





సాహిత్యశాస్త్రమాలిక : ౨
సంపాదకుడు : ఆచార్య రాయప్రోలు సుబ్బారావు

# ఆంధ్ర ప్రతాపరుద్రీయము

శ్రీ విద్యానాథుని కృతికి అనువాదము

## ప్రథమ భాగము

సాహిత్యాచార్య, ఆంధ్రణికశిరోమణి
**జమ్ములమడక మాధవరామశర్మ**
పండితుడు
ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.



నవ్యసాహిత్యపరిషత్తు
గుంటూరు







# ఆంధ్ర ప్రతాపరుద్రీయము

## శ్రీ విద్యానాథుని కృతికి తెలుగు

## ప్రథమ భాగము

సాహిత్యాచార్య, శాస్త్ర విశారద,
సాహిత్య విద్యా ప్రవీణ, లాక్షణిక శిరోమణి

**శ్రీ జమ్మలమడక మాధవరామ శర్మ**

నవ్యసాహిత్య పరిషత్తు
గుంటూరు

# ఉపాయనము

శ్రీ విద్యానాథుడు శ్రీ ప్రతాపరుద్ర నామాంకముగా
యశోభూషణముగా బహూపకారకముగా వెలయించిన
అలంకారశాస్త్ర సర్వస్వ సంగ్రహమును భావించగా
స్వరూప లాభమును పొందిన

## ఆంధ్ర ప్రతాపరుద్రీయము

శ్రీ దీప్తులు కలిగి ధీనీతుల శోభించి గీఃప్రీతుల రాణించు
సహృదయులు సారస్వతపోషకులు
సాహిత్యాభిమానులు వదాన్యులు సంప్రదాయవిదులు
శ్రీ శ్రీ శ్రీ జుబ్దాతుల్ అక్రాన్ శ్రీమంతు రాజా

## శ్రీ యార్లగడ్డ శ్రీ శివరామ ప్రసాద్

బహదూర్ చల్లపల్లి జమీందారు వారికి
ఉపాయనముగా సమర్పిస్తున్నాను



# ప్రస్తావిక

ఈశ్వరుడు సృష్టించిన యావచ్చరాచర సంతానము లోపలమానవుడువిలక్షణుడూదక్షుడూఅయినాడు. ఇకమానవ సృష్టమయిన యంత్రతంత్రమంత్రప్రపంచములో, భాష, తత్పద పదార్థ సంధానము, ఏతదుపసర్జనీకృతమయిన విభావానుభావ సంచారి సంయోగరసపర్యవసానము, ఏతదనుభూతి, విశిష్టము లుగా భాసిస్తున్నవి. అంతే కాదు. ఈశ్వర సృష్టిలో ఉన్న నిత్యనశ్వరత్వాన్నీ, నిమిత్త వికారాన్ని పరిహరించీ, దిద్దీ, సము ద్దీపిస్తున్నది మానవనిర్మాణమయిన వాఙ్మయ ప్రపంచము. ఈశ్వరేచ్ఛచే జన్మించిన కాళిదాసు మృతుడయినాడు. కాని ఆ మహాకవి కామితముగా అవతరించిన కావ్యభాగధేయము అమృతమై నిత్యాభినవముగా నిలిచి ఉన్నది. ముందు ఉంటుంది కూడా. అందువల్లనే కవి ఋషి అయితేనేగాని కావ్యసృజన జరగలేదు. ఆర్షమై అవతరించినది కబట్టే అమృతనిధానముగా అక్షరరమ్యమయింది కవిసృష్టకావ్యము. "కవి రకవిషు అమృతమ్ నిధాయి" అనే వాక్యాన్ని మనము ఇలా విచక్షిం చుకొందాము ఎందువల్లనంటే అమృతమయిన పదార్థము కాబట్టే అమృత ప్రసాదమగు ఆనందాన్ని పిదికే రసమునకు సమర్థమయింది.

శుద్ధమయిన చైతన్యము బిందు ప్రాతిపదికగా అండా కృతిలో పర్యాప్తము. సిద్ధమయిన ప్రవృత్తి మాత్రము ఋజు రేఖా సమపరిమాణముగా త్రిభుజాకారములో నిబద్ధము. ఇదే త్రివర్గనిరూపణ. ఈసాధారణ లక్షణాన్ని కేవలమానవ ప్రవృ త్తికి నిపతిస్తే అందు నిగర్భముగా ఉన్న ధర్మకామార్థ స్వభావత్రికము తేలింది. సమ్మిళితముగా సమపరిమాణముగా

ఈ త్రిభుజాప్రవృత్తి అనుగమిస్తూ ఉంటే బ్రహ్మాండములో వైషమ్యమేమీ కలగదు. భుజాప్రమాణములో న్యూనాధిక్యములు నూల్కొంటే వికారవైపరీత్యాలు సంధిల్లుతవి అయితే పరిమితములయినవి ఈ సిద్ధత్రిభుజలు. అపరిమితమయినదీ ఆఢ్యమయినదీ ఆ చైతన్య బ్రహ్మాండమండలము. త్రిభుజలు స్వరూపపార్థక్యాన్ని లయము చేసికొని ఆసమస్తవలయములో లీనమై పోవడమే మోక్షము. దీన్ని కలిపితే పురుషార్థములు నాలుగయినవి.

త్రివర్గములో ప్రాణికి అవిభాజ్యము ఆత్యంతికమూ అయినది కామము. కామపూర్తికోసము అర్థము. ఈ ద్వంద్వానికి తులాధారణముగా వినియోగమయ్యేది ధర్మము. శిసువు స్తన్య కామితముతోనే పుట్టుతున్నది. తల్లికి సమృద్ధాన్న పరిపుష్టి కావాలె. ఈ శిసుకామితము తీరడానికి ఇదంతా అర్థసాధ్యము. అందుకోసమై అర్థసంపాదనము అనివార్యము. ఇందు ఒక సూక్ష్మభేదము గమనింప తగ్గది ఉన్నది. కామము ఆంతరమయిన చిద్గుణము. అర్థము బాహ్యమయిన సంచయము. జీవసాఫల్యమునకై నియతములయిన సాధనలన్నీ ఆంతర సమువాధికములు కావడమున్నూ, జీవనసంపత్తికి ఉపకరించే ఉపాయములన్నీ బాహిరక్రియాలంబనములు కావడమున్నూ గుర్తింపదగినది.

అనంతమయిన మానవ మేధాప్రభావము వల్ల ఈ రెంటికీ సాధనలు ఏర్పడినవి. వాణిజ్యపరిశ్రమలూ ఉద్యోగవ్యవహారములూ లౌకికసంపత్తి కోసము కుదిరితే, క్రతుకర్మతపో బ్రహ్మజిజ్ఞాసాదులు అలౌకిక సమాహ్వాయము కోసము భాసిం

చినవి. వీనిలో శబ్దముఖసాధనము విశ్వవిశిష్టముగా అనశ్వరైశ్వర్యముగా వెలిగింది. వెలుగుతున్నది. వెలుగుతుంది.

మొట్టమొదట మానవుని చోద్యచోదక క్రియావర్తనమంతా అంగాంగక చేష్టాసహకారముగా జరిగి ఉంటుంది. తరువాత కంఠస్వరవ్యాపారము సాహాయ్యకమయింది. స్వరము అర్థనిరూపణకు చాలలేదు. కాని భావసూచకముగా ఉపకరించింది. ఈ స్వరమే ఒకరూపములో క్రియాసాధకము కావడమూ, మరొక రూపములో ఆహ్లాదకరము కావడమూ అనుభవములో ద్యోతమయింది. ఒకటి శబ్దముగా పరిణమించింది. రెండవది నాదముగానే నిలిచిపోయింది. శబ్దవ్యవసాయమె సాహిత్యము. నాదవ్యాకోచనమె సంగీతము. దృగ్దర్శనీయమయిన చేష్టానిరూపణము మొదట రేఖాసంకేతముగా ప్రారంభమై, రూపలేఖనముగా పరిణమించి, చిత్రకళగా సౌష్ఠవము పొందింది. ఇవన్నీ మానవబుద్ధి విశేషమునూ కరకౌశల సౌకుమార్యమునూ చూపే సహజ చేతన చిహ్నములు.

అయితే వీనిలో అతి ప్రాచీన కాలము నుండీ తెగకుండా ఉత్తరోత్తరవిస్తరముగా ప్రవహించి మనకు ఉపలబ్ధమయినది శబ్దవ్యవసాయఫలమె కావడము గమనింప తగ్గది. వైయాకరణులు శారీరకముగా శబ్దానుశాసనము చేసిరి. దానికి ధర్మనియతి ప్రయోజనమని చెప్పిరి. కాగా మిగిలినదాని అభిగమ్యమానవ్యాపారము దీనిని గవేషించిన వారే సాహితీదార్శనికులు. వీరు శబ్దఘటనా స్ఫోరకమయినదీ, సద్యస్సమాస్వాద్యమైనదీ, అయిన ఒక మధురానుభూతిని అందు గుర్తించిరి. దాని మీమాంసా విశేషమునే వివరిస్తుంది సాహిత్యశాస్త్రము.

నాట్యశాస్త్రము ప్రధానముగా అభినయ యుక్తమయిన రూపకరచనా ప్రయోగలక్షణాలను ఉపదేశిస్తున్నది. విశిష్టముగా రసోత్పత్తి విధానమును ప్రతిపాదించింది. ప్రసక్తముగా కావ్యస్వరూపమును, ఏతద్వస్త్వలంకార గుణాది నిరూపణమును వివరించింది. ఎటయినా కావ్యనిర్వచనము ప్రథమముగా జరిగింది. తరువాత ఏదయినా కావ్యచర్చ జరిగినా అది అంతగా ప్రాముఖ్యమును వహించలే దనవచ్చును. దండీ భామహులు ఇద్దరూ ఆలంకారికులలో ఆచార్యస్థానము వహించారు. అనంతర లాక్షణికులు అందరూ వీరిని చిరంతనాచార్యులుగా పేర్కొనుటయే గాక వీరి నిర్వచనాలనూ హేతువాదాలనూ సవినయముగా ఉదాహరిస్తారు. వీరిరువురిలో భామహుడు కావ్యానికి అలంకార ధర్మశబ్ద వైశిష్ట్యము ప్రతిపాదిస్తాడు. ఆచార్య దండి ఇష్టార్థవ్యవచ్ఛిన్నత్వమును జీవభూతముగా అంగీకరిస్తాడు. రసప్రస్థానము నిరూపించిన భరతుని తర్వాత భామహుడు అలంకారవాదమును లేవనెత్తగా దండి ఇష్టార్థసౌభాగ్యమును సూచించాడు. తరువాత ఉద్భటుని కావ్యాలంకార సారసంగ్రహమూ వామనుని కావ్యాలంకారసూత్రవృత్తీ, రుద్రటుని కావ్యాలంకారమూ, సుప్రసిద్ధములుగా వెలసినవి. వీరంతా ౮౫౦–౯౦౦ మధ్య ఉన్నవారు. ఉదాహృత గ్రంథాలన్నిటికీ అలంకార సంకేతము నామకరణములోనే ఉన్నది. వీనినిబట్టి భామహుని అలంకారవాదమె ప్రసిద్ధముగా వ్యాపించిన దనడము సమంజసము. అయితే దండ్యాచార్యులు ఇష్టార్థసౌభాగ్యాలను సూచించినట్లే తరువాత వామనుడు రీతి అనే ఒక క్రొత్త వ్యపదేశము పైకితెచ్చాడు. "రీతి రాత్మా కావ్యస్య" అని ఖండితమయిన

నిర్వచనముకూడా చేశాడు. దీన్నిబట్టి శబ్దార్థవ్యతిరిక్తమయిన విశిష్టాంశను అతడు గుర్తించెననుట స్పష్టము. నిర్వచనములోని ఆత్మశబ్దాన్నిబట్టి శరీరము కూడా ఉండాలని ధ్వనిస్తుంది. ఇది బహుశః మానవునికి శరీరమూ ఆత్మా ఉన్నట్లే, కావ్యానికికూడా తను జీవములు ఉన్నవనీ, అందులో రీతి ఆత్మ అయితే శబ్దార్థములు శరీరము కావాలెననీ కూడా అభివ్యంగ్య మవుతుంది. ఇంతచర్చ జరిగిన తరువాతనే ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకమును రచించి ధ్వని వాదమును సమగ్రముగా ఉత్పాదించి గొప్ప మహత్తరమయిన మార్పును అలంకార శాస్త్రదృష్టిలో కల్పించెను. ధ్వని వాదము వచ్చిన తరువాత కావ్య స్వరూప స్వభావములూ దాని మహత్తర వైశిష్ట్య వికాసములూ సాధారణ శ్రేణిని అతిక్రమించి ఉదాత్త శాస్త్ర విభూతి నందగల్గినవి.

విషయవిశదీకరణము జరిగేటప్పుడల్లా స్వానుభవ విజ్ఞానములనూ, లోక వార్తా వృత్తములనూ ఊతజేసికొనడము సహజము నిరాకారుడయిన ఈశ్వరునికి నామరూపాలు కల్పించిన బుద్ధిమంతులు ఈ మార్గాన్నే అవలంబించి ఉంటారు. ఉపదేశానికిగానీ సంస్కారానికి గానీ ఈ పద్ధతి అవలంబించక పోతే ఈప్సితము నెరవేరదు, అలాగే కావ్యానికికూడా దాని మహత్వ మధురత్వ రసవత్వ రమణీయత్వాలు నిరూపించి నివేదించడానికిమానుషవ్యక్తి స్థానమునేఉపాదాన కారణముగా గ్రహించి ఉంటారు. మానవునికి శరీరమూ ఆత్మ ఉన్నట్లే కావ్యానికి కూడా శరీరాత్మలను భావించారు. చక్కని అంగ సౌష్ఠవము కలరూపము ఆకర్షవంతమయినట్లే, అందమయిన శబ్దార్థములు గల వాక్యావతారమును కమనీయమయిన

కావ్యముగా పాటించారు. ఈ అంగాంగ సౌష్ఠవమునకు కంఠ హారములు కరకంకణములు పాదాభరణములు సముల్లసన హేతువులయినట్లే శబ్దార్థములకు సౌందర్యదాయకములగు వాటిని అలంకారములుగా పాటించారు. అయితే ఎంత రూప విన్యాసమున్నా ఆభరణ పరికరము ఎంత సమృద్ధముగా ఉన్నా వికాసము లేకపోవచ్చు. అనిర్వచనీయమయిన మనోహరి త్వము ఉండకపోవచ్చు. ఈ లోపము దోషము కూడా కాక పోవచ్చు. అపకర్షక హేతువుగా కూడా ఉండకపోవచ్చు. కాని ఏదో ప్రియప్రాయమైనదీ లావణ్యమైనదీ రూపాలంకార సౌష్ఠవమును సముద్దీపింప చేసేదీ ఒక జీవత్కళ కొరవడినట్లు మాత్రము ద్యోతమవుతున్నది. సౌరభము లేని సన్నజల్ల పుష్పము లాగా, పాలు లేని కుండపొదుగులాగా, నీరు లేని ముత్యములాగా, ఈ రూపవిన్యాసములో ఏదో ఒక లుప్త ద్యుతి ఉన్నమాట వాస్తవము. కావ్య మీమాంసకులకు కుల పతి అయిన భరతుడే దీనిని చక్కగా నిదానించి దర్శించి అది రసమని అనడము మనభాగ్యము. ద్రష్టలు వేరు. శాస్త్ర కారులు వేరు. విపర్యయగ్రహణము పట్టినా విమోక్షణము కూడా త్వరగా దొరకడము మనభాగ్యమే.

ఆనందవర్ధనుడు ఉత్కర్ష హేతువులయిన అలంకారా దులను వద్దనలేదు. కాని ఏతత్ప్రాప్తినుతము ధ్వన్యభి నీతముగా ఉంటేనే కావ్యమాంగల్యానికి హ్లాదకరామణీయకము అబ్బుతుందని అత్యంతమూ ముగ్ధ సుఖమయినే మనోహర వాదమును అనుగ్రహించాడు. అయితే ఆ కాలములో ఇట్టి వాదము పుట్టడానికి వలసినంత అవకాశము ఉన్నట్లు కని పిస్తుంది. ఆనాటి సామాజిక చరిత్రకు శిష్టులే నాయకులు.

సామాన్య ప్రజలు కారు. విజ్ఞాన బలానికి చోదనాధికారులు పుష్కలముగా ఉండిరి. ఇక భారతీయ నాగరికతా, దాని విశిష్ట రేఖలయిన శాస్త్ర శిల్పాదులూ ఎలా ఉన్నవో చూతము. ఆరణ్యకమయిన శ్రౌత స్మార్త ప్రసక్తి ప్రాతగిల్లింది. బౌద్ధుల అహింసాధర్మావబోధమూ సన్యాసినీ సన్యాసానుష్ఠాన విధానమూ చైత్యారామ విహారాలూ, వానిలో భావాభిరామములయిన అద్భుతకుడ్య చిత్రలేఖనాలూ వెలసి సంఘాన్ని ఒక విప్లవములో ముంచి తేల్చినవి. గుప్త సామ్రాజ్యమూ, దానితో పాటు ఒక్కమాటుగా పికటిల్లిన సంపత్సౌఖ్యసమృద్ధి, తదనుగతముగా వర్తిల్లిన సుకుమార సుందర సుహృజ్జీవన సాహిత్య కళాలాలసతా, ఇవన్నీ శతితకు ధ్యేయములయినవి. ఆచార్య శంకరుడు ధర్మ దిగ్విజయము చేశాడు. పునః దానితో శ్రౌతస్మార్తశిష్టాచారము ఒకవంక విడంబిస్తూ ఉంటే అద్వైతమతవ్యాప్తి, తదవిభాజ్యమయిన నివృత్తి రూప సన్యాస ప్రసక్తి మరొక పక్షమున నిరాక్షేపముగా అతిశయింపసాగెను. సాహిత్య కలాపక్షములో జరిగిన వ్యవసాయ విశేషములు కూడా గమనింప తగినవిగానే ఉన్నవి. ఒక ప్రక్క బౌద్ధులిచ్చిన ఉత్తేజన అభిమానములతో ప్రాకృతాది వాఙ్మయము ప్రకాశించింది. దానిలో ఈశ్వర పుణ్యపాపాది విశిష్ట గుణ సంపర్కము లేని మిధునానురాగ మాధుర్యమూ, అభిజన సాధారణ జీవితసౌందర్యమూ, అభివర్ణితమై సమాజ సముపలాలనము చేయగల్గింది. ఇటు సంస్కృతములో కూడా భాస కాళిదాసాదికవులు శాస్త్రధర్మ విజ్ఞాన భాష్యరచనలకు వినియుక్తమవుతూ ఉన్న భాషను సామాజికపరములయిన కావ్య

నాటకాదులలో రసవద్రచనలకు వినియుక్తము చేయడవ పరిపాటి అయింది. పైగా రూపకాదులయందు సంస్కృ భాషతో సరిసమానముగా ప్రాకృతము కూడా సంహితత్వ సంకీర్ణస్థితిని తెచ్చి పెట్టింది. ఇట్టి స్థితిలో సంస్కృతాని శబ్దాను శాసనము జరగడము కుమారిలభట్టు శ్రౌతధర్మకర్మ శాస్త్రప్రయుక్తములయిన శబ్దార్థపరిభాషా ప్రమాణాలన నిష్కృష్టము చేయడము జరిగింది.

రచనారంగములో సూత్రశైలీ భాష్యపద్ధతీ పూర్వ పక్షసిద్ధాంత మర్యాదా, ఇత్యాదులు యథా సమృద్ధముగా ప్రకాశ్తిలోకి వచ్చెను. దర్శనముల ప్రభావము దృఢముగా ప్రతిష్ఠితమయినది. సాహిత్యసృష్టిలో అశ్వఘోషాదుల రచ నము బృహత్కథాదుల విశృంఖలవృత్తి లక్షింప దగినవి ఇక కావ్యచర్చలో నాటకము మున్ముందు వ్యాపించె నడ డము సుసంగతము. పూర్వకావ్య చర్చలో నాటకప్రసక్తి అధికముగా ఉండడానికి ఇదే కారణము కావాలి. ఆనుషంగి కముగా కావ్యపరామర్శ జరిగింది. అందులో రసవాదము అలంకారవాదము రీతివాదము ముఖ్యము లనవని చెప్పవచ్చు. శబ్దార్థసముత్పన్నమయిన కావ్యములోని వైలక్షణ్యమును స్థూలాతిస్థూలమయిన అలంకారాలలో నిరూపించడము నిలి చేది కాదు, అది నిలవనూ లేదు. రసవాదమే నానాట రమ ణించింది.

ఆనందవర్ధనుడు ఈ వాదమును చిత్తసంస్కార రూప మయిన ధ్వనిసూత్రముతో బంధించడానికి వేదాంతులు బ్రహ్మైక్యప్రమాణమును సిద్ధీకరించడానికి చూపిన నానా శాస్త్రవిజ్ఞానమును వినియోగించడమే కాక, తోడ్పో మానవ

చైతన్యరహస్య వేత్తృత్వమును కూడా ప్రదర్శించాడు. అలంకార శాస్త్రములో మొత్తముమీద వేదాంతములో ఆచార్య శంకరునివలె ఆనందవర్ధనుడు తీర్పరిగా నిలిచిపోయినాడు. ఆయన తీర్పు ఏమంటే; కావ్యానికి రసమే ఆత్మ. అయితే దాని ఉత్పత్తి అనుభూతులు ధ్వనిమూలముగా ఉపలబ్ధములు కావాలె. అప్పుడే శబ్దార్థములు అవ్యక్తాభిరమ్యమయిన కళాస్ఫూర్తిని ఉన్ముక్తము చేసి ప్రసన్నములవుతవి.

ధ్వనివాదము తీవ్రమయిన వాదప్రకోపాన్ని కల్పించక పోలేదు. ఇందుకు హేతువులు కూడా మనము ఊహించవచ్చు. ఈ వాదవైఖరి మొట్టమొదట శబ్దార్థవివక్షచేసిన ఇతరధార్మికులను కుట్టింది. వారు తాత్పర్యార్థములోనే ధ్వని లీనీభూతము అన్నారు. ఇక ఉత్తరమీమాంసకుల ఖండనకు కారణాలు వెతుకుదము. ఆనందవర్ధనుడు ధ్వనివాదమును ప్రతిపాదించేటప్పుడూ శాస్త్రచర్చ చేసేటప్పుడూ, పూర్వపక్ష సిద్ధాంతాలు చేసేటప్పుడూ సాగినవైఖరి చాలా నిగూఢముగానూ నిరవకాశముగానూ స్ఫురిస్తుంది. ఆయన రసానందమె బ్రహ్మానందమని నిష్కర్షించకపోయినా, రసానుభూతివలన కలిగే ఆనందము ఆత్మానుభూతి పర్యవసానమయిన ఆనందము కంటె భిన్నమయినదని స్పష్టీకరించక రసానంద ప్రతిపత్తిని ఆత్మనఃకలా సన్నిహితముగా సూక్ష్మీకరించి వదిలెను. ఇది సహజముగా బ్రహ్మవాదులకు తగిలిన గొప్ప సంకటము పైగా ధ్వనివాదము స్ఫోటజన్యము. దాన్ని ఆచార్యశంకరుడు అంతకుముందే త్రోసిరాజన్నాడు. బహుశః ధ్వనిప్రతిష్ఠాపనము తిరిగీ స్ఫోటసముద్ధరణమే అని శంకించి ఉండవచ్చు. ఇంకా గార్హస్థ్య ధర్మముకూడా బంధ రూపముగా నిశ్చయించిన వారి దృష్టికి నాయికానాయక సంబంధ వ్యాపారమును రసఫల

ప్రాప్తికముగా ఆనందసూత్రము చేయడము వేదాంత మూలచ్ఛేదమె అవుతుందని భావించడము అభావ్యము కాదు. అందువలన వారుకూడా ధ్వనివాదాన్ని ప్రతిరోధించి ఉంటారు. అయితే ఆనందవర్ధనుని సిద్ధాంతములో ఇవన్నీ ఐచ్ఛికములో అవిచ్ఛా ప్రతిఫలితములో మనము చెప్పలేము. కాని మనము ఇప్పుడు ఇలా ఎందుకు భావించగూడదు ?

"ఆరణ్యక కాలమును వదిలివేతాం. బ్రహ్మజిజ్ఞాస పరివ్యాప్తమయిన తర్వాత శిష్టులకు ఆత్మావలోకనమే ఆత్యంతిక ధర్మమయింది. దానితోబాటు వారి లోకసంగ్రహ వ్యాసంగము క్షీణింపక తప్పింది. కాదు అంతమట్టుకు సంఘము శిష్టచోదన బలమును కోలుపోయినదే అయింది. అనంతరము ధర్మనాయకులయిన బౌద్ధులు స్త్రీపుంససహజ బంధమును తెంచివేశారు. మరీ తరువాత జ్ఞానబోధలయిన వేదాంతులు మిథ్యాబుద్ధిని సమృద్ధముగా ప్రవృద్ధి చేశారు. ఇక ప్రజాసంఘము ఏమి చేయాలి ?

ఇలాంటి క్లిష్టకాలములో అమృత నిధాయకు డయిన కవి కావ్యసృజనాభిరతిని పరిత్యజించి లాక్షణికుడై సర్వప్రాణి సులభమయిన ప్రవృత్తిలోనే ఆనందస్థానమును గుర్తించి, తత్ప్రాప్తివిధానానికి నాటకసందర్శనమునూ కావ్యాలాపమునూ మధురోపాధులుగా ప్రదర్శించి లోకానందవర్ధనుడే అయినాడు. కవి ఉపదేశకుడు కాడు. అతనిమార్గము ఉపచారికము. ప్రత్యక్షఖండనకూ దానితో అనుసంగమించే కలహవ్యాకులమునకు అతని భావము ఓపదు. అతని కంఠము కాంతాసమ్మితముగానే కలరవించుతుంది. ఉపలాలనమే అతని ఉద్బోధ వికారమునుండి వివర్తింప దలచినా సౌకుమార్యానికి సుముఖుణ్ణి చేయదలచినా, అతనికి చేతనైనది ఈ ప్రసన్న

సాధనము జూస్తే. "...ప్రాణాధిత్యాపి సాధ్య మన్యే"
అంటాడు మహాకవి వృద్ధప్పగల భట్టే జీవిత ప్రవాహ జీవమును శుష్కింపచేసే కర్మోక్త ధర్మశాస్త్రాదిద్రవ్యములను విసర్జించడానికి అన్యమతీయులవలె ధర్మశాస్త్ర శాస్త్రీకులను పట్టలేదు. యావజ్జీవనాను రంజనీయమగు సలక్షణ సాహిత్య స్నేహాభిషేకమును చేయ సమకట్టెను. సాహిత్య ప్రభావమును గుర్తించిన మహాకవి కాళిదాసు పలికిన "కాంతం క్రతుం చాక్షుషం" అనే సూక్తిపరమార్థమును ఆయనఎరుగును. ఆత్రేయీ ముఖముగా భవభూతి నూతనచ్ఛందస్సమావిష్కారములో శబ్దబ్రహ్మవివర్త వాల్లభ్యమును సూచించెను. భరతుని నాటక ప్రకరణము ఆనందవర్ధనునికి చక్కగా అవగాహమయ్యే ఉండాలి. తనకునూ వారికినీ నడుమ సంఘటిల్లిన వాగర్థకళ్యాణనిరాస ప్రయత్నాలు ఆయనను వికలము చేయడము సహజము. ఏతత్సముద్ధరణకు పూనుకొనడము ఆశ్చర్యము కాదు."

ఆనందవర్ధనుడు ఆవిష్కరింప చేసిన ధ్వనివాదానికి అభినవగుప్తుడు వ్యాఖ్యానము రచించి దానికి సాలోచనంగా లోచన అని పేరు పెట్టెను. అభినవగుప్తుడు మహావిద్వాంసుడు. నానాశాస్త్ర సాగర సముత్తీర్ణుడు. పరమ శైవుడు. సాధన ఎరిగిన యోగి. శైవధర్మాగమ మహాగ్రంథములను పెక్కింటిని రచించి, బహుళ వాఙ్మయ భాగ్య విధాతయై, సశరీరముగా గుహా ప్రవేశము చేసిన మహాసిద్ధుడు. ఇటువంటి ఉదాత్త విజ్ఞాని లౌకికము లనుకొనుచున్న నాట్యవేదాన్ని ధ్వన్యాలోకమును ఆసక్తితో ఆదరముతో విచక్షించి, అందలి మహత్తర మాధుర్య నిక్షేపాన్ని పైకెత్తి, దాని అలౌకిక విభూతిని నిరూపించి, సహృదయ సాధన ప్రవృత్తికి నిరూఢి

నిచ్చి కవి పాడిన గానమునకు ఉపశ్రుతి నివేదనము చేశాడు. తెలిసినంతవరకు ఈమహానుభావుడు ౪౧ గ్రంథాలను రచించి నట్లు తేలింది. ఇందులో నాట్యశాస్త్రానికి అభినవ భారతీ వ్యాఖ్య, ధ్వన్యాలోకమునకులోచనవ్యాఖ్య, అలంకారశాస్త్ర భాండారములోనివి. కావ్య కౌతుక వివరణమూ, కథా ముఖ తిలకమూ, నాట్యాలోచనా అనేవి కూడా సాహిత్య మీ మాంసకు చెందినవే అని తోస్తుంది. సాహిత్యానికి సంబం ధించిన ఈ మహావేత్త గ్రంథరచన ౯౯౦—౧౦౨౦ మధ్య జరిగినట్లు చరిత్రకారుల నిశ్చయము. అంటే మన నన్నయ భట్టారకుడు మహాభారతము వ్రాయడానికి దాదాపు వంద యేళ్ళలోపు ఉన్నాడని, ప్రతాపరుద్రీయము రావడానికి ముందు మూడువందల ఏళ్ల క్రిందట ఉండెననీ మాత్రము చెప్పి ఈతని ప్రసక్తి ఇంతటితో ముగిస్తాను.

ఆనందవర్ధనుని తర్వాత కావ్యమీమాంస నడిపిన లాక్షణికులలో కొంచెమో గొప్పోస్వాతంత్ర్యమును చూపిన వారు కొలదిగానే ఉన్నారు. భట్టనాయకుని హృదయదర్ప ణమూ, కుంతకుని వక్రోక్తి జీవితమూ, మహిమభట్టు వ్యక్తి వివేకమూ, క్షేమేంద్రుని ఔచిత్య విచారచర్చా, ఈ శ్రేణి లోకి తెచ్చి గణింప తగినవి భట్టనాయకుని గ్రంథము ఉప లబ్ధము కాలేదు. అయినా నాయకుడు రసవాదములో భోక్తృ వ్యాపారమును నిదానించినట్లు తేలుతూ ఉన్నది. కుంతకుడు కావ్యమునందు అనుసంధాన మధ్యే వర్ణపద, పూర్వార్ధ, ప్రత్యయ, వాక్యప్రకరణ, ప్రబంధవక్రతలలో, ఉన్న వైచి త్రియే కావ్యజీవిత మని ఒక క్రొత్తదృష్టిని చూపాడు. కుంత కుని వక్రతకు వంకర అని అర్థము చేసికోకూడదు. ఎందుకంటే అంగాంగకములలో ఏమాత్రము వంకర ఉన్నా అది విరూప

ముగా కనబడడమూ, ఏవగింపు కలిగించడమూ లోకన్యాయము కాబట్టి, కావ్యానికి రూపజీవాదులు అంగీకరించిన లాక్షణికులూ ఈ వక్రతను వంకర అని భావించరు. కావ్య వాక్యఘటనము అత్యంత పరిచయ పరిపాటిచే సామాన్యములైపోయిన పదాలతో సూటిగా కాక వైచిత్రీస్ఫురితముగా ఉంటుందని ఉండాలనీ ఈలాక్షణికుని భావమని తోస్తుంది. నర్మగర్భితములయిన వగలాట ముచ్చట్లలో స్పృహణీయమయిన చమత్కారము ఉండడము మనకు అనుభవము. తెనుగువారిలో తియ్యని రహఃకలాపములు జరిగేటప్పుడు ఇష్టానిష్టస్ఫోరకముగా "ఇలాంటి వంకర మాటలాడకు" అనడము మన మెరుగుదుము. ఈలాటి ముదితఫణితికే వక్రోక్తి వ్యపదేశము చెల్లుతుంది. కుంతకుని ఉక్తిలోని వక్రత కుంతలములలోని కుటిలతవలె సౌందర్య సముత్కర్షకముగా తేలుతుంది. ఇతడు ఉజ్జీవింపచేసిన నవీన పక్షము ఇదమిత్థముగా నిరూపితము కాదుగాని సహృదయ సహృదయంగమ వ్యాపారమును లక్షించి నివేదించడములో చక్కని నేర్పునూ సుకుమార బుద్ధినీ ప్రదర్శిస్తుంది. వ్యక్తి వివేకము ప్రధానముగా ధ్వనివాద విధ్వంసనముకోసరమే వచ్చింది. శబ్దానికి వ్యంజన అనే తృతీయవృత్తి లేదనీ, అది అనుమితిలోనే అంతర్గర్భితముగా ఉన్నదనీ వాదసారాంశము. పూర్వపక్షానికి కానీ సిద్ధాంతకోటికి కానీ రెండు పంథాలున్నవి. విషయనిరూపణ చేయడములో చిత్తానికి నచ్చిన అభిమతాన్ని తిప్పి ఒప్పించే సరణి ఒకటి. దీన్ని భావపథము అంటాము. ఇది వదలీ ప్రతిపక్షపంక్తిలో దోషాలు వెదికీ రంధ్రాలు కోడీ తద్వారా కలిగే సంకుల వైకల్యములో ప్రతిపక్షవాద విచ్ఛిత్తిని పైకెత్తడము రెండవది. దీనిని అభావపథము అందాము. మహిమభట్టు ఈ రెండవ మార్గములో తన

మహిమ చూపిస్తాడు. అయితే ఈయన గొప్ప వైయాకరణిగా యుక్తిపాటవముగా వాదకౌశలిగా కనిపిస్తాడు. చేసే విమర్శనము శాస్త్రీయముగా హేతుబద్ధముగా నడిపే నేర్పు నిర్భరముగా ఉంది. దోషప్రకరణముమీద ఇతను చూపిన అధికారములో లోతైన చూపు వ్యక్తమవుతుంది. క్షేమేంద్రుడు కావ్యానికి ఔచిత్యమే జీవ మంటాడు. విశితంగా దూరాతి దూరముగా ఔచిత్యచ్ఛాయలను ప్రసరింపచేస్తాడు. నిజముగా ఔచిత్యము లేని కావ్యము వస్త్రవిహీన మయిన వ్యక్తి రూపమువలె దాని యావద్వైశిష్ట రూపలావణ్య చేష్టా భూషణాదులనూ నిరసన వైముఖ్యాస్పదము చేయడము నిజము. అంతేకాక ఔచిత్యా సౌభాగ్య చ్ఛాదనములో అల్పాల్పము లయిన వంకరలు కానబడక తదనుభూతిని భగ్నము చేయకపోవడముకూడా సత్యమె. ఔచిత్యములేని కావ్యము భిన్నభాండముమీద చిత్రలేఖనమువలె, కపాలములోని కమ్మతేనియవలె, చర్మభస్త్రికలోని విమల విభూతివలె నేత్రోత్సవమునుగాని, జిహ్వాప్యాయమునుగాని, పూజాభావమునుగాని, పొందింపలేదు. ఔచిత్యము సర్వోత్కర్ష హేతువుగానూ అనౌచిత్యము యావద్వైశిష్ట్య విఘాతముగానూ ఉద్బోధించిన క్షేమేంద్రుడు ఒకవిధముగా సహృదయలోకానికి మహోపకారి అని చెప్పవచ్చును.

పూర్వోక్త లక్షణపర్యాప్తినిబట్టి భరతుడాదిగా తిరిగిన వేయి వత్సరములలో సాహిత్యవృక్షము బహుముఖముగా అనేక శాఖావిస్తారముగా, అనంతపల్లవ పత్ర పుష్ప ఫల రసాధివాసముగా ఎంత శోభించిందో తేటతెల్ల మవుతుంది. ఈ కాలములోనే నన్నయభట్టారకుడు సంస్కృత మహాభారతమును తెనుగున రచించెను. 'అతడు మహాభారత

కతిథేహాసమును నేర్చిన విధంబున "కావ్యంబుగా" నొనర్తు' నని పలికెను. ఈ కావ్యశబ్దానికి ఎంత మహనీయమయిన అర్థము పట్టగలదో మనము ఇప్పుడు ఊహింపగలుగుదుము. నన్నయభట్టారకుడు రసవాది. తన భారతానికి పర్యాను క్రమణికను అన్వర్థముగా లగించి "ఇక్షుఖండస్థానీయం హి కావ్యమ్ కల్పనీయమ్. తత్ర రసనిష్యంద స్థానీయమ్ వ్యంగ్యమ్" అనే లాక్షణికాదర్శమును పాలించిన మహాకవి. ఈప త్పూర్వోత్తర వ్యవధానముగా కుంతకుడు, ధనంజయుడు మహిమభట్టు, మమ్మటుడు, భోజుడు, మున్నగు సాహిత్య లాక్షణికులు భట్టారకుని సమకాలికులు. ఆంధ్రదేశములో కాకతీయ సామ్రాజ్యము విజృంభించుచుండగా, శైవ వాఙ్మయము జాను తెనుగులో తేనెలు తేలుతూ ఉండగా అలంకారసర్వస్వము కావ్యానుశాసనము సంస్కృత ములో సముత్పన్నము లయినవి. రంగనాథుడు ద్విపదలో రామాయణము తీర్చిదిద్దిన రోజులలోనే జయదేవుని చంద్రా లోకము ప్రకాశించింది తిక్కనసోమయాజి రచనా ప్రవా హము వరదపోయే రోజులలో కేతన దశకుమారచరిత్రమును తెనిగించిన రోజులలో సంస్కృతములో సాహిత్య చర్చ అంతగా కానరాదు. భానుదత్తుని రసతరంగిణీ రసమంజరీ కృతులు మాత్రమె "సురసరిత్కల్లోల కిమ్మీరిత" దేశములో ఉదయించినవి. ఇక పదునాల్గవ శతాబ్దములోపల ప్రకాశిం చిన ఏకావళీ యశోభూషణములు రెండూ ఇంచుమించుగా ఎఱ్ఱాప్రగడ, భాస్కరుడు, నాచనసోముడు మొదలయిన మహాకవులు ఆంధ్రప్రబంధ రచనా శిల్పానికి వన్నెలు చిన్నెలు పెట్టుతున్న కాలములోనివి. ఏకావళి ఓఢ్రదేశములోనూ యశో భూషణములు తెలంగాణములోనూ దీపించడము

అక్కడ విద్యాధరుడు కాకతీయ నృపాలుడయిన నరసింహ
పర్యాయముగానూ, ఇక్కడ విద్యానాథుడు కాకతీయనృపాలుడయిన ప్రతాపరుద్ర పర్యాయముగానూ, అలంకారశాస్త్ర కృషిసాగించడము నాటిరాజుల సాహిత్యాభిమానాభి రుచి లకు సూచనగా ఉన్నదన వచ్చును. ఇలాంటివి మరికొన్ని కన్పించుతున్నవి,

విద్యానాథుని ప్రతాపరుద్రీయము దక్షిణాపథమంది అనుదిన పఠన పాఠనములలో విశేషవ్యాప్తి చెందిన మంచి గ్రంథము. దీనిలో నాటకాలంకార కావ్యలక్షణములు స లక్ష్యములుగా సరళశ్రుతిసుఖమయిన శైలిలో సంగ్రహముగా ఉండడము, ముందునడచిన లాక్షణికుల భిన్నభిన్నమ సారాంశములకు అవిరుద్ధముగా ఉపాదేయవిషయ వివర వాద సారాంశమును వ్యక్తీకరించి కూర్చడము ఇందుకు కా ణము కావచ్చు. దీనికితోడు కుమారస్వామి వ్రాసిన టీక వివరణము సర్వతోముఖ సాహిత్య విషయైక చర్చతో మరిం ఉపకరించిందనడానికి సందేహము లేదు. ప్రతాపరుద్రీయ ప్రాశస్త్యమునుగూర్చి ఇంకను విస్తరించడము తినబోతున వారికి రుచిచూపడ మవుతుంది.

ఆంధ్రసారస్వత శతపత్రములో తొంభై రేకుల సాహిత్య పత్రాలంటే అత్యుక్తికాదేమో! ఇవికూడా మూ దళాలే అంటే న్యాయదూరము కాదు. కానిఇందులో లక్ష పత్రాలు మూడునాలుగు కన్న లేవు. అవికూడా సంఫుల్ల వికా ముతో విస్తరించినవి కావు. ఇది శోచనీయమె కదా! అ కాక సాహిత్యశాస్త్రానికి లక్ష్యప్రాయ మయిన కావ్య వాఙ్మయము మనకు ఉన్నంత సాంగముగా, సాలంకృతముగా సావకాశముగా మరే దేశభాషలోనూ లేదు. అంబారవ

ఉన్నా అది విలువకట్టే సాధనసామగ్రి లేనట్లయింది ఈపరిస్థితి. అదీ కాక అలంకారశాస్త్రములో ఆంధ్రులు ఒకానొక విలక్షణసిద్ధాంతమును సశాస్త్రీయముగా నిరూపించి కృతకృత్యులయినారు. సహృదయుడు యోగివలె పూర్ణుడని కావ్యానుశీలన ప్రాప్యమయిన రసానందము, బ్రహ్మజిజ్ఞాసా లభ్యమయిన చిదానందము ఏకమెఅని మీమాంసించి నిరూపించిన సాహిత్య వల్లభులు తెలుగువారే. లక్షణాగోపము తీక్ష్ణాలంకారాద్యుశులకు కలిగిన అభిలాషకు కారణములు అనేకములు కలవు. కాని అందులో బలవత్తరమైనది ఇది. దేశములో కావ్యపారము స్థాయిక రమణీయశ్రేణి నుండి జారిపోయింది. స్త్రీ పుంలింగ కారక గ్రసితముగానూ సమాసాకాంక్షాధిష్ఠితము గానూ శుష్కీభవింప సాగింది ఒక ప్రక్క. వేరొక ప్రక్క, సాహితీపరుల విజ్ఞానము అధికాధికముగా దోషాధికరణ దష్టముయింది. ఏతత్ప్రతి ఫలముగా సహృదయావరణము జీర్ణదివ్య దేశములాగా విస్మృతి చెందేదుర్దశ పట్టుతుందేమోఅన్న భయము కలిగింది. కావ్యపరిశీలనము వల్ల స్థూలమైన పాండిత్య ప్రాగల్భ్యములు కలిగిన కలుగవచ్చును. కాని ఆత్మప్రసన్నతా ప్రజ్ఞానములు సాధించాలంటే కావ్యానుశీలనము కావాలె. ఈ అంతరములను విచక్షించుకోవడానికి సాహిత్య శాస్త్రములో పూర్వము జరిగిన రస మీమాంసావిజ్ఞానము అవశ్య సహకారము అవుతుంది. ఈ "సాహిత్య శాస్త్ర మాలిక" యదాభవ్యముగా సారస్వత జీవితమునకు కమనీయ కల్యాణములు కై సేయునని ఆశించి ప్రారంభించితిమి. నవ్య సాహితీ పరులు చేపట్టినదని ఉపేక్షింపక స్నిగ్ధవాత్సల్యముతో, సాహిత్య పక్షపాతముతో, మా ఉద్యమాన్ని ప్రోత్సహించి దీవించి అమృతాలంబ ప్రాయ

ఎయిన పూజ్యపాదులు, వైయాకరణ వల్లభులు, కళా ప్రపూర్ణులు, మహామహోపాధ్యాయులు, సర్వతంత్ర స్వతంత్రులు,

శ్రీ తాతా సుబ్బారాయ శాస్త్రి

వరేణ్యులు మాకు అక్షుణ్ణస్మరణీయులు. వారి విద్యాకుటుంబము రెండేండ్లలో రాణించింది. ఒక ఇంట వ్యాకరణ పుత్రుడుంటే రెండవయింట సాహితీకుమారి పచ్చగా కాపురము చేసింది. ఈ ఇంటి దౌహిత్రుడు సరసోపనిషదుద్గాన మాధవుడే మన మాధవుడు. శ్రీమాధవరామ శర్మగారి నిష్కళంక సాహిత్య శాస్త్రవైదుష్యమును గూర్చి మహామహోపాధ్యాయులే స్వయం విజయపత్రము ఇచ్చి పోయినారు. ఇంక ఇతరుల ప్రశంసవారికి అనవసరము. మనకు చర్వితచర్వణము. మా శర్మగారు శిరోమణి, విద్యాప్రవీణ, విద్వాన్ మొదలగు పరీక్షార్థులకు విజ్ఞానార్థులకు ప్రతాపరుద్రీయమును ముప్పది మారులు పైగా పాఠము చెప్పిరి. మా, శర్మ స్వయముగా కావ్యానుశీలనము చేసే ఒక్కగా తపస్వి. వీరు నవ్యసాహిత్య పాఠకుల అభ్యర్థనము అంగీకరించి ఉద్గ్రంథమును తెనిగించుటకు వారి రసోపాసనా సాహిత్య దర్శన ప్రతిష్ఠాపన నిష్ఠలే మూలకారణములు కాని ఆర్థికలాభము కాదు. కువ్యాఖ్యా విషమూర్ఛితములయిన కుసుమకోమల కావ్యకన్యకలు మల్లినాథసూరి సంజీవినితో సకలమంగల మాధురీమూర్తులై లేచిరని పరంపరసూక్తి ఉన్నది. శ్రీ మాధవుని వసంతమాధురీ దోహదముతో నవ్యాంధ్రసాహితీ సుక్షేత్రము పూర్ణ రసవతియై భవిష్యత్కవి సంతానమునకు ఆనంద సూత్రధాత్రి అగునని విశ్వసించుచున్నాము.

రాయప్రోలు సుబ్బారావు

# విజ్ఞప్తి

శ్రీవిద్యానాథుని అలంకార శాస్త్ర సర్వస్వసంగ్రహమయిన ప్రతాపరుద్రీయ కృతికి ప్రచుర ప్రచారము ఉన్నది. మహావ్యాఖ్యాత మల్లినాథుడు దీనిని ఉల్లేఖించుట హేతువు. సాహిత్యశాస్త్ర వ్యాసంగము చేయదలచిన వారికి ఇది ఉపకరించక పోదని సంస్కృత ముఖులందరూ అంగీకరించుతున్నారు. కుమారస్వామి సోమపీథి వ్యాఖ్యానము మూలమునకు శోభ. రెండిటిని కలుపుకొని వ్యాసంగము చేస్తే సాహిత్యాలయములో ప్రవేశించడానికి తగిన అర్హత కలుగుతుంది. సాహిత్యార్చనము చేయాలని ఉత్సాహపడుతూ ఉన్న నేటి సారస్వతేయులకు ఇటువంటి విధానము అవసరము. అవసరాపేక్షితమును అందించడానికి ఆంధ్రప్రతాపరుద్రీయము సమర్థము కావాలని అభిలాష. సాహిత్యగతులు నానా విధములుగా ఉన్న ఈ దినాలలో భారతీయ సాహిత్య విలాసము ఏవిధముగా ఉన్నదో ముందుగా తెలియవలసిఉన్నది. అసంకీర్ణమైన విజ్ఞానము మంచి సామరస్యానికి అవకాశ మిస్తుందికదా!

ప్రాతఃస్మరణీయులు అస్మత్పితృపాదులు శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి చరణులు ప్రకృతము తురీయాశ్రమ నిష్ఠులు (శ్రీవైరాగ్యానంద భారతీస్వామి) ప్రతాపరుద్రీయ పాఠసములో నాకు ప్రథమోపదేశకులు. చిరస్మరణీయులు గురువర్యులు శ్రీ రాయుడుశాస్త్రి దేవులు సాహితీ రూప నిరూపకులు తెనాలి సంస్కృత కళాశాలలో, నెల్లూరు వేదసంస్కృత కళాశాలలో అంతేవాసులకు, అభిజ్ఞులకు అధ్యాపనము చేసి ఆంధ్రప్రతాపరుద్రీయమునకు ఈ సంపన్నాకృతి సముచితమని నిశ్చయించుకొన్నాను. దీనిలో భావప్రకటనమే ప్రధానా

శయము. వ్యాఖ్యానములోని మూల భావమును విస్పష్టం చేసే అంశాలను అందించడానికి యత్నించాను. అక్కడక్క అవసరములని తోచిన వానిని గ్రంథాంతర విజ్ఞానముతో నిరూపించాను. మూలోక్త లక్ష్యలక్షణములు ఆధారంగా ఆంధ్ర ప్రతాపరుద్రీయము ప్రసరించింది. సౌలభ్యమునకై ప్రాకృతానువాదము సంస్కృతచ్ఛాయను స్వీకరించాను. నాటకలక్ష్యమునకు ఇక్కడ అవకాశము అవసరము కాదని కొన్నాను. ఈ విధానమునే అస్మద్గురుపాదులు అమోదించారు. విద్యానాథ కృతికి కల ప్రామాణికతను నేను దీనిలో మీమాంసించ దలచలేదు.

సాహిత్య శాస్త్ర మాలికలో ఈ గ్రంథమును రెండవదిగా ప్రకటించడానికి ఆమోదము చూపి స్వస్పంద మనోహర ప్రస్తావికను అనుగ్రహించిన ఆచార్య శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి సాహిత్యాత్మకు నమోవాకము లర్పించుతున్నాను. ఈ గ్రంథమునకు ఈ విధముగా ప్రకాశనము కలగడములో హేతుభూతులు మరపురాని సౌహార్దశోభితులు సర్వవిధసామరస్య సంధానకుశలులు నవ్యసాహిత్య పరిషత్సూత్రధారులు సహృదయ మిత్రులు శ్రీ తెలికిచర్ల వెంకటరత్నముగారికి అభివాదనములు. ఆంధ్ర ప్రతాపరుద్రీయమునకు అచిరకాలములో అనురూప రూపసంపదనిచ్చిన శ్రీ కల్యాణీ ప్రెస్ వారికి సానంద ధన్యవాదములు

శ్రీ మాధవ రామ శర్మ

పార్థివ సంక్రాంతి
శాలి. ౧౮౭౬

# విషయసూచిక

## ౧. నాయక ప్రకరణము



## కావ్య ప్రకరణము





శబ్దశక్తిమూలక వ్యంజన - అర్థశక్తిమూలకము - ఉభయశక్తి కైశిక్యాది, వృత్తులు-కైశికి-ఆరభటి-భారతి-సాత్వతి - మధ్యమా భటి-మధ్యమకైశికి- రీతి సామాన్యలక్షణము - వైదర్భీరీతి - గౌడీ రీతి - పాంచాలరీతి-శయ్య- పాకములు - ద్రాక్షాపాకము - నారికే పాకము- కావ్యవిశేషములు -ధ్వని-గుణీభూతవ్యంగ్యము-చిత్రము శబ్దచిత్రము - అర్థచిత్రము - ఉభయచిత్రము - ధ్వనివిశేషములు అవివక్షిత వాచ్యధ్వని - వివక్షితాన్య పరవాచ్యధ్వని - అసంలక్ష్య క్రమము-సంలక్ష్యక్రమము - శబ్దశక్తిమూలకము - అర్థశక్తిమూల కము-ఉభయశక్తిమూలకము-అసంలక్ష్యక్రమ భేదములు - శుద్ధభేద ములు-మిశ్రభేదములు- ప్రాచీనుల మిశ్రగణనము - విద్యానాథుని గణనోపపత్తి - సంసృష్టిసంకరాయాతభేదములు - అర్థాంతరసంక్ర మితా వక్షితవాచ్యధ్వని - అత్యంతతిరస్కృతా వివక్షితవాచ్యధ్వని - వివక్షితాన్య పరవాచ్యములో అర్థశక్తిమూలవస్తువుచే వస్తుధ్వని - వస్తువుచే అలంకారధ్వని-వ్యంగ్యమునకు అలంకార వ్యపదేశము- అలంకారముచే వస్తువు - అలంకారముచే అలంకారము - క. ప్రౌ. వస్తువుచే వస్తుధ్వని-క. ప్రౌ. వస్తువుచే అలంకారము - క. ప్రౌ. అలంకారముచే వస్తువు-క. ప్రౌ. అలంకారముచే అలంకారము - క. ని. ప్రౌ. వస్తువుచే అలంకారము-క. ని. ప్రౌ. అలంకారముచే వస్తువు-క. ని. ప్రౌ. అలంకారముచే అలంకారము-శబ్దశక్తిమూల ధ్వని - శబ్దశక్తి మూలాలంకారధ్వని - శబ్దశక్తి మూలవస్తుధ్వని - ఉభయశక్తిమూలధ్వని-అసంలక్ష్యక్రమధ్వని-గుణీభూతవ్యంగ్యము- అగూఢము-అపరాంగము-వాచ్యసిద్ధ్యంగము - అస్ఫుటము - సంది గ్ధము-తుల్యప్రాధాన్యము-అసుందరము-కాక్వాక్షిప్తము-చిత్రము - మహాకావ్యము-ఉపకావ్యము-చంపువు - ఆఖ్యాయిక - క్షుద్రప్రబంధ ములు-ఉదాహరణము-చక్రవాళము-భోగావళి-బిరుదావళి - తారావళి.

౭౨-౧౬౮

3. నాటక ప్రకరణము

నాట్యస్వరూపము - నృత్యము, నృత్తము - దశరూపకములు - రూపకభేదకధర్మములు-సంధిపంచకము-సంధి-అవస్థానిరూపణము -ఆరంభము-ప్రయత్నము-ప్రాప్త్యాశ - నియతాప్తి- ఫలాగమము -

అర్థప్రకృతులు-బీజాదిపంచకము-బీజము-బిందువు - పతాక-ప్రకరి - కార్యము-ముఖసంధి - ముఖసంధ్యంగ నిరూపణము - ప్రతిముఖ సంధి-ప్రతిముఖసంధ్యంగ నిరూపణము- గర్భసంధి-గర్భసంధ్యంగ నిరూపణము-విమర్శసంధి- విమర్శసంధ్యంగ స్వరూపము - నిర్వ హణసంధి - నిర్వహణ సంధ్యంగస్వరూపము - సంధిప్రయోజన ములు-వస్తువిభాగము-విష్కంభము-చూళిక-అంకాస్యము - ప్రవేశ కము-అంకావతారము-అంకము- ప్రరోచన - ఆముఖము - సూత్ర ధారుడు-పూర్వరంగము కథోద్ఘాతము- ప్రవర్తకము - ప్రయోగాతి శయము-ఆముఖాంగములు-ఉద్ఘాత్యకము-అవలగితము-ప్రపంచము -త్రిగతము-ఛలము-వాక్కేళి- అధిబలము - గండము - అవస్యంది తము-నాళిక-అసత్ప్రలాపము-వ్యాహారము-మృదవము -దశరూపక స్వరూపము-నాటకము సర్వప్రకృతి - నాందీస్వరూపము - ప్రకర ణము-భాణము-ప్రహసనము-శుద్ధము-వైకృతము - సంకీర్ణము - డిమము-వ్యాయోగము-సమవకారము - వీధీ - అంకము - ఈహా మృగము. ౧౬౯-౨౨౫

## ౫. రస ప్రకరణము

రసస్వరూపము-భట్టలోల్లటునివాదము - శ్రీశంకుకునివాదము - భట్ట నాయకునివాదము - అభినవగుప్తునివాదము - స్థాయిభావము - రస ములు-విభావము - అనుభావము - సాత్వికములు-వ్యభిచారులు-రసా భాస-భావశాంత్యాదులు-స్థాయిభావములు-రతి- హాసము - శోకము - క్రోధము-ఉత్సాహము-భయము - జుగుప్స-విస్మయము - శమము - శాంతము రసమా ?-శాంతము రసమే-విభావము-ఉద్దీపనవిభావము- అనుభావము-సాత్వికములు- స్తంభము-ప్రళయము -రోమాంచము - కంపము-స్వేదము-వైవర్ణ్యము-అశ్రువు - వైస్వర్యము - వ్యభిచారి భావములు-నిర్వేదము -గ్లాని-శంక-అసూయ-మదము - శ్రమము - ఆలస్యము - దైన్యము-చింత-మోహము - స్మృతి-ధృతి-వ్రీడ-చప లత-హర్షము-ఆవేగము-జడత-గర్వము-విషాదము - ఔత్సుక్యము - నిద్ర-అపస్మారము-సుప్తి-విబోధము-అమర్ష- అవహిత్థ - ఉగ్రత - మతి-వ్యాధి-ఉన్మాదము-మరణము-త్రాసము-వితర్కము - శృంగార చేష్టానిరూపణము-భావము-హావము-హేల-మాధుర్యము -ధైర్యము-

శ్రీ ర్జయతు

# ఆంధ్ర ప్రతాపరుద్రీయము

## నాయక ప్రకరణము

### దేవీ స్తుతి

విద్యాకైరవకౌముదీం శ్రుతిశిరఃసీమ స్తముక్తామణిం
దారాన్ పద్మభువ స్త్రిలోకజననీం వందే గిరాం దేవతాం,
యత్పాదాబ్జనమస్క్రియా స్సుకృతినాం సారస్వతప్రక్రియా
బీజన్యాసభువో భవంతి కవితానాట్యైకజీవాతవః,
శ్రీదేవీ పరమా మాతా స్వోన్మేషార్థప్రదాయినీ,
వాచాం సర్వప్రకారాణాం మూలం లక్ష్యం చ భాసతాం.

* * *

పూర్వేభ్యో భామహాదిభ్య స్సాదరం విహితాంజలిః,
వక్ష్యే సమ్య గలంకారశాస్త్రసర్వస్వసంగ్రహమ్,

భామహాదులు చిరంతనాలంకారికులు. వారలకు సాదరముగా అంజలిని ఘటించుచుతాను. పిమ్మట సమ్యగ్రీతిలో అలంకారశాస్త్రసర్వస్వ సంగ్రహమును చెప్పెదను. ఇది సామాన్యముగా భావము.

ఇది అలంకారశాస్త్రగ్రంథము. అలంకారశాస్త్రకారులకు ముందుగా నమోవాకమును చెప్పుట సముచితము.

### సాహిత్య ప్రాచీనత

అలంకారశాస్త్రము బాగా చిరంతనమే. వేదపురాణేతిహాసాలలో దీనిస్వరూపవిశేషములు గోచరము లవుతూనే

ఉన్నవి. అగ్నిపురాణములో కొన్నిఅధ్యాయాలు సాహిత్య పద్ధతులను విశదముచేస్తూ ఉన్నవి. భరతుని నాట్యశాస్త్రములో నాట్యము ప్రధానము. అయినా అది ప్రసంగవశాన సాహిత్యాంగాలను చర్చిస్తూ ఉన్నది. కేవలాలంకార గ్రంథములుగా చెప్పదగినవానిలో భామహుని కావ్యాలంకారము మొదటిది. అంతకు ప్రాచీనములు ఉండవచ్చునేమో కాని అవి ప్రస్తుతము దొరకడము లేదు. మొత్తముపై తరువాతి ఆలంకారికులకు భామహుడే సాహిత్యభిక్షను పెట్టినట్లు ఊహించాలి కాబట్టి భామహుడు మొదటగా ప్రణమ్యుడు.

## ప్రస్థాన భేదము

ఈ కారికలో "భామహాదిభ్యః" అనే బహువచనము స్వారసికము. సాహిత్యశాస్త్రములో భిన్నభిన్నము లయిన ప్రస్థానములు ఉన్నవి. వాటిలో అలంకారప్రస్థానము మొదటిది. దానిలో ఆదిపురుషుడు భామహుడు. దండి గుణప్రస్థానవ్యవస్థాపకుడు. వామనుడు రీతిప్రస్థానవాది. శ్రీమదానందవర్ధనాభినవగుప్తులు ధ్వనిప్రస్థాన వ్యవస్థాపనాచార్యులు. కుంతకుడు వక్రోక్తివాది. క్షేమేంద్రుడు ఔచిత్యాభిమాని. మహిముడు అనుమాననిర్ణేత. ఆయాప్రస్థానాలకు ఆదిపురుషు లయిన వీరంతా నమస్కార్యులు.

## అలంకారశాస్త్ర మని అనడములో ఉపపత్తి

"అలంకారశాస్త్రసర్వస్వసంగ్రహం" రసము, గుణము, అలంకారము, రీతి, వృత్తి అనేవి సాహిత్యప్రమేయములు. అయినా ఛత్రిన్యాయానుసారంగా దీనిని 'అలంకార శాస్త్రము' అని అనడము యుక్తమే అలంకారపదము చేతనే మిగిలిన వన్నీ సంగృహీతము లవుతవి. మొదటివా

ముగా చెప్పదగిన భామహుడు ఆతనిఅనుయాయులూ అలంకా రాలనే ప్రధానంగా తలచడంమూలాన ఈపేరు ప్రసిద్ధ మయింది. ఇతరులు రసాదులను ముఖ్యముగా తలచినా 'సౌందర్యము అలంకారము' అని భావించడముచేత ఈపేరు అనుపపన్నం కాదు. సాహిత్యప్రమేయాలను అనుశాసించి చెప్పేది అలంకారశాస్త్రము. అలంకారశాస్త్రగ్రంథాలు అనేకములు ఉన్నవి. ఒక్కొక్కగ్రంథంలో ఒక్కొక్కవిషయమే గ్రథితమయింది. కాని అన్నివిషయాలూ ఉపపాదితములు కావడము లేదు. సాహిత్యదర్పణమువంటి గ్రంథంలో సకల విషయాలు ఉన్నా సంగ్రహంగా ఉండకపోవడమువలన సకల విషయాలనూ సంగ్రహంగా విశదంగా ఉపపాదించడానికై ఈగ్రంథము ప్రారబ్ధమయినది.

## చరితార్థత

చిరేణ చరితార్థోఽభూ త్కావ్యాలంకారసంగ్రహః,
ప్రతాపరుద్రదేవస్య కీర్తి ర్యేన ప్రకాశ్యతే.

కావ్యాలంకారసంగ్రహము చిరకాలానికి చరితార్థ మయింది. శ్రీ ప్రతాపరుద్రదేవునికీర్తి ఈగ్రంథంలో ప్రకా శితము కావడమే హేతువు. లోకోత్తరమయిన ప్రతిపాద్యము లభించినందువలన అలంకారశాస్త్రము ఈనాటికి ధన్య మయింది. ఇతర గ్రంథాలలో ఇటువంటి వర్ణ్యపురుషుడు లేడు. ఈగ్రంథములో ఉన్నాడు. కాబట్టి ఈగ్రంథానికి ఉత్కర్ష ఉన్నది.

## ఈశాస్త్రప్రమేయము

రసప్రధానా శ్శబ్దార్థా గుణాలంకారవృత్తయః,
రీతయ శ్చేయతీ శాస్త్రప్రమేయం కావ్యపద్ధతిః.

"అలంకారశాస్త్రసర్వస్వసంగ్రహం" అనగా ఏమో ఈ కారికలో విభజింపబడుతున్నది. రసమే జీవితముగా కలిగిన శబ్దార్థములు, గుణములు, అలంకారములు, వృత్తులు, రీతులు, అను ఈ కావ్యపద్ధతిని సాహిత్యశాస్త్రప్రమేయముగా గ్రహించాలి. "రీతయశ్చ" అనేచోట 'చ' కారమువలన ఇచట చెప్పబడని కావ్యప్రకరణములో వక్ష్యమాణములగు శయ్యా పాకాలను కూడా గ్రహించాలి. కాగా కావ్యమార్గములో రసభావాదులు, శబ్దార్థములు, గుణములు, అలంకారాలు, వృత్తులు, రీతులు, శయ్య, పాకము అనేవి ఉండాలనిభావము.

రసప్రధానత

వీని అన్నిటిలోనూ రసము ప్రధానము కావాలి అనేది ముఖ్యవివక్షితము. అనగా కేవలము శబ్దచమత్కారము కాని, కేవలమూ అర్థచమత్కారము కాని, కేవల గుణాదిచమత్కారము కాని ఉన్న కావ్యపద్ధతి కావ్యపద్ధతి కాదు, అని తాత్పర్యము. వాని వాని చమత్కారము ఉన్నా అక్కడ పర్యవసానంలో రసచమత్కారమే ప్రధానము కావాలన్నమాట. రసపర్యవసానము పొందని చమత్కారము కావ్యపద్ధతిలో ఉండదగదు. రసము జీవితముగా ఉంటేనే వానికి స్వరూపలాభము కలుగుతుంది. ఇచ్చట రసము కేవల ముపలక్షకము. కాగా రసము, భావము, రసాభాస, భావాభాస, భావోదయము, భావసంధి, భావశాంతి, భావశబలతలు కూడా సంగృహీతములు కావాలి. ఈవిషయము మున్ముందు విశదమవుతుంది.

ప్రధానము రసమా? వ్యంగ్యమా?

ఇక్కడ ఒకటి శంకించవలసి ఉన్నది. రాబోయే కావ్యప్రకరణంలో "జీవితం వ్యంగ్యవైభవం" అని నిరూపితము

కానున్నది. వ్యంగ్యము వస్తు వని, అలంకార మని, రస మని మూడు విధాలు. ఈవిధముగా త్రివిధమయిన వ్యంగ్యమే కావ్యజీవిత మని అచటి భావము. ఇక్కడఉన్న "రసప్రధానాః" అనే పదమువలన రసమే జీవిత మని తెలుతున్నది. ఈవాదద్వయములో దేనిని ప్రమాణంగా గ్రహించాలి? రసమే జీవితము అనే వాదమునే ప్రమాణముగా గ్రహించితే వస్త్వలంకారములు జీవితము కాజాలవు. "జీవితం వ్యంగ్యవైభవం" అనే వాదమే ప్రమాణమయితే రసజీవితత్వకథనము వ్యాహత మవుతుంది. ఒకే గ్రంథములో ఈవిధంగా పూర్వాపరవిరుద్ధ వచనాలు ఉండడము ఉచితము కాదుగదా! ఈవైరుధ్యమును ఏవిధంగాపరిహరించాలి? అని.

రసమే జీవితము అని అనడము సముచితపక్షము. రసము ముఖ్యజీవితము. వస్త్వలంకారములు జీవిత మని అనుట ఔపచారికము. రసము స్వస్వరూపములోనే విశ్రాంత మవుతుంది. అది వేరొకదానిలో పర్యవసానము పొందవలక్కర లేదు. వస్త్వలంకారములు అట్లా కాదు. వస్తువు వ్యంగ్యమయినా దానియంతట అది చమత్కారకము కాదు. అది రసాంగ మయినప్పుడె చమత్కారి. రసాంగము కాకుండా స్వరూపవిశ్రాంత మయ్యే వస్తువు నీరసము. నీరసము కావ్యములో ఉపాదేయము కాదు. అలంకారముకూడా అంతే. వస్త్వలంకారాలు రసవిశ్రాంతము లయితేనే సుందరములు అవుతవి. అదీకాక అవి అవశ్యంగా రసవిశ్రాంతిని పొందితీరుతవి. కాబట్టి అవి అప్రధానాలు. అప్రధానము జీవిత మవుతుందా? వానిలోని జీవితత్వవ్యవహారము ముఖ్యము కాదు. కాగా "జీవితం వ్యంగ్యవైభవం" అనేచోట కూడా

రసమె జీవితము అని తాత్పర్యమును గ్రహించాలి. వ్యంగ్య ములుగా ఉండే వస్త్వలంకారములు వాచ్యము లవుతూ ఉండే వస్త్వలంకారములకంటె రమణీయములు. కాబట్టి వస్త్వలంకారములు (వ్యంగ్యము అవుతున్నప్పుడు) జీవిత మనుట యుక్తమె. కాని అది ఆపాతకథనము. స్థలద్వయంలో కూడా రసప్రధానతకు ఏమాత్రమూ హానిలేదు. అందువల్ల ననే పూర్వాపర వైరుధ్యము ఏమీ లేదు. ఇది పై శంకకు సమాధానము.

యద్య ప్యసౌ ప్రబంధేషు ప్రాచాం సాధు నిరూపితా,
తథా ప్యస్యా స్సమం నేతు ర్నోదాహరణ మాదృతం.

ప్రాచీనులప్రబంధాలలో ఈ కావ్యపద్ధతి బాగానె నిరూపిత మయింది. అయినా ఈ కావ్యపద్ధతికి తగిన నాయకుని ఉదాహరణమును ప్రాచీనులు ఆదరించలేదు. ప్రాచీనులు కావ్యస్వరూపమును ఎంతగా నిరూపించినా ఉదాహరణార్హుడయిన నాయకుని వారు నిరూపించకపోవడము వారిగ్రంథాలకు అపకర్షగా ఉన్నది. ఉదాహరణార్హ యోగ్యనాయక నిబంధనము లేనప్పుడు ఎంతగా కావ్యపద్ధతి నిరూపితమైనా సహృదయులకు రుచిరమయిన ప్రవృత్తి ఉదయించదు.

పుణ్యశ్లోకస్య చరిత ముదాహరణ మర్హతి,
న కశ్చి త్తాదృశః పూర్వైః ప్రబంధాభరణీకృతః.

పవిత్రయశస్సు కలవాని చరిత్ర ఉదాహరణార్హ మవుతుంది. పూర్వులు ఎవరూ కూడా అటువంటి పుణ్యశ్లోకుని ఎవనినీ ప్రబంధాభరణముగా చేయలేదు. కర్తవ్యమును ఆచరించని వారికృతి ఎట్లా శ్లాఘ్యము కాగలదు? యోగ్యనాయక నిబంధనము చేయక పోవుట కవులకు అపకర్షాపాదకము.

ప్రబంధానాం ప్రబంధౄణా మపి కీర్తిప్రతిష్ఠయోః,
మూలం విషయభూతస్య నేతు ర్గుణనిరూపణం.

విషయముగా ఉండే ఉత్తమనాయకుని గుణనిరూపణము ప్రబంధాలకు ప్రబంధకర్తలకూ కూడా కీర్తిప్రతిష్ఠా మూలము. నేతృగుణనిరూపణమువలన గ్రంథాలకు కీర్తి కలుగుతుంది. గ్రంథకర్తలకు ప్రతిష్ఠ సంపాదితమవుతుంది. నాయకగుణగణ గణనము ప్రబంధాలకు యశఃప్రతిష్ఠాసంపాదకమైనట్లు ప్రబంధ కర్తలకుకూడా యశః ప్రతిష్ఠాసంపాదక మనికూడ భావము.

కేవలమూ తత్తద్వస్తువులలో ఉండే విశేషముఫలన కలిగేది యశస్సు. ఆయావిశేషాలను సహృదయులు అనుసంధానము చేసి స్వరూపసంవాదమును సంపాదించుతారు. అట్టి సహృదయ స్వాత్మసంవాదమువలన ప్రతిష్ఠ కలుగుతుం దని ఊహించాలి. ప్రబంధౄ ప్రబంధముల ఉత్కర్ష నేతృనిబంధనాధీనము అని పిండితార్థము.

శ్రీరాముడు ఉదాత్తచరితుడు. శ్రీమద్రామాయణములో ఆదికవి వాల్మీకి రామునిగుణవర్ణన మొనర్చినాడు. ఆవర్ణనము రామాయణానికీ వాల్మీకిమహామునికీ మహాప్రతిష్ఠా హేతువు అయింది. ఉత్తమగుణవర్ణనమును అనుసరించి ప్రబంధములను నిర్మాణించుట వలన అనేక శ్రేయస్సులు కలుగుతవి. మహాపురుషగుణవర్ణనము ఉంటేనే ప్రబంధస్థితి శ్రేయస్కర మవుతుంది. కాబట్టి ఉత్తమ గుణగణవర్ణనము అవశ్యకర్తవ్యము.

### కావ్యమైలక్షణ్యము

ఈ అలంకారశాస్త్రములో కావ్యము ప్రతిపాదిత మవుతుంది. కావ్యము వేదాదుల మాదిరిగా పురుషార్థ పర్యవ

సాయి. వేదము "ఈవిధముగా చేయుడు" అని హితప్రాప్తిని కలుగజేస్తుంది. "ఈవిధముగా చేయకుడు" అని అహిత నివృత్తిని సంపాదించుతుంది. ఇట్లాగే శాస్త్రాలు, పురాణాలు, ఇతిహాసాలూ, హితాహితప్రవృత్తినివృత్తిసంపాదకములు. ఉత్తమనాయకవర్ణనము ఉన్న కావ్యమువలనకూడా హిత ప్రాప్తి అహితనివృత్తి ఉన్నది. హితాహితకర్తవ్యాకర్తవ్య మతిని కలుగజేయడములో కావ్యము వేదశాస్త్రపురాణేతి హాససదృశమే. అయినా కావ్యములో విశేషము ఉన్నది. ఆవిశేషము కావ్యాభ్యుచ్ఛ్రయసంపాదకము. వేదాదులవలన కర్తవ్యతాబుద్ధి కలుగుగావుత. కాని అది కటువుగా ఉంటుంది. కావ్యమువలన కలిగే కర్తవ్యతాబుద్ధి సరసము. ఈసరసత్వము వేదాదులలో కానరాదు. చూడుడు—

యద్వేదాత్ ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
య చ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్,
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యశ్రియా
కర్తవ్యే కుతుకీ బుధోఽపి రచిత స్తస్యై స్పృహాం కుర్మహే.

ప్రభుసమ్మితమూ శబ్దప్రధానమూ అయిన వేదమువలన కర్తవ్యాకర్తవ్యరూప మగు ఏఅంశము ప్రమాణ సమ్మతమై కష్టమున చాలా కాలానికి తెలియబడుతున్నదో, సుహృత్సమ్మి తమూ అర్థప్రధానకమూ అయిన పురాణవచనమువలన ఏహితాహితబోధ చిరకాలానికి అభిరుచిత మయిందో, అటు వంటి కర్తవ్యాకర్తవ్యాంశములో కాంతాసమ్మిత మయిన కావ్యశ్రీ సరసత్వమును ఆపాదించి, భావకునికర్తవ్యములో కౌతుకము కలవానినిగ, అకర్తవ్యములో కౌతుకము లేనివా నినిగా చేస్తున్నది. అట్టి కావ్యశ్రీ ప్రాప్తికై మేము స్పృహ

యాశువులపు అవుతారు, అని సామాన్యాత్మక మయిన అర్థము.

వేదము ప్రభుసమ్మిత మనుట

దీనిలోని నిగూఢవిషయమును ఈవిధంగా గ్రహించాలి. లోకములో వేద పురాణ కావ్యాలు హితాహితాలను సూచించుతున్నవి, అని ప్రక్రాంతము. అందులోనూ కావ్యము సరసమనికూడా ఉద్దిష్టము. ప్రత్యక్షప్రమాణము వలన కాని అనుమానప్రమాణమువలన కాని గోచరము కాని ఉపాయవేదనము వేదమువలననే కలుగుతుంది కాబట్టి వేదము వేద మవుతున్నది. జ్యోతిష్టోమాదియాగములు ఇష్ట ప్రాప్తిలో ఉపాయాలు. అవి ప్రత్యక్షాదిప్రమాణాలకు గోచరములు కావు. కలంజభక్షణ సురాపాన పరస్త్రీగమ నాది వర్జనము అనిష్టపరిహారములో ఉపాయము. ఇదికూడా ప్రత్యక్షాదివిషయము కాదు. ఈ ఇష్టానిష్టప్రాప్తి పరిహారో పాయాలను వేదమువలననే తెలియాలి. ఇటువంటి ఈ వేదము రాజతుల్యము. రాజువలె వేదము శబ్దప్రధానము. "ఇట్లు చేయుము" అనే విధిబలాన ప్రభువు మానవులకు ప్రవ ర్తకుడు అవుతున్నాడు. "ఇట్లు చేయకుము" అనే నిషేధ బలాన ప్రభువు నివర్తకు డవుతున్నాడు. వేదముకూడా "సత్యం వద, ధర్మం చర, అహరహః సంధ్యా ముపాసీత, జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" మొదలయిన విధి వాక్యబలాన మానవులకు ప్రవర్తక మవుతున్నది. "స్వాధ్యాయా న్మా ప్రమదః, న కలంజం భక్షయేత్, న సురాం పిబేత్, న పరదారాన్ గచ్ఛేత్, బ్రాహ్మణో న హన్తవ్యః" మొదలయిన నిషేధవచనబలాన నివర్తక మవు

తున్నది. తన ఆజ్ఞను పరిపాలించనివానిని ప్రభువు దండించు తాడు. విధుల నిర్వర్తించని వానిని వేదము ప్రత్యవాయ (ఇబ్బంది) జననద్వారా శిక్షించుతుంది. వేదమును అహరహమూ ద్విజులు అధ్యయనం చేయాలి. వేదములో స్వరవర్ణముల అన్యథోచ్చారణము అనర్థ సాధకము. వేదవిహితకర్మలను అవశ్యము యథావిధిగా ఆచరించాలి. అదే ఫలప్రదము. కాక ఆకర్మల అన్యథానుష్ఠానము కాని అననుష్ఠానము కాని అనర్థజనకము. వేదము ఈవిధంగా ప్రత్యవాయజనకమని ఊహించాలి. మీమాంస చదివితేనే కాని వేదార్థము తెలియదు. వేదార్థము సుగృహీతమయితే కాని కర్తవ్యాకర్తవ్యబోధ కలుగదు. వేదార్థగ్రహణంలో మీమాంసాపేక్ష ఉన్నది కాబట్టి వేదమువల్ల కలిగే ఇష్టానిష్టబోధ చిరకాలానికి కాని కలుగదు. ఈ చెప్పినదంతా వేదవిషయంలో విజ్ఞేయాంశము.

## పురాణము సుహృత్సమ్మితమనుట

ఇక పురాణము అర్థప్రధానము. పురాణములలోని కథలన్నీ అర్థవాదాత్మకములు, అచటి కథలలో స్వార్థతాత్పర్యము లేదు. ఒక్కొకచోట ప్రతిపాద్యప్రశంసా సూచకములుగా కథలు నిరూపితము లవుతవి. వేరొకచోట నిందార్థనిందా పరముగా కథలు ఉపాత్తము లవుతవి. పౌరాణికగాథలను చారిత్రికప్రసిద్ధి ఉన్నప్పటికీ ప్రతిపాద్యవిషయతత్పరతయే ప్రధానము కాబట్టి పురాణములు అర్థవాద బహుళములు అవుతున్నవి. పురాణోక్తము "ఇట్లు చేయవలయును" అనే విధిబలాన ప్రవర్తకము కావడము లేదు. "ఇట్లా ఆచరింపరాదు" అని నిషేధబలాన నివర్తకమూ

మగు కర్మనే గ్రహించాలి. అదే కావ్యము. అట్టి కావ్యమిలా సము సరసతను ఆపాదించుతుంది. అది పఠితలకు ఉత్కంఠను కలగజేసి వారలను స్వాభిముఖులనుగా చేసికొంటుంది. ఒక కమనీయకామిని మృదుగమన కటాక్షవీక్షణ దరహసితాది విలాసాలతో కాంతుని ఆవర్జించుకొనగలదు. కాని "నాకు ఇది ఇష్టము. దీనిని చేయవలసినది' అని కాని "నాకు ఇది ఇష్టము కాదు. దీనిని చేయవద్దు" అని కాని కంఠోక్తిగా చెప్పదు. కటాక్షాదికముచేత సమావర్జితుడయిన కాంతుడు తనంతట తాను కాంతాభిలషితమును సర్వమూ సంపాదించుతాడు. కామిని ఈవిధముగా సర్వమును కాంతునిచేత సంపాదింపచేసికొంటున్నది. కావ్యశ్రీకూడా ఇట్లాగే అని గ్రహించాలి కావ్యవిలాసమంతా వ్యంజనావ్యాపారమాత్రపరము. కావ్యములోని శబ్దార్థములు అప్రధానాలు. కాబట్టే శబ్దప్రధానకము ప్రభుసమ్మితమూ అయిన వేదముకన్నా, అర్థప్రధానకము సుహృత్సమ్మితమూ అయిన పురాణముకన్నా కావ్యము విలక్షణము. సహృదయ హృదయాహ్లాదమును కలుగజేసే వ్యంజనావ్యాపార ద్వారముగానే కావ్యము మానవుని కర్తవ్యములో ప్రవర్తింపచేస్తుంది అకర్తవ్యమునుండి నివర్తింపచేస్తుంది. కావ్యము కాంతాసమ్మితమై సరసతాపాదనముతో ప్రవర్తకము అవుతున్నది. కాబట్టి, భయపురస్సరముగా ప్రవర్తకమవుతూ ఉన్న వేదముకంటె, అనునయపురస్సరముగా ప్రవర్తకమవుతూ ఉన్న పురాణముకంటె విజాతీయమై విశిష్టవిశేషము కలిగి ఉన్నదని తెలుసుకోవాలి. ఇటువంటి ఈ కావ్యశ్రీసంసేవనము సహృదయులకు కర్తవ్యము.

## అనుబంధ చతుష్టయము

పురుషార్థోపదేశము కావ్యప్రయోజనము. అటువంటి ప్రయోజనవిశిష్టమయిన కావ్యము విషయము. పురుషార్థము సాధ్యము. కావ్యము సాధనము. అందువలన ఈరెండిటికీ సాధ్యసాధనభావము సంబంధము. ఈ విషయజిజ్ఞాస కలిగిన సహృదయుడు అధికారి. ఈవిధముగా ఇక్కడ ప్రయోజన విషయ సంబంధాధికారులు అనే అనుబంధచతుష్టయమును గ్రహించాలి. గ్రంథములో ఇవి అవసరములు.

## కావ్యప్రయోజనము

కావ్యఫలము కేవలమూ పురుషార్థోపదేశమే కాదు. కీర్తి మొదలయిన ప్రయోజనాలు అనేకములు ఉన్నవి. కావ్యము దృష్టఫలములను ఆపాదించుతుంది. అదృష్టఫలములనూ సంపాదించుతుంది. ఇట్లా కావ్యము బహుఫలజనకము కావడమువలన బహూపయుక్తము. కేవలము పురుషార్థకాంక్షులకే కాక ఇతరప్రయోజనకాముకులకుకూడా కావ్యము ఉపకరించుతుంది. కాబట్టి ఇది ఉపాదేయము. కావ్యప్రకాశ గ్రంథములో కావ్యప్రయోజనాలు ఈ విధముగా నిర్దిష్టములయినవి.

> కావ్యం యశసేఽర్థకృతే, వ్యవహారవిదే శివేతరక్షతయే,
> సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే.

కావ్యము యశస్సునకు ద్రవ్యసంపాదనానికి వ్యవహారవిజ్ఞానమునకు అమంగళనాశనానికీ పఠనసమనంతరములోనే పరినిర్వృతికి కాంతాసమ్మిత మాటవలన ఉపదేశయోజనమునకూ ఉపకరించేది అవుతుంది.

కాళిదాసాదులు ఎచట పుట్టినారో ఎచట వృద్ధిపొందినారో సరిగా తెలియదు. కాని వారి కావ్యాలు దేశదేశాంతర ఖండఖండాంతర ప్రసిద్ధములై అపారమూ చిరస్థాయీ అయిన యశస్సును వారికి సంపాదించినవి. ధావకుడు నిర్ధనుడు, దరిద్రకవి. అతనికావ్యాలను అభినందించి శ్రీహర్షవర్ధనుడు అనే మహారాజు అమితద్రవ్యమును ధావకునకు బహూకరించినట్లు లోకవిదితమే. లోకవృత్తము లోకవ్యవహార మనబడుతుంది. తత్పరిజ్ఞానముకూడా కావ్యమువలన కలుగుతుంది. రాజకీయవిషయాలలో ఆసక్తి లేక సాహితీజిజ్ఞాసువులై ఉన్న రాజకుమారులకు విష్ణుశర్మ అనే పండితుడు పంచతంత్రమనే గ్రంథద్వారముగా నీతిని ఉపదేశించినట్లు ఆభాణకము ఉన్నది. మయూరకవి కుష్ఠవ్యాధిపీడితుడై సూర్యస్తవము చేసి ఆరోగ్యమును పొందడమూ ప్రసిద్ధమే. అతని కావ్యము సూర్యశతకముగా ప్రసిద్ధి పొందినది. జయదేవమహాకవి చనిపోయిన తనభార్యను గీతగోవిందకావ్యమువలన జీవింపచేసికొన్నాడు. ఇట్లా కావ్యమువలన శివేతరక్షతిని పొందినవారు అనేకులున్నారు. కావ్యపఠనసమనంతరములో విగళితవేద్యాంతరము బ్రహ్మానందసబ్రహ్మచారి అయిన రసానందము కలుగుతున్నది అదే పరనిర్వృతి. కావ్యము కాంతాసమ్మిత మగుటవలన శబ్దార్థాలను గుణీకరించుకొని ధ్వననవ్యాపారపరమై సరసవిధానముతో ఉపదేశించేదికూడా అవుతుంది అని నిరూపితమె.

ఈ చెప్పిన ప్రయోజనాలు కవిసహృదయులకు సంబంధించేవి అవుతవి. వీనిలో యశోఽర్థానర్థప్రతీకారములు ఇద్దరకూ సంబంధించేవి అవుతవి. వ్యవహారోపదేశములు కేవలమూ సహృదయునివే. కవిసహృదయులు ఇద్దరూ పరనిర్వృతి

భాజనులు కాని నిర్వృతికాలములో కవికూడా సహృదయుడే. ఇట్లా ఈ ప్రయోజనాలు యథాసంభవముగా కవిభావకులకు సంబంధించేవి అవుతవని గ్రాహింక.

కావ్యము ఈవిధముగా అనేకప్రయోజనసంపాదకము కావడము మహాప్రబంధాలలో కూడా ప్రసిద్ధమై ఉన్నది.

పరివర్ధతే విజ్ఞానం సంభావ్యతే యశో విసర్పన్తి గుణాః
శ్రూయతే సుపురుషచరితం కింతద్యేన నహరన్తి కావ్యాలాపాః?

కావ్యమువలన విజ్ఞానము అభివృద్ధి పొందుతుంది. యశస్సు సంభావిత మవుతుంది. గుణాలు బాగా వ్యాపించుతవి. యోగ్యపురుషులచరితము శ్రుత మవుతుంది. కావ్యాలాపము సకలసంపాదకము. మనోహారి. కావ్యాలాపము మనోహారము కాకపోవుటలో హేతు వేదీ లేదు. ఏ కారణము వలన కావ్యాలాపాలు మనస్సును హరింపచేయలేవో అటువంటి కారణము ఏమి ఉన్నది? సర్వథా కావ్యము మనోహార మని భావము.

ఇంత దేనికి? ధర్మార్థకామమోక్షాలలోనూ సకలకళలలోనూ కావ్యము వైచక్షణ్యమును సంపాదించుతుంది. సాధుకావ్యనిషేవణము కీర్తిప్రీతికరము. ఇన్ని ప్రయోజనా లున్నప్పటికీ పరనిర్వృతియె ప్రధానప్రయోజనము. అదె ముఖ్యఫల మని రహస్యము. కావ్యము కాంతాసమ్మిత మనే విశేషము ఈఅర్థమును విశదము చేస్తున్నది. కావ్యమువలన చతుర్వర్గవ్యుత్పత్తి ఉన్నప్పటికీ పురుషార్థము లన్నీ ఆనందములోనే పర్యవసానము పొందుతవి కాబట్టి పరనిర్వృతియె పరమప్రయోజన మని గ్రహించాలి. ఆనందమె పార్యంతిక

ముఖ్యఫల మని శ్రీయుతులు అభినవాసప్తపాదులు నిర్వ చించుచున్నారు.

"కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అని ఒకని షేధము ఉన్నది. దానిని అనుసరించి చూచినట్లయితే కావ్యసంలాపములను విడువవలసిందే అని తేలుతుంది. కాగా ఈ కావ్యశ్రీప్రయాస మంతా విఫలమె కాదా? అని శంక కలుగవచ్చును. కాని తదభిప్రాయమును ఈవిధముగా గ్రహించాలి. ఉత్తమపురుష చరితవర్ణనము లేని కావ్యమును త్యజింపవలయును, అని తదర్థము. ఉత్తమపురుష చరితనిబంధనము ఉన్నట్లయితే అటు వంటి కావ్యమును అవశ్యము స్వీకరింపవలయును, అని భావము. కాకపోతే రామాయణాద్యుత్తము కావ్యాలనుకూడా త్యజింపవలసివస్తుంది. కాగా 'కావ్యాలాపాంశ్చ వర్జయేత్' అనేస్మృతి పుణ్యశ్లోకచరితనిబంధనము లేని కావ్యమూలకము అని గ్రహించడము సముచితముగా ఉంటుంది.

ఉత్తమపురుషగుణవర్ణనావశ్యకత అనే ఈపక్షము కేవలమూ కావ్యానికే కాదు. శాస్త్రజాతానికికూడా ఇది ఆవశ్యకము. శాస్త్రాలు సదాశ్రయములై ఉంటేనే లోకములో బాగా ఆదరింపబడగలవు. ఇప్పటికి శాస్త్రజాతానికి కలిగిన లోకాదరము సదాశ్రయతామూలక మని విస్పష్టముగా గోచర మవుతున్నది. శాస్త్రాలలో అన్నిటా సదాశ్రయము భాసించు తూనే ఉన్నది. చూడుడు

కణాదమునిప్రోక్త మయిన వైశేషికశాస్త్రము ఈశ్వర ప్రతిష్ఠాపకము. అందువలననె అది జగత్పూజ్యముగా ఉన్నది. వైశేషికదర్శనములో ఈశ్వరుడు అనుమానప్రమాణముచేత సాధింపబడినాడు. ఈజగములో కనపడుతూ ఉన్న అంకురాది

కము సకర్తృకమే ఉన్నది. కర్త లేకుండా ఏదీ కలుగదు. కార్యముగా ఉండేది సకర్తృకమే అనడము యుక్తిసిద్ధము. లోకములో ఘటము శరావము మొదలయిన వన్నీ కార్యములు. వానికి కులాలుడు కర్త ఉన్నాడు. అట్లాగే ఈ జగత్తుకూడా సకర్తృకమే. అదికూడా కార్యమే కదా! సకర్తృక మయిన జగత్తుయొక్క కర్తృత్వము అస్మదాదులకు సిద్ధము కాదు. భ్రమ ప్రమాదాది దోషబహుళ మానవాదులు జగత్కర్తలు కాజాలరు. సర్వదోషరహితుడు సర్వశక్తియుతుడూ సర్వజ్ఞుడూ అయిన ఆతడే జగత్కర్త. ఈవిశేషములు మనలో ఉండవు. ఇవన్నీ కలవాడు అచింత్యామేయ ప్రభావయుతు డయిన పరమేశ్వరుడే. కాబట్టి ఈశ్వరుడే జగత్కర్త. ఇట్లా వైశేషికము ఈశ్వరుని ప్రతిష్ఠాపించుతున్నది. ఇట్లాగే ఇతరశాస్త్రాలలోకూడా సమన్వయించి చూచుకోవాలి.

శాసించేది శాస్త్రము. మహాభారతము లోకవృత్తము నంతనూ శాసించుతున్నది. సకలవిషయాలనూ అది శాసించి నిర్దేశించుతున్నది. కాబట్టి మహాభారతముకూడా శాస్త్రము. మహాభారతాదిగ్రంథాలు మహాపురుషగుణవర్ణనపరములై ఉన్నవి. కాబట్టి అవికూడా విశ్వాసాతిశయితములే. ఇంత దేనికి? వేదాంతములు బ్రహ్మప్రతిపాదకములు కావడమువలననే పరమోత్కర్ష కలిగి ఉన్నవి. వేదాంతములలో చిదేకరసము నిర్ధర్మకమూ అయిన బ్రహ్మ ప్రతిపాదితము కావడము స్పష్టమే. అక్కడ గుణవత్పురుషవర్ణనము లేకపోవుట దోషము కాదు. బ్రహ్మయందు ఆనందాదిగుణములు ఔపాధికములై ఉన్న వని పద్మపాదాదులు నిరూపించియే ఉన్నారు.

అదీ కాక, బ్రహ్మ నిర్గుణము నిర్దోషమూను. నిర్దోషతయే ఒకగుణము. "అపదోషతైవ విగుణస్య గుణః" అని మాఘు కవి పలుకుతున్నాడు. ఇట్లా ఏదోవిధాన వేదాంతాలలో గుణవత్పురుషనిబంధనము లేకపోలేదు. కాబట్టే అవి సర్వాతిశయితములై ఉన్నవి.

మీమాంసకులు నిరీశ్వరవాదులు. ఆయా కర్మలవలననే సకలమూ జరుగుతుందని వారంటారు. కాని ఈశ్వరుడు ఉన్నాడు అనడమును వారు అంగీకరింపరు. అయినా గుణ ధారేయ మగు ధర్మమును మీమాంసకులు ప్రతిపాదించుతున్నారు. ఆప్రతిపాదనమే గుణవత్పురుషవర్ణనపర్యవసాయిత్వమును పొందుతున్నది. జైమిని మహర్షి ప్రోక్త మయిన మీమాంసాదర్శనములో "అథాఽతో ధర్మజిజ్ఞాసా" అనేది మొదటి సూత్రము. అథ = సకలసాంగవేదాధ్యయనానంతరము, అతః = సకలవేదమూ, వివక్షిత ప్రయోజన సంపాదక మగుటవలన,ధర్మ = ధర్మముయొక్క జిజ్ఞాసా = తెలియవలెనని కోరిక కలుగుతుంది (జిజ్ఞాస చేయవలయును) అని సంక్షేపముగా సూత్రార్థము. ఇట్లా ఉపక్రమించుతూ ఉన్న సూత్రకర్త యగు జైమినిమహర్షికూడా "పురుషాశ్రితగుణ మయిన ధర్మముయొక్క జిజ్ఞాసనే" నిరూపించుతున్నాడు. కాబట్టి తద్ద్వారా మహాపురుషగుణవర్ణనమే శాస్త్రానికి ప్రాణ మని అంగీకరించిన ట్లయినది.

ఇచటి ధర్మస్వరూపనిరూపణములో మతభేదము ఉన్నది. శ్రేయస్సాధన మయిన యాగాదికమునకే ధర్మ మని పేరు. అంతేకాని ఆత్మనిష్ఠమయిన అపూర్వము ధర్మము కాదు. అపూర్వమంటె యాగాదుల అవాంతరవ్యాపారశక్తి. ఈనాడు

చేసే యాగక్రియ ఈనాడే నశించిపోతున్నది. అయినా అది కాలాంతరములో కలిగే ఫలమును సంపాదించుతున్నది. కాలాంతరము వరకూ యాగము ఉండకపోయినా అవాంతర వ్యాపారశక్తితో ఫలజనక మవుతున్నది. ఈశక్తికే అపూర్వ మని పేరు. ఇట్లాగే భాట్టాదులు అంగీకరించుతున్నారు. ఈ మతమును అనుసరించి చూడగా అపూర్వమే పురుషాశ్రితము కాని ధర్మము పురుషాశ్రితము కాదని తేలుతున్నది. అయినా అపూర్వముద్వారముగా ధర్మము పురుషాశ్రితగుణ మవుతున్న దని గ్రహించాలి. అపూర్వద్వారముగా ధర్మానికి పురుషాశ్రితగుణత్వమును చెప్పడము ఔపచారికము. ప్రాభాకరులు యాగాదివ్యతిరిక్త మగు అపూర్వమే ధర్మము అని అంటారు. తన్మతానుసారముగా అది ఆత్మనిష్ఠగుణ మగుట సంప్రతిపన్నమే. ఇది ఔపచారికము కాదు.

మీమాంసాశాస్త్ర మాయాన్యాయనిరూపణపరము కాని పురుషగుణవర్ణనపరము కాదు. అయినా మీమాంస పురుషగుణ మయిన ధర్మనిరూపణపరమే. కాబట్టి సకలశాస్త్రానికీ దానిలోనే పర్యవసానమును అంగీకరించాలి. కాకపోతే అది విఫలము కావలసి వస్తుంది. మీమాంసాప్రబంధరాశి తత్త్వ న్యాయనిరూపణపరమే అప్రగాత. అయినా మహాపురుష గుణ మగు ధర్మనిరూపణము ఉన్నది. కాబట్టే బంగారానికి పరిమళము అబ్బినట్లున్నది. అందువలన

ప్రతాపరుద్రదేవస్య గుణా నాశ్రిత్య నిర్మితః,
అలంకారప్రబన్ధోఽయం సన్తః ! కర్ణోత్సవోఽస్తు వః,

ఈ అలంకారప్రబంధము ప్రతాపరుద్రదేవుని గుణాలను ఆశ్రయించి నిర్మిత మయినది. ఓ సహృదయులారా! మీ

కిది కర్ణోత్సవము అనుగావుత. విద్వాంసులగు మీ రందరూ దీనిని పరిగ్రహించడము సముచితము. ఇగి మీకు శ్రోత్రానందమును సంపాదింపగలదు.

కాకతీయనరేంద్రస్య యశో భూషయితుం కృతా,
విద్యానాధకృతి శ్చేయం స్వయం తేన విభూష్యతే.

కాకతీయనరేంద్రుని యశస్సును భూషించడానికై ఈ కృతి రచితమయినది. స్వయముగా ఈ విద్యానాధునికృతి కూడా ఆ కాకతీయ వీరప్రతాపరుద్రునివలన విభూషిత మవుతున్నది. వర్ణ్యము ఉత్కృష్టము. ప్రబంధము ఉత్కృష్టము. దానిచే ఇది, దీనిచే అది, ఉపస్కృత మవుతుంది. వీనికి అన్యోన్యమూ ఉపస్కార్యోపస్కారక భావము ఉన్నది.

ప్రబంధమహిమవలన వర్ణ్యము అలంకృత మవుతుం దని అనడము నూతనము కాదు. కావ్యాదర్శ మనే అలంకార గ్రంథమును రచించిన ఆచార్య దండి ఈ విధముగా చెప్పి నాడు.

ఆదిరాజయశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయం,
తేషా మసన్నిధానేఽపి న స్వయం పశ్య ! నశ్యతి.

వాఙ్మయ మనే దర్పణము ఆదిరాజుల యశోబింబమును పొంది, ఆ మొదటిరాజు లయిన నల నహుషాదుల అసన్నిధానములోకూడా తాను నశించడము లేదు. చూడుడు ! వస్తువూ దర్పణమూ రెండూ అభిముఖములుగా ఉన్నపుడు బింబప్రతి బింబాలకు నాశము కలుగదు. వస్తువు సన్నిహితము కాక పోయినట్లయితే నాశము కలుగుతుంది. ఇది లోకమర్యాద. ఆయా రాజులు నశించినా వారివారి యశస్సు వాఙ్మయములో స్థిరముగా ఉంటుంది. నల నహుషాదులు లేకపో

యినా తద్యశోబింబప్రతిష్ఠ వాఙ్మయాదర్శాధీన మవుతున్నది. కాబట్టి ప్రబంధమహిమ ప్రతిపాద్యానికి ఉత్కర్షను సంపాదించుతుం దని భావము.

ప్రతిపాదింపబడేవాని మహిమచే ప్రబంధానికి మహత్త్వము సిద్ధించుటనుకూడా పెద్దలు చక్కగా నిరూపించారు. కావ్యాలంకారసంగ్రహాకర్త ప్రాచీనుడూ అయిన భామహుడు ఈ విధముగా అంటున్నాడు

"ఉపశ్లోక్యస్య మాహాత్మ్యా దుజ్జ్వలాః కావ్యసంపదః"

కావ్యములో ఉపశ్లోకింపబడు, అనగా కీర్తింపబడువాని మాహాత్మ్యమువలన కావ్యసంపదలు ఉజ్జ్వలములు అవుతవి అని. ఉద్భటుడుకూడా ఇదే అర్థమును ప్రతిపాదించుతున్నాడు. ఉద్భటుడు భామహగ్రంథానికి వ్యాఖ్యాత. కావ్యాలంకారసారసంగ్రహ మనే సాహిత్యగ్రంథానికి కర్త.

గుణాలంకారచారుత్వయుక్త మ ప్యధికోజ్జ్వలం,
కావ్య మాశ్రయసంపత్త్యా మేరుణేవామరద్రుమః.

గుణ చారుత్వాలంకార సౌందర్యములతో కూడుకొన్నప్పటికీ, మేరువుచే కల్పవృక్షముమాదిరిగా ఆశ్రయసంపదచే కావ్యము అధికోజ్జ్వల మవుతుంది. కేవల గుణాలంకార చారుత్వ నిబంధనమువలన కావ్యము ఉజ్వలము కాదు. తగిన ప్రతిపాద్యుని వర్ణనము ఉన్నప్పుడే కావ్యము సుందరము కాగలుగుతుంది. కల్పవృక్షము కేవల కుసుమాలు ఫలాలూ ఉన్నంతమాత్రాన మనోహరము కాదు. అది మేరువును ఆశ్రయించి ఉంటేనే మనోహరము. కాబట్టి ఆశ్రయసంపన్నిబంధనము ఆవశ్యకము.



రుద్రభట్టుకూడా ఇట్లాగే చెప్పాడు. ఆతడు శృంగారతిలక మనే గ్రంథానికి రచయిత. "ప్రబంధానికి కలిగే ప్రతిష్ఠ ఉదారునిచరితమును ఆధారము చేసికొని ఉంటుంది" అని ఆతనిభావము. ఉదాత్తునిచరితనిబంధనము లేకపోతే ప్రబంధానికి ప్రతిష్ఠ కలుగదు. సాహిత్యమీమాంసాగ్రంథములో కూడా ఈవిషయము ప్రపంచిత మయినది. రాజానకరుయ్యకుడు సాహిత్యమీమాంసాకర్త. "రామాదినాయకుల శౌర్యాదిగుణగ్రథనము పొందిన సుకృతుల సూక్తులు కల్పాంతమువఱకూ శోభావంతములై ఉండగలవు. నాయకమణిసూత్రాన గుంభితము లయిన యోగ్యసూలాకారుల మాలికలు చిరకాలము ఉండేవి అవుతవి" అని తద్భావము.

భోజరాజు సరస్వతీకంఠాభరణ శృంగారప్రకాశాది కర్త. ఉదాత్తచరితుడు. ఆతడుకూడా ఇట్లే నిరూపించినాడు.

> కవే రల్పాపి వాగ్వృత్తిః విద్వత్కర్ణావతంసతి,
> నాయకో యది వర్ణ్యేత లోకోత్తరగుణోత్తరః.

కవివాగ్వ్యాపారము అల్పమయినా లోకోత్తరగుణోత్తరుడయిన నాయకుడు వర్ణింపబడినట్లయితే విద్వాంసులకు కర్ణావతంసము అవుతుంది. లోకాతిశయితగుణాలు కలిగి ఉండడముచేత ఉదాత్తు డయిన నాయకునివర్ణనము ఉంటేనే విద్వాంసులు ఆదరించుతారు. అప్పుడు కవిరచనాప్రపంచములో చతురత లేకపోవడమునుకూడా వారు పరిశీలించరు. ఇట్లా అన్నందువలన అచతురవచనరచనను కవి స్వీకరించవచ్చు నని తలంచరాదు. ఇది కేవలమూ అర్థవాదము. నాయకుడు అవశ్యముగా వర్ణింపబడవలసినదే, అని దీని భావము.

## నాయకగుణములు

కావ్యములో లోకోత్తరగుణోత్తర నాయకుని అవశ్యము వర్ణించాలి. ఆ నాయకగుణాలు ఈవిధముగా ఉన్నవి.

మహాకులీన తౌజ్జ్వల్యం మహాభాగ్య ముదారతా,
తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయో గుణాః,

మహాకులీనత్వము, ఉజ్జ్వలత, మహాభాగ్యము, ఔదార్యము, తేజస్విత్వము, వైదగ్ధ్యము, ధార్మికత్వము మొదలయినవి నాయకగుణములు. పూర్వతనుల శాస్త్రానుసారముగా ఈ కొన్ని గుణాలు మాత్రము ఇట్లా నిర్దిష్టములయినవి. ప్రతాపరుద్ర దేవుని గుణములు వాచామగోచరములు కదా! వీని ఉద్దేశక్రమానుసారముగా ఇక స్వరూపోదాహరణములను ప్రదర్శింతుము.

### ౧ మహాకులీనత

మహాకులీనతా నామ కులే మహతి సంభవః,

వంశగౌరవము కలిగిన గొప్పకులములో జన్మించుట మహాకులీనత అనబడును. ఉదాహరణము

తాదృఙ్మర్త్యమహీలోకభాగ్యవిభవా దింద్రాదిబృందారకైః
క్షోణ్యాం క్రీడితు మిచ్ఛుభి శ్చిరతరం సంప్రార్థితః పద్మభూః,
అత్యర్కేందుకులప్రశస్తి మసృజ ద్యం కాకతీయాన్వయం
తస్మిం స్సంప్రతి వీరరుద్రవపుషా జాగర్తి లక్ష్మీపతిః,

భూలోకభాగ్యవిభవము ధన్యము. ఇంద్రాది దేవతలు భూమిపై విహరింప దలచి చాలాకాలము బ్రహ్మదేవుని సంప్రార్థనము చేసినారు. ఆ ప్రార్థనావశంవదు డయిన బ్రహ్మ కాకతీయాన్వయమును సృజించినాడు. ఆ కాకతీయవంశము సూర్య

చంద్ర వంశప్రశస్తిని అతిక్రమించి ఉన్నది అట్టి వంశములో ఇప్పుడు శ్రీలక్ష్మీపతి వీరరుద్రరూపాన ఉన్నాడు. భూలోకము సర్వాతిశాయి వైభవము కలిగి ఉన్న దనీ, కాకతీయ నరేంద్రులు దేవేంద్రాది సదృశు లనీ, దీనిలో గోచర మవుతున్నది. చంద్రసూర్యవంశాధిక మయిన కాకతీయ వంశములో వీరరుద్రుడు జన్మించినట్లు దీనిలో ప్రతిపాదింపబడినందువలన మహాత్కులప్రసూతి ఉన్నది. కాబట్టి ప్రతాపరుద్రునిలో మహాకులీనత ఉన్నదని భావము.

౨ ఔజ్జ్వల్యము

రూపసంపన్నదేహత్వ మౌజ్జ్వల్యం పరికీర్త్యతే.

రూపసంపద కల దేహ ముండుట ఔజ్జ్వల్య మని కీర్తింపబడుచున్నది. భూషణములు లేకపోయినా భూషితమువలె ఉండే ఆకారవిశేషానికి రూపమని వ్యవహారము. భూషణములు నాలుగు విధాలు. ఆవేధ్యములు, ఆరోప్యములు, నిక్షేప్యములు, బంధనీయములూ అని. కుండలములు ఆవేధ్యములు. హారములు ఆరోప్యములు. నూపురములు నిక్షేప్యములు, అంగదాదులు బంధనీయములు, అని గ్రహించాలి.

ఉదా:-

మురారే ర్యః పూర్వం జలనిధిసుతాయా ముదభవ
న్మహాదేవా జ్జాతః స పున రవనీభృద్దుహితరి,
వపుష్మాన్ కామోఽయం జయతి జగతీభాగ్యవిభవైః
ప్రతాప శ్రీరుద్రః స్వయమితి మనీషా మృగదృశాం.

జలనిధిసుత అయిన శ్రీలక్ష్మియందు మురారి అయిన శ్రీవిష్ణువువలన పూర్వము ఉత్పన్న మయినవాడే ప్రకృతము రాజకుమారికయందు మహాదేవు డను పేరు గల

మహారాజువలన జన్మించినాడు. మహాదేవుడు శివుడు. ఆవనీ భృద్దుహిత పార్వతి. పార్వతీదేవియందు శివునివలన పుట్టిన వాడు అని వ్యంగ్యముగా భాసించుతున్న అర్థము. ఈ దేహ ధారి అయిన మన్మథుడు భూమీభాగ్యవిభవములచే స్వయముగా ప్రతాపశ్రీరుద్రుడై సర్వోత్కర్షగా ఉన్నాడని మృగనయనల అభిప్రాయము. పూర్వపు మన్మథుడే ఇపుడు ప్రతాపరుద్రుడయినాడని దీనిలో ఉత్ప్రేక్షితము. మన్మథుడు రూపసంపద కలవాడు. అతడే ఈతిడగుటవలన ప్రతాపరుద్రుడు కూడా రూపసంపన్న దేహుడు. ఈవిధముగా ఔజ్జ్వల్యసమన్వయమును గ్రహించాలి.

3 మహాభాగ్యము

విశ్వంభరాధిపత్యం యత్ త న్మహాభాగ్య ముచ్యతే.

సార్వభౌమత్వము ఉంపుట మహాభాగ్య మనబడును.

ఉదా:—

సేవానమ్ర నరేంద్ర మౌళివిలస ద్రత్నాంశు నీరాజితం
రాజ్యశ్రీ ప్రథమావతారపదవీ మారుహ్య సింహాసనం,
క్షోణీం రక్షతి విక్రమై రనుపమైః ప్రత్యర్థిపృథ్వీపతి
శ్లాఘాలంఘన జాంఘికై ర్గుణనిధిః శ్రీవీరరుద్రోనృపః.

గుణనిధి అయిన వీరరుద్రభూపతి సింహాసనమును అధిష్ఠించి అనుపమవిక్రమములచే భూమిని రక్షించుచున్నాడు. ఆసింహాసనము ప్రతాపరుద్రుని సేవలో వినమ్రులయిన రాజులశిరోభాగాల విలసించుచున్న రత్నకిరణాలచే నీరాజిత మవుతున్నది. రాజ్యలక్ష్మి ప్రథమముగా అవతరించడానికి మార్గమై ఉన్నది. సింహాసనము రాజ్యలక్ష్మి ప్రథమచిహ్నము కదా! ప్రతాపరుద్రునిపరాక్రమము శత్రురాజుల శ్లాఘా

ల్లంఘనము చేయడములో జాంఘికము, జాంఘికము అంటే పిక్క బలము కలది అని అర్థము. ఉల్లంఘించేవారలకు పిక్క బలము కావాలి. ఇక్కడ ఆపదమువలన శీఘ్రగామి అనే అర్థాన్ని గ్రహించాలి. వీరరుద్రునివిక్రమసన్నిధానములో ఇతరులశ్లాఘలు లెక్కకు రావని భావము. ఈపద్యములో వీరరుద్రునకు శిష్టపరిపాలనము దుష్టనిగ్రహముల ద్వారా నిఖిలక్షోణీరక్షణము కల దని చెప్పబడినది. కాబట్టి మహాభాగ్యము.

## ౪. ఔదార్యము

య ద్విశ్రాణనతాచ్ఛీల్యం ఔదార్యం త న్నిగద్యతే,

దాన మిచ్చునట్టి స్వభావము కలిగి ఉండుట ఔదార్య మగును. ఉదారుడు దాత అతనిధర్మము ఔదార్యము.

ఉదా:—

వదాన్యో నాన్యోఽస్తి త్రిజగతి సమో రుద్రనృపతేః
గుణశ్రేణీశ్లాఘా పిహిత హరిదీశాన యశసః,
సమంతా దుద్భూతై ర్ద్విరదమదగంధై స్సురభయః
క్రియంతే యద్విద్వజ్జన మణిగృహ ప్రాంగణభువః.

మూడు లోకాలలోనూ రుద్రనృపతితో సమానుడయిన వదాన్యుడు లేడు. అతడు దిక్పాలకుల యశస్సును తన గుణగణోత్కర్షచేత తిరస్కరించినాడు. మణిగృహాలను విద్వజ్జనులకు ఆవాసభూములనుగా చేసినాడు. ఆవిద్వాంసులకు మదమత్తమతంగజాలను దానము చేసినాడు. అంతటా అతిశయించిన ఆ ద్విరదమదగంధములచేత మణిమయభవనప్రాంగణ భూములు సురభితము లవుతున్నవి. ఈపద్యములో సమృద్ధ వస్తువర్ణనము ఉన్నందువలన ఉదాత్తాలంకారము. ప్రతాప

రుద్రుని దానవైభవము దీనిలో వర్ణిత మయినది. కాబట్టి ఉదారతను సమన్వయించుకొనవచ్చును.

౫. తేజస్వితా

జగత్ప్రకాశకత్వం యత్ తేజస్విత్వం త దుచ్యతే.

జగమునంతనూ ప్రకాశింపచేయుట తేజస్విత్వ మగును. తేజము—పరాక్రమము. తేజము కలవాడు తేజస్వి. వానిధర్మము తేజస్విత. ఉదా:—

సదా తేజోభానౌ స్ఫురతి జయినః కాకతివిభో
రరిక్ష్మాభృత్కాంతాచికురతిమిరాహంకృతిముషి,
ప్రకాశవ్యుత్పత్తి ర్భవతి జరదుద్దామతమసా
మసూర్యంపశ్యానా మవధిగిరిపాశ్చాత్యదృషదాం,

జయశీలుడూ కాకతిదేవతోపాసకుడూ అయిన కాకతి విభుని ప్రతాపభానుడు పగ లనకా రాత్రి అనకా నిత్యమూ ప్రకాశించుచుతూ ఉండగా, ఎన్నడూ సూర్యుని చూడని అవధి గిరికిపటమటివైపున ఉన్న పాషాణములకు కూడా ప్రకాశ జ్ఞానము కలుగుతున్నది. అక్కడ ఇదివరలో అంధకారము అతిశయించి ఉన్నది. ఎన్నడూ ప్రకాశము లేనందువలన అచటి తమస్సు ఘనీభూతమై ఉన్నది. ఇప్పుడీ ప్రతాపభాను ప్రసారమువలన ఆచీకటి అంతా చిన్నభిన్న మయినది. కాకతి రుద్రుని తేజోభానుడు శత్రురాజకాంతల చికురతిమిరాహంకార మును హరించు నని విశేషణార్థము. శత్రుభూపతులు భీకరవీర సంగ్రామములలో ప్రతాపరుద్రునిచే హతు లయినారు. తత్కాంతలకు ప్రియవియోగము కలిగినది. కాగా వారలకు కేశసంస్కారము లేదు. చికురములు వెలవెలబారినవి. వాని గర్వము నిర్వాపిత మయిన దని భావము. దీనిలో ప్రతాప

రుద్రుని ప్రతాపసూర్యుడు అతివేలప్రకాశము కలుగజేయు వాడు కావడమువలన లోకోత్తర మగు తేజస్వితను భావించాలి.

## ౬. వైదగ్ధ్యము

కృత్యవస్తుషు చాతుర్యం వైదగ్ధ్యం పరికీర్త్యతే.

కర్తవ్యార్థములలోని ప్రయోగకౌశలము వైదగ్ధ్య మగును. విదగ్ధుడు — చతురుడు. అఘటమానములను ఘటించువాడు. వానిధర్మము వైదగ్ధ్యము. చేయదగిన కార్యములలోని చతురత్వమే వైదగ్ధ్యము. ఉదా:—

చాతుర్యం కిము వర్ణ్యతే గుణనిధేః శ్రీవీరరుద్రప్రభోః?
యత్రాన్యోన్యవిరుద్ధయో రపి మహద్వాణీశ్రియో రార్జవం,
కించాభ్యాం సదృశోపచారలలితాం తత్తాదృశై రుత్సవైః
నిస్సాపత్న్య మిమాం భువం స నృపతి ర్ధత్తే దిశాం జిత్వరః.

గుణనిధి అయిన శ్రీవీరరుద్రప్రభువుచాతుర్యము వర్ణించడానికి శక్యము కాదు. పరస్పరవిరుద్ధస్వభావములు కలిగిన లక్ష్మీసరస్వతులను ప్రతాపరుద్రుడు సముపార్జనముచేసినాడు. ఇంకా సర్వదిశాజయనస్వభావము కలిగిన ఈనృపతి ఈలక్ష్మీసరస్వతులతో సమానముగా ఆయా స్వభావసముచితములయిన సత్కారవిశేషాలవలన సంతసించిన భూమినికూడా ధరించుతున్నాడు. వాణీలక్ష్మీభూములలో ఏమాత్రమూ సవతిపోరు లేకుండునట్లుగా ఆయా విశేషాలతో కూడుకొనిన ఉత్సవములను ఆచరించుతున్నాడు. పరస్పరవిరుద్ధస్వభావము కలిగిన వీరలకు అన్యోన్యానురాగమును కలుగజేసే చాతుర్యము వీరరుద్రునకు ఉన్నది. కాబట్టి వైదగ్ధ్యమును ఊహించాలి,

## ౭. ధార్మికత్వము

దర్మైకాయత్తచిత్తత్వం ధార్మికత్వ ముదీర్యతే.

ముఖ్యముగా ధర్మములోనే ఆయత్త మయిన చిత్తము కలిగిఉండుట ధార్మికత్వ మగును. ధర్మమును ఆచరించే వాడు ధార్మికుడు. ఆతనిభావము ధార్మికత్వము. ఉదా:—

పరిహాసేఽప్యనౌచిత్యం స్వప్నేఽప్యన్యవధూకథాం,
శత్రావప్యగుణారోపం కాకతీంద్రో న మృష్యతి.

కాకతీంద్రుడు పరిహాసములో నయినా అనౌచిత్యమును సహించడు. స్వప్నములోనయినా పరవధూకథను సహింపజాలడు. శత్రువుపై అయినా దోషారోపమును మన్నించలేడు. పరిహాసాదులలో కూడా అనౌచిత్యాదికమును సహింపని కాకతివీరప్రతాపరుద్రుని ధార్మికత్వము ప్రశంసనీయము. ఈ చెప్పినవి నాయకగుణములు.

ఇప్పటికి మొదటగా ఉద్దిష్టము లయిన గుణములను నిరూపించడ మయినది. అక్కడ "ధార్మికత్వాదయో గుణాః" అని ఉన్నది. అందులోని 'ఆది' పదమువలన మహామహిమత్వము పాండిత్యము మొదలయినవానిని గ్రహించాలి.

## ౮. మహామహిమత్వము

తన్మహామహిమత్వం స్యాద్యా పున ర్దేవతాత్మతా,

దేవతాత్మత కలిగి ఉండుటను మహామహిమత్వమునుగా గ్రహించాలి. గొప్పసామర్థ్యము కలవాడు మహామహిముడు. ఆతనిధర్మము మహామహిమత్వము. ఉదా:—

కౌసల్యాఽస్త్వవిధమజననీ దేవకీ చ ద్వితీయా
విష్ణో ర్మాతా తదను మహితా ముమ్మడంబా తృతీయా,

య స్త్రేతాయాం రఘుపతి రభూ ద్ద్వాపరే శౌరి రాసీత్
త్రాతుం క్షోణీం స జయతి కలౌ వీరరుద్రావతారః.

శ్రీవిష్ణువునకు కౌసల్యాదేవి ప్రథమ జనని అయినది. పిమ్మట దేవకీదేవి రెండవ తల్లి అయినది. తరువాత కాని యాంబ దగిన ముప్పడంబాదేవి మూడవ మాత అయినది. ఏవిష్ణుదేవుడు త్రేతాయుగములో రఘుపతి అయినాడో ద్వాపరయుగములో శ్రీకృష్ణు డయినాడో ఆతడే కలియుగములో భూమిని రక్షించడానికి వీరరుద్రావతారుడై సర్వోత్కర్షగా ఉన్నాడు. దీనిలో ప్రతాపరుద్రుడు విష్ణ్వవతారమగుటవలన దేవతాత్మత ఉన్నది. అందువలన మహామహిమత్వలక్షణము సమన్వితమవుతున్నది.

## ౯. పాండిత్యము

సర్వవిద్యాధికత్వం యత్ పాండిత్యం త దుదాహృతం.

సర్వవిద్యలలో ఆధిక్యము కలిగిఉండుట పాండిత్య మని అనబడుతున్నది. వేదశాస్త్రాదిజన్యజ్ఞానమునకు 'పండా' అని పేరు. పండాకలవాడు పండితుడు. పండితుని ధర్మము పాండిత్యము. ఆత్మసాక్షాత్కారము కలవాడు పండితుడని వేదాంతమర్యాద. అది ఇక్కడ గ్రహింపబడదు. వేదాంతపండితుడు ప్రపంచవిముఖుడు. ఉదా:—

గోష్ఠీభిః పరితోషయ న్బుధగణా న్షడ్దర్శనీసీమభిః
సత్కావ్యతమార్గదర్శనపరైః సూక్తైః కవీ న్ప్రీణయన్,
సంగీతోపనిషద్రహస్యపిశునై రాతోద్యయోగ్యక్రమైః
ధన్వా న్సంపది వైణికా న్విహరతే శ్రీకాకతీంద్రో నృపః.

శ్రీకాకతీంద్రప్రభువుమహాసభలో పండితులు కవులు వైణికులూ మొదలయినవా రనేకు లున్నారు. వారల నంద

రినీ ప్రతాపరుద్రుడు స్వయముగా ఆయా విద్యావిశేషములచే సంతసింపచేస్తున్నాడు. న్యాయము, వైశేషికము - సాంఖ్యము యోగము - పూర్వమీమాంస ఉత్తరమీమాంస అనేవి షడ్దర్శనాలు. ఈ ఆరుదర్శనాలనూ విషయముగా చేసి కొంటున్న శాస్త్రవ్యాసంగాలచేత పండితమండలిని ప్రతాపరుద్రుడు సంతోషపెట్టుతాడు. సత్సారస్వతమార్గమును ప్రదర్శించడములో సమర్థము లయిన సూక్తములచే కవులను సంతసింపచేస్తాడు. సంగీతోపనిషద్రహస్యములను సూచించునటువంటి చతుర్విధవాద్యోచితపరిపాటీవిధానములచే వైణికులను ప్రీణింపచేస్తాడు. ఇట్లా శ్రీ వీరరుద్రుడు తన సభలో విహరించుతున్నాడు. దీనిలో వీరరుద్రునకు సర్వవిద్యాధిక్యము వర్ణింపబడినందువలన పాండిత్య మున్నది. "ధార్మికత్వాదయో గుణాః" అనేచోట 'ఆది' పదముచేత మహామహిమత్వము పాండిత్యము మొదలయిన వానిని గ్రహించాలని నిర్దిష్టము. అక్కడకూడా మొదలయినవి అని ఉండడమువలన దశరూపకాదిగ్రంథాలలో ప్రతిపాదింపబడిన గుణాలనుకూడా పరిగ్రహించాలి. వినీతత్వము, మధురత్వము త్యాగము, దక్షత, ప్రియంవదత, రక్తలోకత, శౌచము, వాగ్మిత, రూఢవంశత, స్థిరత, యువత్వము, బుద్ధ్యుత్సాహ స్మృతి ప్రజ్ఞా కలా మాన యుతత్వము, శౌర్యము, దార్ఢ్యము, తేజస్విత, శాస్త్రదృష్టి, ధార్మికత, అనేవి దశరూపకోక్తములు. వీనివీని స్వరూపాదికమును ఇతరస్థలాన చూడాలి. ఈచెప్పినవి స్త్రీలలోనూ పురుషులలోనూ ఉండవచ్చును. ఎవరెవరిలో ఏయేగుణాలకు అవకాశము ఉంటుందో యథాసంభవముగా గ్రహించాలి. శోభ, విలాసము, మాధుర్యము, గాంభీర్యము,

ధైర్యము, స్థైర్యము, తేజస్విత, లాలిత్యము, ఔదార్యము, అనే ఈగుణాలు కేవలమూ పురుషమాత్రనియతములు. అని ఇతరగ్రంథాలలో ఉన్నవి, వీనిలో కొన్ని అయినా స్త్రీలలో ఉండకపోవు అని ఊహ కలుగుతున్నది. విస్తరభీతివలన ఆ యావిశేషాలను ఇక్కడ ఉపపాదించలేను.

## నాయక స్వరూపనిరూపణము

ఇట్లా నాయగుణాలు నిరూపితము లయినవి. ఇక నాయక స్వరూపము.

> యశఃప్రతాపసుభగో ధర్మకామార్థతత్పరః,
> ధురంధరో గుణాఢ్యశ్చ నాయకః పరికీర్తితః,

యశఃప్రతాపములచే మనోహరుడు, ధర్మకామార్థతత్పరుడు, గుణాఢ్యుడూ అగువాడు నాయకు డని చెప్పబడు చున్నాడు. యోగ్యమయిన ప్రఖ్యాతికి యశస్సు అని పేరు. ద్రవ్యకోశసంపాదనమున యోగ్యదండధారణమువలనా కలిగే తేజస్సునకు ప్రఖ్యాతి అని పేరు. గుణములు సాధారణములు అసాధారణములూ అని రెండు రకాలు. పూర్వము చెప్పిన మహాకులీనత్వాదులు సాధారణగుణాలు. శోభావిలాసాది పౌరుషగుణములు అసాధారణాలు. ఈ సాధారణాసాధారణగుణాలతో పరిపూర్ణు డయినవాడు గుణాఢ్యు డనబడును. ఈగుణాఢ్యత్వమే నాయక సామాన్యలక్షణము. "నయతి ప్రాప్నోతీతి నాయకః" అని నాయకపదవ్యుత్పత్తి. ప్రబంధములో తనవృత్తమును వ్యాపింపచేయువాడు అని భావము. ప్రబంధమునంతనూ వ్యాపించి ఉండేవాడు నాయకుడు అని తాత్పర్యము. ఇంకా ప్రబంధములోని ఫలానికి నాయకుడు

అధికారి. ప్రధానఫలస్వామ్యమునాయకునకె ఉంటుంది. కాగా గుణాఢ్యత్వము ప్రబంధవ్యాపిత్వము ఫలస్వామిత్వమూ కల వాడు నాయకుడు అని పర్యవసితార్థము. "గుణాఢ్యశ్చ" అనే స్థలానఉన్న 'చ' కారమువలన ఈఅర్థమును గ్రహించవచ్చును. నాయకుడు ఉత్తముడు మధ్యముడు అధముడూ అని మూడు విధాలు. ఈచెప్పిన సకలగుణసంపన్నుడూ, ప్రబంధవ్యాపి ఫలశిరస్కవ్యాపారుడూ అగువాడు ఉత్తమనాయకుడు. కొన్ని గుణాలు లేకపోతే మధ్యమనాయకుడు. బహుగుణహీనుడు అధమనాయకుడు.

నాయకగుణాలుచెప్పేకారికలో యశఃప్రతాపసుభగత్వము ధర్మకామార్థతత్పరత్వము ధురంధరత్వము అనేవి గుణాఢ్యపదముచేత సంగృహీతము లవుతూనే ఉన్నవి. అయినా మళ్లా వేరుగా చెప్పడము వ్యర్థమే అని తోచవచ్చును కాని ఉత్తమ మధ్యమాధమ నాయకు లందరిలోనూ ఈచెప్పిన గుణాలు అవశ్యముగా ఉండా లని పునరుపాదానతాత్పర్యము. ఈ యశఃప్రతాపసుభగత్వాదులు ఉన్నట్లయితే నాయకత్వానికి హాని లేదు. గుణాఢ్యపదమువలన సామాన్యగుణాలు ఉండి తీరా లని నిర్దిష్ట మవుతున్నది. అందులోనూ ఈ చెప్పిన యశః ప్రతాపసుభగత్వాది విశేషగుణాలు అవశ్యముగా ఉండాలి అని బోధించడానికై పైకారిక అంతా ఆవశ్యక మవుతున్నది.

నాయకుడు యశఃప్రతాపసుభగు డగుటకు ఉదా:—

ధర్మాలంబనసముచ్ఛ్రితాం త్రిభువన ప్రఖ్యాతపత్రశ్రియం
ధత్తే కాకతివీరరుద్రనృపతేః స్ఫారం యశోమండలం,
ధామైవాస్య నభస్స్థలీ త్రిభువనవ్యామేయ మాలోక్యతే
తన్మన్యే నియతం ప్రతాపతపన స్తస్యోపరి ద్యోతతే.

కాకతివీరరుద్రుని సమతిశయితమయిన యశోమండలము ధర్మాలంబనమువలన చక్కగా పైకి ఎత్తబడిన స్వర్గమర్త్య పాతాళలోకముల ఏకాతపత్రశోభను ధరించుతున్నది. నల్ల కలువలవలె నల్లగా ఉన్న ఈ నభస్థలము ఆ ఆతపత్రచ్ఛాయ మాదిరిగా కన్పడుతున్నది. కాబట్టి ఈ ఆతపత్రమువిూద ప్రతాపతపనుడు ప్రకాశించుతున్నా డని నేను నిశ్చయముగా తలుస్తున్నాను. ప్రతాపరుద్రునికీర్తి త్రిభువనాలనూ ఉల్లంఘించి ఉన్నది. అటుపైనకూడా ప్రతాపము ప్రకాశించుతున్నది. సూర్యాదులు ఛత్రాధఃఖచిత మణిగణాలవలె ఉన్నారు. ఈతని కీర్తి ప్రతాపములు చంద్ర సూర్యాధికములు. అని వ్యంగ్యము, సమన్వయము సులభము.

ధర్మకామార్థతత్పరత్వమునకు ఉదా:—

ధర్మోర్థ ఇవ పూర్ణశ్రీ రర్థో ధర్మ ఇవ స్థితః
కామ స్తా వివ తౌ కామ ఇవ రుద్రనరేశ్వరే.

రుద్రనరేశ్వరునియందు ధర్మము అర్థమువలె పూర్ణ శ్రీకమై ఉన్నది. అర్థము ధర్మమువలె పూర్ణశోభతో ఉన్నది. కామము ధర్మార్థములవలె ఉన్నది. ధర్మార్థములు కామమువలె ఉన్నవి. దీనిలో ధర్మార్థకామములు మూడూ పరస్పరమూ సదృశములై ఉన్నవి. వానిలో ఏమాత్రమూ తారతమ్యము లేదు. అని గోచర మవుతున్నది. ప్రతాపరుద్రుడు మూడింటిలోనూ సమభావము కలిగి ఉన్నా డని భావము.

ధురంధరత్వమునకు ఉదా:—

గాయంతీ రనుమోదతే నిజవధూ శ్శేషః శిరఃకంపనైః
లక్ష్మీం ప్రీణయతేద్య ఽకచ్ఛపపతి ర్వక్షఃస్థలీదర్శనాత్,

దిఙ్నాగాశ్చ కరేణుకాశ్చ సమపాకుర్వం త్యనుప్రవ్రజ్యయా
దోష్ణా కాకతివీరరుద్రనృపతౌ విశ్వంభరాం బిభ్రతి.

వీరరుద్రనృపతి బాహువుచే విశ్వంభరను రక్షించువాడు కాగా ఆదిశేషునకు, ఆదికూర్మమునకూ, దిగ్గజాలకూ భూభరణభారము తగ్గినది. శేషుడు గానముచేస్తూ ఉన్నతన భార్యలను శిరఃకంపనాలతో అభినందించుచున్నాడు. శేషాంగనలు తమ భర్తృ భారావతరణ సంతోషభరాన వీరరుద్రుని కీర్తిని గానించుచున్నారు. శేషుడు ఇదివరలో శిరస్సుపై భారము ఉండడమువలన కంపనము చేయడానికి వీలు కలుగలేదు. ఇప్పుడా భారము లేదు. కచ్ఛపపతి (ఆదికూర్మము) ఆలింగనానికై వక్షఃస్థలీదర్శనమున లక్ష్మీదేవిని ప్రీణింపచేస్తున్నాడు. ఇదివరలో భారాతిశయమువలన ఉరమును చూపడానికి అవకాశము లేదు. లక్ష్మికూడా ఆలింగన విధురగా ఉండేది. దిగ్గజాలు అనుప్రవజనముతో తమ కరేణుకా దుఃఖమును పోగొట్టుతున్నవి. ఇదివరలో నిత్యమూ భూభరణవ్యగ్రములై ఉండడమువలన రమణానికై వెళ్ళడానికి అవకాశము లేదు. ఇప్పుడు రతిమనస్కములై విప్రలంభవ్యథాఖిన్నత కలిగిన ఆడఏనుగులను అనుసరించుచున్నవి. శేషాదులు భూమిని వహించుతారు. కచ్ఛపపతి శేషాదులను వహించుతాడు. శేషాదిభరణీయ విశ్వంభరను వీరరుద్రుడు భుజాన భరించుచున్నాడువలన ధురంధరత్వమును ఊహించాలి.

గుణాఢ్యత్వమునకు ఉదా:—

ముఖై స్సహస్రేణ ఫణీ వదేచ్చేత్ కరై స్సహస్రేణ లిఖే ద్వివస్వాన్,
నేత్రై స్సహస్రేణ హరిశ్చ పశ్యేత్ స్థానే గుణా న్కాకతివీరభర్తుః.

శాకటిపీరప్రభృతులగుణాలను ఆదిశేషుడు ముఖసహస్రాన పలికేటట్లయితే, సూర్యుడు కరసహస్రముతో లిఖించేటట్ల యితే, దేవేంద్రుడు నేత్రసహస్రముతో చూచేటట్లయితే, సమంజసముగా ఉంటుంది. ఒకడు పలుకుట, వేరొకడు వ్రాయుట, ఇంకొకడు చూచుట, అనే సరసత దీనిలో ఉన్నది. శేషాదులే ఆయాకర్మలలో సమర్థులు. వీరరుద్రుని గుణాలు అసంఖ్యేయముగా ఉన్నవికదా! సమన్వయము స్పష్టము.

## నాయకవిశేషములు

ధీరోదాత్తాది నాయకులు నలుగురు. వీరు సర్వరససాధారణులు. వీరే శృంగారాశ్రయముగా ఉన్నప్పుడు అనుకూలాదిభేదమున నాలుగు నాలుగు భేదములు కలవారవుతారు. కాగా షోడశభేదములు సిద్ధించును. వీరికి ఉత్తమ మధ్యమాధమ భేదము ఉన్నది. అప్పుడు ౪౮ భేదాలు. ఇంకా ఈ విషయములో భేదప్రభేదాలను ఇతరగ్రంథాలలో గ్రహించాలి.

> ఉదాత్త ఉద్ధతశ్చైవ లలిత శ్శాన్త ఇత్యపి,
> ధీరపూర్వా ఇమే పూర్వైః శ్చత్వారో నాయకాః స్మృతాః ,

ధీరశబ్దము పూర్వమందున్న ఉదాత్తోద్ధత లలిత శాంతులనే నాయకులు నలుగురు అని పూర్వులు స్మరించుచున్నారు. కాగా ధీరోదాత్తుడు ధీరోద్ధతుడు ధీరలలితుడు ధీరశాంతుడూ అని నాయకులు నలుగురు. అని భావము. వీరు నలుగురూ సర్వరససాధారణులు.

ఈ నాయకులలోని ఉదాత్తత్వము ఉద్ధతత్వము లలితత్వము శాంతత్వమూ అనేవి జాతివాచకాలు కావు. ఒకేగోవులో ఉండే వత్సత్వ వృషభత్వ మహోక్షత్వాల మాదిరిగా

అవస్థా వాచకములె. మహావీరచరితాదిగ్రంథాలలో భవభూతి మొదలయిన మహాకవులు ఒకేనాయకునకు ఈ నాలుగు భేదాలనూ నిరూపించారు. ఉదాత్తత్వాదులు జాతివాచకములె అయితే ఆవిధముగా భేదచతుష్టయమును చెప్పడము అసంగత మవుతుంది. జాతి అనపాయి. అది ఒకప్పుడు ఉండి వేరొకప్పుడు పోయేది కాదు. గోవులోని గోత్వము జాతి. అది గోవ్యక్తి ఉన్నంతవరకూ గోవులో ఉంటుంది. మరణాంతమూ ఉంటుం దన్నమాట. మధ్యలో మారదు. అట్లాగే ఉదాత్తత్వాదులూనూ కావాలి కదా! ఒక ప్రబంధములో ఒకనికి మొదట ఉదాత్తత్వమును చెప్పేటట్లయితే ఆ ప్రబంధాంతమూ ఆతనికి ఉదాత్తత్వమునే చెప్పాలి. కాని అట్లా లేదు. పరశురాముడు ఉదాత్తుడుగా ఉద్ధతుడుగా శాంతుడుగా కూడా నిరూపితు డయినాడు. అది అసంగతమే కావలసివస్తుంది. కాబట్టి అవి వత్సత్వాదులవలె అవస్థా వాచకములని గ్రహించాలి. ఈవిషయము దశరూపకములో నిరూపిత మయింది. ఇది తగిన ప్రసంగము కాబట్టి ఇక్కడ కూడా అనూదితము. ఈ ధీరోదాత్తాదుల స్వరూపోదాహరణము లను ఈవిధముగా గ్రహించాలి.

## ధీరోదాత్తుడు

మహాసత్త్వోఽతిగంభీరః కృపావా నవికత్థనః
ప్రతాపరుద్రవ ద్ధీరో ధీరోదాత్త స్స సమ్మతః.

మహాసత్త్వుడు అతిగంభీరుడు దయాసహితుడు ఆత్మశ్లాఘాపరత్వము లేనివాడూ ప్రతాపరుద్రునివలె ధీరు డయినవాడూ ధీరోదాత్తు డగును. క్రోధాదులు ఎంతగా కలిగినా అంతఃకరణము అవశము కాకుండా ఉండడమును మహాసత్త్వత

అంటారు. మహాసత్త్వుడే ధీరుడని కొందరిభావము. ఇక్కడ ధీరమహాసత్త్వపదాలకు పునరుక్తి లేకుండా ఉండడానికై ధీరుడంటే తన ప్రయత్నమునుండి చలింపనివాడు స్థిరుడు శాస్త్రిక చక్షువు అనే అర్థాన్ని గ్రహించాలి. ఎంతగా చిత్తవికారము కలుగుతున్నప్పటికి నిభాళించుకొని సావష్టంభముగా ఉండే వాడు గంభీరుడు. ఇతరులదుఃఖాలను పోగొట్టాలని తలచే వాడు దయాసహితుడు. ఇతరపదార్థాలు స్పష్టమే. సర్వోత్కర్షగా ఉండడము ఔదాత్త్యమని ఫలితార్థము. ఈలక్షణములో కొన్ని సామాన్యగుణాలు ఉన్నవి. విశేషలక్షణములో సామాన్యగుణాలను చెప్ప నవసరము లేదు. అయినా అవి ఆవశ్యకములు, అని సూచించడానికై ఉపాదానము ఆవశ్యకమే ఉదా:—

> సందిగ్ధే కృపయా మృదుః క్షణ మరీన్ హన్తుం ధృతాసిః పురః
> శౌర్యశ్రీప్రణయప్రశంసిషు నమద్భ్రూర్లజ్జతే వందిషు,
> ఆకారాన్ సుఖరోషహర్షపిశునా న్వక్త్రేన ధత్తే మనాక్
> త్రైలోక్యాతిశయాఢ్యకీర్తిసుభగ శ్శ్రీవీర రుద్రో నృపః.

మూడు లోకాలనూ అతిశయించే స్వభావము కలిగిన కీర్తిచే మనోహరుడయిన వీరరుద్రభూపతి యుద్ధభూమిలో ఎదుట శాత్రవులను తునుమాడడానికి ఖడ్గమును ధరించి కూడా కృపామృదులహృదయుడై క్షణకాలము సందేహించుతాడు. స్తోత్రపాఠకులు తన శౌర్యశ్రీప్రణయమును ప్రశంసించేటప్పుడు నతభ్రూవిలాసుడై లజ్జపడుతాడు. సుఖరోషహర్షాలను సూచించే ఆకారములను కొంచెముగా నయినా ముఖాన ధరించడు. దీనిలో ఉదాత్తలక్షణ సమన్వయము స్పష్టము. ఇక్కడ నాయకునకు స్థైర్యము ధార్మికత్వము కీర్తి సుభగ

త్వమూ అనే సాధారణగుణాలు కృపాదివిశేషగుణాలూ నిర్దిష్టము లయినవి.

## ధీరోద్ధతుడు

దర్పమాత్సర్యభూయిష్ఠః చండవృత్తి ర్వికత్థనః
మాయావీ సులభక్రోధః స ధీరోద్ధత ఉచ్యతే.

దర్పమాత్సర్యములు అధికముగా కలవాడూ రౌద్రుడూ ఆత్మశ్లాఘాపరుడూ మంత్రాదిబలముచేత లేనివస్తువులను చూపించే మాయావీ వంచకుడూ సులభకోపుడూ అయినవాడు ధీరోద్ధతుడవుతాడు. ఉదా:—

రే! రే! ఘూర్జర! జర్జరోఽసి సహరే, లంపాక! కిం కంపసే?
వంగ! త్వంగసి కిం? ముధా బలరజఃకాణోఽసి కిం కోంకణ?
బాణ! ప్రాణపరాయణో భవ మహారాష్ట్ర! పరాష్ట్రోఽస్యమీ
యోద్ధారో వయ మి త్యరీ నధిభవం త్యంధ్రక్షమాభృద్భటాః

ఆంధ్రభూమీ పతిభటులు మేమె యోద్ధలము అని శత్రువులను నానావిధాల అభిభవించుతున్నారు. వారితిరస్కారవాక్యములు ఈవిధాన ఉన్నవి. ఓరోరీ! ఘూర్జరా! జర్ఝరుడ వయినావు. ఓరీ! లంపాకా! యుద్ధముగో కంపించుతావేమి? ఓరీ! వంగదేశీయా! కంపించుతున్నావె! ఓరోరీ! కోంకణా! వ్యర్థముగా బలపరాగాంధుడ వయినావు. ఓరీ! బాణా! ప్రాణరక్షణ పరాయణుడవు కమ్ము. ఓరీ! మహారాష్ట్రా! నీరాష్ట్రము నీకు కాకుండా పోయినదిలె! దీనిలో భటుల ఆత్మశ్లాఘ దర్పమాత్సర్యాదులూ స్పష్టములు.

## ధీరలలితుడు

నిశ్చింతో ధీరలలితః కలాస క్తః సుఖీ కభూః

చింతావిరహితుడూ నృత్యగీతాదికళాలయుడు దానసక్తుడు నిత్యమూ భోగప్రవణుడూ అగువాడు ధీరలలితుడు. ఈతని ఆకారము సుకుమారము. ఉదా:—

శౌర్యోష్మా నిరవగ్రహః ప్రతినృపాః సర్వేఽపి నమ్రీకృతాః
పాతివ్రత్యముపైతి భూరియ మయం నాథ స్స్వయంభూ శ్శివః
ధీరోఽయం యువరాజ ఏవ వహతి శ్రీవీరరుద్రో ధురం
సర్వా మిత్యనుమోదతే ప్రతికలం శ్రీకాకతీంద్రో నృపః.

వీరరుద్రకులజ్యేష్ఠుడయిన శ్రీకాకతీంద్రనృపుడు నిరతమూ ఆమోదమును అనుభవించుతున్నాడు ఆతని అభిప్రాయము ఈవిధముగా ఉన్నది. ప్రతాపరుద్రుని శౌర్యాతిశయము అడ్డు లేనిదై ఉన్నది. శత్రునృపతు లందరూ నమ్రీకృతు లయినారు. ఈభూమి పాతివ్రత్యమును పొందుతున్నది. ఈ స్వయంభూశివుడు లోకాధినాథుడై ఉన్నాడు. యువరాజయిన శ్రీవీరరుద్రుడు ధీరుడు. ఆతడే ఈభారము నంతనూ వహించుతున్నాడు. ఇంకా కావలసినది ఏమి? ఈవిధముగా వీరరుద్రకులజ్యేష్ఠుని లాలిత్యమును ఊహించాలి.

ధీరశాంతుడు

ధీరశ్శాన్తః ప్రసన్నాత్మా ధీరశాంతో ద్విజాదికః

ధీరుడు శాంతుడు ప్రసన్నమనస్కుడూ అయినవాడు ధీరశాంతు డనే నాయకుడు. చక్కని వివేచనాపటిమ కలిగి క్లేశములను సహించేవాడై శమప్రధానుడై హ్రాస్తాంతఃకరణుడై ఉండేవాడే ధీరశాంతుడు. ధీరశాంతు డయ్యేవాడు బ్రాహ్మణుడుకాని వైశ్యుడుకాని కావాలి. తదితరులు ధీరశాంతులు కాదగరు, అనే నిషేధమును ఇక్కడ గ్రహించాలి. ధీరత్వ శాంతత్వాదులు ఉన్నప్పటికీ క్షత్రియులకు ధరలలి

తత్వమె. సామాన్యగుణయుక్తులయిన ద్విజాదులు ధీరశాంతు లవుతా రని కొందరిభావము. ఉదా;—

వీరం రుద్రనృపాలరత్న మభితః ప్రాప్తోదయం మోదతే
సంఖ్యావద్గణ ఏష పూషణ మివ ప్రత్యగ్ర మబ్జాకరః
ఉన్మీలత్కమలావిహారవసతి ర్భూత్వా వికాసై ర్నిజై:
విశ్వామోద ముదంచయ న్నవిరతం దోషావసానోత్సుకః

ఈ పద్యానికి రెం డర్థా లున్నవి. వానిలో మొదటిఅర్థము ఈ పండితమండలి అంతటా అభ్యుదయము పొందిన నూతనుడగు వీరరుద్రనృపాలరత్నమును చూచి తామరకొలను సూర్యుని చూచి అనుమోదించినట్లుగా అనుమోదించుచున్నది. సముల్లసించుచున్న శ్రీలక్ష్మీదేవికి విహారవసతి అయినది. తమ ఉత్సవాదివికాసములచే నిత్యమూ ప్రపంచామోదమును అతిశయింపజేస్తున్నది. తమయందు దోషాలు లేనందువలన ఉత్సుకమై ఉన్నది. ఇటువంటి ఈ అర్థములోనే బ్రాహ్మణుల ధీరశాంతత్వమును ఊహించాలి.

"పూషణ మివ అబ్జాకరః" తామరకొలను సూర్యునివలె అని ఉపమాలంకారము. అక్కడ సరః సూర్యపక్షములో భావమును ఈవిధముగా గ్రహించాలి. సూర్యుడు అంతటా ఉదయము పొంది ఉన్నాడు. నూతనుడు. సూర్యోదయములో అబ్జాకరము (సరస్సు) వికసించుకమలాలకు విహారవసతి అయినది. స్వీయవికాసములచే నిత్యమూ ప్రపంచానికి పరిమళభాగ్యమును అతిశయితము చేస్తున్నది. రాత్రి గడిచి పోవడముచేత ఉత్సుకమై ఉన్నది, అని,

## శృంగారనాయకులు

ధీరోదాత్తాదులు సర్వరససాధారణులు. కేవలమూ శృంగారరసానికి అసాధారణు లయిన నాయకులు ఇక్కడ నిరూపింపబడుతున్నారు. ధీరోదాత్తాద్యుదాహరణములను చూచి నట్లయితే వారు ఒక్కొక్క రసానికె అసాధారణులుగా కన్పడుతున్నారు. ధీరోదాత్తుడు వీరానికి ధీరోద్ధతుడు రౌద్రానికీ, ధీరలలితుడు శృంగారరసానికీ, ధీరశాంతుడు శాంతరసానికీ, సంబంధించినట్లుగా ఉన్నది. వారు సర్వరససాధారణులె అయినా వారివారి విశేషలక్షణానుసారముగా ఉదాహరణములు ఆవిధముగా ప్రదర్శింపబడినవని గ్రహించాలి. శృంగారరసము విషయముగా కల నాయకులు నలుగురున్నారు. అనుకూలుడు దక్షిణుడు ధృష్టుడు శఠుడూ అని వారి పేర్లు. వీరిస్వరూపోదాహరణములను ఈ విధముగా తెలియవచ్చును.

ఏకాయత్తోఽనుకూలః స్యాత్తుల్యోఽనేకత్ర దక్షిణః
వ్యక్తాగా గతభీర్ధృష్టః గూఢవిప్రియకృచ్ఛఠః.

ఒకే నాయికయందు అనురక్తుడై ఉండేవాడు అనుకూలుడు. అనేకనాయికలందు సమానముగా ఉండేవాడు దక్షిణుడు. అపరాధము వ్యక్తమయినా భయము లేనివాడు ధృష్టుడు. గూఢముగా అపరాధము చేసేవాడు శఠుడు.

### అనుకూలుడు

అనేక నాయికలున్నప్పటికీ గుణోత్తర అయిన ఒకే నాయికయందు విశేషముగా అనురక్తుడగువాడు అనుకూల నాయకుడు. విద్యానాథుడు ఈ అభిప్రాయానుసారముగానే ఉదాహరణమిస్తున్నాడు. శ్రీరామాదులవలె ఏకజాని అయినవాడె అనుకూలుడని కొందరిభావము. ఉదా:—

కిం నామాచరితం తపః సఖి! భువా యస్యాః పతి ర్గీయతే
వీరో రుద్రనృపః క్వ తత్సుచరితం ? తస్య ప్రియా స్యాం యతః,
జానే మానిని ! మా విషీద పురతః ప్రఖ్యాప్య నామ స్థిరాం,
త్వాం రత్నాకరమేఖలాం త్వయి సదా సక్తం విధాస్యే నృపం.

ఈ శ్లోకములో పూర్వార్ధము నాయికావాక్యము. ఉత్తరార్ధము సఖీవాక్యము. సఖీ ! భూమి అనునామె ఏమి తపస్సు చేసినదో కదా ? ఆమెపతిని అందరూ "వీరుడు రుద్రనృపతి" అని గానముచేస్తున్నారు. ఆభూమిసుచరితము ఎక్కడిదో ! నేను ఆవీరరుద్రనృపతికి ఎట్లా ప్రియురాలను కాగలుగుతానో కదా ! ఏ సుచరిత్రమును ఆచరించితే అతడు ప్రియుడవుతాడో ! (ఇటుపైన సఖి చెప్పుతున్నది) చెలీ ! నాయకఘటనోపాయమును నేను ఎరుగుదునులే. ఓమానినీ ! విషాదపడవద్దు. నిన్ను ఆతనిఎదుట ప్రఖ్యాపించుతాను. ఈమె స్థిర రత్నాకరమేఖల. అని చెప్పుతాను. నీపైన నృపుడు సదా ఆసక్తుడు అయ్యేటట్లు చేస్తాను. నీయందు ఆతనికి అనురాగము కలగడానికై సపత్నీనామసామ్యముతో నిన్ను ప్రకటము చేస్తాను. ఆతడు నీమీాద అనురాగి అవుతాడు. ఈపద్యములో ప్రతాపరుద్రునకు భూమిపైన విశేషానురాగము ఉన్నదని వ్యక్తమవుతున్నది. వధువు స్థిర రత్నాకరమేఖల అని భూమీనామగ్రహణమున స్నేహము ప్రఖ్యాపిత మవుతున్నది. స్థిరముగా ఉండేది స్థిర. భూమి స్థిరముగా ఉండేది కాబట్టి స్థిర. స్థిరానురాగము కలవ్యక్తినికూడా స్థిర అనవచ్చు. అందువలన నాయికకూడా స్థిర. రత్నాకరములు - సముద్రములు మేఖల - మొలనూలు. సముద్రములు మొలనూలుగా కలది భూమి. రత్నములకు ఆకర మయిన మేఖల కల

యువతి రత్నాకరమేఖలా. దీనిలో నాయిక రత్నాకరమేఖల. పై లక్షణానుసారముగా అనేకనాయిక లున్నప్పటికీ నాయకుడు భూమిపై విశేషానురాగము కలవాడుగా వర్ణింపబడి నందువలన అనుకూలత ఉన్నది.

దక్షిణుడు

అనేకనాయికలందు వైషమ్యము లేకుండా స్నేహముతో అనువర్తనము చేసే నాయకుడు దక్షిణు డవుతాడు. ఇక్కడ ఈవిషయమును తెలియవలసిఉన్నది. ఒకయువతి అనేకపురుషులందు ఆసక్తురాలై ఉన్నట్లయితే రసాభాస అవుతుం దని రసప్రకరణములో చెప్పబడనున్నది. బహుసక్తి ఉన్నప్పుడు సమానానురాగఫలము కలుగదు. విభావాదుల పరిపూర్తి ఉండదు. అప్పుడు రసీభావము సిద్ధము కాదు. యువతికి బహుసక్తి ఉంటే రసాభాస అయినట్లు పురుషునకు అనేకానురాగము ఉన్నట్లయితే రసాభాసమే ఉండాలికాదా ? ఈవిధముగానే కొందరు అంగీకరించుచున్నారు. అప్పుడు దక్షిణనాయకానురాగములో రసత్వము ఉండదు. అదికూడా ఆభాసమే అవుతుంది. కాగా రసనాయకులలో దక్షిణనాయకుని చెప్పడము అసంగతమె అవుతుంచె! ఆతనిని రసాభాసనాయకునిగనె పరిగణించాలికదా ? రసనాయకునిగా చెప్పడము ఎట్లా ఉపపన్న మవుతుంది ? అని శంక.

సమాధానము— దక్షిణనాయకునకు ఒకేనాయికయందు గాఢానురాగము ఉంటుంది. ఇతరనాయికలలో అట్లా కాదు. ఒకనాయికపైన మధ్యమానురాగము. వేరొకనాయికపై మందానురాగము. ఇట్లాగే అనురాగము ఉండడములో తరతమభావము నిశ్చితము. "తుల్యోఽనేకత్ర దక్షిణః" అనే

వక్షిణలక్షణములో సమానానురాగవత్త్వము ప్రతిపాదింప బడడము లేదు. అక్కడ సమానానువర్తనము మాత్రమే వివక్షితము. "ఈతడు నాయందే అనురక్తుడు. నాయందే అనురక్తుడు" అని ఆయానాయికలు భావించేటట్లుగా స్నేహానువర్తి అయ్యేవాడే దక్షిణుడవుతాడు. ఈఅనువర్తనము కపటప్రధాన మని శఠసామ్యమును ఊహించరాదు. ఈస్నేహానువర్తనములో విప్రియకారిత్వము ఏమీ లేదు. తత్తన్నాయికాసమక్షస్నేహానువర్తనములో అనురాగోద్రిక్తహృదయముతోనే ఆతడు ఉంటాడు. అందువలనని విభావాదులపరిపుష్టికి ఏమాత్రమూ హాని లేదు. రసత్వానికేమీ భంగము లేదు. రసాభాసతకు ప్రసక్తి లేదు. కాబట్టి దక్షిణుడు రస నాయకుడే.

యువతికూడా బహుపురుషులందు సమానానువర్తిని అయి నట్లయితే రసాభాసతాప్రసక్తి ఉండదుకదా! అని శంకించవచ్చును. కాని అది ఉచితము కాదు. స్త్రీ పురుషుని తరతమభావాన పరీక్షించగలదు. అప్పుడు ఒకనియందె దృఢానుబద్ధ అవుతుంది. తదితరులలో నిష్ప్రేమ కపటప్రవృత్తిని మాత్రమే ప్రదర్శించుతుంది కాని అనురాగమయప్రవృత్తిని చూపలేదు. అందువలన విభావాదులపుష్కలత ఏర్పడదు. కాబట్టి రసాభాసమే అవుతుంది, దీనిలోని విషయవివేకమును కామశాస్త్రాదులలో విశదముగా గ్రహించవలసిందేకాని అప్రస్తుతమి నిక్కడ ఉపపాదింపము. ఉదా:—

నర్మోక్త్యైవ నిమంత్రితా స్మరకలాకేళీషు కాచి న్మయా
సాకూతేన విలోకనేన హృదయం కస్యైచి దావిష్కృతం

కస్యాశ్చి త్ప్రహితః ప్రసాధనవిధిః దూతీకరేణ క్వ వా
గంతా స్మీ త్యనుచింతయైవ నృపతే రాసీ త్ప్రభాతా నిశా,

స్మరకళాక్రీడలవిషయమై ఒకనాయికను సరోక్తితో నిమంత్రించినాను. సాకూతవిలోకనముతో వేరొకనాయికకు నాహృదయాభిలాషమును ఆవిష్కరించినాను. దూతీహస్తముతో మరి ఒకనాయికకు స్రక్చందనాభరణాది ప్రసాధన విధిని పంపినాను. ఇప్పుడు ఎక్కడకు వెళ్ళవలెనో? అనే అను చింతనమువలన నృపాలకునకు రాత్రి తెల్లవారినది. దీనిలో నాయకునకు ముగ్గురునాయికలందూ అనురాగప్రవృత్తి సమముగా ఉన్నది కాబట్టి దక్షిణతను ఊహించాలి.

ఈ ఉదాహరణములో నాయకునకు సమానుభూతి లేదు. అందుకొరకై వేరొక ఉదా:—

వాణీం ముఖేన నేత్రాభ్యాం శ్రియం దోష్ణాచ మేదినీం,
మానయం స్తుల్యతాం ధత్తే తాసు రుద్రనరేశ్వరః.

ముఖమున వాణీదేవిని నేత్రముల శ్రీదేవిని, భుజమున భూదేవిని, సమ్మానించుతూ రుద్రనరేశ్వరుడు వాణీ శ్రీ భూములందు సామ్యమును వహించుతున్నాడు. సమన్వయము స్పష్టము.

పూర్వోదాహరణములోకూడా వ్యంగ్యముగా వాణీ లక్ష్మీ వసుంధరలు సూచింపబడినారు. దీనిలో వాచ్యముగా చెప్ప బడినారు దానిలో అనువృత్తిసూచక సరోక్త్యాదులు వాచ్యము లయినవి. దీనిలో ముఖాదిపదములచే వ్యంగ్యము లయినవి. ఉదాహరణద్వయములోని వాణీ శ్రీ వసుంధరలు వీరరుద్రునకు నాయికలు కావుకదా! దాక్షిణ్య మెట్లు? అని శంకింప నక్కరలేదు. వాణ్యాదిపదాలలోని స్త్రీలింగ

సరసతవలన ఆయానామములు కల నాయికలు గోచర మవు తున్నారు. తదభేదమును ప్రకృతములో గ్రహించినట్లయితే శృంగారనాయకత్వభంగ ప్రసంగము లేదు.

## ధృష్టుడు

ప్రకృతనాయికను విడిచి నాయికాంతరసంబంధములో కలిగిన ఉపభోగచిహ్నాలవలన నాయకుని అపరాధము స్పష్ట మయి నప్పటికీ ప్రకృతనాయికాసన్నిధానములో భీతి ఏమా త్రమూ లేకుండా ఉండేవాడు ధృష్టనాయకుడు. ఉదా:—

రాజ్యశ్రీపరిభోగశంసి భవత స్సర్వాంగ మాలోక్యతే
కస్తత్రావినయోస్తి? సాహస మిదం తన్నామ మయ్యర్పితం
జానే త్వాం బహువల్లభం కి మపరం వక్తవ్య మల్పా వయం
తస్యాం ప్రేమ తవాధికం వసుమతీ యా నామ కిం జల్పితైః?

నీఅవయవాలన్నీ రాజ్యశ్రీపరిభోగమునుసూచించుతున్నవి ఇందులో అవినయము ఏమి ఉన్నది? ఆనాయికానామ మును నాయందు అర్పించినావు. ఇదే సాహసము. నీకు ప్రియురాండ్రు చాలామంది ఉన్నారు. నే నీ విషయమును ఎరుగుదును. ఇంకా చెప్పవలసినది ఏమి ఉన్నది? మేము అల్పులముకదా! వసుమతి అనే ఆమెపైననే నీకు ప్రేమ అధికము. మాటలవలన ప్రయోజనము ఏమున్నదిలే! దీనిలో నాయకునిఅంగములు అన్యాంగనాసముపభోగమును శంస నము చేయడమువలన, వేరొకరిపేరుతో నాయికను పిలు చుట అనే గోత్రస్ఖలనము ఉండడమువలనా, నాయకుని అప రాధము నిర్భీకత్వమూ వ్యక్తములవుతున్నవి. అన్యాసంభోగ చిహ్నకుపిత అయిన ఇందలి నాయిక ఖండిత.

శ ఠు డు

ఇతరులకు తెలియకుండా ఉండేటట్లు గూఢముగా అన్య నాయికాసంగమరూపవిధానములో ఉంటూ స్వీయనాయి కను సానురాగముగా కలియకపోవుట అనే విప్రియమును ఆచరించేవాడు శఠనాయకుడు. ఈతని ఈ విప్రియము నాయి కకు మాత్రము తెలిసిఉంటుంది. ఆమెకు తెలిసినా ఇబ్బంది లేదులే! అనే ధీమాతో నాయకుడు ప్రవర్తించుతాడు. ఉదా:—

దృష్ట్యా పశ్యసి కేవలం న మనసా వాచా ప్రియం భాషసే
నో భావేన, భుజాంతరం ప్రకటయ స్యగ్రే న చాభ్యంతరం
జ్ఞాతం కాకతినాథ! భూ స్తవ పరం ప్రాణేశ్వరీ ధ్యాయతః
మాదృక్షేషు విడంబనైవ త దలం వ్యర్థై ర్బహిస్సంభ్రమైః.

కేవలమూ దృష్టితో చూస్తావు. మనసార చూడవు. కేవలము వాక్కుతో ప్రియము భాషించుతావు. అనురక్తితో మాట్లాడవు. బయటికి మాత్రము భుజాంతరమును ప్రక టించుతావు. అభ్యంతరమును వెలుపరచవుకదా! కాకతి నాథ! అంతా తెలిసిందిలే సంతతధ్యానము చేస్తూ ఉన్న నీకు భూమియె ప్రాణేశ్వరి మావంటిజనులందు కేవలమూ విడంబనమును ఆచరించుతున్నావు. చాలులె! ఈ వ్యర్థము లయిన బహిస్సంభ్రమము లేమిలె!! ఇవిమాత్రము ఎందుకు? వీనినికూడా మానివేయవచ్చు. దీనిలో నాయకుని భావ శూన్య దర్శనాదివిధానము నాయికకు మాత్రము తెలియును. నాయకుడు గూఢవిప్రియకారి. సమన్వయము స్పష్టము

గ్రంథప్రారంభములో ప్రతాపరుద్రునే అంతటా తగుల వేస్తానని ప్రతిజ్ఞాతము. అక్కడక్కడ ఆయా నాయకవిష

యముగా కాకతీశ్వరులు ఉదాహరింపబడినారు. అయినా ఇది ప్రతిజ్ఞాభంగము కాదు. ఉదాహృతు లందరూ ప్రతాపరుద్రసంబద్ధులే కదా! అందువలన వారూ వారూ ఉదాహరింపబడినప్పటికీ వీరరుద్రునివర్ణనమె ఉన్న దని గ్రహించాలి.

## స హా యు లు

శృంగార నాయకులకు నాయికాసంబంధము నియతము. నాయకులకు నాయికలను అనుకూలింపజేయడములో సహాయులు నలుగు రున్నారు. పీఠమర్దుడు, విటుడు, చేటుడు, విదూషకుడూ అని వారి పేర్లు. వీరిస్వరూపములను ఈవిధముగా తెలిసికోవాలి.

కించిదూనః పీఠమర్ద ఏకవిద్యో విటః స్మృతః
సంధానకుశల శ్చేటో హాస్యప్రాయో విదూషకః

ప్రధానకథానాయకునికన్న కొంత తక్కువగుణాలు కలవాడు పీఠమర్దుడు. ఈతడు ప్రాసంగికేతివృత్తములో నాయకుడుగా ఉంటాడు. ఈతనికే పతాకానాయకు డని పేరు. నాయకునకు ఉపయోగించే గీతాదివిద్యలలో ఏదో ఒక విద్యను మాత్రమె ఎరిగినయాతడు విటుడు. నాయికను సంధానింపచేయడములో కౌశలము కలవాడు చేటుడు. వేషభాషాచేష్టాదులచే హాస్యమును కలుగజేసేవాడు హాస్యమె ప్రచురముగా కలవాడు విదూషకు డవుతాడు. ఈ చెప్పినవారు నాయకునకు సంబంధించినకార్యాలలో ఏదో విధముగా ఉపయోగించేవా రవుతారు.

## నా యి క

నాయిక నాయకసామాన్యగుణాలు కలిగి ఉంటుంది. ఇది నాయికాసామాన్యలక్షణము. ఇక నాయికావిశేషములను

తెలిసికోవాలి. వారిలక్షణోదాహరణములు నిరూపింపబడుతున్నవి. శృంగారనాయికలు ఎనిమిది విధములుగా ఉన్నారు. స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక, అని అష్టవిధ శృంగారనాయికల నామములు. యథాక్రమముగా వారి లక్షణములను నిరూపించుతాము.

### ౧ స్వాధీనపతిక

ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా

ప్రియునిచే నిత్యమూ ఉపలాలిత అయిన యువతి స్వాధీనపతిక అవుతుంది. అధీనుడు-ఆయత్తుడు తనయందు అధీనుడు స్వాధీనుడు. స్వాధీనుడగు పతి కలయామె స్వాధీనపతిక. ప్రియుడు నిత్యమూ సురతసుఖాస్వాదలుబ్ధుడై ఆసన్నుడయినట్లయితే ఈ స్వరూపము లభించుతుంది. ఉదా:—

ప్రియాం సర్వంసహాం తైస్తై ర్విశేషై రుపలాలయన్
ప్రతాపరుద్రనృపతిః ప్రతిక్షణ మవేక్షతే.

సర్వంసహ అనే ప్రియురాలిని ప్రతాపరుద్రనృపతి వాసోంగరాగాదికము లయిన ఆయా విశేషాలచే ఉపలాలనము చేస్తూ ప్రతిక్షణమూ నిరీక్షిస్తున్నాడు. దీనిలో నాయిక ఆసన్నాయత్తరమణ కావడము వలన స్వాధీనపతిక.

### ౨ వాసకసజ్జిక

ప్రియాగమనవేలాయాం మండయంతీ ముహుర్ముహుః,
కేళీగృహం తథాత్మానం సా స్యాద్వాసకసజ్జికా.

ప్రియుడు వచ్చేసమయములో కేళీగృహమునూ తననూ మాటిమాటికి మండనము చేసికొనే యువతి వాసకసజ్జిక.

నివాసభవనములో ఉపస్కరోపకరణాలతో సన్నద్ధురాలగునట్టిది అని భావము. "స్త్రీణాం వార స్తు వాసకః" అనే వచనాన్ని బట్టి వాసకపదానికి వారదిన మని కొందర రర్థము చెపుతారు. తన్మతానుసారముగా యువతి తనవంతుదివసము రాగా తననూ క్రీడామందిరమునూ హర్షముతో అలంకరించుకొనే టట్లయితే వాసకసజ్జిక అవుతుందని భావము. ఈపక్షమే విద్యానాథునకు అభిమతముగా కన్పడుతున్నది. ఉదా:—

స్వతేజసా పరిష్కృత్య ప్రధానాగార ముత్సుకా,
శ్రియాఽభిషేకవేళాయాం వీరరుద్రః ప్రతీక్షితః,

వేడుకపడుతూ ఉన్న శ్రీదేవి తన తేజస్సుచే ప్రధానగారమును అలంకరించి అభిషేకసమయములో వీరరుద్రుని నిరీక్షించుతున్నది. దీనిలో సమన్వయము విశదము.

### ౩ విరహోత్కంఠిత

చిరయ త్యధికం కాంతే విరహోత్కంఠితోన్మనాః

అనపరాధి అయిన కాంతుడు బాగా ఆలస్యము చేసినపుడు ఉన్మనస్క అయినయువతి విరహోత్కంఠిత. విరహమువలన ఉత్కంఠకలదిగా చేయబడిన స్త్రీ అని భావము. ఉ:-

న శంకాన్యా తాదృగ్గుణపరిమళే రుద్రనృపతౌ
కయా వా గోష్ఠ్యాసౌ చిరయతి? సఖీభి ర్న సులభః,
సమానేతుం, కాంతం వ్రజ! మదన! బద్ధోఽంజలి రయం
యతో విష్వద్రీచః కిరతి కిరణాన్ త్వత్ప్రియసఖః.

నానావిధగుణములచే పరిమళించుతున్న రుద్రనృపతి ఉత్తముడు. ఆతడు నాయికాంతరాసక్తుడై ఉంటాడు అనే శంక లేదు. ఏవిద్యాగోష్ఠితో విలంబనము చేస్తున్నాడో! చెలి



కత్తెలను పంపింతునా? వారలు ఆతని తీసుకొని రావడానికి సామర్థ్యముకలవారు కారు. ఆతడట్లు సులభుడు కాడు. ఓ మదనా! ఇదిగో! నీకు అంజలి ఘటించితిని. నానాయకుని తీసికొని రావడానికై వెడలుము. చూచితివికదా! నీప్రియ సఖుడు చంద్రుడు అంతటా ప్రసరించేటట్లు తనకిరణాలను వెదజల్లుతున్నాడు. దీనిలో నాయిక విరహాతుర అయి ఉత్కంఠిత అయినది. ప్రియుడు ఎపుడువస్తాడో? ఎట్లా వస్తాడో? అని వేదన పడుతున్నది.

౪ విప్రలబ్ధ

క్వచి త్సంకేత మావేద్య దయితేనాద వంచితా
స్మరార్తా విప్రలబ్ధేతి కళావిద్భిః ప్రకీర్త్యతే.

ఒకచోట సంకేతభూమిని ఏర్పాటుచేసి అనుకొన్నట్లుగా చెప్పినట్లుగా రాక ప్రియుడు వంచనచేయగా మన్మథపీడిత అయిన యువతి విప్రలబ్ధ అని కళావిదులు పలుకుతున్నారు. విప్రలంభము-వంచనము. వంచితయువతి విప్రలబ్ధ అని భావము. ఉదా:—

గచ్ఛాగ్రేసఖి! కా ప్రియాగమకథా? ప్రాప్తోనిశీథః పరం
సంకేతాలయ! మోక్ష్యసే మమ వృథా జాతో శ్రుభిః పంకిలః
యద్వా రుద్రనరేశ్వరే ప్రియతమే రాజ్య శ్రియో వల్లభే
భారత్యా, దయితే భువః కృతపదాః ప్రాయో వయం వంచితాః

సఖీ! ముందు నడువుము, దారితీయుము, ఇంకా ప్రియుడు వస్తాడన్న కథ ఏమి ఉన్నది? నిశీథమె-అర్ధరాత్రమే ప్రాప్తమయినది. కాని ప్రియుడురాలేదు, ఓసంకేతాలయమా! విడువలేక విడువలేక నిన్ను విడుచుచున్నాను. వ్యర్థము గా నాకన్నీటిచేపంకిలమయినావుకదా! మాయుభయులసమాగమ

శ్రమజలములచే పంకిలము కాకపోయితివికదా! రుద్ర నరేశ్వరుడు రాజ్యశ్రీప్రియతముడు. భారతీవల్లభుడు భూదయితుడు. బహువల్లభుని ప్రేమించుట తగదు. తెలియక మన మట్లు చేసితిమి. వంచితల మైనాము. దీనిలో నాయిక దయిత వంచితయై కామాతుర అగుటవలన విప్రలబ్ధ అని గ్రహింపవలెను.

### ౫ ఖండిత

> నీత్వాన్యత్ర నిశాం ప్రాత రాగతే ప్రాణవల్లభే,
> అన్యాసంభోగచిహ్నై స్తు కుపితా ఖండితా మతా.

ప్రాణవల్లభుడు అన్యనాయికాసమీపములో నిశ నంతనూ గడిపి ప్రాతఃకాలమునరాగా ఆతనిశరీరముపైన అన్యాసంభోగ చిహ్నాలను చూచి కుపిత అయిన నాయిక ఖండిత అవుతుంది. ఖండిత అనే పదము ఇటువంటి నాయికావిషయమై పారిభాషికము, ఉదా:—

> రాత్రి ర్యామత్రయపరిమితా వల్లభా స్తే సహస్రం
> మార్గాసక్త్యా మమ గృహ మపి ప్రాత రేవాగతోసి,
> కిం కర్తవ్యం ? వద !నృపతిభిః వీక్షణీయాహి సర్వాః
> కోవా దోష స్తవ ? పున రహం కామ మాయాసయిత్రీ.

మొదటి చివరి అరజాములకు రాత్రిగా పరిగణనము లేదు. కాబట్టి రాత్రి మూడు జాములు పరిమితి కలది. నీకు వల్లభలు సహస్ర మున్నారు. మార్గాసక్తిచే నాగృహానికికూడా ప్రాతఃకాలముననె వచ్చినావు. ఇంకనూ చేయవలయునది ఏమి ఉన్నది ? చెప్పుము. ప్రభువులు అందరిని చూడవలసినదే కదా ! ఇందు నీదోష మేమున్నది ? పాపము నేనే నిన్ను మిక్కిలి ఆయాసపెట్టితిని. రాత్రినంతా ఇతరనాయికాభవన

ములో గడిపి ప్రాతస్సమయమున వచ్చినప్రియుని చూచి నాయిక ఈసడింపుతో ఈవిధముగా పలుకుతున్నది. సమన్వయము స్పష్టము. నాయకుడు ధృష్టుడు.

౬ కలహాన్తరిత

కోపాత్ప్రియం పరాణుద్య పశ్చాత్తాపసమన్వితా,
కలహాన్తరితా నామ సూరిభిః పరికీర్తితా,

ప్రణామాదివిధానమున ప్రసన్నతను సంపాదించాలని తలచునాయకుని మొదట కోపాన తిరస్కరించి అనంతరము పశ్చాత్తాపమువలన ఖిన్నయగు నాయిక కలహాంతరిత అవుతుంది. కలహముతో కూడుకొన్నది కావడమువలన ఈ నామము సార్థకము. ఉదా:—

తథా తథా అనునయః ప్రియ స్త్వయా హృదయ! రోషకలుషేణ
అవధీరితో న జ్ఞాతో రాజేతి వియోగవేదనాం సహస్వ!

ఆయావిధముగా ప్రణామాదులచే అనునయము ఒనర్చుతూ ఉన్న ప్రియుని అవధీరణము (తిరస్కారము) చేసినావుకదా! ఆతడు రాజు అని అయినా తెలుసుకొనలేకపోయితివె! హృదయమా? ఇప్పుడిక ఏమి లాభము? వియోగవేదనను సహింపుము. అది తప్పదు. దీనిలో నాయకుడు క్రుద్ధానునయకోవిదుడు. కామతంత్రనిపుణుడు. నాయిక మొదట నాయకుని తిరస్కరించి ఈవిధముగా అంటున్నది. నాయికాను రాగము ప్రణయకలహముచే అంతరితమై ఉన్నది కాబట్టి నాయిక కలహాంతరిత,

౭ ప్రోషితభర్తృక

దేశాంతరగతే కాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా.

కాంతుడు దేశాంతరగతుడయినప్పుడు ఖిన్నురాలయిన

నాయిక ప్రోషితభర్తృక అవుతుంది. ప్రోషితుడు—ప్రవాసము పొందినవాడు. అట్టిభర్త కలది ప్రోషితభర్తృక. ఉదా:—

త్రైలోక్యప్రథమానకీర్తిమహసః శ్రీవీరరుద్రప్రభోః
సేవార్థం చిరయత్సు కాకతిపురే భూపేషు తద్యోషితః
ద్వారాసక్తదృశో నయంతి దివసాన్ వ్యుష్ట్యాశయా చ క్షపాః
తద్ధ్యానప్రతిబద్ధసాంద్రపులకవ్యాకీర్ణకామేషవః.

మూడు లోకములలో ప్రఖ్యాతమయిన కీర్తి ప్రతాపములు కల శ్రీవీరరుద్రప్రభువు సేవకై సామంతరాజులు కాకతి పట్టణమున విలంబ మొనరించుచుండగా వారి కాంతలు ద్వారదేశములలో దృష్టు లుంచి పగటిసమయములను గడపుచున్నారు. ప్రభాత మవుతుంది అనే ఆశతో రాత్రులను గడపుతున్నారు. నిరతము ప్రియచింతనమువలన వారలకు దట్టముగా పులకలు ప్రరూఢము లవుతున్నవి. ఆ పులకలె కీలితకామబాణము లయినవి. దీనిలో నాయికలప్రియులు దూరదేశాన ఉన్నారు. నాయికలు విరహిణులై వ్యథపడుతున్నారు, ప్రజాగరాదికమున వారిఖేదము వ్యక్త మవుతున్నది. కాబట్టి నాయికలు ప్రోషితభర్తృక లనడము సముచితము.

## ౮ అభిసారిక

కాంతాభిసరణోద్యుక్తా స్మరార్తా సాభిసారికా

మన్మథార్తయై కాంతునిగురించి అభిసరించడములో ఉద్యుక్తురా లయిన యువతి అభిసారిక అవుతుంది. కాంతుడే అభిసరించేటట్లుగా చేసే నాయికకూడాఅభిసారికయే. అభిసరించేది అభిసరింపచేసేదీ అభిసారికే అని అనేకులు అంగీకరించుతున్నారు. దూతికలను పంపి కాంతుని అభిసరింపచేయు

వచ్చును. ఒకరిపైకె వేరొకరు అభిముఖముగా సరించుట-గమిం చుట అభిసరణము. అది కలది అభిసారిక. ఉదా:—

సంభ్రమైరలమల్పజ్ఞే! ప్రేయా నస్తు మహీపతిః
కరేణుస్థాం న పశ్యామి న శ్రుణో మ్యభిసారికాం.

నే నిప్పుడు కాంతుని అభిసరింపబోతున్నాను. కరేణుకను తీసికొని రమ్ము అని నాయిక పలుకగా ఇది దూతిసమాధాన వచనము. మహీపతి ప్రియుడవుగావుత. ఓసి అల్పజ్ఞా! సంభ్రమములు చాలులె! అభిసారిక గజముపై వెళ్ళడమును నేను చూడనూలేదు. విననూలేను. ఇది యేమిటి? ఎవరయినా ఏనుగుపైన ఎక్కి అభిసరించుతారా? ఈపద్యములో కాంతుని గురించి అభిసరించడమె ఉన్నది.

## సహాయులు

ఈచెప్పిననాయికలకు నాయకులను అనుకూలింప జేయడములో సహాయమొనర్చుస్త్రీలు వేరువేరుగా ఉన్నారు. దాసి, సఖి, చేటి, ధాత్రేయి, ప్రాతివేశిని, లింగిని, శిల్పిని, తాను, అనే వీరు నాయకానుకూల్యసంపాదనములో సహాయులు. తనభవనములో ఆయా కర్మలను చేసేది దాసి, స్నేహము కారణముగా సహాయపడుచెలికత్తె సఖి, చేటునిస్త్రీ చేటి. పాలిచ్చి పెంచిన ఉపమాతకూతురు ధాత్రేయి. సమీపగృహములో ఉండే యువతి ప్రాతివేశిని. సన్యాసము స్వీకరించినస్త్రీ లింగిని. చిత్రకారాదులయువతి శిల్పిని. తానే మారువేషముతో దౌత్యము చేయుటకూడా ఉన్నది. "లింగినీ శిల్పిని స్వా చ సహాయాః పరికీర్తితాః" అనె మూలములో ఉన్న స్వా పదమునకు బాంధవస్త్రీ అని అర్థము చెప్పడము ఉచితము. కాగా చెల్లెలు ఆడబిడ్డ మేనమామ

కూతురు ఈ మొదలయిన బాంధవస్త్రీలు ఇక్కడ గ్రహింప తగి ఉన్నారు. వీరిస్వరూపోదాహరణములు స్పష్టములె. కాబట్టి నిరూపించలేదు.

## నాయికాభేదములు

పద్మిని, చిత్రిణి, శంఖిని, హస్తిని అను స్త్రీజాతివిశేష ములు కామశాస్త్రములో ప్రసిద్ధములుగా ఉన్నవి. వానిని ఆస్థలములోనే గ్రహించాలి. ఈచెప్పినవిధముగా స్వాధీన పతికాద్యవస్థాష్టకము నిరూపితమయినది. అనేకనాయికలు ఈఅవస్థలను పొందుతారు. ఆ నాయికలలో మూడు భేదా లను ప్రస్తుతము నిరూపించుతాము. సంక్షేపముగా నాయిక త్రివిధ. ముగ్ధ, మధ్య, ప్రౌఢ అని. యథాక్రమముగా వీరిలక్ష ణములను ఈవిధముగా గ్రహించాలి.

## ముగ్ధ

ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా

ఉదయించుచున్న యౌవనము కలది ముగ్ధ అవుతుంది. ఆమె మాన్మథభావాలు లజ్జావిజితములవుతవి. ముగ్ధ-సుందరి. ఉదయద్యౌవన సౌందర్యము కలది ముగ్ధ అని భావము. ఉదా:—

ముగ్ధే య న్మనసోఽపి గోప్య మఖిలం త న్మహ్య మావేద్యతే
కిం యా చాచి దహం ? తవ ప్రియసఖీ ప్రచ్ఛాద్య కిం తామ్యసి ?
ఆసక్తి స్తవ రుద్రదేవనృపతా వాశాస్యతే కిం భవేత్ ?
ఇత్యాశ్యాం ప్రణయైకవాచి సుచిను ద్దత్తోత్తరా ప్రీతయా.

ఓముగ్ధా! మనస్సునకును గోప్యముగా ఉంచదగినదె అయినా సర్వమునూ నాకు చెప్పెడిదానవుకదా! నేను ఎవ

రనో అవుతానా ? నీకు ప్రియసఖినికదా ! మనోభావమును దాచి ఉంచి ఏల వ్యథపడుతావు ? నీకు రుద్రదేవన్నృపతి యందు ఆసక్తి ఉన్నదని అనుకొనుచున్నాము. రుద్రదేవుని యందు ఆసక్తి ఉండదగునులే ! నేను తలచినది సత్యమె యగునా ? అని ఈవిధముగా చెలికత్తె ప్రణయమును గురించి ప్రధానముగా పలుకగా సుతనువయిన ఆ ముగ్ధానాయిక సిగ్గుతో సమాధాన మిచ్చినది. దీనిలో నాయికయొక్క ప్రథమ యౌవనము లజ్జావిజితమన్మథత్వమూ గోచరము లగుటవలన నాయిక ముగ్ధ. స్త్రీలకు ప్రథమయౌవనములో అంగములు అకఠినములై మృదువులై ఉండుట ప్రసిద్ధము. ముగ్ధ అధరాంగసంస్కార మొనర్చుకొనును. క్రీడాలాలస అగును.

మధ్య

లజ్జామన్మథమదధస్థా మధ్యమోదితయౌవనా.

సముత్పన్నయౌవన మధ్యానాయిక. ఆమె మాన్మథ భావాలు లజ్జాభావములూ సమముగా ఉంటవి. అటూ ఇటూ ఉండేది కావడమువలన మధ్యమ అనే నామము సముచితము. సముచితయౌవనసౌందర్యమున స్పృహణీయ యై ఉండునది మధ్య అని భావము. ఉదా:—

లీలావిభ్రమపూర్వరంగ ముదితం తారుణ్య మేత్య త్రపా
నేపథ్యాంతరబింబితస్మరకలాలాస్యప్రపంచశ్రియః
సఖ్యః పశ్యత! కాకతీయనృపతౌ భావానుబంధోజ్జ్వలః
కోఽప్యస్యాస్తరళభ్రువో విజయతే శృంగారనాట్యక్రమః.

కాకతీయనృపతివిషయమై ఈమె శృంగారనాట్యక్రమము అనిర్వాచ్యమాధుర్యము కలదై సర్వోత్కర్షగా ఉన్నది. చెలియలారా ! చూడుడు ! ఈతరళభ్రూశృంగారనర్తనము

అనురాగభావానుబంధమువలన సముజ్జ్వలమై ఉన్నది. ఈమె మాన్మథకళలుఅను లాస్యప్రపంచశోభలు లీలావిలాసములకు పూర్వరంగముగా ఉన్న తారుణ్యమునుకూడి ఉన్నవి. లజ్జయను యవనికాభ్యంతరమున బింబనము పొంది యున్నవి. నాట్య మొనరించునట్టి స్త్రీ పూర్వ రంగమును పొంది యవనికాభ్యంతరమున లాస్యశోభలను ప్రసరింపజేయును. భ్రూవిలాసముల ప్రకాశింపజేయును. నానావిధవ్యాపారవిశేష సంబంధమున ఉజ్వల మగు శృంగారరసనర్తనము చేయును. ఇటువంటి ఈభావముకూడా ఇక్కడ సమారోపసుందరమై భాసించుతున్నది. ఇందలి నాయికావిధానము కనుపడీ కనుపడక త్రపాస్మరకళామధ్యస్థమై ఉన్నందువలన మధ్యమాత్వమును గ్రహించవలయును.

## ప్రౌఢ

స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా.

సంపూర్ణయౌవనము కలది ప్రౌఢ యగును. ప్రౌఢావ్రీడ మాన్మథభావములచే మందీకృత మగును. లజ్జ అణగి పోయి రాగభావములు అతిశయించినప్పుడు ప్రౌఢ అని భావము.

ఉదా:—

సహేలం పశ్యంత్యాః ప్రకృతిసుభగం రుద్రనృపతిం
తదాత్వప్రత్యుద్యద్ద్వివిధలలితాటోపమధురం,
రసప్రాదుర్భావా ద్యుగపదుదయాత్సాత్త్విక మహో!
మృగాక్ష్యా స్తారుణ్యే కుసుమశరశిల్పం విజయతే.

రుద్రనృపతి స్వభావసుభగుడు. ప్రియదర్శనుడు. ఒక మృగాక్షి ఆతనిని సమీపముగా చూస్తున్నది. ఆసమయములో ఆమెకు వివిధము లయిన కర్ణకండూయన కుచమర్ద

నాది కోమలాంగవిన్యాసములు సముత్పన్నము లయినవి. వానిఆటోపమున ఆమె మధురమధురముగా చూస్తున్నది. ఆమెయందు రసానుభూతి ఆవిర్భవించినది. అందువలన సాత్త్విక భావాలు యుగపత్కాలములో ఉత్పన్నము లయినవి. ఆమృగాక్షి తారుణ్యములో ఈవిధముగా కామకళాకౌశలము విజయవంత మవుతున్నది. దీనిలో నాయికాభావాతిశాయిత, మందీకృతవ్రీడావత్వమూ స్పష్టగోచరములు.

## ఇతర భేదములు

ఇట్లు సంక్షేపముగా నాయికాభేదములు నిరూపితము లయినవి. గ్రంథాంతరములలో ఇంకా అనేక భేద ప్రభేదాలు వర్ణింపబడినవి. ఆయా భేదాంతరములను యథాసంభవముగా ఉదహరించి గ్రహించవచ్చునని ఇక్కడ ప్రతిపాదించడము లేదు.

## నాయికాసంగ్రహము

ఇచట ఈ నాయికాసంగ్రహమును ఈవిధముగా గ్రహింపవచ్చును. స్వీయ, పరకీయ సామాన్య అని నాయిక త్రివిధ. స్వీయనాయిక ముగ్ధ, మధ్య, ప్రగల్భ అని మూడు విధాలు. ముగ్ధకు అవాంతరభేదాలు లేవు. మధ్యాప్రగల్భలు ధీర, అధీర, ధీరాధీర, అని మూడు మూడు విధాల అవుతారు. వీరే మరల జ్యేష్ఠ, కనిష్ఠ అని ద్వైవిధ్యము పొందుతారు. పరకీయ కన్య అని వివాహిత అని రెండువిధాలు. వేశ్య (సామాన్య) కు ఒకటే భేదము. ఇట్లా స్వీయ ౧౩ విధాలు. పరకీయ ౨ విధాలు. వేశ్య ౧ విధము. మొత్తము వీరు ౧౬ భేదాలు కలవా రవుతున్నారు. వీరలకు ప్రత్యేక ప్రత్యేకముగా స్వాధీనపతికాది భేదాష్టకసంబంధమువలన ౧౨౮ భేద

ములు కలుగును. వీరలకు ఉత్తమ మధ్యమాధమ భేదసంకలనమువలన ౩౮౪ భేదములు సిద్ధములగును, ఇంకా పద్మినీచిత్రిణ్యాదిభేదయోజనమున ౧౧౫౨ భేదములు. దివ్యా దివ్య దివ్యాదివ్య భేదమున ౩౪౫౬, వాత, పిత్త, శ్లేష్మ తత్వభేదమున ౧౦౩౬౮. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రభేదమున ౪౧౪౭౨. సత్వ, రజ, స్తమో భేదమున ౧౨౪౪౧౬ భేదములు కలుగును. ఇట్లాగే భేదాంతరములను ఊహించాలి. వాని అన్నిటి యోజనమున అసంఖ్యేయ నాయికాభేదములు కలుగును. ఇటువంటిపద్ధతినే నాయకులలోకూడా యోజించి గ్రహించాలి. ఆయాభేదప్రపంచప్రదర్శనము ప్రస్తుతము అవసరము కాదు.

ప్రసక్తమూ అప్రసక్తమూ ఈవిధముగా నిరూపితమయినది. పరమప్రకృతము పుణ్యశ్లోకగుణవర్ణనము. తదుపస్కారకముగా దీనిని తెలియవలయును.

గుణాలంకారాణాం రసమహతి కావ్యే విలసితం
స్ఫురచ్ఛబ్దార్థాభ్యాం తదపి హృదయానంది భవతి
తయోరప్యున్మేషః స్రవదమృతమాధుర్యసుభగః
పరం పుణ్యశ్లోకం చరిత మనుబధ్నన్ విజయతే.

రసమహత్కావ్యమున గుణాలంకారవిలసనము సుందరము ఆగుణాలంకారవిలసితము యోగ్యస్ఫురణముకల శబ్దార్థముల ద్వారా హృదయానందక మవుతుంది. స్రవదమృతమాధుర్యము కలిగిన మనోహరమగు శబ్దార్థముల ఉన్మేషము కూడా పుణ్యశ్లోకచరితమును నిబంధించేది అయినపుడు సర్వోత్కర్ష కలది కాగలదు, కాబట్టి గుణవన్నాయకనిబంధనము ఆవశ్యకము. సన్నాయకనిబంధనమువలన శబ్దార్థములు

చక్కగా సమున్మిషితము లవుతువి. ప్రసవదమృతమధురము లవుతవి. సుభగము లవుతవి. అటువంటి శబ్దార్థాలవలన గుణాలంకారములు విలసించును. గుణాలంకారముఖముగా కావ్యము రసమహత్తర మగును. ఈ నాయకప్రకరణ నిగూఢిత సకలార్థమునకూ ఇది సంగ్రహావచనము.



"గుణాలంకారాణాం" అనే సంగ్రహ శ్లోకము తరువాత కొన్ని ప్రతులలో కొంత అధికంగా పాఠము కన్పించు తున్నది. ఆ భాగమునకు కుమారస్వామి సోమపీథి వ్యాఖ్యానము చేయలేదు. ఆతడు స్మరించనూ లేదు. రత్నశాణము అనే వేరొక వ్యాఖ్యానంలో కూడా ఈ భాగవ్యాఖ్య లేదు. అందువలన కొందరు ఈ భాగమును ప్రక్షిప్తముగా తలుస్తు న్నారు. ఇప్పటికి, ముద్రితము లయిన ప్రతాప రుద్రీయ గంథాలలో ప్రక్షిప్తముగా తలచ బడుతున్నప్పటికీ ఇది ముద్రిత మయింది. దేశమంతటా పఠన పాఠనములలోనూ ఉంది. ఏతదీయాంశములను ప్రమాణంగా స్వీకరించుతూ ఉన్న వారున్నూ ఉన్నారు. అందువలన పాఠకుల భావనకు ఆ భాగమును కూడా అనువదించి ప్రదర్శించడము యుక్త ముగా ఉంటుంది. ఇది "గుణాలంకారాణాం" అనే శ్లోకానికి ఉపపాదకమయిన టీకాప్రాయముగా ఉంటుంది. గురుశిష్య మర్యాదలో ఎవరో వ్యుత్పన్న శిష్యుడు ఈ భాగమును వ్రాసి కొని ఉండవచ్చు.

కావ్యములో గుణములు అలంకారములూ అనేవి ఉప స్కార హేతువులు. అనగా శోభా సంపాదకములు అన్న

మాట. వీనిని నిబంధించినప్పుడు కావ్యములో చక్కని శోభ ఉంటుంది. కాని తగిన అలంకార్యము అంటే; అలంకరింపబడేది, ఉపస్కరింపబడేది (ఉపస్కార్యము) ఉండాలి. అది ఉన్నప్పుడే వీనికి చరితార్థత ఉంటుంది. అట్లా అలంకార్యము లేకపోతే ఇవి దేనికి ఉపస్కారకములు ? దేనిని శోభింపచేస్తవి ? తనకు తానే ఏదిన్నీ ఉపస్కారకము కాదు కదా! కాబట్టి అలంకార్యము అనేది ఉంటేనే అందము. ఏది అలంకారానికి ఆశ్రయంగా ఉంటుందో అదే అలంకార్యము. లోక న్యాయము కూడా ఇంతే కదా ! హారకేయూరాదులు అలంకారములు. వానికి ఆశ్రయంగా ఉండేది అలంకార్యము. గుణాలంకారములకు కావ్యము ఆశ్రయముగా ఉంది కాబట్టి కావ్యమే అలంకార్యము అవుతుంది. సామాన్యంగా రసభావాదులు అలంకార్యములు అని ప్రసిద్ధి ఉన్నది. అవి అలంకార్యములు అని అనడమున్నూ విరుద్ధము కాదు. రసభావాదులు అంతటా ప్రధానములు కదా ! ఆ ప్రాధాన్యమును బట్టి అవి అలంకార్యములు అని అంటూ ఉంటారు. చూడండి; లోకములో కూడా హార నూపురాద్యలంకారములు శరీరమును ఆశ్రయించి ఉంటవి. అక్కడ శరీరము అలంకరింపబడుతున్నది కాబట్టి అలంకార్యము అని అనాలి కదా ! అయినా ఆత్మయె అలంకార్యము అని అంటున్నాము. ఆత్మ అనేది ఉంటేనే కదా ! శరీరమున్నూ అలంకార్యము కాగలిగేది. ఆత్మ లేకపోతే శవ శరీరము అలంకార్యమవుతుందా ? ఆత్మ ఉంటేనే సకల శోభలున్నూ. అట్లాగే కావ్యములో రసము ఆత్మ. రసాదులు జీవితభూతములు కాబట్టి కావ్యాత్మతాకథనము యుక్తిసహము.

ఒక్కొక్క చోట కావ్యములో రసము ప్రధానముగా ఉంటుంది. వేరొకచోట అలంకారము ముఖ్యముగా ఉంటుంది. ఇంకొక చోట వస్తువు ప్రధానత్వము పొందుతుంది. వీనిని ఈ విధముగా ఉదాహరణములలో గ్రహించవచ్చు.

### రస ప్రాధాన్యము

ఈషదంకురిత విభ్రమ చారౌ దేహ పల్లవిత కాంతిని తన్వ్యాః
యౌవనే ముకులిత స్తనమాత్రే పుష్పితశ్చ ఫలితశ్చ మనోభూః.

ఆ తన్వి యొక్క యౌవనము, కొంచెము కొంచెముగా అంకురించిన విభ్రమాల వలన మనోహరముగా ఉన్నది. దేహములో కాంతి చిగిర్చింది కనుక యౌవనము స్పృహణీయముగా ఉంది. ఇంకా స్తనములు ముకుళితములుగా (మొగ్గల మాదిరిగా అన్నమాట) ఉన్నవి. ఆ యౌవనము ఇంత మాత్రముగానే ఉన్నప్పటికి అక్కడ మన్మధుడు పుష్పితుడూ అయినాడు ఫలితుడూ అయినాడు. ఇది ఒక బాలను చూచి స్పృహ కలిగిన ప్రతాప రుద్రుడు పలికిన వచనము. దీనిలో శృంగార రసము వ్యక్తమవుతూ ఉన్నది. ఆ బాల విభావము, ఆమె విశిష్ట యౌవనము ఉద్దీపనము. మంద గమనాదులు ఔత్సుక్యాదులు అనుభావములు సంచారులూ అవుతవి. వీని వలన ప్రతాపరుద్ర రతి రసీకృత మవుతుంది. రసీభావ సంపత్తి యొక్క స్వరూపము రస ప్రకరణములో నిరూపితమవుతుంది. ఒక వృక్షము అంకురితమై పల్లవితమై పుష్పితమై ఫలితము కావడ మనేది లోక ప్రసిద్ధము. ఇక్కడ కూడా మదన విషయములో ఈ నాలుగు అవస్థల చాతుర్యమును గ్రహించాలి.

## అలంకార ప్రాధాన్యము

కీర్త్యా ప్రతాపరుద్రస్య విహరంత్యాం దిగంతరే.
లోకాలోక తటాః శశ్వద్ద్రవచ్చంద్రోపలాంకితాః.

ప్రతాపరుద్రుని కీర్తి దిగంతరములలో విహరించుచూ ఉంటే లోకాలోక పర్వతతట ప్రదేశాలు కూడా మాటిమాటికి ద్రవించే చంద్రకోపలములు కలవి అయినది. దీనిలో, లోకాలోక పర్వతము యొక్క తటముల చంద్రకాంతకుట్టిమ ప్రదేశాలకు రుద్రదేవకీర్తి యందు వెన్నెల అనే బుద్ధికలగడము చేత ద్రవీభావము కలిగింది అని ఉంది కాబట్టి భ్రాంతిమదలంకారము వ్యంగ్య మవుతుంది. కీర్తిని చూడగానే వాటికి చంద్రికా భ్రాంతికలిగింది. అలంకారానికి కూడా వ్యంగ్యావస్థలో ప్రాధాన్యం ఉంటుంది. అది ప్రధానవ్యంగ్యము కాకుండా ఉన్నప్పుడు వేరొక దానిని ఉపస్కరించేది అవుతుంది కాబట్టి అపుడు అలంకార్యము కాదు. ప్రధాన వ్యంగ్య మయినపుడు తానే అలంకరింప బడేది అవుతుంది కాబట్టి అలంకార్యము అవుతుంది. ఇట్లా అలంకార్య మయినా అలంకార వ్యంగ్యము అని అనడము బ్రాహ్మణశ్రమణ న్యాయాను సారంగా సంగతమవుతుందని ఊహించాలి. శ్రమణుడంటే బౌద్ధసన్న్యాసి. ఈ అవస్థలో బ్రాహ్మణత్వాదులు ఉండవు. అయినా అతను ఒకప్పుడు బ్రాహ్మణుడు అనే అంశమును బ్రాహ్మణశ్రమణ పదము సూచిస్తుంది అట్లాగే వ్యంగ్యావస్థలో అలంకారత్వము ఉండక పోయినా ఒకప్పుడు ఇది అలంకారముగా ఉన్నది అనే అంశమును అలంకారవ్యంగ్యము అనే పదము తెలియ జేస్తుంది.

## వస్తు ప్రాధాన్యము

అవతరతి వీరరుద్రే కాకతివంశే త్రిలోక మహనీయే
త్యక్త్వా దుగ్ధపయోధిం తల్ప ఫణీశః స్వమందిరం ప్రాప్తః.

త్రిలోకములలో మహనీయు డయిన శ్రీవీరరుద్రుడు కాకతి వంశములో అవతరించగా తల్పముగా ఉన్న ఆదిశేషువు పాలసముద్రమును విడిచిపెట్టి తన మందిరమునకు పోయినాడు. దీనిలో తల్పఫణీశుడు దుగ్ధాబ్ధిని విడిచి స్వగృహము వెళ్ళినాడు అని వర్ణించడము చేత క్షీరసముద్రములో హరి లేడు, అని అభివ్యక్తమవుతున్నది. దీనిచేత పురుషోత్తముడు ప్రతాపరుద్ర రూపముగా కాకతీయ కులములో ఉంటున్నాడు. అనే వస్తువు వ్యజ్యమాన మవుతున్నది. ఇట్లా వ్యంగ్యార్థ ప్రాధాన్యము మూడు విధాలుగా ఉంటుంది.

గుణములు అలంకారములున్నూ కావ్యమును ఆశ్రయించి ఉన్నప్పుడు విలసిల్లుతూ ఉంటవి. అట్లా గుణాలంకార విలసిత మయిత కావ్యము శబ్దస్ఫురణము చేత అర్థస్ఫురణము చేత ఆ శబ్దార్థోభయ స్ఫురణము చేత సహృదయులకు హృదయానందకము అవుతుంది. వీని విశేషములను ఈ విధముగా ఉదాహరణములలో గ్రహించవచ్చును.

## శబ్ద స్ఫురణము

ప్రౌఢమయిన బంధముయొక్క అతిశయము ఉంటే శబ్ద స్ఫురణము అని అంటారు. రచనాడంబరము బాగా ఉండాలన్న మాట. ఆరభటీ వృత్తిలో ప్రతిపాదించే బంధాడంబరము ఉంటే శబ్దస్ఫురణము అని గ్రహించవచ్చు. ఉదా—

క్షోణీ రక్షణ దక్షిణాః క్షతజగత్క్షోభా మురీక్ష్య క్రమాః
క్షుద్రక్షత్రియ పక్ష శిక్షణ విధౌ ప్రోత్క్షిప్త కాక్షేయకాః

ఉద్దామోద్యమనస్య రుద్రనృపతే ర్దోర్దండయో శ్చండయో
గర్జద్దుర్జన గర్వ పర్వత భిదా దంభోలయః కేలయః

పద్య భావము కావ్య ప్రకరణములో విశదమవుతుంది.

## అర్థ స్ఫురణము

అచుంబితమయిన అర్థసంపదను అర్థస్ఫురణము అంటారు. ఆ అర్థమును ఇతర కవులు స్పృశించి ఉండరాదు. ఉదా:—

ఛాయ—ఖడ్గే యుద్ధ విజృంభితే రిపుమహీ నాథాంజలిం బింబితం
ప్రేక్షంతో జయలక్ష్మీవాస కమలం మన్యంతే విజ్ఞానినః
మన్యే వీర ప్రతాపరుద్రనృపతేః జన్యే గృహీతుం పునః
తత్సాల్పష్యై రిపుజీవితాని విధేః ప్రాప్తస్య పీఠాంబుజం.

ఈ పద్యభావము కూడా కావ్య ప్రకరణములో విశదమవుతుంది. దీనిలోని అర్థసంపత్తి ఇతరకవిజుష్టము కాదు. అందువలన అర్థ స్ఫురణము.

## ఉభయ స్ఫురణము

అర్థ స్ఫురణము శబ్ద స్ఫురణమూ రెండూ మిశ్రితములై ఒక పద్యములో ఉంటే ఉభయ స్ఫురణము అవుతుంది. ఉదా:—

ఉద్యద్బృంహిత గర్జితైః ద్విప ఘటా కాతంబినీ డంబరైః
క్షోణీభృత్కటకోప రోధ పటుభిః సద్యః స్ఫురద్దిక్తటాః
ప్రావృట్సంభ్రమ శంసినో రిపువధూ బాష్పోప్లవం దుర్దినం
కుర్వంత శ్చలమర్తిగండ నృపతే జైత్ర ప్రయాణోద్యమాః.

"చలమర్తి గండ" అనే వీరబిరుదము కలిగిన ప్రతాపరుద్రమహారాజు యొక్క జైత్ర ప్రయాణ యత్నములు వర్షాసమయ సంభ్రమమును సూచించేవిగా ఉన్నవి. "చలమర్తి

గండ" అనే బిరుద పదము "ఛలమర్త్యగండ" పదమును అనుసరించి వచ్చింది. గండ అనేది కన్నడ పదము. దానికి మొగుడు అని అర్థము. కపటముగా ప్రవర్తించే మానవులకు మొగుడు. వారిని కపటము లేకుండా అదుపు ఆజ్ఞలలో పెట్టేవాడు అని భావము. సంస్కృత పదములు దేశీయ పదములు సమాసించడము ఆంధ్రభాషకు మాత్రమె క్రొత్త. ఛలమర్త్యపదము చేఱమర్తి అయింది. కొన్ని పాఠాలలో 'చలమర్త్యగండ' అని కూడా ఉన్నది కాని ఆ బిరుదము 'చలమర్తిగండ' అనే వాడిక. ఇక ప్రకృతము. ఆ చలమర్తిగండని జైత్రప్రయాణోద్యమాలలో ఏనుగుల బృంహితములు అతిశయించుచున్నవి. అవి మేఘ గర్జితముల మాదిరిగా ఉన్నవి. ఏనుగుల సమూహాడంబరము బాగా ఉంది. ఆ గజసమూహము కాదంబిని మాదిరిగా అంటే మేఘపంక్తి మాదిరిగా ఉంది. ఇంకా ఆ ఉద్యమములు శత్రువుల సేనా శిబిరములను ఉపరోధించడములో సమర్థములుగా ఉన్నవి. వర్షాకాలము పర్వతాల చరియలను సమర్థంగా ఉపరోధిస్తుంది అనే అర్థమున్నూ ఇక్కడ శ్లిష్టముగా ఉన్నది. అప్పుడే దిక్తటములన్ని స్ఫురించి జ్వలించుచున్నవి. ఇంతగా ఇట్లా జరుగుతూ ఉంటే శత్రుస్త్రీలకు కన్నీరు ఉద్భవించింది. ఆ రిపువధూ బాష్పము వలన దుర్దినము కలిగింది. మేఘచ్ఛన్న దివసమును దుర్దినము అంటారు. ఇటువంటి దుర్దినమును కలుగజేస్తూ ఆ జైత్రోద్యమాలు ప్రావృట్సంభ్రమ శాసనములుగా ఉన్నవి. అని భావము. దీనిలో శబ్దార్థ స్ఫురణమును యథాయోగముగా సమన్వయించుకోవాలి.

ఇటువంటి శబ్దార్థ స్ఫురణములచేత కావ్యానికి చారుత్వము కలుగుతుంది. అట్టి శబ్దార్థములకున్నూ సహృదయ హృదయానంద దాయకత్వము కలుగవలె నంటే పుణ్యశ్లోకానువర్ణనము ఉండి తీరాలి. కాబట్టి ఈ విధంగా కావ్యంలో నాయకునకే ప్రాధాన్యము ఉంది అని గ్రహించాలి. సత్కులము సదాచారము యశస్సు శౌర్యము పాండిత్యము శీలము మొదలయిన నాయక గుణముల వర్ణనము అవసరము. ఆ విధముగా చేయడమె చాలా సమ్మతము. ప్రబంధములో ప్రధాన నాయకుని కులాచారాదులనె వర్ణించితే ప్రబంధరచన పరితృప్తి నిస్తుంది. పోనీ; ప్రతిపక్ష నాయకుని నానాగుణాలను వర్ణించి ఆ ప్రతినాయకుని జయించినట్లుగా ప్రకృత నాయకుని వర్ణించడము కూడా బాగానే ఉంటుంది. ప్రతినాయకుని జయించి నందువలన నాయకోత్కర్షను నిరూపించడమున్నూ కొన్నిచోట్ల సమ్మతమె. ఈ విధానములకు ఈఉదాహరణలలో సమన్వయముల చూడవచ్చు.

తత్వం యస్య పరః పుమాన్, అవతరో యస్యాన్వయః కాకతి
క్ష్మాపానాం, చరితం చ యస్య భువన క్షేమంకర ప్రక్రమం,
శ్లాఘా యస్య లఘూకృతామరతరు స్వర్ధేను చింతామణిః
సోయం విశ్వధురంధరో విజయతే శ్రీవీరరుద్రో నృపః,

ఎవని తత్వము పరమ పూరుషుడేనో! ఎవని కాకతి భూపాలవంశము అవతారమో! ఎవని చరితము భువనాలకు క్షేమమున్ను కలుగ జేసే ప్రక్రియ కలదో! ఎవని శ్లాఘ కల్ప వృక్షము కామధేనువు చింతామణి అనే కామప్రదములను కూడా లఘూకరించిందో! ఆతడు ఈ విశ్వధురంధరుడయిన శ్రీవీరరుద్ర మహారాజు సర్వోత్కర్షగా రాణించు తున్నాడు.

దీనిలో ప్రస్తుతనాయకుని కులవైభవాదులు వర్ణితములయినవి. ఇట్లా వర్ణించడమనేది ఒక విధము.

యత్తేజః ప్రతిపక్ష భూప విహరద్గర్వాంధకారాతపో
యద్దోరర్గల విక్రమః త్రిజగతీ శుద్ధాంత దౌవారికః
సోప్యాసీ ద్యధి సేవణక్షితిపతిః సన్నాహ భేరీ ధ్వనిం
శ్రుత్వా రుద్రనరేశ్వరస్య మహతో భీతః పలాయ్యాకులః.

ఏ సేవణ ప్రభువు పరాక్రమము శత్రు రాజులలో ఉండే గర్వమనే అంధకారానికి ఆతపప్రాయమో! ఏ సేవణాధీశుని భుజార్గల పరాక్రమము ముల్లోకముల అంతఃపురాలకు దౌవారిక రీతితో ఉండేదో! ఆ సేవణ క్షితిపతి కూడా రుద్రనరేశ్వరుని సన్నాహ భేరీధ్వనిని విని గొప్ప భయము వలన ఎక్కడకో పరుగెత్తి వ్యాకుల పడినాడు. దీనిలో మొదట ప్రతినాయకుడయిన సేవణరాజు గుణవిశేషములు వర్ణితములయినవి. ఉత్తరార్థములో ఆతడు రుద్రనరేశ్వర ధాటికి ఆగలేక పోయినట్లు వర్ణించడం వలన రుద్రనరేశ్వరోత్కర్ష సిద్ధమవుతున్నది. ఇది రెండవ పద్ధతి.

ఇటువంటి వర్ణనము ఉత్పాద్య నాయకుని విషయమై పనికి రాదు. కల్పిత నాయకుని కవి స్వీకరించినపుడు ఆనాయకుడు సర్వలోక ప్రసిద్ధిని పొందడానికి ముందుగా కులాచారాది విశేషములను వర్ణించడమే ఉచితము. స్వతస్సిద్ధముగా ప్రసిద్ధుడయిన నాయకుడే అయితే ఈ రెండు విధానాలనూ కూర్చవచ్చును. అటువంటి ప్రసిద్ధ నాయకుని కులవ్యాప్తదేశాదులు లోకప్రసిద్ధములే కాబట్టి బలవంతుడయిన శత్రువును జయించినట్లుగా కవులు వర్ణించడము యుక్తము. ప్రబంధ నాయకుడు స్వతస్సిద్ధ నాయకుడు ఉత్పాద్య నాయకుడు అనే భేదముతో

రెండు విధాలుగా ఉండడము సంభవించుతూనే ఉంటుంది. ఈ విషయంలోనే ఇది కూడా పరిగ్రాహ్యము. ధీరోద్ధత నాయకునిలో బాహ్య సంభ్రమ బహుళంగా రౌద్రమును వర్ణించినట్లు ధీర లలిత నాయకునిలో బహు భావ కారి అయిన శృంగారమును వర్ణించి నట్లున్నూ ధీరోదాత్తనాయకుని విషయములో ఆ విధముగా రౌద్ర శృంగారాలను వర్ణించ రాదు. ఆతని కార్య విశేషమును అనుసరించి ఆ యా రససంపూర్తి ఉన్నట్లుగా వర్ణించడమే సముచితక్రమము. ఇంకా ధీరోదాత్త నాయకునిలో హాస్యము మొదలయిన ఇతర రసాల వర్ణనము కూడా అధికంగా ఉండరాదు. మందోద్యమానుభావములు కలిగి ఉన్నట్లుగా వర్ణించాలి. ధీరోదాత్త నాయకుడు అంటే సర్వవిధనాయకులలోనూ అధికుడు. అటువంటి సర్వాతిశాయి అయిన ధీరోదాత్త నాయకుని విషయముగా చేసికొని ప్రబంధాలు ఉన్నప్పుడు బాగా శ్లాఘాస్పదములు అవుతూ ఉంటవి.

నాయక ప్రకరణము

# కావ్య ప్రకరణము

గ్రంథములో నాయక ప్రసంగము ప్రాసంగికము. అది నిరూపిత మయినది. కావ్య స్వరూప నిరూపణము ప్రకృతము. ఈ ప్రకరణములో అది ప్రతిపాదింపబడును. ముందుగా కావ్య సామాన్య లక్షణమును ఈ విధముగా గ్రహించాలి.

కావ్య స్వరూపము

గుణాలంకార సహితౌ శబ్దార్థౌ దోష వర్జితౌ
గద్య పద్యోభయమయం కావ్యం కావ్య విదో విదుః.

కావ్యము గద్య కావ్యమని పద్య కావ్యమని ఉభయ కావ్యమని మూడు విధములు. ఈ కారికలో "గుణాలంకార సహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ" అనేది కావ్య లక్షణము. గుణాలంకార సహితములు దోష రహితములూ అయిన శబ్దార్థములు కావ్యము అని దాని భావము. పై కారికార్థమును వేరొక విధముగా పరిశీలించి నట్లయితే "అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యం" అని కావ్య సామాన్య లక్షణము పర్యవసన్న మవుతుంది. దోష రహితములూ గుణసహితములూ అలంకార సహితములూ అయిన శబ్దార్థములు కావ్యము అని అర్థము.

మొదటి కారికలో దోషవర్జనము ప్రథమోపాత్తము కాలేదు. వివరణ వాక్యములో అది ప్రథమోపాత్త మయినది. దీని వలన ఈ భావము వ్యక్త మవుతున్నది. దోషము అల్పమయినా ప్రమాదవశమున సంప్రాప్త మయినా ఉపేక్ష

చేయరాదు. ఇట్లే ఆచార్య దండి అభిప్రాయపడుతున్నాడు. కావ్యములో అల్పదోషము నయినా ఉపేక్షించ రాదు. శరీరము సుందరమయినా ఒక శ్విత్రము (బొల్లిమచ్చ) వలన దుర్భగ మవుతుంది కదా! గుణ సమూహములో ఒక దోషము మునిగి పోతుంది కాని బయటికి కన్పించదు. అనే కాళిదాససూక్తి కావ్య విషయములో కాదని గ్రహించాలి. కాగా కావ్యములో దోషమును ఏ మాత్రమూ ఉపేక్షించ రాదని పర్యవసన్న మవుతున్నది. కావ్యమును ముందు దోషరహితముగా చేయాలి. పిమ్మట గుణసహితముగా చేయడము ఆవశ్యకము. కొందరు గుణము దోషాభావ రూపమె కాని స్వతంత్రము కాదు. అని అంటారు. అది యుక్తము కాదు. గుణానికి ప్రత్యేకస్వరూపము ఉన్నది. కావుననె గుణవత్త్వము వేరుగా ఉపాత్త మయినది.

గుణము కావ్యానికి శోభా సంపాదకము. గుణములు ఉన్నట్లయితే కావ్యము కావ్యము కాగలుగుతుంది. గుణ ఘటనములో సావధానుడయిన కవి అలంకార రచనలో శ్రద్ధను పూన వలసి ఉన్నది. అలంకారములు శోభాతిశయాధాయకములు. కావ్యానికి కలిగే ఉత్కర్షఅలంకారాధీనము. ఇట్లా నిర్దోషములు గుణ యుక్తములూ అలంకార యుతములూ అయిన శబ్దార్థములు కావ్యమని పర్యవసితము.

ఇక్కడ ఒకటి విచారణీయము. శబ్దము అర్థమును విడిచి ఉండదు. అర్థము శబ్దమును విడిచి ఉండదు. శబ్దము కావ్యము అని అన్నప్పటికీ "శబ్దార్థములు కావ్యము" అని అన్నట్లే అవుతుంది. అర్థము కావ్యమని అన్నా "శబ్దార్థములు కావ్యము" అని అన్నట్లె అవుతుంది. ఆయినా శబ్దార్థములు కావ్యమని

విశేషించి చెప్పడములో ఈ అర్థమున్నది. రెండు ఒకటి అనడము విచిత్రమే. అదీకాక శబ్దము అర్థమును విడిచి ఉండక పోదు. గీతాది శబ్దాలలో అర్థము లేదు కదా! అటువంటి శబ్దము కావ్య మెట్లా అవుతుంది? అర్థము శబ్దమును విడిచి ఉండడము కూడా ఉన్నది. చేష్టాదుల వలన గోచర మవుతూ ఉన్న అర్థమును శబ్ద బోధ్య మన రాదు. కావ్యములో శబ్ద బోధ్యార్థమె ఉండాలని అర్థమును చెప్పే శబ్దమె ఉండాలని కావ్య విదులకు సమ్మతము. శబ్దార్థములు కావ్యమని అనడము ఈ అర్థమును చెప్పుతుంది. ఇంకా శబ్దప్రధానములకూ అర్థ ప్రధానములకూ కూడా కావ్యత్వము ఇష్టము. శబ్దమె కావ్య మన్నట్లయితే శబ్ద ప్రధానకమె కావ్య మవుతుంది కాని అర్థ ప్రధానకము కావ్యము కాజాలదు. అర్థమె కావ్య మన్నట్లయితే అర్థ ప్రధానకమె కావ్యమవుతుంది కాని శబ్ద ప్రధానకము కావ్యము కాజాలదు. కాబట్టి యథోక్తమె సమ్మతము. ఇంకా ఇక్కడి విశేషార్థము ఇతర స్థలములలో విశేషముగా నిరూపితము.

## కావ్య సామగ్రి లోక సామగ్రి

శబ్దార్థౌ మూర్తి రాఖ్యాతౌ జీవితం వ్యంగ్య వైభవం
హారాదివదలంకారా స్తత్రస్యు రుపమాదయః

శ్లేషాదయో గుణా స్తత్ర శౌర్యాదయ ఇవ స్థితాః
ఆత్మోత్కర్షా వహా స్తత్ర స్వభావా ఇవ రీతయః,
శోభా మాహార్యకీం ప్రాప్తా వృత్తయో వృత్తయో యథా,
పదానుగుణ్య విశ్రాంతిః శయ్యా శయ్యేవ సమ్మతా,
రసాస్వాద ప్రభేదాః స్యుః పాకాః పాకా ఇవ స్థితాః,
ప్రఖ్యాతా లోకవదియం సామగ్రీ కావ్య సంపదః.

లోకములో కమనీయ కామినీమణికి ఎటువంటి సామగ్రి ఉంటుందో అట్లాగే కావ్య సంపదకు కూడా సామగ్రి ప్రఖ్యాతమై ఉన్నది. లోక మందలి వ్యక్తికి స్వరూపము (మూర్తి శరీరము) జీవితము హారాద్యలంకారములూ శౌర్యాది గుణములూ స్వభావములూ అనుకరణాత్మకము లయిన నడవడులూ శయ్యాపాకమూ అనేవి ఉంటవి. ఇది సామాన్యముగా లోక సామగ్రి. శబ్దార్థములు,వ్యంగ్యవైభవము, అనుప్రాసోపమాదులూ, వైదర్భ్యాది రీతులూ, కైశిక్యాది వృత్తులూ, శయ్య, ద్రాక్షాదిపాకములూ అనేవి కావ్యసామగ్రి. కావ్యసామగ్రికీ లోక సామగ్రికీ స్వరూప సామ్యము ఉన్నది. శబ్దార్థములు కావ్యానికి శరీరము. వ్యంగ్యవైభవము జీవితము. అనుప్రాసోపమాదు లలంకారములు. వైదర్భ్యాదిరీతులు ఆత్మోత్కర్షసంపాదకము లయిన స్వభావములు. కైశిక్యాది వృత్తులు కృత్రిమ (తెచ్చి పెట్టుకొన్న) శోభను పొందిన వృత్తములు. శయ్యా పదానుగుణ్య విశ్రాంతి రూప మగు శయ్య. శయ్యపై పాదాలకు ఆనుగుణ్యము నిచ్చేవి శ్రాంతి ఉంటుంది. వర్ణసంఘట నాత్మక పదములకు ఆనుగుణ్యముని చ్చేవి శ్రాంతి ఈ శయ్యలో ఉంటుంది. ద్రాక్షాది పాకములు రసా స్వాద ప్రభేదముల యిన పాకములు. కావ్య పాకములు శృంగారాది రసా స్వాదప్రభేద స్వభావములై ఉండును. ఇటుపై ఈ సామగ్రీ స్వరూప స్వభావములు వివేచితముల గును. కావ్యము కాంత. కాంతా సామగ్రి వలె కావ్య సామగ్రి కూడా కాంత కాంతము స్పృహణీయమూను. "రస ప్రధానా శ్శబ్దార్థాః, జీవితం వ్యంగ్య వైభవం" ఈ వచనాలకు పరస్పరమూ విరోధము లేదని నాయక ప్రకరణములో నిరూపితము.

## శబ్దార్థములు

కావ్యములో ప్రయుక్తమగు శబ్దజాత మంతా త్రివిధముగా ఉంటుంది. వాచక శబ్దము లక్షకశబ్దమూ వ్యంజక శబ్దము అని. అర్థబోధకమయిన శబ్దమె ఇక్కడ వివక్షితము. శబ్దము అర్థమును బోధించడములో ఒక శక్తికలిగి ఉంటుంది. ఒక్కొక్క అర్థమును బోధించడానికి ఒక్కొక శక్తి కావాలి. ఆ శక్తులను ద్వారముగా చేసికొని శబ్దములు ఆయాఅర్థములను చెప్పునని సారాంశము. ఈ శబ్ద శక్తులకే శబ్ద వ్యాపారము లని పేర్లు. ఈ విషయము ముందు ముందు వివేచితమవుతుంది. అభిధ లక్షణ వ్యంజన అని ఈ వ్యాపారములకు పేర్లు. అభిధద్వారముగా ఒక అర్థమును ప్రతిపాదించే శబ్దము వాచకము. లక్షణద్వారముగా అర్థమును ప్రతిపాదించే శబ్దము లక్షకము. వ్యంజనద్వారా అర్థప్రతిపాదక శబ్దము వ్యంజకము. వీనివలన బోధింపబడే అర్థాలు మూడు విధములు. వాచ్యము లక్ష్యము. వ్యంగ్యమూ అని. కాబట్టి ఈ అర్థము పర్యవసన్న మవుతున్నది. వాచకశబ్దము వాచ్యార్థమును చెపుతుంది. లక్షక శబ్దము లక్ష్యార్థమును చెప్పుతుంది. వ్యంజకశబ్దము వ్యంగ్యార్థమును చెప్పుతుంది.

### వాచకము

ఏ శబ్దమును వినిన వెంటనే ఏఅర్థము గోచరమవుతుందో ఆ అర్థమునకు ఆ శబ్దము వాచకము. ఘటశబ్దమును వినగానే కలశరూపార్థము గోచరమవుతున్నది. కాబట్టి కలశరూపార్థానికి ఘటపదము వాచకము. ఇట్లే ఇతర స్థలాలలోనూ.

### లక్షకము

వెంటనే గోచరమయిన అర్థము కుదురు బాటును పొందక

పోగా ఆ కుదురు బాటును కలిగించుటకు రెండవ అర్థమును స్వీకరించుతాము. అనుపపత్తి కుదురు బాటును కలుగజేసే అర్థమును చెప్పే శబ్దానికి లక్షకమని పేరు. "గంగాయాం ఘోషః" అనే వాక్యం ఉన్నదనుకోండి. గంగలో ఘోషమున్నది. అని ఈవాక్యము వలన వెంటనే గోచరమవుతూఉన్న అర్థము. గంగాయాం అనే పదానికి గంగా ప్రవాహములో అనికదా అర్థము. ఘోషమనగా గొల్లపల్లె. అదిగంగాప్రవాహములో ఉండదు. కాబట్టి ఈ అర్థానికి కుదురు బాటు లేదు. దీని కుదురు బాటును సంపాదించ డానికై వేరొక అర్థమును ఇక్కడ గ్రహించాలి. మొదట గోచరమయిన ప్రవాహములో అనే అర్థమును త్యజించాలి, కాగా మన మిక్కడ గంగా తటమున ఘోషము" అనే అర్థమును గ్రహించుతున్నాము. ఈఅర్థము బాధితముకాదు. 'గంగాతటమున' అనే అర్థమును చెప్పే 'గంగాయాం' అనే పదము ఇక్కడ లక్షక పదమని గ్రహించాలి.

### వ్యంజకము

మొదటి అర్థము కుదురు బాటు పొందినప్పటికీ అచటి స్వరూప రమణీయతను బట్టి అనేకార్థములు గోచరములగును. అటువంటి అర్థములను చెప్పు శబ్దము వ్యంజకము. "సూర్యుడు అస్తంగతు డయినాడు" అని వాక్యము భాస్కరుడు అస్తమించినాడు. అని మొదటి అర్థము కుదురు బాటును పొందక పోవడము లేదు. అయినా తద్వాక్య శ్రవణానంతరము బాలుని గురించి దూరము వెళ్ళవలదని, వటువుని గురించి సంధ్యావందన సమయమయిన దని, నాయికనుగురించి నీప్రియుడు వచ్చినట్లె అని అనేకార్థములు తత్తద్వాచిత్వానుసారముగా

గోచరములవు తున్నవి. ఈ అర్థప్రతిపాదక మగు ఆ శబ్దము వ్యంజకమని విభావనచేయాలి. ఈ నిరూపణము వలన వాచ్య లక్ష్య వ్యంగ్యార్థముల స్వరూపము కూడా చెప్పినట్లైం.

తాత్పర్యార్థము అతిరిక్తము కాదు.

వాచ్యలక్ష్యవ్యంగ్యరూపమ యిన అర్థ త్రితయము ప్రసిద్ధ ముగా ఉన్నది. కొందరు తాత్పర్యార్థమను నాల్గవ అర్థ మును కూడా అంగీకరించుతారు. అదియుక్తము కాదు. తాత్పర్యార్థము కూడా వ్యంగ్యార్థమె కాని అంతకన్న అతి రిక్తము కాదు.

ఇచటి పూర్వోత్తర వాదములను ఈవిధముగా గ్రహిం చాలి. తాత్పర్యార్థము అతిరిక్తమని పలికేవారు ఈ విధ ముగా అంటారు. మీమాంసకులు అభిహితాన్వయ వాదు లని, అన్వితాభిధాన వాదులనీ, ద్వివిధముగా ఉన్నారు. వారిలో అభిహితాన్వయవాదులు తాత్పర్యమును అంగీకరించు తారు. అభిహితములగు పదములకు అన్వయము చెప్పువారు అభిహితాన్వయ వాదులని అర్థము. ఒకవాక్యములో ఉన్న పదములు తమతమ అర్థములను తెలియజేసి విరతము లవు తున్నవి. అనంతరము వాక్యము మొత్తముపైన ఒకఅర్థము గోచరమవుతున్నది. అది పదార్థము కాదు, వాక్యార్థము. పదార్థముల పరస్పర సంబంధాత్మకము. అందువలననే అది పదార్థముల సముదాయరూపము కాదు. పదములవలన గోచరమవుతూ ఉన్న అర్థముకంటె వాక్యమువలన గోచర మవుతూఉన్న అర్థము భిన్నము. ఈ అర్థమునె విశిష్టార్థమని అంటారు. ఇదె తాత్పర్యార్థమని అభిహితాన్వయ వాదుల భావము, అభిహితములయిన వాక్యములోని పదాలకు పర

స్వరమూ సమన్వయమును బోధించే అర్థము వేరుగా ఉన్నదని బోధించేవారు అగుటవలన వీరు సార్థక నాములు.

"ఘటమానయ" అనేవాక్యములో 'ఘటపదము' అమ్ అనే ద్వితీయావిభక్తి ప్రత్యయమూ, 'ఆజ్' అనేఉపసర్గ 'నీఞ్' ధాతువు, అనంతరము 'లిజ్' ప్రత్యయమూ, అనేవి ఉన్నవి. ఘటపదానికి ఘటమని అర్థము. ద్వితీయావిభక్తి ప్రత్యయమైన 'అమ్' అనే దానికి కర్మత్వము అర్థము. ఆజ్ ఉపసర్గకు అభివ్యాప్తి అర్థము, నీఞ్ ధాతువునకు నయనము ప్రాపణము అర్థము. తదుత్తరవర్తి ప్రత్యయానకి ప్రేరణ అర్థము ఇట్లా వేరువేరుగా పదార్థములు గోచరములవుతున్నవి. ఆయా పదాలలోని అభిధవలన ఆయా అర్థములు కలుగుతున్నవని భావము. ఈ అర్థములను బోధించి ఆపదాలలో ఉన్న అభిధ విరతమవుతున్నది. అనంతరార్థమును బోధించడములో అభిధకు సామర్థ్యము లేదు. ఇప్పటికి పదార్థములను కూడిక చేయగా 'ఘటము కర్మత్వము, అభివ్యాప్తి నయనము ప్రేరణ' అని తేలుతున్నది. ఇటువంటి అర్థము ప్రవర్తకమూ కాదు నివర్తకమూ కాదు. దీనివలన ప్రయోజనము లేదు.

'ఘటమానయ' మొదలగు వాక్యాలను విన్నవానికి ఇంత కన్న భిన్నమయిన అర్థము భాసించుతున్నది. అదే ప్రవర్తకము కాని నివర్తకము కాని అవుతున్నది. "ఘటకర్మకమగు ఆనయనమును ఒనరింపుము" అని అచటి విశిష్టార్థము. ఈ అర్థమును అభిధ బోధించలేదు. ఇది లక్షణా వేద్యమూ కాదు. ఇది వ్యంగ్యము కాదు, వాచ్యలక్ష్యవ్యంగ్యములకన్న అతిరిక్తము. ఇదె తాత్పర్యార్థము. తాత్పర్యము అనే వృత్తి

ఈ అర్థమును బోధించుతుంది. ఈ అర్థానికి తాత్పర్యార్థమని పేరు. అది సార్థకము కూడా "తస్మిన్ పరాః తత్పరాః తత్పరాణాం భావస్తాత్పర్యం" అని తాత్పర్య పదవ్యుత్పత్తి, విశిష్ట రూపమయిన వాక్యార్థము నందు ఆసక్తములయిన వాక్యములోని శబ్దముల ధర్మము తాత్పర్యమని తేలినది. ఇటు వంటి నాల్గవ అర్థము కప్పిపుచ్చడానికి శక్యము కాని దై మీమాంసకులచే అంగీకరింపబడి ప్రసిద్ధమై అందరి అనుభవములలోనూ భాసించునదై ఉండగా "వాచ్యలక్ష్య వ్యంగ్య రూపమున అర్థజాతము త్రివిధము" అని అనడము ఏవిధముగా కుదురుతుంది? అని పూర్వ పక్షము.

ఈ ఉపపాదనమంతా అప్రయోజకము. మీమాంసకులలో ఒక తెగకు చెందిన అభిహితాన్వయవాదులె ఈ విధముగా పలుకుతారు. మరియొక తెగకు చెందిన అన్వితాభిధానవాదులు ఈ విధముగా అనరు. సంసర్గరూపమయిన వాక్యార్థ ప్రతిపత్తికై తాత్పర్యమనె వ్యాపారాంతరమును అంగీకరింపవలసిన అవసరము లేదు. ఈ వాక్యార్థము వాక్య మహిమవలననె గోచరమవుతుంది ఆ కాంక్షా యోగ్యతా సత్తులు కలదివాక్యము. అటువంటి వాక్యము పదపదార్థముల సమన్వయశక్తి కలిగి ఉంటుంది. పదాంతరములతో అన్వయము పొందిన పదాలకు (అన్వితపదాలకు) అన్వయము వాదించువారు అన్వితాభిధానవాదులు. అన్వితాభిధాన వాదులు వాక్యార్థము వాచ్యమె అవుతుందని అంటున్నారు. పెద్దల వ్యవహారము వలన పిల్లలకు అర్థబోధ కలుగుతుంది. ఉత్తమ వృద్ధుడు ఒకడు 'ఘటమానయ' అనే వాక్యము ప్రయోగించితే ఆదర్థము తెలిసిన మధ్యమవృద్ధుడు ఒక

ర్యమును ఆచరించుచున్నాడు. దానిని చూస్తూ ఉన్న
లుడు "ఈ మొత్తము వాక్యానికి కలశమును తీసికొని
వడము అర్థము" అని గ్రహించును. ఈ వాక్యమును
న వెంటనే ఆ బాలునికి ఆ అర్థము గోచరించుచున్నది.
బట్టి ఆ అర్థము వాచ్యమె. అందువలన వాక్యార్థము
చ్యమె అని అన్వితాభిధానవాదుల వాదసారము. వాక్య
లోఉన్న అభిధ వాక్యార్థమును బోధించుతుంది. ఇట్లా
క్యార్థము ప్రతిపన్నమవుతూఉంటే తద్విజ్ఞానానికై వ్యాపా
ంతరమును అంగీకరింపవలసిన అవసరము లేదని తెలిసికోవాలి

తాత్పర్యపదవ్యుత్పత్తిని వాక్యార్థములో సమన్వయించి
ాపడము కూడా అసముచితము. ఈ వ్యుత్పత్తిలో తచ్ఛ
ము చే సంసర్గరూపమయిన వాక్యార్థము చెప్పబడదు. ఆ
చ్ఛబ్దమువలన రసాదిరూపమయిన సర్వప్రధానార్థముసే
హించాలి. రసాద్యర్థములోనే కవిసంరంభ విశ్రాంతి
ంటుంది. కాని సంసర్గరూపార్థములో కవిసంరంభవిశ్రాంతి
ండదు. ఈ రసాద్యర్థమును విషయముగా చేసికొను శబ్ద
లు తత్పరములు. వానిభావము తాత్పర్యము. రసాద్యర్థ
ను ప్రత్యాయితము చేయు పదార్థశక్తియె తాత్పర్యము.
ది అభిధ కాదు. లక్షణ కాదు వ్యంజనయె. ఈ తాత్పర్యా
ము కూడా వ్యంగ్యార్థమె కాని అతిరిక్తము కాదు.

తాత్పర్యార్థమని చెప్పదగిన అర్థము వ్యంగ్యమే. వాక్యార్థ
ను తాత్పర్యమనరాదు. వాక్యార్థము వాచ్యమే. ఈ
ధముగా అర్థత్రైవిధ్యమె ప్రసిద్ధము యుక్తిసిద్ధమూను.
బట్టి నాల్గవ అర్థము దీని కన్న వేరు గాలేదు. అని సమా
ానము.

## శబ్ద వృత్తులు

శబ్దము వృత్తి ద్వారముగా అర్థమును ప్రతిపాదించుతుందని ఇదివరలో చెప్పబడినది. ఆవృత్తియె వ్యాపారమని శక్తి అని అనబడును. వాచకశబ్దము అభిధావృత్తిద్వారమున వాచ్యమును లక్షకశబ్దము లక్షణావృత్తిద్వారమున లక్ష్యార్థమును వ్యంజకశబ్దము వ్యంజనావృత్తిద్వారమున వ్యంగ్యార్థమునూ బోధించును. ఇట్లా అభిధ లక్షణవ్యంజన అనే మూడు శబ్ద వృత్తులు ప్రసిద్ధములై ఉన్నవి.

### గౌణి - లక్షణ

గౌణవృత్తికూడా లక్షణా ప్రభేదమెకాని అన్యముకాదు. కొందరు గౌణవృత్తిని అతిరిక్తముగా అంగీకరించుతారు. వారి వాదము ఈవిధముగా ఉంటుంది.

గుణములను నిమిత్తముగా చేసికొని ప్రవర్తించే వృత్తికి గౌణవృత్తి అని పేరు. "అగ్ని ర్మాణవకః ముఖం చంద్రః" ఇత్యాదులు ఉదాహరణములు. ఈ ఉదాహరణములలో మాణవకునియందు అగ్నిత్వము ముఖమందు చంద్రత్వమూ సమారోపితమవుతున్నది. మాణవకుడు అంటె వటువు. వటువునందు పింగళత్వ పవిత్రత్వాది గుణములు ఉన్నవి. ఈగుణములను ఆధారముగా చేసికొని అగ్నిత్వము ఆరోపితమయినది. కాగా అగ్నిపదము వలన మాణవక బోధకలుగు తున్నది. మాణవక రూపార్థమును చెప్పడములో అగ్నిపదానికి సామర్థ్యము లేకపోయినా గుణాలు ఆసామర్థ్యమును సంపాదించు తున్నవి. ఇట్లాగే ముఖం చంద్రః అనే మొదలయిన స్థలాలలో కూడా గ్రహించాలి. ఇటు వంటిస్థలాలలో అగ్న్యాదిపదాలు గుణవృత్తిని ఆధార

ముగా చేసికొని మాణవకాద్యర్థములలో ప్రవర్తించుచున్నవి కాబట్టి ఇవి గుణవృత్త్యుదాహరణములు. అభిధాలక్షణా వ్యంజనోదాహరణములలో ఇటువంటి విశేషము కన్పడదు. కాబట్టి దీనిని వేరుగా అంగీకరించాలి అని.

ఇది యుక్తము కాదు. గుణవృత్తిని వేరుగా అంగీకరింప వలసిన అవసరము లేదు. గౌణవృత్తి కూడా లక్షణా ప్రభేదమె. లక్షణ సంబంధానుపపత్తి మూలకము. గౌణవృత్తి కూడా సంబంధానుపపత్తిమూలకమె. కాబట్టి అది లక్షణ కన్న భిన్నము కాదు.

"గంగాయాం ఘోషః" అనేది లక్షణోదాహరణముకదా! గంగాప్రవాహము నందు ఘోషాధికరణత్వము ఉపపన్నము కాదు. గంగలో ఘోషము ఉండడము కుదరదు. కాబట్టి ఘోషాధికరణత్వాత్మకమగు అనుపపత్తి ఉన్నది. "గంగా తటమున ఘోషము" అనే లక్ష్యార్థమును అక్కడ అంగీకరించుచున్నాము. వాచ్యార్థమయిన ప్రవాహానికి లక్ష్యార్థమయిన తటానికీ సామీప్యసంబంధము ఉన్నది. ఇట్లా లక్షణాస్థలములలో సంబంధానుపపత్తులున్నవని గ్రహించాలి.

అగ్నిర్మాణవకః అనే గౌణవృత్త్యుదాహరణములో, అగ్ని కానివానియందు అగ్నిపదప్రయోగము ఉపపన్నము కాదు. ఇటువంటి అనుపపత్తి ఉన్నది. అగ్నిగుణములు మాణవకునియందు ఉండడమును బట్టి అగ్నిసాదృశ్యమును అక్కడ గ్రహించాలి. అందువలన అక్కడ సాదృశ్య సంబంధము ఉన్నది. మొత్తముమీద ఈ రెండు ఉదాహరణములలోనూ సంబంధము అనుపపత్తి అనేవి ఉన్నవి. కాబట్టె గౌణిని వేరుగా పరిగణింప నక్కరలేదు. సంబంధము ఒకచోట సామీప్యరూ

పము వేరొకచోట సాదృశ్యాత్మకము. ఇది అత్యంతమూ భేదకముకాదు. ఈ కొంచెపు అవాంతరభేదము ఉండడము వలననే గౌణి లక్షణాప్రభేద మవుతున్నది.

ఈ విషయములో ఒక శంక. గౌణికి లక్షణకూ ఈ చెప్ప బోవు ఒకింత భేదము ఉన్నదని అనవచ్చును. "అగ్నిర్మాణ వకః" అనే గౌణీఉదాహరణములో అగ్నిసాదృశ్యవిశిష్టమాణ వకుడు అని అర్థము. అగ్నిసాదృశ్య విశిష్టత్వమనేది అగ్నిపద లక్ష్యార్థము. ఈ లక్ష్యార్థములో సంబంధమయిన సాదృశ్యము విశేషణముగా అన్వయము పొందుతున్నది. "గంగాయాం ఘోషః" అనేలక్షణోదాహరణములో లక్ష్యమయిన తటము నందు సామీప్యసంబంధము విశేషణముగా అన్వయము పొందడములేదె! "గంగా తటమున ఘోషము" అనేకదా అక్కడి అన్వయము! కాగా ఈ రెండూ సంబంధమూలకముగా ఎట్లా సామ్యమును పొందగలుగు తవి ? అని.

ఇది యుక్తముకాదు. లక్షణలో కూడా సంబంధము విశేషణముగా అన్వయము పొందక పోవడములేదు. గౌణి ఉదాహరణములో అగ్నిసాదృశ్యము మాణవకుని యందున్నది. కాబట్టి "అగ్నిర్మాణవకః" అనే చోట అగ్నిసాదృశ్యవిశిష్ట మాణవక ప్రతిపత్తి వివక్షితమవుతున్నది. అట్లాగే "గంగాయాం ఘోషః" అనే చోట గంగాసంబంధవిశిష్ట తీర ప్రతిపత్తియేవివక్షితము. గంగాసంబంధము అవశ్యముగా తీరములోభాసించితీరాలి. తటము గంగాశబ్దము వలననె బోధింపబడుతున్నది. ప్రవాహము గంగాపదబోధ్యము, అనడము ప్రసిద్ధమె. తట ప్రవాహములు రెండూ ఏకపదబోధ్యము లవుతున్నందువలన తటములో ప్రవాహాత్మకత ఉండితీరుతుంది.

ఇదే గంగా సంబంధ విశిష్టత్వము అని గ్రహించాలి. ఏక శబ్దము వలన తెలియబడు స్రోత స్తీరములకు తాదాత్మ్యము గోచరమవుతుంది. అందువలననె అత్యంత పావనత్వ శీతత్వాది ప్రవాహధర్మాలు తీరాన భాసించును. అప్పుడే ప్రయోజన సిద్ధి కలుగుతుంది. ఈ విధముగా అంగీకరించడమె సముచితము. ఈ విధముగా అంగీకరించక పోయినట్లయితె ప్రయోజనములు సిద్ధములు కావు. గంగాగతములయిన శీతత్వాది ప్రయోజనాలు ఘోషములో భాసించవలె అనే అభిప్రాయముతోనే "గంగాయాం ఘోషః" అని లాక్షణిక ప్రయోగము చేయబడినది. ఇటువంటి స్థలంలో కూడా గంగాపదమును ఉపలక్షణముగా తలచడము యుక్తము కాదు. ఉపలక్షణముగా తలచినప్పుడు 'ఇది సముద్రాది తీరము కాదు. గంగాతీరమె.' అని గంగాసంబంధము మాత్రమె గోచరమవుతుంది గాని తీరద్వారమున ఘోషగత పవిత్రత్వాదులు సిద్ధించవు. ప్రయోజన ప్రతిభానములేక కేవల గంగా సంబంధము మాత్రమె అభిలషితమయినప్పుడు "గంగాతీరే ఘోషః" అనే ముఖ్యశబ్దాభిధానముకంటె "గంగాయాం ఘోషః" అనే లాక్షణికప్రయోగములో భేదమేమీ లేక పోతుంది. ముఖ్యలాక్షణిక ప్రయోగాలకు భేదముఉండడము ఉచితము. భేదము అక్కరలేదనడము యుక్తము కాదు. అట్లాగే అయితె ముఖ్యశబ్దము ఉండగా లాక్షణికమును ఎందుకు ప్రయోగించాలి ? తత్ప్రయోగానికి అవకాశమె ఉండదె ? కాగా గౌణిలో మాదిరిగా లక్షణలో కూడా సంబంధము విశేషణముగా అన్వయము పొందడము సమానమె. అందువలన గౌణవృత్తి కూడా లక్షణాప్రభేదమె.

## లక్షణా భేదములు

గౌణీలక్షణలలో ఇటువంటి నిమిత్తభేదము ఉన్నది. అయినా గౌణీలక్షణలో అంతర్భవించు తుంది, కాబట్టే లక్షణ సాదృశ్య నిబంధనమని సంబంధ నిబంధనమని రెండువిధాలు. సంబంధ నిబంధనకము ౹యిన లక్షణకూడా జహద్వాచ్య అని అజహద్వాచ్య అని రెండువిధాలు. సాదృశ్యనిబంధనకమయిన లక్షణ సారోప అని సాధ్యవసాన అని ద్వివిధము. ఇట్లా లక్షణ చతుర్విధ మవుతున్నది. వీని నామములను ఈ విధముగా గ్రహించాలి.

౧ సంబంధ నిబంధన జహద్వాచ్య లక్షణ
౨ సంబంధ నిబంధన అజహద్వాచ్య లక్షణ
౩ సాదృశ్య నిబంధన సారోప లక్షణ
౪ సాదృశ్య నిబంధన సాధ్యవసాన లక్షణ

వీని స్వరూపములు ముందుముందు విశదములగును. ఈ లక్షణా గౌణీ విషయములోని చర్చ గ్రంథాంతరములలో వేరొక విధముగా ఉన్నది. వానిని అక్కడనే చూడాలి. వాని వలన ప్రకృతము అంతగా ఉపయోగము లేదు. అందువలన వానిని ఇక్కడ నిర్దేశించడము లేదు.

## కైశిక్యాదులు శబ్దవృత్తులుకావు

కైశికీవృత్తి ఆరభటీవృత్తి సాత్వతీవృత్తి భారతీవృత్తి అని నాలుగు వృత్తులు ఉన్నవి. కాని అవి శబ్ద వృత్తులు కావు. శబ్దసందర్భాశ్రితములు. అవి కేవలమూ రచనను ఆశ్రయించి ఉంటవి. రసావస్థితిని సూచించుతవి. వృత్తి పద సామ్యమున వానిని వీనిలో కలుపరాదు. రసాద్యను గుణములై సముచితార్థ వ్యాపారములుగా ఉండేవి కైశిక్యాది

వృత్తులని, రసాద్యనుగుణములైన సముచిత శబ్ద వ్యాపారము లుగా ఉండేవి వైదర్భ్యాదిరీతులని ధ్వన్యాచార్యులు పలుకు తున్నారు వారి భావమును అనుసరించి కైశిక్యాదులు అర్థ ప్రధానము లయినా శబ్దములు అకడకూడా నాంతరీయక ములుగా ఉంటవి కాబట్టి వైదర్భ్యాది రీతిసాపేక్షత ఉన్న దని ధనికాదులు ప్రతిపాదించినారు. వారి విధానమును బట్టి కైశిక్యాదులు రచనాశ్రితములు అని అనడమూ యుక్తమే.

రచనకూడా రసవ్యంజక మగుట ప్రసిద్ధముగా ఉన్నది. కైశిక్యాదుల రసవ్యంజకత్వము రచనాధీనముగా ఉన్నది. కాని విభావాదులె రసవ్యంజకములనడము సముచితార్థము. రచన మొదలయినవి విభావాదులకు సహకారులు. ఇటువంటి సహకారిత్వము ఉండడమును బట్టి రసవ్యంజకము లని అన డము కూడా అయుక్తము కాదు. రచన రసానుగుణము కాక పోతే దుష్టమవుతుంది. అనుగుణవర్ణరచన రసవ్యంజకము కావడమూ అననుగుణ వర్ణరచన రసవ్యంజకము కాకపోవ డమూ అనుభవసిద్ధము. దీనిని అనుసరించి పరిశీలించగా కైశిక్యాదుల రసవ్యంజకత రచనాధీనమని స్పష్టము. వైద ర్భ్యాదిరీతుల స్వరూప వివేచనము ముమ్ముందు విశదమవు తుంది. వైదర్భి గౌడి పాంచాలి అనేవి రీతి విశేషాలు కాని అవి వృత్తులలో అంతర్భవించవు అని గ్రహించాలి.

## అభిధ

ఇప్పటికి శబ్దజాతము అర్థజాతమూ నిరూపితమయింది. ఇక శబ్దములలోని వ్యాపారములను ప్రతిపాదించవలసిఉన్నది. వరుసగా అభిధ లక్షణ వ్యంజన అనేవానిని ఉద్దేశ క్రమాను సారముగా నిరూపించు తాము.

సంకేతితార్థగోచరమగు శబ్దవ్యాపారము అభిధఅవుతుంది. సంకేతము కలది సంకేతితము. శబ్దము, అర్థము వీనికి కల సంబంధనిశ్చయము సంకేతమనబడును. సంకేతితమయిన అర్థము సంకేతితార్థము. సంకేతితార్థమును విషయముగా చేసికొనిన శబ్దమందలి వ్యాపారమునకు అభిధ అని పేరు. సంకేతితమయిన అర్థము జాతిగుణ ద్రవ్యక్రియాత్మకమై నాలుగు విధములుగానుండును. గోత్వాదికముజాతి శుక్లాదికముగుణము చైత్రమైత్రాదిసంజ్ఞ ద్రవ్యము పాకాదికము క్రియ.

లక్షణకాని వ్యంజనకాని సంకేతితార్థగోచరములుకావు. అందువలననె అవి శబ్దవ్యాపారములె అయినా వానియందు ఈ అభిధాలక్షణమునకు అతివ్యాప్తి లేదు. చేష్టలు సంకేతితార్థగోచరములె అయినా అవి శబ్దవ్యాపారములు కావు, కాబట్టి ఈ అభిధా లక్షణానికి చేష్టలలో అతి వ్యాప్తికలుగదు. అన్వితాభిధానవాదులు లక్షణలో కూడా సంకేతము ఉన్నదంటారు. కాబట్టి అక్కడ కూడా సంకేతి తార్థగోచరత్వము ఉన్నది. అంతమాత్రాన ఈ లక్షణానికి లక్షణలో అతివ్యాప్తిని ఊహింపరాదు. లక్షణ శబ్ద వ్యాపారము కాదు. అభిధ శబ్ద వ్యాపారము కదా! శబ్దవ్యాపారపదమువలన ఆ అతివ్యాప్తి నిరాసము కలుగుతుంది. ఇది అన్వితాభిధాన వాదుల మతమును అనుసరించి చెప్పినమాట. లక్షణ శబ్ద వ్యాపారమని ఇది వరలో చెప్పబడినది. ఇప్పుడు అది శబ్ద వ్యాపారము కాదు అని అంటున్నాము. ఈ విషయము ముమ్ముందు విశదమవుతుంది.

ఇటు వంటి ఈ అభిధ రెండు విధాలు. రూఢిపూర్వక అని యోగపూర్వక అని. అవయవార్థ మని సముదాయార్థ మని

అర్థము రెండువిధాల ఉంటుంది. పదముల వ్యుత్పత్తి బలమున కలిగే అర్థానికి అవయవార్థమని పేరు. వ్యుత్పత్త్యర్థము కానిది సముదాయార్థము. కుంభకారుడు అనేపదమువలన కులాలుడు అనే అర్థము కలుగుతున్నది. "కుంభం కరోతీతి కుంభకారః" అని కుంభకార పదవ్యుత్పత్తి. తద్బలమున కలిగిన కులాల రూపార్థము అవయవార్థమనబడును. కుశలుడు అనే పదానికి నిపుణుడు అని అర్థము. 'కుశాన్ లాతీతి కుశలః' దర్భలను కోయువాడు అని కుశలపదవ్యుత్పత్తి. నిపుణుడు అనే దీని అర్థములో వ్యుత్పత్త్యర్థము కలియడము లేదు. కాబట్టి ఇది సముదాయార్థము. అనాదిలోకప్రసిద్ధిని అనుసరించి కొన్ని పదాలకు సముదాయార్థమె చెప్పబడుతున్నది. అటువంటి చోట రూఢిపూర్వక అయిన అభిధ ఉన్నదని గ్రహించాలి. అవయవార్థముఉన్న చోట శబ్దములలో యోగపూర్వికఅయిన అభిధ ఉంటుందని గ్రహించాలి.

రూఢిపూర్వక ఉదా:—

తపోవిశేషైః ప్రథితైః ప్రజానాం కృచ్ఛ్రైశ్చరిత్రైర్జగతీ మహాఘ్యైః
భాగ్యైః ప్రభూతైర్భువనస్య చాస్య బిభర్తి రాజ్యం పంపీరుద్రః

ప్రసిద్ధములయిన ప్రజల కృచ్ఛ్రచాంద్రాయణాది తపోవిశేషములచేతా భూకాంతయొక్క గౌరీవ్రతాది శుభచరితముల చేతా ఈ భువనముయొక్క ప్రభూత భాగ్యములచేతా వీరరుద్రుడు రాజ్యమును భరించుతున్నాడు. ఈ పద్యములో శబ్దములన్నీ రూఢములు, దీనిలో తప, ప్రభృతి శబ్దాలకు అవయవార్థము లేదు. అనాది కాలమునుండి అవి సముదాయార్థ బోధకములుగానె ఉన్నవి. "ప్రకృష్టేన జాయంత ఇతి ప్రజాః" అని ప్రజాది శబ్దాలకు అవయవార్థము ఉన్నా

"రూఢి ర్యోగమపహరతి" రూఢ్యర్థము యోగార్థమును తిరోభానించుతుంది. అనే నియామాన్నిబట్టి రూఢ్యర్థమునే గ్రహించాలి. ప్రజాశబ్దము వ్యుత్పత్తిబలాన అర్థాంతరమును ఏమాత్రమూ బోధించడము లేదు. పంకజాదిపదాలవలె ఇది రూఢమె.

యోగపూర్వక ఉదా:—

రాజ్ఞి రుద్రనరాధీశే రంజయత్యఖిలాః ప్రజాః
భూ రన్వర్థా వసుమతీ రత్నగర్భా స్థిరేతిచ.

రాజయిన రుద్రనరాధీశుడు నిఖిల ప్రజలకూ రంజనము చేస్తూ ఉండగా భూమి వసుమతి, రత్నగర్భ స్థిర అని అన్వర్థ నామములు కలది అయినది. "రంజయతీతి రాజా" రంజనము చేయువాడు రాజు. "వసు ధన మస్యామ స్తీతి వసుమతీ" వసు వనగా ధనము. అది దీనియందు ఉన్నది. కాబట్టి ఇది వసుమతి "రత్నాని గర్భేయస్యాస్సా రత్నగర్భా" రత్నాలు గర్భమందు కలది రత్నగర్భ. "తిష్ఠతీతి స్థిరా" ఉండునది కావున స్థిర. ఈ అవయవార్థములు ఆ యా శబ్దములలో ఉన్నవి. కాబట్టి అవి యౌగికములు. ఇంకా ఇక్కడ యోగరూఢాది విశేషములను ఇతర స్థలములలో గ్రహించాలి.

లక్షణ

వాచ్యార్థము అనుపపన్న మయినపుడు వాచ్యార్థమునకు సంబంధించిన అర్థవిషయమై ఆరోపితశబ్ద వ్యాపారము లక్షణ అవుతుంది. "గంగాయాం ఘోషః" అనే ఉదాహరణములో వాచ్యార్థమయిన ప్రవాహము ఉపపత్తి సంపాదకము కాలేదు. ప్రవాహసంబంధము ఉన్న తటము విషయమై శబ్ద వ్యాపారము ఆరోపితమవుతున్నది. కాబట్టి అక్కడ లక్షణ

ఉన్నది. శబ్దము ఒక అర్థమును చెప్పగానే దాని వ్యాపారము ఉపరతమవుతున్నది. కాబట్టి ఆశబ్దము అర్థప్రతిపాదనములో. వ్యాపారాంతరమును పొందలేదు. గంగాశబ్దము ప్రవాహ రూపార్థమును చెప్పి ఉపరత మయింది. మళ్ళా గంగాశబ్దము తటరూపార్థమును చెప్పలేదు. దానియందు వేరొక వ్యాపార మును స్వీకరించుట యుక్తముకాదు. కాబట్టి అక్కడ అర్థమె లక్షకము. అందుచేత లక్షణ అర్థవ్యాపారమే కావాలి. కాని వాచ్యధర్మము వాచకమునందు ఉపచరిత మవుతుందని నియమ మున్నది. తదనుసారముగా ఇక్కడ అర్థధర్మమయిన లక్షణ వాచకమగు శబ్దమునందు ఉపచరిత మవుతున్నది. అందుచే లక్షణ శబ్దవ్యాపారము కావచ్చును.

లక్షణను అంగీకరించడములో హేతువులు మూడు ఉన్నవి. అవి లక్షణాబీజములు అనబడును. ముఖ్యార్థబాధ ముఖ్యార్థసంబంధము ప్రయోజనము అనేవి లక్షణా బీజములు. లక్షణాబీజములు లేనిపోతే లక్షణను అంగీకరించరాదు. "గంగాయాం ఘోషః" అనే స్థలములో లక్షణా బీజత్రయమూ ఉన్నది. అందుచేత అక్కడ లక్షణను అంగీకరించ డము సముచితమె. పై ఉదాహరణములో ప్రవాహరూప మయిన ముఖ్యార్థము బాధితమవుతున్నది. లక్ష్యముగా అంగీక రించే తటానికీ ముఖ్యార్థమయిన ప్రవాహానికీ సామీప్యసంబం ధము ఉన్నది. కాబట్టి ముఖ్యార్థసంబంధము ఉన్నట్లు భావిం చాలి. శీతత్వపావనత్వాది ప్రయోజనాలు అక్కడ భాసించు తున్నవి. ఇట్లా ప్రయోజనముకూడా ఉన్నది. ఈ విధముగానే ఇతరోదాహరణములలో కూడా గ్రహించాలి.

మొదట చెప్పిన విభాగక్రమమును అనుసరించి లక్షణా భేదములను ఉదాహరించుతాము. వానిలో మొదటి భేదము సంబంధ నిబంధన జహద్వాచ్యలక్షణ. వాచ్యార్థము ఎక్కడ సర్వథా విడిచి పెట్టబడుతుందో అది జహద్వాచ్య, దీనినె జహల్లక్షణ అంటారు. వాచ్యార్థము ఉపయుక్తము కానందు వలన ఇందు విడువబడును. ఉదా:—

జేతుః కాకతిభూభర్తు రాకర్ణ్య పటహధ్వనిం,
సామంతనగరాణ్యుచ్చై రాక్రోశంతి సమంతతః.

జయశీలుడయిన కాకతిభూపతి పటహధ్వనిని విని సామంత నగరములు అంతటా ఉచ్చైస్స్వరముతో ఆక్రోశిస్తున్నవి. దీనిలో ఆక్రోశనమనేది ప్రాణిక్రియ. అచేతనమయిన నగరానికి సంబంధించదు. సామంతనగరములు బాగా ఆక్రోశిస్తున్నవి. అనే వాచ్యము అనన్వితము. ఆక్రోశన సిద్ధికొరకై నగర శబ్దము స్వార్థమును త్యజించుచున్నది. స్వనివాసి ప్రాణులను లక్ష్యముగా చేస్తున్నది. నగరస్థితజనులు ఆక్రోశనము చేస్తున్నారు. అని లక్ష్యార్థము. ఈ అర్థములో, వాచ్యమయిన నగరరూపార్థము జహద్రూపము అయినందు వలన జహత్స్వార్థ అని గ్రహించాలి.

అజహల్లక్షణకు ఉదాహరణము—జహల్లక్షణలో మాదిరిగా దీనిలో వాచ్యార్థము కేవలమూ విడిచిపెట్టబడదు. లక్ష్యార్థములో వాచ్యార్థము మిళితమై ఉంటుంది.

పత్యుః కాకతినాథస్య పాదపీఠీ మనారతం
స్ఫురద్రత్న ప్రభాజాలై రలంకుర్వంతి మౌళయః.

ప్రభువయిన కాకతినాథుని పాదపీఠమును శిరములు స్ఫురించుతున్న రత్నప్రభల సమూహాములతో అనవరతమూ అలంకరించు తున్నవి. ఇక్కడ మౌళయః అనేది లక్షకపదము. కేవలమూ శిరములు అలంకారమును సంపాదించలేవు. అలంకు ర్వంతి అని ఇక్కడ అలంకారము చెప్పబడినది. ఆ అలంకార సిద్ధికై మౌళులు తమకు ఆశ్రయభూతులయిన నృపతులను లక్ష్యముగా చేస్తున్నవి. నృపతులు మౌళిసహితులు. లక్ష్యములో వాచ్యముకూడా మిళితమై ఉన్నది. వాచ్యము జహ ద్రూపము కాలేదు. కాబట్టి అజహత్స్వార్థ అని గ్రహించాలి. స్వార్థమును విడిచి స్వార్థసహితార్థాంతరమునందు లక్షణ ఉన్నది.

ఇక్కడ అభిధచే స్వార్థము చెప్పబడదు. అట్లే అయితే స్వార్థములో అభిధ అంశాంతరములో లక్షణ అవుతుంది అప్పుడు ఒకే శబ్దానికి ఒకే సమయములో వృత్తి(వ్యాపార) ద్వయము ఆపన్నమవుతుంది, ఆవిధముగా సమసమయములో వ్యాపారద్వయము ఉంటుందనడము యుక్తముకాదు. స్వార్థమును అభిధనుండి విడదీసి లక్ష్యముగా స్వీకరించాలి. అప్పుడే అజహత్స్వార్థ అనే వ్యపదేశము సముచితమవుతుంది. ఇంకా ఈ విషయములో అబాల సులభప్రసంగాలను ఆకర గ్రంధములలో దర్శించాలి.

సారోపనిబంధన సారోప లక్షణ ఉదా:—

మంథానాచల మూలమేచక శిలాసంఘట్టన శ్యామికా
కారం యత్తుహినద్యుతౌస్ఫురతి తత్సారంగ మాచక్షతే
మన్యే నన్విహ వీరరుద్రనృపతేః కీర్తిశ్రియా నిర్జితః
తన్మూఢాంక వరాహ మిందురు రసావి త్రత్సముజ్జృంభతే,

చంద్రునిలో, సముద్రమథనానికై కవ్వముగాఅయిన మంథర పర్వతముయొక్క మూలనీల శిలాసంఘట్టనము వలన అయిన శ్యామికాకారము కన్పడుతున్నది. దానిని కొందరు సారంగమని అంటున్నారు నేను ఇట్లా అనుకుంటాను. వీరరుద్ర నృపతి కీర్తిశోభచేత చంద్రుడు పరాజితుడయినాడు. ప్రతాపరుద్రుని ముద్రాంకమయిన వరాహమును ఉరమున ధరించుతూ సముజ్జృంభించుతున్నాడు. కాగా చంద్రునిలోనినలుపు ప్రతాపరుద్ర ముద్రాంకవరాహము. ఈ పద్యములో చంద్రకళంకరూపమయిన సారంగమందు వరాహత్వము సమారోపిత మవుతున్నది. అందువలన సారోప.

విషయమూ విషయి రెండూ శబ్దోపాత్తములై ఉండగా అభేదప్రతిపత్తి కలిగినట్లయితే సారోప అవుతుంది "అగ్నిర్మాణవకః" అనే చోట ప్రకృత మాణవకుడు విషయము. అప్రకృతవహ్ని విషయి. ఈ రెండూ సామానాధికరణ్యమున అనగా సమానవిభక్తికములుగా ఉపాత్తము లయినవి. "అగ్న్యభిన్నో మాణవకః" అని అభేదప్రతిపత్తి (జ్ఞానము) కలుగుతున్నది. అందువలన ఇది సారోప. ప్రకృతోదాహరణములో చంద్రకళంక కురంగము విషయము, ముద్రాంక వరాహము విషయి. రెండిటికీ అభేదప్రతిపత్తి కలుగుతున్నది. కాబట్టి సారోప.

విషయము ఉపాత్తము కాక విషయిచే నిగీర్ణమయినప్పుడు అభేదప్రతిపత్తి కలిగినట్లయితే అధ్యవసానము అని అనబడుతున్నది. "అగ్నిర్మాణవకః" అన్నట్లు విషయమూ విషయీ రెండూ ఉపాత్తములు కాకుండా "అగ్నిః" అని విషయి మాత్రమె శబ్దోపాత్తమయినప్పుడు మాణవకరూప

మయిన విషయము నిగీర్ణమవుతుంది. అట్లా నిగీర్ణమాణవకుని యందు అగ్న్యభేదప్రతిపత్తి కలుగుతుంది. ఆవిధముగా . ఉదాహరణము నకు అధ్యవసాయమని పేరు విషయము ఆరోప విషయమని విషయి ఆరోప్యమాణమని కూడా వ్యవహారము ఉన్నది సాదృశ్య నిబంధన సాధ్యవసాయ లక్షణ ఉదా:—

కాకతీయ కులాంభోధేః ప్రభవత్యేష చంద్రమాః
కృతః కువలయోల్లాసో యే నోదయ ముపేయుషా.

కాకతీయకుల సముద్రమునుండి ఈచంద్రుడు ఉదయించు తున్నాడు. ఉదయము పొందిన ఈతడు కువల యోల్లాస మొన రించుతున్నాడు. కువలయోల్లాస పదానికి రెండర్థాలు. చంద్రుడు కువలయములకు కలువలకు సముల్లాసమును సంపాదించు తున్నాడని ఒకటి చంద్రపదముచే అధ్యవసితుడయిన ప్రతాప రుద్రుడు భూవలయమునకు ఉల్లాసమును ఇస్తున్నాడని రెండ వది. దీనిలో ప్రతాపరుద్రుడు విషయము. చంద్రుడు విషయి ప్రతాపరుద్రుడు నిగీర్ణుడయినాడు. శబ్దముచే వేరుగా చెప్ప బడలేదు. చంద్రశబ్దముననె చెప్పబడు తున్నాడు. చంద్రుడుగా అధ్యవసితు డవుతున్నాడు. చంద్రాభేద జ్ఞానము అక్కడ కలుగుతున్నది. కాబట్టి సాధ్యవసాయ.

శ్లోకములో "ఏషచంద్రమాః" అని ఉన్నది. ఏషః అనే పదమున ప్రతాపరుద్రుడు చెప్పబడడు. అట్లే అయితే అది కూడా సారోపయె అవుతుంది కాని సాధ్యవసాయ కానేరదు. "ఏషః" అనే పదము ఆరోప్యమాణము యిన చంద్రునిలో విశేషణము, • అది చంద్రునిలో అభేదమున అన్వయించు తున్నది. అది విషయవాచకము కాదు. అందువలన అధ్యవసా యితకు భంగము లేదని గ్రహించాలి.

ఈ పద్యములోనే కాకతీయకులాంభోధి అని సారోప కూడా ఉన్నది. కాకతీయకులము అంభోధి అనే విషయము విషయి రెండూ శబ్దోపాత్తములయినవి. విషయి విషయములకు అభేదము గోచరమవుతున్నది. ఈ విధముగా పద్యములో లక్షణాంతరముకూడా సంబంధించి ఉండడము వలన విచ్ఛిత్తి విశేషము ఉన్నదని తెలుసుకోవాలి.

## వ్యంజన

ఈ విధముగా అభిధా లక్షణా రెండూ నిరూపితములయినవి. ఇక వ్యంజన క్రమ ప్రాప్తమవుతున్నది. దానిని నిరూపించాలి. ఆ యాయాపదాలచే చెప్పబడిన ఆయా పదార్థములు ఆకాంక్షాది వశమున పరస్పరమూ సంబంధముకలవై అన్వయము పొందిన అనంతరము [సమన్వయశక్తికిలిగి వాక్యార్థము ప్రతీతమయిన పిమ్మట ప్రకరణాదివశమున ప్రాకరణికార్థము పర్యవసితము కాగా] కావ్య శరీర భూత వాక్యార్థమును ఉపస్కరించడము (శోభింప చేయడము) లో సమర్థమైన, వాచ్యల వ్యుత్పత్తి రిక్తార్థాంతరమును గోచరముచేయునట్టి శబ్దవ్యాపారము వ్యంజన అవుతుంది. ఈ వ్యంజన అభిధానంతరము సముల్లాసము పొందుతుంది. తాత్పర్యము వేరుగా ఉన్నదని అంగీకరించేవారు కూడా వ్యంజన తాత్పర్యానంతర భావి అని అంగీకరింపవలసి ఉన్నది. లక్షణకు కూడా అనంతరమే ఈ వ్యంజన సముల్లసించుతుంది. లక్షణ తాత్పర్యశక్తి సమన్వితమైన అర్థమును విధురీకరించుతుంది. కాబట్టి తదనంతర భావియే కాని సర్వోత్తీర్ణము కాదు. సకల వ్యాపారములూ ఉడిగి పోయినపిమ్మట శోభాధాయకార్థ ప్రతిపాదనము చేయడానికి వ్యంజన సముల్లాసము పొందుతున్నది. కాబట్టి

వ్యంజన సర్వోత్తీర్ణము. వాచ్యలక్ష్యములకంటె అతిరిక్త మయిన అర్థము వ్యంగ్యము. దానిని ఈ వ్యంజన ప్రతిపాదించు తుంది.

వ్యంగ్య రహితమయిన కావ్యము అనాత్మక శరీరము (శవ శరీరము) వలె అరమణీయము. ఈ వ్యంజనా ప్రతిపాద్య మయిన అర్థము కావ్యశరీరమయిన వాక్యార్థమును ఉపస్కరించుతుంది. వ్యంజన శబ్దవ్యాపారమని అనడము కేవలమూ ఉపలక్షణము. అర్థము కూడా వ్యంజకమె. అర్థము తెలియబడని గీతాది కేవల శబ్దాలు కూడా వ్యంజకములె. నిరర్థకములయిన శబ్దములు వ్యంజకములని ఇక్కడ నిర్దిష్ట మవుతూనే ఉన్నది. శబ్దముచే ప్రతిపాద్యము కాని అర్థము కూడా వ్యంజకమని అంగీకృతము. కాగా వ్యంజనయందు శబ్ద వ్యాపారత్వము అర్థవ్యాపారత్వమూ ఉన్నదని గ్రహించాలి.
ఈవ్యంజన మూడువిధాలు. శబ్దశక్తిమూలకము, అర్థశక్తి మూలకము ఉభయశక్తిమూలకమూ అని.

శబ్దశక్తిమూలకవ్యంజన

హర్యాదిపదములు నానార్థకములు. అవి ప్రకృతార్థమును అప్రకృతార్థమునూ బోధింపగలవు. వాని యందున్న అప్రకృతార్థమును తెలియజేసే శక్తి ప్రకరణాది బలమువలన నివారిత మవుతున్నది. అప్పుడవి ప్రకృతార్థమును మాత్రమె చెప్పగలవు. అయినా అప్రకృతార్థము గోచర మవుతున్నది. దానిని చెప్పడానికి వ్యంజనే కావాలి. ఇటువంటి స్థలములలో వ్యంజన శబ్దశక్తి మూలకము. ఉదా:—

వాహిన్యః కాకలీం ప్రస్య సర్వతోముఖ సంభ్రమాః,
సర్వం త్యుద్యత్కటంఘాఘ్యం ప్రతిపక్షబలాద్భవం.

కాకతీంద్రుని సేనలు అన్నిముఖములా సంభ్రమముకలవై శత్రుబల సముద్రమును అతిశయించిన కబంధములచే పరిపూర్ణముగా చేస్తున్నవి. ఇది ప్రకృతార్థము. నదులు ఉదక సంభ్రమము కలవై అర్ణవమును జలబంధ సమృద్ధముగా చేస్తున్నవి. అని అప్రకృతార్థము. ఈపద్యములో వాహినీ సర్వతోముఖ కబంధ శబ్దములు నానార్థకములు. వీనికి సైన్యము సర్వవ్యాపిత్వము లూ నమస్తక దేహమూ అని క్రమముగా ప్రకృతార్థములు. నది జలము ఉదక బంధము అనేవి అప్రకృతార్థాలు. వాహిన్యాదిపదాలు రెండర్థాలను చెప్పడానికి సమర్థములె అయినా అప్రకృతనదీజల వాచకత్వము అర్థప్రకరణాదికముచే నియంత్రిత మవుతున్నది. వాహిన్యాదిపదాలశక్తి ప్రకృతార్థము నందె నియమితమవుతున్నది. అది ఎంతగా నియమితమయినా నదీజలప్రతిపత్తి కలుగుతూనే ఉన్నది. దానిని కలుగ జేయడానికి శబ్దశక్తి మూలకమయిన వ్యంజనయే సమర్థము. అభిధ ఈ అప్రకృతార్థ ప్రతిపత్తిని కలుగిచేయలేదు. కేవలమూ ప్రాకరణికార్థములో పర్యవసానము పొందుతూ ఉన్న అభిధకు ఈ అర్థప్రతిపాదనములో శక్తి ఉండదు కదా! అప్రాకరణికార్థము వలన వాక్యార్థానికి శోభకలగాలని వక్తకు వివక్ష ఉన్నది. కాబట్టే అప్రకృతము గోచరమవుతున్నది. అటువంటి ఆ అప్రకృతము ఇతరములవలన గోచరము కాదు. దానికొరకైవ్యంజనను అంగీకరించాలి. ఆవ్యంజన ప్రసిద్ధవ్యాపారా తిరిక్తమయిన వ్యాపారాంతరము. ఇది ఇటువంటి స్థలములో శబ్దమును విడిచిపెట్టి ఉండదు. అందువలన ఈవ్యంజన శబ్దవ్యాపారమె అని నిశ్చితము.

పోనీ! లక్షణవలన ఆ అర్థము గోచరము కావచ్చుకదా. అంటారేమో? అది యుక్తము కాదు. వాచ్యార్థములో అనుపపత్తి లేనందువలన లక్షణకూడా ఇక్కడ ప్రసక్తము కాదు. రూఢ్యతిరిక్త స్థలములో ముఖ్యార్థ బాధలేనప్పుడు లక్షణ ప్రసరించడము ఉండదు.

ఇంతగా అభిధవలనా గోచరము కాక లక్షణవలనా గోచరము కాకుండా ఉండే అర్థము దేనికి? ఈవిధముగా ఒకే వాక్యానికి అనేకార్థములను కల్పించడము కూడా దోషమే అవుతుందేమో! అనికూడా భావించడము ఉచితముకాదు. లౌకిక వాక్యాలన్నీకూడా ప్రయోగించే వాని వివక్షాధీనములుగా ఉంటవి. కాబట్టి ఇక్కడ అనేకార్థత్వము దోషము కాదు. పౌరుషేయ వాక్యాలన్నీ కూడా సాధారణముగా ఈ విధముగానే ఉంటవి. ఒకఅర్థము అభిధాద్వారా ప్రతిపాదిత మవుతుంది. వేరొకటి వ్యంజనాద్వారా ఉపపాదిత మవుతుంది.

ఒక వాక్యములో వ్యాపారద్వయమున అర్థద్వయ ప్రతిపాదనము ఉన్నట్లయితే ఏకార్థతకు హానికలుగుతుంది. వాక్యభేదమనే దోషము వాటిల్లుతుంది. అప్పుడు ఆ అర్థము స్వీకార్యమవుతుందా? ఈ అర్థము స్వీకార్యమవుతుందా? అని శంకఉదయించుచుతుంది. ఎప్పుడయినా ఒకే అర్థము స్వీకార్యము కావాలి కాని రెండర్థాలూ స్వీకార్యాలు కావు. ఏదో ఒక్క అర్థమును స్వీకరించితే రెండో అర్థమును విడిచిపెట్ట వలసిందే అటువంటి అర్థము అగ్రాహ్యమే అవుతుంది. కదా! అగ్రాహ్యార్థము ఉండగానే అప్రమాణతా బుద్ధి కలుగుతుంది. ఇదంతా వైదిక వాక్యాలలోని విషయము.

ప్రకృతస్థలాలలో అట్లా కాదు. ప్రకృతార్థ పరమయిన వాక్యము వలననే అప్రకృతార్థముకూడా భాసించాలని ప్రయోక్త యొక్క భావము. ఇటువంటివాక్యాలలో వాక్యభేద దోషమును ఊహింపరాదు.

ప్రకృతార్థమును ప్రతిపాదనము చేసేటప్పుడు అప్రకృతార్థము స్ఫురించేటట్లయితే ఆఅప్రకృతార్థానికి ప్రకృతార్థములో ఏదయినా సంబంధమును చెప్పితీరాలి. కాకపోయినట్లయితే కవి అసంబద్ధమయిన అర్థమును చెప్పినవాడవుతాడు. అప్పుడాతని వచనాలలో ఉన్మత్తాదుల వచనాలలో వలె అశ్రద్ధేయత కలుగుతుంది. కాబట్టి ప్రకృతిస్థలములో ప్రతిపాదితమయిన ప్రకృతార్థమగు సేనా వృత్తాంతమునకూ అప్రకృతార్థమయిన నదీవృత్తాంతమునకూ ఔపమ్యమును సంబంధముగా నిశ్చయించాలి. అందువలన ఇక్కడ ఉపమాలంకారము వ్యంగ్యము సేనలు నదీ సదృశములు అని వ్యంగ్యోపమా స్వరూపము.

ఈపద్యములోనే "ప్రతిపక్షబలార్ణవం" అనేచోట శత్రు బలమునందు అర్ణవత్వము ఆరోపింపబడుట వలన రూపకాలంకారము వాచ్యముగా ఉన్నది. వ్యంగ్యమయిన అర్థము వాచ్యమయిన రూపకము యొక్క సిద్ధిలో అంగమవుతున్నది. ఏదయినా సమానధర్మము లేకపోతే ప్రతిపక్ష బలమునందు అర్ణవత్వారోపము కుదరదు. వాహినీ సర్వతోముఖ కబంధ శబ్దాలవలన గోచరమవుతూ ఉన్న అర్థాంతరము అర్ణవధర్మాలను నిరూపించు తున్నది. కాబట్టే వాహిన్యాదులు సమాన ధర్మ సమర్పకములు. ఈ విధమయిన వ్యంగ్యమగు అర్థాంతరము ఉంటేనే కాని అర్ణవత్వారోపము కుదరదు. అందువలన న

వ్యంగ్యమవుతూఉన్న అర్థము వాచ్యరూపక స్థితిలో అంగమన్నమాట. ఇట్లా వాచ్యసిద్ధ్యంగమయి నపుడు గుణీభూత వ్యంగ్యమె కాని ఉత్తమ వ్యంగ్యము కాదు. దీనిని ధ్వని అంటాను కాగా ధన్యుదాహరణ ప్రస్తావములో గుణీభూతో దాహరణము ఉచితము కాదు కదా! అని ఇక్కడ శంకించవలసి వచ్చును. అయినా వ్యంగ్యసామగ్రీ మాత్రమును ఇక్కడ ప్రదర్శించాలి. అనేది మాత్రమె ఇక్కడ అభిప్రాయము అని స్వీకరించే టట్లయితే ఈ చెప్పినది అంతగా దోషము కాదు

ఇంకా ఇక్కడ ఒక విషయమును గ్రహించాలి. శ్లేషాలంకారము మూడు విధములు. ప్రకృతశ్లేష అప్రకృతశ్లేష ప్రకృతా ప్రకృతశ్లేష అని. ఈ విధముగానే అలంకార ప్రకరణములో విద్యానాథుడు నిరూపించుతాడు. విశేషణములు మాత్రమే శ్లిష్టములై విశేష్యము శ్లిష్టము కాకపోయినట్లయితే ఉభయశ్లేష అవుతుంది. విశేషణములూ విశేష్యమూ శ్లిష్టములయితే శబ్దశక్తిమూల ధ్వని అవుతుందని అనే ఈ వ్యవస్థ కాగా ప్రకృతములో విశేష్యముగా ఎన్నదగిన "ప్రతిపక్ష బలార్ణవం" అనేది శ్లిష్టము కాలేదు. అందువలన ఇది ఉభయశ్లేష అవుతుందిగాని శబ్దశక్తిమూల ధ్వని కానేరదు. కాబట్టి దీనిని ధ్వని అని అనడము అనుచితము పూర్వాపర విరుద్ధమూను. విషయము ఈ విధముగా ఉండగా దీనిని శబ్దశక్తిమూల ధ్వని లక్ష్యముగా దేనికి ప్రదర్శించారు?

అనే ఇటువంటి శంకతో ఇక్కడ పరిశీలించినట్లయితే ఈ అర్థము అవి భాసించుతుంది. ప్రాచీనులయిన మమ్మట భట్టాదులు ఉభయశ్లేషను అంగీకరించరు. విశేష్యము శ్లిష్టమయినా కాకపోయినా భాసించే అర్థము అప్రకృతము అయినట్లయితే

శబ్దశక్తి మూలధ్వనియె అవుతుందని వారు అంగీకరించుతు న్నారు. ప్రపథనములో ప్రాచీనుల పథమును అనుసరించి ఉదహరించడము వలన ప్రరోచన కలుగుతుందని విద్యానా థుడు ఈ విధముగా చేసిఉంటాడు. అలంకార ప్రకరణములో ప్రదర్శింపబడ బోవు నదిస్వమతము. అక్కడ తన్నిరూపణమును అనుసరించి నిరుక్తార్థములను సవరించుకొనడము సముచిత పక్షము. విద్యానాథుని ఈ ప్రదర్శనము కేవలమూ పరీక్షక ప్రతిభా పరీక్షార్థమని అనడం కంటె ప్రాచీనోపజీవ్య పథ ప్రదర్శనార్థమని భావించుట సమంజసము. ఇక ఈ ప్రసక్తి చాలును.

## అర్థశక్తిమూలము

వాచ్యార్థము స్వగత సౌందర్య విశేషము వలన అర్థాంతర మును అవగమింప చేస్తుంది. అక్కడ చెప్పేవాని (వక్త) విశే షము, వినేవాని విశేషము ప్రతిపాదింప బడే వాని విశేషము అట్లాగే దేశ కాలాది విశేషములూ అర్థాంతర ప్రత్యాయనము (వ్యంగ్యము చేయుట) లో ఉపకరించుతవి. అక్కడ అర్థాంత రము వ్యంజన వలననే గోచరమవుతుంది. ఈ వ్యంజన వాచ్యార్థావలంబనము వలన ఉదయించుతుంది కాబట్టి దీనిని అర్థశక్తి మూల వ్యంజన అనడము యుక్తము. శబ్దశక్తి మూలములో వాచ్యార్థము సహకారి అవుతుంది. అర్థశక్తి మూలములో శబ్దము ఉపకరించేది అవుతుంది. కాబట్టి ఒక దాని యందు వేరొక దానికి సహకారిత్వము ఉన్నదని గ్రహించాలి. ఉదా:—

శ్రుత్వా కాకతిభూభర్తుః క్షోణీ పాణిగ్రహోత్సవం
అంగుష్ఠే నాలిఖ ద్భూపాః పాదపీఠం నతాననాః

కాకతి భూమిరుద్రుని క్షోణీపాణి గ్రహణోత్సవమును విని సామంత భూపతులు వినతాననులై పాదపీఠిని అంగుష్ఠముతో లిఖించి నారు. దీనిలో సామంత భూపతులు విషణ్ణులయి నారు. అని అర్థశక్తి మూలవ్యంజన వలన గోచరమవుతున్నది. విషణ్ణులు=విషాదము కలవారు. విషాదము ఒక సంచారి భావము. భావములు అసంలక్ష్యక్రమ వ్యంగ్యములు అని ఆలంకారిక సిద్ధాంతము. అయినా రసభావాదులు సంలక్ష్యక్రమములు కాకపోవు. ఇక్కడ విషాదమునకు నతానన సత్వము అనుభావము. ఈ నతాననత్వము అనేక కారణముల వలన కలుగవచ్చును. నియత కారణము వెంటనే గోచరము కాదు. దానిని తెలిసికొనడానికి ప్రకరణాది పర్యాలోచనము ఆవశ్యకము. అప్పుడు వీరరుద్ర ధరణీ పరిణయ శ్రవణాను సారమున విషాదము హేతువుగా గోచరమవుతుంది. ఇట్లా విషాదము విలంబముగా ప్రతీయ మానమవుతున్నది. కాబట్టి సంలక్ష్యక్రమము.

ఈ విధముగా విషాదరూపమయిన వ్యంగ్యము అర్థశక్తి మూలకము. దీనిని కొందరు అనుమానగమ్యమని అంటున్నారు. వారి భావము ఈ విధముగా ఉంటుంది ప్రత్యక్షముగా గోచరము కాని దానిని అనుమానముతో ఊహింపవచ్చును. అనుమానములో ఊహింపచేసే దానికి హేతువని సాధనమని గమకమని పేరు. ధూమము వలన అగ్నిని అనుమానింపవచ్చును. పర్వతమునందు ధూమముకనబడి నట్లయితే అక్కడ అగ్ని ఉన్నదని ఊహించుతాము. ధూమము ఉండే స్థలములో అంతటా అగ్ని ఉంటుంది. కనుకనే ధూమము సాధనమై అగ్నిని సాధ్యము చేస్తున్నది. సాధ్యమునకు ఆశ్రయముగా

ఉండేది పక్షము అవుతుంది. ప్రకృతములో నతాననత్వము హేతువుగా విషణ్ణత్వమును సాధింపవచ్చును. విషణ్ణత్వము నకు ఆశ్రయులయిన సామంతరాజులు పక్షములవుతారు. ఇట్టి అనుమాన విధానమునన్నె రాజులు విషణ్ణులయినారు. అనే అర్థము గమ్యమవుతూ ఉండగా దానికొరకై అర్థశక్తి మూలకముగా వ్యంజనను అంగీకరించుట వ్యర్థము. అని అనుమానవాదుల వాదము.

కాని ఇది సముచితముకాదు. అర్థశక్తి మూలవ్యంజనములో అనుమానశంక యుక్తముకాదు. అనుమానములో వ్యాప్తి ఉండడము అవసరము. వ్యాప్తి అనగా సాధ్యసాధనముల నియత సంబంధము. ఇటువంటి నియతి ఉన్నపుడే అనుమానశక్తి ఉచితమవుతుంది. వ్యాప్తి లేనపుడు అనుమాన రచన ప్రసారము పొందదు. "యత్ర యత్ర ధూమః తత్ర తత్ర అగ్నిః" అనే వ్యాప్తి సుస్థిరు బాటును పొందుతుంది కాబట్టి ధూమ హేతుకముగా వహ్నిని సాధ్యము చేయవచ్చును ప్రకృతపద్యములో వ్యంగ్యవ్యంజక ములుగా ఉన్న విషణ్ణత్వ నతాననత్వములకు అవినాభావము (అనగా నియత సాహచర్యము వ్యాప్తి) లేదు. నతాననత్వము అనేక కారణములవలన కలుగవచ్చును. గురువందనము జేసే శిష్యుడు వినత శిరస్కుడవుతాడు. లజ్జాభరాలస అయిన లలన వినత వదన అవుతుంది భారాల సుడయిన భటుడు నతాననుడు అవుతాడు. "యత్ర యత్ర నతాననత్వం తత్ర తత్ర విషణ్ణత్వం" అనే వ్యాప్తి ఇక్కడ లేదు. నతానన త్వము ఉన్నా లజ్జాభరాలస లలనలో విషణ్ణత్వము లేదు. కాబట్టి నియతంగా నతాననత్వంవలన విషణ్ణత్వము గమ్యము

కాజాలదు. అందువలన అనుమానము ఉచితము కాదు. నియతమయిన కారణ ప్రతీతి కవి వివక్షాసహాయము కలిగిన వ్యంజకశబ్దము వలననె కలుగుతుంది. ఇంకా ఒకే వ్యంజకము వలన ఆయా నానావ్యంగ్యార్థముల ప్రతీతి కలుగవచ్చును. ఇట్టి నానా వ్యంగ్యార్థ ప్రతీతి వక్తృవివక్షాను సారముగా ఉంటుంది. సూర్యుడు అస్తంగతుడయినాడు అనే వాక్యస్థలములో వివక్షాభేదమును బట్టి అనేకార్థములు గోచరములు కావడము సుప్రసిద్ధమై ఉన్నది. ఈ విషయము ఇదివరలో నిరూపితమే. అనేకవ్యంగ్యార్థప్రతిపత్తి అనుమాన పరిపాటీ విరుద్ధము. వ్యంగ్యము అనుమేయమూ అనేవి అత్యంతమూ విలక్షణములు. కాబట్టి వ్యంజనము అనుమానము కాదు.

అభిధయె ప్రతీయమానార్థములో కూడా ప్రవర్తించుతుందని మీమాంసకులు అనడము సముచితము కాదు. అభిధావృత్తికి సంకేతార్థమునందే పరిచయమున్నది. అది ప్రతీయమానార్థములో ప్రసరించలేదు. మీమాంసకులుకూడా వ్యంజనమును అవశ్యముగా స్వీకరించాలి. ఈ విషయవిస్తరమును గ్రంథాంతరములలో విశదముగా గ్రహింపవచ్చును. ఇంతటి ఈ గమనికను అనుసరించి అర్థశక్తి మూలవ్యంజన విషయమును వివిక్తముగా ఎరుంగవలయును.

## ఉభయశక్తి మూలకము

శబ్దశక్తి మూలకము నందు నానార్థకములయిన శబ్దములు ప్రవేశము పొందును. అవి పరివృత్తి సహములు కావు. అర్థశక్తి మూలకములో నానార్థ బోధక పదములు పరివృత్తి సహములగును. శబ్దశక్తి మూలకములో అర్థశక్తి సహకారితవుతుంది, పరివృత్తిసహిష్ణువులుపరివృత్త్య సహిష్ణువులు

అయిన పదములు కూర్పబడు నపుడు ఉభయశక్తి మూలక వ్యంజన ఉంటుందని గ్రహించాలి. ఉదా:—

విజితారిపురో మూర్త్యా విలసత్సర్వమంగళః
రాజమౌళి రసౌ భాతి రుద్రదేవో జగత్పతిః

ప్రకృతార్థము:— శత్రుపట్టణములను జయించిన వాడును స్వరూపములో విలసించునట్టి నిఖిలమంగళములు కలవాడును రాజ చూడామణియు జగత్ప్రభువూ అయిన ఈ ప్రతాప రుద్రుడు భాసించుతున్నాడు.

అప్రకృతార్థము :- అరిపురముల జయించినవాడునూ స్వరూపమున శోభించు సర్వమంగళ (పార్వతి) కలవాడునూ శిరమున చంద్రుడుకలవాడునూ జగత్పతియూ అయిన శ్రీ శివుడు భాసించుతున్నాడు.

ఈ పద్యములో "విజితారిపురః జగత్పతిః" అనేవి అర్థ శక్తి మూలకములు. "విలసత్సర్వ మంగళః రాజమౌళిః" అనేవి శబ్దశక్తి మూలకములు. అందువలన ఇక్కడి వ్యంజన ఉభయశక్తి మూలకముగా ఉన్నది. ప్రతాపరుద్రునకూ శ్రీ శివునకూ ఔపమ్యము గోచర మవుతున్నందువలన ఉపమా లంకారధ్వని.

## కైశిక్యాదివృత్తులు

మొదటి సంగ్రహకారికలోని ఉద్దేశ క్రమానుసారముగా గుణాలంకారములను చెప్పవలసి ఉన్నది. అయినా అవి బహువక్తవ్యములగుట వలన ఇక్కడ ఉపేక్షితములు. వేరు వేరుగా అవి వాని వాని ప్రత్యేక ప్రకరణములలో నిరూపి తములగును. శబ్దవృత్తి నిరూపణానంతరము వృత్తిపద

సామ్యమును బట్టి కైశిక్యాది వృత్తుల స్వరూప నిరూపణము ఇక్కడ ఉపక్రాంతమగును.

అత్యర్థ సుకుమారార్థ సందర్భా కైశికీ మతా
అత్యుద్ధతార్థ సందర్భా వృత్తి రారభటీ స్మృతా,
ఈషన్మృద్వర్థ సందర్భా భారతీ వృత్తి రిష్యతే,
ఈషత్ప్రౌఢార్థ సందర్భా సాత్వతీవృత్తి రిష్యతే.

అత్యంతమూ సుకుమారమునైన అర్థసందర్భము ఉన్నట్లయితే కైశికీవృత్తి అవుతుంది. అత్యుద్ధతార్థసందర్భము ఉన్నప్పుడు ఆరభటీవృత్తి కొంచెము మృదువయిన అర్థ సందర్భము ఉన్నట్లయితే భారతీ వృత్తి అవుతుంది. ఈషత్ప్రౌఢార్థ సందర్భము కలదయితే సాత్వతీవృత్తి అవుతుందని సాహిత్యవిదులు అంగీకరించు తున్నారు.

శృంగారము కరుణమూ అనే రెండు రసములూ అత్యంత సుకుమారములు. రౌద్రభీభత్సములు అత్యుద్ధతరసములు. హాస్యము శాంతమూ అద్భుతమూ అనే మూడు రసములూ కించి త్సుకుమారములుగా కీర్తితములు. వీరభయానకములు రెండూ ఈషత్ ప్రౌఢములు. శృంగార కరుణరసములు అతికోమల సందర్భమున వర్ణింపబడిన స్థలములో కైశికీవృత్తి అని, రౌద్రభీభత్సములు అతి ప్రౌఢసందర్భమున వర్ణింపబడిన స్థలములో ఆరభటీవృత్తి అని, నాతిసుకుమారములయిన హాస్య శాంతాద్భుతములు నాతిసుకుమారమయిన సందర్భమున సంగ్రథితము లయినప్పుడు భారతీ వృత్తి అనీ నాతిప్రౌఢములయిన వీరభయానకములు నాతి ప్రౌఢరచనలో నిర్వహింపబడినపుడు సాత్వతీవృత్తి అనీ గ్రహించాలి. గ్రంథాంతరములలో వీని భేదప్రభేదములు అనేకములు నిరూపితము

లయినవి. వానిని అక్కడనే దర్శించాలి. యథాక్రమముగా వీనిని ఉదాహరింతుము.

కైశికీవృత్త్యుదాహరణము

జితమదనవిలాసం కాకతీయాన్వయేందుం
నరపతి మనిమేషం ద్రష్టు మాశంసినీనాం,
సపది విరచితాసీ దంగనానా మపాంగైః
దివి కువలయ దామ శ్యామలా తోరణశ్రీః.

మదనుని రూపవిలాసముల జయించినట్టి కాకతీయాన్వయ చంద్రుడయిన ప్రతాపరుద్ర నరపతిని రెప్పపాటు లేకుండా చూడ వలెనని అంగనలు ఉవ్విళ్లూరుతున్నారు. అప్పుడు ఆ అంగనల అపాంగములచేత ఆకాశములో కువలయదళ శ్యామలమయిన తోరణశోభ విరచితమయినది. దీనిలో నరపతి విషయకము అంగనాగతమూ అయిన రతి సముచిత విభావాదుల వలన సముల్లసితమై రసీభావము పొందుతున్నది. అసంయుక్త కోమల వర్ణ సందర్భమున శృంగార వర్ణనము ఉన్నది. కాబట్టి ఇది కైశికీవృత్తిశోభితము మహా కులీనతాది గుణగణము కలిగిన విదగ్ధనాయకుడు. ఆలంబన విభావము లోకోత్తర రూపయౌవనాదులు ఉద్దీపన విభావములు. అపాంగ ప్రసరణాదికము అనుభావము. ఔత్సుక్యాదికము వ్యభిచారి. వీనిచే రతి రసీభావము పొందు తున్నది. విభావాదుల స్వరూపము రసప్రకరణములో విశద మగును.

ఆరభటీ వృత్త్యుదాహరణము

ఖడ్గాఘాత నికృత్త శాత్రవశిరో నిష్ఠ్యూత రక్తచ్ఛటా
జాలై రుచ్ఛట శస్త్రఘట్టన భవత్స్ఫుర స్ఫులింగోత్కరైః,

స్త్యానాసృక్పిశితాస్థి ఖండ వికట స్థూలోజ్జ్వలాంగారకైః
ఉచ్చండ శ్చలమర్తిగండ నృపతేః క్రోధాగ్ని రాయోధనే.

చలమర్తి గండడు అనే బిరుదము కలిగిన ప్రతాపరుద్ర నృపతియొక్క క్రోధాగ్ని యుద్ధములో ఉచ్చండమై ఉన్నది. శాత్రవుల శిరములు ఖడ్గాఘాతమున నరుకబడినవి. ఆ నికృత్త శిరములనుండి రక్తచ్ఛటల సమూహములు ప్రసరించుతున్నవి. సమతిశయిత శస్త్రఘట్టనముల వలన గొప్ప స్ఫులింగ జాలములు ఉత్పన్నము లవుతున్నవి. ఘనీభూతమయిన రక్తము మాంసము అస్థిఖండములూ ఉన్నందువలన వికట స్థూల సముజ్జ్వలాగ్నికణములున్నట్లుగా క్రోధాగ్ని ప్రచండమై ఉన్నది. దీనిలో రౌద్ర బీభత్సములు పరుష వర్ణముల వికట బంధములో ప్రతిపాదితములయినవి. శస్త్రోల్లాసాదికము వలన రౌద్రమూ, రక్త మాంసాదులవలన బీభత్సమూ సూచితము లవుతున్నవి.

## భారతీ వృత్త్యు దాహరణము

ఔన్నత్యం మహదన్యదేవ మహితః కోప్యేష గంభీరిమా
చాప్యన్యా సరణిః ప్రతాపయశసో రన్యైవ వాహ్వోః ప్రథా,
సర్వం నూతనమేవ రుద్రనృపతేః జానే న తన్నిర్మితౌ
సామగ్రీ చతురాననేన కియతీ ? కీదృక్క్రమా కల్పితా.

ఆ మహౌన్నత్యము వేరు. మహితమయిన ఈ గంభీరిమ చెప్పదగినది కానిది. ఆయశః ప్రతాపముల మార్గము కూడా లోక విలక్షణమె. బాహువుల ప్రఖ్యాతి విజాతీయము. రుద్ర నృపతికి సంబంధించినది సర్వమూ నూతనమె కదా ? ఆ ప్రతాపరుద్రుని నిర్మాణములో చతురాననుడు ఎంతటి ఎటు వంటి సామగ్రిని ఎక్కడ కల్పించినాడో తెలియ కుండా

ఉన్నాను. దీనిలో సంయుక్త వృత్తబంధము ఉన్నది. అది అద్భుత రససూచకము. వీరరుద్ర దర్శనము వలన కలిగిన విస్మయము సముచిత విభావాది సముల్లసితమై అద్భుతరసము అవుతున్నది.

సాత్వతీవృత్త్యుదాహరణము

దూరాదాకర్ణ్య విశ్వప్రసృమర మహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారంభ భేరీ నినద మరిన్నృపాః పూర్ణ కర్ణజ్వరార్తాః
ఆరుహ్యాద్రీన్ విశంతో గహన మతిమహత్కంటకాకృష్ట కేశా
స్త్రాయధ్వం ముంచతేతి ప్రతినృపతి ధియా పాదపాన్ ప్రార్థయంతే.

వీరరుద్రుని పరాక్రమము ప్రపంచములో ప్రసరించు స్వభావము కలదిగా ఉన్నది. అటువంటి వీరరుద్రుని జైత్ర ప్రయాణ ప్రారంభములో వెలువడిన భేరీనాదమును శత్రుభూపతులు విని పూర్ణకర్ణ జ్వరము కలవారై పీడితు లయినారు. భయ త్రస్తులయినారు. వారు పర్వతములను ఎక్కి అరణ్యములను ప్రవేశించుచుండగా కంటకి వృక్షాలు వారి కేశములను పట్టుకొన్నవి. ఆ శత్రుభూపతులు అప్పుడు ప్రతిభూపతులు వచ్చి జుట్టు పట్టుతున్నారనే భావముతో "రక్షింపుడు, విడిచి పెట్టుడు" అని వృక్షాలను ప్రార్థించుచున్నారు. దీనిలో వికట మయిన బంధము పరుష మయిన వర్ణ సందర్భముా ఉన్నది. దీనివలన భయానకము ప్రతిపాదిత మవుతున్నది.శత్రు నృపతి లోని భయములో భేరీనినద శ్రవణము ఆలంబనవిభావము. పర్వతా రోహణా రణ్యప్రవేశములు అనుభావములు. జ్వర శ్రమగ్లాన్యాదులు సంచారులు. వీని వలనభయముభయానక రసము అవుతున్నది. కాబట్టి ఇది సాత్వతీ వృత్తి.

## మధ్యమారభటి మధ్యమకైశికి

మధ్యమారభటి మధ్యమకైశికి అని రెండు వృత్తులు సర్వ రస సాధారణములై ఉన్నవి. వీని స్వరూపమును ఈ విధముగా గ్రహించాలి. మృదువయిన అర్థము ఉన్నప్పటికీ అనతి ప్రౌఢబంధము ఉన్నట్లయితే మధ్యమకైశికి అవుతుంది శృంగార కరుణములు అతిసుకుమారములే. అయినా అల్ప ప్రౌఢత్వము దోషము కాదు. కాని అతిప్రౌఢసందర్భము మాత్రము సమ్మతము కాదు. అతిప్రౌఢసందర్భము ఉంటే ప్రతికూలవర్ణము అనే దోషము సంభవిస్తుంది. ప్రౌఢార్థము ఉన్నప్పటికీ ఒకింత మృదువిన్యాసము ఉన్నపుడు మధ్యమారభటి అవుతుంది. రౌద్ర బీభత్సములు అతి ప్రౌఢములై అయినా ఈషన్మృదుబంధము దోషావహము కాదు. కాని అతిమృదు సందర్భము విరుద్ధము. యథాక్రమముగా వీని ఉదాహరింతుము

### మధ్యమ కైశికి

ఆసన్నేపి మహోత్సవే కథమిదం స్వప్నేపి ప్రవాసం వ్రజేః?
ధిక్! ధిక్!! సాహస మావయో ర్విఘటనం కో వా విధిః కాంక్షతి?
ఇత్థం స్వప్ననివారిత ప్రియతమ ప్రస్థానబుద్ధి స్తతో
బుద్ధ్వా మూర్ఛతి కాకతీయనృపతే! త్వద్వైరి నారీజనః,

మహోత్సవము సమాసన్నమయినది కదా! నన్ను విడిచి నీవు ప్రవాసము ఎట్లా వెళ్ళుతావు? నీ సాహసము యుక్తముగా లేదు. ధిక్! ధిక్!! మనకు విఘటనము కలుగ డమును ఏదైవము కాంక్షించుతుంది? అని ఈ విధముగా ఓ కాకతీయనృపతీ! నీ వైరి నారీజనము స్వప్నములో ప్రియ తముని ప్రస్థానాభిలాషమును నివారించుతూ నిద్రనుండి మేల్కొని మూర్ఛ పొందుతున్నది. ఇది భర్తృవియోగము

కలిగిన శత్రుస్త్రీవచనము. దీనియందు ఈషత్ ప్రౌఢసందర్భము ఉన్నది. శృంగార సంకీర్ణ మయిన కరుణ రసము దీనిలో ప్రతిపాదిత మవుతున్నది. స్వప్నములో ప్రణయ శృంగారము జాగ్రదవస్థలో కరుణమూ నిరూపణను పొందినవని ఊహించాలి.

### మధ్య మారభటి

మాంసకీకస సంకీర్ణాః ప్రసరద్రుధి రాపగాః
వసా కర్దమితా యుద్ధే భువోఽన్ధ్ర సుభటైః కృతాః

యుద్ధములో ఆంధ్రసుభటులు భూప్రదేశములను మాంసముతో సన్నని ఎముకలతో సంకీర్ణములనుగా నెత్తురుటేరులు ప్రవహించే ట్లుగా మెదడుఅనే బురద కలుగునట్లుగా చేస్తున్నారు. జుగుప్స స్థాయిగా కలిగిన బీభత్సరసము దీనిలో వర్ణితమైనది. సందర్భము ఈషన్మసృణముగా ఉన్నది. కాబట్టి మధ్యమారభటి. ఈ విధముగానే రసాంతరములలో కూడా ఉదాహరణములను గ్రహించాలి.

### రీతులు

వైదర్భీ గౌడీ పాంచాలి అనేవి రీతులు. కొందరు వీటిని వృత్తులంటారు. అంత మాత్రాన కైశిక్యాది సామ్యమును ఊహించరాదు. వైదర్భ్యాది రీతులుశబ్దగుణములయిన మాధుర్యాలను ఆశ్రయించి ఉంటవి. అవిఅర్థ విశేషమునుఅపేక్షించవు. కనుకనె శృంగారాది నిరపేక్షములు. కేవలము శబ్దముల సందర్భములోని సౌకుమార్యమును ప్రౌఢత్వమునూ మాత్రము అవి విషయముగా చేసికొనును. మాధుర్యాదులు రసధర్మములె అయినా రీతులు రస నిరపేక్షములె. రసాశ్రిత మాధుర్యాది శబ్దధర్మ పరత్వము వైదర్భ్యాదులకు ఉన్నది.

కైశిక్యాదులు సాత్త్వా ప్రధానపరములు. కాబట్టి కైశిక్యాదులకూ వైదర్భ్యాదులకూ భేదము అధికముగా ఉన్నది.

అసంయుక్తము లయిన కోమల వర్ణముల బంధము ఉన్నప్పుడు సందర్భము (రచన) అతి మృదువుగా ఉన్నదని, పరుష వర్ణములతో వికటబంధము ఉన్నపుడు రచన అతి ప్రౌఢమని సంయుక్తము లయిన మృదువర్ణములు ఉన్నపుడు రచన ఈషన్మృదువని, అవికట మృదు వర్ణము లున్నపుడు రచన ఈషత్ ప్రౌఢమని గ్రహించాలి. ఇకరీతుల స్వరూపోదాహరణములు.

## రీతి సామాన్య లక్షణము

రీతిర్నామ గుణాశ్లిష్ట పదసంఘటనా మతా

గుణములతో కూడుకొనిన పదముల సంఘటనకు రీతి అని పేరు. మాధుర్యాది గుణ పరతంత్రము లయిన శబ్దముల సందర్భమే రీతి. ఓజః ప్రసాదాది గుణ విశిష్ట పదరచన రీతి అవుతుంది. శ్లేష మొదలయిన గుణాలు గుణప్రకరణములో నిరూపితము లవుతవి. మాధుర్యము, ఓజస్సు, ప్రసాదమూ అనేవి మూడే గుణాలని వ్యాంగ్యవాదులకు సమ్మతము. విద్యానాథుడు వ్యంగ్యవాదియె అయినా శ్లేషాది గుణదశకమును అంగీకరించుచున్నాడు. అంతేకాదు భోజరాజ మతానుసారముగా ఇతరవై నాలుగు గుణాలను ఉల్లేఖించుచున్నాడు. కాబట్టి శ్లేషాది గుణాశ్లిష్ట పదసంఘటన రీతిఅని గ్రహించవచ్చు. అటువంటి రీతి వైదర్భి గౌడి పాంచాలి అని త్రివిధము. విదర్భ దేశములో అధికముగా గౌరవింపబడడము వలన వైదర్భి అనే పేరు కలిగింది గౌడదేశ వ్యవహారము వలన గౌడి అయింది. పాంచాలదేశ ప్రచారమువలన పాంచాలి

అయింది. ఈవిధముగా ఇవి ఆయా దేశాలలోని విదగ్ధ జన పరిగ్రహాము బట్టి ఆయా సంజ్ఞలను పొందినవి.

## వైదర్భి

బంధపారుష్యరహితా శబ్దకాఠిన్య వర్జితా
నాతిదీర్ఘసమాసా చ వైదర్భీ రీతి రిష్యతే.

దుస్సంధులవలన బంధములో పరుషత్వము కలుగుతుంది. వైదర్భి ఇటువంటి బంధపారుష్యముతో రహితమైనదిగా ఉండాలి. పరుష వర్ణములతో రచన ప్రారంభింపబడినట్లయితే శబ్ద కాఠిన్యము కలుగుతుంది. శబ్దకాఠిన్య వర్జితమై ఉంటేనే వైదర్భి అవుతుంది. దీనిలో దీర్ఘ సమాసములు ఉండరాదు. రచన సమాస రహితముగా ఉండాలి. మధ్యమ సమాస అయిన రచన అయినా ఉండవచ్చును. ఇటువంటిది వైదర్భి.

ఉదా:—

కాకతీయ నరేంద్రస్య కీర్తిచందనచర్చనం
దిగంగనా వితన్వంతి వతంసీకృత తద్గుణాః

దిగంగనలు కాకతీయ నరేంద్రుని గుణములను కర్ణాభరణములను గా చేసికొని ఆతని కీర్తిని చందనపు పూతగా అలము కొంటున్నారు. ఇందలి రచనలో పారుష్యము లేదు.

వేరొక ఉదా:—

వితరణగుణ లీలా తోషితాశేషలోకే
విభవతి నరనాధే కాకతీయాన్వయేందౌ
సురతరుగణనాయాం కామధేను ప్రసంగే
క్షితిజన సురతేయం వీతకౌతూహలాఽసీత్.

కాకతీయాన్వయ చంద్రుడయిన నరనాథుడు దానలీలచే అశేషలోకమునూ సంతసింప చేసి విలసిల్లు చుండగా భూసుర

సముదాయమంతా కల్ప తరువు పరిగణనము లోనూ, కామ ధేనువు ప్రసంగము లోనూ వీతకుతూహలమయినది. ఇక వానిని కుతూహలముతో యాచింప నవసరము లేదని భావించినవి. అని భావము. ఈ రెండు ఉదాహరణములలోనూ కోమల వర్ణములూ స్వల్ప సమాసములూ, మృదు బంధమూ ఉన్నది. కాబట్టి వైదర్భి రీతి అవుతుంది. "కీర్తి చందన చర్చనం" అనే చోట రేఫ సంయోగము ఉన్నది. తోషితా శేషలోకే అనే చోట పరుష వర్ణములు అనదగిన శ, ష, లు ఉన్నవి. అయినా అవి భూయో భూయః ప్రయుక్తములు కావు. కాబట్టి వైదర్భిత్వమునకు భంగము లేదు. ఈ విధముగానే ఆలంకారికులు అంగీకరించు తున్నారు. ఇటుపై ఉదాహరణములలో కూడా ఈ విధానము నె అనుసరించాలి.

## గాడీరీతి

ఓజః కాంతి గుణోపేతా గాడీయా రీతిరిష్యతే.

ఓజస్సు కాంతి అనే గుణాలతో కూడుకొన్న రచనకు గాడీరీతి అని పేరు. సమాస భూయస్త్వము ఉండుట ఓజో గుణము. ఉద్భట రచన ఉండుట కాంతి గుణము. ఈ రెండూ ఉన్నట్లయితే గాడీరీతి అవుతుంది. ఉదా:—

ప్రచండతరదోర్దండ ఖండితారాతి మండలః
బిభర్త్యతీవధరాం గుర్వీం ప్రభవన్నంధ్రభూపతిః.

ఆంధ్ర భూపతి అయిన ప్రతాపరుద్రుడు ప్రచండ తరములయిన భుజ దండములచే శత్రుమండలమును ఖండించి సమర్థతరుడు అవుతూ అతిశయిత మయిన పృథివీధురమును భరించు తున్నాడు. దీర్ఘ సమాసత సంయుక్త వర్ణ కృతోద్భటతా దీనిలో స్పష్టము.

వేరొక ఉదా:—

ఉద్యద్దోస్స్తంభ ఖడ్గ త్రుటదరిమకుటాటోప సంజాత రాహు
భ్రాంతి భ్రశ్యత్పతంగాభయకరణ చణస్ఫార నాసీరరేణుః
అంధ్రక్ష్మాభర్తు రాసీదధికరణధురా భిన్నమత్తేభ కుంభ
ప్రోద్యన్ముక్తౌఘతారా నికరపరివృతాస్స్వర్వధూవక్త్రచంద్రాః.

సమధిక మయిన భుజ స్తంభము నందలి ఖడ్గముచే శత్రు మకుటములు త్రుటితములై పైకెగిరినవి. ఆ శిరములను చూడగా సూర్యునకు రాహువు అనే భ్రాంతి కలిగింది. అందుచే అతడు పలాయితు డవుతున్నాడు. అప్పుడు ఆంధ్ర క్షమానాథుని సేనా పరాగము సూర్యునకు అభయకరణ చణము అయింది. ఆసమయములో యుద్ధ నిహత వీరులను వరించుటకు దేవాంగనలు వచ్చినారు. ప్రతాపరుద్రుని యుద్ధములో భిన్న భిన్నములయిన మత్తేభముల కుంభములనుండి ముత్యాల సమూహములనెడు తారా నికరములు వెలువడి ఆ స్వర్వధూవక్త్ర చంద్రులను చుట్టుకొన్నవి. ఈ రెండు పద్యాలలోనూ పరుష వర్ణఘటనను ఉన్నది. సమాసభూయస్త్వము ఉన్నది.

## పాంచాల రీతి

పాంచాల రీతి ర్వైదర్భీ గౌడీ రీత్యుభయాత్మికా.

పాంచాలరీతి వైదర్భి గౌడీ రీతుల సమ్మేళనాత్మకము. ఆ రెండురీతుల ప్రయోజనమునూ ఇది సంపాదించుతుంది.

ఉదా:—

జేతుః కాకతివీర రుద్రనృపతే ర్జైత్రప్రయాణోత్థితే
క్షోణీరేణుభరే నభస్యతిభృశం ధూమిభ్రమం బిభ్రతి,
జాతా మర్త్యనదీ విశంకటతటీదీర్ఘా వియద్దీర్ఘికా
గాథం గూథతమా చ గౌతమనదీ పాతాళగంగాయతే.

జయనశీలు డయిన ప్రతాపరుద్రుని దైత్రప్రయాణములో భూపరాగము అధికముగా వెలువడింది. అది ఆకాశాన భాగావ్యాపించి భూవిభ్రమమును ధరించింది. అప్పుడు వియ ద్దీర్ఘిక అనబడే ఆకాశగంగ పరాగ కలనము వలన విశాలము లయిన తటాలు కలదై సూనవృలనదిగా అయినది. క్రింద ఉన్న సాతవసనగి, గోదావరి మిక్కిలి గాధ గాధమై సాతాళి గంగ అవుతున్నది. వేరొక ఉదా:—

స్థానే తచ్చలమర్తిగండ నృపతే! త్వత్ఖడ్గభోగీ ద్విషత్
ప్రాణై ర్యత్పరితోషమేతి సరలం కిం త్వేతదత్యద్భుతం
పీత్వేస ప్రతిపక్షపార్థివ యశః క్షీరం గౌరత్విషం
యత్సంవర్ధయతి త్రిలోకభరితాం త్వత్కీర్తిలక్ష్మీసుధాం,

చలమర్తి గండడు అనుబిరుదము కలిగిన ఓ ప్రతాప నృపతీ! నీ ఖడ్గ భుజంగము శత్రు ప్రాణములచే పరితోషము పొందుట యుక్తమె. సర్పములు వాతాహారములుకదా! కాని ఈ చెప్పబోయేది అత్యద్భుతముగా ఉన్నది. నీ ఖడ్గ భోగి ప్రతిపక్ష పార్థివుల యశఃపయోధారలను పానము చేసి గౌరవర్ణము కల త్రిలోక భరితమైన నీ కీర్తిలక్ష్మి సుధను వర్ధింప చేస్తున్నది. పాము త్రాగిన పాలు అమృతము కావడము చిత్రమె కదా! ఈ ఉదాహరణద్వయములో రీతి ద్వయసాంకర్యము ఉన్నది. అద్భుత రసము దీనిలో ప్రతి పాదిత మవుతున్నది. కాబట్టి పాంచాలి.

## శయ్య

మొదటి "రీతయశ్చేయతీ శాస్త్ర ప్రమేయం కావ్య పద్ధతిః" అనేచోట చకారము వలన శయ్యా పాకములు సము చ్చితములు అవుతున్నవి కదా! ఆ శయ్యాపాకములలో

శయ్యా శబ్ద ధర్మము కావడము వలన శబ్దధర్మకముల ప్రస్తావములో శయ్యా నిరూపణా ర్హము. కాబట్టి శయ్యను నిరూపింతుము.

యా పదానాం పరాఽన్యోన్యమైత్రీ శయ్యేతి కధ్యతే

వినిమయమూ సహిష్ణువు లయిన పదముల యొక్క నిరతిశయమయిన పరస్పర మైత్రి శయ్యా అవుతుంది. వైదర్భ్యాది రీతులలో పదములు వినిమయమును సహింపగలవు. దీనిలో అట్లా కాదు. కనుకనె శయ్యా రీతులకన్న భిన్నము ఉదా:—

దాతుః కాకతివంశమండనమణేః నిస్సీమవిశ్రాణన
శ్లాఘూలంఘిత కల్పపాదప గుణప్రౌఢే రగాధౌజసః
భిభ్రచ్ఛారదకౌముదీ పరిమళం సామంత సీమంతినీ
గండాభోగ నిరూఢ పాండిమధురం ధత్తే యశః ప్రాయశః.

కాకతి వంశాలంకార మహామణి అయిన ప్రతాపరుద్రుడు దాత. ఆతని నిస్సీమదానశ్లాఘచేత కల్పపాదపముల గుణప్రౌఢికూడా తిరస్కృత మయింది. ప్రతాపరుద్రుడు అగాధ ప్రతాప ఖని. తరచుగా ఆతని యశము శరచ్చంద్రికా సౌరభ్యమును భరించి సామంతనృపతి యువతి విశాల కపోలముల లో నిరూఢమయిన పాండిమ భారమును వహించుతున్నది. దీనిలోని రచన పదముల వినిమయమును సహింపదు. ఈశయ్యా పదానుగుణ్యము కలిగి ఉన్నది.

## పాకములు

ఇక పాకమె మిగిలి ఉన్నది. దానిని చెప్పెదము. హృదయంగమ మయిన అర్థగంభీరిమ ఉన్నట్లయితే పాకమవుతుంది. శృంగారాది రసములయొక్క ఆస్వాద్యమానతలోని విశేషము పాకములో గోచర మవుతుంది. పాకము రెండువిధాలు

ద్రాక్షాపాకము నారికేళపాకము అని. ప్రస్ఫుట భావార్థములు ఉన్నట్లయితే ద్రాక్షాపాకము. అంతర నిగూఢభావార్థములు ఉంటే నారికేళ పాకమని సామాన్య లక్షణము. విశేషముగా వాని స్వరూపోదాహరణముల చెప్పెదము.

ద్రాక్షాపాకము

ద్రాక్షాపాకస్స కథితోబహిరంతఃస్ఫురద్రసః.

బయటికి స్ఫుటముగా రసము ప్రతీతము కావాలి. ఆలోచించిన కొలదీ అంతరములో గంభీరముగా రసము ఆస్వాద్యమానము కావాలి. అప్పుడది ద్రాక్షాపాకము అవుతుంది. ఈ పేరు సార్థకము. ద్రాక్ష బాల సులభ మధురిమను ఇస్తుంది. ఆస్వాద్యమయిన కొద్దీ మధుర మధురముగా ఉంటుంది కదా. ఉదా:—

స్మరస్మేరాన్ మందస్మితమధుర సౌరభ్యసుభగాన్.
మనాగ్వ్రీడా జాడ్యాన్ ప్రణయరస కల్లోల భరితాన్
కృతానేకస్కంధాన్ మనసిజ సహస్రాణి సృజతః
కటాక్షాన్వామాక్షీ కిరతి పరితో రుద్రనృపతిం.

సుందర నేత్రాలుకలిగిన ఒక రమణీ మణి రుద్రనృపతిని అంతటా నానా విధములయిన కటాక్షములను వెదజల్లు తున్నది. ఆచూపులు స్మరప్రధానములై మద మంథర మిళితములై ఉన్నవి. మందస్మితముచేత సంతాపహరములుగా ఉన్నవి. ఆమె పద్మినీ జాతి యువతి అగుట వలన ఆ కటాక్షములు సౌరభ్యముచే సుభగములైఉన్నవి. నాయిక ప్రౌఢ. అందువలన అవి కొంచెపు లజ్జచే జడిమములై ఉన్నవి. ప్రణయరస కల్లోల భరితములై ఉన్నవి. నానా విధ స్కంధములనుసృజించు తున్నవి. వేయిమన్మథులను సృష్టించు

తున్నవి. ఈపద్యములోని కటాక్ష విశేషణములు నిగూఢ భావనా పరిశీలనార్హములు. ఇక్కడి శృంగారము ఈవిధముగా సమ్మర్ద సహిష్ణువయినా పారిసమయములో కూడా చక్కగా ఆస్వాద్యమానమవుతున్నది. ఇట్లా దీనిలో అర్థ నిబంధనము ప్రసన్న గంభీరము కాబట్టి ద్రాక్షాపాకము.

## నారికేళపాకము

సనారికేళపాకః స్యాదంతర్గూఢ రసోదయః

గూఢ గూఢరస స్ఫురణము ఉన్నట్లయితే అది నారికేళ పాకము. నారికేళమును బద్దలు కొట్టితేనే గాని ఆస్వాద్యమానము రసము ఉండదు కదా. అట్లాగే ఇదీని. ఉదా:—

లీలా విభ్రమ................శృంగారనాట్య క్రమః

ఈ పద్యము మొదటి ప్రకరణములో నాయికా ప్రసక్తి వచ్చినప్పుడు మధ్యమోదాహరణ ప్రస్తావములో నిరూపితమయింది. దీనిలో వెంటనే ఉద్దిష్ట ప్రతీతి కాదు. ఇప్పటికి ఈ ఉదాహరణములు రసవిషయమైన ప్రదర్శితము లయినవి ఇట్లాగే వస్త్వలంకార ప్రతీతులలో కూడా గ్రహించాలి. అర్థము యొక్క స్ఫుట ప్రతీతిలో ద్రాక్షాపాకము చరమ సీమను పొందినది. విలంబిత ప్రతీతిలో నారికేళము పరాకోటిని అధిష్ఠించింది. అటూ ఇటూ కాక వీని అంతరాళములో ఉండే మధ్యమ ప్రతీతి అనేక విధాల ఉంటుంది. కాబట్టి మధుపాకము, క్షీరపాకము, కదళీపాకము, రసాలపాకము మొదలయినవి సంభావనానుసారముగా ఊహింప తగివున్నవి

## కావ్యవిశేషము

ఈ విధముగా కావ్య సామగ్రి నిరూపిత ప్రాయము. ఇక ఈ కావ్య భేదములను నిరూపించాలి. ఒక చోట వ్యంగ్యము

ప్రధాన మవుతుంది. వేరొకచోట అప్రధాన మవుతుంది. మఱిఒకచోట అస్ఫుట మవుతుంది. ఈ రీతిగా వ్యంగ్య పరిస్థితిని బట్టి కావ్యము త్రివిధము. వ్యంగ్య ప్రాధాన్య మున్నప్పుడు ఉత్తమ కావ్యము. దీనినే ధ్వని అని వ్యపదేశించుతారు. వ్యంగ్యము అప్రధాన మయినట్లయితే మధ్యమ కావ్యము. ఇది గుణీభూత వ్యంగ్యమని వ్యపదేశింపబడుతున్నది. వ్యంగ్యము అస్ఫుట మయినప్పుడు అధమకావ్యము. దీనికే చిత్రమని పేరు. లోకములో ఏదయినా వస్తువును తెలిసికొనడానికి దీపముపై ఆదరమును ప్రదర్శించుతాము. చీకటిలో ఉన్న వనితావదనారవిందావలోకనానికై దీపశిఖయందు యత్నము కలవారు కావడము ప్రసిద్ధమె కదా! అట్లాగే మహాకవి కూడా వ్యంగ్యార్థము కొఱకై వాచ్యవాచక విచిత్రతలందు ప్రవర్తించుతాడు. అక్కడ వ్యంగ్యము మధ్యలో విశ్రాంతము కాదు. తనవరకూ సహృదయుల హృదయాలను ఆకర్షించుతుంది. కనుకనె ఉత్తమములో వ్యంగ్యానికి ప్రాధాన్యము ఉన్నదని అనుసంధించవలసి ఉన్నది. మధ్యమ కావ్యములో వ్యంగ్యము ప్రతిద్వంద్వముగా ఉంటుంది. కాబట్టి అక్కడ అది అప్రాధాన్యము పొందుతున్నది. ఇక్కడ వ్యంగ్య చారుత్వానికి అపకర్ష ఉన్నట్లయితే వ్యంగ్యములోని అప్రధానత స్వాభావికము కాదు వ్యంగ్య చారుత్వానికి అపకర్ష ఉన్నట్లయితే వ్యంగ్యము అప్రధానమని గ్రహించాలి. గుణీభూతవ్యంగ్యము అనే పదము వలన కూడా ఈ అర్థమె సూచిత మవుతున్నది. అధమకావ్యము అస్ఫుట వ్యంగ్యము కావడము వలన నీరసము. అది కేవలమూ వాచ్యవాచకముల వైచిత్ర్యములను మాత్రము ఆశ్రయించి ఉం

టుంది. కనుకనే చిత్రముతో సమానము. దీనినే ఆలేఖ్య ప్రఖ్యము అంటారు. చిత్ర శబ్ద వాచ్యమగు ఇది శబ్ద చిత్రమని, అర్థచిత్రమని, ఉభయచిత్రమని విభాగము పొందుతుంది.

ధ్వని

స్వామిన్ ! గోత్రమహీధరాన్ కిమధునా నీచైర్విధత్సే ? పతో
గాధాసంబునిధీన్కరోషి ? కురుషే కిం దిక్పతీ నల్పకాన్ ?
ఇత్థం పార్శ్వచరానులాప మఖిలం న్యక్కృత్య ధర్మైష్మిణా
సృష్టః పద్మభువా గుణైకవసతిః శ్రీవీరరుద్రో నృపః.

స్వామీ ! కులపర్వతాలను ఇప్పుడు ఏల క్రిందుగా చేస్తున్నారు ? సాగరములను గాధములనుగా చేస్తున్నారేమి ? దిక్పతులను అత్యంతమూ అల్పులనుగా చేయుచున్నారేమిటి? ఇట్లా పార్శ్వచరులు మాటిమాటికీ పలుకుతూ ఉన్నప్పటికీ ధర్మబుద్ధి కలిగిన ప్రజాపతి ఈ అనులాపము నంతా పెడ త్రోసి గుణైక వసతి అయిన శ్రీ వీరరుద్ర నృపాలకుని సృజించినాడు. ఈ పద్యములో ప్రతాపరుద్రునకు కుల శైలాతిశాయి సమున్నతత్వము ఉన్నదని సముద్రాతిశయిత గాంభీర్యము కలదని, లోక పాలాధిక మయిన ఐశ్వర్యము ఉన్నదని ధ్వనించు తున్నది. ఇట్లాగే కాకతీయ నిర్మాణ వైభవము, కులశైలములు, పయోనిధులు, లోకపాలురు వీరి నిర్మాణ సంరంభము కన్న అతిశయించి ఉన్నదని సర్వవిలక్షణమని వ్యంగ్య మవుతున్నది.

గుణీభూత వ్యంగ్యము

ప్రత్యగ్ర ప్రసరత్ప్రతాప విభవ వ్యాప్తాఖిలాశాంతరే
విశ్వత్రాతరి వీరరుద్రనృపతౌ సింహాసనాధ్యాసిని

ఆస్థానీం సముపాగతై ర్నృపవరై స్తాస్తాస్తథా దర్శితా
శ్చేష్టా యాభి రముష్య కాకతివిభో ర్దృష్టిః కృపార్ద్రీకృతా.

నూతనముగా ప్రసరించిన వీరరుద్రనృపతి యొక్క ప్రభావముచే నిఖిల దిగంతరములూ వ్యాప్తము లయినవి. ఆతడు విశ్వరక్షకుడై సింహాసనమును అధిష్ఠించగా ఆ స్థానమంటపమునకు వచ్చిన సామంత నృపవరులు ఆ యాచేష్టలను చేసినారు. వానిచే ఈ కాకతి విభుని దృష్టి కృపార్ద్రీకృత మయింది. ఈ పద్యములో అభిషేక మహోత్సవమును అనుభవించిన ప్రతాపరుద్రుని ఎదుట శరణార్థులయిన పార్థివులు తథావిధ నానావిధకృపణోక్తులనూ పునః పునః ప్రణామాదికములనూ ఆచరించినారు అనే అర్థములు వ్యంగ్యములవుతున్నవి. ఆ యా చేష్టలు దర్శితము లయినవి అనే వాచ్యార్థములో ఉన్న చేష్టా రూపము లయిన అనుభావములె రమణీయములు కాని యిచటి వ్యంగ్యము ఈ వాచ్యమును అతిశయించుట లేదు. కాబట్టి వ్యంగ్యము అగూఢమయిన దని చారుత్వాతి శయము దానిలో లేదని గ్రహించాలి. అందువలననే ఇది గుణీభూత వ్యంగ్యము అవుతున్నది. గుణము -అప్రధానము. అప్రధానీభూతము గుణీభూత మగును. వ్యంగ్యము ఎక్కడ గుణీభూత మవుతున్నదో అది గుణీభూత వ్యంగ్యము, అని నామసార్థకతను గ్రహించాలి.

## చిత్రము

చిత్రకావ్యానికి అధమ కావ్య మని పేరు. ఇది త్రివిధము. శబ్దచిత్రము, అర్థచిత్రము, ఉభయచిత్రము అని. వ్యంగ్యరహిత కావ్యము చిత్ర మవుతుంది. వ్యంగ్యరహితము అంటే వివక్షితముగా వ్యంగ్యము లేకపోవడము అని అర్థము. తలవని తలం

వుగా ఏదో ఒక వ్యంగ్యము ఉంటే ఉండవచ్చు. సామాన్యముగా ఏ వాక్యమూ వ్యంగ్య రహితమై ఉండదుకదా! కాగా తాత్పర్యవిషయీభూత మయిన వ్యంగ్యము లేనపు డధమము అని తలచుట యుక్తము.

అర్థనిబంధనములో కంటె శబ్దనిబంధనములోనే కవితాత్పర్యము ఉండేటట్లయితే అక్కడ శబ్దకృత చమత్కారమే ప్రధాన మవుతుంది. అపు డది శబ్దచిత్ర మని వ్యపదేశమును పొందుతుంది. శబ్దనిబంధన రసికత్వముకంటె అర్థనిబంధనరసికత్వమే అధికముగా గోచర మయినట్లయితే అక్కడ ఉపమాద్యర్థాలంకారములే చమత్కారు లగును. అప్పుడా కావ్యము అర్థచిత్రవ్యవహారము కలదగును. శబ్దార్థచిత్రతలు రెండూ ఏకస్థలములో సమావేశము పొందినప్పుడు ఒకటి తక్కువ అని కాని అధిక మని కాని అనడానికి అవకాశము లేదు. అక్కడ శబ్దార్థములు రెండూ చమత్కారులే. కాగా అది ఉభయ చిత్ర మవుతుంది.

### శబ్ద చిత్రము

క్షోణీరక్షణదక్షిణాః క్షతజగత్క్షోభాధురీణక్రమాః
క్షుద్ర క్షత్రియపక్ష శిక్షణవిధా ప్రోత్క్షిప్త కౌక్షేయకాః,
ఉద్దామోద్యమనస్య రుద్రనృపతే ర్దోర్దండయో శ్చండయో
ర్గర్జద్దుర్జన గర్వపర్వత భిదా దంభోళయః కేళయః.

సమతిశయిత ప్రతాపోద్యమనము కలిగిన రుద్రనృపతి యొక్క చండ భుజదండ క్రీడలు భూరక్షణ సమర్థములు, ప్రపంచ క్షోభ నాశకములు. అతని ఆయుధ ప్రయోగ పరిపాటి చూడశక్యము కానిది. క్షుద్రక్షత్రియ పక్ష శిక్షణ విధానములో నిత్యమూ ఉద్యత ఖడ్గములై ఉన్న క్రీడలు

అహంకరించు దుర్జనుల గర్వ పర్వతములను భేదించడములో వజ్రాయుధములు. దీనిలో వృత్త్యను ప్రాస బహుళముగా ఉన్నది. గర్వమందు పర్వత త్వారోపణము వలన రూపకాలంకారము కూడా స్ఫుటముగానే ఉన్నది. అయినా పద్య రచయితకు శబ్ద చమత్కార నిబంధన వ్యసనిత అధికముగా కన్పడుతున్నది, కాబట్టి శబ్ద చిత్రమే అవుతుంది.

అర్థచిత్రము

ఖగ్గే జుజ్ఝవిజుంభిఏ రిఉమహీ ణాహాంజలిం బింబిఅం
పేక్ఖంతో జయలచ్ఛివాసకమళం మణ్ణంతి విణ్ణాణిణో,
మణ్ణే పీర పలఅ రుద్దావిహుణో జణ్ణేసు ఘేత్తుం ఉణో
సిట్ఠీఏ రిఉజీవిఆఇ విహీణో జత్తస్స పీఢంబుఅం,

యుద్ధములో విజృంభించిన ప్రతాపరుద్రుని ఖడ్గమునందు శత్రు భూపతుల అంజలి ప్రతిబింబించింది. దానిని చూచి విజ్ఞానులు "ఇదిజయలక్ష్మి నివాస కమలము" అని భావించుతున్నారు. కాని అది ప్రతాపరుద్రునియుద్ధములలో హతులైన శత్రువుల జీవితములను పునః సృష్టికై గ్రహించవలెనని విచ్చేసిన విధియొక్క పీఠాంబుజము అని నేను భావించుతాను. ఈ పద్యములో ప్రతాపరుద్ర ఖడ్గ ప్రతిబింబిత మయిన రిపు నృపాంజలియందు జయలక్ష్మి వాసకమలత్వమును ఆరోపించి అపహ్నవము చేయడము ఉన్నది. పక్షాంతరోపన్యాసము వలన ఈ అపహ్నవము అర్థసిద్ధము. ఇట్లా ఈ అపహ్నవ పూర్వకముగా బ్రహ్మాసన కమలత్వమును ప్రతిపాదించడము చేత ఇక్కడ అపహ్నవాలంకృతి ఉన్నది. ఈ అపహ్నవ నిరూపణములోనే కవికి అభినివేశము ఉన్నది. వృత్త్యను

ప్రాసలో అంతగా అభిమానము లేదు. కాబట్టి అర్థచిత్రమే కాని ఉభయ చిత్రము కాదు.

### ఉభయ చిత్రము

విద్యాసముద్రే భువనైకభద్రే ప్రతాపరుద్రే జితవైరిభద్రే,
రక్షావినిద్రే ధృతశౌర్యముద్రే కాంతేవ పృథ్వీ రమతే గుణార్ద్రే.

విద్యలకు సముద్రుడూ, భువనమున కంతకూ ఒకే భద్ర స్వరూపుడూ, వైరి భద్రముల జయించినవాడూ, రక్షణములో నిద్రారహితుడూ, శౌర్యముద్రను ధరించినవాడూ, అయిన ప్రతాపరుద్రునియందు పృథివి ప్రియురాలి వలె రమించుతున్నది. దీనిలో 'ద్ర' కారము అనేక పర్యాయములు ఆవృత్తమయినందు వలన వృత్త్యను ప్రాస, ప్రియురాలివలె అనే ఉపమాలంకారమూ సమప్రధానములుగా ఉన్నందువలన ఉభయ చిత్రతను ఊహించాలి.

ఈ ఉదహరించిన చిత్రభేదత్రయములో వర్ణిత విషయాలకు ఏదోవిధముగా వీరశృంగారములలో పర్యవసానమును చెప్పవచ్చును. కాగా రసము గోచరమవుతున్నందువలన ఉత్తమ కావ్యత్వమునె అంగీకరించాలి కాని అధమ కావ్యత్వమును అంగీకరించరాదే! అని శంకించరాదు. దీనిలో పార్యంతికమయిన రస పర్యవసానము కవికి వివక్షితము కాదు. కాబట్టి అధమ కావ్యత్వమును చెప్పడమె సరసముగా ఉంటుంది.

### ధ్వని విశేషములు

సామాన్యముగా కావ్యము త్రివిధమని ఇప్పటికి నిరూపితము. ఉత్తమ కావ్యమును సవిశేషముగా చెప్పవలసి ఉన్నది.

తద్విశేషములు ఇక ప్రస్తావింపబడును. మొదటగా ధ్వని అభిధామూలకమని లక్షణామూలకమని ద్వివిధము. అభిధామూలమునకు వివక్షితాన్యపరవాచ్యమని పేరు. ఇందలి వాచ్యము వివక్షిత మవుతుంది. వాచ్యార్థము స్వమాత్రమూ బాధాసహితము కాదు. అన్యపరముకూడా అవుతుంది. రాజును సేవించాలనే భావము ఉన్నప్పుడు ముందుగా రాజపురుషుని సేవించడము లోకములో ప్రసిద్ధముగా ఉన్నది. వనితావదనారవిందావలోకనమును అభిలషించిన పురుషుడు దీపశిఖపై యత్నము కలవాడవుతాడు. అట్లాగే వ్యంగ్యాదరము ప్రధానమె అయినా ముందుగా వాచ్యమునందు శ్రద్ధ ఉంటుంది. కాబట్టి వివక్షితాన్యపరవాచ్యమనే నామము సార్థకము. లక్షణా మూలకమునకు అవివక్షిత వాచ్యమని పేరు. దీనిలో వాచ్యార్థము వ్యంగ్యార్థముచే న్యగ్భావితమవుతుంది వివక్షితము కాదు కాబట్టి సార్థకనామము.

## అవివక్షిత వాచ్యధ్వని

వివక్షితాన్యపరవాచ్యధ్వనికి భేదాలు చాలా ఉన్నవి. స్వల్పభేదాలు కలిగిన అవివక్షితవాచ్య ధ్వనిని ముందుగా నిరూపించడము సముచితము. అవివక్షిత వాచ్యధ్వని లోని వాచ్యము అర్థాంతర సంక్రమితవాచ్యమని, అత్యంత తిరస్కృత వాచ్యమని రెండు విధాలు. అవి ప్రత్యేకముగా వాక్యగతము, పదగతమని రెండు విధము లవుతున్నవి. కాగా ఇది నాలుగు విధములు. అర్థాంతర సంక్రమిత వాచ్యములో కొంతగా వాచ్యము ఉపపన్న మయినా అంతమాత్రాన ఉపయోగము లేదు. అది అర్థాంతరములో సంక్రమిత మవుతుంది. కాబట్టి అది అజహల్లక్షణా మూలకము. వాచ్యా

ర్థము అత్యంతమూ తిరస్కృతమయినప్పుడు అత్యంత తిరస్కృత వాచ్యమవుతుంది. ఇక్కడ వాచ్యానికి ఏమాత్రమూ ఉపపత్తి ఉండదు. కాబట్టి ఇది జహల్లక్షణామూలకము. దీనిలోని వాచ్యము ఈ విధముగా సంక్రమితము కావడములో వ్యంజన సహకారి వర్గప్రభావము హేతువని గ్రహించాలి. మొత్తము ఇట్లా నాలుగు విధములయిన ఈ ధ్వని నామములు ఈ విధముగా ఉంటవి.

౧. పదగతార్థాంతరసంక్రమితావివక్షిత వాచ్యధ్వని
౨. వాక్యగతార్థాంతరసంక్రమితావివక్షిత వాచ్యధ్వని
౩. పదగతాత్యంతతిరస్కృతావివక్షిత వాచ్యధ్వని
౪. వాక్యగతాత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని

వివక్షితాన్యపరవాచ్యధ్వని

వివక్షితాన్యపరవాచ్యధ్వని సంలక్ష్యక్రమ వ్యంగ్యమని, అసంలక్ష్య క్రమ వ్యంగ్యమని రెండు విధాలు. వ్యంగ్య వ్యంజకముల ప్రతీతి క్రమము స్ఫుటసంవేద్య మయినట్లయితే సంలక్ష్య క్రమ వ్యంగ్య మవుతుంది. సంలక్ష్య-బాగా గోచరమవుతూ ఉన్న, క్రమ -క్రమము కలిగినవ్యంగ్యము-వ్యంగ్యము కలది. అని శబ్దార్థము. వాచ్యప్రతీతి ఒకటి, వ్యంగ్యప్రతీతి వేరొకటి. ఈరెండు ప్రతీతులకూ క్రమము ఉంటుంది. ముందుగా వాచ్యము ప్రతీతమవుతుంది తరువాత వ్యంగ్యము ప్రతీతమవుతుంది. ఈరెండిటికీ ఉన్న మధ్య కాలక్రమము సులక్షమయినప్పుడు సంలక్ష్య క్రమ వ్యంగ్యము అంటారు.

అసంలక్ష్యక్రమము

అసంలక్ష్య క్రమ వ్యంగ్యానికే రసాదిధ్వని అనిపేరు. దీనిలో విభావాదులు వ్యంజకములు. రసాదికము వ్యంగ్యము. వీని

ప్రతీతులలో క్రమము ఉన్నది. అది అత్యంతమూ సూక్ష్మము. నూరు పద్మదళాలను ఒకే పర్యాయము సూదితో గ్రుచ్చి నప్పుడు వేధక్రమము గోచరము కాదు. అది శీఘ్రభావి. అచటి క్రమము సంలక్ష్యము కాదు. అట్లాగే ప్రకృతములో కూడా క్రమము సులక్షము కాదు. కనుకనె అసంలక్ష్య క్రమము అనే పేరు సార్థకము. అంతే కాని క్రమము ఇక్కడ లేకపో లేదు. కాబట్టి ఇది అక్రమ ధ్వని కాదు. కార్యకార ణములకు పౌర్వాపర్యము అవశ్యమూ ఉండి తీరుతుందికదా! విభావాదులు కారణములు. రసాదులు కార్యములు. కార ణము కార్యానికి నియతంగా పూర్వమె ఉంటుంది. అందు వలన విభావాది ప్రతీతి మొదటకలిగితే రసాది ప్రతీతి తరు వాత కలుగుతుంది. విభావాది ప్రతీతి సమకాలంలో రసాది ప్రతీతి కలుగదు. విభావాది ప్రతీతినే రసాది ప్రతీతి అని ఎవరూ అనరు. విభావాదుల వలన రసాది ప్రతీతి కలుగు తుంది అని అందరకూ సమ్మతము. కాగా ఆ రెండిటిలో ఉన్న ప్రతీతి క్రమము సంలక్ష్యమాణము కాదు. అని సూక్ష్మ దృష్టితో భావించాలి.

### సంలక్ష్యక్రమము

సంలక్ష్య క్రమ వ్యంగ్యము శబ్దశక్తి మూలమని, అర్థశక్తి మూలమని, ఉభయశక్తి మూలమనీ మూడు విధములుగా ఉన్నది. వీనిలో

### శబ్దశక్తిమూలము

నాలుగు విధములు. మొదటగా శబ్దశక్తి మూలకము వస్తు ధ్వని అని, అలంకార ధ్వని అని ద్వివిధము. ఇవి ప్రత్యేకము

పదగతము, వాక్యగతమని భేదము పొందగా మొత్తము నాలుగు విధములు అవుతున్నది. వాని నామములు.

౧. పదగత శబ్దశక్తిమూల సంలక్ష్యక్రమ వివక్షితాన్యపర వాచ్య వస్తుధ్వని.

౨. వాక్యగత ,, ,, ,,

౩. పదగత ,, వివక్షితాన్య పరవాచ్యాలంకారధ్వని

౪. వాక్యగత ,, ,, ,,

## అర్థశక్తిమూలము

ఇది మొత్తము ముప్పది ఆరు విధముల వుతుంది. వీని విరణమును ఈక్రింది విధముగా గ్రహించాలి. అర్థశక్తి మూలకములోని మూల భూత వ్యంజకమయిన అర్థము స్వతస్సంభవి అని కవి ప్రౌఢోక్తి సిద్ధమని కవినిబంధనోక్తి సిద్ధమని మూడు విధాలు. కేవలము సాహిత్యము లోనే సిద్ధమగుట కాక లోకములో కూడా ఔచిత్యాన్ని బట్టి ఉండడానికి అవకాశము ఉన్నదని సంభావిత మవుతూఉన్న అర్థము స్వతఃసంభవిఅవుతుంది. లోకములో లేకపోయినాకవితనప్రతిభావిశేషమున సంభావించి సంపాదించే అర్థానికి కవి ప్రౌఢోక్తి సిద్ధము అని పేరు. కవి యొక్క ప్రౌఢోక్తి వలననే అది సిద్ధమవుతుంది కాని లోకములో సిద్ధము కాదన్నమాట కవి తన గ్రంథములో పాత్రలను నిబంధించుతాడు. వారు కవినిబద్ధ వక్తలు. ఆ వక్తల వచనములలోని ప్రౌఢోక్తి వలన సిద్ధమగు అర్థము కవినిబంధనోక్తి సిద్ధము అని వ్యవహరింపబడును. ఇట్లా త్రివిధమయిన వ్యంజకార్థము వస్తురూపముగా అలంకార రూపముగా ప్రత్యేకము ద్వైవిధ్యము పొంది మొత్తము ఆరు విధములు అవుతుంది. వస్తువు వ్యంజకము

కావచ్చును. వ్యంగ్యమూ కావచ్చును. అట్లాగే అలంకారము కూడా వ్యంజకము కావచ్చు. వ్యంగ్యమూ కావచ్చు. అందువలన వస్త్వలంకారములు వ్యంజకములూ వ్యంగ్యములూ అవుతవన్న మాట. అనగా వస్తు రూప వ్యంగ్యానికి వస్తువు వ్యంజకము. అలంకారము కూడా వ్యంజకమే. అలంకార రూప వ్యంగ్యానికి వస్తువు వ్యంజకము. అలంకారము కూడా వ్యంజకమే. ఇట్టి విధానము వలన పైని చెప్పిన ఆరుభేదాలూ పన్రెండు విధములు అవుతున్నవి వాని నామములను ఈ విధముగా గ్రహించాలి. దీనిలో స్వతస్సిద్ధము నాలుగు విధములు. కవి ప్రౌఢోక్తి నాలుగు విధములు. కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి నాలుగు విధములు.

౧. స్వతస్సిద్ధార్థశక్తి మూల సంలక్ష్యక్రమ వివక్షితాన్యపర వాచ్య వస్తువుచే వస్తుధ్వని.
౨. స్వతస్సిద్ధార్థశక్తిమూల ,, ,, అలంకారధ్వని.
౩. స్వతస్సిద్ధార్థశక్తిమూల ,, పరవాచ్యాలంకారముచే వస్తుధ్వని.
౪. స్వతస్సిద్ధార్థశక్తిమూల ,, ,, అలంకారధ్వని.
౫. కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి ,, ,, పరవాచ్యవస్తువుచే వస్తుధ్వని.
౬. కవి ,, ,, ,, అలంకారధ్వని.
౭. కవి ,, ,, పరవాచ్యాలంకారముచే వస్తుధ్వని.
౮. కవి ,, ,, ,, అలంకారధ్వని.
౯. కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి ,, పరవాచ్యముచే వస్తుధ్వని.

౧౦. కవి ప్రౌ. శ. సం. వి. ప. వాచ్యముచే అలంకారధ్వని.
౧౧. కవి „ „ „ పరవాచ్యాలంకారముచే వస్తుధ్వని.
౧౨. కవి „ „ „ అలంకారధ్వని.

ఇట్లా ద్వాదశ విధమయిన ఈ ధ్వని ప్రబంధ గతమని వాక్య గతమని పద గతమని ప్రత్యేకము త్రివిధము కాగా మొత్తము ముప్పది ఆరు విధములవుతున్నది. ప్రబంధ గత వాక్య గత పద గత పదముల యోజనము చేసి ఈ షట్త్రింశత్ భేద (౩౬) నామములను గ్రహించాలి. వానిపేర్లు సుగమములని నిరూపించ లేదు.

ఈ అర్థశక్తి మూలకమునకె అనురణన ధ్వని అని పేరు. అనుసరించి రణించుట (ధ్వనించుట) అనురణన మవుతుంది. ఒక కంచు గంటను మ్రోగించినపుడు ప్రథమ స్వనానంతరము స్నిగ్ధ మయిన స్వనము వెలువడుతుంది. అదె అనురణనము ప్రకృతములో కూడా ఒకవస్తువును అనుసరించి వేరొక వస్తువు ధ్వనించుతున్నది. అలంకారము ధ్వనించుతున్నది. అలంకారమును అనుసరించి వస్తువు ధ్వనించుతున్నది. అలంకారము ధ్వనించుతున్నది. ఇట్లా అనుసరించి ధ్వనించుట ఉన్నది. కాబట్టి అనురణన ధ్వని అనే పేరు సముచితముగా ఉన్నది.

## ఉభయశక్తిమూలకము

ఉభయశక్తి మూలకమయిన ధ్వని వాక్యగతముగా ఏక విధమె. దానిలో భేదాంతరముల విచిత్రతా కల్పనము దుశ్శకము. "ఉభయశక్తిమూల సంలక్ష్య క్రమ వివక్షితాన్యపర వాచ్యధ్వని." అని దీని నామమును గ్రహించాలి. ఈవిధముగా

శబ్ద శక్తి మూలకములు నాలుగు, అర్థశక్తి మూలకములు ముప్పదియారు, ఉభయశక్తి మూలకము ఒకటి మొత్తమన్నీ కలిపి ఈ సంలక్ష్య క్రమ వ్యంగ్యధ్వని నలుబది ఒకటి భేదములు పొందు తున్నది.

## అసంలక్ష్యక్రమభేదములు

అసంలక్ష్యక్రమవ్యంగ్యమయిన రసాది ధ్వని ప్రబంధగతము వాక్యగతము పదగతము పదైకదేశగతము రచనాగతము వర్ణగతమూ అని ఆరువిధములు. వానినామములు—

౧ ప్రబంధగత వివక్షితాన్య పరవాచ్యా సంలక్ష్య క్రమ వ్యంగ్య రసాది ధ్వని.
౨ వాక్యగత ,, ,, వ్యంగ్య రసాది ధ్వని.
౩ పదగత ,, ,, రసాది ధ్వని
౪ పదైకదేశగత ,, ,, రసాది ధ్వని.
౫ రచనాగత ,, ,, రసాది ధ్వని.
౬ వర్ణగత ,, ,, రసాది ధ్వని.

రసాదులు అనేక విధములుగా ఉన్నవి. వాని భేద గణనము అశక్యము. తద్ద్యోతకము లయిన ప్రబంధాదులలోని భేదమునే రసాదులందు ఊహించుకొని తద్భేదత్వమును గ్రహించాలి. రసము భావము రసాభాస భావాభాస భావోదయము భావసంధి భావశబలత భావశాంతులు అనేవి రసాదులు అని వివేకము.

## శుద్ధభేదములు

ఇంతకు పూర్వము చెప్పిన నలుబది ఒకటి భేదములతో ఈఆరింటిని కలిపితే, వివక్షితాన్య పరవాచ్యధ్వని మొత్తము

నలుబది ఏడు విధము లవుతున్నది. మొట్టమొదట చెప్పిన అవివక్షిత వాచ్యధ్వని భేదాలను నాల్గింటిని కూడా వీనితో కలిపితే ధ్వని మొత్తము మొదటగా ఏబది ఒకటి భేదములు పొందుతున్నవి. ఈభేదాలు ఇతర ధ్వనులతో సంబంధము పొందనివి అగుట వలన విశుద్ధ భేదములు అనబడును.

### మిశ్ర భేదములు

ఈ చెప్పిన శుద్ధధ్వని భేదములలో ఒక్కొక్క ధ్వనికి వేరొక ధ్వనితో సంబంధము ఉన్నప్పుడు మిశ్రభేదములు సిద్ధము లగును. అట్లొక దానితో వేరొక దానిని కలిపి నట్లయితే ప్రథమ భేదానికి ఏబది ఒక భేదములు సిద్ధము లగును. మొదటి భేదమయిన పదగతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్య ధ్వనికి పదగతార్థాంతరసంక్రమితావివక్షిత వాచ్య ధ్వనితోడనే సంబంధము ఉన్నపుడు ఒక భేదము కలుగుతుంది. వాక్యగతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్య ధ్వనితో సంబంధము ఉన్నట్లయితే రెండవ భేదము కలుగుతుంది. ఇట్లాగే ఇతర ధ్వనులతో సంబంధము వలన కలుగు ఇతర భేదములను కూడా ఊహించుకోవాలి. ద్వితీయ భేదానికి ఏబది భేదములె సిద్ధములగును. తృతీయ భేదానికి నలభై తొమ్మిది భేదాలు కలుగుతవి. ఈ విధముగానే చతుర్థ పంచమాది భేదాలకు క్రమ క్రమముగా ఒక్కొక్క భేదమును పరిత్యజించాలి. కాగా ఈ మిశ్రభేదాలు పదమూడు వందల అరవై ఆరు (౧౩౬౬) అవుతవి.

### ప్రాచీనుల మిశ్రగణనము

ఇక్కడ ప్రాచీనులు వేరొక విధముగా మిశ్ర భేదాలను పరిగణించారు. శుద్ధ ధ్వని భేదాలలో ఒక్కొక్కదానికి క్రమ

క్రమముగా ఒక్కొక్క భేదమును పరిత్యజించడమును, తన్నిమిత్తముగా ఒక్కొక్క భేదమును తగ్గింపవలసి ఉండడమును వారు అంగీకరించినట్లు లేదు ప్రథమ భేదానికి ఏబదియొకటి ప్రకారములు కలుగునట్లె ద్వితీయ భేదానికి కూడా ఏబది ఒకటి ప్రకారములు కలుగును. అట్లాగే తృతీయాది భేదాలకు కూడా కలుగుతవి. పద గతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్యధ్వనికి వాక్యగతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్యధ్వనితో సంబంధము కలుగగా ఒక మిశ్రభేదము ఉదయించునట్లె వాక్య గతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్యధ్వనికి పద గతార్థాంతర సంక్రమితావివక్షిత వాచ్య ధ్వని సంబంధము వలన భేదాంతరము జనించుతుంది. లక్షణా మూల ధ్వనికి అభిధా మూలధ్వని సంబంధము వలన మిశ్ర భేదము కలుగునట్లు అభిధా మూల ధ్వనికి లక్షణా మూల ధ్వని సంబంధము వలన భేదాంతరము ఉదయించుతుంది. ఈ విధముగానే యాభై ఒకటి శుద్ధ ధ్వని భేదాలకు పరస్పర సంబంధము వలన యాభై ఒకటి యాభై ఒకటి భేదాలు ఉంటవి. ఇట్లు ఈభేదాలను అన్నిటినీ విచారించినట్లయితే మిశ్రభేదాలు రెండు వేల ఆరు వందల ఒకటి (౨౬౦౧) అగును. ఈ ప్రాచీనాంగీకృత పద్ధతిని కాక ఏకైక న్యూనత్వమును ఆశ్రయించి నన్నూట పండ్రెండు వందల డెబ్భై అయిదు (౧౨౭౫) భేదాలు తగ్గి పోతున్నవి. షడ్వింశతి త్ర్యుత్తర శత త్రయాధిక సహస్ర (౧౩౨౬) సంఖ్యాక భేదములె సిద్ధములవుతున్నవి. ఈ సంఖ్యావలంబనము ఉత్తమమూ అని ప్రాచీనాభిమానము ఉన్నపుడు శంక కలుగుతుంది.

## విద్యానాథునిగణనోపపత్తి

ఈ ప్రాచీన వాదము యుక్తము కాదు. అవివక్షితవాచ్యా నికి వివక్షితాన్యపరవాచ్య సంబంధము వలన కలిగే భేదము కంటె వివక్షితాన్యపరవాచ్యానికి అవివక్షిత వాచ్య సంబంధము వలన కలిగే భేదము వేరు కాదు. మొదటి భేదము లోనే అది అంతర్భవించుతుంది. ఈ క్రమముగానే వస్తు ధ్వనికి అలంకారధ్వని సంబంధము వలన కలిగే భేదము, అలం కార ధ్వనికి వస్తుధ్వని సంబంధము వలన కలిగే భేదము కంటే పృథగ్భూతము కాదు. కాబట్టి పూర్వ పూర్వానికి ఉత్త రోత్తర సంబంధముతో ఒక్కొక భేదము యొక్క న్యూన తను గ్రహించాలి. ప్రాచీనులు అంగీకరించిన విధానములో— దీనికి దానితో సంబంధము, దానికి దీనితో సంబంధమని, సంబంధి ప్రతి సంబంధుల ఉచ్చారణ వ్యత్యాసమె కాని విశే షము ఏమీ లేదు. కాబట్టి వానికి యథోచితముగా పర స్పరమూ అంతర్భావమును చెప్పడమె యుక్తము చమత్కా రానురోధమునుబట్టి ఏకైక భేద న్యూనతను అభిమానించాలి.

## సంసృష్టిసంకరాయాత భేదములు

ఈ చెప్పిన మిశ్రభేదాలకు కూడా త్రిరూపకమైన సంక రముతో ఏక విధమయిన సంసృష్టితో మరల నాల్గువిధాల యోజనము చేసినట్లయితే అయిదు వేల మూడు వందల నాలుగు (౫౩౦౪) భేదాలు సిద్ధములగును. సందేహ సంకరము, అంగాంగి భావ సంకరము, ఏకవాచకానుప్రవేశ సంకరమూ, అని సంకరము మూడు విధాలు. సంకరము మాదిరిగా సంసృష్టి సాపేక్షము కాదు. కాబట్టి ఏకవిధమె. వీని స్వరూప ములు ముందు విశదము లగును. ఇప్పటికి—

శుద్ధా శ్చైకప్రకారా, మిశ్రా ఋతునేత్రానశేందవః,
సంసృష్టిసంకరాయాతా స్త్వబ్ధి ఖాగ్ని శరాబ్ధయః.

శుద్ధ భేదములు ౫౧. మిశ్ర భేదములు ౧౩౨౬. సంసృష్టి సంకరా యాతములు ౫౩౦౪. కావ్య ప్రకాశ కారాది ప్రాచీనుల దృష్టిలో శుద్ధ భేదములు ౫౧ మిశ్ర భేదములు ౨౬౦౧. సంసృష్టి సంకరా యాతములు ౧౦౪౦౪. ఇంకా భేద ప్రభేదముల కల్పనాను సారముగా అనంత ప్రకారములు ఉదయించును. వానిని అన్నిటినీ పరిగణించడము అవసరముగా తోచదు.

ఈ చెప్పిన శుద్ధ భేదాలలో కొన్నిటిని దిఙ్మాత్రముగా ఉదాహరింతుము. అందు

అర్థాంతర సంక్రమితాఽ వివక్షిత వాచ్యధ్వని

మూర్ధానో యూయ మాస్మాకాః కిమిత్యౌన్నత్య మిచ్ఛథ,
ఇతి ప్రతాపరుద్రస్య ప్రణతాః ప్రతిపార్థివాః.

ఓ మాకు సంబంధించిన శిరములారా! మీరు ఔన్నత్యమును ఏల అభిలషించు తారు? అని ప్రతాపరుద్రుని శత్రురాజులు ప్రణతులయినారు. దీనిలో "ఆస్మాకాః" అనేది అర్థాంతర సంక్రమిత వాచ్యము. దీనివలన కేవలము అస్మత్సంబంధము (మాకు సంబంధించి నట్టి) మాత్రము ప్రతిపాదింపబడదు. అది అకించిత్కరము. అటువంటి అర్థము వలన ప్రయోజనము లేదు. మేము సర్వ విధ దైన్యములకు ఆవాసముగా ఉన్నాము మీరు ఇట్టి మాకు సంబంధించిన వారు. వైనతేయుని సన్నిధానములో సర్పాలవలె మీరు కూడా ఇప్పుడు విక్రమ విముఖులు కావడము సముచితము. అని ఇక్కడ గోచరమవు తున్నది. కాబట్టి అర్థాంతర సంక్ర

మితా వివక్షిత వాచ్యతను గ్రహించాలి. "అస్మాకాః" అనే అవివక్షిత వాచ్యపదము గోచరమవుతూ ఉన్న అర్థాంతరములో సంక్రమితమై వ్యంజకమవు తున్నది. మీరు దీనులకు సంబంధించిన వారు. కాబట్టి మీకు ఔన్నత్య కాంక్ష సముచితము కాదు అని వ్యంగ్యము.

అత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని

విశదిమ విలిప్త వియతో ధవళిమ పరిపూరితాఖిలాశాంతాః,
విహరంతి యశఃపూరా గౌరాః శ్రీకాకతీంద్రస్య,

(శ్రీ) కాకతీంద్రుని గౌరములయిన యశః ప్రవాహములు వైశద్యముచే ఆకాశాన విలేపనము చేస్తూ ధావళ్యముచే నిఖిలదిగంతములను పరి పూరితములను చేస్తూ విహరించు తున్నవి. విలేపనము మూర్త ద్రవ్యానికి కుదురు తుంది. కాని అమూర్తమైన ఆకాశానికి కుదరదు. కాబట్టి విలేపనము అక్కడ అనుపపన్నమై స్వార్థమును పరిత్యజించు తున్నది. ఆకాశమును రంజింప చేయు చున్నది అనే అర్థము లక్ష్యము. దీనివలన గగనము నందు ప్రకాశాధిక్యము ఉన్నదని వ్యంగ్యమవుతున్నది. ఇందుచే ఇక్కడ "విశదిమవిలిప్తవియతః" అనేది అత్యంత తిరస్కృత వాచ్యమని గ్రహించాలి. అవివక్షిత వాచ్యములోని ఈభేదద్వయము ఇక్కడ పదగతముగా ఉదాహృత మయినది. ఇట్లాగే వాక్యగతముగా కూడా ఊహ్యము.

అర్థ శక్తి మూల వస్తువుచే వస్తుధ్వని

అబ్దాః ఋతూన్వినా మాసాః శుక్లపక్షాన్వినా తిథీః,
రాత్రీర్వినాపి కాంక్షంతే కాకతీయ రిపుస్త్రియః.

కాకతీయ శత్రుయువతులు ఋతువులు లేని సంవత్సరములను శుక్లపక్షములు లేని మాసములను రాత్రులు లేని తిథులనూ కాంక్షించుతున్నారు. వసంతాది ఋతువులూ శుక్లపక్షములూ రాత్రులూ కామోద్దీపకములగుట వలన అవి లేక పోవడమును శత్రుస్త్రీలు కాంక్షించుతున్నారని ప్రతీయమానమవుతున్నది. దీనివలన వారలకు ప్రియ వియోగము కలిగినది అనే వస్తువు వ్యక్తమవుతుంది. ఈ ప్రియ వియోగమయిన వస్తువుచే ప్రతాపరుద్రుని శత్రువులందరూ నిహతులయినారని వ్యంగ్యమవుతున్నది. ఇట్టి వ్యంగ్యము వాచ్యము కంటె అతిశయిత రమణీయతానిధానము. ప్రియ విరహ వివశలయిన శత్రుస్త్రీలు కొన్ని సంవత్సరాలు జీవించాలని మొదట ఋతువులు లేకపోవడమును కోరుతున్నారు. పిమ్మట కొంత కాలానికి వానిని కూడా గడపడానికి అశక్తులై కొన్ని మాసములందు మాత్రము ప్రాణాలను ధరించాలని వెన్నెలలు లేని పక్షములు నశించి పోవడమును కోరుతున్నారు. ఇంకా మాసాలను కూడా వెళ్ళబుచ్చడానికి సామర్థ్యము లేక కొన్ని తిథులలో మాత్రము జీవితాలను నిలబెట్టుకోవాలని రాత్రుల సృష్టి లేకపోవడమునె అభిలషించుతున్నారు. ఈ విధముగా వస్తువుచే బహువస్తువు వ్యంగ్యమవుతున్నది.

## వస్తువుచే అలంకారధ్వని

దృష్ట్వా కాకతివీరరుద్రనృపతేః కీర్తిం జగద్వ్యాపినీం
వస్తుం వాంఛతి శంభు రత్ర శయితుం లక్ష్మీపతిః కాంక్షతి,
స్నాతుం ధావతి దివ్యతాపసగణః సంవర్ధితుం వార్ధయ
శ్శ్లేష్టుంతే సవిలాసమభ్రమురపి స్ప్రష్టుం శనైః రీహతే,

కాకతి వీరరుద్రుని కీర్తి జగమంతటా వ్యాపించింది. దానిని చూచి శివుడు అక్కడే నివసించవలెనని వాంఛించుతున్నాడు. లక్ష్మీపతి అక్కడ శయనింప కాంక్షించుచున్నాడు దివ్య తాపసులయిన సప్తర్షుల గణము స్నానము చేయాలని భావనము చేస్తున్నది. సాగరములు సంవర్ధనము పొందడానికై చేష్టాయుక్తములవుతున్నవి. ఐరావతము యొక్క ప్రియురాలయిన అభ్రము సవిలాసముగా స్పృశించడానికి మెల్లగా ఉత్సుక మవుతున్నది. దీనిలో శివాదులకు నివాసాకాంక్షాదికము కలుగుట వ్యంజక వస్తువు. దీనిచే వ్యాపించిన కీర్తిని చూడగా శివునకు కైలాసమనే భ్రాంతి కలిగినదని విష్ణువునకు క్షీరార్ణవ భ్రాంతి కలిగినదని, తాపసులకు మందాకినీ భ్రాంతి కలిగినదని, సాగరములకు చంద్రభ్రాంతి కలిగినదనీ, అభ్రమువునకు ఐరావత భ్రాంతి కలిగినదనీ భ్రాంతిమదలంకారము వ్యజ్యమాన మవుతున్నది.

## వ్యంగ్యమునకు అలంకారవ్యపదేశము

వ్యంగ్యముగా ఉండేది అలంకార్యమె కాని అలంకారము కాదు. ఇక్కడ వ్యజ్యమానవుతూ ఉన్న భ్రాంతి ప్రధానముగా ఉన్నది. కాబట్టి అలంకార్యమె కావాలి కాని అలంకారము కాకూడదు. అయినా బ్రాహ్మణ శ్రమణన్యాయమును అనుసరించి "అలంకారము" అని వ్యపదేశించడము విరుద్ధము కాదు. పూర్వము బ్రాహ్మణుడుగా ఉన్న ఒకడు శ్రమణుడయినాడు. శ్రమణుడంటే బౌద్ధ సన్యాసి. శ్రమణావస్థలో బ్రాహ్మణత్వాదికము లేదు. అయినా "బ్రాహ్మణ శ్రమణుడు" అనే వ్యవహారము ఉంటున్నది. ఈతడు పూర్వావస్థలో బ్రాహ్మణుడుగా ఉన్నాడు అనే ప్రత్యభిజ్ఞానమును

మాత్రము ఆ వ్యవహారము సూచిస్తుంది. అట్లాగే ప్రకృతంలో కూడా అలంకార్యముగా ఉండే అవస్థలో అలంకారత్వము ఉపపన్నము కాదు కాబట్టి "ఇది ఒకరకపు అలంకారముగా ఉన్నది." అనే విశేషము సూచింపబడు తున్నదని గ్రహించాలి. ఈ విషయము గాని ఉత్తర స్థలములందునూ గ్రహించుట సముచితము.

### అలంకారముచే వస్తుధ్వని

ప్రతాపరుద్రస్య రణే కృపాణః సద్యస్సముద్యద్రుధిరారుణశ్రీః,
ఆలంబతే రోషకషాయితస్య కాళీకటాక్షస్య విజృంభితాని,

రణములో ప్రతాపరుద్రుని కృపాణము తత్కాలములో అతిశయించిన రుధిరముచేత ఎర్రని శోభకలదై రోషకషాయిత మయిన కాళికాదేవి కటాక్షము యొక్క విజృంభితమును అవలంబించుచున్నది. దీనిలో కృపాణము కటాక్ష విజృంభితములను ధరించు చున్నది, అనడము వలన నిదర్శనాలంకారము స్పష్టము. కాళీకటాక్షము క్షణములో రిపుక్షయము చేస్తుంది. అట్లాగే కృపాణముకూడా క్షణకాలములో సకల రిపుక్షయము చేస్తుంది అనేవస్తువు వ్యంగ్య మవుతున్నది.

### అలంకారముచే అలంకారధ్వని

కాకతీయవిభోః కీర్తిపుండరీకే విజృంభితే,
ధత్తే మధుకరక్రీడాం తమాలశ్యామలం నభః,

కాకతీయ ప్రభువు కీర్తి పుండరీకము విజృంభించగా తమాలమువలె శ్యామల మయిన గగనము మధుకర క్రీడను ధరించు చున్నది. దీనిలో నిదర్శనా లంకారముచే అధికాలంకారము ధ్వనించు చున్నది. కీర్తి పుండరీకము నందు ఆకాశము మధుకర క్రీడను ధరించు చున్నది అనుట నిదర్శనా

లంకారము. ఇది వ్యంజక మయిన వాచ్యము. ఆశ్రయము ఆశ్రయి అనే రెండిటికీ అనుగుణ్యము లేక పోవుట అధి కాలంకారము. అది ఇక్కడ వ్యజ్యమాన మవుతున్నది దీనిలో యశము ఆధారము. నభస్సు ఆధేయము. పుండరీకము ఆధారము మధుకరము ఆధేయము. పద్మముపై విహరించే మధుకరము అల్పముగా ఉంటుంది. విహార స్థానమయిన పుండరీకము అధిక ముగా ఉంటుంది. మధుకర క్రీడను ధరించే నభస్సు అల్ప ముగానె ఉంటుంది. పుండరీకాయిత మయిన కీర్తి వైపుల్యము కలది అవుతుంది. ఆశ్రయ మయిన కీర్తిపుండరీకానికి వైపు ల్యము ప్రతీయమాన మవుతున్నది. భ్రమర సాదృశ్య ప్రతిపాద నమువలన ఆకాశానికి అల్పత్వము ధ్వన్య మాన మవుతున్నది. ఈ విధంగా అధికాలంకారమును సమన్వయించుకోవాలి.

ఈ ప్రదర్శించిన ఉదాహరణ చతుష్టయములో వ్యంజకా ర్థము లోకసిద్ధమే కాబట్టి స్వతస్సిద్ధార్థశక్తి మూలత్వమును ఊహించాలి. ఇక కవిప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూలములను ఉదాహరించుతాము. వానిలో మొదటగా—

క. ప్రౌ. వస్తువుచే వస్తుధ్వని

క్రావంక్రావం ఖురశిఖిహరత్కార్తికేయేషు జాత
చ్ఛిద్రచ్ఛద్మశ్రవణ పదవీ చారిణీం చారణౌఘైః,
శశ్వద్గీతాం త్రపణమహితాం కాకతీంద్రస్య కీర్తిం
క్రౌంచక్ష్మాభృ ద్భవతి మహతో విస్మయా న్నిశ్చలాంగః.

మల్లశాలలో విహరించు కుమారస్వామి తన బాణాలచేక్రౌం చపర్వతమును భేదించాడు. అపుడు ఛిద్ర(రంధ్రము)ము ఒకటి కలిగింది. ఆపర్వతానికి అది కర్ణము. భువన మహిత మయిన కాకతీంద్ర కీర్తిని చారణ గణములు మాటిమాటికి గానము

చేసినారు. ఆచిద్రచ్ఛద్మ శ్రవణపదవీ సంచారము చేసే కీర్తిని క్రౌంచము విని విని అత్యధిక విస్మయాన నిశ్చలాంగ మవు తున్నది. దీనిలో ప్రతాపరుద్రుని కీర్తి స్థావరములకు కూడా విస్మయ కారిక మని వస్తువు వ్యంగ్యమవు తున్నది. క్రౌంచము ఆ కీర్తి ని వినడము అనేది వ్యంజకమయిన వస్తువు విస్మ యాన క్రౌంచము నిశ్చలాంగి మయింది అనే హేతూత్ప్రేక్ష ఇక్కడ ఉన్నప్పటికీ కీర్తి స్థావరాలకు కూడా విస్మయజనకము అనే వస్తువే చమత్కారక మగుటవలన వస్తువుచే వస్తువు వ్యంగ్యమవు తున్నదని గ్రహించడమె యుక్తము. అచేతనము వినడమనేది లోక సిద్ధము కాదు. కేవలమూ కవి ప్రతిభా నిర్మితము. అందువలన ఇది కవి ప్రౌఢోక్తి సిద్ధము.

క. ప్రౌ వస్తువుచే అలంకారధ్వని

వీరరుద్రభటాన్ దృష్ట్వా జయలక్ష్మీవృతాన్ రణే
కర్షంత్యరివధూకేశాన్ కాననే కంటకిద్రుమాః.

రణములో వీరరుద్ర భటులు జయలక్ష్మీ సమాలింగితులు కావడమును చూచి అరణ్యములో కంటక వృక్షాలు శత్రు స్త్రీ కేశములను గ్రహించుతున్నవి. కంటకిద్రుమకర్తృకమూ కేశకర్మకమూ అయిన కర్షణము ఇక్కడ వ్యంజకవస్తువు. జయ లక్ష్మీ సమా లింగితులయిన వీరరుద్రభటులను చూచి కంటకి వృక్షాలు మన్మథావేశము కలవి యో అనునట్లు ప్రతిభూపాల వధూకేశములను ఆకర్షించు చున్నట్లు ఉన్నవి. అనే ఉత్ప్రే క్షాలంకారము వ్యంగ్యము.

౧ క. ప్రౌ. అలంకారము చే వస్తుధ్వని

అపసరతి సఖీభి స్సమం వధ్వా శ్శిథిల మానాయాః
ఆత్మ గ్రహణ భయేనేవ సవిధ గతే మనోహరే దయితే.

మనోహరుడయిన దయితుడు సమీపమునకు రాగా ప్రణయమానము శిథిలమయిన నవవధువుయొక్క లజ్జ తనను గ్రహించుతాడేమో అనే భయముచే కాబోలు చెలికత్తెలతో సమంగా తొలగి పోతున్నది. దీనిలో ఆత్మ గ్రహణ భయముచే కాబోలు అనేది వ్యంజకమయిన ఉత్ప్రేక్ష. దీనిచే, మనోహరుడు నవవధువును ఆలింగన మొనర్చుకొన్నాడు. అనే వస్తువు వ్యంగ్యమవుతున్నది.

క. ప్రౌ. అలంకారముచే అలంకారధ్వని

అభయం యాచమానానాం కాకతీయేంద్ర విద్విషాం.
రక్షాం నాంగీకరోతీవ వనం శాఖాగ్ర కంపనైః.

అభయమును కోరుతూ ఉన్న కాకతీయేంద్ర శత్రువులకు శాఖాగ్ర కంపనములచే వనము రక్షణము చేయడమును అంగీకరింపనట్లు గా ఉన్నది. దీనిలో అంగీకరింపనట్లు ఉన్నది అనుట వాచ్యమగు వ్యంజకోత్ప్రేక్ష. దానిచే ప్రతాపరుద్ర శత్రురక్షణ మొనర్చుటకు వనము కూడా భయపడుతూ ఉన్నట్లు ఉన్నది అనే ఉత్ప్రేక్ష వ్యంగ్య మవుతున్నది. ఈ నిదర్శించిన నాలుగు ఉదాహరణములలో వాచ్యము లోక సిద్ధము కాదు. కవికల్పితము. కాబట్టి వీనిలో కవి ప్రౌఢోక్తి నిబంధనత ఉన్నదని గ్రహించాలి. ఇక కవి నిబద్ధ వక్తృ ప్రౌఢోక్తి సిద్ధార్థ శక్తి మూలకములను ఉదాహరించుతాము. అందు

యథా తథా భవతు నరనాథ! కురు రక్షణం శశినః,
యత్తయా కటాక్షోల్కా ఆజ్ఞప్తా స్తం మషీకర్తుం.

ఓ! నరనాథా! పూజ్యురాలయిన నాయిక ఎట్లాగయినా కానీ నీవు మాత్రము చంద్రుని రక్షణ చేయాలి ఏమంటావా?

ఆమె చంద్రుని మసీకరించడానికి తన కటాక్షోల్కలను ఆజ్ఞాపించింది. దీనిలో విరహాతుర అయిన ఆర్య చంద్రికను. సహించలేక రోష సముజ్జ్వలిత కటాక్షోల్కలచే చంద్రుని మసిగా చేస్తున్నది. ఆ చంద్రుని సంరక్షించుము. అనేది వ్యంజకమయిన వాచ్య వస్తువు. దీనిచే ఇటుపైె ఆమె జీవితమును ధరించడానికి శక్తురాలు కాదు. ఇపుడే నీవు రావాలి అనే వస్తువు వ్యజ్యమాన మవుతున్నది. ఈ పదము దూతీవాక్యము. దూతి కవి నిబద్ధవక్త. తద్వచనములలోని ప్రౌఢోక్తి వలన ఈ వ్యంగ్యము గోచర మవుతున్నది. కాబట్టి కవి నిబద్ధవక్తృ ప్రౌఢోక్తిని సమన్వయించుకోవాలి. ఇట్లాగె మున్ముందూను.

క. ని. ప్రౌ. వస్తువుచే అలంకార ధ్వని

కస్త్వం శుభ్రాఖిలాంగశ్చరసి ? నను యశో వీరరుద్రస్య పత్యుః
కోఽయం తే దివ్యదేహః స్ఫురతిపరిసరే ? మత్సుహృత్తత్ప్రతాపః,
ప్రచ్ఛాద్యాలం స్ఫురద్భిః కుముదసరసిజైః ఖ్యాపితం వస్స్వరూపం,
సోమార్కౌ ! స్వాగతం వా మపధిగిరి రహం కల్పితో నిస్తమస్కః,

ఈ పద్యము ప్రథమార్ధములో లోకాలోక పర్వతమునకూ వీరరుద్ర యశమునకూ జరిగిన ప్రశ్నోత్తర వాక్యములు నాలుగు ఉన్నవి. ద్వితీయార్థము లోకాలోక వాక్యము.

లోకాలోకము:— శుభ్రాఖిలాంగుడవై సంచరించుచున్నావు. నీవెవరవు ?

యశస్సు:— నేనా ? వీరరుద్రుని యశస్సును.

లోకా:— నీ పరిసరములో దివ్యదేహము కలిగి స్ఫురించుచున్నాడె. ఎవరీయన ?

యశ:—ఆతడు నాస్నేహితుడు. వీరరుద్రుని ప్రతాపము.

లోకా:— ఓ! నీవు రహస్యమును ఇక దాచనక్కర లేదులె. వికసించుచున్న కుముదములు పద్మములచే మీస్వరూపము బాగాని తెలిసిందిలె. మీరు సోమార్కులు. మీకు స్వాగతము. రండు. నేను అవధిపర్వతమును. మీరాక వలన నేను వితమస్కముగా చేయబడితిని. ఈ పద్యములో అవధిగిరి వీరరుద్ర యశస్సుల ఉక్తి ప్రత్యుక్తి రూపముగా ఉన్న వాచ్యవస్తువు వ్యంజకము. ప్రతాపరుద్రుని యశఃప్రతాపాలకుసోమార్క సాదృశ్యము గోచరమవుతున్నది కాబట్టి ఉపమాలంకారము వ్యజ్యమానమవుతున్నది. కవినిబంధనోక్తి మూలకత్వము సుగమము. ఈ విధముగా ఉక్తి ప్రత్యుక్తులు లోకసిద్ధములు కావు. అవి కవి నిబద్ధ వక్తృప్రౌఢోక్తి సిద్ధములు.

క. ని. ప్రౌ. అలంకారముచే వస్తుధ్వని

అప్రాప్య సేవావసరం నాథ! కాంతావృతస్య తే,
త్వత్కీర్తిం సేవమానేవ శ్యామా సర్వాంగపాండురా.

ఓః ప్రభూ! మా శ్యామ కాంతాసమావృతుడ వయిన నీయొక్క సేవావసరమును పొంద జాలక నీ కీర్తిని సేవించు దాని వలె సర్వాంగ పాండుర అయినది సుమా! శ్యామ—యౌవనవతి, నల్లనియువతి. దీనిలో శ్యామా సర్వాంగ పాండురత్వములో ధవళకీర్తి సేవనము హేతువుగా ఉత్ప్రేక్షిత మయింది. ఇది వ్యంజక మయిన ఉత్ప్రేక్షా లంకారము దీనిచే, నాథా! మీరు అవశ్యముగా అన్నివిధాలా ఆమెను స్వీకరించ వలసి ఉన్నది. అనే వస్తువు వ్యంగ్య మవుతున్నది.

క. ని. ప్రౌ. అలంకారముచే అలంకారధ్వని

పశ్య ! హలా ! వధ్వా స్తథాఽరూఢోఽపి నిర్భరో మానః
నృపతి సమాగమ సంభ్రమ సంజాత భయ ఇవాపసరతి.

చెలియలారా ! చూడండి! ఈ నవ వధువు నిర్భర ప్రణయ మానము ఆ విధముగా ఆరూఢమయినప్పటికీ నృపతి సమాగమము వలన పుట్టిన భయము కలిగిన దానివలె తొలగి పోతున్నది. దీనిలో భయము కలదాని వలె అనేది వాచ్యమగు వ్యంజకోత్ప్రేక్ష. దీనిచే కారణ మయిన ప్రియప్రార్థనము లేకుండానే కార్యమయిన మానినీ మనః ప్రసన్నత్వము కలిగినది అనే విభావనాలంకారము వ్యంజ్యమాన మవుతున్నది. *

ఇక ఈవిధముగానే ప్రబంధాదిగతముగా కూడా యథా సంభవముగా ఉదాహరణములను ఊహించుకోవాలి. ఇప్పటికి ఈ చెప్పిన ఉదాహరణములలో అవహిత చేతస్కులయిన వారు ఉదాహరణాంతరములను గ్రహించడము కష్టము కాదు. కాబట్టి వానిని మళ్ళా ఇక్కడ ఉల్లేఖించుట గ్రంథగౌరవమే అనే భావముతో ఇక్కడ చెప్పడము లేదు. ఇతర గ్రంథాలలో వీని ప్రపంచము ఉన్నది.

శబ్దశక్తిమూలధ్వని

శబ్దశక్తి మూలధ్వనివస్తుధ్వని అనీ, అలంకారధ్వని అనీ, రెండు విధాలు. అలంకారముకూడా వస్తువె. అయినా అది విచిత్ర వస్తువు అగుట వలన అలంకారమని వ్యపదేశము

* మూలగ్రంథములో అలంకారధ్వని తరువాత వస్తుధ్వని ఉదాహృతమయింది. ఇదివరకు వస్తుధ్వనితరువాత అలంకారధ్వని ఉదాహృతము కావడము ప్రక్రాంతమనే అభిప్రాయముతో ఔచిత్యాన్నిబట్టి ఈ వరుస అనుసృతమయింది.

పొందుతున్నది. వస్తువు రెండు విధములు. చిత్రవస్తువని అచిత్రవస్తువని. అచిత్రవస్తువునకు వస్తువని పేరు. ఇదే శుద్ధ వస్తువు చిత్రవస్తువు అలంకారము.

అలంకారోధ వస్త్వేవ శబ్దా ద్యత్రావభాసతే,
ప్రధానత్వేన స జ్ఞేయః శబ్దశక్త్యుద్భవో ద్విధా.

శబ్దమువలన అలంకారముకాని, కేవల శుద్ధ వస్తువుకాని ప్రధానముగా అవభాసించే స్థలములో శబ్దశక్త్యుద్భవధ్వని ద్వివిధమని గ్రహించాలి. శబ్దస్వాభావ్యమున అవభాసించుతున్న అలంకారవస్తువులు ప్రధానములుగా గోచరములు కాకపోయినట్లయితే శబ్దశక్తి మూలధ్వని అనే పేరు లేదు. అని ప్రాచీనులు అంటున్నారు.

శబ్దశక్తి మూలాలంకార ధ్వని

ఏష సత్యం రాజా శ్యామా ఖలు త్వం సమాగమో ద్వయోః,
కిం పున ర్న ప్రదోష కథా దృశ్యతే ఏతత్ఖలు ఆశ్చర్యం.

ఈతడు సత్యముగా రాజు. నీవు శ్యామవు కదా! మీ ఇద్దరికే సమాగమము ఉచితము. కాని ఇక్కడ ప్రదోషకథ కన్పడడము లేదే! ఇదే ఆశ్చర్యముగా ఉన్నది కదా! ఇది సామాన్యార్థము. ఓ! యౌవనవతీ! నీవు నృపాలకుని ప్రేమించినావు. మీకు సమాగమము యుక్తముగా ఉన్నది. మీ విషయమై దోషదూషిత కథలు వెలువడక పోవడము చిత్రముగా ఉన్నది. ఔలీ! అనేది ప్రకృతార్థము.

ఈతడు చంద్రుడు. నీవు రాత్రివి. మీకు సమాగమము యుక్తమే కదా! శ్యామా చంద్ర సమాగమము వలన ప్రదోష కాలము కలుగవలసింది కదా! అది లేదు. ఇది చిత్రము అని అప్రకృతార్థము. ఈ పద్యములో శ్యామా రాజ శబ్దములు

ప్రకరణ బలానుసారము వలన కాంతా నృపులకు వాచకములై ఉన్నవి. ఆశబ్దాల వలననె నిశాచంద్రప్రతీతి కలుగుతున్నది. కవి ఇక్కడ అనే కార్థ పద గుంఫనమును చేసినాడు. కాబట్టి అర్థాంతరము ఆతనికి వివక్షితమె అని తెలిసికోవాలి. ఇట్లా వివక్షితమైన అర్థాంతరమునకు ప్రకృతార్థమునకూ ఏదో ఒక సంబంధము ఉండితీరాలి. లేకపోతే కవి అసంబద్ధార్థాభిధాయి అవుతాడు. ఈ అసంబద్ధతా పరిహారానికై ఔపమ్యము ఇక్కడ కల్పింప వలసి ఉన్నది. అట్లా అభ్యూహితౌపమ్యానుసారముగా ఉపమాలంకారము వ్యంగ్యమవుతున్నది. ఇటువంటి స్థలములందు ఈ ఉపమాలంకారము శ్లిష్ట శబ్దములు ఉంటేనే కలుగుతుంది. శ్లిష్టశబ్దములు లేక పోయినట్లయితే అది కలుగదు. కనుకనే ఇది శబ్దశక్తి మూలమని భావము అన్వయ వ్యతిరేకములను బట్టి శబ్దానికే ఆ శక్తిని అంగీకరించాలి.

### శబ్దశక్తిమూల వస్తుధ్వని

కాంతారవాస సంతప్తా స్సంశృణుధ్వం హితాదితః,
కురుధ్వ మధునా రాజపాదసేవాం నరేశ్వరాః.

అరణ్య నివాసమున సంతప్తులయిన ఓ సామంత నరేశ్వరులారా! మేము మీకు హితులము మానుండి మీరు ఇది వినండి. మీరు ఇప్పుడు రాజ పాదసేవను ఒనరించండి. ఇక్కడ రాజపాదసేవా పదము ద్వ్యర్థము. రాజు పాదసేవ అని ఒకఅర్థము. చంద్రకిరణసేవ అని రెండవఅర్థము. శబ్దశక్తిచే ప్రకరణబలము వలన ప్రతాపరుద్రుని పాదముల సేవనే చేయాలి. అరణ్యావాసము వలన ఏల సంతాపపడుతారు? అనే వస్తువు వ్యంగ్యమవుతున్నది అరణ్యావాసములో

మామూలు సారతాప తప్తులకు చంద్రకిరణసేవ ఉపకారకము. ఇక్కడ ప్రతాపరుద్రుని వలన వ్యధితులైె సామంత నృపాలకులు వనవాస పరితాపమును పొందుతున్నారు. అనే అర్థము ప్రకృతములో ప్రకరణబలాను సారముగా తెలియ దగి ఉన్నది. ఈ విధముగా సంతప్తులకు చంద్రకిరణసేవ ఉపకారి కాదు. అటువంటి వారికి ప్రతాపరుద్రనృపుని పాదముల సేవ మాత్రమె ఉపకార జనకము. కాబట్టి రాజపాదసేవా శబ్దశక్తి స్వాభావ్యమువలన ప్రతాపరుద్రుని సేవ చేయండి, అని వస్తురూపమయిన అర్థము వ్యంగ్యమవుతూ ఉన్నదని సూక్ష్మముగా అవధారింపతగి ఉన్నది.

## ఉభయశక్తిమూలధ్వని

జిష్ణు రేష భుజస్తంభ జృంభమాణాద్భుతాయుధః,
ముంచంతు క్ష్మాభృత స్సర్వే నిజపక్ష విజృంభితం.

దీనిలో రెండర్థములు. ఓ! పృథివీపతులారా! ఇతడు జయన శీలుడు. ఈతని భుజ స్తంభములందు అద్భుత మయిన ఆయుధము విజృంభించు తున్నది. మీరందరూ మీ మీ సేనాబల విజృంభణమును కట్టిపెట్టుదురు గావుత. ఇది ప్రథమార్థము. ఓ!పర్వతములారా! ఈతను ఇంద్రుడు. ఈతని భుజ స్తంభములందు అద్భుతాయుధము విజృంభించుతూ ఉన్నది. మీరందరూ మీ మీపక్ష=రెక్కల విజృంభణమును విడిచి పెట్టుదురు గావుత. ఇది అప్రకృతార్థము. ఈపద్యములో "క్ష్మాభృతః,నిజపక్ష విజృంభితం,జిష్ణుః," అనే శబ్దాలు పరివృత్తి సహములు కానందువలన శబ్దశక్తి మూలత్వమును, "భుజ స్తంభ జృంభమాణా ద్భుతాయుధః" అనే శబ్దము పరివృత్తి సహము అవుతుంది కాబట్టి అర్థశక్తి మూలత్వమును గ్రహిం

చాలి. ఒకే వాక్యములో శబ్దార్థ శక్తులుకూడా ఉన్నందువలన ఉభయశక్తి మూలధ్వని. ఇది ఒకవాక్యము అగుటవలన వాక్యగితమె అని తెలియవలెను.

అసంలక్ష్యక్రమ ధ్వని

రసాది ధ్వనికి అసంలక్ష్య క్రమవ్యంగ్య మని పేరు. ఇట్లా అనడములో ప్రాచీనసమ్మతి ఉన్నది. రుద్రభట్టుని శృంగార తిలకమునందు ఇట్లాగే గడత మైనది.

రసభావ తదాభాస భావశాంత్యాది రక్రమః,
భిన్నో రసాద్యలంకారా దలంకార్యతయా స్థితః.

రసము భావము రసాభాస భావాభాస భావశాంత్యాదులు అక్రమములు అనబడును. అనగా అసంలక్ష్య క్రమములు అని అర్థము. ఈ అసంలక్ష్య క్రమవ్యంగ్యధ్వని అలంకార్యముగా ఉంటుంది. కాబట్టి రసాద్యలంకారములకంటె భిన్నము. భావశాంత్యాదు లనేచోట ఆదిపదమున భావోదయము భావసంధి భావశబలతలను గ్రహించాలి. భావానికె శాంత్యుదయ సంధి శబలత్వములు ఉంటవి. రసానికి శాంత్యాదులు ఉండవు. అక్కడ శాంత్యాద్యవస్థావర్ణనము చమత్కారకము కాదు. కాబట్టి రసానికి శాంత్యాదులను గణించడము లేదు.

ధ్వని వాదమును అంగీకరించని ప్రాచీనులు రసభావాదులు వర్ణింపబడిన స్థలములో రసవదాద్యలంకారములను అంగీకరించుతున్నారు. రసాదులు ప్రధానములయినా అప్రధానములయినా అవి అలంకారములె అని వారి భావము. ఇది యుక్తముగ్గా తోచదు. అలంకరించేది అలంకారమవుతుంది. అనగా 'అప్రధానమె అలంకారమవుతుంది. కాని ప్రధానము అలంకారము కాదు.' అని భావము. ప్రధానము ఎప్పుడూ

అలంకార్యమే. రసభావాదులు ప్రధానముగా వర్ణింపబడిన స్థలములో అలంకారమనే వ్యపదేశము చేయడము సముచితము కాదు. అక్కడ కూడా రసాదికము అలంకారమే అయ్యేటట్లయితే అది దేనిని అలంకరించుతుంది? తనకు తానే అలంకార మవుతుంది. అని అనడములో ఉపపత్తి లేదు. అలంకారము కంటె అలంకరింపబడేది భిన్నముగా ఉండాలి. ఇది లోకసిద్ధమయిన న్యాయము కూడాను. కామినీ కంఠసీమలో హారము అలంకారము. కంఠసీమ అలంకార్యము. హారము కంఠసీమను అలంకరించుతున్నది. హారము వేరు. కంఠసీమ వేరు. రెండిటికీ భేదము ఉన్నది. అట్లాగే ప్రకృతంలోకూడా భేదముఉండాలి. ప్రధానములుగా రసాదులు వర్ణింపబడినపుడు అవికూడా అలంకారములె అయితే వాటికన్న భిన్నముగా వానిచేత అలంకరింప బడేది ఒకటి ఉండితీరాలి కదా. అటువంటిది ఏమీ లేదే? తనకు తాను అలంకారము ఎట్లా అవుతుంది? రసభావాదులు అప్రధానముగా వర్ణింపబడే స్థలములోనే రసవదాద్యలంకారము లనివ్యవహరించడము యుక్తముగా ఉంటుంది. కాగా అలంకార్యముగా ఉండే రసభావాదులె అలక్ష్యక్రమ వ్యంగ్యధ్వనులు అనబడుతవి. రసప్రకరణములో రసభావ స్వరూప నిరూపణ ప్రపంచమును రసభావాదుల ఉదాహరణములనూ విశదముగా నిరూపించుతాము.

## గుణీభూతవ్యంగ్యము

మధ్యమ కావ్య లక్షణము ఇది వరలో నిరూపితమయింది. అదె గుణీభూతవ్యంగ్యమని నిరుక్తము. గుణీభూత వ్యంగ్యము అష్ట విధముగా ఉన్నది. ఇక వానిని నిరూపించుతాము. ఈ

విషయము కావ్యప్రకాశములో ఇట్లా ప్రతిపాదిత మయింది. అగూఢము అపరాంగము వాచ్యసిద్ధ్యంగము అస్ఫుటము సందిగ్ధము తుల్యప్రాధాన్యము కాక్వాక్షిప్తము అసుందరమూ అని మధ్యమకావ్యము అష్టవిధము అని. ఈ మమ్మటవచనము మావచన సంవాదమును చూపుతున్నది. వీనిలోనే లక్ష్యనిర్దేశముకూడా ఉన్నది. ఇక లక్షణలక్ష్యములను ప్రదర్శించుతాము.

## అగూఢము

కామినీ కుచకలశమువలె గూఢార్థమె చమత్కారకారి అవుతుంది. కాని అగూఢము అంతగా చమత్కారి కాదు. కాబట్టి అగూఢవ్యంగ్యము మధ్యము కావ్యమె. కావ్యార్థము ద్రావిడీ స్తనగతి అత్యంతమూ ప్రకాశము కారాదు. ఘూర్జరీకుచ యుగళ్రియ అత్యంతమూ నిగూఢమూ కారాదు. ఆంధ్ర వధూ కుచాభమై గూఢా గూఢముగా ఉండడమె మనోహరము. వ్యంగ్యము ఒకచోట ద్రుతప్రతీత మవుతుంది. అది అగూఢము. వేరొకచోట మధ్యమ రీతిని గోచర మవుతుంది. అది గూఢము. ఇంకా ఒకచోట విలంబిత ప్రతీతిక మవుతుంది. అది అస్ఫుటము. ద్రుతప్రతీతి విలంబిత ప్రతీతి ఉంటే మధ్యమ కావ్యమని మధ్యమ ప్రతీతి ఉన్నట్లయితే ఉత్తమకావ్యమని ఇక్కడి వివేకము. ఉదా:—

> ఔన్నత్యం యది కీర్త్యతే శిఖరిణః క్రుధ్యంతి నీచైఃకృతాః
> గాంభీర్యం యది వర్ణ్యతే జలధయః క్షుభ్యంతి గాధీకృతాః,
> తద్భూపం వర్ణయితుం బిభేమి యది వా జాతోఽస్మ్యగస్త్యః స్థితః
> త్వత్పార్శ్వే గుణవర్ణనే హా గిరే! శ్రీవీరరుద్రప్రభో!

ఓ! శ్రీవీరరుద్రప్రభూ! నేను మీ ఔన్నత్యమును కీర్తించినట్లయితే పర్వతములు క్రిందుగా చేయబడినవై క్రోధ

యుక్తములగును. గాంభీర్యమును వర్ణించి నట్లయితే జలధులు గాఢీ కృతములై క్షోభయుక్తము లవుతవి. కావున నిన్ను వర్ణించడానికి భయపడుతున్నాను. ఓ గుణ రత్న రోహణ గిరీ! (రోహణ పర్వతము రత్నాలకు ఉత్పత్తి భూమి) నేనీ విధముగా భయపడడ మెందుకు? నీపార్శ్వములో నేను ఇప్పుడు అగస్త్యుడనై ఉన్నాను. దీనివలన — జలనిధి పర్వతాలకు నేను భయపడను అని వ్యజ్యమానమవుతున్నది. కుంభసంభవుడు వామనీకృత వింధ్యాచలుడు. చుళుకీకృత పయోరాశి కదా! ఈ వ్యంగ్యము వాచ్యాయమానము గానే ఉన్నది. అందువలన అగూఢము.

### అపరాంగము

రసాదులకు రసాదులు అంగములు అయినట్లయితే అది అపరాంగమవుతుంది. ఇదిఅనేకవిధాలు కావడానికిఅవకాశము ఉన్నది. ఆభేదాలను ఈ విధముగా తెలియవచ్చును.

౧ ఒక రసమునకు వేరొక రసము అంగమగుట
౨ ,, భావము అంగమగుట
౩ ,, రసాభాస అంగమగుట
౪ ,, భావాభాస అంగమగుట
౫ ,, భావశాంతి అంగమగుట
౬ ,, భావోదయము అంగమగుట
౭ ,, భావసంధి అంగమగుట
౮ ,, భావశబలత అంగమగుట

ఇట్లాగే భావానికి భావము రసము భావాభాస రసాభాస భావశాంతి భావోదయము భావసంధి భావశబలతలు అంగము లగుటలలో కూడా అపరాంగత్వమును ఊహించాలి. ఈ విధము

గానే తదాభాసాదులకు తత్తదంగత్వములో కూడా అపరాంగత్వమును గ్రహించుట శక్యము. ఇదే అనేక భేదాలవుతుంది. ఇంకా ఈ విధముగా రసభావాద్యర్థానికి అనురణనము అంగమయినపుడు కూడా అపరాంగమె అవుతుంది. వాక్యార్థభూతముగా ఉన్న వాచ్యార్థానికి రసభావాదులు అంగములయినా అపరాంగమె అవుతుంది. ఇట్లాగే సంలక్ష్యక్రమధ్వని అంగమయినా అపరాంగమనియే గ్రాహ్యము. ఈ విధముగా ఈ భేదములు అనంతములు కావడానికి అవకాశము ఉన్నది. రసానికి రసము అంగమగుటమాత్రముఉదాహృతమవుతున్నది.

వీతవ్రీడ మపాస్తమాన ముదయద్వైస్వర్య మావిర్భవ
త్స్వేదం నిర్భరగాత్రవేపథు మిళన్మూర్ఛం గళద్బాష్పకం,
సంజాతప్రళయంచ కాకతిమహీనాథ ! స్మరోద్వేజితా
భూపాః శైలగుహాసు యాంతి విజనం భీత్యా సమాలింగితాః.

ఓ! కాకతిమహీనాథా ! భీతిసమాలింగితులయిన సామంత నృపాలకులు పర్వతగుహాలలో విజన ప్రదేశములను గురించి స్మరోద్వేజితులై పోతూ ఉన్నారు. వారలలో లజ్జ తొలగిపోతున్నది. అభిమానము అపాస్తమవుతున్నది. విస్వరత్వము ఉదయించుతున్నది. స్వేదము ఆవిర్భవించుతున్నది. నిర్భరమైన శరీరకంపము కలుగుతున్నది. మూర్ఛకలుగుతున్నది. కన్నీరు ప్రసరించుతున్నది. ప్రళయము ఉత్పన్నమవుతున్నది. ఈ పద్యములో భయాలింగితులయిన సామంతకుల వ్యాపార విశేషము ప్రకృతము. అది భయానక రసమును అభివ్యక్తము చేస్తున్నది. భయానక రసానికి భయము స్థాయిభావము. సామంతకులు తదాశ్రయులు. భయభీతులలో వీతవ్రీడత్వాదికముఉంటుంది. భయానకరసానుగుణముగాసన్నివేశింప చేయ

బడిన పీతప్రీడత్వాది విశేషణాల బలాన అప్రస్తుత నాయక ధర్మ ప్రతీతి కలుగుతున్నది. భీతి అనే నాయికచే సమాలింగిత సామంతనృపతులు స్మరోద్వేజితులై పీత ప్రీడత్వాదికము కలుగునట్లుగా నిర్జన ప్రదేశములను గురించి వెళ్లుచున్నారు అనేది నాయికా నాయక వ్యవహారము. ఇది శృంగార రసావగతి హేతువు ప్రకృతము కాబట్టి భయానకము ప్రధానము. శృంగారము అప్రధానము. అప్రధానమయిన శృంగారము భయానకమును పోషిస్తున్నది. కాబట్టి భయానకములో అంగమవుతున్నది. ప్రకృతబలాన భయానకము తెలియదగి ఉన్నది కాని వర్ణ్యమానమగుట శృంగారమె చమత్కారి అయినా అది భయానక రసానికి అంగమవుతున్నందు వలన అపరాంగము. ప్రధానమయినా భయానకము అంతగా చమత్కారికాదు. కాబట్టి ఇక్కడ ధ్వని అనే వ్యవహారము లేదు. ఈ విధముగా ఇతరోదాహరణములను గ్రహించాలి.

## వాచ్యసిద్ధ్యంగము

ప్రతీయమానమయిన అర్థము వాచ్యసిద్ధిలో (ఉత్పత్తిలో) అంగము అయినట్లయితే వాచ్యసిద్ధ్యంగము అవుతుంది. అపరాంగము ఇటువంటిది కాదు. తనంతట తాను సిద్ధమయిన అర్థానికి అంగమయినట్టిది అపరాంగము. వాచ్యసిద్ధిలోనే ఉపకరించేది వాచ్యసిద్ధ్యంగము. ఉదా:—

> కరాళః కాకతీంద్రస్య కరవాల నవాంబుదః,
> ధారయా శమయత్యుగ్రం ప్రతాపజ్వలనం ద్విషాం.

కాకతీంద్రుని కరాళమయిన ఖడ్గమేఘము శత్రువుల ఉగ్రమయిన ప్రతాపాగ్నిని ధారచే శమింపచేస్తున్నది.

ఇక్కడ ధారా పదము ఉభయార్థకము. కత్తి అంచు అని ఒక అర్థము. జలధార అని రెండవ అర్థము. వీనిలో జలధారా రూపార్థము వ్యంగ్యము. ప్రకరణ బలాన అభిధ ఖడ్గధారార్థములోనె నియంత్రిత మవుతున్నది కదా! ఈ పద్యములోనె "కరవాలనవాంబుదః" అనే చోట కరవాలము నందు నవాంబుదత్వము సమారోపిత మవుతున్నందు వలన రూపకాలంకారము ఉన్నది. "ప్రతాపజ్వలనం" అనే చోటకూడా రూపకాలంకారము ఉన్నది. ఈ రూపకము వాచ్యభూతము. ధారాపద వ్యంగ్యమయిన జలధార ఈ రూపకానికి సిద్ధిని ఆపాదించుతున్నది. రూపకము స్వనిర్వాహానికై ప్రతీయమాన జలధారను అపేక్షించు తున్నదని భావము. ఈ వ్యంగ్యము లేకపోయినట్లయితే "కరవాల నవాంబుదః" అనె చోట రూపకము సిద్ధించదు. "కరవాల నవాంబుదః" అనేది రూపకసమాసమా? ఉపమితసమాసమా? అనే సందేహము కలుగుతుంది. ఖడ్గధారయందు జలధారాత్వము ఆరోపిత మయినట్లుగా వ్యంగ్యముగా గోచరమవుతున్నది. అందువలన అది వ్యంగ్యరూపకము. ఖడ్గధారయందు జలధారాత్వారోపము ఉంటేనే కాని కరవాల మందు నవాంబుదత్వారోపము కుదరదు. ఇట్లా వ్యంగ్యము వాచ్య భూత రూపకానికి సిద్ధికారి. కాబట్టి ఇది వాచ్యసిద్ధ్యంగమనే గుణీభూతవ్యంగ్యమవుతున్నది.

సామాన్య ధర్మము ప్రయోగింప బడకుండా ఉన్నప్పుడే ఉపమిత సమాసము ఉపపన్నమవుతుంది. సామాన్య ధర్మము ప్రయుక్తమయినట్లయితే రూపక సమాసమే కాని ఉపమిత సమాసము కాదని వ్యాకరణ శాస్త్ర నియమము. ఇక్కడ

"కరాళః" అనేది కరవాలానికి నవాంబుదమునకూ సమాన ధర్మము. కాగా ఈ స్థలంలో రూపక సమాసమె కాని ఉపమిత సమాసము కాదు. అందుచే జలధారా రూపవ్యంగ్యము లేక పోయినట్లయితే సమాస సందేహము కలుగుతుంది అని అనడము ఉచితము కాదు. సామాన్య ధర్మ ప్రయోగము రూపక సాధకముగా ఉన్నది కదా! అందువలన ఇక్కడ జలధారా రూపవ్యంగ్యము రూపక సిద్ధి కృత్తనుట సముచితముగా లేదు. ఈ వ్యంగ్యము లేకపోయినా రూపక సిద్ధిలో అంతరాయములేదు. వ్యంగ్యాతిరిక్తార్థముచే వాచ్యము ఉపపన్నమవుతూ ఉన్నపుడు వ్యంగ్యము వాచ్య సిద్ధ్యుపకారక మయినా గుణీభూత మనరాదని సాహిత్యవిదుల సిద్ధాంతము. ఈ హేతువులను బట్టి ఈ పద్యము ధ్వన్యుదాహరణమె అవుతుంది. కాని వాచ్య సిద్ధ్యంగ రూప గుణీభూతోదాహరణము కాదు. విద్యానాథుడు దీనిని ఇట్లా ఉదహరించడములో ఉపపత్తిమృగ్యముగా ఉన్నదని గ్రహించాలి.

## అస్ఫుటము

వ్యంగ్యము మధ్యమ ప్రతీతికము కాక విలంబిత ప్రతీతికమయినట్లయితే అస్ఫుటమనే గుణీభూత వ్యంగ్యమవుతుంది. ఉదా:—

> వీరరుద్రకృపాణస్య మహిమా కోప్యనంకుశః,
> ప్రసూతే కీర్తిగంగాం యః పీత్వా ద్విషదసృఙ్నదీం.

వీరరుద్రుని కృపాణము యొక్క మహిమ అనంకుశము. అది అనిర్వాచ్యము. అడ్డులేనిది. ఆ కృపాణము శత్రురక్తనదిని పానము చేసి కీర్తిగంగను కలుగజేస్తున్నది కదా! దీనిలో జహ్నుమహర్షి కంటె కృపాణమునకు ఆధిక్యము

ప్రతిపాదింపబడినందున వ్యతిరేకా లంకారము వ్యంగ్యము. అది అత్యంతమూ నిగూఢముగా ఉన్నది. ఇదివరలో జహ్నుమహర్షి తన ఆశ్రమ పదములో ప్రవహించే గంగా నదిని పానముచేసి భగీరథుడు ప్రార్థించగా తన శ్రోత్రమార్గము నుండి గంగను విడిచిపెట్టినాడు. ఆతడు గంగనే త్రాగినాడు. గంగనె విడచినాడు. కృపాణము రక్తమును త్రాగి కీర్తిని ప్రసరించేటట్లు చేస్తున్నది. త్రాగినది వేరు. విడిచినది వేరు. కావున జహ్నువుకన్న ఆధిక్యము కలదని వ్యంగ్యము గూఢగూఢముగా ఉన్న ఈ అర్థము కథనము వలననె తెలియబడవలసి ఉండుటచే అస్ఫుటము.

## సందిగ్ధము

కవి వివక్ష వ్యంగ్యార్థములో ఉన్నదా? వాచ్యార్థములో ఉన్నదా? అనే సందేహము ఉభయ కోటికమై ప్రధానముగా ఉన్నప్పుడు సందిగ్ధము అవుతుంది. వ్యంగ్య వివక్షయే కవికి ఉన్నా వాచ్యముకూడా వివక్షితమై ఉండడము ఉన్నదికదా! ఉదా:—

> కాకతీశ్మాపతే ర్దృష్టి రనురాగతరంగితా,
> లగ్నా కల్హారమాలేవ వధ్వా స్తుంగే కుచద్వయే.

కాకతీసుని అనురాగ తరంగితమైన దృష్టి నవవధూస మున్నతకుచద్వయమునందు కల్హారమాలవలె సంలగ్నమయింది. దీనిలో కాకతీయుడు ఆలింగనాభిలాషుడై ఉన్నాడని వ్యంగ్యము. ఈ పద్యవాక్యము ఆలింగన కాంక్షలోనే విశ్రాంత మవుతున్నదా? కేవలమూ ఆ విధముగా స్తనమండలావలోకనములోనె విశ్రాంతిని పొందుతున్నదా? అని ఇక్కడ సందేహము కలుగుతున్నది. ఈ సందిగ్ధానికే

"కరాళః" అనేది కరవాలానికి నవాంబుదమునకూ సమాన ధర్మము. కాగా ఈ స్థలంలో రూపక సమాసమె కాని ఉపమిత సమాసము కాదు. అందుచే జలధారా రూపవ్యంగ్యము లేక పోయినట్లయితే సమాస సందేహము కలుగుతుంది అని అనడము ఉచితము కాదు. సామాన్య ధర్మ ప్రయోగము రూపక సాధకముగా ఉన్నది కదా! అందువలన ఇక్కడ జలధారా రూపవ్యంగ్యము రూపక సిద్ధి కృత్తనుట సముచితముగా లేదు. ఈ వ్యంగ్యము లేకపోయినా రూపక సిద్ధిలో అంతరాయము లేదు. వ్యంగ్యాతిరిక్తార్థము చే వాచ్యము ఉపపన్నమవుతూ ఉన్నపుడు వ్యంగ్యము వాచ్య సిద్ధ్యుపకారక మయినా గుణీభూత మనరాదని సాహిత్య విదుల సిద్ధాంతము. ఈ హేతువులను బట్టి ఈ పద్యము ధ్వన్యుదాహరణమె అవుతుంది. కాని వాచ్య సిద్ధ్యంగ రూప గుణీభూతోదాహరణము కాదు. విద్యానాథుడు దీనిని ఇట్లా ఉదహరించడము లో ఉపపత్తిమృగ్యముగా ఉన్నదని గ్రహించాలి.

## అస్ఫుటము

వ్యంగ్యము మధ్యమ ప్రతీతికము కాక విలంబిత ప్రతీతిక మయినట్లయితే అస్ఫుటమనే గుణీభూత వ్యంగ్యమవుతుంది.

ఉదా:—

వీరరుద్రకృపాణస్య మహిమా కోప్యనంకుశః,
ప్రసూతే కీర్తిగంగాం యః పీత్వా ద్విషదసృఙ్నదీం.

వీరరుద్రుని కృపాణము యొక్క మహిమ అనంకుశము. అది అనిర్వాచ్యము. అడ్డు లేనిది. ఆ కృపాణము శత్రురక్త నదిని పానము చేసి కీర్తిగంగను కలుగజేస్తున్నది కదా! దీనిలో జహ్నుమహర్షి కంటె కృపాణమునకు ఆధిక్యము

ప్రతిపాదింపబడినందున వ్యతిరేకాలంకారము వ్యంగ్యము. అది అత్యంతమూ నిగూఢముగా ఉన్నది. ఇదివరలో జహ్నుమహర్షి తన ఆశ్రమ పదములో ప్రవహించే గంగా నదిని పానముచేసి భగీరథుడు ప్రార్థించగా తన శ్రోత్రమార్గము నుండి గంగను విడిచిపెట్టినాడు. ఆతడు గంగనే త్రాగినాడు. గంగనె విడచినాడు. కృపాణము రక్తమును త్రాగి కీర్తిని ప్రసరించేటట్లు చేస్తున్నది. త్రాగినది వేరు. విడిచినది వేరు. కావున జహ్నువుకన్న ఆధిక్యము కలదని వ్యంగ్యము గూఢగూఢముగా ఉన్న ఈ అర్థము కథనము వలననె తెలియబడవలసి ఉండుటచే అస్ఫుటము.

## సందిగ్ధము

కవి వివక్ష వ్యంగ్యార్థములో ఉన్నదా? వాచ్యార్థములో ఉన్నదా? అనే సందేహము ఉభయ కోటికమై ప్రధానముగా ఉన్నప్పుడు సందిగ్ధము అవుతుంది. వ్యంగ్య వివక్షయే కవికి ఉన్నా వాచ్యముకూడా వివక్షితమై ఉండడము ఉన్నదికదా! ఉదా:—

కాకతిక్ష్మాపతే ర్దృష్టి రనురాగతరంగితా,
లగ్నా కల్హారమాలేవ వధ్వా స్తుంగే కుచద్వయే.

కాకతీసుని అనురాగ తరంగితమైన దృష్టి నవవధూసమున్నతకుచద్వయమునందు కల్హారమాలవలె సంలగ్నమయింది. దీనిలో కాకతీయుడు ఆలింగనాభిలాషుడై ఉన్నాడని వ్యంగ్యము. ఈ పద్యవాక్యము ఆలింగన కాంక్షలోనే విశ్రాంత మవుతున్నదా? కేవలమూ, ఆ విధముగా స్తనమండలావలోకనములోనె విశ్రాంతిని పొందుతున్నదా? అని ఇక్కడ సందేహము కలుగుతున్నది. ఈ సందిగ్ధానికే

సందిగ్ధ ప్రాధాన్యమని పేరు. వ్యంగ్యము చమత్కారియై ప్రధాన మవుతున్నదా? వాచ్యమె ప్రధాన మవుతున్నదా? అని సమన్వయమును చూచుకోవాలి.

తుల్య ప్రాధాన్యము

వాచ్యార్థానికి వ్యంగ్యార్థానికి సమాన ప్రాధాన్యము ఉన్నట్లయితే తుల్య ప్రాధాన్యమవుతుంది. సామాన్యముగా వాక్యములో ఒకే అర్థమె ప్రధానము. ఇతరార్థములు ఉన్నా తదంగ భావమును పొంది తీరాలి. రెండర్థములకూ సమప్రాధాన్యము ఉన్నట్లయితే ఏకార్థతకు భంగము వాటిల్లుతుంది. ప్రకృతములో వాచ్య వ్యంగ్యములు సమబలములయినా ఐకార్థ్యభంగదోషము వాటిల్లుతుంది. కాని ఈ వాక్యభేదమనేది లౌకికవాక్యములలో దోషము కాదని ఇదివరలో ప్రతిపాదితము. ఉదా:—

నృపాః ప్రతాపరుద్రస్య నిషేవధ్వం పదాంబుజే,
అన్యథాఽస్య మనస్తావదకస్మాదపి కలుషాయతే.

ఓ! నృపాలకులారా! ప్రతాపరుద్రుని పదాంబుజములను సేవించుడు. కాకపోయినట్లయితే అంతటి ప్రసన్నతకల ప్రతాపరుద్రుని మనస్సు కలుష మవుతుంది సుమా. ఈ చెప్పినది వాచ్యార్థము. ప్రతాపరుద్రుని పాదసేవను పరిత్యజించినట్లయితే నగరనివాసము దుర్లభమవుతుంది అని వ్యంగ్యము. ఈ వ్యంగ్యమూ పూర్వము చెప్పిన వాచ్యమూ సమప్రధానములై ఉన్నవి. కవి ఎల్లప్పుడూ వ్యంజనైకప్రవణుడై ఉండాలి. దీనిలో అట్లా కాక వాచ్యప్రవణత కూడా కన్పడుతున్నది. వాచ్యవ్యంగ్యముల ప్రాధాన్యాది నిర్ణయములో సహృదయులె ప్రమాణము అన్యథాన్యథావలికే ఉద్ధతులు ప్రమాణముకారు.

## అసుందరము

ఉద్దేశ క్రమానుసారముగా కాక్వాక్షిప్తమును ఉదాహరించవలసింది. కాని దానిని ఉల్లంఘించి విద్యానాథుడు అసుందరమును ఉల్లేఖించుతున్నాడు. దీనివలన ఉద్దేశక్రమము వివక్షితము కానట్లు సూచిత మవుతున్నదని ఊహించవచ్చును. కాని ఈవిధముగా భావించుట ఉచితముగా ఉంటుంది. కొందరు కాక్వాక్షిప్తమును గుణీభూతముగా తలచరు. స్వరము వేదమునందే విశేషార్థ ప్రతీతి కృత్తని వారిభావన. కావ్య స్వరము విశేషాధాయకము కాదని కూడా వారి తలంపు. కాక్వాక్షిప్తము కూడా గుణీభూతమె అని విద్యానాథ హృదయము. దీనిని ఆ విధముగా తలచని వారి వాదమును నిరసించడానికి కాక్వాక్షిప్తమును చివరకు ఉంచి ప్రస్తుతము అసుందరమును నిరూపించడము సముచితము అని భావించి విద్యానాథుడు అసుందరమునే ఉదాహరించు చున్నాడు.

ఏకశిలా మహిళాణాం శ్రుత్వా నరేంద్ర దర్శనామోదం
గురుజన నియంత్రితాయా వధ్వాః శ్యామలం వదనం.

ఏకశిలా నగరములోని యువతుల నరేంద్రదర్శన నిమిత్తకమయిన సంతోష మహాలాభమును వినగా గురుజనముచే నియంత్రితురాలయిన ఒక నవవధూ వదనము శ్యామలమయింది. దీనిలో నరేంద్ర దర్శన నిమిత్తమయిన హర్షమును ఊహించు వధువు మలినముఖము కలదయిందని వాచ్యము. గురుజన నియంత్రితనయిన నేను నరేంద్రుని చూడడానికి వెళ్ళకపోయితిని కదా! అని వ్యంగ్యార్థము. వాచ్యమె మనోహరముగా ఉన్నది. వ్యంగ్యము సుందరముగా లేదు. కాబట్టి అసుందరము.

## కాక్వాక్షిప్తము

కాకువు అనేది శబ్ద ధర్మము. అది ఒక స్వర విశేషము. అట్టి కాకువుచే అర్థాంతము ఆక్షిప్త మయినట్లయితే అది కూడా గుణీభూత వ్యాంగ్యమె అవుతుంది. అక్కడ ప్రతీయమానార్థము శబ్దస్పృష్టమవుతుంది. కాబట్టి ధ్వని వ్యవహారము ఉచితము కాదు. కాకువు కొన్ని స్థలములలో ప్రశ్నమాత్ర పర్యవసాయి అవుతుంది. వ్యంగ్యము దానిచే సమున్నీతము కాదు. అటువంటి స్థలములో వ్యంగ్యము గుణీభావము పొందదు. కేవలకాకుసామర్థ్యమున వ్యంగ్యము గోచరమగుస్థలములో కాకువు ప్రశ్న పర్యవసానము పొందదు. కాబట్టి వ్యంగ్యానికి గుణీభావమె కలుగుతుంది ఉదా:—

> ప్రియసఖి! కథయ! అధికా క్షోణీ లక్ష్మీః సరస్వతీ మత్తః?
> యాం బహుమన్యతే స సరనాథో గుణ విశేషజ్ఞః.

గుణవిశేషజ్ఞు డయిన ఈ సరనాథుడు వారినె అధికముగా అభిమానించు తున్నాడు కదా! నాకన్న క్షోణి కాని లక్ష్మి కాని సరస్వతికాని అధికురాలా? ప్రియసఖీ నీవేచెప్పు. దీనిలో నాకన్న అధికురాలా? అని ప్రశ్నార్థకముగా కాకు కల్పనచేసినట్లయితే అధికురాలు కాదు. అనే వస్తువు వ్యంగ్యమవుతుంది. అధికురాలు కాదు. అనే నిషేధార్థమునకు వాచకము ఏమీ దీనిలో లేదు. అది కేవలమూ వాచ్యసామర్థ్య లభ్యమె. అయినా కాకుసంస్పర్శము వలన గూఢత్వము పోయింది. తన్నిమిత్తముగా చారుత్వాతిశయముకూడా భగ్నమయింది. వ్యంగ్యము శబ్ధధర్మ స్పృష్టమయినది అన్నమాట. అందువలన గుణీభూతమే అవుతున్నది.

## చిత్రము

ఇప్పటికి గుణీభూత వ్యంగ్య ప్రపంచ నిరూపణము అయింది. ఇక అధమ కావ్యమును ప్రపంచించాలి. అధమ కావ్యము చిత్రము అని నిరూపితమె. చిత్రకావ్యము శబ్దాలంకార చిత్రమని అర్థాలంకార చిత్రమని ద్వివిధమై అవాంతర భేదాలతో బహువిధమవుతుంది. తత్ప్రపంచము అలంకార ప్రకరణములో వ్యక్తము అవుతుంది.

## మహాకావ్యము

ప్రబంధములు ధ్వన్యాశ్రయములు. ప్రబంధములంటే ఎటు వంటివో లక్షణము లేకపోతే తెలియదు. కాబట్టి మహా కావ్యాది ప్రబంధముల లక్షణ నిరూపణమును చేసెదము. నగరము సముద్రము పర్వతము ఋతువులు చంద్రోదయ సూర్యోదయ వర్ణనము ఉద్యానవిహారము జలక్రీడ మధు పానము రతోత్సవము విప్రలంభము వివాహము కుమా రోత్పత్తి వర్ణనము రాజకీయ మంత్రాలోచనము దూత్యము జైత్రయాత్ర యుద్ధము నాయకుని అభ్యుదయమూ అనే పదు నెనిమిది వర్ణితములయి నట్లయితే మహాకావ్యమని వ్యవ హారము కలుగుతుంది. వీనిలో కొన్ని లేకపోయినా మహా కావ్యత్వమునకు లోటులేదు. ఇంకా మహాకావ్య విషయమై అనేక విశేషములు గ్రంథాంతరములలో నిరూపితము లయి నవి. ఇట్టి ఈ కావ్యము మూడువిధములు; గద్యమయము పద్యమయము ఉభయమయమూ అని.

> అపాదః పదసంఘాతో గద్యం పద్యం చతుష్పదం

అన్నట్లు పాదరహితమైన పదముల సమూహము గద్యము అవుతుంది. నాలుగు పాదముల నియతి ఉన్నట్లయితే పద్యము

అవుతుంది. కాదంబరి తిలకమంజరి మొదలయినవి గద్య కావ్యములు. రఘువంశము మొదలయినవి పద్యకావ్యములు. రామాయణ చంపువు మొదలయినవి ఉభయమయములు.

## ఉపకావ్యము

అసర్గబంధమపి యదుపకావ్య ముదీర్యతే,

మహాకావ్యములో సర్గ నిబంధనము ఉంటుంది. సర్గనిబంధనము లేకపోయినట్లయితే ఉపకావ్య మవుతుంది. సూర్య శతకాది గ్రంథములలో సర్గనిబంధనము లేదు. కాబట్టి అవి ఉప కావ్యములు.

## చంపువు

గద్య పద్యమయం కావ్యం చంపూరిత్యభిధీయతే,

గద్య పద్య మయముగా ఉండే కావ్యము చంపువు అన బడును. చంపూరచన క్లిష్ట సుందరము. గద్య పద్య నిబంధ నము ఉన్నంతమాత్రాన యథేచ్ఛారచనకు అవకాశము ఈయబడదు. విషయా న్యాయౌచిత్యమును అనుసరించి గద్య పద్యములు ఉండవలయును.

## ఆఖ్యాయిక

వక్త్రం చాపరవక్త్రం చ సోచ్ఛ్వాసత్వం చ భేదకం,
వర్ణ్యతే యత్ర కావ్యజ్ఞైః అసావాఖ్యాయికా మతా.

వక్త్రము అపరవక్త్రము ఉచ్ఛ్వాసములు కలిగి ఉండుట అనే భేదకధర్మములు వర్ణింప బడిన స్థలములలో కావ్య జ్ఞులు ఆఖ్యాయిక అని తలంచుతారు. వక్త్రము అపర వక్త్రమూ అనేవి వృత్తవిశేషములు. ఆఖ్యాయికలో ఇవి నిరూపితములు కావలయును. ఆఖ్యాయిక ఉచ్ఛ్వాస

విభాగములచే పరిచ్ఛిన్నము కావలయును. హర్షచరితము మొదలయినవి ఆఖ్యాయికలు. కేవలమూ గద్యనిబంధనము ఉన్నట్లయితే కథ అవుతుంది. కాదంబర్యాదులు ఇటువంటివే. అందువలన అవికథలు. కథ ఆఖ్యాయిక అనేవి గద్యజాతికి సంబంధించినవి. ఈ చెప్పిన ఆఖ్యాయికా ధర్మములు కథ కన్న భేదమును సంపాదించుతవి.

వక్త్రము అనేది మాత్రావృత్తములలో ఒకటి. దీనిలో నాలుగు పాదములు ఉంటవి. పాదములో ఎనిమిది అక్షరములు. అపరవక్త్రమనేది అర్ధ సమవృత్తములలో ఒక భేదము. వీని లక్షణములు వృత్త రత్నాకరములో ఈ విధముగా నిరూపితములయినవి.

వక్త్రం నాద్యాన్నసౌ స్యాతామబ్ధే ర్యోఽనుష్టుభి ఖ్యాతం,
అయుజి న న ర లా గురుః సమే, తదపరవక్త్ర మిదం న జౌ జరౌ.

అనుష్టుప్ వృత్తములో పాదానికి ఎనిమిది అక్షరాలు. నాలుగు పాదాలు. ఆ అనుష్టుప్పులో ప్రథమాక్షరం తరువాత నగణ సగణములు ఉండక నాలుగో అక్షరము తరువాత యగణము ఉన్నట్లయితే వక్త్రము అనే వృత్తమవుతుంది. మొదటి అక్షరము ఎనిమిదవ అక్షరమూ గురు లఘువులలో ఏదయినా కావచ్చు. దీనిలో నాలుగో అక్షరానికి పూర్వము గణాపేక్ష లేదు. అక్షర ప్రాధాన్యం ఉంటుంది. అయిదవ వర్ణము నుండి గణప్రాధాన్యం ఉంటుంది. అందువలననే దీనిని మాత్రా వృత్తము అని అంటారు. అపరవక్త్రములో నాలుగు పాదాలు. ప్రథమ తృతీయ పాదాలలో రెండు నగణాలు ఒక రగణము ఒక లఘువు ఒక గురువూ ఉండాలి. ద్వితీయ చతుర్థ పాదాలలో నగణము రెండు జగణాలు రగణమూ ఉండాలి. ౧, 3

పాదాలలో ౧౧ అక్షరాలు. ౨, ౪ పాదాలలో ౧౨ అక్షరాలు. అందువలననే దీనికి అర్థసమవృత్తాలలో గణనము.

క్షుద్రప్రబంధములు

ఇక క్షుద్రప్రబంధముల నిరూపింతుము. ఇవి అనేక విధములుగా ఉన్నవి. ఉదాహరణము చక్రవాళము భోగావళి బిరుదావళి తారావళి అనువాని స్వరూపములు మాత్రము ఇక్కడ నిరూపితము లగును.

ఉదాహరణము

యేన కేనాపి తాళేన గద్యపద్య సమన్వితం,
జయత్యుపక్రమం మాలిన్యాదిప్రాస విచిత్రితం,
తదుదాహరణం నామ విభక్త్యష్టక సంయుతం.

ఆది తాళము జంపె తాళము ఒంచత్పుట తాళము మొదలగు సంగీతశాస్త్ర ప్రసిద్ధములయిన తాళములలో ఏదో ఒక తాళమునకు అనుకూల గతి కలిగిన గద్యములు పద్యములూ ఉండాలి. ఉపక్రమములో 'జయతి' అని ఉండాలి. మాలిన్యాది వృత్తములతో రమ్యపద్య నిబంధనము ఉండాలి. అనంతరము 'ఇతి' అనే ఉపక్రమము ఉన్న ఎనిమిది వాక్యములు. ఈ వాక్యములు ప్రాససహితములు కావలయుట, తాళ సహితములు కావలయుటా విధి. ఈపద్ధతి ప్రతి విభక్తిలోనూ కూడుకొని ఉండాలి. సంబోధన విభక్తి ఎనిమిదవది. ఒక్కొక విభక్తికి ఎనిమిది వాక్యములు చొప్పున ఎనిమిది వాక్యాష్టకములు ఉండాలి. అనంతరము సర్వవిభక్త్యంకితమయిన శ్లోకము ఆవశ్యకము. తుదకు కవి ప్రబంధ నామాంకిత మయిన పద్యవిశేషము అపేక్షితము. ఈలోపుగా విభక్త్యాభాసలను నిబంధింప వలయును ఇట్టి విధానములు

కల కావ్యము ఉదాహరణము. విభక్తులవలె ఉండే విభక్తులు కానిపదములు విభక్త్యాభాసములు. విహాయ, విహాస్య, కథం, చిరాయ, చిరాత్, చిరస్య అనేవి విభక్తులవలె ఉన్నవి కాని విభక్తులు కావు. అవి విభక్త్యాభాసములు. మాలినీ వృత్తము ప్రతిపాదములోనూ నగణ నగణ మగణ యగణ యగణములు ఉంటవి. ఎనిమిదవ స్థానమున ఏడవ స్థానము లోనూ విరతి రూపముగుయతి ఉండవలెను. ఇది మాలినీవృత్త లక్షణము.

## చక్రవాళము

సంబోధన విభక్త్యా యత్ప్రచురం పద్యపూర్వకం,
విముక్తపునరాకృష్టశబ్దం స్యాచ్చక్రవాళకం.

సంబోధన విభక్తి బహుళముగా ఉండాలి. పద్యపూర్వకముగా ఉండాలి. గద్యముకూడా కళికారూపముగా అనుప్రవిష్టము కావచ్చును. విముక్త పునరాకృష్ట శబ్దములు ఉండాలి. ఆద్యంత పదములు శృంఖలితములై ఉండాలని భావము. ఇట్టిది చక్రవాళము అనబడుతుంది.

## భోగావళి

ఆద్యంతపద్య సంయుక్తా సంస్కృత ప్రాకృతాత్మకా।
అష్టభిర్వా చతుర్భిర్వా వాక్యైః స్కంధసమన్వితా,
ప్రతిస్కంధం భిన్నవాక్యరీతి ర్దేప స్పృహోచితా
సప్తితో దేపశస్తాది రేషా భోగావళీ మతా.

మొదటా చివరా పద్యాలు ఉండాలి. ఈ భోగావళి సంస్కృత ప్రాకృతాత్మకముగా ఉంటుంది. ఎనిమిదిగాని నాల్గుకాని వాక్యములు స్కంధస్కంధములుగాకూడి ఉండాలి. ప్రతిస్కంధములోనూ వాక్యరీతి భిన్న భిన్నముగా ఉండ

వలయుట అవశ్యకము. దేవ నృప అనే పదాలతో అది సము చితము కావాలి. అంతటా దేవశబ్దము మొదట్లో గ్రథితము కావాలి. ఇట్టిది భోగావళి. దీనిలో భోగోపకరణములు అయిన ఉద్యాన సంపదాదుల వర్ణనము తరచుగా ఉండాలి.

బిరుదావళి

వర్ణ్యమానాంకబిరుద వర్ణన ప్రచురోజ్వలా,
వాక్యాడంబర సంయుక్తా సా మతా బిరుదావళీ.

భోగావళీ స్వరూపానికి బిరుదావళీ స్వరూపానికీ అంతటా సామ్యము ఉన్నది. భోగావళి విశేషములన్నీ దీనిలోఉండాలి. ఇది ఒక్కటి మాత్రము దీనిలో విశేషము. వర్ణింప బడువాని చిహ్నములు బిరుదములూ ప్రచురముగావర్ణితములు కావాలి. వాక్యాడంబరము అతిశయించి ఉండాలి. ఇది బిరుదావళి అనే క్షుద్రప్రబంధము.

తారావళి

తారాణాం సంఖ్యయా పద్యై ర్యుక్తా తారావళీ మతా.

నక్షత్రముల సంఖ్యకల పద్యములతో కూర్చబడినది తారావళి అవుతుంది. ఇట్లాగే చతుశ్శత్తరము చతుర్భద్రము మొదలయినవి అనేకములు ఉన్నవి. ఇవి అన్నీ కవిప్రౌఢోక్తి సిద్ధములయిన క్షుద్రప్రబంధములు. విస్తరభయమున వానిని అన్నిటినీ ఇక్కడ చెప్పజాలము. యథాసంభవముగా ఊహించుట సముచితము.

కావ్యప్రకరణము

# నాటక ప్రకరణము

## నాట్య స్వరూపము

ముందుగా నాట్య స్వరూపము నిరూపింప బడును.

చతుర్విధై రభినయై స్సాత్వికాంగిక పూర్వకైః
ధీరోదాత్తా ద్యవస్థానుకృతి ర్నాట్యం రసాశ్రయం.

సాత్వికము ఆంగికము వాచికము ఆహార్యము అనేవి చతుర్విధాభినయములు. వీనిచే ధీరోదాత్తా ద్యవస్థలను అనుకరించుట నాట్యము. ఈనాట్యము రసమును ఆశ్రయించి ఉంటుంది. వాక్యార్థీభూతముగా ఉండేరసమును విషయముగా చేసికొని ఉంటుందని భావము. "అభినయతి పదార్థా నిత్యభినయః" అని అభినయ పదవ్యుత్పత్తి. పదార్థములను అభివ్యక్తము చేసేది అభినయమవుతుందన్నమాట. సత్వము వలన కలిగే స్తంభ ప్రళయ రోమాంచాదులు సాత్వికములు. అనిమేష నయనత్వాదికముతో సాత్వికము అభినయించాలి. హస్తపాదాదులు అంగములు. పతాకా హస్తము మొదల ఋనవి హస్తాదుల వ్యాపారములు. అవియె ఆంగికాభినయములు అనబడును. పాఠ్యమనబడునట్టి కావ్య నాట్యాదికము వాచికమవుతుంది రసోచితమయిన రాగాలాపాదికము వాచికాభినయము. నాట్యానికి తగిన వేష భూషాదులను ధరించుట ఆహార్యాభినయము. ఇట్టి ఈనాలుగు విధములయిన అభినయముల ద్వారా ధీరోదాత్తాది నాయకుల యొక్క ధీరోదాత్తత్వాద్యవస్థలను అనుకరించుట అనగా

అభినేయులయిన రామాదుల తాదాత్మ్యమును పొందుట నాట్యమని పర్యవసితము. ఈనాట్యము రసాశ్రయమగుటవలన వాక్యార్థాభినయాత్మకమని గ్రహించాలి. నట అవస్పందనే అనేధాతువు నుండి నాట్యశబ్దము వ్యుత్పన్నమవుతున్నది. కించిచ్చలనమని ధాత్వర్థము. కాగా నాట్యములో సాత్త్వికాభినయ బాహుళ్యముఉంటుందని సూచితము. ఈనాట్యము చేసేవారునటులవుతారు. నటులధర్మము నాట్యమవుతుందని గ్రహించాలి.

## నృత్యము - నృత్తము

భావాశ్రయం తు నృత్యంస్యాన్నృత్తం తాలలయాన్వితం.

నృత్యము భావాశ్రయము నృత్తము తాలలయసమన్వితము. రస సామగ్రిగా చెప్పదగిన విభావాదులు పదార్థీభూతములు అవినృత్యములో విషయములుగా ఉండును. కనుకనె నృత్యము పదార్థాభినయాత్మకమని గ్రహించాలి. నృతీ-గాత్రవిక్షేపే అనేధాతువు వలన నృత్యశబ్దము వ్యుత్పన్నమవుతున్నది. కాబట్టి ఆంగికాభినయ బాహుళ్యము నృత్యములో ఉంటుందని సూచితము. దీనిని అభినయించే వారికి నర్తకులనిపేరు. ఇటువంటి నిరూపణము వలన నాట్యమునకంటె నృత్యానికి భేదము సిద్ధమయింది. ఈనృత్యానికి మార్గమని కూడా పేరున్నది.

తాలము లయ అనేవి సంగీత శాస్త్ర సంకేతపదాలు నృత్తము ఏతదుభయాశ్రయము. దీనికే దేశి అని వేరొక నామము ఉన్నది. ఈప్రక్రియ దశరూపక ప్రతిపాదితము నృత్యము నృత్తమూ రెండూ నాటకాదులకు ఉపకారకములై అంగములుగా ఉంటవి కాబట్టి ఇక్కడ వాని స్వరూపము

నిరూపితమయింది. ఇవి నాటకాదులకు అంగములగుటవలన దశరూపకములో చెప్పబడినవి. నృత్యము ఒక్కొక్క స్థలములో అవాంతర పదార్థాభినయాత్మకముగా ఉంటుంది. నృత్తము శోభాహేతువుగా ఉంటుంది కాబట్టి ఇవి నాట్యాంగములై.

ఇంకా దశరూపకములో ఈవిధముగా నిరూపితమయినది. ఈ నృత్య నృత్తములు రెండూ మధురోద్ధత భేదాన రెండు విధములవుతవి. మధురనృత్యము మధురనృత్తము, ఉద్ధత నృత్యము ఉద్ధత నృత్తమూ అని. ఈ మధురములయినవి రెండూ లాస్యరూపములని ఉద్ధతములయినవి రెండూ తాండవ రూపములని వ్యపదేశము పొందుతున్నవి. పార్వతీ పరమేశ్వరులలో పార్వతీదేవి ఒనర్చిన నృత్య నృత్తములు లాస్యమని పరమేశ్వరుడొనర్చిన నృత్య నృత్తములు తాండవమనీ వ్యవహారము పొందినవి. ఇవి నాటకాదులకు ఉపకారకములుఅని.

## దశరూపకములు

నృత్య నృత్తోపకృతమయిన నాట్యమును అనుసరించి పది రూపకములు సిద్ధములవుతున్నది. నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, ఈహామృగము అని రూపకములు పది విధములవుతున్నవి. రసాశ్రయమయిన నాట్యము వలన ఈ పది భేదములై కలుగును. భావాశ్రయమయిన నృత్యమువలన ఉపరూపకములు అనేకములు సిద్ధములవుతవి. వానిని విస్తర భీతిచే ఇక్కడ ఉపపాదించడము లేదు.

ఈ రూపకములన్నీ నాట్యాశ్రయములై. అంతమాత్రాన ఇవి అన్నీ అభిన్నములు అనే శంక సముచితము కాదు. ఒక్కొక్క రూపకములో వస్తువు (ఇతివృత్తము కథ) ఒక్కొక్క

విధముగా ఉంటుంది. నాయకులు కూడా భిన్న భిన్నముగా ఉంటారు. రసమూ వేరు వేరుగా ఉంటుంది. కాబట్టి ఆరూపకాలకు వస్తువు నాయకుడు రసమూలూ భేదమును సంపాదించుతున్నవి.

వస్తువు ఆధికారికమని ప్రాసంగికమని రెండు విధాలు. ప్రాసంగిక వస్తువుకూడా పతాకావస్తువని ప్రకరీవస్తువని రెండు విధాలు. కాగా వస్తువు ౧ ఆధికారికవస్తువు ౨ పతాకా వస్తువు 3 ప్రకరీ వస్తువూ అని త్రివిధమవుతున్నది. వీని స్వరూపము ముందు ముందు విశదమవుతుంది. ఇట్లా భేదము పొందిన ఈ వస్తువు ప్రఖ్యాతమని ఉత్పాద్యమని మిశ్రమని మళ్లా త్రివిధమవుతున్నది. అందువలన వస్తువునకు నవ విధత్వమును గ్రహించాలి. ఇదె దివ్యరూపమున మర్త్యరూపమున ఉభయ రూపమున భేదము పొందినట్లయితే ఇంకా బహుభేదాలు సిద్ధములు కావచ్చు. ఆనానా భేదాలను లక్ష్యములలో చూచుకోవాలి. ప్రఖ్యాతోత్పాద్య మిశ్రత్వ భేదాన వస్తువు త్రివిధమవుతుందని దశరూపక కర్తకూడా చెప్పుతున్నాడు. ఇతిహాస పురాణాలలో ప్రసిద్ధమైన ఉన్నకథ నిబంధనముగా కలవస్తువు ప్రఖ్యాత వస్తువవుతుంది. కవి కల్పితమయిన వస్తువు ఉత్పాద్యము. ఏతదుభయ సాంకర్యాన సిద్ధమయ్యేది మిశ్రవస్తువు. ఇటువంటి వస్తుభేదము వలన రూపకాలకు పరస్పరమూ భేదము కలుగు తున్నది.

నాయక భేదము ఇది వరలో నిరూపితము. ఆ నాయక భేదముకూడా రూపకభేదకమె. రసభేదములు రస ప్రకరణములో నిదర్శితములవుతవి. రసభేదమును అనుసరించికూడా రూపకములు భిన్నములవుతున్నవి. ఏ యే రూపకములో

ఏ యే వస్త్వాదులు ఉంటవో ఈ క్రింది విధాన గ్రహించాలి.

రూపకభేదక ధర్మములు

౧. నాటకములో:— ప్రఖ్యాతమయిన ఇతివృత్తము ఉంటుంది. నాయకుడు ధీరోదాత్తుడు శృంగారము కాని వీరము కాని ప్రధానముగా ఉంటుంది. ఇతర రసములు అంగములుగా అనుప్రవేశముపొందుతవి. ౨. ప్రకరణములో:— ఇతివృత్తము ఉత్పాద్యము. నాయకుడు ధీరశాంతుడు. దీనిలో శృంగార రసానికే ప్రాధాన్యము ఉంటుంది. ౩. భాణములో:— ఇతివృత్తము ఉత్పాద్యము. ధూర్త విటుడు నాయకుడు. శృంగారము వీరమూ రెండూ సూచనామాత్రసారములై ఉంటవి. ౪. ప్రహసనములో:— ఇతివృత్తము కల్ప్యము. పాషండులు మొదలయిన వారు నాయకులు. హాస్యరసము ప్రధానము. ౫. డిమములో:— ప్రఖ్యాతమయిన ఇతివృత్తము ఉంటుంది. దేవ గంధర్వ పిశాచాది ధీరోద్ధత నాయకులు పదునారుగురు ఉంటారు. రౌద్రరసము ప్రధానము. శృంగార వీరములు అనుప్రవేశము పొందుతవి ౬. వ్యాయోగములో:— వస్తువు ప్రఖ్యాతము. నాయకుడు ధీరోద్ధతుడు. వీరరసము ప్రధానము ౭. సమవాకారములో:— దేవాసురాది నాయకులు పన్నెండుగురు ఉంటారు. వీరరసము ప్రధానము. ఇతివృత్తము ప్రసిద్ధమయినా కావచ్చు, కల్పితమయినా కావచ్చు. ౮. వీధిలో:— ఇతివృత్తము కల్పితము. ధీరోద్ధతుడు నాయకుడు. శృంగారము సూచనామాత్ర సారముగా ఉంటుంది. ౯. అంకములో:— ప్రఖ్యాతమయిన వస్తువు ఉంటుంది. ప్రాకృతజనుడయిన వాడు నాయకుడుగా ఉంటాడు. కరుణ రసము ప్రధానము ౧౦. ఈహామృగములో:— వస్తువు

మిశ్రాత్మకము. నాయకుడు ధీరోదాత్తుడు. దీనిలో శృంగార రసాభాస నిరూపితమవుతుంది. ఇట్లా వస్త్వాది భేదమున రూపక భేదమును గ్రహించాలి. ఇకవస్తు ప్రపంచము.

సంధిపంచకము

ఆ నాటకాదుల సామగ్రిని నిరూపింపుతాము. అయిదు సంధులు ఉంటవి. ఈవిషయము దశరూపకములో ఈవిధముగా చెప్ప బడింది. ముఖసంధి, ప్రతిముఖసంధి, గర్భసంధి, అవమర్శ సంధి (దీనినే విమర్శసంధి అంటారు) ఉపసంహృతి సంధి (దీనికి నిర్వహణ సంధి అనికూడా పేరు.) అని సంధులయిదు. ఈసంధిపంచకము రూపకములలో ఉండాలి.

సంధి

ఒక మహా ప్రయోజనముతో అన్వయము పొంది ఉన్న కథలకు అవాంతర ప్రయోజనములతో సంబంధము ఉండుట సంధి అవుతుంది. రూపకములలో నిరూపితములయిన కథలకు ధర్మార్థ కామములు ప్రయోజనములుగా ఉంటవి. ఇవి శుద్ధములుగా ఉండవచ్చును. అంటే ఒక్కొక్కటే ప్రయోజనముగా ఉండవచ్చు అన్నమాట. ఇంకా ఏకానేకానుబంధముగా ఉండవచ్చు. రెండు మూడు కలిసి ప్రయోజనముగా ఉండవచ్చు అని భావము. ఇటువంటి విధానములో పండ్రెండు విధాల ప్రయోజన సంబంధము ఉండవచ్చు.

ధర్మము ధర్మార్థములు ధర్మకామములు ధర్మార్థ కామములు
అర్థము అర్థధర్మములు అర్థకామములు అర్థ ధర్మకామములు
కామము కామధర్మములు కామార్థములు కామధర్మార్థములు,

ఈ చెప్పిన ప్రయోజనాలలో ఏదయినా ప్రధానముగా ఉంటుంది, ఒక రూపకములో నిరూపింపబడె ప్రధానేతి

వృత్తానికి అనేకేతివృత్తఖండములు ఉంటవి. ఇవి అన్నీ ప్రధానేతివృత్తానికి ఉన్న ప్రయోజనముతోనే సంబంధము కలిగి ఉంటవి. అట్లయినా వానికి అవాంతర ప్రయోజన సంబంధము ఉండుట సంధి అవుతుందని తాత్పర్యము. అవస్థలు అర్థప్రకృతులు అనువాని సంబంధము వలన ముఖాది సంధులు ఉత్పన్నములగును. ప్రయోజన సిద్ధిలో హేతువులుగా ఉండేవి అర్థ ప్రకృతులని కొందరి భావము. అర్థ ప్రకృతులనేవి కథా శరీరములో కారణములుగా ఉంటవని మరికొందరు భావించు తున్నారు. మహాప్రయోజన సంపాదములో హేతువుగా ఉండేది ఒకటి ఉంటుంది. ప్రారంభము మొదలు ఫలసిద్ధి పర్యంతమూ మొదటి హేతువుస్వరూప విశేషముతో ప్రసరించు తుంది. ఆ హేతువుయొక్క స్వరూప విశేషములే అర్థప్రకృతులు. బీజము బిందువు పతాక ప్రకరి కార్యమూ అని అర్థప్రకృ తులు ఐదు ఉన్నవి. ఫలసిద్ధికై ఉపాయము స్వీకరింప బడును. అది నాయకుని వ్యాపార రూపము. ఆ ఉపాయము ప్రారంభము మొదలు ఫలసిద్ధి పర్యంతము అయిదు స్వభావములను పొందు తుంది. అవె అవస్థలు. ఆరంభము, ప్రయత్నము, ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమమూ అని ఆ అవస్థాపంచకము యొక్క నామములు. ఆరంభ బీజముల సంబంధము వలన ముఖసంధి కలుగుతుంది. ప్రయత్న బిందువుల సంబంధములో ప్రతిముఖ సంధి ప్రాప్త్యాశా పతాకల సంబంధములో గర్భసంధి, నియ తాప్తి ప్రకరుల సంబంధములో అవమర్శసంధి, ఫలాగమ కార్యముల సంబంధములో నిర్వహణసంధీ ఉత్పన్నములవు తవి. దశరూపకములో కూడా ఇదే అర్థము నిరూపితమయింది.

బీజ బిందు పతాకాఖ్యప్రకరీ కార్యలక్షణాః
ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమాః
అర్థప్రకృతయః పంచ పంచావస్థానసమన్వితాః
యథాసంఖ్యేన జాయంతే ముఖాద్యాః పంచ సంధయః

ఈ దశ రూపక కారికల అర్థము సుగమము.

## అవస్థా నిరూపణము

### ౧ ఆరంభము

ఔత్సుక్యమాత్రమారంభః ఫలలాభాయభూయసే

కాలాక్షమత్వ రూపమయిన అభిలాష ప్రకర్షము ఔత్సుక్య మనబడును. రూపకములలో ధర్మార్థ కామ రూపమయిన ఫలమె అభీష్టము. కాని క్షుద్రఫలములు ఉద్దిష్టములు కావు. ఆ మహాఫలము యొక్క అధిక లాభానికై ఔత్సుక్యము మాత్రము ఉండుట ఆరంభము అనబడును. ఫలసిద్ధి కొరకయిన నాయక వ్యాపారము స్వరూపమునుండి కొంతగా ఉచ్ఛూనమయినట్లయితే ఆరంభమవుతుంది అని భావము.

### ౨ ప్రయత్నము

ప్రయత్నస్తు ఫలప్రాప్తౌ వ్యాపారోఽతిత్వరాన్వితః.

ఫలప్రాప్తి విషయములో అత్యంతమూ త్వరాన్వితమయిన వ్యాపారము ప్రయత్నమవుతుంది. కార్య సంపాదనములోని యోగ్యత ప్రయత్నము అనిభావము. ప్రకృష్టమయిన యత్నము ప్రయత్నము అని సార్థకనామము.

### ౩ ప్రాప్త్యాశ

ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా కార్య సంభవః,

ఉపాయము ఉన్నది అనె శంక, అపాయము ఉన్నది అనే

శంక వీనివలన వివక్షితమయిన కార్యము సంభవమగుట ప్రాప్త్యాశ అవుతుంది. ఏదయినా కార్యము సిద్ధించవలెనంటే కొన్ని ఉపాయములు ఉంటవి. కొన్ని అపాయములు కూడా ఉంటవి. వీనిని చక్కగా పరిశీలించి కార్యసంభవమును ఊహించాలి. ఊహలో భాసించే ప్రతిబంధకములను అన్నిటినీ నశింపచేసుకుంటూ ప్రాప్తి విషయమై ఆశ కలిగి ఉండుట ప్రాప్తి ఉండవచ్చునని ఊహచేయుట ప్రాప్త్యాశ అవుతుందని పరమార్థము.

## ౪ నియతాప్తి

అపాయాభావతః కార్యనిశ్చయో నియతాప్తికా

అపాయములు లేనందువలన కార్యము అవశ్యముగా కలుగుతుంది అని నిశ్చయించుట నియతాప్తి అవుతుంది. నియతము-నిశ్చితమయిన, ఆప్తి-ప్రాప్తి, ఉన్న యన సార్థకము. ప్రతిపక్షములన్నీ నివృత్తములయినందున ప్రాప్తి నిశ్చితమే అవుతుందని భావము.

## ౫ ఫలాగమము

సమగ్ర ఫలసంపత్తిః ఫలాగమ ఉదాహృతః,

సమగ్రమయిన ఫలము సంపన్నమగుట ఫలాగమము అవుతుంది. బాధకములన్నీ అబాధకములైనందువలన ప్రకృతార్థము అబాధితమయినందువలన సంపూర్ణముగా ఫలపర్యంతమయిన రచన అవ్యాహతమవుతుంది. ఫలము అర్థసిద్ధమే అవుతుంది. అదే ఫలాగమము.

## బీజాదిపంచకము

ఇక అర్థప్రకృతులనబడు బీజాది పంచకము నిరూపితమగును.

## ౧ బీజము

స్తోకోద్దిష్టః కార్యహేతుః బీజం విస్తార్యనేకధా

స్వల్పముగా ఉపక్షిప్త మయ్యేది అనేకవిధాల విస్తరించే దిన్ని ఫలానికి హేతువుగా ఉండేది బీజమనబడును. ఫల సంపాదక మయిన బీజము మొదట స్వల్పముగా ఉన్నా పిమ్మట మూలముగా బోదెగా శాఖలుగా ఆకులుగా పుష్పములుగా అనేక విధాల విస్తరించుతుంది. అట్లాగె త్రివర్గ రూప ఫలహేతువయిన ఇదికూడా మొదట స్వల్పమే. అనంతరము నాయకుడు ఉపనాయకుడు ప్రతినాయకుడూ అనే భేదాలతో విస్తరించుతుంది. ఆబీజము ఒక్కొక చోట స్వాయత్తసిద్ధి అయిన నాయకునకు ఆత్మోత్సాహాత్మకముగా ఉంటుంది. ఒక్కొక చోట సచివాయత్త సిద్ధిగా నాయకుడు ఉండే స్థలములో సచివునకు ఉత్సాహాత్మకముగా ఉంటుంది. రాజు ఉభయాయత్తసిద్ధిగా ఉన్నచోట బీజము ఉభయోత్సాహాత్మకముగా ఉంటుంది. అమాత్యగతోత్సాహము కూడా నాయకునకె ఫలజనకమవుతుంది.

## ౨ బిందువు

అవాంతరార్థ విచ్ఛేదే బిందురచ్ఛేద కారణం

పరమ ప్రయోజనానికి అవాంతరముగా కూర్పబడు వాని వలన కొంతగా విచ్ఛేదము కలిగినట్లయితే అటువంటి విచ్ఛేదము లేకుండునట్లుగా చేయడములో హేతువుగా ఉండేది బిందువవుతుంది. గ్రంథములో నిరూపింపబడు బీజము కొన్ని అవాంతర ఫలములను కూడా కలుగ జేస్తుంది. అట్టి అవాంతర ఫలములచే మహాఫలము విచ్ఛిన్నప్రాయమవుతూ ఉన్నప్పుడు అవిచ్ఛేదహేతువుగా ఉండేది బిందువు అనిభావము.

### ౩ పతాక

ప్రతిపాద్యకథాంగం స్యాత్పతాకా వ్యాపినీకథా,

ఫలమును ఉద్దేశించి ప్రవర్తించేది కావడము వలన ప్రతిపాద్య కథ ప్రధానము. ప్రతిపాద్యకథకు అంగముగా వుండేది పతాక అవుతుంది. ప్రధాన కథకు ఇది సంబంధించి ఉంటుంది. గ్రంథములో కొంతగా మాత్రము వ్యాపించి ఉంటుంది. రామాయణములో రాముడు నాయకుడు. తద్వ్యాపారరూపమయిన కథ ప్రధానము. సుగ్రీవుడు ఉపనాయకుడు. తద్వ్యాపార రూపకథ రామకథాంగము. రామకథా సంబద్ధము కాబట్టి అది పతాక.

### ౪ ప్రకరి

అవ్యాపినీ ప్రకరికా........

అధికముగా వ్యాపించకుండా ఉండే వృత్తాంతము ప్రకరి అవుతుంది. అల్పమగు ప్రకరము ప్రకరి. రామాయణములో జటాయువృత్తాంతమూ శబరీ వృత్తాంతము ఈ విషయములో దృష్టాంతములు. పుష్పాదిప్రకరము తమకంటె అతిరిక్తమయిన పదార్థానికి శోభను కలుగజేస్తుంది. అట్లాగే గ్రంథములో ఉపాత్తమయిన ఋతువర్ణనాదికము ప్రధానమునకే ఫలజనకమవుతుంది కానితనకు ఏమీ ఫలమును ఆపాదించుకోదు. ప్రకరికాస్వరూపము ఈవిధముగా ఉంటుంది. ప్రతిపాద్య కథకు అంగమగుట అనేపతాకకు చెప్పిన విశేషమును ఇక్కడ కూడా సమన్వయించుకోవాలి.

### ౫ కార్యము

............కార్యం నిర్వాహకృత్ఫలే,

ప్రధాన ఫలమును నిర్వహించునట్టి అంతిమ కథావయవ

మునకు కార్యము అని పేరు. ఇతరములకువలె కార్యమునకు అవాంతర ఫల సంబంధమును ఊహింప నక్కర లేదు. ఇది సాక్షాత్తుగా ప్రధాన ఫలజనకము. కార్యేతరములు అవాంతర ఫలములతో సంబంధము ఉంటేనే కాని ప్రధాన ఫలమును కలుగజేయడానికి సమర్థములు కాలేవు. ఈవిధముగా అవస్థలూ అర్థప్రకృతులూ నిరూపితములయినవి. ఈపంచక యుగళ సమన్వయము వలన సంధిపంచకము సిద్ధమవుతుంది. ఇక వానిని చెప్పెదము.

### ముఖసంధి

ముఖం బీజసముత్పత్తి ర్నానార్థరససంభవా
అంగాని ద్వాదశైతస్య బీజారంభసమన్వయాత్.

నానా ప్రయోజనములు కల రసానికి హేతువయిన బీజ సముత్పత్తి ఉంటే ముఖసంధి అనబడుతుంది. బీజము ఆరంభమూ అనే రెండిటి సమన్వయము వలన దీనిలో పండ్రెండంగములు ఉత్పన్నములగును. గ్రంథములలో అంతటా రసమె మహా ప్రయోజనము. ఆ రస సంభూతి కయిన బీజము ముఖ సంధిలో ఉండాలి. ఆదినుండి అంతము వరకు ప్రసరించే రసానికి అవాంతర ప్రయోజనములు అనేకములు ఉంటవి. ఇట్టి ఈ అవాంతర ప్రయోజనాలు త్రివర్గ వ్యతిరిక్తములని గ్రహించాలి. ప్రహసనము మొదలయిన కొన్ని రూపకాలలో త్రివర్గము ఫలముగా ఉండదు. అక్కడ ధర్మార్థ కామాతిరిక్తములయిన ప్రయోజనములె రసోపకారకములవుతవి. ఇట్లా అనేకావాంతర ప్రయోజనవద్రస సంభూతికి సమర్థమయిన బీజసముత్పత్తి ఉన్నట్లయితే ముఖసంధి అవు

తుందని గ్రహించాలి. బీజారంభములకు అనుగుణముగా ముఖ సంధ్యంగములను నిబంధించాలి.

ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, భేదము, కరణము అనేవి ముఖసంధ్యంగములు. ఇవి అన్నీ అన్వర్థములు. వీనిస్వరూపమును ఈవిధముగా తెలుసుకోవాలి.

## ముఖసంధ్యంగ స్వరూపము

౧. ఉపక్షేపము:— బీజము యొక్క వ్యసనము ఉపక్షేపమవుతుంది. బీజ సదృశమయిన ప్రస్తుతేతి వృత్తమును సంక్షేపముగా సూచించి నిర్దేశించుట ఉపక్షేపము అనిభావము. బీజప్రాయమయిన నాటకీయార్థమును నిరూపించాలన్నమాట.

౨. పరికరము:— బీజము యొక్క వృద్ధి అనగా ప్రస్తుత సూక్ష్మేతివృత్తముయొక్క విషయవిస్తారము పరికరమగును.

౩. పరిన్యాసము:— బీజము యొక్క నిష్పత్తి- బీజార్థము సిద్ధించుట పరిన్యాసమగును. వర్ణనీయవిషయమును నిశ్చయరూపాన ప్రకటించుట అని భావము.

౪. విలోభనము:—బీజ గుణ వర్ణనము విలోభనము. మూల భూతార్థమునందు అభిలాషను ఉదయింపచేయ దానికై గుణ వర్ణనము చేయుట అని భావము.

౫. యుక్తి:— బీజార్థములో అనుకూలముగా సంఘటనము పొందిన ప్రయోజనములను బాగా నిర్ణయించుట యుక్తి అవుతుంది.

౬. ప్రాప్తి:— బీజమునకు సంబంధించిన సుఖప్రాప్తి ప్రాప్తి అవుతుంది.

౭. సమాధానము:— నాయికా నాయకులకు అభిమతముగా ఉండేటట్లుగా బీజార్థమును ప్రదర్శించుట సమాధానము.

౮. విధానము:—బీజార్థములోని సుఖదుఃఖముల కారణ నిబంధనము విధానము.

౯. పరిభావన:—ఏవయినా ఆశ్చర్య జనక దృశ్యములను చూచి కుతూహల సహితులై పరిభాషించుట పరిభావన అనబడును.

౧౦. ఉద్భేదము:—బీజ రూపాన గూఢంగా ఉన్న అర్థమును బహిరంగము చేయుట ఉద్భేదమవుతుంది.

౧౧. భేదము:— బీజాను గుణముగా ప్రోత్సాహము చేయుట.

౧౨. కరణము:—బీజానుకూలమయిన ప్రస్తుత కార్యమును ఆరంభించుట కరణము అనబడును. ఈ పండ్రెండున్ను ముఖ సంధ్యంగములు. వస్తు విన్యాసములోని సూక్ష్మ భాగోప భాగముల విషయమై గ్రంథనిబంధకునకు ఎటువంటి అభిరుచి ఉంటుందో ఆ అభిరుచిని ఈ అంగములు సూచించుతవి. అన్ని అంగములనూ రూపకములో నిబంధించడము కష్టము. కాబట్టి దీనిలో ఉపక్షేప పరికర పరిన్యాస యుక్తి ఉద్భేద సమాధానములు అనే ఆరు అంగములు ఉండడము చాలా ఆవశ్యకము. అందువలన అవి ప్రధాన నిబంధనీయములు. మిగిలిన ఆరూ ఉంటే మంచిదే. అవి లేక పోయినా ముఖ సంధి ఉద్దేశము వీనివలన సిద్ధమవుతుంది అన్నమాట.

## ప్ర తి ము ఖ స ం ధి

లక్ష్యాలక్ష్యస్య బీజస్య వ్యక్తిః ప్రతిముఖం మతం
బిందుప్రయత్నానుగమా దంగా న్యస్య త్రయోదశ.

లక్ష్యాలక్ష్యముగా ఉన్న బీజార్థము యొక్క అభివ్యక్తి ప్రతిముఖసంధి అవుతుంది. బిందు ప్రయత్నముల అనుగమము వలన దీని అంగములు పదమూడు. ముఖసంధిలో గోచర మయిన బీజము ఒకానొక అంశములోలక్ష్యమవుతుంది. వేరొక అంశములో అలక్ష్యమవుతుంది. నాటకీయ ప్రధాన ఫలసాధక మయిన ఇతివృత్తము ఒకప్పుడు గుప్తమవుతుంది. వేరొక ప్పుడు స్పష్టమవుతుంది. ఈ ప్రతిముఖసంధి ప్రయత్నబిందువుల శృంఖలలో అనుగతమవుతుంది. కాబట్టి ప్రయత్నావస్థలో ఫలప్రాప్తికై శీఘ్రోద్యోగము కలుగుతుంది. బిందువులోకథ అవిచ్ఛిన్నమై ప్రసరించుతుంది. ముఖసంధిలో సూత్రితమయిన ప్రధాన ఫలము ప్రతిముఖసంధిలో కొంతగా వికాసము పొందుతుంది. ప్రధాన ఫలానుకూలానేక ప్రయోజనములలో కొన్ని మాత్రము నిష్పన్నములు కావడము కొన్ని నిష్పన్న ములు కాకపోవడమూ దీనిలో ఉంటుంది. బిందు ప్రయ త్నానుగుణముగా ప్రతిముఖ సంధ్యంగములనుప్రయోగించాలి.

విలాసము పరిసర్పము, విధూతము, శమము, నర్మ, నర్మ ద్యుతి, ప్రగమనము, విరోధము, పర్యుపాసనము, వజ్రము, పుష్పము, ఉపన్యాసము, వర్ణసంహారము. అని దీని త్రయోద శాంగములు. వీనిస్వరూపమును ఇట్లా గ్రహించాలి.

### • ప్రతిముఖసంధ్యంగ స్వరూపము

౧ విలాసము:— సంభోగ విషయమగు మనోరథము విలా

సము. ఆనందము నిచ్చు పదార్థములను, కోరుట విలాసము అని అర్థము.

౨ పరిసర్పము:— మొదట కన్పడి తరువాత గోచరముకాక దృష్టనష్టముగా ఉండే పదార్థమును అనుసరించుట పరిసర్పము అనే అంగము.

3 విధూతము:— సుఖప్రదము లయినప్పటికీ అనిష్టము లయిన అరతిని ఇచ్చే పదార్థములను తిరస్కరించుట విధూత మవుతుంది.

౪ శమము:— అరతి ఉపశమించుట శమము.

౫ నర్మ:— పరిహాసాత్మకమ యిన వచనము నర్మ.

౬ నర్మద్యుతి:— అనురాగమును ఉద్ఘాటించి నందువలన కలిగే ప్రీతి నర్మద్యుతి అవుతుంది. నాయికా నాయకులలో ఒకరొకరి అనురాగమును విశదము చేసినప్పుడు వారియందు ప్రీతి ఉదయించుతుంది. అదే ఇది.

౭ ప్రగమనము:— ఉత్తరో త్తరము నిరూపితము లయిన ట్టిన్ని ఉత్తర ప్రత్యుత్తర రూపముల యినట్టి ఉత్కృష్ట వచనములచే అనురాగ బీజమును ప్రకాశింప చేయుట ప్రగమనము అవుతుంది.

౮ విరోధము:— ఏదయినా మనచే హితప్రాప్తిని నిరోధించుట.

౯ పర్యుపాసనము:— ఇష్టజనులను ప్రతిమాలు కొనుట పర్యుపాసనము, కోపపడిన వారిని అనునయించుట అని భావము.

౧౦. వజ్రము:— మొదట్లోనే సమ్ముఖములో నిష్ఠురంగా మాటలాడుట వజ్రమనబడును

౧౧. పుష్పము:— అనురాగమును ప్రకాశింప చేయునట్టి విశేషతా పూర్ణమయిన వచనముపుష్పము ఈవిశిష్టవచనము విశేషానురాగమును కలుగ జేస్తుంది.

౧౨. ఉపన్యాసము:—అనురాగమును కలుగ జేయడములో యుక్తి సహితమయిన వచనము ఉపన్యాసమనబడును.

౧౩. వర్ణసంహారము:— నాలుగు వర్ణముల సమ్మేళన మును చక్కగా వర్ణించుట వర్ణసంహారమవుతుంది. ఇక్కడ వర్ణము అంటే నాటకీయ పాత్రలని ఒకరి భావము. వారి సమాగమమునను వర్ణించుట దీని స్వరూప మవుతుంది.

ఈ నిరూపించిన త్రయోదశాంగములలో పరిసర్ప ప్రగ మన వజ్ర ఉపన్యాస పుష్పములు అనే అంగములు అవశ్య ముగా ఉండాలి. అందువలన అవి ప్రధానములు. కేవలమూ వీనిని నిబంధించినా ఇతి వృత్తముసముచితము కాగలుగుతుంది.

గర్భసంధి

గర్భస్తు దృష్టనష్టస్య బీజస్యాన్వేషణం ముహుః
అస్యాప్త్యాశా పతాకానుగుణ్యేనాంగ ప్రకల్పనం.

ప్రతిముఖ సంధిలో దృష్టనష్టముగా ఉన్న బీజమును మరల మరల అన్వేషించుట గర్భసంధి అవుతుంది. ప్రతిముఖ సంధిలో బీజము కొంతవరకు ప్రకాశిత మవుతుంది. అదే మాటి మాటికి ఆవిర్భావ తిరోభావములచే అన్విష్టమయి నట్ల యితే గర్భసంధి అని గ్రహించాలి. బీజము ఇదివరలో దృష్ట నష్టముగా ఉన్నందువలన అది ఒకప్పుడు అపాయం పొందేది అవుతుందేమో! అనేశంక కలుగవచ్చును. అప్పుడు తద్విచ్ఛే దము కూడా సంభావితము కావచ్చును. అందువలన మళ్ళా మళ్లా దానిని అన్వేషించడము గర్భసంధి స్వరూపము. ఈగర్భ

సంధిలో పతాకా ప్రాప్త్యాశలకు అనుగుణంగా అంగములను కల్పించాలి. దీనిలోని ప్రాప్త్యాశావస్థలో సఫలతా సంభావనతో బాటు విఫలతాశంక కూడా ఉంటుంది. అర్థప్రకృతి అయిన పతాకలో ప్రధానఫలమును సిద్ధింపచేసే ప్రాసంగిక వృత్తాంతము ఉంటుంది. ఈసంధిలో పతాక అనియతము. అది వైకల్పికము. పతాక లేకపోయినా ప్రాప్త్యాశ ఉంటుంది. పతాకా ప్రాప్త్యాశలకు అనుగుణముగా గర్భసంధ్యంగములను ప్రయోగించాలి.

అభూతాహరణము, మార్గము, రూపము, ఉదాహరణము, క్రమము, సంగ్రహము, అనుమానము, తోటకము, అధిబలము, ఉద్వేగము, సంభ్రమము, ఆక్షేపమూ, అని గర్భసంధ్యంగములు పన్నెండు ఉన్నవి. వాని స్వరూపమును ఈ విధముగా గ్రహించాలి.

గర్భ సంధ్యంగ స్వరూపము

౧. అభూతాహరణము:—ప్రస్తుతమునకు ఉపయోగించే ఛద్మాచరణము కపట వచనము అభూతాహరణ మనబడును.

౨. మార్గము:—యథార్థమును చెప్పుట మార్గము.

౩. రూపము:—వితర్క- యుక్త మయినట్టిన్ని విశేషమును ప్రతిపాదించునట్టి వాక్యము రూపము అవుతుంది.

౪. ఉదాహృతి:—ప్రస్తుతమునకు ఉత్కర్ష కలిగే ట్లుగా పలుకుట ఉదాహరణము, ఉదాహృతి అవుతుంది.

౫. క్రమము:—బాగా ఆలోచించిన అర్థముల ప్రాప్తి క్రమము. అభిలషించినవస్తుప్రాప్తి. ఏదైనా విషయముయొక్క యథార్థ జ్ఞాన ప్రాప్తి క్రమమవుతుందని కొందరి ఊహ.

ఉంటుంది. గర్భసంధిలో నిర్భిన్నమయిన బీజార్థముతో ఇది సంబంధించి ఉంటుంది. గర్భసంధిలో బీజార్థము ఒకవిధముగా విస్తృతి పొంది ఉన్నప్పటికీ అందులో కన్న ఇక్కడ ఈ విమర్శసంధిలో అధికముగా విస్తృతమై ఫలోన్ముఖము అయ్యే టప్పుడు శాపక్రోధవిపత్తి విలోభనాదులు కారణముగా విఘ్నములు కలుగ వచ్చును. ఇటువంటి ఈ క్రోధాదులచే ఆ బీజము బాగా విమృష్ట మవుతుంది. కాబట్టి ఇది విమర్శ సంధి. దీనిలో నియతాప్తి అవస్థ. ప్రకరి అర్థ ప్రకృతి. వీనిని అనుసరించి పదమూడు అంగములు స్వరూప లాభమును పొందుతవి.

అపవాదము, సంఫేటము, విద్రవము, ద్రవము, శక్తి, ద్యుతి, ప్రసంగము, ఛలనము, వ్యవసాయము, నిరోధము, ప్రరోచనము, విచలనము, ఆదానము అని దీని అంగములు. వీని స్వరూపమును నిరూపింతును.

## విమర్శసంధ్యంగ స్వరూపము

౧. అపవాదము:—దోషమును ప్రఖ్యాపనము చేయుట అపవాదము.

౨. సంఫేటము:—రోష సంభరితమయిన పరస్పరమూ ప్రసరించు సంభాషణమునకు సంఫేట మని పేరు.

౩. విద్రవము:— వధబంధాదికము ఉండుట,

౪. ద్రవము:— గురుజనులను అవమానించుట తిరస్కరించుట ద్రవము.

౫. శక్తి:— విరోధము శమించి పోవుట.

౬. ద్యుతి:— భయపెట్టుట ఉద్వేగపెట్టుట ద్యుతి

౭. ప్రసంగము:— గురుజనుల సంకీర్తనము.

౮. ఛలనము:— అవమానము చేయుట ఛలనము.

౯. వ్యవసాయము:— తనశక్తిని ప్రశంస చేయుట.

౧౦. నిరోధనము:— క్రోధ సంబద్ధులయిన వారి యొక్క పరస్పర విక్షేపము నిరోధన మవుతుంది. దీనిలోనే ప్రకృత కార్యములో విఘ్నముఉండడముకూడా సూచిత మవుతుంది.

౧౧ ప్రరోచనము:— రాబోవు శ్రేయమును సిద్ధమయి నట్లుగా చెప్పుట ప్రరోచనమవుతుంది. సఫలతా లక్షణము లను చూచి భవిష్యమును ఊహించుట అని భావము.

౧౨. విచలనము:— తన గుణాలను ఆవిష్కరించు కొనుట విచలనము

౧౩. ఆదానము:— కార్యసంగ్రహము ఆదానము. తన ప్రయోజనమును సాధించుట అని భావము. వీనిలో ఏయే అంగములకు ప్రాధాన్యము ఉన్నదో విద్యానాథుడు సూచించ లేదు. అయినా దశరూపకంలో చెప్పిన విధానానుసారముగా చూస్తే అపవాద శక్తి వ్యవసాయ ప్రరోచనాఽదానములు ప్రధానములు అని గోచరమవుతున్నది. వానిని మాత్రమె గ్రంథములో నిబంధించినా కార్యశృంఖలకు అనుగుణ్యము ఉంటుందని గ్రహించవచ్చును.

## నిర్వహణ సంధి

బీజవంతో ముఖాద్యర్థా విప్రకీర్ణా యథాయథం
ఐకార్థ్య ముపనీయంతేయత్ర నిర్వహణం హి తత్
ఫలాప్తి కార్యానుగుణ్యా దంగాన్యస్య చతుర్దశ.

నానావిధములుగా తమ తమ స్థానాలలోనే నిరూపితము లయి ఉండడము వలన బీజయుక్త ముఖాద్యర్థములు విప్ర

క్షీర్ణములై ఉంటవి. వాటికి ముఖ్యార్థమయిన పరమ ప్రయోజనము యొక్క సంబాధమును నిరూపణము చేసినట్లయితే నిర్వహణ సంధి అవుతుంది. ఆయాస్థలములలో వేరువేరుగా ఉండడము వలన ముఖసంధ్యాదులలోని ప్రయోజనాలకు అంతగా పరస్పర సంబంధము ఉన్నట్లు కనపడదు. మహా ప్రయోజన సంబంధము కూడా అంతగా భాసించదు. వాటికి పరస్పరసంబంధమును విశదము చేస్తూ ముఖ్యఫల సంబంధమును నిశ్చయించడము నిర్వహణసంధి అవుతుందని భావము. దీనిలో ఫలప్రాప్తి అవస్థ. కార్యము అర్థ ప్రకృతి ఈ రెండిటికి అనుగుణముగా దీని అంగములు పదునాలుగు ఉన్నవి. ఫలాప్తి కార్యానుగుణముగా ఈ నిర్వహణ సంధిలో చతుర్దశాంగములను నిరూపించాలి.

సంధి, విరోధము, గ్రథనము, నిర్ణయము, పరిభాషణము, ప్రసాదము, ఆనందము, సమయము, కృతి, ఆభాషణము, ఉపగూహనము, పూర్వభావము, ఉపసంహారము, ప్రశస్తి అని నిర్వహణసంధి అంగములు. ఇక వీటి స్వరూపము.

### నిర్వహణసంధ్యంగస్వరూపము

౧. సంధి:— ముఖసంధిలో ఉపక్షిప్తమయిన బీజార్థమును ఉద్భావనము చేయుట సంధి అవుతుంది.

౨. విరోధము:— కార్యమును అనుసంధానము చేయుట ప్రథమ సంధిలో ఉపక్షిప్తమయిన ఫలరూపార్థమును అన్వేషించుట విరోధము. దీనిని విబోధము అని కూడా అంటారు.

3. గ్రథనము:— కార్యార్థమును ఉపక్షేపము చేయుట గ్రథనము.

౪. నిర్ణయము:— బీజానుగుణమయిన కార్యమును ప్రఖ్యాపనము చేయుట, అనుభూతార్థమును చెప్పుట నిర్ణయము అవుతుంది.

౫. పరిభాష:—అన్యోన్యమూ సంభాషించుట పరిభాష.

౬. పర్యుపాసనము:—ఏదయినా చేసికాని, ఏదయినా పలికికాని, ప్రసన్నతను సంపాదించుట పర్యుపాసన మవుతుంది.

౭. ఆనందము:— వాంఛితార్థసంప్రాప్తి మొదట కలగాలని తలచిన ఫలము కలుగుట ఆనందము.

౮. సమయము:— దుఃఖము నశించుట. అవాంతరంగా కలిగిన అంతరాయములన్నీ అంతరించి పోవడము సమయము.

౯. కృతి:— లబ్ధార్థస్థిరీకరణము కృతి. లభించిన ఫలము ద్వారా శోకాదికము శమించడము. శోకాములవలన సముత్పన్నమైన అస్థిరత నివృత్తమగుట కృతి అవుతుందని భావము.

౧౦. ఆభాషణము:— ప్రతిష్ఠ గౌరవము యశస్సు మొదలయిన వాని ప్రాప్తి ఆభాషణ మవుతుంది.

౧౧. ఉపగూహనము:— అద్భుత వస్తుప్రాప్తి.

౧౨. పూర్వభావము:— ఇష్ట కార్యదర్శనము.

౧౩. సంహారము:— కార్యార్థమును ఉపసంహరించుట (సమాప్తము చేయుట) వరాదానప్రాప్తి సంహార మవుతుంది.

౧౪. ప్రశస్తి:— శుభశంసనము—ఆశీస్సు.

ఈ చెప్పిన పదునాలుగూ నిర్వహణాంగములు. వీనిలో ప్రధానములంటూ వేటికీ ప్రత్యేక నిరూపణము లేదు. మొత్తము మీద వీనిని అన్నిటినీ నిరూపించాలని తాత్పర్యము. ఈఅయిదు సంధులలోనూ అరువదినాలుగు అంగములు

ఉన్నవి. ఈవిధముగా చతుష్షష్ట్యంగసమన్వితము లయిన పంచసంధులూ ప్రతిపాదితములయినవి. ఈ చెప్పిన ఉపక్షేపాదికాంగములలో క్రమము లేదు. వీనిలో వేటికయినా, కార్యకారణభావము ఉన్నట్లయితే అక్కడ క్రమమును అంగీకరించాలి. కార్యకారణ భావము లేని స్థలములో కూడా క్రమమును అంగీకరించడములో హేతువు కనపడదు. మహాకవుల లక్ష్యగ్రంథములలో క్రమము కన్పడడము లేదు. ఏవిధముగా నయినా ప్రతిపాదింప తగిన వస్తువు సౌష్ఠవముతో కూడు కొనిన విన్యాసముకలది కావడమె వివక్షితము. కాబట్టి కథావస్తువు సముచితముగా ఉండేటట్లు అంగములను నిబంధించాలి. కార్యవ్యాపారశృంఖల శిథిలము కాకుండా ఉండేటట్లు నిరీక్షించాలి.

సంధిప్రయోజనములు

ఈ సంధ్యంగముల ప్రయోగము ఆరు ప్రయోజనములను ఉద్దేశించి ఉంటుంది. సామాన్యముగా ప్రధానమునకు ఏ ఫలము ఉంటుందో ఆ ఫలమె అంగములకు కూడా సిద్ధిస్తుంది. అంగములకు వేరుగా ప్రయోజనము ఉండవలసిన అవసరము లేదు. అయినాఇక్కడ అంగములకు ప్రత్యేకప్రయోజనములు ఉన్నవని చెప్పడము అనుపపన్నము కాదు. ప్రతి పదార్థానికీ కొన్ని దృష్టాదృష్ట ప్రయోజనాలు ఉంటవి. ఈ రూపకములలో అంగములకూ ప్రధానములకూ సంబంధించిన మహా ఫలము అదృష్ట ఫలమనీ ఈ చెప్పబోయే ఆరుఫలములూ దృష్ట ఫలములనీ గ్రహించాలి.

౧. వివక్షితార్థ ప్రతిపాదనమనేది మొదటి ప్రయోజనము. రూపకములో కవినిరూపించదలచిన అర్థము. వీనివలన

(అంగముల వలన) స్పష్టముగా ప్రతిపాదిత మవుతుంది. వస్తువు వీనిలో ఇంతగా విస్తృతిని పొందుతుంది కాబట్టి వివక్షితార్థ ప్రతిపాదనము విస్పష్ట మవుతుంది.

౨. గోప్యార్థగోపన మనేది రెండవ ప్రయోజనము. రూపక రచనలో చుంబనాలింగనాది సురత ప్రభేదములు గోపనీయములు. ఈ అంగములు ఆధారముగా గోప్యార్థమును గోపనము చేయడానికి అవకాశము ఉన్నది. అందువలన ఇది కూడా ప్రయోజనములలో ఒకటి.

౩. ప్రకాశ్యార్థ ప్రకాశనము నేది మూడవ ప్రయోజనము. కార్య ప్రణాళిక సమముగా ప్రసరించడానికి కొన్నిటిని ప్రకాశింప చేయవలసి ఉంటుంది ఈ అంగములు అటువంటి ప్రకాశ్యార్థమును ప్రకాశింప చేయగలవు.

౪. అభినయ రాగసమృద్ధి అనేది నాల్గవ ప్రయోజనము. నాలుగు విధములయిన అభినయముల ద్వారా సామాజిక మనములను రంజింప చేయవలసిఉన్నది. అటువంటివిధానానికి కూడా సంధ్యంగములు బాగా ఉపకరించుతవి. కాబట్టి అదీ ఫలమే.

౫. చమత్కారిత్వ మనేది పంచమ ప్రయోజనము. చమత్కారమును కలుగజేయడానికై ఆశ్చర్యకర ప్రయోగములు ఆవశ్యకములు. సంధ్యంగములు ఇటువంటి అవకాశమును ఇస్తున్నవి.

౬. ఇతివృత్తవిస్తరమనేది ఆరవ ప్రయోజనము. రూపకములోని వృత్తాంతము ఉపక్షయము పొందకుండా ఉండేట్లుగా రూపకసర్వాంత పరిశీలించాలి. ఉపక్రమోపసంహార

ములను అనుసరించి కథ విస్తరింప బడుటకు ఈ అంగములు మంచి అవకాశమును సంపాదించు తున్నవి. కాబట్టి ఇతివృత్తము బాగా పెంపు పొందుతుంది. అంగోపాంగములతో అది పరిపుష్టమవుతుంది. అందుచే ఇతివృత్త విస్తరము కూడా ప్రయోజనమె. ఈ ఆరు విధములయిన ఉద్దేశ్యములు సిద్ధము లయ్యేటట్లుగా దృశ్య కావ్యరచనలో సంధిసంధ్యంగ ములను నిబంధించాలి.

## వస్తు విభాగము

రూపకములోని ఇతివృత్తము వేరొక రీతిని బట్టి కూడా ద్వివిధ మవుతుంది. సూచ్యవస్తువు మొదటిది. అసూచ్య వస్తువు రెండవది. అనుచితము గానూ నీరసముగానూ ఉండే వస్తువును అభినయించరాదు. అది ఉద్వేగ జనకము. దానిని విస్తరింప చేయరాదు. ఏదో ఒక విధముగా దానిని సూచిం చడమే సముచితము. అదె సూచ్యవస్తువు. కొన్నికొన్ని విషయాలు అత్యంతమూ మధురములూ ఉదాత్తములూ అయి ఉంటవి. వాటి రసభావములు అత్యంతమూ ఉద్దీప్త ములై ఉండడానికి అవకాశము ఉన్నది. అటువంటి వాటిని చక్కగా అభినయించి ప్రదర్శించడము ఆవశ్యకము. వానిని సూచనామాత్రిసారములనుగాచేయరాదు. చక్కగావిస్తరింప చేయాలి. అప్పుడు అది అసూచ్యవస్తువవుతుంది.

ఈ అసూచ్యవస్తువు దృశ్యమని శ్రవ్యమని రెండు విధాలు శ్రావ్యగతముగా అవాంతరభేదములు అనేకములు ఉన్నవి. సర్వశ్రావ్యమని నియతశ్రావ్యమని శ్రావ్యము రెండు విధాలు. రంగములో ఉండే వారందరూ వినదగినది సర్వశ్రావ్యము. కొందరు మాత్రమె వినతగినది నియతశ్రావ్యము. ఇక్క

డనె అశ్రావ్యమనేది కూడా వేరొకటి ఉన్నది. ఈ అశ్రావ్యవస్తువు స్వగతము అనే పేరుతో ఉంటుంది. ఒక పాత్ర తనలోతాను అనుకొనే వచనమును స్వగతమని అంటారు. ఏతదతిరిక్త శ్రావ్యభేదాలు ప్రకాశ రూపములు. నియత శ్రావ్యమనేది జనాంతికమని అపవారితకమని రెండు విధాలు. రంగస్థలములో ఉన్న జనుల సన్నిధానములోనే త్రిపతాకా కరమును జనులకు అడ్డముగా పెట్టి పరస్పరమూ సంభాషణము చేయుట జనాంతికము. రంగములో వేరొక ప్రక్కకు తిరిగి తన అభీష్టునితో రహస్యమును చెప్పడము అపవారితమవుతుంది. సూచ్యార్థము యొక్క సూచనా క్రమము అయిదు విధములుగా ఉన్నది. ఈ విషయము దశ రూపకములో ఈ విధముగా నిరూపింపబడి యుంది. "విష్కంభము చూళిక అంకాస్యము, ప్రవేశకము, అంకావతరణము" అనేవానిచే సూచ్యార్థమును సూచించాలి అని. ఈ అయిదూ అర్థోపక్షేపకములు. ఇక వీని స్వరూపమును యథాక్రమముగా నిరూపించుతాము.

౧ విష్కంభము

వృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః
సంక్షేపార్థస్తు విష్కంభో మధ్యపాత్రప్రయోజితః.

విష్కంభమును ప్రస్తావనానంతరము రచించాలని కొందరంటారు. అంకద్వయ మధ్యభాగములో రచించాలని కొందరి ఆశయము. విష్కంభము జరిగిన జరుగబోవు కథాంశములను నిదర్శించేదిగా ఉండాలి. అది సంక్షేపరూపముగా ఉండాలి. తదర్థనిబంధనము సంక్షేపముగా ఉండేటట్లు పరిశీలించడము ఆవశ్యకమని భావము. విష్కంభము మధ్యపాత్రలచే ప్రయు

క్తము కావాలి. మధ్యములగు వారు ఒకరు కాని అనేకులు కాని ఇందు పాల్గొన వచ్చును. ఇది శుద్ధమని సంకీర్ణమని రెండువిధాలు. కేవలము సంస్కృత భాషాప్రచురముగా (శిష్టభాష) ఉండేది శుద్ధము. సంస్కృత ప్రాకృత (గ్రాంధిక వ్యావహారిక) భాషామిశ్రితముగా ఉండేది సంకీర్ణము. ఒకడు కాని అనేకులు కాని మధ్యములు ప్రయోగించి నట్లయితే శుద్ధమవుతుందని, మధ్యమ నీచపాత్రప్రయుక్త మయినట్లయితే సంకీర్ణమవుతుందనీ గ్రహించాలి. ఏక మధ్యమ పాత్ర ప్రయుక్త శుద్ధవిష్కంభము అనేక మధ్యమపాత్ర ప్రయుక్త శుద్ధవిష్కంభమూ అని శుద్ధవిష్కంభము ద్వివిధము కావచ్చును. శుద్ధ విష్కంభములో మధ్యమపాత్రల భాషణము వార్తాలాపమూను సంస్కృతములో ఉంటుంది. మిశ్రవిష్కంభములో మిశ్రభాష ఉంటుంది.

## ౨ చూళిక

అంతర్యవనికా సంస్థైః చూళికార్థస్యసూచనా.

యవనికాభ్యంతరములో నుండి రంగస్థలములో ప్రవేశము పొందకుండగానే పాత్రలు అర్థమును సూచించినట్లయితే చూళిక అవుతుంది. నేపథ్యములో నుండి ఏదైనా రహస్యార్థమును సూచించుట చూళిక అని తాత్పర్యము.

## ౩ అంకాస్యము

అంకాంతపాత్రైరంకాస్యముత్తరాంకార్థసూచనా.

పూర్వాంకాంతము నందున్న పాత్రలచే ఉత్తరాంకార్థము సూచిత మయినట్లయితే అంకాస్యము అని పేరు. రాబోవునట్టి అంకములోని విషయమును పూర్వాంకాంతములోని పాత్రలు భాషణావసరమున సూచించాలి.

## ౪ ప్రవేశకము

ప్రవృత్తవర్తిష్యమాణానాం కథాంశానాం నిదర్శకః
ప్రవేశకస్తు నాద్యేంకే నీచపాత్ర ప్రయోజితః.

విష్కంభములో మాదిరిగా దీనిలో కూడా వృత్తవర్తిష్యమాణ కథాంశ నిదర్శనము ఉంటుంది. కాని ఇది నీచపాత్ర ప్రయోజితము. ప్రవేశకము రెండు అంకాలకు మధ్య లోనే ఉంటుంది. కాని ఎప్పుడూ కూడా ప్రథమాంకములో ఉండదు. ఆవిధముగా ఉండరాదని నియమము. ప్రవేశకము లోని పాత్రల భాష ఉత్కృష్టముగా ఉండదు. గ్రామ్యముగా ఉంటుందన్నమాట.

## ౫ అంకావతారము

యత్రస్యాదుత్తరాంకార్థః పూర్వాంకార్థానుసంగతః
అసూచితాంకపాత్రం తదంకావతరణం మతం.

ఉత్తరాంకార్థము పూర్వాంకార్థాను సంగతమై ఉండాలి. పూర్వోత్తరాంకార్థ కథలలో విచ్ఛేదము ఉండరాదు. ఉత్తరాంకములో ప్రవేశించే పాత్రలకు వేరుగా సూచనమంటూ ఉండదు. పూర్వాంకాంతములో పాత్రలందరూ వెడలిపోయి ఉత్తరాంకములో మరలవారె ప్రవేశించాలి. అంకాస్యమునకూ అంకావతారమునకూ ఈభేదము ఉన్నది. అంకాస్యములో ఉత్తరాంకార్థ విషయము సూచనా మాత్రముగా నిర్దిష్టమవుతుంది. అంకావతారములో పూర్వాంక పాత్రలు ఉత్తరాంకములో మళ్లాప్రవేశించి కార్యవ్యాపారమున అగ్రసరులై ఉంటారు.

అర్థోపక్షేపకములు అనబడే ఈవిష్కంభాది పంచకమున సూచ్యార్థమును సూచించాలి. దృశ్యమయిన అర్థమును అంక

ములచే ప్రదర్శించాలి. ఇక అంకస్వరూపమును ప్రదర్శించెదము.

ఆంకము

ప్రత్యక్షనేతృచరితో బిందువ్యాప్తి పురస్కృతః
అంకో నానాప్రకారార్థ సంవిధాన రసాశ్రయః.

అంకములో నాయక చరితము ప్రత్యక్షముగా ఉండాలి. నాయక వ్యాపారమును రంగములో ప్రవేశింప చేసి నిర్దేశించాలి. బిందు రూపార్థమును అభివ్యక్తము చేయడమును అంకము పురస్కరించుకోవాలి.

బిందుసూచనార్థమై అంకము పరిచ్ఛిన్నం కావాలి. ఇంకా అంకము నానాప్రకారార్థ సంవిధాన రసాశ్రయము కావడము కూడా అపేక్షితము. నానా విధములయిన అవాంతర ప్రయోజనములకున్నూ కథా సన్నివేశ విశేషములకున్నూ అంగ భూతములయిన రసములకున్నూ అంగిగా ఉండే రసానికిన్నీ అంకము ఆశ్రయముగా ఉండాలి. కవి అంకములో కేవల రస నిబంధనైకరసికత్వముతో వస్తువును విచ్ఛిన్నము చేయరాదు. వస్త్వలంకార నిబంధనాభిలాషముతో రసమును తిరోధానించరాదు. ఇట్లా వస్తురసములు పరస్పరమూ బాధా రహితములై ఉండాలి. దూర ప్రయాణము వధయుద్ధము రాజ్య దేశాది విప్లవము. శత్రువులముట్టడి, భోజనము, స్నానము, సురతము, అనులేపనము, వస్త్రగ్రహణము మొదలగు వానినిరంగములో ప్రత్యక్షముగా చూపించరాదు. అధికారి అయిన ప్రధాన నాయకుని వధను ఏమాత్రమూ దర్శించరాదు. అధికారివధ ఉన్నట్లు కొంతగా కల్పన చేయవచ్చును. కాని ఆతనికి మరల ప్రత్యుజ్జీవనమును చెప్పడము ఆవశ్యకము. ఆవశ్యకమయిన దానిని ఏమాత్రముఘూ విడువరాదు. నాయకుని ఒకనాటి

చరితమును అంకములో ప్రతిపాదించాలి. ఒక దినము లోని ఘటనల కంటె అధికముగా ఘటనలను సమావేశింప చేయరాదు. కావ్యస్వారస్యము నష్టము కాకుండా ఉండేటట్లుగా ఇతివృత్తమును సంక్షిప్తముచేయాలి. అంకరచనలో ఉండే వస్తుఘటనలు అసంబద్ధముగా ఉండరాదు. వానిలో కార్యకారణభావము ఉండితీరాలి. అంకములోని వస్తువిన్యాసము సమ్యగ్రీతిలో ఉండడమూ పరస్పరమూ సంబంధము కలిగిఉండడమూ ఆవశ్యకము. ఆయా అంకాలలోని కార్య సమాప్తులనూ ఫలప్రాప్తులనూ కార్యవ్యాపారప్రసారములలో ఉపయోగించేటట్లుగానూ అక్కడ అగ్రసరములు అయ్యేటట్లుగానూ నిబంధించాలి. ఒక్కొక్క అంకానికి మధ్యకాలము ఒక్కొక్క సంవత్సరము కంటె అధికముగా ఉండరాదు. ఇతి హాసవశాన ఇంతకన్న అధిక కాలము సంప్రాప్తమయినా దానిని సంవత్సరముగా సంకోచింప చేయుడము ఆవశ్యకము. ఈ అంకముల అంతరమును సూచనము చేయడానికె అర్థోపక్షేపకములు నిర్దేశింపబడినవి. ఒక అంకానికి ఒకే ప్రయోజనము ఆశ్లిష్టమై ఉండాలి. నాయకుడు అందు ఆసన్నుడై ఉండాలి. విదూషకుడు మొదలయిన ముగ్గురు నలుగురు పాత్రలతో అంకమును కూర్చాలి. సర్వపాత్రలూ నిష్క్రమించుట అంకమునకు అవసానము. ఇటువంటి ఈ అంక విశేషస్వరూపములు గ్రంథాంతరములందు విపులముగా నిరూపితము లయినవి.

విష్కంభాదులు సూచ్యవస్తు ఖండ ప్రతిపాదకములు. అంకములు అసూచ్య వస్తుఖండ ప్రతిపాదకములు. ఈ రెండిటి స్వరూపములూ నిరూపితము లయినవి. ఇక నాటకీ

వృత్తిని నిరూపించ వలసి ఉన్నది. భారతీ వృత్తి సర్వ కార్యార్థ సూచకము. సంస్కృత ప్రధాన మయిన వాగ్వ్యాపారము భారతి. విశిష్ట మానవులు దీనిని ప్రయోగించాలి. ప్రధాన వ్యక్తులు సంస్కృత బహుళంగా ఉక్తి ప్రత్యుక్తులతో వ్యవహరించడ మన్నమాట. రూపక ప్రారంభములో ఇది నటుని ఆశ్రయించి ఉంటుంది. ఇతర స్థలాలలో అయితే కొంత విశేషము కలవారు ప్రయోగిస్తారు. తదంగములు నాలుగు ఆముఖము ప్రరోచన వీధి ప్రహసనమూ అని సామాన్యముగా వీధీ ప్రహసనములు ప్రబంధాదిలో ప్రయుక్తములు కావడము లేదు. రూపక దశక మధ్యములో వీధి ప్రహసనములు రూపక భేదములుగా పరిగణింప బడుతున్నవి. వాటిలక్షణాలను ఆ యా ప్రసంగములలో నిరూపించుతాము. ఈప్రసంగమున ప్రరోచనను నిరూపింప వలసినదె. విద్యానాథుడు ఇక్కడ దాని స్వరూపమును చెప్పక పోయినా ఉదాహరణములో సమన్వయ విధానమును సూచించుతున్నాడు. కాబట్టి ఇక్కడ ప్రరోచనను ఉపపాదించడము ప్రరోచనకు (ప్రీతికి) హేతువు కాకపోదు కదా !

## ప్ర రో చ న

ప్రస్తుతార్థమును ప్రశంస చేస్తూ సభాసదులకు సముత్కంఠను కలుగ జేయడము ప్రరోచన అవుతుంది. పశంస రెండు విధాలు. చేతనాశ్రయ మని అచేతనాశ్రయ మనిదేశకాల ప్రశంస అచేతనాశ్రయము. కవిసభ్య నట కథానాయక ప్రశంస చేతనాశ్రయము. కవి తన ప్రకృత్యను సారముగా నాలుగు విధాల ప్రరోచనా ప్రయోగ మొనరించు తాడు. ప్రకృత్యనుసార మున కవికూడా నాలుగు

విధములవుతాడు. ఉదాత్తుడు ఉద్ధతుడు ప్రౌఢుడు వినీతుడూ అని. ఉదాత్తకవి అభిమాన పరిపూర్ణమైన వచన ప్రయోగము చేస్తాడు. ఉద్ధతకవి ఇతరులను అవమానించి తన ఉత్కర్షను చెప్పుకొంటాడు. ప్రౌఢకవి తనఉత్కర్షను యుక్తివిశేషముతో స్పష్టము చేస్తాడు, వినీతకవి వినయపూర్వకముగా తన అపకర్షను ఉల్లేఖించుకొంటాడు.

సభ్యులు కూడా ప్రార్థనీయులని ప్రార్థకులని ద్వివిధముగా ఉంటారు. ఎవరిఆగమనానికై నాట్యప్రయోక్త ఉత్కంఠితుడవుతాడో ఎవరిరాక వలన తాను సమ్మానింపబడినట్లుగా తలంచుతాడో వారు ప్రార్థనీయసభ్యులు. నాటకమును చూడవలెనని ఉత్కంఠ పడేవారు నాట్యమును ప్రయోగించే వారిచే (నటులచే) తాము అనుగ్రహింపబడితిమని భావించే వారు ప్రార్థక సభ్యులు, ప్రరోచన కూడా సంక్షిప్త మని విస్తృత మనీ రెండు విధాలు.

ఆ ము ఖ ము

సూత్రధారో నటీం బ్రూతే మారిషం వాథ విదూషకం
స్వకార్య ప్రస్తుతాక్షేపి చిత్రోక్త్యా యత్తదాముఖం.
ప్రస్తావనా వా యత్ర స్యా త్కథోద్ఘాతః ప్రవర్తకం
ప్రయోగాతిశయశ్చేతి త్రీణ్యంగాన్యాముఖస్య తు,

సూత్రధారుడు నటుని గురించి గాని మారిషుని గురించి గాని విదూషకుని గురించి కాని చిత్రోక్తులతో పలుకుట ఆముఖ మవుతుంది. ఆ చిత్రోక్తి అభిమత రూపక ప్రయోగములో పరిషదారాధనాత్మకమైన ప్రస్తుత కార్యమును తెలియజేసేదిగా ఉండాలి. ప్రస్తుతమయిన కావ్యార్థమును

సూచించేది కావాలి. చిత్రోక్తితో నాట్యాదికమును పలుకుట ఆముఖము అని భావము.

సూత్రధారులు ఇద్దరు ఉంటారు. ఒకడు పూర్వరంగ విధాత. రెండవ సూత్రధారుడు మొదటి వానివలె గుణము ఆకారమూ కలిగి ఉంటాడు. ఈతడు ప్రస్తావనా ప్రవర్తకుడు. స్థాపకుడని ఈతనికే వేరొక నామము. నటీ మారిషాది సంభాషణమును బట్టి ఈతడె ఇక్కడ వివక్షితుడని ఊహించాలి. నటి ఈతని గృహిణి. వెంటనంటి తిరుగు వాడు (పారిపార్శ్వకుడు) మారిషుడు. నర్మసచివుడు విదూషకుడు కవినాయకుల గుణములను ఆసూత్రించే వాడునూ కావ్యవస్తువును సూచించేవాడునూ రంగప్రసాధన ప్రౌఢుడూ అగువాడు సూత్రధారు డనబడును. అతని గృహిణిఅయిన నటి సంగీత వాద్యకుశల కళావిశారద అభినయచతుర సర్వభాషా విచక్షణ. నటుని కృత్యములలో ఉపకారిణిగా ఉంటూ అనుకారిణి అవుతూఉంటుంది. భరతుడు నిర్దేశించిన నానా ప్రకార రసభావాశ్రయము లయిన అభినయములను చక్కగా పరిష్కరింపగలవాడు మారిషుడు. ప్రత్యుత్పన్నమతి నర్మప్రయోగ చతురుడు వేద వేత్త హాస్యప్రాయుడూ అయినవాడు విదూషకుడు. ఇటువంటి వీరితో నటుడు స్వకార్యము కావ్యార్థమూ ఆక్షిప్త మయ్యేటట్లుగా పలుకుట ఆముఖము అని గ్రహించవచ్చును.

ఇంకా ఈవిషయమును ఇక్కడ గ్రహించాలి. రూపక ముఖ్యకథా ప్రారంభానికి పూర్వము కొన్ని కృత్యములను విధానించ వలసి ఉన్నది. దీనినె పూర్వరంగమంటారు. అభినయము చేసేవారు రూపకము ప్రారంభించడానికి పూర్వము

రంగశాలా విఘ్నములను దూరీకరించవలసి ఉన్నది. ఈపూర్వ రంగమునందు ఆవిధానములు కూడి ఉంటవి. భరతుడు ఈవిధానములను విపులముగా ప్రతిపాదించినాడు. తదను సారము అన్నిటికన్న ముందుగా నాటకము ప్రారంభము కాబోవు చున్నదని సూచించడానికి వాద్యఘోషణము చేయబడుతుంది అనంతరము గాయకులు వాదకులూ రంగానికివచ్చి తమతమ సాధనాల స్వరాదికమును మేళవించి గాన వాద్యములను ప్రారంభించుతారు. అప్పుడు సూత్రధారుడు రంగములో పువ్వులు చల్లుతూ ప్రవేశించుతాడు. ఆతనితో బాటు ఒకసేవకుడు ఒకజలపాత్రను పట్టుకొని వస్తాడు. వేరొకడు ఇంద్ర ధ్వజమును తీసికొని వస్తాడు, సూత్రధారుడు జలపాత్రనుండి ఉదకమును గ్రహించి తనను పవిత్రముచేసి కొంటాడు. ఇంద్ర ధ్వజమును హస్తములతో బట్టి రంగమునవిలిచి స్తుతిపాఠము చేస్తాడు. ఈస్తుతిపాఠమె నాంది. అనంతరము ఏదేవతోత్సవ మును అనుసరించి నాటకము జరుగనున్నదో ఆదేవతను స్తవముచేయాలి. రాజవందనము చేయాలి. బ్రాహ్మణ నమస్కారము చేయాలి. ఇట్లా నాంది సమాప్తము కాగానె రంగద్వారము అనే కృత్యము ప్రారంభింప బడుతుంది. ఇక్కడి నుండి నాటక ప్రారంభము. అప్పుడే శ్రీపార్వతీదేవి ప్రమథ గణములు భూతములు మొదలగువారి ప్రసన్నత కొరకు నృత్యము జరుగుతుంది. సూత్రధార విదూషకులు సంభాషణము చేస్తారు. రూపక కథ సూచిత మవుతుంది. సూత్ర ధారాదులు నిష్క్రమిస్తారు. అనంతరము స్థాపకుని ప్రవేశము. ఈతడు రూపములో గుణాలలో సూత్రధార సదృశుడు. తాను సూత్రధారుని వలె వేషమును ధరించు తాడు.

నాటక విషయమును నామమునూ సూచించుచుతాడు. నాట్యకారుల గుణాములను వర్ణించుచుతాడు. ఉపయుక్త గుణ వర్ణనము చేసి రూపకమును ప్రారంభిస్తాడు. దివ్యవస్తువును దివ్యుడుగా అభినయించుచుతాడు. మర్త్య వస్తువును మర్త్యుడుగా అభినయించుచుతాడు. మిశ్రవస్తువును అన్యతరుడుగా సూచిస్తాడు. ఆముఖము అంటే ఇది. దీనినే ప్రస్తావన అంటారని విద్యానాథుడు దశరూపకకారాశయమును ఉల్లేఖించుచున్నాడు ప్రస్తావన అని స్థాపన అని ఆముఖము రెండు విధాలు. కొన్ని వీథ్యంగముల ప్రయోగము ఉంటే స్థాపన అవుతుంది. శృంగార ప్రధానక రూపకములలో ఆముఖము, వీరాద్భుత ప్రధానకములలో ప్రస్తావన హాస్య భీభత్స రౌద్ర ప్రధానకములలో స్థాపన యోజితము కావాలని కొందరి ఆశయము.

ఈ ఆముఖ కార్యము మూడు విధాల ఉంటుంది. కాబట్టి కథోద్ఘాతము ప్రవర్తకము ప్రయోగాతిశయమూ అని మూడంగములు ఉన్నవి. ఈ అంగముల స్వరూపము.

### ౧ కథోద్ఘాతము

స్వేతివృత్తసమం వాక్యమర్థం వా యత్ర సూత్రిణః
గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతో ద్విధైవ సః

రూపకములో ప్రవేశించు పాత్రధారి తన యితివృత్తముతో సమానమయిన సూత్రధారుని వచనమును కాని వచనార్థమును కాని స్వీకరించి ప్రవేశించినట్లయితే కథోద్ఘాతమవుతుంది. వాక్యమును స్వీకరించి ప్రవేశించడము ఒకటి, వాక్యార్థమును స్వీకరించి ప్రవేశించడము రెండు. ఇట్లా ఇది రెండు విధాలు.

౨ ప్రవర్తకము

ప్రస్తూయ మానకాలస్య గుణవర్ణనయా స్వతః
ప్రవిశేత్సూచితం పాత్రం యత్ర తత్స్యాత్ప్రవర్తకం.

సూత్రధారుడు రంగ ప్రపంచమునందు వసంతాది ఋతువు నుగురించి గానము చేస్తాడు. కాబట్టి అట్లా స్వభావసిద్ధముగా ప్రస్తావింప బడుతూ ఉన్న వసంత శరదాది కాల గుణ వర్ణనము వలన సూచితమయిన పాత్ర ప్రవేశించినట్లయితే ప్రవర్తక మవుతుంది. సూత్రధారుడు చేసే ఋతు వర్ణనము ను ఆశ్రయించి పాత్ర ప్రవేశించడము ప్రవర్తక మవుతుందని భావము.

౩ ప్రయోగాతిశయము

ఏషోఽయమిత్యు పక్షేపాత్సూత్రధార ప్రయోగతః
పాత్రప్రవేశో యత్రాయం ప్రయోగాతిశయో మతః.

వీడుగో ఇతడు అనే సూత్రధారి ప్రయోగమును అనుసరించి ఉన్న ఉపక్షేపమును బట్టి పాత్ర ప్రవేశించినట్లయితే ప్రయోగాతిశయమవుతుంది. సూత్రధారుడు రంగములో ప్రవేశించి తానుపలుకు వచనముతో ప్రవేశింపబోయె పాత్రయొక్క సామ్యమును గ్రహించుతాడు. 'ఇదుగో' అని ప్రవిశత్పాత్రను సూచించుతాడు. అట్లా ఉపక్షేపించుట ప్రయోగాతిశయము.

భారతీ వృత్తిభేదమయిన వీధికి పదమూడు అంగము లున్నవి. వీధ్యంగములె ఆముఖాంగములు. వాని స్వభావము అటువంటిదే కాబట్టి దానిని ఇక్కడ చెప్పడము అవసరము.

ఉద్ఘాత్యకము, అవలగితము, ప్రపంచము, త్రిగతము,

ఛలము, వాక్కేలి, అధిబలము, గండము, అవస్యందితము, నాళిక,అసత్ప్రలాపము; వ్యాహారము, మృదవము.

అని ఇవి పదమూడు. ఈ వీథ్యంగములూ ఆముఖాంగములూఅభిన్నములైనా వీథ్యాముఖములు అభిన్నములుకావు. ఆ ముఖములో ఉండే కథోద్ఘాతాదిత్రయము వీథిలో ఉండదు. సూత్రధారాది సంబంధము వీథిలో ఉండదు. ఉద్ఘాత్యకాది సర్వాంగములూ వీథిలో ఆవశ్యకములు. ఆముఖములో అట్లా కాదు. కాబట్టి రెండిటికీ భేదము ఉన్నదని గ్రహించాలి.

ఇక వీని స్వరూపమును నిరూపింతుము.

౧. ఉద్ఘాత్యకము:—రంగమున ప్రవేశించిన వారిపరస్పరాలాపములో గూఢార్థకములయిన శబ్దములు వానిపర్యాయము వాచకములయిన శబ్దములు మాలారూపముగా ఉన్నట్లయితే; అంటే ప్రశ్నఉత్తరము ప్రశ్నఉత్తరమురూపముగా ఉన్నట్లయితే ఒక విధమయిన ఉద్ఘాత్యక మవుతుంది. వస్తువిశేష జ్ఞానము కొరకై ప్రశ్నోత్తరమాల నిబద్ధ మయినట్లయితే రెండవ ఉద్ఘాత్యక మవుతుంది. పరస్పరమూ నిబద్ధములయిన ప్రశ్నోత్తరముల వలన అనేక విషయములను తెలిసి కొనడానికి అవకాశము ఉంటుంది గదా!

౨. అవలగితము:— ఇది రెండు విధములు. ఒక చోట ఒక కార్యమును సమావేశింప జేయడము వలన తత్సాదృశ్యము మొదలయినవి కారణముగా వేరొక కార్యము సాధితమయినట్లయితే మొదటి అవలగితము. దీనిలో ప్రకృత కార్యము ప్రయత్న పూర్వకముగా ఉంటుంది. అన్య కార్యమే అప్రయత్నముగా ప్రాసంగికముగా సిద్ధ మవుతుంది. ఒక కార్యమును

ఆచరించుట అనే మిషతో ఇతర కార్యాచరణము ప్రథమా వలగితమని సారాంశము.

ఇతర కార్య ప్రసంగము వలన ప్రకృత కార్యము అయి నట్లయితే రెండవ అవలగితము. ప్రకృతమునకు ఏదో విధ ముగా సంబంధించిన అప్రకృత కార్య ప్రసంగము చేయబడే టప్పుడు ప్రకృత కార్యము సిద్ధ మయినట్లయితే ద్వితీయా వల గితమని భావము.

3. ప్రపంచము:— లేనిపోని పరదారాభిగమనాది కములను చెప్పి అసత్ప్రాయ మయిన పరస్పర స్తోత్రమును నిబం ధించుట ప్రపంచము అనబడును. కొందరు ఈ విధముగా అంటారు. చెడు పనులను ఆచరించి నందు వలన ఒకడు వేరొకని సోపహాసముగా కొంత ప్రశంస చేయుట ప్రపంచ మవుతుంది అని. ఈ రెండు స్వరూపములూ ఒకటే అయినా రెండవదాని స్తోత్రములో హాస్యము ప్రవేశము పొందడమె విశేషము. పరస్త్రీ గమనాదికము లోని చాతు ర్యము అసత్కర్మలో సమ్మిళితమె అవుతుంది.

౪. త్రిగతము:— ఇది రెండువిధాలు. పూర్వరంగాంగము మొదటిది. ప్రస్తావనాంగము రెండవది. నటాదులు సల్లాప మొనర్చుట పూర్వ రంగాంగ త్రిగతము. ప్రస్తావ నాంగముగా ఉండే త్రిగతము ఈ విధముగా ఉంటుంది. ఒక శబ్దము వలన శ్రుతిసామ్యమును బట్టి అనేకార్థములను యోజనము చేయుట. పూర్వ రంగములో సూత్రధారుడు నటుడూ పారి పార్శ్వకుడూ అనే ముగ్గురూ సంలాపము ఒనరించుట వలన వారందరూ ఒకే ధ్వనితో మేళనము పొందేటట్లు పలకడము

వలన ఈ శ్రుతిసమత్వము ఊహించడానికి అవకాశము కలుగుతుంది.

౫. ఛలము:— దీనికే ఛలన మని కూడా పేరు. మొదట చూడడానికి ప్రియముగా ఉన్నప్పటికీ వాస్తవముగా అప్రియముగా ఉండే వాక్యములతో లోభపెట్టుట ఛలమవుతుంది. ఏదో కార్యమును లక్ష్యముగా పెట్టుకొని ప్రలోభ పెట్టువాని హాస్యము కాని రోషము కలుగ జేయు వాని వచనము కాని ఛలమవు తుందని కొందరంటారు.

౬. వాక్కేళి:— ఇది రెండు విధాలు సాకాంక్షమయిన వాక్యమును మధ్యలో నివర్తింపచేయుట, పలుకుతూ పలుకుతూ ఉన్న వాక్యమును ఆపివేయుట వాక్కేళి అవుతుంది. ఇది మొదటి విధము. రెండు మూడు పర్యాయములు ఉక్తి ప్రత్యుక్తులను నిబంధించడము రెండవ వాక్కేళి. అనేక ప్రశ్నలకు ఒకే సమాధానము ఉండడముకూడా వాక్కేళియె అవుతుందని కొందరి భావము.

౭. అధిబలము:— ఇద్దరు వ్యక్తులు పరస్పరమూ తమ తమ సామర్థ్యమును ప్రకాశింప చేసికొనడానికై స్పర్ధతో మాటలు మీరడము (వాక్యాధిక్యము) అధి బలమవుతుంది.

౮. గండము:— ప్రస్తుత విషయముతో సంబంధము ఉన్నప్పటికీ భిన్నార్థ సూచకమయిన ప్రస్తుత విరోధి అయిన త్వరాయుక్త వాక్యము ఆలోచింపకుండా పలికిన వాక్యము గండము అవుతుంది.

౯. అవస్యందితము:— రసవశాన పలికిన వాక్యానికి అన్యథా వ్యాఖ్యానము చేయడము అవస్యందితము.

౧౦. నాళిక:— గూఢభావము కలిగిన సోపహాస ప్రహేళికా వచనము నాళిక అవుతుంది. దీనిలో అసలర్థము దాచబడి ఉంటుంది. దీనిలో బాహ్యార్థము కాని అభ్యంతరార్థము కాని గోపిత మవుతుంది. ప్రహేళిక అంటె చిత్రవచనము. ఏదో ఒక అర్థమును వ్యక్తము చేస్తూ సహజార్థమును గోపనము చేసి పలకడము ప్రహేళిక. బాహ్యాభ్యంతరార్థములలో ఒకటి గోపిత మవుతుంది. వేరొకటి ప్రకట మవుతుంది. ఈ ప్రహేళికా విశేషములను ఇతర స్థలములలో విశదంగా గ్రహించాలి.

౧౧. అసత్ప్రలాపము:—అసంబద్ధ కథా ప్రాయమయిన ప్రలాపము అసత్ప్రలాప మవుతుంది. ఆవేశములో ఇటువంటి అసంబద్ధ ప్రలాపము ఉదయించుతుంది. స్వప్నములో ఈ విధముగా పలకవచ్చును. ఉన్మాదము వలన ఈ విధముగా పలకవచ్చును, బాలత్వ సులభముగా ఇటువంటి వచనాలు రావచ్చును. అందు వలననే ఇక్కడ "అసంగతి" అనే వాక్య దోషము వాటిల్లదు.

౧౨. వ్యాహారము:— వేరొక ప్రయోజనమును సిద్ధము చేసికొనడానికై హాస్య పూర్ణమయిన లోభకారి అయిన వచనమును పలుకుట వ్యాహారము.

౧౩. మృదవము:—దోషమును గుణీకరించడము కాని గుణమును దోషీకరించడము కాని మృదవ మవుతుంది.

ఇట్లా ఈ పదమూడంగములూ నిరూపితము లయినవి. ఆముఖములో వీటి నన్నిటిని నిబంధించాలన్న నియమ నిర్బంధము లేదు. యథా సంభవముగా ప్రస్తావనలో వీనిని కూర్చాలి. ఈ ఆముఖము అంతా రసోపకారిక ఉపోద్ఘాత

రూపము. ఇక ఇటుమీద దశరూపకముల స్వరూపము ను నిరూపించాలి.

సాంగై ర్ముఖ ప్రతిముఖ గర్భవిమర్శో పసంహృతైః
పూర్వం ప్రకృతి రన్యేషా మాధికారిక వృత్తవత్
వీరశృంగారయో రేకః ప్రధానం యత్ర వర్ణ్యతే
ప్రఖ్యాతనాయకోపేతం నాటకం తదుదాహృతం,

నాటకము దశరూపకములో మొదటిది. కావున ప్రకృతి. సర్వాంగోపదేశము కలది ప్రకృతి అవుతుంది. నాటకములో ఆయా అంగములతో కూడుకొన్న ముఖ ప్రతిముఖ గర్భ విమర్శ నిర్వహణ సంధులు అయిదూ ఉండాలి. నాటకము కంటె ఇతరములయిన రూపకములన్నీ వికృతులు. వానికి అన్నిటికీ ఇది ప్రకృతి. వికృతిలో సర్వాంగోపదేశము ఉండదు ప్రకృతినుండి వికృతి అతిదేశమున అంగమును గ్రహించు తుంది. సర్వాంగోపదేశము లేనప్పుడు ఎక్కడ అన్ని అంగ ములూ ఉంటవో అక్కడినుండి ఈ అంగములను తెచ్చు కోవాలి.

దర్శ పూర్ణమాస యాగము ప్రకృతియాగము. దానిలో కావలసిన సర్వాంగములూ ఉపదిష్టములై ఉన్నవి. అదివేరొక చోటనుండి అంగములను తెచ్చుకొనవలసిన అవసరము లేదు. ఐంద్రాగ్న్యాది యాగములు వికృతియాగములు. వానిలో సర్వాంగోపదేశము లేదు, అక్కడ కావలసిన అంగములు దర్శపూర్ణమాస యాగములనుండి అతిదేశమున సంప్రాప్తము లవుతవి. ఒకచోటను డి వేరొకస్థలానికి అంగములు సంప్రాప్త ములు కావడమునకు అతిదేశము అనిపేరు.

ఇక్కడ ప్రకృతముతో ప్రకరణాది రూపకములు వికృతులు

అక్కడ అన్ని అంగములూ చెప్పబడవు. అక్కడ కావలసిన వానిని నాటకము నుండి గ్రహించాలి. కాబట్టి నాటకము అన్నిటికీ ప్రకృతి. ఇది ఆధికారిక వృత్తము కలిగి ఉంటుంది. ఆధికారిక పదార్థము ఇదివరలో నిరూపిత మయింది. నాటకములో వీరశృంగార ములలో ఏదో ఒకటి ప్రధానముగా వర్ణింప బడాలి. కాబట్టి రసాంతరములు అంగములుగా ఉండాలని సూచితము.

విద్యానాథుడు చెప్పక పోయినా గ్రంథాంతర విషయమును ఇక్కడ ఈవిధముగా గ్రహించాలి. నాటకములో వీర శృంగారములలో ఏదో ఒకటి ప్రధానముగా ఉండాలనేది నియమమై అయినా ఇతర రసములు ప్రధానముగా ఉండ రాదనే నిషేధము లేదు. ప్రబంధములకు ఉత్కర్షను సంపాదింప దలచిన కవి నవరసములలో ఏరసము నయినా ప్రధానముగా నాటకములో వర్ణింప వచ్చును. కాబట్టి ఒకచోట వీరము ప్రధానము ఇంకొక చోట శృంగారము ప్రధానము వేరొక స్థలములో కరుణము ప్రధానము. మరిఒకచోట శాంతము ముఖ్యము. ఇంకోచోట అద్భుతము ప్రధానము కావచ్చును. కనుకనే భవభూతి ఉత్తర రామచరితములో కరుణము ప్రధానమని కొందరనుట సంగత మవుతున్నది. ప్రబోధ చంద్రోదయములో శాంతము ప్రధానము. ముద్రా రాక్షసములో అద్భుతము అంగిరసము. వీరశృంగారములె ప్రధానముగా ఉండవలె నని అనడము ఇతరములు ప్రధానములు కారాదను నిషేధపరమై అయినట్లయితే ప్రబోధ చంద్రోదయాదులు నాటకములె కాకపోవలసి వస్తుంది. ప్రబోధచంద్రోదయాదులు నాటకములె అని సహృదయముల

నిశ్చయము. కాగా వీరశృంగారములలో ఏదయినా ఒకటి ప్రధానముగా ఉండాలి, అనే వచనభావమును ఈవిధముగా గ్రహించాలి. రసములలో వీరశృంగారములు బహుజన సాధారణములు కాబట్టి వానిని ప్రధానముగా వర్ణించినట్లయితే ప్రబంధములకు ఉత్కర్ష బహుజనాదృతి కలుగుతుంది. ఇతర రసాలు అంతగా బహుజన సమాదరణము పొందినవి. కావు. కాబట్టి వానివర్ణనము వలన బహుజనాదృతి కలుగక పోవచ్చు. అందుచేత వీరశృంగారములలో ఏదో ఒకదానిని ప్రధానముగా వర్ణించాలి. ఇతర రసాలుకూడా బహుజన సమాదరణమును పొందేవిగా చెప్పడినట్లయితే వానినికూడా ప్రధానముగా వర్ణించవచ్చును.

రామాయణాది గ్రంథప్రఖ్యాతుడయిన ధీరోదాత్త నాయకుడు నాటకములో నాయకుడుగా ఉండాలి. ఇంకా దీనిలో నాయకుడు కాదగినవాడు రాజర్షికాని దివ్యుడుకాని అవుతాడు. అభిగమ్యగుణయుక్తుడు ప్రతాపయుతుడు కీర్తికాముడు మహోత్సాహుడు వేదరక్షకుడు మహీపతి ప్రఖ్యాతవంశ్యుడూ అయిన వాడె నాయకుడు కావాలి. దీనిలో ఆధికారిక వృత్తము ప్రఖ్యాతముగా ఉండాలి, ఇతిహాసాది ప్రఖ్యాత వస్తువునందు నాయకునకుగాని రసమునకుగాని అనౌచిత్యమును సంపాదించు సంఘటనము ఉన్నట్లయితే దానిని పరిత్యజించి అన్యథాయోజనముచేయాలి. ఇట్టిది నాటకము,

ప్రస్తుత మూలగ్రంథములో లేకపోయినా ఆవశ్యకములయిన ఈ విషయాలను కూడా ఇక్కడ గ్రహించడము సముచితముగా ఉంటుంది. నాట్య శాస్త్ర సంబద్ధము లయిన సర్వ విషయములూ నాటకములో ఉన్నవి. సర్వ రసాలకూ

నాటకములో సమావేశము ఉన్నది. కావుననె సర్వ ప్రకారములయిన రూపకాలకున్నూ ఇది ప్రతినిధి. నాటకము సర్వగ్రాహిణి ప్రకృతి అయినందు వలన దేశభాషలలో నాటక శబ్దము రూపక స్థానాపన్నము అయింది. నాటక శబ్దము వలన సకల దృశ్య కావ్య బోధ కలుగు తున్నది. ఈ విధముగా ఆ శబ్దమును ప్రయోగించడము శాస్త్రీయముగా అనుచితమె అయినా లోకములో అది ప్రసారము పొందింది. కాబట్టి నాటకము అంటే రూపకమని రూపక భేదమయిన నాటక మనిన్ని అర్థము. శాస్త్రీయ దృష్టిచే లిఖింప బడని గ్రంథాలలో ఈ భేదమును గ్రహించాలి.

నాటక కథ ఇతిహాస ప్రసిద్ధము. ఇతిహాస ప్రసిద్ధము కాని కేవల కల్పిత కథను ఆధారము చేసికొని నాటకమును రచించరాదు. ఇక్కడ ప్రధాన కార్య సహాయములో నలుగురో అయిదుగురో వ్యక్తులు నాయకుని అనుసరించుతారు. నాయకుని కంటె ఇతరుడు ప్రాసంగిక మయిన కథానకములో నాయకుడు కావచ్చును. నాటకములో అయిదంకాలకు తక్కువ ఉండ రాదు. పది అంకములకంటె అది మించరాదు. పంచాధికాంకములు ఉంటే దానిని మహానాటకము అని అంటారు.

నాటక రచన గోపుచ్ఛాగ్ర భాగసమానముగా ఉండాలని నాట్యాచార్యుల భావము. ఇక్కడ అగ్రభాగ సామ్యమును చెప్పడములో అనేకులు అనేకాభిప్రాయములను చెప్పుతున్నారు. ఉత్తరోత్తరాంకములు చిన్న చిన్నవిగా ఉండాలని కొందరి అభిప్రాయము. మరికొందరీ విధముగా అంటారు: గోపుచ్ఛములో కొన్ని వాలములు చిన్నవిగా ఉంటవి. కొన్ని దీర్ఘములై ఉంటవి, అట్లాగే నాటకములో

ముఖ సంధిలో కొన్ని కార్యములు మాత్రమే ఉపనిబద్ధములు కావాలి. ప్రతి ముఖసంధిలో అంతకన్న అధికంగా కార్యములు నిబంధింప బడాలి. అంతకంటే గర్భాది సంధులలో అధిక ప్రయోజన నిబంధనము ఉండాలి. తుది అంకములో అన్ని ప్రయోజనములూ సమాప్తములు కావాలి అని. మరి ఒకరు ఈ విధముగా అంటారు, గోపుచ్ఛాగ్ర భాగములో ఒకటో రెండో వాలములు అతిదీర్ఘములై ఉంటవి. అట్లాగే నాటకారంభములో ఒకే అర్థము వ్యాపకమై ఉండాలి. గోపుచ్ఛములోని వాలములు వానిసంఖ్య ఉత్తరోత్తరమున పెరిగి ఏకస్థానములో సమన్వితము లవుతూ ఉన్నట్లు నాటకములో కూర్చబడే కథలన్నీ క్రమ వృద్ధి కలవై ఉప సంహారములో మహా సమన్వయము పొందేవి కావాలి అని.

నిర్వహణ సంధిలో అద్భుత రసము ఉండుట అవసరము. ఇంకా ఇటువంటి విశేషాలను గ్రంథాంతరములను అనుసరించి గ్రహించాలి.

## నాందీస్వరూపము

ఇక నాందీ స్వరూపమును నిరూపించు తాము. నాటక ప్రారంభములో విఘ్ననాశకమయిన పూర్వరంగము అనే కర్మ విశేషమును అవశ్యముగా ఆచరించాలి: రంగ విఘ్నోప శాంతికై కుశీలవులు నాటకవస్తువునకు పూర్వము ఆచరించే కర్మ పూర్వరంగ మవుతుందని ప్రాచీనా చార్యులు పలుకుతున్నారు. ఆ పూర్వరంగములో ప్రత్యాహారము మొదలయిన అంగములు ఇరువది రెండు ఉన్నవి. ఎన్ని అంగములున్నా నాటకములో విఘ్నశాంతికై నాందిని ఆచరించాలని సంప్రదాయ విదులు అంటారు.

అర్థతః శబ్దతోవాపి మనాక్కావ్యార్థ సూచనం
యత్రాష్టభిః ద్వాదశభిః అష్టాదశభిరేవ వా
ద్వావింశత్యా పదైర్వాపి సా నాందీ పరికీర్త్యతే.

అర్థ ద్వారమున కాని శబ్దద్వారమున కాని కొంతగా కావ్యార్థమును సూచించుట నాంది అవుతుంది. ఈనాందిలో ఎనిమిది కాని పండ్రెండు కాని పద్దెనిమిది కాని ఇరవై రెండు కాని పదములు ఉండాలి. అని నియమము. నాందిలో ఉండదగిన పదాలు సుబంత తిజంత రూపములు. అని కొందరి ఆశయము. శ్లో కానికి నాలుగు పాదాలు ఉంటవి కాబట్టి శ్లోక పాదమె పదము అని కొందరి అభిప్రాయము. ఒక్కొక వాక్యము ఒక్కొక పదమని మరికొందరి భావము. నాటకాది రూపకాలలో మొదట నిరూపించిన పద్యము నాంది అవుతుంది కదా ! వేణీ సంహారము అనే భట్ట నారాయణుని నాటకములో అష్ట పద నాంది ఉన్నది. మురారి కవిరచించిన అనర్ఘ రాఘువ నాటకములో ద్వాదశ పద నాంది ఉన్నది. రాజశేఖరుని బాలరామాయణ నాటకములో ద్వావింశతి పద నాంది ఉన్నది. కొందరు నాందిలో పదనియమము ఉండడమును అంగీకరించరు. పదనియమము లేని నాందీ రచన కూడా కొన్ని నాటకములలో గోచర మవుతున్నది.

మొదట ప్రవేశించిన సూత్రధారుడు ఈ నాంది పఠనము చేస్తాడు. ఈ నాంది అనంతరము వేరొక సూత్రధారుడు ప్రవేశించి రంగ ప్రసాధన పురస్సరముగా భారతీ వృత్తిని ఆశ్రయించి శ్లోకములతో (పద్యములతో) కావ్యార్థమును సూచించాలి. నాట్య సాంప్రదాయికులయిన వారు రంగభూమియందు ప్రవేశించి సభాపతి ఎదుట నృత్తగీత వాద్య

విశేష ప్రయోగము ఒనర్చుట రంగ ప్రసాధనము అని బడుతుంది. భారతీ వృత్తి స్వరూపము ఇది వరలో నిరూ మయింది. పద్యముల ద్వారా కావ్యార్థమును సూచింప యును. అనే విషయమును దశరూపక కర్త ఈ విధము అంటున్నాడు.

రంగం ప్రసాధ్య మధురైః శ్లోకైః కావ్యార్థసూచకైః
ఋతుం కం చిదుపాదాయ భారతీం వృత్తిమాశ్రయేత్.

కావ్యార్థమును సూచనము చేసే మధుర శ్లోకాల ద్వా రంగప్రసాధనము చేసి అనంతరము ఏదయినా ఋతువు గ్రహించి భారతీ వృత్తిని ఆశ్రయింప వలసినది అని. ఈ చెప్పి ప్రక్రియ అంతా నాటకానికే ముఖ్యమని గ్రహించాలి.

## ౨. ప్రకరణము

ఉత్పాద్యేనేతి వృత్తేన ధీరశాంత ప్రధానకం
శేషంనాటక తుల్యాంగంభవేత్ప్రకరణం హి తత్,

ప్రకరణములో ఇతివృత్తము కల్పితముగా ఉండాలి. నా కుడు ధీరశాంతుడు ఆముఖము మొదలయిన అంగముల నాటకములో మాదిరే. ఈ చెప్పిన విశేష స్వరూప మాత్రము ప్రకరణ సాధారణము. మిగిలినవన్నీ నాటకము వలె దీనిలో యోజనీయములు.

నాటకము ప్రకృతి ప్రకరణాదులు వికృతులు కన ప్రకరణములో కావలసిన అంగములన్నీ నాటకమునుండి దేశ ప్రాప్తములవుతవి. ఈ అతిదేశ విధాన రావడ మ మిగిలిన రూపకాలలో అంతటా గ్రహించాలి. "ధీరశా ప్రధానకం" అనేమూలపదాన్ని అనుసరించి దీనిలో చెప్ప

ఇతరోపదేష్టవ్య ధర్మాంతరములను కూడా గ్రహించాలి. ఈ ధర్మాంతరములు దశరూపకములో ఈవిధముగా ఉపదిష్టము లయినవి.

ప్రకరణములో నిరూపితము కావలసిన ఇతివృత్తములో కా శ్రేయమై కల్పితము కావాలి. లోకములో అది సంభావిత సిద్ధి కలది కావాలి. అమాత్యుడు బ్రాహ్మణుడు వైశ్యుడు వీరలలో ఎవరయినా నాయకుడు కావచ్చును. ధీర ప్రశాంతుడుగా ఉండే నాయకుడు ధర్మ కామార్థ తత్పరుడై ఉండాలి, అపాయ సహితుడుగా నిబంధింప బడాలి. ఆతని ప్రయోజన సిద్ధి అపాయ కలితముగా ఉండాలని భావము.

ప్రకరణములో నాయిక మూడు విధాలు. కులస్త్రీ కాని వేశ్యాంగన కాని ఇద్దరూ కాని దీనిలో ఉంటారు. ఇటువంటి నాయికా నిబంధన విశేషమును బట్టి ప్రకరణము కూడా మూడు విధాలుగా ఉంటుందని తెలుసు కోవాలి. గణిక ప్రాకృత భాషిణి కులజ సంస్కృత భాషిణి. భాణము మొదలయినవి కృత్యంతరములకంటె దీనిలోసంధి సంధ్యంగములకు ప్రకర్షకరణము (ప్రకృష్టముగా ఒనరింప బడుట) ఉంటుంది. అందువలన ప్రకరణ నామము సార్థకము.

## ३. భాణము

భారతీవృత్తి భూయిష్ఠం శౌర్య సౌభాగ్య సంస్తవైః
సూచ్యేతే వీరశృంగారౌ విటేన నిపుణోక్తినా.
కల్పితే నేతివృత్తేన ధూర్తచారిత్ర వర్ణనం
ఏకోంకో ముఖనిర్వాహౌ యత్ర భాణః స సమ్మతః.

భాణములో భారతీవృత్తి బహుళముగా ఉండాలి. శౌర్యము సౌభాగ్యమూ సంస్తూయ మానములు కావాలి.

నిపుణవచనములు కల విటుడు వీరశృంగారములను సూచించాలి. దీనిలో ఇతివృత్తము కల్పితము ధూర్తుల చరిత్రము వర్ణితము కావాలి. ఒకటే అంకము ముఖసంధి నిర్వహణ సంధి అని రెండు సంధులే ఉండాలి. తాను అనుభవించిన కథ కాని ఇతరానుభూతేతి వృత్తముకాని దీనిలో ఉండాలి. పాత్రము ఒకటే. విటుడు ప్రవేశించి ఆకాశభాషితముతో వ్యవహరించాలి. గేయపదము మొదలయిన లాస్యాంగములు పదిన్నీ దీనిలో ప్రతిపాదింపబడాలి. గేయపదాదుల లక్షణమును గ్రంథాంతరములందు చూచుకోవాలి. ఈ భాణములో అభినయ మొనరింప గలిగిన బుద్ధిమంతుడయిన విటుడు కల్పిత వ్యక్తితో వార్తాలాపము ఒనరించుతాడు. రంగభూమిపై వచ్చిన నాయకుడు ఆకాశమును చూస్తూ వింటూ ఉన్నట్లుగా అభినయించుతూ కల్పిత పురుషునితో ఉక్తిప్రత్యుక్తులను జరుపుతాడు. స్వయముగా ప్రశ్నించుతాడు. వారు పలికిన సమాధానమును వినినట్లుగా అభినయించి తానే పలుకుతాడు. వారి ప్రశ్నలను చెప్పి తాను ఉత్తరించుతాడు. ఇటువంటి ఉక్తి ప్రత్యుక్తులకు ఆకాశభాషితము అని పేరు. కాగా ఒకే వ్యక్తి ఇద్దరి కృత్యములనూ ఆచరించుతాడని భావము.

## ౪. ప్రహసనము

యత్ర సంధ్యంగ వృత్త్యంగ వర్ణనం భాణవన్మతం
హాస్యో రసః ప్రధానం స్యాద్భవేత్ప్రహసనం హి తత్.

ప్రహసనములో కూడా సంధ్యంగములు వృత్త్యంగములున్నూ భాణములో మాదిరిగా వర్ణింపబడాలి. దీనిలో హాస్యరసము ప్రధానము, హాస్యవచనములు ఇక్కడ ప్రచు

రముగా ఉంటవి కాబట్టి ఇది ప్రహసన మవుతుంది. ప్రహసనము మూడు విధాలు. శుద్ధము వైకృతము సంకీర్ణమూ అని.

శుద్ధము:— పాషండ విప్రప్రభృతి చేటీ చేట సమాకులం
వేషభాషాది సహితం శుద్ధం హాస్య వచోన్వితం.

వేదనిందకు లయిన పాషండులు శ్రోత్రియులుగా కనబడే విప్రులు మొదలయిన వారు శుద్ధ ప్రహసనములో ఉంటారు. ఇది చేటీచేట సమాకులమై ఉంటుంది శ్రోత్రియాదుల వేష భాషాయుతమై ఉంటుంది. హాస్య వచః సమన్వితమై ఉంటుంది. ఇట్టిది శుద్ధ ప్రహసనము.

వైకృతము;— కాముకాదివచోవేషైః షండ కంచుకి తాపసైః
ప్రహాసాభినయప్రాయం వైకృతం తత్ప్రకీర్త్యతే.

వైకృత ప్రహసనములో నపుంసకులు కంచుకులు తాపసులున్నూ కాముకాదుల వచోవేషాదులు కలిగి ఉంటారు. ప్రహసింపదగు అభినయము దీనిలో ప్రధానముగా ఉంటుంది. ఇట్టిది వైకృతము.

సంకీర్ణము;— యద్వీథ్యంగైః స్సమాకీర్ణం సంకీర్ణం ధూర్తసంకులం.

ఉద్ఘాత్యకము మొదలయిన వీథ్యంగములతో సమాకీర్ణము ధూర్తులయిన చోర ద్యూతకరాదులతో సంకులముగా ఉండే ప్రహసనము సంకీర్ణము.

## ౫. డిమము

యత్ర వస్తు ప్రసిద్ధం స్యాత్ వృత్తయః కైశికీం వినా
నేతారో దేవగంధర్వయక్షరక్షోమహోరగాః
భూతప్రేతపిశాచాద్యాః షోడశాత్యంతముద్ధతాః
హాస్యశృంగారరహితా రసా రౌద్రప్రధానకాః
చత్వారోంకాః సంధయశ్చ చత్వారో మర్శవర్జితాః

మాయేంద్రజాల సంగ్రామ సూర్యచంద్రగ్రహోదయః
శేషం నాటకవత్సర్వం స డిమః పరికీర్త్యతే.

డిమమునందు వస్తువు ప్రసిద్ధముగా ఉండాలి. కైశికీ వృత్తి తప్ప మిగిలిన వృత్తులన్నీ దీనిలో ఉంటవి. దేవ గంధర్వ యక్షరక్షోమహోరగభూత ప్రేత పిశాచ ప్రముఖులు అత్యంతమూ ఉద్ధతులూ అయిన పదునలుగురు నాయకులు ఉంటారు. దీనిలో రసములు దీప్తములు హాస్య శృంగారములు ఇక్కడ ఉండవు. శాంతమునకు ఇంకు ప్రసక్తియే ఉండదు. దీనిలో నాలుగే అంకములు. నాలుగే సంధులు. విమర్శ సంధి ఉండదు. మాయ ఇంద్రజాలము యుద్ధము సూర్య గ్రహణము చంద్ర గ్రహణము మొదలయినవి దీనిలో నిబద్ధములు కావాలి. పిడుగులు పడుట తోకచుక్కలు రాలుటలు కూడా ఇందు ఉండాలి. మిలిగిన విశేషములన్నీ నాటకములో మాదిరిగానే ఉంటవి. డిమ ధాతువునకు సంఘాతము సమూహము అని అర్థము. కాగా నాయకుల సంఘాత వ్యాపారము దీనిలో ఉంటుంది. కాబట్టి డిమము అని అనడము సముచితముగా ఉంటుందని ధనికాదులు పలుకుతున్నారు.

ఒ వ్యాయోగము

యత్ర ఖ్యాతేతివృత్తం స్యాదుద్ధతో నాయకో మతః
గర్భావమర్శరాహిత్యం డిమవద్రసపోషణం
ఏకవాసరకార్యం చ సవ్యాయోగో మహారణః

వ్యాయోగములో ఇతి వృత్తము ప్రఖ్యాతమై ఉండాలి. నాయకుడు ధ్ధతుడు. గర్భ సంధి విమర్శ సంధి ఉండదు. శాంతశృంగారహాస్య రహితములు రౌద్ర ప్రధానకములూ

అయిన ఆరు రసాలు దీనిలో ఉండాలి. కైశికి తప్ప మిగిలిన వృత్తులు ఉంటవి. స్త్రీ నిమిత్తముగా ఉండని మహాయుద్ధము ఇక్కడ ఉండాలి. ఒకనాటి కార్యమిక్కడ వర్ణితము కావాలి. ఇటువంటి ఈ విశేషాలలో ఇది డిమతుల్యము. అనేకులు ఇక్కడ కూడుకొని ఉంటారు. కాబట్టి వ్యాయోగమనే నామము సార్థకము. "వ్యాయుజ్యంతే బహవః పురుషాః ఇతి వ్యాయోగః" అని వ్యుత్పత్తి. దీనిలో అనేక పురుషులు సమావేశము పొందుతారు అని భావార్థము.

## ౭ సమవకారము

యత్రాముఖం నాటకవత్సంధయో మర్శవర్జితాః
నేతారో ద్వాదశ పృథక్ఫలా దేవాసురాదయః
వీరప్రధానాశ్చ రసాః త్రయోంకా స్తేషు చ క్రమాత్.
వస్తుస్వభావదైవాదికృతాః స్యుః కపటాస్త్రయః
పురరోధరణాగ్న్యాదినిమిత్తా విద్రవాస్త్రియః
ధర్మార్థకామానుగుణాస్త్రిస్త్రః శృంగారరీతయః
ప్రథమేంకే నిబద్ధవ్యా కథా యామత్రయావధిః
యామావధిః ద్వితీయేంకే తృతీయేంకేర్ధయామికా
అసౌ సమవాకారః స్యాద్వీథ్యంగైః కైశ్చిదన్వితః

సమవకారములో ఆముఖమును నాటకములో వలె రచించాలి. రూపకములలో ఆముఖ రచన అత్యంతమూ ఆవశ్యకము. దీనిలో విమర్శ సంధి ఉండదు. మిగతా నాలుగు సంధులూ ఉండాలి. దేవాసురాదు లయిన నాయకులు దీనిలో పన్నెండుగురు ఉంటారు. వీరందరూ ఒకే కార్యమును అనుసరించి ప్రవర్తించే వారయినా వేరు వేరు ఫలములు కలవారుగా ఉండాలి. వీరరసము ప్రధానము. శృంగా

రాది రసాలు అంగములుగా ఉండాలి. మూడే అంకములు ప్రథమాంకములో ముఖ ప్రతిముఖ సంధులను ద్వితీయాంక ములో గర్భసంధిని తృతీయాంకములో నిర్వహణ సంధిని నిబంధించాలి. అంకత్రయములోనూ మూడు కపటములను మూడు విద్రవములను మూడు శృంగారములనూ నిబంధించాలి. కపట మనగా మోహము. మోహాత్మకముగా ఉండే భ్రమ కపటమునకు స్వరూప మని పెద్దలు చెపుతున్నారు. ఇది నిమిత్తాను రోధమున మూడు విధముల వుతుంది. వస్తు స్వభావ కపటము దైవిక కపటము శత్రుజ కపటము. క్రూరమృగములు మొదలయిన వాని వలన కలిగేది మొదటిది. వహ్ని వర్ష వాతాది సంభవము రెండవది సంగ్రామాది సముద్భవము మూడవది. కపటము వలన కలుగు పలాయనమునకు విద్రవము అని పేరు. విద్రవము త్రివిధము. శత్రువులు పట్టణమును ముట్టడించుట యుద్ధము మొదలగు నది మొదటిది ఇది శత్రువుల వలన కలుగు తుంది. అగ్ని మొదలయినవి నిమిత్తముగా కలిగేది రెండవ విద్రవము, ఇది దైవికము. సర్ప వ్యాఘ్రాదులు నిమిత్తముగా కలిగే విద్రవము మూడవది, ఇది వస్తు స్వభావ కృతము.

ధర్మశృంగారము అర్థ శృంగారము కామ శృంగారము అని శృంగారము మూడు విధాలు. దానిని బట్టి శృంగార రీతులున్నూ మూడువిధాలు. యథాక్రమముగా అంకత్రయములో కపట త్రయ విద్రవ త్రయ శృంగార త్రయ మును వర్ణించాలి, ఒకకపటము ఒకవిద్రవము ఒకశృంగారమూ ప్రత్యంకములోనూ ఉండాలని భావము. ప్రథ

మూంకములో మూడుజాములు అవధిగా కల కథను నిబంధించాలి. రెండవ అంకములో ఏకయామావధిక కథను. మూడవ అంకములో అర్ధయామిక కథను నిబంధించాలి ఈ సమవకారములో యథాలాభముగా ఉద్ఘాత్యకాది వీథ్యంగములను నిబంధించాలి. దీనిలో అంతటా అర్థములు అవకీర్ణములై ఉంటవి కాబట్టి సమవకారము సార్థకము "సమవకీర్యంతే అర్థా అస్మిన్నితి సమవకారః" అనివ్యుత్పత్తి.

## ౮ వీధి

యత్రభాణ వదంగానాం క్లృప్తిః వృత్తిస్తు కైశికీ
శృంగారః పరిపూర్ణత్వాత్సూచనీయోఽతిభూయసా
ఉద్ఘాత్యకా దీన్యంగాని సా వీథీ వీథి వన్మతా

వీధిలో అంకముల రచన అంతా భాణములో మాదిరిగా ఉండాలి. అనగా అంకము ఒకటే ఉంటుంది. ముఖసంధి నిర్వహణసంధి అనే సంధులు రెండే ఉంటవి. దీనిలో వృత్తి మాత్రము కైశికి ఉంటుంది. శృంగారమును పరిపూర్ణముగా అత్యధికముగా సూచించాలి. తదితర రసాలను అంకములను అల్పముగా ప్రతిపాదించాలి, ప్రస్తావనా ప్రసంగములో సూచించిన ఉద్ఘాత్యకాద్యంగములను దీనిలో నిరూపించాలి ఈ వీథిలో అంగము లన్నీ వీథిలో వలె పంక్తిగా మార్గముగా నిబద్ధము లవుతవి కాబట్టి వీథి అనే నామము సముచితముగా ఉంది. ఇంకా దీనిలో ఒకడె పాత్రకాని ఇద్దరు పాత్రలుగాని అభినయించుతారు. దీనిలో లాస్యాంగ దశకము ఉన్నానరే! లేకపోయినా హాని లేదు. అనురాగము కల సామాన్య స్త్రీ కాని పరకీయ కాని ఇక్కడ నాయికగా ఉండాలి. ఇది సంత సారకాము వలె బహిరంగ వస్తుకము

కాబట్టి కులపాలిక (కులజ) అయిన స్త్రీని నాయికగా చేయరాదు.

౯ అంకము

యత్రేతివృత్తం ప్రఖ్యాతం ప్రధానం కరుణో రసః
స్త్రీణాం విలాపో వాగ్యుద్ధం నేతారః ప్రాకృతానరాః
భాణవత్ సంధివృత్త్యాదిన ఉత్సృష్టోఽంక సంజ్ఞితః

అంకములో ఇతివృత్తము ప్రఖ్యాతము ఉత్పాద్యమునూ కావచ్చు అని కొందరిభావము. కరుణారసము ఇక్కడ ప్రధానము. స్త్రీలవిలాపము అధికము వాగ్యుద్ధము మాత్రము ఉండాలి. ప్రాకృతనరులు నాయకులుగా ఉంటారు ఇంకా మిగిలినసంధి వృత్త్యాదికము అంతా భాణములోవలె ఉండాలి ఈ అంకమనే రూపకము సామాన్యముగా రూపకాలలో నిబంధింపబడే నానాప్రకారార్థ సంవిధాన రసాశ్రయముగా చెప్పబడిన అంకము కాదు. కనుకనే దీనికి ఉత్సృష్టము అని పేరు. ఉత్సృష్టికాంకము అనిన్నీ ధనికాదులు అంటారు.

౧౦ ఈహామృగము

మిశ్రమీహామృగే వృత్తం చతుఽంకం త్రిసంధికం
మర్త్య దివ్యౌ చ నియమా న్నాయక ప్రతినాయకౌ
ధీరోద్ధతౌ స్త్రియం దివ్యాం హర్తుకామౌ చ కాముకౌ
అవధం యుద్ధమన్యోన్య మాభాసరసయో స్తయోః.

ఈహామృగములో ఇతివృత్తము మిశ్రముగా ఉంటుంది. నాలుగె అంకాలు. మూడె సంధులు. గర్భసంధి విమర్శసంధి ఉండవు. నాయకులు మర్త్యులు దివ్యులుగా ఉంటారు. ప్రతినాయకులున్నూ అట్లాగే ఉంటారు. నాయకుడు దివ్యుడయితే ప్రతినాయకుడు మర్త్యుడు. నాయకుడు మర్త్య

డయితే ప్రతినాయకుడు దివ్యుడు. నాయక ప్రతినాయకులు ఇద్దరూ ధీరోద్ధతులు. కాముకులై దివ్య యువతిని హరించాలని ప్రయత్నించుతారు. వారిద్దరకూ యుద్ధమును దీనిలో వర్ణించాలి. కాని వధ ఎవరికీన్నీ వర్ణింపరాదు. అవధ యుద్ధమన్నమాట. వీరిద్దరూ అనురాగ రహిత నాయిక యందలి అనురక్తులు కాబట్టి వారి రసము ఆభాసరూపము. వీరిద్దరిలో ఏ ఒకరిని కూడా అభిమానింపని దివ్యయువతిని వీరు అపహరించాలని యత్నించుతారు. వీరి యుద్ధము మేక పోతుల యుద్ధము వలె వధరహితము. మృగము వలె అలభ్యగా ఉండే నాయికను నాయకుడు కోరుతాడు కాబట్టి ఇది ఈహామృగము అవుతున్నది.

ఇట్లా పది రూపకములూ నిర్ణీతము లయినవి. ఈప్రక్రియ అంతా దశరూపకమును అనుసరించి నట్టిదె కేవలము స్వోప్రేక్షమూలకము కాదు. ఇంకా ఉపరూపకముల స్వరూప విశేషములను గ్రంథాంతరము లందు గ్రహించాలి.

నాటక ప్రకరణము

# రస ప్రకరణము

దృశ్య శ్రవ్య భేదము పొందిన సర్వవిధ కావ్యాలకూ రసము ఆత్మ వంటిది. అట్లా జీవిత భూతమయిన రసము యొక్క స్వరూపము ఈ ప్రకరణములో నిరూపిత మవుతుంది. విభావానుభావ సాత్త్విక వ్యభిచారి సామగ్రీ సముల్లాసితమయిన స్థాయిభావము రసము.అని రససామాన్య లక్షణము.స్థాయిగా ఉండే భావము రసమవుతుంది. ఆస్థాయి భావము విభావాది సామగ్రిచేత సముల్లసితము కావాలి. విభావము, అనుభావము సాత్త్వికభావము, వ్యభిచారిభావము అనేవి రససామగ్రి. వీని స్వరూపము మున్ముందు ప్రతిపాదిత మవుతుంది. విభావాదులు సరసకావ్యములో సంగృహీతములు అవుతవి. రంగములో నిపుణుడయిననటునిచే కూడా ప్రకాశితములు అవుతవి. ఇట్లా కావ్యనాట్యోపాత్తమయిన విభావాది సామగ్రి సహృదయ సామాజికునిచే భావ్యమానము అవుతుంది. వీనిచే సముల్లసితమయిన స్థాయిభావమె రసము. సముల్లాసిత మగుట అంటే ఆస్వాద్యమానము కావడమన్నమాట. నిర్భరానంద సంవిద్రూపమును పొందింప బడడము అనిభావము. సామాజిక నిష్ఠమయిన రత్యాది స్థాయిభావము విభావాది సామగ్రీ వశాన ఆస్వాద్యమానము అయినపుడు రసత్వము పొందుతుందని తాత్పర్యము. ఈవిషయము దశరూపకములో ఈ విధముగా నిరూపితమయింది.

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః
ఆనీయమానః స్వాద్యత్వం స్థాయిభావో రసః స్మృతః

విభావము, అనుభావములు, సాత్వికములు, వ్యభిచారులు వీనిచే స్వాదుత్వమును పొందింపబడిన స్థాయిభావము రసము అవుతుంది. అని భావము. 'స్వాద్యత్వం' అనేచోట 'స్వాదుత్వం' అని కూడా పాఠము ఉన్నది. కేవలమూ అన్నము స్వాదువుగా తినడానికి రుచిగా ఉండదు. కూర పప్పు పులుసు పచ్చడి మొదలయిన వ్యంజన ద్రవ్యముల సంబంధము వలన అన్నములో స్వాదుత కలుగుతుంది. అపుడు అన్నము ఆస్వాద్యమానము అవుతుంది. కేవలస్థాయి స్వాదువుగా ఉండదు. విభావాదుల సంబంధము వలన స్థాయియందు స్వాదుత కలుగుంది. అపుడు స్థాయి ఆస్వాద్యమానము అవుతుంది. అదె రసము. ప్రస్తుతములో రసచర్చ ప్రసక్తము కాబట్టి కొంతగా రసమును మీమాంసించుతాము.

నాట్యవేదమును ఆవిష్కరింపచేసిన భరతముని సాహిత్యాచార్య మూర్ధన్యుడు. ఆతడు

"విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రస నిష్పత్తిః"

అని రసప్రతీతిని సూత్రించాడు. దీనిని అనుసరించి అనేకులు అనేకవిధాల రసవాదములను ఆవిష్కరించారు. వానిలో ప్రధానములయినవి నాలుగు వాదాలు. భట్టలోల్లటుడు శ్రీశంకుకుడు భట్టనాయకుడు అభినవగుప్త పాదాచార్యుడు అనేనలుగురూ రససూత్రమును వ్యాఖ్యానించారు, వానిలో భట్టలోల్లటుడు మీమాంసకుడు. శ్రీశంకుకుడు తార్కికుడు భట్టనాయకుడు సాంఖ్యవాది. అభినవగుప్త పాదాచార్యుడు ఆలంకారిక మూర్ధన్యుడయిన సాహిత్యవేది. ఈవాదాలలో శ్రీమదభినవ గుప్త పాదాచార్యుని మతమె సిద్ధాంతమతము. సాహిత్యకారులు అందరూ దీనినే ఆధారంగాచేసికొని తమ

గ్రంథాలను ప్రసరింప చేసారు. విద్యానాథుడుకూడా రసవాదములో అభినవ గుప్తానుయాయి.

## భట్టలోల్లటునివాదము

భరతుని సూత్రములో "సంయోగాత్, నిష్పత్తిః" అని రెండు పదాలు ఉన్నవికదా! ఉత్పత్తి వాది అయిన ఈలోల్లటుడు ఈరెండు పదాలకున్నూ తన వాదానుకూలముగా అర్థము చెప్పుకొంటాడు. విభావాదుల సంయోగమువలన రసము నిష్పన్నమవుతుంది అనే సూత్రార్థములో విభావాదులు హేతువులని రసము కార్యమని స్పష్టము. విభావసంయోగము వలన అనుభావ సంయోగము వలన వ్యభిచారి సంయోగము వలన రసము నిష్పన్నమవుతుంది, విభావానికి రసానికిన్నీ ఉత్పాద్యోత్పాదక భావ సంబంధము ఉన్నది. విభావాదులు ఉత్పాదకములు. రసము ఉత్పాద్యము. అనుభావాలకు రసానికీ గమ్య గమక భావ సంబంధము ఉన్నది. అనుభావములు గమకాలు. రసము గమ్యము. వ్యభిచారులకు రసానికి పోష్య పోషక భావ సంబంధము ఉంది. వ్యభిచారులు పోషకములు రసము పోష్యము. కాగా రసము విభావాల వలన ఉత్పన్నమవుతుంది. అనుభావాల వలన గమ్యము అవుతుంది. వ్యభిచారుల వలన పోష్య మవుతుంది. అని భావము. దీనిని శృంగారరసములో ఈ విధముగా సమన్వయించి చూచుకోవాలి. లలనాదులు ఆలంబన విభావాలు. వీని వలన రత్యాదిస్థాయి ఉత్పన్న మవుతుంది. ఉద్యానమంద మారుతాదులు ఉద్దీపన విభావాలు. వీనివలన స్థాయి ఉద్దీపిత మవుతుంది. కటాక్ష భుజక్షేపణాదులు అనుభావాలు వీనివలన రతి ప్రతీతి యోగ్యము అవుతుంది. ఉత్కంఠ మొదలయినవి

వ్యభిచారి భావాలు వీనివలన రతిపరి పుష్టము అవుతుంది. ఈవిధముగా విభావాదుల వలన ఉత్పన్నమై ప్రతీతమై పుష్టమ యిన రతి శృంగారరసము అవుతున్నది; ఈరసానికి రామాది నాయకులు ఆశ్రయులు. వారిరతి భావమే కావ్యనాట్యాలలో అభిధావృత్తిచేత చెప్పబడుతున్నది కాబట్టి అభిధావృత్తినిబట్టి ఈ రసము వారిదే అని నిశ్చితమవు తున్నది. నాట్యమును అనుసరించి అభినేయములో కూడా ఈ రసము ఉన్నదని అంగీకరించవచ్చు. నటుడు రామాదుల తుల్య రూపత్వమును అనుసంధానించుతున్నందువలన రసము నటుని యందు ఉన్న దని సామాజికులు ఆరోపించుతున్నారు. ఇట్లా ఆరోప్య మాణమయిన ఇది సామాజికులకు చమత్కార హేతువు అవుతున్నది.

## శ్రీశంకుకుని వాదము

విభావాదులకు రత్యాది భావాలకూ అనుమాప్యాను మాపక భావసంబంధము ఉన్నది. విభావాదులు అనుమాపక ములు. రత్యాదులు అను మాప్యములు. ఇట్లా అనుమీయ మానములు అవుతూఉన్న రత్యాదిస్థాయి భావములె రస ములు. అనుమాపకములయిన విభావాదుల సంబంధము వలన రసానుమితికలుగుతున్నది. లోకములో సామాన్యముగా నాలుగు విధాల ప్రతీతులు ఉంటవి. చిత్రతురగమును చూచే టప్పుడు చతుర్విధ ప్రతీతులకంటె విలక్షణమయిన ప్రతీతి కలుగుతుంది. నటుని చూచినప్పుడు కూడా విలక్షణ ప్రతీతి ఉదయించుతుంది. నటుడు అభినయములో దృఢాభ్యాసము కలవాడు కాబట్టి విభావము అనుభావము వ్యభిచారి అనే త్రయము ఆతనిలో వాస్తవంగా లేకపోయినా గోచరమవు

తుంది. ఆతడు ప్రదర్శించే రోమాంచాదులు కృత్రిమములె అయినా కృత్రిమములుగా తలచబడవు. ఇటువంటి విభావాదుల వలనఆతనియందు రత్యాదిస్థాయిఉన్నట్లు ఊహింపబడుతుంది. ఈ అనుమానమె చమత్కార రూపమయిన చర్వణ. ఈచర్వణలో విషయముగా ఉన్న స్థాయిభావమె రసము. సామాజికులె ఈచర్వణ కలిగి ఉన్నారు కాబట్టి రసము వారియందె ఉంటుందని వ్యవహారము. ఇక్కడ ఉన్న స్థాయ్యనుమానము ఇతరానుమానాలవంటిది కాదు. ఇతరానుమానాలు చమత్కారకములు కాక పోవచ్చు కాని ఇది మాత్రము వస్తు సౌందర్య బలము వలన రసనీయమై చమత్కారకము అవుతుంది.

## భట్టనాయకునివాదము

విభావాదులకు రత్యాదిభావాలకూ భోజ్య భోజక భావ సంబంధము ఉన్నది. విభావాదులు భోజకములు. రసము భోజ్యము. విభావాది సంబంధము వలన అంటే భోజ్య భోజక భావసంబంధము వలన రసానికి నిష్పత్తి అనగా భుక్తి కలుగుతుంది. శబ్దాత్మకముగా ఉండే కావ్యములో మూడు వ్యాపారములు ఉన్నవి. అభిధాయకత్వము భావకత్వమూ భోజకత్వమూ అనివీటినే అభిధభావన భోగీకృతి అంటారు. అభిధ. వాచ్యార్థవిషయముగా ఉంటుంది. భావనావ్యాపారము రసాదులను విషయముగా చేసికొనిఉంటుంది భోజకత్వమనే భోగీకృతి సహృదయులను విషయముగా చేసికొని ఉంటుంది. భావకత్వానికే సాధారణీకరణము అనిపేరు. ఆవ్యాపారము చేత విభావాదులు స్థాయి అన్నీ కూడా సాధారణముగా చేయుబడుతవి. అంటే ఒకవ్యక్తికి సంబాధించినవి అని కాకుండా అందరకూ

సంబంధించేవిగా సర్వ సామాన్యములుగా చేయబడుతవి. సీతాదివిశేషములు అన్నీకూడా ఆయావిశేష ధర్మాలను పరిత్యజించుకొని సాధారణముగా కామినీత్వాది సామాన్య రూపముగా ఉపస్థితములు కావడమునకు సాధారణీకరణము అని పేరు. అభిధావ్యాపారముచేత సీతారామాది పదార్థములు గోచరములు కావడము భావకత్వ వ్యాపారముచేత విభావాదులు సాధారణీకృతములు కావడమూ జరుగుతుంది. ఆతరువాత భోజకత్వ వ్యాపారము కూడుకొనగానే రత్యాదిస్థాయి భావము భుజ్యమానము అవుతుంది. ఈస్థాయి భోగములో రజస్తమోగుణములు తిరస్కృతములు అవుతవి. సత్వగుణోద్రేకము కలుగుతుంది. దానివలన ఆనందము ప్రకాశించుతుంది. ఆనంద స్వరూపమయిన స్వసంవేదనము సిద్ధమవుతుంది. ఇట్లా సహృదయుల చేత రత్యాది స్థాయి భావము ఆస్వాదింప బడుతుంది. ఈరితియొక్క ఆస్వాదమె రసనిష్పత్తి.

## అభినవగుప్తుని వాదము

శ్రీమదభినవగుప్తపాదాచార్యుడు ౧౦౦౦ కాలికి ముఖ్యవ్యాఖ్యాత ఈతని వాదమె నేటివరకుసిద్ధాంతమై నిలిచిఉంది. ఆవాదసారమును ఇట్లా గ్రహించాలి. రసాలకు విభావాదులకూ వ్యంగ్య వ్యంజక భావ సంబంధము ఉన్నది. విభావాదులు వ్యంజకములు రసములు వ్యంగ్యములు. విభావాదుల సంబంధము వలన రసము నిష్పన్నమవుతుంది అంటే అభివ్యక్తము అవుతుందన్నమాట. ఈ విషయమును ఇట్లా విపులముగా గ్రహించాలి. లోకములో స్త్రీ ఆలంబన కారణము. చంద్రికాదులు ఉద్దీపన కారణాలు. కటాక్షపాతాదులు మొదలయినవి కార్య

ములు. చింతాదులు సహకారులు వీనివలన రతిభావము ఉన్నట్లుగా అభ్యూహించడములో పరిశీలన పాటవము కలిగిన లోక ప్రవృత్తినిఎరిగిన సామాజికులకు అనుభవము ఉంటుంది. అటువంటి సామాజికుల హృదయంలో రత్యాదిభావము సంస్కార రూపముగా అంతఃస్థితమై ఉంటుంది. కావ్యములో కాని నాట్యములో కాని ఈ చెప్పిన కారణాదులు తమః కారణత్వాదులను పరిత్యాగము చేసికొంటువి. కారణములందు విభావనము కలుగగానే కారణత్వముపోయి విభావాది వ్యవహారము కలుగుతుంది. కార్యములలో అనుభావనము కూడుకొనగానే కార్యత్వముపోయి అనుభావ వ్యవహారము కలుగుతుంది. సహకారులందు సంచారణము కూడుకొనగానే సహకారిత్వము పోయి సంచారి వ్యవహారము కలుగుతుంది. ఆసమయములో ఒకసంబంధ స్వీకార విశేషము కాని సంబంధ పరిహార విశేషము కాని ఏమిగోచరము కాదు. సీతాదులు కామినీత్వాది సామాన్యరూపాన గోచరము లవుతారు. ఆసమయము లో అంతఃస్థితమయిన రత్యాది స్థాయి అభివ్యక్తము అవుతుంది. అట్లా అభివ్యక్తమయిన రత్యాదికమె రసము. మొదటగా కావ్యపదాల వలన అయా అర్థోపస్థితి కలగడము; అనంతరము యథాస్థితముగా ఉన్న విభావాదుల వాక్యార్థబోధ. అప్పుడే సాధారణ్యము కలుగగానే రత్యాదులకు అభివ్యక్తి కలుగుతుంది. ఈఅభివ్యంగ్యమయిన స్థాయి విభావాది సముల్లసితము అయినది కాబట్టి రసము అవుతున్నది

ఈనాలుగు మతాల సారమును ఈ విధముగా బుద్ధిరూఢము చేసికోవచ్చు. విభావాదులకు రసమునకూ ఉన్న ఉత్పాద్యో

త్పాదక భావసంబంధము వలన రసమునకు ఉత్పత్తి కలుగుతుంది అని భట్టలోల్లటుడు, అనుమాప్యానుమాపక భావసంబంధమువలన రసమునకు అనుమితి కలుగుతుంది. అని శ్రీశంకుకుడు, భోజ్య భోజక భావసంబంధము వలన రసమునకు భుక్తి కలుగుతుంది. అని భట్టనాయకుడు వ్యంగ్య వ్యంజక భావసంబంధము వలన రసమునకు అభివ్యక్తి కలుగుతుంది. అని అభినవగుప్తపాదులు అంగీకరించుతున్నారు. ఇంకా రసనిష్పత్తియందు చాలా వాదాలు ఉన్నవి. ఆ వాదముల ప్రదర్శనము ఇక్కడ బరువు అవుతుందని నిరూపించడము లేదు.

## స్థాయిభావము

విభావాది పరిపుష్టమయిన స్థాయిభావము రసమవుతుంది. అని ఇంతవరకు నిరూపితము. భావానికి స్థాయిత్వము అంటే ఏమిటి? తెలియవలసి ఉన్నది. అందులోనూ ముందుగా భావ స్వరూపమును గుర్తించాలి. పిమ్మట స్థాయిత్వమును గ్రహించి నిర్ణయించుకోవాలి. సంస్కారము అనే పేరుగలిగిన సామాజిక మనోవికారమునకు భావము అనిపేరు. కావ్యములో నాట్యములో రామాదుల సుఖదుఃఖములు నివేదింపబడుతూ ఉంటవి. ఆ సుఖదుఃఖాదులను భావించుతూ సహృదయుడు సామాజికుడు వానిని తన అనుభూతికి అందించుకుంటాడు. ఆ అనుభవము వలన వాసనారూపమయిన సంస్కారము వానిలో కలుగుతుంది. అదే భావము. తద్భావభావనము భావమవుతుందని సారము. సామాజికులయిన భావకులచిత్తము రామాదుల సుఖదుఃఖాది భావనము చేత భావితమవుతుంది.

ఈ భావితము అయిన భావము రెండువిధాల ఉంటుంది. ఒకటి సన్నిహితము వేరొకటి వ్యవహితము. మొదటిది వస్త్రములో తంతువు వలె ఉంటుంది. దారములో వస్త్రముకంటె ఆకారమాత్రలోనే తేడా ఉంటుంది అట్లాగే రసములో స్థాయిభావము ఆకారమాత్రములోనే వ్యవహితముగా ఉంటుంది కాని మిగతా అంతా ఒకటే, కాబట్టే స్థాయి రసానికి సన్నిహితము. బాగా ప్రకర్ష కలిగి రసత్వమును పొందే భావము స్థాయి అవుతుందని పెద్దలున్నూ చెపుతున్నారంటే బాగా సన్నిహితత్వమును నిరూపించుతున్నారన్నమాట.

వ్యవహితముయినరీతిని విభావాదులలో సమన్వయించుకోవాలి. రసానికీ విభావాదులకున్నూ మధ్యలో భావాంతరము వ్యవధానము సంపాదించేదిగా ఉంటుంది. విభావాదులెపుడున్నూ స్థాయిద్వారా రసోల్లాసకములు అవుతూఉంటవి. కాగా ఇంతకూ ఇది సారాంశముగా తేలుతుంది. సామాజికుల మనోవికార రూపము రసానికి సన్నిహిత పూర్వావస్థా విశేషమూ అయినట్టిదిస్థాయిభావమన్నమాట. రామాదుల సుఖదుఃఖాదిభావితమయిన భావము సజాతీయ విజాతీయాభిభూతము కాకుండా రసానుభవపర్యంతమూ ఉండేది అయినట్లయితే స్థాయిభావము అవుతుంది. దశరూపకములో కూడా ఇట్లాగే అంగీకృతమయింది. సజాతీయ భావముల చేతగాని విజాతీయ భావముల చేతగాని తిరస్కృతము కాకుండా రసీభావం కలిగే వరకూ ఉండే భావము స్థాయి అవుతుంది అని అక్కడి భావము.

ప్రకృతభావానికి సజాతీయ భావములు కొన్నీ విజాతీయ భావములు కొన్నిన్నీ ఉంటవి. ఒక నాయికయందు ఒక

నాయకునకు ఉన్న రతిభావానికి ఇతర నాయికల యందలి రతిభావము సజాతీయ భావము అవుతుంది. సమానకోటికి సంబంధించిన భావాలు సజాతీయములన్నమాట. అసమాన కోటికి సంబంధించినవి విజాతీయములు. రతిభావానికి బీభత్స రస సంబంధభావాలు విజాతీయములవుతవి. ఇటువంటి సజాతీయములు కాని విజాతీయములు కాని భావాన్ని తిరస్కరించకుండా కప్పిపుచ్చకుండా ఉండాలి. దీనిని ఇట్లా ఉదాహరణములో గ్రహించవచ్చు.

నరవాహనదత్తునకు మదనమంజూషపై ఉత్కటానురాగమున్నది. ఇంకా తదితర నాయికలందునున్నూ ఒక్కొక విధమయిన అనురాగభావము ఉన్నది. అయినా ఆ ఇతర నాయికానురాగాలు మదనమంజూషా విషయకమయిన అనురాగమును తిరస్కరించలేదు. ఇతర నాయికానురాగాలు అన్నీ సజాతీయములు. ఇట్లా సజాతీయములచేత ప్రకృతానురాగము అభిభూతము కాకుండా ఉంది. కాబట్టి సజాతీయానభిభూతత్వము సిద్ధమయింది. మాలతియందు మాధవునకు అనురాగం ఉంది. ఇది బాగా సముత్కటమయిన అనురాగము. మాలతి తనను లభించదని ఒకిప్పుడు మాధవుడు మహాశ్మశానాలో తిరుగాడుతున్నాడు. అప్పుడు అక్కడ అతనికి పీనుగులు పిశాచములకు సంబంధించిన ఏవగింపు కలగజేసే అంశాలు ఎన్నో గోచరించినవి. అపుడు ఉదయించిన భావాలు బీభత్సమునకు సంబంధించినవి కాబట్టి ప్రకృత శృంగారేతరములు అయినందువలన విజాతీయములు. ఆ విజాతీయ భావములచేత కూడా అతని మాలతీ విషయకమయిన భావము ఏమీ తిరస్కృతము కాకుండా ఉన్నది.

ఈ విషయమును భవభూతి శ్మశానాంకంలో స్పష్టంగా నిరూపించాడు. ఎన్నెన్ని ఇతరభావాలు కలవర పెట్టుతున్నప్పటికి మాధవునకు మాలత్యనురాగమె దృఢ సంస్కారంగా ఉన్నది. ఇట్లా ఆ అనురాగము విజాతీయ భావానభిభూతము.

ఈరీతిగా విరుద్ధా విరుద్ధావిచ్ఛిన్న స్వభావకముగా భావము ఉన్నప్పుడు అది స్థాయి అవుతుంది. సముద్రము తనలో చేరిన మధురమయిన నదీజలమును ఇతర జలమునూ అంతనూ ఉప్పగానే చేస్తుంది. అన్నిటికి ఆత్మభావమును సంపాదిస్తుంది. అట్లాగే స్థాయికూడా తనకు ఇతరములయిన సజాతీయ విజాతీయముల నన్నిటినీ తనలో కలిపివేసి కొంటుంది. ఇంకా ఇటువంటి ఈభావము అనుభవపర్యంతమూ ఉండేది కావాలి. సంస్కార రూపముగానున్న ఇది నిరంతర నిధ్యానము వలన విజాతీయ ప్రత్యయము ఏమీ లేనిదై భావమునకు తన్మయతను ఆపాదించుతుంది. అంతపర్యంతమూ ఇది ఉన్నప్పుడు స్థాయి అవుతుందని గ్రహించాలి.

## రసములు

రసములు తొమ్మిది ఇక్కడ నిర్దేశింపబడుతున్నవి. రసముల సంఖ్యలో అనేక వాదాలు ఉన్నవి. శృంగారము ఒక్కటే రసము. ఇతరములు ఏవీ రసములె కావు. వీరాదులు రసములు. అని అనడము మిథ్యాప్రవాద అని భోజదేవుని భావము. అద్భుతమే రసమొక్కటే రసము. ఇతరములకు రసత్వమేమిటి? అని నారాయణపండితుడు అంటాడట. భక్తిరసమె వాస్తవ రసము, అని భక్తిప్రియుల వాదము. శృంగార వీర రౌద్ర బీభత్సములు నాలుగే అసలు రసాలు అని కొందరంటారు. శాంతము ఒక్కటే స్వభావరసము. తక్కినవి ఇటువంటివి కావు.

కనుక సిద్ధరసము శాంతము ఒక్కటే అని మరికొందరి నిశ్చయము. అసలు శాంతము రసము కానేకాదు. తదితరములయిన శృంగారాదులె రసములు. అవి ఎనిమిది. "అష్టౌ నాట్యరసాః" అని అంటున్నారు కదా! అని ధనికాగుల ఊహ. శాంతముతో కలిపి రసములు తొమ్మిది. అని అనవలసిందే అని కొందరి ఉపపాదన. వత్సల రసమును కూడా కలుపుకొంటే పదిరసాలు అవుతవి. అందువలన వత్సలరసము కూడా రసమె అని అన్యభావము. భక్తినికూడా రసాలలో పరిగణించాలి. దీనినికూడా కలిపితే రసాలు పదకొండు అని ఒక ఊహ. స్నేహముకూడా రసమె కాబట్టి దానితో రసాలు పన్నెండు. అని ఇంకొక భావము. ఆఁ ఏవయినా రసాలు కావచ్చు. రస్యమానములన్నీ రసములె. కాబట్టి "అనంతా వైరసాః" అని కూడా కొందరి భావము ఇట్లా రసవిషయమై అనేక విప్రతిపత్తులు ఉన్నవి. ఈ న్యూనాధిక సంఖ్యా నివారణమునకు రసాలను విభాగించి పరిగణించాలి.

| | | |
|---|---|---|
| ౧. శృంగారము | ౨. హాస్యము | ౩. కరుణము |
| ౪. రౌద్రము | ౫. వీరము | ౬. భయానకము |
| ౭. బీభత్సము | ౮. అద్భుతము | ౯. శాంతము. |

అని రసములు తొమ్మిది. ఈ విధముగా ప్రామాణికులయిన పెద్దలు నిర్ణయించారు. ఈ రసాల వరసను చెప్పడములో కూడా అభిప్రాయ విశేషాలు ఉన్నవి. కొందరు ఈ వరుసలో దీనిని నిర్దేశించడము లేదు. రస్యమానావస్థలో రసాలన్నీ ఏకాస్వాదజనకముల కాబట్టి ఒకటి ముందు మరొకటి తరువాత అనే విధానము అక్కరలేదు. దేనిని ముందుచెప్పినా చెప్పవచ్చును. అని కొందరి ఆలంకారికుల

ఊహగా కన్పించుచుతుంది. మరికొందరు క్రమవిన్యాసములో అభిప్రాయ విశేషమునున్నా ఊహించుచున్నారు. సత్వరజస్తమోగుణములకు పరస్పర సంబంధము వలన తొమ్మిది భేదాలు సిద్ధములవుతవి. అట్లాగే జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల పరస్పర సంబంధంలోనూ నవభేదసిద్ధి ఉంది. సాత్విక సాత్వికము సాత్విక రాజసము సాత్విక తామసము ఈవిధంగా ఇతర భేదాలున్నా. వీనికీ రసాలకూ సంబంధంఉంది. సాత్విక సాత్వికాదికంగా పరిగణించడములో క్రమాచిత్యం ఉన్నది. కాబట్టి రసాలను కూడా ఒకక్రమంలో సంఖ్యానించడము మంచిది. కాగా శాంత శృంగార కరుణములు హాస్యాద్భుత భయానకములు వీర బీభత్స రౌద్రములూ అనే క్రమిక రీతి సుసంగతంగా ఉంటుందని సాహిత్యసార కారాదుల ఆశయము.

ఇక్కడ నిర్దేశించిన క్రమములోనూ ఒక విశిష్టభావము ఉన్నది. ధర్మార్థ కామ మోక్షములనే చతుర్వర్గములో కామమనేది సర్వప్రాణి సులభము. సర్వహృదయంగమము. కాబట్టి శృంగారమును మొదట నిర్దేశించడము సముచితము. హాస్యము శృంగారజన్యము కాబట్టి తదనంతరము నిర్దేశించాలి. ఏతద్విరోధి అయిన కరుణమును అనంతరము పరిగణించాలి. తరువాత కరుణములో నిమిత్తభూతమయిన అర్థప్రధానమయిన రౌద్రమును చెప్పడము ఉచితమె. అర్థ కామములు రెండూ ధర్మమూలములుగా ఉండాలి. కాబట్టి ధర్మప్రధానమయిన వీరమును దాని తరువాత నిర్దేశించాలి. వీరమనేది భయపడిన వారికి అభయమివ్వడమె సారముగా కలిగి ఉంటుంది. అందువలన వీరము తరువాత భయానక గణనము యుక్తము. దాని పిమ్మట భయానక కారణ భూత

మయిన బీభత్సము తగి ఉంటుంది. వీరాక్షిప్తములయిన భయానకాదులను చెప్పిన తరువాత వీరరస ఫలభూత మయిన అద్భుత గణనము అర్థ్యముగా ఉంటుంది. ఇట్లా త్రివర్గ ఫలకములయిన రసాలను గణించిన తరువాత మోక్ష ఫలకమయిన శాంతమును చెప్పాలి. ఇట్లా ఈ ఉద్దేశక్రమము నకు ఉపపత్తిని అభ్యూహించాలి. ఈ విధంగానే అభినవగుప్త పాదులున్నూ అంగీకరించారు. తదభిప్రాయానుసారముగా రసములు ఇట్లా ఉద్దిష్టములయినవి. ఈ చెప్పిన రసాలకు వరుసగా ఇవి స్థాయిభావములు.

౧. రతి ౨ హాసము ౩. శోకము

౪. క్రోధము ౫. ఉత్సాహము ౬. భయము

౭, జుగుప్స ౮ విస్మయము ౯. శమము

అనే ఈ తొమ్మిదిన్నీ స్థాయి భావాలు. ఇవి తొమ్మిదే ఎందుకు కావాలి? అనేది ఇతర గ్రంథాల్లో దర్శించాలి.

### విభావము

విభావము అనుభావము సాత్త్వికభావము సంచారిభావము అనే ఈ నాలుగూ రససామగ్రి. వాని నిరూపణము ఇప్పుడు ప్రసక్తము. ముందుగా విభావ విభాగ ప్రదర్శనము సంగత ముగా ఉంటుంది. "విశేషేణ భావ్యతే ఇతి విభావః" "విశే షేణ భావయతీతి విభావః" అని విభావ పదానికి రెండు వ్యుత్పత్తులు ఉన్నవి. విశేషముగా భావింప బడేది కాబట్టి విభావము అని ఒక అర్థము. బాగా స్థాయిభావమును భావింపచేసేది కాబట్టి విభావము అని వేరొక అర్థము. ఈ విభావము రసోత్పాదనములో కారణముగా ఉంటుంది. ఇక్కడ రసము అంటే లౌకికమయిన రత్యాదిస్థాయి భావ

ముును గ్రహించాలి. అది రసము కాబోతున్నది కాబ
రసమని వ్యవహృతము కావడము అసముచితం కాదు. ముఖ్య
రసానికి ఉత్పత్తి వినాశాలు అంటూ ఏవీ ఉండవు కదా! ఇట్టి
రసోత్పాదనములో కారణముగా ఉండే విభావము ఆలంబ
విభావమని ఉద్దీపన విభావమని రెండు విధాలు. ఆలంబ
విభావము రసములో సమవాయి కారణముగా ఉంటుంది
మన్ను ఘటములో తంతువులు పటములో సమవాయి కా
ణాలు. ఘటము మన్నును అవలంబించి ఉంటుంది. రసమ
ఏవిభావమును అవలంబించి ఉంటుందో అది ఆలంబన విభా
వము. నాయికా నాయకులను అవలంబించి శృంగార రసమ
ఉంటుంది కాబట్టి వారు ఆలంబన విభావము. మిగిలిన కార
జాతమంతా ఉద్దీపన విభావము. రసమును ఉద్దీపింప చేయ
డానికి ఇది సమర్థము కాబట్టి సార్థకము. ఘటములో కుల
లుడు నిమిత్త కారణము శృంగార రసములో విశిష్టములయి
దేశకాలాదులు ఉద్దీపన విభావములవుతవి. ఈ ఉద్దీపన విభా
వము నాలుగు విధాలు. శృంగార తిలకములో ఈవిధమ
గానే నిరూపించారు. ఆలంబనగుణము, తచ్చేష్ట, తదలంకృ
తటస్థము అని ఉద్దీపనక్రమము చతుర్విధము. రూపము యౌవ
నము మొదలయినవానిని ఆలంబన గుణము అంటారు. యౌవ
నము వలన ఉదయించిన హావ భావాదులు తచ్చేష్టలుగ
చెప్పదగినవి. నూపురము అంగదము హారము మొదలయిన
తదలంకరణము అన్నమాట. మలయానిల చంద్ర చంద
బంభరాదులు తటస్థములయిన ఉద్దీపన విభావాలు. ఈ ఉద్దీ
పన విభావము నాలుగు విధాలనడము శృంగార రస విషయ
ములోనే సుసంగతంగా ఉంటుంది.

## అనుభావము

"అను భావ్యతే ఇతి అనుభావః అను భావయతీతి అనుభావః" అని రెండువిధాల అనుభావ వ్యుత్పత్తిని చెప్పవచ్చు. రసోచితమయిన స్థాయి భావమును అనుసరించి దానివెంటనే భావింపబడేది కాబట్టి అనుభావము అని ఒక్క అర్థము. స్థాయి భావమును స్వమహిమచేత అనుభవింపచేస్తుంది కాబట్టి అనుభావము అని వేరొక అర్థము. శరీరజన్యములయిన కటాక్ష భుజాక్షేప మందగమనాదులు అనుభావములవుతవి. ఈ అనుభావము రసానికి కార్యభూతము. ఇక్కడకూడా రసము అంటే స్థాయిత్వ యోగ్యమయిన లౌకికమయిన రత్యాదికము అనే గ్రహించాలి. ఇటువంటి రత్యాదికమునకు కామినీ కటాక్షాదులు కార్యభూతములు అవుతవి. ఇవి ఇట్లా కార్యములుగా ఉండే అభినయాది ద్వారా భావకుల మనస్సులో ప్రతిబింబించుతవి. తరువాత వారి హృదయస్థాపితమయిన రత్యాది భావమును అనుభవింప చేస్తవి. కాబట్టి అవి అనుభావాలు.

## సాత్త్వికములు

సాత్త్వికములు కూడా కటాక్షాదులవలె కార్యభూతములు అయి భావమును సూచించేవి అవుతున్నవి కటాక్షాదులు సాత్త్వికములూ ఎవరియందు గోచరములవుతవో వారియందు రత్యాదిభావము ఉన్నదని మనము ఊహించగలము. అందువలన ఇవి భావసంసూచనాత్మకములన్నమాట. సాత్త్వికములు ఈవిధంగా అనుభావములె అవుతున్నప్పటికి వేరుగా పరిగణించడములో ఒక అసాధారణ కారణం ఉంది. సత్త్వము వలన ఉత్పన్నములగు భావాలకు సాత్త్వికములు అని పేరు.

ఇతరుల సుఖదుఃఖాదులను భావించడములో అంతఃకరణము అత్యంతమూ అనుకూలముగా ఉండడమునకు సత్వము అని పేరు. పరగత సుఖదుఃఖాదులను భావించడము చేత అంతఃకరణము ద్రావితమవుతుంది. అదే సత్వము. ఈ సత్వము నిమిత్తముగా ఉండే భావాలు కాబట్టి సాత్వికభావములు అవుతున్నవి. వీటికి అనుభావత్వము ఉన్నప్పటికీ సత్వ జన్యత్వము ఉన్నది కాబట్టి వేరుగా పరిగణనము చేయవలసి వచ్చింది.

ఈ సాత్వికభావాలు ఎనిమిది.

౧. స్తంభము ౨. ప్రళయము ౩. రోమాంచము

౪. స్వేదము ౫. వైవర్ణ్యము ౬. వేపథువు

౭. అశ్రువు ౮. వైస్వర్యము

ఈ ఎనిమిదిన్నీ సాత్వికభావాలుగా పరికీర్తితములు అవుతున్నవి. ఈ స్తంభాదులు ఎనిమిదన్నీ బాహ్యములయిన శరీర ధర్మాలు భౌతికములున్నూ. ఇవి ఆంతరాళికములయిన సాత్విక భావాలను అవగమింప చేస్తవి. కాబట్టి న్యాయంగా ఇవి గ్లాని నిర్వేదాది గమకములె అని అనవచ్చును. స్థాయి భావ సంచారి భావ సంఘము జీవుని మనోమయావస్థను పొంది కారణరూపములయిన ఆంతర సాత్వికములను సంపాదిస్తుందని తత్త్వము.

ఈ సాత్వికతత్వ కథనంలో అనేక విధములయిన అభిప్రాయాలు ఉన్నవి. కొందరు ఈ విధంగా అంటారు. మానవునకు ఆయిదు దేహాలు. అన్నమయము ప్రాణమయము మనోమయము విజ్ఞానమయము ఆనందమయము అనే సంజ్ఞలతో ఆదేహాలు ఉంటవి. రత్యాదిస్థాయిభావాలు మనోమయవస్తులు. అవి పంచభూతాత్మకమయిన అన్నమయమును

క్షోభింపచేస్తవి. ఇట్లా అన్నము క్షోభకమవుతూ ఈరత్యాది గణము, సత్వ గుణాతిశయము ఉన్నందు వలన సత్వము అని చెప్పదగిన ప్రాణమయమును ప్రవేశించి సాత్వికత్వము పొందుతున్నది. అప్పుడు ప్రాణమయము భూభాగానుగ్రహములో ఉంటే స్తంభము కలుగుతుంది జలభాగానుగ్రహం ఉంటే బాష్పము. తీవ్రమైన తేజస్సు యొక్క అనుగ్రహం ఉంటే స్వేదము. ఆ తేజోనుగ్రహము తీవ్రము కాకపోతే వైవర్ణ్యము. ఆకాశానుగ్రహం ఉంటే ప్రలయమూ కలుగుతుంది. అనిలానుగ్రహము మందముగా మధ్యముంగా ఉత్కృష్టంగా ఉంటుంది. కాబట్టి క్రమంగా రోమాంచము వేపథువు వైస్వర్యము కలుగుతవి ఈరీతిగా ఎనిమిది భావాలు పుట్టడానికి అవకాశం ఉంది ఇంకా ఉండే అభిప్రాయాలకు ఇది అదను కాదు.

## వ్యభిచారులు

వ్యభిచారి భావాలకే సంచారి భావములని కూడా పేరు. "విశేషేణ అభితః చరంతీతి వ్యభిచారిణః" అని వ్యుత్పత్తి. విశేషముగా అంతటా సంచరించుచుతూ ఉండేవి అని అర్థము ఇవి రసానికి సహకారులుగా ఉంటవి. సముద్రములో తరంగాలు పైకి లేస్తూ క్రీడను సలుపుతూ ఉంటవి. అటువంటి మజ్జననిమజ్జనాలద్వారా అవి సముద్రానికి ఉత్కర్షను కలుగజేస్తున్నవి తుదకు సముద్ర రూపమును పొందుతున్నవి. అట్లాగే వ్యభిచారులున్నూ స్థాయిలో నిమగ్నములై ఉన్మగ్నములై స్థాయిని పోషించుచూ ఉంటవి. తుదకు రసాత్మతను పొందుతవి. ఈ వ్యభిచారులు ముప్ఫైమూడు ఉన్నవి.

౧ నిర్వేదము ౨ గ్లాని ౩ శంక
౪ అసూయ ౫ మదము ౬ శ్రమము

౭ ఆలస్యము ౮ దైన్యము ౯ చింత
౧౦ మోహము ౧౧ స్మృతి ౧౨ ధృతి
౧౩ వ్రీడ ౧౪ చపలత ౧౫ హర్షము
౧౬ ఆవేగము ౧౭ జడత ౧౮ గర్వము
౧౯ విషాదము ౨౦ ఔత్సుక్యము ౨౧ నిద్ర
౨౨ అపస్మారము ౨౩ సుప్తి ౨౪ విబోధము
౨౫ అమర్షము ౨౬ అవహిత్థ ౨౭ ఉగ్రత
౨౮ మతి ౨౯ వ్యాధి ౩౦ ఉన్మాదము
౩౧ మరణము ౩౨ త్రాసము ౩౩ వితర్కము

ఇంకా ఇతరములు ఏవయినా వీనిలోనే అంతర్భవించుతవి. విభావానుభావ వ్యభిచారులకు సంబంధించిన ఈవిషయమును కావ్యప్రకాశగ్రంథములో మమ్మటభట్టు ఈవిధముగా నిరూపిస్తున్నారు.

కారణాన్యథ కార్యాణి సహకారీణి యాని చ
రత్యాదేః స్థాయినో లోకే తాని చేన్నాట్య కావ్యయోః
విభావా అనుభావాశ్చ కథ్యంతే వ్యభిచారిణః.

లోకములో స్థాయిత్వ యోగ్యమయిన రత్యాది భావానికి కారణములుగా కార్యములుగా సహకారులుగా ఏవి ఉంటున్నవో అవే నాట్యములో కావ్యములో సంభావితములై వ్యపదేశింపబడేటప్పుడు వరుసగా విభావములని అనుభావములని వ్యభిచారులని అనబడుతున్నవి. సామాన్యంగా లోకంలో శృంగార ప్రవృత్తి ఉన్న స్థలంలో చూస్తే నాయికా నాయకులు కారణముగానూ, కటాక్ష భుజాక్షేపాదులు కార్యములుగానూ, నిర్వేదాదులు సహకారులు గానూ చెప్పబడుతూ ఉన్నవి. అవే కావ్య నాట్యములలో విభావన

వ్యాపారము ఉన్నందువలన కారణములు విభావములనీ, అనుభావన వ్యాపారము ఉన్నందువలన కార్యములు అను. భావములని, వ్యభిచరణ వ్యాపారము ఉన్నందువలన సహకారులు వ్యభిచారులని ఆయాశబ్దములచే వ్యపదేశ్యములవుతున్నవి అని భావము. ఒకచోట విభావములుగా ఉన్నట్టివి వేరొకచోట అనుభావములు కావచ్చు. సంచారులూ కావచ్చు. అట్లాగే ఒకచోట అనుభావాలుగా ఉన్నట్టివి వేరొకచోట విభావములూ కావచ్చు. వ్యభిచారులూ కావచ్చు. అదేవిధంగా ఒకచోట వ్యభిచారులుగా ఉన్నట్టివి వేరొకచోట విభావములు కావచ్చు అనుభావములూ కావచ్చును. అయినప్పటికీ అవి ఏవిషయంలో విభావములుగా అనుభావములుగా వ్యభిచారులుగా ఉంటున్నవో ఆ విషయములో అవి నియతములు గానే ఉంటవి. అటువంటి నియతవ్యవస్థను అనుసరించియే మమ్మటుడు కారణకార్య సహకారులు విభావానుభావ వ్యభిచారి శబ్ద వ్యపదేశ్యము లవుతవని నిరూపించినాడు.

## రసాభాస

"ఆ ఈషత్ భాసతే ఇతి ఆభాసః" కొంచెముగా భాసించేది ఆభాస అవుతుంది. స్పష్టముగా రసముయొక్క రూపము భాసించకుండా ఏదో కొంచెముగా రసము భాసించి భాసించనట్లుగా ఉండేటట్లయితే రసాభాస అవుతుందని గ్రహించాలి. రసము లేకపోయినప్పటికీ రసము ఉన్నట్లుగా భాసించడముకూడా రసాభాసే అవుతుంది రసము సముల్లసితము కావడానికి ఎంతటి విభావాదిసామగ్రి అవసరమో అంతటి విభావాది సామగ్రి సరిగాలేక సంకుచితముగా ఉంటే రసాభాస

అవుతుంది. అప్పుడు రసప్రతిభాసము సరిగా ఉండదు. ఇది ఒక విధమయిన రసాభాస. అంగరసము తన హద్దును దాటి ప్రవృత్తమయినప్పుడు శృంగారరసము బాధిత మవుతుంది. అవినీతుడైన అమాత్యుడు స్వామిని (ప్రభువును) అధికారము చలాయించనీయక అభాసపాలు చేసినట్లుగా స్వేచ్ఛాప్రవృత్తి కలదై ప్రవృద్ధమయిన అంగరసము అంగిరసమును ఆభాసీకరించుతుంది. సామాన్యంగా రెండుపాళ్ళు అంగిరసమును వర్ణించాలి. రెండు పాళ్లు ఇతరరసాలను వర్ణించాలి. ఆచార్యులను అతిక్రమించి అంగరసము తృతీయ భాగమును ప్రవేశించినట్లు వర్ణించితే ముఖ్యరసము స్వపోషానికి అలబ్ధస్థానమై ఆభాస అవుతుంది. ఇది రెండవ విధమయిన ఆభాస. ఒక రసాన్ని ముఖ్యంగా నిరూపించ దలచినపుడు వేరొక రసాన్ని ప్రబలం చేయరాదని తాత్పర్యము. హాస్యము మొదలయినవి అధికమయినట్లయితే శృంగారాది రసాలు ఆభాస అవుతవి. గ్రంథాలలో రసపరిపోష విశేషము చేత రమతులయిన విదగ్ధజనులకు మాత్రము ముఖ్యంగా గోచరమవుతుంది. శృంగారము వీరము రౌద్రము అద్భుతము శాంతము అనే ఈ రసాలు లోకోత్తర నాయకాశ్రయములుగా ఉంటే పరిపోషాతిశయము ఉంటుంది. కనుకనే శృంగారమును మ్లేచ్ఛాది విషయముగా నిరూపించితే ఆభాసత్వమె కాని రసత్వము సిద్ధముకాదు. విభావాది పరిపూర్తి బాగా ఉంటే రసత్వము ఉంటుంది. విభావాది పరిపూర్తి సరిగా లేకపోతే అక్కడ రసము ఆరోపితము కావచ్చునే కాని వాస్తవంగా ఉండదు. మ్లేచ్ఛాదులలో విభావాది పరిపూర్తి బాగా ఉండదు. అటువంటి స్థలాలలో స్థాయి చర్వణా గూఢము కాదు. ఈ విషయంలో పెద్దల సమ్మతికూడా ఉన్నది.

ఏకత్రైవానురాగ శ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛగతేఽపి వా
యోషితో బహుసక్తి శ్చే ద్రసాభాస స్త్రిధా మతః.

రసాభాస విషయములో పెద్దలు ఈవిధముగా అభిప్రాయ పడుతున్నారు రసాభాసము మూడువిధాలుగా ఉంటుంది ఒకటి:- నాయికా నాయకులలో అనురాగము ఒకచోటనే ఉండి రెండవచోట లేకపోయి నట్లయితే అక్కడ రసపూర్తి బాగా ఉండదు. కాబట్టి అది ఒకవిధమయిన ఆభాస. రావణునిపై సీతాదేవికి అనురాగంలేదు. రావణునకు మాత్రమె అనురాగం ఉంది. కనుక ఆవిధానము ఈ ఆభాస కోటిలో చేరుతుంది. నాయికా నాయకులలో మొదట ఏ ఒక్కరికో అనురాగం కలుగుతుంది. ఇద్దరికీ సమకాలం అనురాగం కలుగదు. రెండోవ్యక్తికి తరువాతి కాలంలో అనురాగం కలుగు తుంది. ఇటువంటి స్థలములో ఏకత్రానురాగమె కాబట్టి రసాభాసయే అవుతుందా? అని శంకించ నక్కర లేదు. అటువంటి స్థలములో విభావాది పరిపూర్తి ఉంటుంది అనే సంభావన కలుగవచ్చు కాబట్టి రసాభాసత్వం లేదు. మొదట రత్నావళి వత్సరాజును ప్రేమించింది. అప్పటికి ఇంకా వత్సరాజుకు ప్రేమ కలుగలేదు. అయినా రత్నావళీ పూర్వానురాగమునకు ఆభాసత్వము లేదు. తరువాత వత్స రాజు ప్రేమించడము వారి అనురాగమునకు విభావాది పరి పూర్తి ఉండడమున్నూ ప్రసిద్ధమె. కాబట్టి ఆ దంపతుల అను రాగానికి రసత్వ సిద్ధి ఉన్నది. రెండు:- మ్లేచ్ఛగతముగా తిర్యగ్గతముగా అనురాగము వర్ణితమయితే రసత్వము లేదు. ఆభాసత్వమే ఉంటుంది. తిర్యక్కు-అంటే వైదగ్ధ్య గంధము ఎపుడూ కూడా అనుభవించని ప్రాణులు. విభావాది భావ

ములున్నా వాటికి ఎపుడూ అనుభూతము కావు. మ్లేచ్ఛులు (అత్యంతమూ పామరులయిన ఆటవికులు) మాట్లాడడము మాత్రము నేర్చి ఉంటారే కాని తక్కిన్నా అన్నిటిలోనూ వారు తిర్యక్సహోదరులు. తద్గతంగా శృంగార వర్ణనము ఆభాసే అవుతుంది. ఒకనాయికకు అనేక పురుషులందు అనురాగమును వర్ణించడమున్నా రసాభాసమే. ఒకవేళ వర్ణితమయినపుడు విభావాది పరిపూర్తి ఉండదు. సరిగా స్థాయ్యాస్వాదము కలగదు. అందువలన రసాభాస. ఈ చెప్పిన మూడు స్థలాలలోనూ వరుసగా సహజానురాగము లేనందు వలన, అవివేకము వలన, అనే కానురాగము వలన రతి ఆరోపితము కావడమె కాని వాస్తవంగా ఉన్నట్లు కాదు. రతి ఆరోపితమయితే హాస్యాస్పదము అవుతుంది. ఇట్లా ఇది ఆరోపితమయినప్పటికీ ఏదో తత్కాలంలో చమత్కారకమె కావచ్చు కాబట్టి రసాభాసకూడా ఉపాదేయమై కావ్యాలలో ఔచిత్యానుసారంగా వర్ణితము కావచ్చునని కొందరి భావము. ఇప్పటికి ఈచెప్పిన ఆభాస వివేకము బహుళంగా శృంగారమునకు సంబంధించి ఉన్నది. రసాంతరాల విషయంలో గ్రంథాంతరములను అనుసరించి ఆభాస విజ్ఞానమును సంపాదించుకోవాలి. ఇట్లాగే భావాభాస విషయములోనూ అన్యాను సరణము చేయాలి.

## భావశాంత్యాదులు

వ్యభిచారి భావముల ఉత్పత్త్యాది విశేషములను బట్టికూడా చమత్కారము ఉదయించుతుంది. ఆ చమత్కార నిబంధనముగా నాలుగు భేదాలు ఉన్నవి. భావోదయము భావ శాంతి భావ సంధి భావ శబలత అని ఆ భేదాల పేర్లు. వ్యభిచారి

భావాలకు ఉదయదవస్థను వర్ణించితే భావోదయము. ప్రశామ్యదవస్థను వర్ణించితే భావశాంతి. పరస్పర విరుద్ధము లయిన రెండు రసాల నాశ్రయించిన రెండు భావాలకు స్పర్థతో కూడుకొన్న సంబంధమును ఒకచోట వర్ణించితే భావసంధి. ఒక దానికటి ఉపమర్దించుకొనేటట్లు అంటే పూర్వ పూర్వ భావమును ఉత్తరోత్తర భావము ఉపమర్దనము చేసేదిగా పూర్వ పూర్వమును ఉత్తరోత్తరము బాధించేదిగా సమావేశింప జేయ బడినట్లయితే భావ శబలత అవుతుంది. ఈ విషయము దశరూపకములో కూడా? నిర్దిష్టమయింది. భావమునకు శాంతి ఉదయము సంధిశబలత అని నాలుగు భేదాలు ఉన్నవి. అవి. ఇక వీని ఉదాహరణములు తత్తదవసరములో నిరూపితము లవుతవి.

## స్థాయిభావములు

ఇక యథాక్రమముగా రతి మొదలయిన స్థాయిభావాల యొక్క స్వరూపములను లక్ష్యములనూ ప్రదర్శించుతాము.

### ౧. రతి

సంభోగవిషయ ఇచ్ఛావిశేషో రతిః

సంభోగ విషయిక మయిన ఇచ్ఛావిశేషము రతి అవుతుంది. యువావస్థలో ఉన్న స్త్రీ పురుషులకు పరస్పరమూ ఆనంద జనక మయిన దర్శనాలింగనాది కర్మలకు సంభోగము అని పేరు. కామోపచారము సంభోగము. స్త్రీ పురుషుల సుఖము కామము అని అంటారు. ఆ స్త్రీ పురుషుల యొక్క పరస్పర విమర్దము వలన ఉదయించే ఆనంద సంభేదమె సుఖ మవుతుంది. ఆ ఆనందమును సంధానించే కర్మ

ఉపచార మన్నమాట. కాగా పైన నిరూపించిన సంభోగ స్వరూపము స్పష్టమయినట్లు. అటువంటి సంభోగము విషయముగా ఉన్న ఇచ్ఛా విశేషము 'సంభోగమును ఒనరించాలి' అనే కోరిక రతి అవుతుంది, దీనినే స్పృహ మొదలయిన పదాలతో పిలుస్తారు. ప్రమోదాత్మకమయిన మనోవృత్తి రతి అని భావము. ఉదా:—

శృంగారైకరసః స్మరోఽస్తు జగదానందైక నిష్యందభూ
రిందు స్తిష్ఠతు విభ్రమైకవసతి ర్జాగర్తు పుష్పాకరః
సంత్వన్యేపి గుణప్రసాదితదిశః కిం తై రశేషోన్నతో
జాతః కాకలివల్లభో మమ పతిః కామస్య కామోత్సవః

శృంగారమే ఏకరసముగా ఉన్న మన్మథుడు ఉండు గావుత! జగములకు ఆనందమును సంధానించడములో అద్వితీయ నిష్యందభూమి అయిన చంద్రుడుకూడా ఉండుగావుత! సకల విలాసాలకూ ఏకైక వసతి అయిన వసంతుడు ఉండనీ! అభిరూప్యము మొదలయిన గుణసంపదచేత లోక భావాలను సుప్రసన్నంగా చేసికొన్న దిగంత విశ్రాంత గుణ గణము కలిగిన గంధర్వ గీర్వాణాదులు కూడా ఉంటే ఉండుదురు గావుత! వారంతా ఒక్కొక్క గుణానికి ఆశ్రయ భూతులు వారి వలన ఏమి ప్రయోజనము? సర్వాధికుడు మన్మథునకు కూడా మన్మథోత్సవ రూపుడూ అయిన శ్రీ కాకతి వల్లభుడు నా పతి అయినాడు. నాకు ఇక ఏమీ లోటు లేదు. ఈ పద్యములో ఒక నాయికకు వీరరుద్రుని యందు ప్రమోదాత్మకమయిన రతి ఉన్నదని గోచరము అవుతున్నది. ఆ నాయిక తనయందు అనురక్తుడయిన ప్రియుని లాభము వలన ముదిత (సంతుష్ట) అయింది, ఈ నాయికకు ఇక్కడ మదన ఇందు

వసంతాది వైరాగ్యము ఉన్నది. అభిమాన మూలమయిన ప్రియవిషయ ప్రేమయే దీనిలో ముఖ్యము. నాకు ఇతరము ఏమీ ఇష్టముకాదు. ఇదే ఇష్టము. ప్రియము అని ఆమె ప్రత్యయము.

## ౨. హాసము

వికృతిదర్శనాది జన్యో మనోవికారో హాసః

వికృతి దర్శనాదుల వలన ఉత్పన్నమయిన మనో వికారమునకు హాసము అనిపేరు. తనయందుగాని ఇతరుని యందుగాని ఉన్నటువంటి వికృతములయిన వేషభాషా కార వికారములను విరుద్ధా లంకారములను అస్పష్ట భాషణములను ఈ మొదలయినవానిని చూడడమువలన, వినడమువలనా మనో వికారము కలుగుతుంది. ఇదే హాసము. దీనిలో బాష్పాదులు అనుభావాలుగా ఉంటవి. నిద్రాలస్యాదులు సహకారులుగా ఉంటవి. ఉత్తములలో రెండు విధాలుగా మధ్యములలో రెండు విధాలుగా అధములలో రెండువిధాలుగా ఉంటుంది. స్మితము హసితములు ఉత్తములకు విహసితము ఉద్ధసితములు మధ్యములకు అపహసితము అతిహసితములు అధములకూ ఉంటవి. ఇంకా దీనిలో స్వగత భేదాలు పరగత భేదాలు చాలా విధాలుగా ఉన్నవి. వాని స్వరూపాదులను ఇతర స్థలములలో గ్రహించాలి. ఉదా:—

బిభ్రాణాః కబరీః ధృతాంజనదృశః కృత్వా కుచౌ కృత్రిమౌ
స్త్రీవేషా న్నిశి కాకతీంద్రనగరే ప్రచ్ఛన్నరూపాః నృపాః.
దృష్ట్వా క్షౌమముపాస్య వక్షసి కుచావాకృష్య నీవీస్పృశో
హీ! హీ!! కష్టమితి త్యజంతి విపణిశ్రేణీషు ధూర్తా విటాః.

కాకతీంద్రుని చేత జయింపబడిన శత్రురాజులు రహస్య

రూపముతో ప్రతాపరుద్రుని పట్టణములో తిరుగు తున్నారు. రాత్రి పూట వారికి ధూర్తులు ఎదురయినారు. అప్పటి విశేషము ఈ విధముగా ఉన్నది. స్త్రీజనానికి తగిన కేశపాశమును ధరించి కంటికి కాటుకను పెట్టుకొని కృత్రిమములయిన కుచాలను ఏర్పాటు చేసికొని రాజులు స్త్రీవేషము కలవారై కాకతీంద్రుని నగరములో రాత్రియందు ప్రచ్ఛన్న రూపముగా ఉన్నారు. ధూర్తులయిన విటులు వీధుల శ్రేణులలో స్త్రీ రూపముగా ఉన్నవారలను చూచి, వారు కట్టుకొన్న తెల్లని దుకూలాలను ఊడదీస్తున్నారు. వక్షస్థలాన కుచాలను ఆకర్షించుతున్నారు. నీవిని స్పృశించారు. అప్పుడు వారికి తత్వము తెలిసింది. ఆకుచములు కృత్రిమాలు కాబట్టి వీరు స్త్రీలు కాదని వారు గ్రహించారు. కుచాకర్షణ సమయంలోనే నీవీ స్పర్శకూడా చేశారు. విషయం తెలిసింది. హీ! హీ! అన్నారు. పొరపాటు పనిచేశామని వారిని విడిచి పెట్టుతున్నారు. ఖైదీలుగా గ్రహింపబడిన శత్రువులు తప్పించుకొని పోవాలని రాత్రిపూ స్త్రీవేషాలతో వెళ్ళుతూ ఉంటే ఇది ఘటించింది. వైరి భూపతులలో ఉన్న వికారాకారము హీ! హీ! అనే హాసానికి హేతువయింది.

## ౩. శోకము

ఇష్టజన వియోగాదినా ఆత్మని దుఃఖాతిశయః శోకః

ఇష్టజన వియోగము అనిష్ట ప్రాప్తి ద్రవ్యనాశము గృహదాహము మొదలయిన వానివలన తనచిత్తములో కలిగే దుఃఖప్రకర్షకు శోకము అని పేరు. ఉదా:—

బాలః! నిష్కరుణోసి రక్షయసి కిం వన్యాం శరీరస్థితిం?
తత్తాదృగ్విభవా గృహాః క్వను గతాః? స్థానం మరుః కల్పితం

హా నాథాః ! పతితాః ప్రతాపన్నృపతేః క్రోధార్చిషీతి ద్విషత్
యోషాణాం తదనూప మ్రుథి రహో ! జాతం స్థలం మారవం.

ఇష్టజన వియోగము వలన కలిగే శోకానికి ఇది ఉదాహరణము. ప్రతాపన్నృపతి తోటి మహాయుద్ధంలో భర్తలు చనిపోగా శత్రు స్త్రీల భార్యలు ఈ విధముగా శోకించుచున్నారు. ఓ ! ధాతా ! నీవు దయలేని వాడవు. ఘాతుకుడవు. మాకు ఇప్పుడు వనములో ఉత్పన్నములవుతూ ఉండే ఫల మూలాదులతో ఆధారమయిన శరీరస్థితిని కలుగజేస్తున్నావేమయ్యా ! మాకు ఇటువంటి శిక్షణము ఇస్తున్నావె! నీకు దయలేదా? నానా విధ భోగోపకరణాలతో పరిపూర్ణములయిన ఆ మా గృహాలు ఏమయిపోయినవి? అవన్నీ ఎక్కడికి పోయినవి? ఇపుడు మాకు మరు ప్రదేశాలనే స్థానముగా కల్పించావు కదా! మాకు దప్పిక కలిగితే ఈ ప్రదేశాలలో ఉదకము కూడా లభ్యము కాదే! పోనీ, మహారణ్యాలలో నయినా భర్తలతో కూడి మృగ మిథునాలవలె ఏదో విధంగా సంచరించుదామా? అని అనుకొంటే అదికూడా లేదే! మా దైవ దుర్విపాకము ఎటువంటిదో? ఎట్లాంటిదో? కాని ఇంత వ్యథ పడుతున్నాము. ఆ భర్తలు కూడా వీరరుద్రుని క్రోధాగ్నిలో మిడతలు అయిపోయినారు. హా నాథుల్లారా! ఆ నృపతి క్రోధాగ్నిలో పడిపోయినారా? మీరంతా భస్మమయినారా? మీరు మళ్లా రానేరారా? ఈ విధముగా శత్రుస్త్రీలు దుఃఖపడుతూ ఉంటే వారి కన్నీళ్ళచేత ఆ ప్రదేశము అంతా జలప్రాయము అయింది. ఈ పద్యములో శత్రుస్త్రీలు శోకానికి ఆలంబన విభావముగా ఉన్నారు. భర్తృ వియోగము రాజ్యభ్రంశముల వలన

వారికి దుఃఖాతి భూమికలిగింది. దైవోపాలంభనము చేస్తు న్నారు. రోదనము మొదలుపెట్టారు. ఈవిధంగా వారిశోకము సూచితమవుతున్నది. భూమిపై పొర్లాడడము ఉరస్తాడనము మొదలయినవి అనుభావాలు. దైన్యము మోహము చింత విషాదము మొదలయినవి సంచారి భావాలు.

౪. క్రోధము

శత్రుకృతాపచారేణ మనఃప్రజ్వలనం క్రోధః

శత్రువు భృత్యులు ప్రతిపక్షులు మొదలయినవారు చేసిన అపచారమువలన కలిగిన మనః ప్రజ్వలనానికి క్రోధము అని పేరు. భృత్యాదులు తిరస్కరించినా ఈ మనోవృత్తి కలుగుతుంది. ఇది క్రోధము కోపము రోషము అనిమూడు విధాలు క్రోధము క్రూరజనులను ఆశ్రయించి వధాదికము చేయించుతుంది. అది కాగానే పోతుంది. కోపము వీరజనులో ఉండి ఇతరుల ప్రార్థన చేయగానే తొలిగిపోతుంది. రోషము స్త్రీ పురుషులలో పరస్పరమూ ఉంటుంది. ఒకరికి ఒకరిమీదనమ్మకం కలిగే వరకూ ఇదిపోదు. ఉదా:—

రే! రే! సేవణ! కస్తవాయమనిదంపూర్వోఽద్య గర్వో మహా
ఉత్తీర్ణా కిల యేన గౌతమనదీ ప్రాప్నోసి మృత్యోర్ముఖం
ఏషా "కాకతివీరరుద్ర'' ఇతి కిం నాశ్రావి సప్తాక్షరీ ?
ప్రత్యక్ష త్రిప్రతిపక్ష పార్థివ మహాభూత గ్రహోచ్చాటనీ.

ఈపద్యములోని క్రోధము క్రూరులను అవలంబించి ఉన్నది. అవజ్ఞా మూలముగా ఇదికలిగింది. ఓయీ! సేవణకా! ఏమిరా. ఇది? ఈమహాగర్వము ఇదివరలో ఎప్పుడూ లేదే! ఈక్రొత్త గర్వము ఎక్కడిదిరా? గౌతమనదిని ఆగర్వము తోటే కాబోలు దాటివచ్చావు? ఎంతపని చేసావు!!! గౌతమిని

దాటినావా? అయితే మృత్యుముఖానికి వచ్చితివిలే! కాకతి వీరరుద్రః అనే సప్తాక్షరీ మహామంత్రాన్ని నీవు వినలేదా? అతిశయించుతూఉన్న ప్రతిపక్ష పార్థివులు అనే మహాభూత గ్రహాలు అన్నింటినీ ఉచ్చాటనముచేసి ఇది పోగొట్టుతుందే! ఈమంత్రాన్ని వినగానే వారంతా కాందిశీకులు అవుతారే! నీవు ఇపుడు ఈ విధముగా ఉద్యమించుతున్నావేమిటి? ఈ పద్యములో కంఠ గర్జనము దంత ఘట్టనము మొదలయినవి అనుభావాలు.

## ౫. ఉత్సాహము

లోకోత్తరేషు కార్యేషు స్థేయాన్ప్రయత్న ఉత్సాహః

లోకోత్తరములయిన పనులలో అతి స్థిరమయిన ప్రయత్నానికి ఉత్సాహము అనిపేరు. తాను తలచిన కార్య సాధనలో బాగా ఉత్సుకత్వము ఉండాలన్నమాట. నేను ఇటువంటి వాడను ఈ పనులను చేయగలను అనే ఆత్మ విశ్వాసము ఉంటే అభిమానాత్మక మయిన ఉత్సాహము కలుగుతుంది. అన్ని పనులలోనూ ఉండే మానసావేశము దీని స్వభావము. ఇది సహజము కావచ్చు. ఆహార్యము (తెచ్చిపెట్టుకునేది) కావచ్చు. ఉదా:—

క్షుబ్ధేష్వబ్ధిషు సంభ్రమాత్త్రిభువన గ్రాసేచ్ఛయా సర్వతః
సన్నద్ధేష్వపి పర్వతేషు పరితో గండోపలా న్వర్షితుం
శక్తా ఏవ వయం నివారణవిధౌ ఇత్యక్షమాభృజ్జయే
శ్లాఘా నః కియతీతి కాకతివిభో ర్గర్జంతి సైన్యే భటాః.

కాకతి ప్రభువు సైన్యములో భటులు ఈ విధముగా గర్జనము చేస్తున్నారు. మూడు లోకాలనూ గ్రసించవలెను అనే కోరికతో సముద్రములు ప్రళయంలో మాదిరిగా క్షోభము కలవె

నప్పటికి పర్వతాలన్నీ గండశైలాలను వర్షించడానికి అంతటా సన్నద్ధములు అయినప్పటికీ నివారణము చేయడములో మేము సమర్థము గానే ఉన్నాము. క్షుద్రరాజులను జయించడములో మాకు కలిగే శ్లాఘ ఏమి ఉంది ? ఈ పద్యములో భటుల ఉత్సాహము శత్రు రాజులను విషయముగా చేసికొని సముద్ర సంక్షోభమును పర్వత సన్నాహమును మేము నివారించ గలము. అనే వాగారంభణంతో కనపడుతున్నది. వీర స్థాయి అయిన ఉత్సాహము మూడు విధాలుగా ఉంటుంది. కాబట్టి వీరముకూడా త్రివిధము. దానవీరము యుద్ధవీరము ధర్మవీరమూ అని. దయా వీరము అనేదాన్ని కూడా కొందరు చెప్పుతున్నారు. ఈ భేదాంతరాలను ఇతర స్థలాలలో గ్రహించాలి.

౭. భయము

రౌద్రసందర్శనాదిభిరనర్థాశంకనం భయం

రౌద్రమయిన ఆకారమును రౌద్రమయిన శబ్దమును చూచినందు వలన వినినందువలన అనర్థము వస్తుందేమో అనే శంక కలుగుతుంది. అది మనశ్చాంచల్య రూపము. దానినే భయము అంటారు. ఈ భయము స్త్రీలకు దుర్బల స్వభావులకూ స్వాభావికము. ఉత్తములకయితే కృతకము. వారికి సహజము కాదట. అందరిలోనూ కృతకము కాని ఎక్కడా సహజముగా ఉండదు అని కొందరంటారు. ఇది ఇట్లా అనేక విధముల ఉంటుందని కొందరి భావము. ఉదా:—

దూరాదాకర్ణ్య విశ్వప్రసృమర మహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారంభభేరీ నినద మరిన్నపాః భూష్ణవిష్ణుజ్వరార్తాః
ఆరుహ్యాద్రీన్ ద్విశంతో గహన మతిమహత్కంటకాకృష్టచేలాః
త్రాయధ్వం ముంచతేతి ప్రతినృపతి ధియా పాదపాన్ ప్రార్థయంతే

విశ్వవ్యాపి ప్రతాపము కలిగిన ప్రతాపరుద్ర మహారాజు గారి జైత్ర ప్రస్థానములోని ఆరంభ భేరీధ్వనిని శత్రురాజులు దూరముగా ఉండి విని బాగా కర్ణజ్వరము కలవారయినారు. ఆ జ్వరార్తులై పర్వతాలను ఎక్కి అరణ్యములను ప్రవేశించు తున్నారు. ఆ ప్రదేశములో పెద్దకంటకి వృక్షాలు తమ పెద్ద పెద్ద కంటకములతో శత్రురాజుల కేశములను పట్టి లాగినవి. అప్పుడు వారు ప్రతినృపతులు వచ్చి లాగుతున్నారనే అభిప్రాయముతో రక్షింపుడు. విడిచిపెట్టుడు అని ప్రార్థించు తున్నారు. వ్యాకులాంతః కరణము కలవారై దీనోక్తులతో వేడుకొను చున్నారు. దీనిలో శత్రురాజ గతమయిన భయానికి కంటకా కర్షణము ఉద్దీపనము. దీనాలాపములు అనుభావములు. భయానక స్థాయి ఈ విధముగా స్పష్టమవుతున్నదని గ్రహించాలి.

౮. జుగుప్స

అర్థానాం దోషసందర్శనాదిభి ర్గర్హణా జుగుప్సా

రక్తము కక్కిన పదార్థమూ మొదలుగా గల అహృద్యములు అయిన వానిని వినినప్పుడు కాని చూచినపుడు కాని ఆ పదార్థ దోషములను గ్రహించి నపుడు కలిగే మనః సంకోచమునకు జుగుప్స అని పేరు. ఇది కలిగినపుడు నానా విధాన ఉమ్మి వేయుట మొదలయిన అనుభావములు ఉంటవి. భయము అపస్మారము ప్రభృతు లయినవి అన్నీ సహకారులు. విభావములోని భేదమును బట్టి ఇది రెండు రకాలుగా ఉంటుంది. క్షోభము ఉద్వేగమూ అని రెండు విధములు. రుధిరాంత్రాది దర్శన స్పర్శనముల వలన మనఃక్షోభము కలుగు తుంది. క్రిమి, పూతి, విష్ఠ మొదలయిన వాని వలన ఉద్వే

గము కలుగుతుంది. వైరాగ్యము వలన యువతి గర్హావలన మూడవది సిద్ధ మవుతుందని కొందరు అభిప్రాయ పడుతారు.
ఉదా:—

విష్వక్త్వక్త్వస్తిక్కపంకే మహతి నిపతితోచ్చూన మాతంగ దేహ
శ్రేణీ లబ్ధ ప్రచారాః ప్రవహదు వసా మజ్జ రక్త ప్రవాహాః
రాశీభూతాస్థికూట స్థపుటిత నికటా నిస్సరం ద్విస్రగంధాః
కుర్వంత్యాయోధనోర్వ్యో భయ మవనిభృతాం వీరరుద్రేణ సృష్టాః

వీరరుద్రుని చే సృజింపబడిన యుద్ధభూములు శత్రురాజులకు భయము కలుగ చేస్తున్నవి. ఆ యుద్ధభూమి వర్ణనమె ఈ పద్యములో ఉన్నది. యుద్ధభూమి అంతటా కూడా మస్కిష్కపంకము అధికముగా సిద్ధమయింది. ఆ బురదలో నడిచి వెళ్లలేక, మావటి వాళ్లు కొట్టుతూ ఉంటే ఏనుగులు పడిపోయినవి. పడి చనిపోయి ఉబ్బినవి. అటువంటి గజ దేహముల పంక్తులలో నక్కలు మొదలయినవి అన్నీ దేహాల మీదుగా నడుస్తూ సంచారము చేస్తున్నవి. ధాతుసారము ఎముకల రసము రక్తమూ పెద్ద ప్రవాహముతో ప్రవహించుతూ ఉన్నవి. ఎముకలన్నీ గుట్టలు గుట్టలుగా పోగు వేయబడి ఉన్నవి. సమీప ప్రదేశాలను అన్నిటినీ ఆ ఎముకలు ఎగుడు దిగుడుగా చేసినవి. అంతటా కూడా గవులుకంపు వస్తున్నది. యుద్ధ భూములు ఈ చెప్పినవిధంగా అసహ్యకరముగా ఉన్నవి.

## ౮. విస్మయము

అపూర్వార్థసందర్శనా చ్చిత్తవిస్తారో విస్మయః

లోక మర్యాదను అతిక్రమించిన అపూర్వ పదార్థాలను చూచి నందువలన మనస్సుకు విస్మృతి కలుగుతుంది. దానికే

విస్మయము అని పేరు. అలౌకికములయిన వస్తువులను సరిగా అనుభవములోకి తెచ్చుకోలేక మనస్సు విస్మయావేశము పొందుతుంది. ఈ విస్మయావిష్టత అద్భుత రసమునకు హేతువు అవుతుంది. ఉదా:—

ఔన్నత్యం మహదన్యదేవ మహతః కోప్యేష గంభీరిమా
కాప్యన్యా సరణిః ప్రతాపయశసో రన్యైవ బాహ్వోః ప్రథా
సర్వం నూతనమేవ రుద్రనృపతే ర్జానే న తన్నిర్మితా
సామగ్రీ చతురాననేన కియతీ ? కీదృక్క్రమా కల్పితా.

ఈ పద్యము కావ్యప్రకరణములోనే నిరూపితమయింది. దీనిలో ప్రతాపరుద్రునకు సంబంధించిన ఔన్నత్యాదికము అలౌకికముగా నిరూపితమయింది.

## ౯. శమము

శమో వైరాగ్యాదినా నిర్వికార చిత్తత్వం.

వైరాగ్యము ఈశ్వరానుగ్రహము సత్సంగము మొదలగు వానివలన నిర్వికారమయిన చిత్తవృత్తి కలుగుతుంది. దానికే శమము అని పేరు. ఈ శమము కలిగినప్పుడు విషయాభిలాషలు నశించి పోతవి. ఈ మనోవికారమునకు తృష్ణాక్షయము అని పేరు. యమ నియమాదుల యొక్క అనుసరణము ఉన్నప్పుడే ఇది కలగడానికి అవకాశము ఉంది. ఉదా:—

కిం లబ్ధం చతురాననేన మహతీ మాయుః ప్రథాం గచ్ఛతా?
లబ్ధ్వా సంపద మప్యనన్యసుగమా మింద్రేణ వా కిం కృతం
ఇత్యన్తాంతరుపప్లవాః సుకృతినో నో జానతే దాహ్యమ
వ్యద్యోపప్లవ మంధ్రనాథతిలకే విశ్వంభరాం బిభ్రతి.

ఆంధ్ర నాథ తిలకుడయిన వీరప్రతాపరుద్రుడు విశ్వంభరను భరించుచూ ఉండే సుకృతము కలవారి శమావస్థ

దీనిలో వర్ణితము అవుతున్నది. బ్రహ్మ దేవుడు గొప్ప ఆయు ప్రృథను పొంది ఏమి సంపాదింప కలిగినాడు? ఇతరులకు సుగమము కాని సంపదను పొంది ఇంద్రుడు మాత్రం ఏమిచేయ గలిగాడు? ఆయుస్సంపాదనములో సంప త్సంపాదనములో వీరు ఇద్దరూ పరమావధిగా ప్రసిద్ధులు. అటు వంటి వారు కూడా ఈసుకృతుల దృష్టిలో లెక్కగా లేరు. ఈ విధంగా వారు బ్రహ్మాదులను భావించుతూ అంతరుపప్లవాల నన్నిటినీ నశింపచేసికొని బాహ్యమును కూడా వారు ఏమాత్రమూ తెలిసికొనడము లేదు. ఇది అంతా కూడా నిరుపద్రవాగా రాజ్య పాలనము చేస్తూ ఉన్న ప్రతాపరుద్రుని మహిమ.

శాంతము రసమా?

నాట్యరసాలు ఎనిమిదే ఉన్నవి. శాంతమంటూ రసము వేరుగా లేనేలేదు. శాంతము కూడా ప్రత్యేకముగా రసమె అయినట్లయితే పెద్దలు పరిగణనము చేసే వారె! వారు రసాలను పరిగణించుతూ 'అష్టౌ నాట్య రసాః' అంటున్నారు. అందు వలన శాంతమనే తొమ్మిదవ రసము లేదు. కావ్యార్థ భావనము వలన నాలుగు విధము లయిన చిత్త వృత్తులు కలుగుతవి. వికాసము విస్తరము క్షోభము విక్షేపమూ అని, వీని వలన ఎనిమిది రసాలు కలుగుతున్నవి. అంతేనే కాని వీటి కంటే అతిరిక్తముగా తొమ్మిదవ రసము ఉత్పన్నము కావడానికి ఏమీ అవకాశము లేదు. వైరాగ్యాత్మక మయిన చిత్త వృత్తి ఎన్నడూ కలగ డానికి అవకాశము లేదు. అనాదికాల ప్రవాహంనుండి పరం పరగా వస్తూ ఉన్న రాగ ద్వేషాదులను విడిచి పెట్టడము శక్యము కాదు. ఈ విధముగా వైరాగ్యము ఉత్పన్నమె కాదె! కాగా శమము ఎక్కడినుండి

వస్తుంది? శమోత్పత్తికి అనుకూలమయిన సామగ్రి ప్రపంచంలో ఎక్కడా లేనే లేదు. ఒక వేళ అటువంటిది ఎక్కడ నయినా ఉన్నా అది శ్లాఘ్యము కాదు. కొందరికి మాత్రం శ్లాఘ్యము అయినప్పటికీ దానిని వేరుగా పరిగణించ నక్కర లేదు. వీర ములో నయినా బీభత్సములో నయినా అది అంతర్భవించు తుంది. ఒకప్పుడు అంతర్భావము రాక పోయినా అదొక పురుషార్థముగా చెప్ప తగ్గది కాదు. అందువలన శాంత మనేది రసముగా చెప్పతగినది కాదని శాంత ప్రతిక్షేపము చేసే వారు పలుకుతున్నారు. దీన్ని సమీక్షించాలి.

## శాంతము రసమె

శాంతమున్నూ ప్రత్యేకంగా ఒక రసమని సిద్ధాంతము. దీనిని ఈ విధము గా గ్రహించాలి. భరతముని ఇతర రసాలతో పాటు శాంతరసమును కూడా చెప్పనె చెప్పాడు. మహర్షియె అంగీకరిస్తున్నాడు కాబట్టి ఇతరులు ఏల అంగీకరించ రాదు? శాంతము రసము. శాంతానికి కూడా అనుకూల మయిన సామగ్రి పుష్కలంగానే ఉంది. శమోత్పత్తికి తగిన అవకాశాలు బాగానె ఉన్నవి. శృంగారాది రసాలు రాగి జనులకు ఇష్టము లయినట్లు అవి వారి శ్లాఘా పాత్రములయినట్లు శాంతము కూడా విరాగులకు ఇష్ట మవుతుంది. వారి శ్లాఘా పాత్రమూ అవుతుంది. ఇది ఏ రసములోనూ అంతర్భవించదు. మహా పురుషార్థముఅని చెప్పదగినట్టిది శాంతరసము ఒక్కటే. శాంతము స్వభావ సిద్ధమయిన ఆదిరసము. దాని స్థాయిఅయిన శమము సిద్ధభావము. భరతముని సంచారి భావాలను పరిగణ నము చేస్తూ మొదటగా నిర్వేదమును నిర్దేశించుతున్నాడు. అమంగళ ప్రాయమయిన నిర్వేదమును ప్రథమంలో చెప్ప

డము అంత ఉచితము కాకపోయినా భరతుడు చెప్పినంద
వలన నిర్వేద స్థాయిక మయిన శాంతరసము ఉన్నట్లుగా భ
రతుడు అంగీకరించాడని గోచర మవుతున్నది. ప్రత్యేకము
శాంతరసమును చెపుతూ దాని భావ విభావాదులను భ
రతుడు విశదంగా నిరూపించుతున్నాడు. ప్రామాణికు లయి
ఆలంకారికు లందరూ శాంతసత్త విషయములో ఏకమతుల
అవుతున్నారు. సర్వవిధములయిన విషయాభి లాషలూ నశిం
పోతే నివృత్తిరూపముగా నిర్వేదము కలుగుతుంది. అవిద్య
నశించగానే సుఖరూపత్వము గోచరమవుతూ ఉన్నట్లుగ
తృష్ణా నివృత్తిలో సుఖరూపత్వము గోచరము అవుతూ
ఉన్నది. కామసుఖముకాని దివ్యమయిన మహాసుఖము కాని
ఈకోరికల నాశనము వలన కలిగే సుఖము యొక్క చిన్న
మంతునకయినా పనికిరావు. ఈరసానికి వైరాగ్యాది సామగ్రి
కూడా బాగానేఉంది. పరమేశ్వరానుగ్రహము పూర్వజన్మల
పరిపాకము సద్గురుసేవ సత్పురుషుల అనుగ్రహము వేదాంత
విచారణ యమనియమాదులు మతిస్మృతి చింతాదులు ఇవన్నీ
కూడా శమసామగ్రిగా ప్రసిద్ధము. రాగద్వేష కలుషతాంతః
కరణులు శాంతమును సేవగించు కొన్నంత మాత్రాన ఇది
లేకపోలేదు. కొందరు మెచ్చుకోలేదని ఇదిరసము కాకపో
తుందా? వీతరాగులు శృంగారాన్ని ఒప్పుకోరు. అంతమా
త్రాన అదిరసము కాకపోయిందా? కాబట్టి వీతరాగులయిన
పుణ్యాత్ములకు అభిప్రేతమయిన ఈ శాంతము సుస్థిరముగానె
ఉంటుంది. ఈరసము శృంగారములో అంతర్భవించదు.
దానికీ దీనికీ చాలాదూరము. ధర్మవీరములో శాంతము అంతర్భ
వించవచ్చునేమో అనితలచ నక్కరలేదు. వీరము నెప్పుడూ

కూడా అభిమానాత్మకము. అహంకారప్రాణముగా ఉంటుంది. సర్వాహంకారములూ ప్రశాంతములై పోవడమే శాంతము యొక్క రూపము. ఇంతటి వైజాత్యముఉంటే ఒకదానికి ఒక దానిలో అంతర్భావము కుదురుతుందా? నాల్గవ పురుషార్థ మయిన మోక్షము శాంతైక సాధ్యమని ప్రామాణికులు అంగీకరిస్తున్నారు. సర్వప్రకారములూ సంపూర్ణ కాముడై సంతుష్టమానసుడై శాంతమును స్వీకరించినపుడే మానవుడు ముక్తిని పొందుతాడు. మోక్షఫలకమయిన ఈశాంతము సర్వ రసాలకంటె ప్రధానతమము. కావ్యార్థ సంభేదమువలన కలిగే స్వాదము శాంతానికికూడా అనుకూలమే. ముదిత మైత్రి కరుణ ఉపేక్ష రూపముగాచిత్తవృత్తి లిగినప్పుడు శమప్రాదుర్భా వానికి అవకాశం ఉన్నది. ఈవిధముగా శాంతము అప్రతిక్షే ప్యము అయిన రసమైఉంటూ ఉండగా దీనిని ప్రతిక్షేపము చేయ పూను కొనడము అసముచితముగా ఉంటుంది. ఇంకా ఈవిషయములో విస్తరమును ఆకరగ్రంథములో గ్రహించాలి.

విభావము

విభావము అనుభావము సంచారులు అనేవి ఆయా రసా లకు అసాధారణములుగా ఉంటవి. వాటిని ప్రత్యేకంగా నిరూ పించి ఉపపాదించడము ఉచితమయిన పద్ధతి. మొదటగా శృంగారరసమునకు సంబంధించిన ఆలంబన విభావము దాని ఉదాహరణమూ ఈవిధముగా ఉంటుంది.

లావణ్యైకఖనిః విధాతృరచనాశిల్పప్రతిజ్ఞావధిః
శృంగారప్రతిమా విలాసవిపణిః కందర్పఘంటాపథః
నారీణాం మకుటేపతా చ తరుణీ సేయం కిమన్యైర్గుణైః
అస్యా మస్మదుపస్మృతేః ప్రియతమః శ్రీపీఠమస్తో న్యపః

లావణ్యానికి ఏకఖని. ఈమెలోని లావణ్యము ఎప్పుడూ ఏమాత్రమూ క్షయించిపోదు. విధాత రచనాశిల్ప ప్రతిజ్ఞకు ఈమె అవధి. అంగములనూ ఉపాంగములనూ సౌష్ఠవముగా నిర్మాణించాలి అని బ్రహ్మప్రతిజ్ఞచేసి ఈమెను నిర్మించి ఉంటాడు. ఇటుమీద ఇంతకన్న చక్కని స్త్రీని సృజించాలి, అంటే ఏవిధంగా ప్రతిజ్ఞ చేయవలెనో కూడా బ్రహ్మకు తెలియదు. ఈమె శృంగారానికి ఒక ప్రతినిధి ఇతర స్థలాలలో శృంగారమును రాబట్టడానికి ఈమె ఈవిధముగా అయింది. అందువలన వైరాగ్యములో నుండికూడా శృంగారమును స్వీకరించుతుంది. ఈతరుణి సర్వవిలాసాలకూ పణ్యవీథి. ఎవరికయినా విలాసములు కావలెనన్నట్లయితే ఈవిలాసిని దగ్గరకువచ్చి ఖరీదుచేయవలెను. మన్మథునకు ఈమె ఘంటాపథము ఈమె నారీ దేవత. ఇంకా ఇతరగుణాలు చెప్పటం ఏటికి ఫలము? ఈమె వలన సామగ్రీ ఫలముగా ప్రియుడు కూడా లభించాడు. మన్మథసమన్మథుడయిన శ్రీ వీరరుద్ర నృపుడు ఈమెకు ప్రియుడు. దీనిలో ఆలంబన విభావముగా ఉన్నతరుణి యొక్క సౌందర్యాదికము ఆలంబనముగా వర్ణితమయింది.

ఉ ద్దీ ప న వి భా వ ము

ఉరోమాత్రోత్సేధం ధవిదవి విలాసై ర్విభవై
మృగాక్ష్యా స్తారుణ్యం త్రిభువనమిదం వ్యాకులయతి
స్తనాభోగస్ఫీతం యది కిల భవేత్కా ఖలు తదా
భవిత్రీ ? కిం వాన్యత్ ? విజిత మఖిలం పుష్పధనుషా.

ఈమృగాక్షి తారుణ్యము ఉరము మాత్రము ఎత్తుగా ఉన్నదయినా అభినవ విలాసములతో ఈమూడు భువనాలనూ వ్యాకుల పెట్టుతున్నది. ఆ వయస్సులో స్తనాలవాల

స్థలము కొంచెము ఉన్నతముగా ఉన్నది. ఇక ఇటుమీద ఆ తారుణ్యము స్తనముల విస్తారముచేత సమృద్ధమయినట్లయితే ఇక ఏమి కథ అవుతుందో? ఏమి చెప్పగలము? ఇంత కన్నా అయ్యేదేమిటి? పుష్పబాణుడు సర్వజగములూ జయించినట్లే! ఉదయద్యౌవనమె జగన్మోహనముగా ఉంది. ఆ యౌవనము ఉదితమయినప్పుడు పరిపూర్ణమయినప్పుడూ ఇంకా ఎట్లా ఉంటుందో? దీనిలో కన్యావక్షస్సు రత్యుద్దీపన విభావముగా నిరూపితమయింది.

### అనుభావము

స్మరస్మేరాః మందస్మిత మధుర సౌరభ్య సుభగాః
మనాగ్వ్రీడా జాడ్యాః ప్రణయరస కల్లోల భరితాః
కృతానేక స్కంభాః మనసిజ సహస్రాణి సృజతః
కటాక్షాః వామాక్షీ కిరతి పరితో రుద్రనృపతిం.

ఈ పద్యము కావ్యప్రకరణములో నిరూపిత మయింది. ఇదేవిధంగా రసాంతరములకు సంబంధించిన విభావానుభావములను ఉదాహరించి గ్రహించాలి. ఇక ఇటుమీద సాత్త్విక భావముల స్వరూపోదాహరణములను నిరూపించుతాము.

### సాత్త్వికములు

సాత్త్విక భావముల యొక్క సామాన్య లక్షణ ప్రస్తావములో సాత్త్వికములు బాహ్యములని ఆంతరములని నిరూపింప బడింది. ఇక్కడ బాహ్యములయిన స్తంభాదుల యొక్క స్వరూపము నిరూపిత మవుతుంది.

### ౧ స్తంభము

స్తంభః స్యాన్నిష్క్రియాంగత్వం రాగ భీత్యాదిసంభవం.

క్రియలు లేని అంగములు కలిగి ఉండడము స్తంభము

అవుతుంది. ఇది అనురాగము వలన భయము వలన విషాద విస్మయాదుల వలనా ఉత్పన్న మవుతుంది. ఉదా:-

కాకతిపుర స్త్రియః పశ్యంత్యో నరేంద్రకందర్పం
మదనశరోత్కీర్ణా ఇవ స్థితా నిశ్చలాంగ్యః.

కాకతిపట్టణమయిన వరంగలులోని స్త్రీలు రాజ మన్మథుని చూస్తూ మన్మథ బాణాలచే చెక్కబడినట్లుగా నిశ్చలములయిన అంగములు కలవారై నిలబడి ఉన్నారు. దీనిలో స్త్రీలు చూస్తూనే నిశ్చల స్వభావము కలవారయినారని అనడము వలన చైతన్యము ఉన్నప్పటికిన్నీ నిశ్చేష్టత్వము చెప్పినట్లయింది. కాబట్టి స్తంభమనే సాత్త్వికము.

## ౨ ప్రళయము

ప్రళయః సుఖదుఃఖాద్యై ర్గాఢ మింద్రియ మూర్ఛనం.

సుఖము దుఃఖమూ మొదలయినట్టి భావములచేత ఇంద్రియములు గాఢముగా మూర్ఛ పొందుట ప్రళయము అవుతుంది. వాక్కాయ మనస్సులు సామాన్యముగా దీనిలో నష్టచేష్టము లవుతవి ఉదా:-

జితమదనరూపసారః సఖి! ఏష వీరరుద్రనృపచంద్రః
యం దృష్ట్వా నిమజ్జతి మూర్ఛాయా మింద్రియగ్రామః,

ఓ సఖీ! ఈ వీరరుద్రనృపచంద్రుడు మదనరూపసారమును గూడా జయించినాడు గదమ్మా! ఆతనిచూడగానే ఇంద్రియ సమూహము అంతా మూర్ఛానిమగ్నము అవుతున్నది. దీనిలో ఇంద్రియములన్నీ తమ తమ వ్యాపారములనుండి మరలి పోయినట్లు నష్ట చేష్టత కలిగినట్లూ వర్ణింప బడింది. కాబట్టి ప్రళయ మవుతుంది.

## ౩ రోమాంచము ౪ కంపము

సుఖాద్యతిశయాజ్జాతా రోమాంచో రోమవిక్రియా
రాగరోషభయాదిభ్యో వేపథు ర్గాత్రవేపనం.

రోమాంచ కంపములు రెండింటికీ ఉదాహరణ లాఘవమును బట్టి ఒకే పర్యాయము లక్షణము చెప్పబడు తున్నది. రోమ వికారమునకు రోమాంచము అనిపేరు. సుఖము ఉత్సాహము భయము విస్మయమూ అధికముగా కలిగినప్పుడు రోమ వికారము కలుగుతుంది. రాగము రోషము భయము జ్వరము మొదలయిన వాని వలన కలిగిన గాత్ర కంపమునకు వేపథువు అని పేరు. సుఖజన్యమయినరోమాంచ కంపములకు ఉదాహరణమును ఈ విధముగాదర్శించాలి.

దయితాలింగన నిర్భర కంపా చ వధూ ర్వియోగజీర్ణాంగీ,
ఉద్గిరతి అంతరస్థితమదనశరాణ్ పులకచ్ఛద్మనా.

వధువు ప్రియుడు ఆలింగనము చేసికొనడము చేత అత్యధిక కంపము కలది అయింది. అంతకు పూర్వము ఆమె అంగములన్నీ ప్రియుని వియోగము వలన జీర్ణములై ఉన్నవి. ఇప్పుడు ఈ విధముగా కంపము కల్గదై పులకలు అనే మిషతో తనలో దాగి ఉన్న మన్మథ బాణాలను ప్రకటనము చేస్తున్నది. దీనిలో కంపము కలగడము రోమాంచము ఉత్పన్నము కావడమూ విస్పష్టముగా ఉన్నది.

## ౫ స్వేదము

వపుర్జలోద్గమః స్వేదః రతిఘర్మ శ్రమాదిభిః.

సంభోగ శ్రమ వలనను నిదాఘపరిశ్రమ వలననూ శరీరము నుండి జలము ఉద్గమించును. అదే స్వేదము ఉదా:—

శ్రుణ్వంతీ ప్రియసందేశం ప్రేయసః కాకతీశితుః,
స్మరరాజ్యాభిషిక్తేవ స్విన్నాంగీ వామలోచనా.

ప్రియుడయిన కాకతీశ్వరుని యొక్క ప్రియమైన సందేశమును వింటూ ఉన్నదై ఆసుందర నేత్రములు కలిగిన తరుణి మన్మథ రాజ్యమునందు అభిషిక్తురాలైన దానివలె స్విన్నాంగి అయింది. ప్రియుడు చెప్పే మాటలు వింటూ ఉంటే ఆమెకు స్వేదము ఉదయించింది. సమన్వయము స్పష్టమె.

## ౬ వైవర్ణ్యము

విషాదమదరోషాద్యైః వర్ణాన్యత్వం వివర్ణతా

విషాదము మదము రోషము మొదలయిన వాని వలన వేరొక వర్ణము కలగడము ముఖాదికమునందు రంగు మారుట వైవర్ణ్యమవుతుంది. ఉదా:—

నరనాథ! చంద్రధవలాః తవ గుణాః సాధు సంస్మరంత్యాః,
అంగాని పాండురాణి ఇదానీం జాతాని శ్యామాయాః.

ఓ నరనాథా! చంద్రునివలె తెల్లగా ఉన్న నీగుణములను మూచెలి బాగా సంస్మరణ చేస్తున్నది. అట్లా ఉంటే ఆ శ్యామ (అంటే యువతి అనీ ఒకఅర్థము. శ్యామవర్ణము కలది అని వేరొక అర్థము) అవయవములు పాండురములు అయినవి. నీగుణాలు తెల్లనివి కాబట్టి తెల్లని వానిని స్మరణం చేస్తూఉంటే అవయవాలన్నీ తెల్లనివి అయినవి అని ఒక భావము. నీవు లభించక పోవడము వలన నీ విరహంతో వ్యథను అనుభవించుతూ ఆమె నీ గుణగానం చేస్తూ ఉంటే శరీరమునందు అంతటా వివర్ణత్వము కలిగింది. అని వేరొక భావము. ఆమె నల్లనిది అయినప్పటికీ అంగములు తెల్లవయిన

వని అంతగా తెలుపు దనము సిద్ధము కావడము విరహాతి శయమును ద్యోతనము చేస్తుంది.

౭ అ శ్రు వు

అశ్రు నేత్రోద్భవం వారి దుఃఖ రోష ప్రహర్షజం

దుఃఖము రోషము ప్రహర్షము మొదలయిన వాని వలన కంటిలో ఉదకము పుట్టుతుంది. దానికి అశ్రువు అని పేరు.

ఉదా:—

వీరరుద్రనృపాద్భీతం పాండ్యం మగ్నం పయోనిధౌ
అన్వేష్టుమివ తద్వోపి దశ్రుధారాపగాయతే.

వీరరుద్ర నృపాలుని వలన భయపడి పాండ్యరాజు సముద్రములో మగ్నుడయి నాడు. అతని భార్య కన్నీరు అతనిని వెదకడం కోసరము కాలువలు నదివలె అవుతున్నది. పాండ్యరాజు పోగా అతని భార్య అధికముగా దుఃఖించుతున్నది. అని భావము. సమన్వయము స్పష్టము.

౮ వై స్వ ర్య ము

మదం గద్గదభాషిత్వం వైస్వర్యంస ముదాహృతం

సంతోషము మొదలయినవాని వలన గద్గదభాషిత్వము కలుగుతుంది. దానికే విస్వరత్వము అని పేరు. ఆ సమయము లోని మాటలు సరిగా రాక గద గద అనే ధ్వనితో వస్తవి.

ఉదా:—

విజనే ప్రియేణ సమం ఖామఖామాక్షరం భణంత్యాః
ఏకో జానాత్యనంగో అర్థం వధ్వా భణితానాం

నిర్జన ప్రదేశములో సురత సమయములో ప్రియునితో కూడా సుఖపారవశ్యము వలన ఆ వధువు పలుకుతున్నది. ఆ

పలుకులలో అక్షరాలు కృశించి పోయినవి. మణితధ్వనులతో అవి కలసి ఉన్నందువలన ఆవచనాలకు అర్థము ఏమిటో ఇతరులకు గోచరము కావడము లేదు. ఒక మన్మథుడు మాత్రమె తెలుసు కొంటున్నాడు. మొత్తానికి ఆవధువు యొక్క గద్గద వాక్యములు బాగా కామోద్దీపకములు అయినవి. ఆ పలుకులలో విస్వరత్వము ఉన్నది. కాబట్టి సమన్వయము స్పష్టము.

### వ్యభిచారిభావములు

ఇక ఇటు మీద నిర్వేదాది వ్యభిచారి భావములను. వాని స్వరూపోదాహరణములనూ నిరూపించ వలసి ఉన్నది.

### ౧ నిర్వేదము

దుఃఖేర్ష్యా తత్వబోధాచే ర్నిర్వేదో నిష్ఫలత్వధీః
తత్ర చింతాశ్రునిశ్వాసదీనతాః సంభవంతి చ.

దుఃఖము ఈర్ష్య తత్వబోధ మొదలయిన వానివలన నిర్వేదము కలుగుతుంది. అందువలన అంతటా నిష్ఫలత్వ బుద్ధి కలుగుతుంది. చింత అశ్రువు నిశ్వాసము దీనత్వములు దీనిలో సంభవించుతవి. ఇవి నిర్వేదాను భావములు. ఈ నిర్వేదము భావాంగముగా అనుభావాంగముగా రసాంగముగా స్వతంత్రముగా కూడా ఉండవచ్చును. ఇక్కడ మామూలుగా సామాన్య స్వరూపము మాత్రము సంగ్రహముగా చెప్పబడుతున్నది. ఉదా:—

సఖి! కర్పూరేణ కృతం కిం కస్తూర్యా మలయజ స్తిష్ఠతు
గుణశిశిరం యశస్సురభిం అనయ ప్రతాపరుద్రం చ.

ఓ! చెలీ! కర్పూరము చాలులె. కస్తూరి ఇంకా దేనికి? మంచి గంధమూ ఉండనీ! ఇపుడు వాని వలన ఏమీ ఉపయోగము లేదు. ప్రస్తుతము ప్రతాపరుద్రున్నే తీసికొనిరా!

ఆతడు తన గుణాలతో చల్లగా ఉంటాడు. తన యశస్సుతో పరిమళించుతూ ఉంటాడు. నాకు ఆతడే కావాలి. దీనిలో ప్రియ వియోగ జన్యమయిన దుఃఖము హేతువుగా కర్పూరాదులందు నిష్ఫలత్వము నిరూపించబడింది. కాబట్టి నిర్వేదము

౨ గ్లాని

గ్లాని రబలస్యాపచయో వైవర్ణ్యారతి కారణం

బలము తగ్గిపోవడము గ్లాని. క్షుత్పిపాసలవలన సురత ప్రయాసము వలనా బలము తగ్గిపోవచ్చు. వైవర్ణ్యము అరతి కృశించి పోవడము సరిగా పలక లేకపోవడము మొదలయిన వానిని ఇవి కలుగజేస్తుంది. ఉదా:—

త్రైలోక్యం వహతి మహీ తాం ధరతి భుజః ప్రతాపరుద్రస్య
తం హృదయేన ధరంతీ సాహసికీ దుర్బలాంగ్యస్మి.

ఒకయువతి సురత శ్రాంతఅయింది. ఆమెశరీరం అలసి పోయింది. ఆపిల్ల చాలా దుర్బలఅయింది. ఆమెస్థితిని ఈపద్యం చెప్పుతున్నది. ఈభూమి మూడులోకాలనూ వహించుతున్నది. ఆభూమిని ప్రతాపరుద్ర భుజము వహించుతున్నది. ఆప్రతాపరుద్రుని వక్షస్థలాన ధరించుతూ సాహసము చేసి దుర్బలాంగిని అయినాను. నేను తన్వంగినని తెలుసుకున్నప్పటికీ సమాగమ సంభ్రమము వలన ఆలోచించకుండా ప్రవర్తించాను. అందు వలన ఇంతగా దుర్బల అయినాను. దీనిలో ఆయువతి బలము తగ్గిపోవడము ఉన్నది. కాబట్టి గ్లాని.

౩ శంక

అనిష్టాభ్యాగమోత్ప్రేక్షా శంకా రోషాదికారణం

పరకార్యము వలనగాని తన దుర్నయము వలనగాని

అనర్థప్రాప్తిని అభ్యూహానము చేయడము శంక అవుతుంది.
దీనివలన రోషాదులు కలుగుతవి. ఉదా:—

నజానా త్వన్య ఇతి మయా హృదయే ప్రియస్య పరిచయః కృతః
కిం ప్రకటాస్మి జనానాం సర్వాంగీణైః పులకైః?

ఇతరులు తెలుసుకోకుండా ఉండాలని నేను హృదయములో ప్రియుని పరిచయమును కలుగజేసికొన్నాను. ఈసర్వావయవ వ్యాప్తములయిన పులకముల ద్వారా నేను జనులకు ప్రకటమయినానా ఏమి? అయ్యో! నాగూఢానురాగము ప్రకటము కావడము అనర్థమేకదా! దీనిలో ఈప్రాకట్యము వలన ఏమిఅనర్థము కలుగుతుందో అని ఆముగ్ధ శంకించుతున్నది. సమన్వయము సులభము.

## ౪ అసూయ

పరోత్కర్షాసహిష్ణుత్వ మసూయా పరికీర్తితా.

ఇతరుల ప్రకర్షమును సహింపలేక పోవడము అసూయ అవుతుంది. గర్వము దౌర్జన్యము మొదలయినవాని వలన ఇది కలుగుతుంది. ఉదా:—

అభిజాత్యా గుణై రూపేణవ మత్తః కింమహీ అధికా?
యత్తాం ప్రతాపరుద్రో బహుమన్యతే భాగధేయం తత్.

ప్రతాపరుద్రుని ప్రియురాలు తనచెలికత్తెతో ఈవిధముగా అంటున్నది. కులముచేగాని గుణములచేగాని రూపముచేగాని నాకన్న భూమి అధికురాలా ఏమి? ప్రతాపరుద్రుడు ఆమెనే బహుమానించుతున్నాడె. ఆమె నాకన్న ఎట్లా అధికురాలు? కాకపోయినా ఆయన ఆమెను అట్లా అభిమానించుతూ ఉన్నాడంటే అది ఆమె భాగధేయమె కావాలి. దీనిలో నాయకకు భూమిపై అసూయఉంది.

ప్రతాపరుద్రుడను ప్రేమించుట అనే ఆమె ఉత్కంఠను ఈమె సహించ లేకుండా ఉన్నది.

౫. మదము

మదిరాది కృతో మోహహర్షవ్యతికరో మదః

మద్యపానాదికము వలన కలిగిన హర్షమోహ సంకరము నకు మదమని పేరు. మోహముఅంటే విచిత్తత. మనస్సు సరిగా ఉండకపోవడము. ఉదా:—

భణతి చాసంగతార్థం హసతి వ్యుమందంచ రాగభరితాక్షీ
ప్రియచింతామదిరయా పరవశా పశ్యత శ్యామాంగీ.

ఈ శ్యామాంగి ప్రియచింత అనే మదిరచేత పరవశురాలు అయింది. సరీగా అర్థసంగతి లేకుండా పలుకుతున్నది. రాగ భరిత నేత్రాలు కలదై అమందముగా నవ్వుతున్నది. చూడండి! మద్యము పుచ్చుకొన్నవారుకూడా ఎర్రనికన్నులు కలవారై నవ్వుతారు. అసంబద్ధంగా మాట్లాడుతారు.

ఈమె ప్రియ చింతవలన విక్లబురాలయింది. నేత్రాలతో అనురాగ భరమును సూచించు తున్నది. సమన్వయము సులభము.

౬. శ్రమము

శ్రమం ఖేదోఽధ్వరత్యాదేః జాతః స్వేదాతిఘాయికృత్.

ప్రయాణము సురతము మొదలైన వానివలన కలిగిన ఖేదానికి శ్రమము అనిపేరు. దీనివలన స్వేదాతిశయము కలుగుతుంది. ఉదా:—

ఆగచ్ఛత్యేవ ప్రియే విస్మృత్యుత్కంఠవతీ గతాగతాయాసం,
తామ్యసి స్వేదజలైః సుందరి లులితాంగరాగాసి.

ప్రియుడు వస్తూనే ఉన్నాడుకదా! ఇంతట్లోనే ఇంత తొందరఎందుకు? మాటి మాటికి గమాగమాయాసమును ఎందుకు పొందుతున్నావు? నీకు చెమట పట్టింది. చాలా శ్రమపడు తున్నావు. సుందరీ! చూచావా? నీ అంగరాగము అంతా చెమటవలన విలులితమయి పోయింది. ఎందుకు ఈ శ్రమ? ఈ పద్యములో గతి నిమిత్తకమయిన శ్రమ ఉన్నది. సురతాభిలాషిణి అయిన నాయిక గతాగతాయాసమును పొందింది.

౭ ఆలస్యము

మందోద్యమత్వ మాలస్యం కర్తవ్యేషు ప్రకీర్త్యతే.

చేయదగిన పనులలో ఉద్యమము మందముగా ఉండడము ఆలస్యమవుతుంది. మనస్సు అన్యాసక్తమై ఉన్నందువలన కర్తవ్యములలో సరిగా ప్రసరించదు. ఆ మందత్వమే ఆలస్యము. ఉదా:—

ఆస్తాం మృగాక్ష్యాః గృహకృత్య వార్తా
స్వాంగోపచారేష్వపి యత్నమాంద్యం,
కర్తవ్యమగ్రే దయితస్య యత్ స్యాత్
నూనం బలాత్కారయతి స్మరస్తత్.

ఈ మృగాక్షికి గృహకృత్యవార్త అట్లా ఉండనివ్వండి. తన అంగ సముపచారములలో కూడా ఈమె పని మరీ మందగించి ఉన్నదే! ప్రియుడు వచ్చిన తరువాత ఆయన ఎదట దగ్గర చేయవలసిన పనులు చాలా ఉన్నవే! అవి అన్నీ ఎట్లా అవుతవో? అవు నన్నను!! అప్పుడు ఆ కర్తవ్యమును అంతా మన్మథుడె చేయించుతాడు. పరవశురాలయి ఈ

పిల్ల వెల్ల మొగము వేసికొంటే ఆ మన్మథుడు బలవంతంగా నయినా చేయించి తీరుతాడు.

౮ దైన్యము

సత్వత్యాగా దనౌద్ధత్యం దైన్యం కార్పణ్య సంభవం.

సత్వము- అంటే మనస్సులోని దిటవుతనము. అది తగ్గిపోవడము వలన ఉద్ధతత్వము అంతా పోతుంది. అదె దైన్యము. దార్గత్యము వలన కూడా ఈ అనుద్ధతత్వము కలుగవచ్చు. అదీ దైన్యమె. దీనివలన కార్పణ్యము కలుగుతుంది. అంటే దీనదీనము లయిన మాటలు అన్నమాట. ఉదా:—

ఆనేతుం నరనాథం గతః ఖలు సఖీజనో విలంబతే,
మన్మథ! నమామి చంద్రం శిక్షయ! చిరయ! ఈషదితి.

నరనాథుని తీసికొని రావడమునకై సఖీ జనము వెళ్ళింది. ఇంకా రాలేదు. విలంబనము చేస్తున్నది. మన్మథా! నీకు నమస్కారము చేస్తానయ్యా! "తొందర పడకు. ఇంకా కొంత ఆలస్యము చేయువలసిన"దని చంద్రుణ్ణి నీవు శిక్షించు. ఆతడు వెన్నెల కాస్తూ నన్ను వ్యథపెట్టుతున్నాడు. నీవు ఆతణ్ణి ఆజ్ఞాపించక పోతే నేను బాధ పడవలసి వస్తున్నది. దీనిలో బ్రతిమాలు కొనడము, కృపణోక్తి ఉన్నందున దైన్యము అవుతుంది.

౯ చింత

ఇష్టానధిగమాద్ధ్యానం చింతా శూన్యత్వ తాపకృత్.

అపేక్షితమయిన వస్తువు కాని, ఇష్టుడయిన ప్రియుడుకాని సమయానికి లభ్యము కాకపోయినట్లయితే కొంత ఆలోచన ధ్యానమూ కలుగుతుంది. అదే చింత, దీనివలన శూన్యత్వము తాపము కలుగుతుంది. ఉదా:—

సన్నిహితమపి గురుజనం న చ ప్రేక్షతే పృష్టాపి నాలపతి,
ఏషాపి మూగ్గతి గతిం హృదయస్య ప్రియానుబంధస్య.

దగ్గరలో ఉన్నా గురుజనమును చూడదు. పలకరించినా పలకదు. ప్రియానుబంధముతో ఉన్న హృదయము యొక్క గతి ఏమిటా? అని ఈమె వెదుకు తున్నది. ఇష్టుడయిన ప్రియుడు రాలేదే! ఏమి చేయనా? అని బెంగతో ఆ పిల్లది ఉన్నట్లు వర్ణితము. ఈ పద్యము పూర్వార్థములో శూన్యత్వమున్నూ ద్వితీయార్థములో ప్రియానవాప్తిమూలకమయిన ధ్యానమున్నూ చెప్పబడింది.

## ౧౦ మోహము

మోహస్తు మూర్ఛనం భీతిదుఃఖావేశానుచింతనైః.

భయావేశము దుఃఖావేశము నిత్యమూ అనుచింతనముల వలన విచిత్తతా రూపమయిన మూర్ఛనము కలుగుతుంది. అదే మోహము ఉదా:—

కథమపి గమయిత్వా వాసరం దీర్ఘదీర్ఘం
విరచితనవవేషా ప్రేషయిత్వాద దూతీః
విరయతి హృదయేశే ప్రాంశుభి శ్చంద్రపాదైః
అభిహతసకలాంగీ మూర్ఛితా కోమలాంగీ.

అతికష్టముగా ఏదోవిధముగా దీర్ఘ దీర్ఘ మయిన పగటిన్ని గడిపి సూర్యుడస్తమించి చీకటిపడగానే నవవేషమును రచించుకొని దూతికలను పంపింది. ప్రియుణ్ణి తీసికొని రావడానికై. 'ఇంకా రాలేదు. ఇంకా రాలే'దన్న ఆవేగము వలన దూతి తరువాత దూతిని ఇట్లా అనేక దూతికలను పంపింది. అప్పటికీ ఆయన రాలేదు. ఇంకా ఆయన ఆలస్యముచేస్తూ ఉంటే ప్రాంశువులు (దీర్ఘములు) అయిన చంద్రకిరణాలు ఆమెను

బాధపెట్టినవి. శరీరావయవాలన్నీ వెన్నెల తాకుడువలన హూనం హూనం అయినవి. ఇక ఆ కోమలాంగి తాళ లేక మూర్ఛపోయింది.

## ౧౯ స్మృతి

పూర్వానుభూతవిషయం జ్ఞానం స్మృతి రుదాహృతా,

పూర్వము అనుభవించిన పదార్థములను సంబంధించి ఉన్న జ్ఞానము స్మృతి అవుతుంది. సదృశవస్తువును చూచి నప్పుడు పూర్వ విషయాలు జ్ఞాపకమునకు వస్తవి. అట్లాగే అనుచింతనము వలన సంస్కారము ఉద్బుద్ధము అవుతుంది. అప్పుడు వెనుకటి స్మృతి కలుగుతుంది. ఉదా:—

ప్రతాపరుద్రస్య భుజే వసంత్యా క్షోణ్యా తపః కీదృశమార్జితం స్యాత్,
స్పృష్టం సకృద్యేన మదీయమంగం ప్రాప్నోతి విష్వక్సుఖ వజ్రలేపం'

స్పర్శ వలన కలిగిన సుఖమును స్మరించడము ఈ పద్యములో ఉన్నది. ఒక నాయిక ఇట్లా అనుకుంటున్నది. ప్రతాపరుద్రుని భుజమందు నిత్యనివాసము చేస్తూ ఉన్న భూమి ఎటువంటి తపస్సును ఆర్జించిందో కదా! ప్రతాపరుద్రుడు ఒక పర్యాయమె స్పృశించినా నా శరీరము అంతటా సుఖ వజ్రలేపమును పొందుతున్నదే! భుజవాసిని అయిన భూమికి నిత్యస్పర్శ ఉంటున్నందువలన ఆమె ఇంకా ఎంతటి సుఖాన్ని అనుభవించుతున్నదో? ఈ పద్యములో నాయిక పూర్వము కలిగిన స్పర్శ సుఖమును స్మరించుతూ ఉన్నందు వలన సమన్వయము విశదమె.

## ౨౦ ధృతి

ధృతి శ్చిత్తస్య నైస్పృహ్యం జ్ఞానాభీష్టాగమాదిభిః.

జ్ఞానము ఇష్టమయిన వస్తువు యొక్క ప్రాప్తి మొదలయిన

వాని వలన చిత్తమునకు నిస్పృహత్వము కలుగుతుంది. దానికి ధృతి అని పేరు. ఉత్తమ జ్ఞానము కలిగితే ఇతర వస్తువులపై వేరుగా స్పృహ ఉండదు. అదే ధృతి. ఉదా:—

వీరరుద్రనృపతౌ హృదయ! త్వ ద్వల్లభే త్రిభువనైకధురీణే,
సాధు! సాధు! కృతకృత్యమసి త్వం మన్యసే! జగదశేషమసారం,

ఓ! హృదయమా! వీరరుద్ర నృపతి నీవల్లభుడు. మూడు లోకాలలోనూ ఏకైక ధురీణుడు. ఆతడు నీకు ఆ విధముగా వల్లభుడు కాగానే నీవు కృతకృత్య మయినావు. సర్వజగత్తు అసారముగా భావించుతున్నావు. దీనిలో అభీష్ట మయిన ప్రతాపరుద్రుని ప్రాప్తివలన ఆ నాయికకు నిస్పృహత్వము కలిగింది. అందువలన ధృతి.

౧౩ వ్రీడ

చేతస్సంకోచనం వ్రీడాఽనంగరాగస్తవాదిభిః

మనస్సుకు సంకోచము కలగడము అనగా వికాసము లేకుండా మనస్సు సంకుచితము కావడము వ్రీడ అవుతుంది. ఈ సమయములో మనస్సుకు ధార్ష్ట్యము ఉండదు. ఇది అనంగ రాగము వలన కాని అంటే మన్మథుడు నిమిత్తముగా కలిగిన అనురాగము వలన కాని, ఇతరులు చేసిన స్తోత్రాల వలన కాని తన సంప్రదాయ సిద్ధములయిన ఆచారాలు నశించి పోవడము వలన కాని కలుగుతుంది. ఉదా:—

తథా సమాలోకన కౌతుకానాం మనోరథై రంధ్రపురాంగనానాం,
విలోకితే రుద్రనృపే భవంతి పర్యస్త పక్ష్మాణి విలోచనాని.

ఆంధ్ర పురములోని స్త్రీలు ప్రతాపరుద్రుని అవలోకనము చేయాలని అత్యంతమూ కుతూహలముతో ఉన్నారు. అటువంటి వారి కోరికలు ప్రబలములు అయి ఉన్నవి. ఈ సమ

యందలి రుద్ర నృపుడు వీరిని చూడగానే వీరి నేత్రాలు పర్యస్త పక్ష్మములు అవుతున్నవి. రెప్పలు దిగజారుతున్నవి. రుద్రదేవుని యందలి అనురాగము చేత ఆతడు కృపా వలోకనము చేసినా స్త్రీలకు మనస్సంకోచము కలిగింది. కాబట్టి వ్రీడ.

౧౪ చపలత

చాపలం త్వనవస్థానం రాగద్వేషాది సంభవం.

రాగము ద్వేషము మాత్సర్యము మొదలయిన వాని వలన అనవస్థానము కలుగుతుంది. అంటే చిత్తము ఒక విధముగా నిలకడగా ఉండక చెదురుతూ ఉంటుంది. దీనినే చాపలము అంటారు. చాపలమే చపలత. ఉదా:—

దృష్ట్వా రుద్రనరేంద్రం తరళతరాక్షీ విలాస మృదుహాసా
కలయతి మౌక్తి కహారం స్పృశతి చ కర్ణోత్పలం బాలా.

అనురాగ మూలక మయిన చాపలము దీనిలో నిర్దేశింప బడుతున్నది. ఒక బాల రుద్రనరేంద్రుని చూచి తరళ తరళ ములయిన నేత్రాలు కలదయింది. విలాసముతో మృదువయిన హాసమును విశదము చేస్తున్నది. ఏమీ తోచక మెడలోని మౌక్తిక హారమును చేతితో పట్టుకొంటున్నది. చెవిలోని నీలోత్పలమును స్పృశించుతున్నది. దీనిలో నాలుగు చేష్టలు ఉన్నవి. క్షణకాలమయినా మనస్సు ఒకచోట ఉండడము లేదు. ఈ అనవస్థానము వలన చాపలమును ఊహించాలి

౧౫. హర్షము

ప్రసత్తి రుత్సవాదిభ్యో హర్షః స్వేదాశ్రు కంపకృత్

ప్రియుని ఆగమనము పుత్రజననము మొదలయిన ఉత్సవాదుల వలన ప్రసత్తి అనగా మనఃప్రసాదము కలుగుతుంది.

దానికి హర్షము అని పేరు. స్వేదము అశ్రువు కంపములకు హేతువు. ఉదా:—

యత్పూర్వం సరసీషు పద్మముకుల వ్యాజా త్తప స్సంచితం
వక్షోజౌ! యువయో స్తదద్య ఫలితం జాతౌ కృతార్థౌ యువాం
దత్తా కాకతివల్లభేన భవతో రేషా స్వవక్షస్థలీ
కస్తూరీ ద్విగుణీభవ త్పరిమళా కల్హారమాలా యతః

ఒక యువతి తన కుచాలను సంబోధించుకొని వానికి ప్రియుడు స్వయంగా పద్మమాలను ఇచ్చినందు వలన ధన్యత్వము కలిగిందని చెప్పుతూ తన హర్షమును దీనిలో స్పష్టము చేస్తున్నది. ఓ! వక్షోజముల్లారా! మీరు పూర్వ జన్మలో సరస్సులలో నివసించి పద్మ కోరకములు అనే మిషతో తపస్సును సంపాదించారు. ఆ సంచితమయిన తపస్సంతా ఇప్పుడు ఫలించింది. మీరు ఈ నాడు కృతార్థులు అయినారు. ఏమంటే కాకతి వల్లభుడు తన వక్షస్థలములోని కల్హారమాలను ఇచ్చినాడు. ఆ మాల ఆతని వక్షస్సు పై ఉన్న కస్తూరి చేత తన పరిమళమును రెట్టింపు చేసుకొన్నది. ఆ పుష్పమాలను ఆయన మీకు ఇచ్చినాడు కదా! అనురాగముతో ప్రియుడు ఇచ్చినట్టి కల్హార మాల వలన ఆ కామినికి హర్షము కలిగింది,

### ౧౬. ఆ వే గ ము

ఇష్టానిష్టాగమాజ్జాతః ఆవేగశ్చిత్తసంభ్రమః

ఇష్ట ప్రాప్తి వలన కాని అనిష్ట ప్రాప్తి వలన గాని చిత్తమునకు సంభ్రమము కలుగుతుంది. దానికి ఆవేగము అని పేరు. ఈ ఆవేగము దైవికముగా కలుగవచ్చు. రాజ్య విప్లవాదుల వలన కలగవచ్చును. ఉదా:—

నిస్సాణధ్వని మాకలయ్య సహసా హేలా విహారోద్యతం
ద్రష్టుం కాకతి వీరరుద్రనృపతిం ప్రత్యగ్ర కౌతూహలాః
అర్ధాలంబిత మండనాః ప్రతిపదం వ్యత్యస్తభూషా జవా
దారోహన్తి సువర్ణసౌధ వలభీ శృంగాణి పౌరస్త్రియః

కాకతి వీరరుద్రనృపతి ఎక్కడికయినా బయలు దేరే టప్పుడు భేరిని ప్రయోగించుతారు. ఒకప్పుడు ఆయన విలాస వ్యవహారానికి ఉద్యమించి బయలుదేరగానే నిస్సాణధ్వని వెలువడింది. అదివినగానే వేగంగా ఆతనిచూడ వలెనని పౌరస్త్రీలునూ నూతన కౌతూహలము కలవారయినారు. అలంకరించు కొంటూ సగము సగము మాత్రమే అలంక రించుకొని వేగిరపడుతున్నారు. ప్రతిస్థానములోనూ అభర ణాలను వ్యత్యాసముగా ఉంచుకొంటున్నారు. ఇట్లా అయి వేగముతో సువర్ణ సౌధవలభీ శృంగాలను అధిరోహించు తున్నారు. ఇష్టుడయిన ప్రతాపరుద్రుడు వస్తూఉన్నందువలన చిత్తసంభ్రమము కలిగిన పౌరస్త్రీల అవేగము దీనిలో స్పష్ట ముగా ఉన్నది.

## ౧౭ జడత

జాడ్య మప్రతిపత్తిః స్యాదిష్టా నిష్టాగ మోద్భవా.

ఇష్టప్రాప్తి వలన అనిష్ట ప్రాప్తివలనా కర్తవ్య మూఢ త్వము కలుగుతుంది. దానికి జాడ్యము అని పేరు. హఠాత్తుగా అనుకోనిసి ఇష్టము సంప్రాప్తమయి నప్పుడు మనస్సు స్తబ్ధమై పోవచ్చును. అప్పటిస్థితిలో ఏమీజ్ఞానము ఉండదు. ఏముచేయవలెనో ఏమితోచదు. దీనికి అప్రతిపత్తి అనిపేరు. అప్రతిపత్తే జాడ్యము. అదేజడత. ఉదా:—

సమాయాతే నాథే ప్రమనసి గృహాన్ రుద్రనృపతౌ
వపుస్సౌందర్యశ్రీ విజిత మదనోదార యశసి
వధూ రంతస్తోష వ్యతికరవశా న్నోపచరితుం
పురస్తా దాలీనాంన చలతి తథానో విరమతి.

ఉదారమనస్సు కలిగిన ఆత్మనాథుడయిన రుద్రనృపతి ఇంటికి వచ్చినాడు. ఆతడు వపుస్సౌందర్య శోభచేత మన్మథుని ఉదారయశస్సును జయించినాడు. ఇటువంటి సుందరుడు రాగానే ఆవధువు చెలికత్తె లందరూ దగ్గర ఉండడముచేత సిగ్గుపడి తనకు కలిగే మనోభావాలను అదిమి పెట్టుకుంటున్నది. అప్పుడు ఆమెకు కలిగిన అంతస్తోష సంబంధము వలన ఆ చెలికత్తెల ఎదుట ఉపచారము చేయడాని కయినా కదలదు కదలకనూ పోదు. ఉపచరించడము మానీవేయదు. అట్లా కాకనూపోదు. ఆమెకు ఉపచరించాలని ఉత్కంఠా కలుగుతున్నది' లజ్జకూడా ఉదయించుతున్నది. ప్రవృత్తి నివృత్తి రెండూ ఆవధువును అటూ ఇటూ లాగుతున్నవి. ఏవ్యాపారమూ ఆమెలో కలగడములేదు. ఇష్టప్రాప్తి వలన ఆమెలోని అప్రతిపత్తి ఇక్కడ నిదర్శితమయింది.

## ౧౮ గర్వము

అన్యధిక్కరణాదాత్మోత్కర్షో గర్వః బలాదిజః

బలము ఐశ్వర్యము గొప్పవంశము లావణ్యము విద్య మొదలయిన వానివలన ఆత్మోత్కర్షాభిమానం కలుగుతుంది. దీనివలన ఇతరులను ధిక్కరించడము అవమానపరచడము మొదలయినవి కలుగుతవి. దీనికి గర్వము అనిపేరు. ఉదా:—

కోవా శస్త్రగ్రహణ సమయో మాదృశా మీదృశానాం,
కీదృక్త్వేరం ప్రతిధరణిభృ త్కీటకేషే ష్వమీషు

ఇత్యావేశ ప్రతిభయ భుజాటోప దుర్వార గర్వాః
సంక్రీడంతే రణభువి భటాః కాకతీంద్రస్య జేతుః

బల మూలకమయిన గర్వము దీనిలో నిరూపితము అవుతున్నది. శస్త్రమును గ్రహించవలెనని నియమము మాకు ఎందుకు? ఇటువంటి మాకుకూడా ఆ నియమమా? క్షుద్రకీటములవంటి ఈరాజుల విషయమై మాకు వైరమేమిటి? మాఅంత గొప్పవారికి ఈక్షుద్రులతో వైరము ఉన్నదని అనడముకూడా లజ్జాకరముగా ఉంది, ఈవిధమయిన వచనాలతో గొప్పఆవేశముతో భయంకరమయిన భుజాటోపముతో వారింపరాని గర్వము కలవారై కాకతీంద్రుని భటులు రణభూమిలో క్రీడ చేసము స్తున్నారు. ఆయుద్ధము వారికి ఏమీ ప్రయాసకరముగా లేదు. దీనిలో భటుల వచనములందు గర్వము కన్పించుతూనే ఉంది.

౧౫ విషాదము

విషాద శ్చేతసోభంగః ఉపాయాభావ చింతనైః

ఆరంభించిన కార్యము చెడిపోయినందు వలన తన అపరాధము తెలిసినందువలనా విఘ్నములు కలిగినందువలనా ఆపదలు వచ్చినందు వలనా, వీటిని పోగొట్టు కొనడానికి ఉపాయములు ఏమీ కన్పడక వ్యాకులపాటు ఉండడము చేతనూ చేతోభంగము కలుగుతుంది. దీనికి విషాదము అని పేరు. ఉదా:—

ప్రేషయామి మన ఇతి ముధా తన్మాం ముక్త్వా వల్లభే లగ్నం
మాముజ్ఝిత్వా నో గచ్ఛతి మదనః సఖి! కిం ను కర్తవ్యం?

ఒకనాయిక సఖితో పలుకుతున్నది. ఓ! సఖీ! నామనస్సు ప్రియుని పంపించుతానని చెప్పి నన్ను విడిచి ప్రియుని దగ్గ

రకు వెళ్లి ఆతని యందే లగ్నమయింది. నా మనస్సు అక్కడి నుండి మరలదు కదా! మదనుడు కూడా నన్ను విడిచి పోడే! నేను ఏమిచేసేది? ఆతని యందు కల ఉత్కటాను రాగము నన్ను ఇంతగా వ్యాకుల పెట్టుతున్నది. ఆతని పైని అనురాగము కలతపెట్టు తున్నది. ఏమి చేయడానికీ తోచదు. అని భావము. సమన్వయము స్పష్టమె.

౨౦ ఔత్సుక్యము

కాలాక్షమత్వ మౌత్సుక్యం మనస్తాప త్వరాదికృత్

ఇష్ట విరహము వలన రమ్య వస్తువును చూడవలెనను కోరికవలనా కాలవిలంబనమును సహింపలేక పోవడము ఉంటుంది. దీనికి ఔత్సుక్యము అని పేరు. మనస్తాపము త్వర, నిశ్వాసము, నిద్ర మొదలయిన వానికి ఇది హేతువు అవుతుంది. ఉదా:—

ఆంధ్రపుర భామినీజనోఽంగాని ప్రసాధ్య త్వరమాణః
రుద్రనరేంద్రాగమనే విలంబితం సహతే కృచ్ఛ్రేణ.

ఆంధ్ర పురములోని భామినీజనము శరీరాలను బాగా అలంకరించుకొని రుద్రనరేంద్రుని ఆగమనంలో ఆలస్యమును అతికష్టముగా సహించుతున్నది. దీనిలో 'కృచ్ఛ్రేణ సహతే' అనడము చేత కాల విలంబనమును సహించ లేకుండా ఉన్నారని భావము కలుగుతుంది. అందువలన ఔత్సుక్యము.

౨౧ నిద్ర

నిద్రా చిత్త నిమీలనం.

చిత్తమునకు నిమీలనము కలగడము నిద్ర అవుతుంది. మనస్సు బాహ్యేంద్రియ సంబంధముతో ఉండకపోవడమును ఇక్కడ గుర్తించాలి. ఉదా:—

స్వప్నే దృష్టం దయితం వధూ రాలింగితుం కృతోద్యోగా
పశ్యత! దరమీలితాక్షీ గగనే కరౌ ప్రసారయతి.

ఆ వధువు స్వప్నములో కన్పడిన ప్రియుని ఆలింగనము చేసికొనవలెనని ప్రయత్నము చేసినదై కన్నులు మూతమూసికొనియే ఆకాశములో చేతులు చాచుతున్నది. చూడుడు! ఈ పద్యములో అలీక ప్రియుని ఆలింగనము చేసికోవలెనని ప్రయత్నము చేయడము వలన ఆ నాయికకు అనవరత చింత ఉన్నట్లు స్పష్టము అవుతున్నది.

## ౨౨ అపస్మారము

ఆవేశో మోహదుఃఖాద్యై రపస్మారోంగ తాపకృత్.

మోహము దుఃఖము మొదలయిన వానివలన ఆవేశము కలుగుతుంది. దీనికి అపస్మారము అని పేరు. అంగతాపమును ఇది కలుగచేస్తుంది. ఉదా:—

దృష్ట్వా స్వప్నే కుపితవదనం కాకతీయ క్షితీంద్రం
హా! హా! రక్షేత్యసకలగిర స్సంభ్రమోత్థాన భాజః
ధావంత్యంతర్వణభువి లురంత్యాహ్వయంత్యాత్మబంధూ
నారా ద్భూతానపి రిపుగణా వ్యస్త నామగ్రహేణ.

శత్రుగణములు స్వప్నములో కాకతీయ క్షితీంద్రుని కుపితవదనము కల వానినిగా చూచి భయపడి "హా! హా!! రక్ష....! అంటున్నారు. 'రక్షత' అని అనవలసింది 'రక్ష' అని అనడము వలన ఆమాట సంపూర్ణముగా లేదు. ఇట్లా అసకల వాక్కు-కలవారై గాభరాపడి నిద్రనుండిలేచి పరుగెత్తుతున్నారు. వనాంతర్భూమిపై పడి పొర్లాడుతున్నారు. తమ బంధువులు దగ్గర ఉన్నప్పటికీ వ్యస్త నామగ్రహణములతో ఎక్కడో దూరముగా ఉన్నవారిని పిలిచినట్లుగా పిలు

స్తున్నారు. ఈ పద్యములో శత్రువుల అపస్మారము భయ హేతుకముగా మోహమూలకముగా ఉన్నది.

### ౨౩ సుప్తి

సుప్తి ర్నిద్రాసముద్రేకః

నిద్రయొక్క అతిశయమునకు సుప్తి అని పేరు. ఉదా:—

విశ్వైకరక్షాజుషి కాకతీంద్రే
నిశ్చింతతాం ప్రాప్తవతో మురారేః
తత్కీర్తిచంద్రాతపవర్ధితోపి
దుగ్ధాంబుధిర్నైవ భినత్తి నిద్రాం.

ప్రపంచమును బాగా రక్షించడమును బాగుగా స్వీకరించిన వాడై ప్రతాపరుద్రుడు ఉంటూఉంటే మురారికి నిశ్చింతత కలిగింది. అటువంటి నిశ్చింతతతో అతడు ఉన్నప్పుడు ప్రతాపరుద్రుని కీర్తి చంద్రునియొక్క వెన్నెలచే వృద్ధిని పొందినప్పటికీ పాల సముద్రము విష్ణువు నిద్రను భంగ పరచడము లేదు. ఎంతగా సముద్రము వృద్ధిని పొందినా విష్ణు నిద్రకు ఏమీ భంగ పాటూ లేకుండా ఉన్నది.

### ౨౪ విబోధము

విబోధ శ్చేతనావాప్తిః జృంభాక్షి పరిమార్గకృత్

చైతన్య ప్రాప్తికి విబోధము అని పేరు. ఆవలింతలు కన్నులు నులుముకొనడము మొదలయిన వానిని ఇది కలుగ జేస్తుంది. చేతన కలగగానె మాంద్యము తొలిగి పోతుంది. అదే విబోధము. ఉదా:—

ప్రతాపరుద్రే నృపమౌళి రత్నే
విశ్వంభరాం రక్షతి శిక్షితారౌ

విజృంభమాణాః పరితః ప్రజానాం
భాగ్యశ్రియ స్తత్క్షణ మున్మిషంతి.

రాజులకు చూడామణి అయిన ప్రతాపరుద్రుడు దుష్ట శిక్షకుడై విశ్వంభరను రక్షించు చుండగా ప్రజల భాగ్య శ్రీలు అంతటా కూడా తత్క్షణంలోనే విజృంభించుతూ ఉన్మేషము పొందుతున్నవి. ఇదివరలో నిద్రాణముగా ఉన్న సంపదలు ఇప్పుడు వృద్ధిని పొందుతూ ఉన్నట్లు వర్ణిత మవుతున్నది. సూర్యుడు ఉదయించినప్పుడు అదివరలో ముకుళించుకొని ఉన్న పద్మాలు వికసించడమున్ను విస్ఫారితములు కావడమున్ను ప్రసిద్ధము. నిద్రించుతూ ఉన్న జనులు చేతన రాగానే మేల్కొని ఆవలించడము లోకసిద్ధమే. "విజృభమాణాః ఉన్మిషంతి" ఈ పదాల వలన ఈ చెప్పిన అర్థాలకు అభేదా ధ్యవసానము గోచర మవుతున్నది. భాగ్యసంపదలకు ఉన్నిద్రతా రూపమయిన విబోధము ఈ రూపముగా వర్ణిత మయింది.

## ౨౫ అమర్ష

అమర్షః సాపరాధేంఘ చేతః ప్రజ్వలనం మతం.

అపరాధము చేసిన వారల విషయమై మనః ప్రజ్వలనము కలుగుతుంది. దానికి అమర్ష అని పేరు. తనను అధిక్షేపము చేసినా అవమానము చేసినా మళ్ళా ప్రతిక్రియ చేయాలన్న బుద్ధి కలుగుతుంది. ఇదే మనః ప్రజ్వలనము. ఉదా:—

అరే ! భూపా శ్చాపా న్నమయత ! శిరాం స్యున్నమయత
ప్రవృత్తాః స్వస్త్రీణా మహమహమికా వీరవరణే
త్వరంతే నః ఖడ్గాః ప్రవిదలన కేల్యామితి భటా
రిణాగ్రే గర్జంతి ప్రకటితరుషో రుద్రనృపతేః.

ఓరీ! రాజుల్లారా! ధనుస్సులను వంచండి. శిరస్సులను పైకిఎత్తండి. మీరు ఇట్లా చేస్తే యుద్ధ హతులై వీరస్వర్గము పొందుతారు. నేను నేనవి స్వర్గ స్త్రీలను వీరత్వముతో వరించడమునకే మీరు ప్రవర్తించి యుద్ధము చేయండి. ఖండన క్రీడలో మా ఖడ్గాలు త్వరపడుతున్నవి. అని ప్రతాప రుద్రుని భటులు రోషమును ప్రకటించుచుతూ యుద్ధాగ్ర భాగ ములో గర్జించుచుతున్నారు. భటులు శత్రువుల విషయమై ప్రతి చికీర్షతో ఉన్నట్లు వర్ణిత మయినందు వలన అమర్షము సమ న్వయించుకోవాలి.

### ౨౬ అవహిత్థ

హర్షాద్యాకార సంగుప్తి రవహిత్థేతి కథ్యతే

హర్షాద్యాకారములను సంగోపనము చేసికొనడము అవ హిత్థ అనబడుతున్నది. ఉదా:—

గోష్ఠ్యాం మహిళానాం శ్రుత్వా ప్రతాపరుద్ర చరితాని,
ఆలిఖ త్యవనతముఖీ ముగ్ధా చరణేన మహీపృష్ఠం.

ఒకముగ్ధస్త్రీ, స్త్రీలగోష్ఠిలో ప్రతాపరుద్ర చరితములను విని ముఖమును వంచుకొన్నదై పాదముతో భూమిపై పృష్ఠ మును లిఖించుచున్నది. ఆ స్త్రీల ప్రసంగములో తన అనురా గమును వృద్ధిని పొందించునట్టి ప్రియు చరితములను విని చాలా సంతోష పడింది. సిగ్గు పడింది. తన హర్ష లజ్జలు ముఖ వికాసమూ ఇతరులకు కన్పడుతవేమోనని తలవంచు కొని ఉన్నది. ఈ విధముగా ఆకార సంగోపనము స్పష్టమె.

### ౨౭ ఉగ్రత

దృష్టేఽపరాధే చండత్వ ముగ్రతా తర్జనాదికృత్.

అపరాధము కన్పడగా చండత్వము ఉండడము ఉగ్రత

అనబడుతుంది. పుత్రమిత్ర కళత్రాదులకు ఎవరయినా ద్రోహము ఒనరింపగా క్రౌర్యము కలుగుతుంది. ఇది తర్జనాదికమును కలుగ చేస్తుంది.

> ప్రియ మానీయ మానిన్యా విరహార్తి ర్నివార్యతాం
> యదేతస్యాః కటాక్షోల్కా పాతై రిందు ర్మషీకృతః

ఒక విరహిణీ సఖి ప్రియుని గురించి దూతికను పంపుతున్నది. ఆమెతో అనే వచనము. ప్రియుని తీసికొని వచ్చి ఈ మానిని యొక్క విరహ బాధను నివారింప చేయండి ఎందువలనంటే; ఈమె కటాక్షోల్కా పాతము చేత చంద్రుడు మసి అవుతున్నాడు. ఈ విరహిణి ప్రియ ప్రాప్తి లేనందు వలన బాధపడుతూ విరహోద్దీపకుడయిన చంద్రుని యందు కోపము కలదై చంద్ర నిందనము చేస్తున్నది. అందువలన ఆమెలోని ఉగ్రత స్పష్టమే.

## ౨౮. మతి

> తత్వమార్గానుసంధానా దర్థనిర్ధారణం మతిః

నానావిధ శాస్త్ర చింతనము ఊహాపోహాలు తత్వమార్గము మొదలయిన వాని యొక్క అనుసంధానము వలన కార్యమును నిశ్చయించుట మతి అవుతుంది. ఉదా:—

> కస్సంశయో మహీతలే చంద్ర ఏవ వీరరుద్ర నరనాథః
> యస్య కరస్పర్శా దంగాని మృగాంక రత్నంతి.

వీరరుద్ర నరనాథుడు భూమిలో చంద్రుడే. ఇంకా సంశయము ఏమి ఉంది? ఆతని కరస్పర్శవలన అవయవాలు చంద్రకాంత మాణిక్యము లవుతున్నది. చంద్ర కిరణ స్పర్శ కలిగితే చంద్రకాంత శిలలు ద్రవీభూతములు అవుతవి. ఇక్కడ నాయకుని కరస్పర్శ వలన అవయవములు ద్రవీభూతములై

పారవశ్యమును ఇస్తున్నవి. ఆతడు చంద్రుడే కాకపోయినట్లైతే అవయవాలు మృగాంకరత్నములు కావు. ఇవి ఇట్లా అయినందు వలన ఆతడు చంద్రుడే అని అర్థ నిర్ధారణము ఉన్నందు వలన మతి అవుతున్నది.

౨౯. వ్యాధి

మనస్తాపాద్యభిభవాత్ జ్వరాది ర్వ్యాధి రిష్యతే.

మనస్తాపము మొదలయిన వాని ఆఘాతము వలన జ్వరాదికము కలుగుతుంది. దానికి వ్యాధి అని పేరు ఉదా:—

ప్రతాపరుద్రస్య దిశాం జిగీషోః ప్రత్యర్థి నారీజన దేహ జన్మా
స్మరజ్వరోష్మా హిమవత్ప్రదేశాన్ స్మర్తవ్య నీహారకథాన్ కరోతి.

దిగ్విజేత అయిన ప్రతాపరుద్రుని యొక్క శత్రు స్త్రీ జన దేహమునందు ఉత్పన్నమయిన మన్మథ జ్వరము యొక్క ఊష్మ హిమవ త్ప్రదేశములో నీహార కథలను స్మరింప చేస్తున్నది. ఎంత చల్లని ప్రదేశాలలో ఉన్నప్పటికీ మన్మథ జ్వరము ఉష్ణాధిక్యముగా ఉన్నందువలన ఇంకా కామాపేక్ష కలుగుతుంది. అందువలన ఈ తాపజ్వరము చాలా గొప్పది అని భావము. వ్యాధి సమన్వయము స్పష్టమే.

౩౦. ఉన్మాదము

ఉన్మాదః తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి.

చేతనములందు అచేతనములందున్నూ సమానముగా ప్రవర్తించడము ఉన్మాదము అవుతుంది. భయము సన్నిపాత రోగము, ఇష్ట వియోగము ధన నాశము మొదలయిన వాని వలన చిత్త విభ్రాంతి కలిగితే అది ఉన్మాద మన్నమాట. ఉదా:—

ప్రతాపరుద్రస్య జయప్రయాణ
భేరీధ్వనౌ మూర్ఛతి దిఙ్ముఖేషు
త్రాసాకులా భ్రాంతిముపేత్య వృక్షాన్
పృచ్ఛంతి మార్గం రిపుభూమి పాలాః

ప్రతాపరుద్ర దేవుని యొక్క జయప్రయాణ భేరీ ధ్వని దిఙ్ముఖాలలో వ్యాపించుతూ ఉంటే, భయపడి వ్యాకులపడి విభ్రాంతి పొంది రిపుభూమిపాలకులు వృక్షముల దగ్గరకు వెళ్ళి 'మాకు మార్గము చెప్పండి. మాకు గతి ఏమిటి?' అని అడుగు తున్నారు. ఇక్కడ అచేతనములు అని అనబడు వృక్షాలదగ్గరకు వెళ్ళి చేతన వ్యక్తులను అడిగి నట్లుగా అడగడము ఉన్నందువలన ఉన్మాదము అవుతుంది.

### ౩౧ మరణము

మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః

మరణము కొరకయిన ప్రయత్నమును మరణము అని అంటారు. చనిపోయే అవస్థలో ఉండే చేష్టలను ఇక్కడ వర్ణించ వచ్చునని కొందరి భావము. మరణములో ఏమీ అభినయము ఉండదు కాబట్టి కావ్యములో దీనిని చెప్ప నక్కరలేదు. అని కొందరు అభిప్రాయపడుతున్నారు. ఉదా:-

ప్రియవిరహ మసహమానా వధూ ర్నిజజీవిత ముపేక్షమాణా
సేవతే జ్యోత్స్నాం దక్షిణపవనస్య తనుం సమర్పయతి.

వధువు ప్రియ విరహమును సహించలేక తన జీవితమును ఉపేక్షించుతూ ఇక ప్రాణాలను విడిచి పుచ్చాలనే అభిప్రాయ ముతో వెన్నెలను సేవించుతుంది. మలయ మారుతమునకు శరీరమును సమర్పించుతుంది. విరహతాపము పడే వారు వెన్నెలను మలయానిలమునూ సహించలేరు. కాబట్టి

ఆ వధువు మరణార్థమే ప్రయత్నించు తున్నదని గ్రహించాలి. సాక్షాన్మరణము అనేది అమంగళ ప్రాయము కాబట్టి ఉదాహరణము ప్రదర్శించడము ఉచితము కాదు. కాబట్టి తదర్థ ప్రయత్నమే నిర్దిష్టము.

౩౨ త్రాసము

ఆకస్మిక భయాచ్చిత్త క్షోభస్త్రాసః ప్రకీర్త్యతే

ఆకస్మికముగా కలిగిన భయము వలన మనస్సునకు క్షోభము కలుగు తుంది. దానికి త్రాసము అని పేరు. ఉదా:-

ప్రణయకుపితా చిరేణాపి వధూః శ్రుత్వా ఘనఘన స్తనితం
దయితం సరభస వలితా ఆలింగతి వేపమానాంగీ-

ఆ వధువు అప్పటి కప్పుడే ప్రణయ కుపితురాలై కూడా అట్లాగే ఉండి ఉండి మేఘధ్వనిని విని భయపడింది. అప్పుడు సర భసముగా మెలి తిరిగి కంపించే శరీరము కలదై ప్రియుని ఆలింగనము చేసికొంటున్నది. దీనిలో గర్జిత మూలమయిన త్రాసము వధువునకు వర్ణిత మయింది.

౩౩ వితర్కము

సందేహాత్కల్పనానంత్యం వితర్కః పరికీర్తితః.

సందేహమువలన అనేకములయిన కల్పనలు కలగడము వితర్కము అవుతుంది. విమర్శ వలన కూడా అనేకథా సంభావన ఉండవచ్చును. అప్పుడూ వితర్కమే. ఉదా:—

గుణైస్తస్త్రాసక్తం మమ హృదయ మస్యన్న గణితం
సఖీభి ర్నాలోచి క్షితిపతిరసౌ దుర్లభ ఇతి
ఉపాయః కో వా స్యాత్తదభిగమనే ? ముహ్యతి మనః
కియాన్ కోయం ? కీదృక్ కియదవధి రంతర్వ్యతికరః.

మహా కులీనత్వము మొదలయిన గుణములను చూచి ఆ క్షితిపతి యందు నాహృదయము ఆసక్తమయింది. ఇతర మయినది ఏమీ కూడా నాహృదయము గణించ లేదు. నాహృదయము కామాంగమయినందువలన ఈ క్షితిపతి దుర్లభుడు అవుతాడేమో ఆ నేవిషయమును వివేకవతులు అయిన చెలికత్తెలతో కూడా ఆలోచించ లేదు. అయినదేమో అయింది. ఇక ప్రియప్రాప్త్యుపాయమును చూస్తాను అని అందామా ? ఆతని అభిగమనములో ఉపాయము ఏది ఉంటుందో కదా ! నామనస్సు మూర్ఛ పడుతున్నది. ఈ మోహానంతరము ఆలోచించు దాము అని అనుకొన్నప్పటికీ; ఏమో ! ఈ మోహము ఎప్పుడు పోతుందో ? ఈమోహము ఏమిటో? ఇది ఎంతవరకు ఉంటుందో? ఇది ఏవిధముగా ఉన్నదో? ఎన్నాళ్లు ఇట్లా వ్యథపెట్టుతుందో ఏమీ ఊహింపలేము. ఈలోని వ్యతికరము ఈవ్యసనము ఇట్లా వ్యథపెట్టుతున్నది. ఈపద్యములో మోహము విషయమై సందేహమువలన కల్పనా నంత్యము నిరూపిత మయింది. కావున వితర్కము. ఇట్లా వ్యభిచారి భావములు నిరూపిత ములు అయినవి.

సాత్త్వికభావములు వ్యభిచారిభావములూ అనేక రసాలకు సాధారణములు. అందువలన నియతంగా ఒకవిశేషాన్ని బట్టి ఉదాహరణము ప్రదర్శించలేను. విభావములను తత్తద్రస ప్రస్తావములో ఉదాహరించి నిరూపించినట్లుగా వీనిని అట్లా చేయడమునకు వీలు లేదు. కాబట్టి సామాన్యంగా ఈసంచారులు వేరుగా నిర్దేశించబడినవి. సాధారణముగా శృంగార రస ములో ఈసంచారులకు అన్నిటికీ అనుప్రవేశము కలుగు

తుంది. హాస్యరసములో గ్లాని శ్రమ చపలత్వము హర్షము అవహిత్థములు మాత్రమె సంభవించుతవి కరుణములో మద ధృతి వ్రీడాహర్షగర్వౌ త్సుక్యోగ్రత్వములు అనేభావములు ఉండవు. ఇవికాక ఇతరభావాలు దానిలో సంభవించుతవి. రౌద్రరసములో గ్లాని శంకాలస్య దైన్యచింతావేగ జడతా విషాదసుప్తి నిద్రాపస్మారావహిత్థావ్యాధ్యున్మాద శ్రమత్రాసములు సంభవించవు. ఇతరములు అక్కడ ఉండవచ్చును. వీరరసములో నిర్వేదముకూడా ఉండదు. రౌద్రములో ఉండని భావాలు దీనిలోనూ ఉండవు, భయానక రసములో అసూయా మదధృతి వ్రీడాహర్ష గర్వ నిద్రాసుప్త్యుత్సాహవహిత్థోగ్రతా మతిభావాలు ఉండవు. ఇతరములు మాత్రమె ఉంటవి బీభత్సములోనూ అద్భుతములోనూ చింతాత్రాసాదుల యొక్క స్థితిని యథాసంభవముగా ఊహించాలి. శాంతరసములో నిర్వేదము ధృతి ఈరెండుమాత్రము సంభవించుతవి.

### శృంగారచేష్టా నిరూపణము

ఇక శృంగార చేష్టలను నిరూపించుతాము. దీనిలో కొన్ని చిత్తారంభములయిన భావాలు కొన్ని గాత్రారంభ (శరీరము) భావాలు. ఈచేష్టలు అన్నీ అనుభావాలె అవుతవని అంటున్నారు. వీనిలో కొన్నిభావాలు యౌవన జన్యములై ఉంటవి. యువతులను ఆశ్రయించి చేష్టా రూపములుగాఉన్న ఆ భావాలు ఉద్దీపన విభావాలు కూడా కావచ్చునని కొందరకు సమ్మతము. సంకీర్ణముగా ఉండే వీటికి ఒకప్రకరణ నియమము అంటూ లేదు. కాబట్టి నానిస్వరూప నిరూపణానికి ఇదేతగిన అవసరము. ఇవన్నీ పద్దెనిమిది విధాలుగా ఉంటున్నవి.

| | | |
|---|---|---|
| ౧ భావము | ౨ హావము | ౩ హేల |
| ౪ మాధుర్యము | ౫ ధైర్యము | ౬ లీల |
| ౭ విలాసము | ౮ విచ్ఛిత్తి | ౯ విభ్రమము |
| ౧౦ కిలకించితము | ౧౧ మోట్టాయితము | ౧౨ కుట్టమితము |
| ౧౩ బిబ్బోకము | ౧౪ లలితము | ౧౫ కుతూహలము |
| ౧౬ చకితము | ౧౭ విహృతము | ౧౮ హసితము |

వీనిలో మొదటి అయిదు భావాలూ చిత్తారంభములయిన శృంగార చేష్టలు. అంటే మనస్సులో పుట్టే వికృతు లన్న మాట. తరువాతనున్న పదమూడున్నూ గాత్రారంభములయిన శృంగార చేష్టలు. ఇవి శరీర చేష్టలలో అనుగతములై కనుపడుతూ ఉంటవి. ఇక వీని స్వరూపోదాహరణములను నిరూపించుతాము.

## ౧ భావము

రసాభిజ్ఞాన యోగ్యత్వం భావ ఇత్యభిధీయతే

రసమును తెలుసుకొనే యోగ్యత కలిగి ఉండడమునకు భావము అని పేరు. బాల్యము యౌవనము ఈ రెండు వయస్సుల సంధిలో శృంగారము విషయముగా ఒక అంతఃకరణ వికారము కలుగుతుంది. ఆ అవస్థలో శృంగారము అంటే ఏమిటో కొంచెము తెలియడానికి వీలు ఉన్నది. దానికే భావము అని పేరు. ఉదా:—

రుద్రనరేంద్రస్య గుణాన్ గాయతి బాలత్వే విస్రబ్ధం
లజ్జతే దరపులకితో యువతిజనో యౌవనే గాతుం

యువతి జనము బాల్యములో రుద్రనరేంద్రుని గుణాలను స్వేచ్ఛగా గానము చేసింది. యౌవనము వచ్చేటప్పటికి ఆ

గుణాలనె గానము చేయడానికి కొంతగా పులకిత శరీరము కలదై లజ్జపడుతున్నది. యౌవనము రాగానే కొంత వికారము ఉద్భవించడము రాగాభిజ్ఞానము ఉండడమూ ఇందులో వర్ణితము అయినందువలన ఇది భావమవుతుంది.

౨ హావము

ఈష ద్దృష్టవికారః స్యాద్భావో హావః ప్రకీర్త్యతే.

భావములో కొంతగా వికారము కన్పడి నట్లయితే అదే హావము అవుతుంది. భావములో వికారము స్పష్టముగా కనపడదు. ఈ హావానికి కూడా పై పద్యమె ఉదాహరణము. దానిలో "దరపులకితః" అనే దానివలన పులకములు కొంతగా కొంచెముగా గోచరములు అవుతూ ఉన్నట్లు వర్ణిత మయినందు వలన హావమును గ్రహించాలి.

౩ హేల

సువ్యక్త విక్రియో భావః హేలేతి ప్రతిపాద్యతే

భావము వ్యక్త విక్రియ కలదయినప్పుడు హేల అవుతుంది. హావము కంటె కూడా హేల సువ్యక్తము అన్నమాట.

ఉదా:—

మా భవతు కస్యాపి స్ఫుట మితి ముగ్ధే కరోషి వల్లభం హృదయే
ఘోష్యతే తవ భావః సర్వాంగీణైః పులకైః.

ఓ! ముగ్ధా! ఎవరికీ కూడా స్ఫుటము కాకుండా ఉండాలని వల్లభుని హృదయములో దాచుకొన్నావు. అంతమాత్రాన ఏమయింది? ఇది ఎవరికి తెలియడం లేదు? నీ సర్వ శరీర వ్యాప్తములయిన పులకములచేత నీ ఈ భావము ఘోషింపబడుతున్నది. దీనిలో భావము సర్వాంగీణ పులకల ద్వారా సువ్యక్తమయింది కాబట్టి హేల.

## ౪. మాధుర్యము

అభూషణేపిరమ్యత్వం మాధుర్యం పరికీర్త్యతే

భూషణాలు లేకపోయినప్పటికీ రమ్యముగా ఉండడమునకు మాధుర్యము అని పేరు. స్వభావ సిద్ధమయిన రమ్యత సహజంగా ఉన్నప్పుడు భూషణాదుల వలన ఉపయోగము ఉండదు కదా! ఉదా:—

జిత త్రైలోక్య లావణ్యా ప్రకృత్యా హరిణేక్షణా
కింతు భూషయితుం ధత్తే భూషణానీతి మే మతిః

ఈ హరిణేక్షణ స్వభావము చేతనే మూడు లోకాల వారి లావణ్యమునూ జయించింది. ఆ జయనములో ఆమె ఏమీ ప్రయత్న పడలేదు. అయితే భూషణాలను భూషించడము కొరకు ధరించుతున్నదని నా అభిప్రాయము. స్వభావ సిద్ధముగా సౌందర్యము ఉంటే ఆభరణాలు అక్కర లేదు. ఆభరణాలు లేక పోయినా అందముగా ఉన్నట్లు దీనిలో వర్ణితము కాబట్టి మాధుర్యము.

## ౫. ధైర్యము

శీలాద్యలంఘనం నామ ధైర్య మిత్యభిధీయతే

శీలము మొదలయిన వానిని అతిక్రమించక పోవడము ధైర్యము అవుతుంది. తన సంప్రదాయము ధర్మము నీతి మొదలయిన వానిని అతిక్రమింప వలసిన క్లిష్ట సమయము వచ్చినప్పటికిన్నీ అతిక్రమించక పోవడము ధైర్యము. ఉదా:-

కులవధూనాం న యుజ్యతే మర్యాదాలంఘనం ఖలు విషమేపి
రుద్రనరేంద్రగుణాః పున ర్హృదయహరాః కిం ను కర్తవ్యం ?

కులస్త్రీలకు అత్యంతమూ విషమ మయిన పరిస్థితిలో కూడా మర్యాదను అతిక్రమించడము యుక్తము కాదు. కాని

రుద్రన రేంద్రుని గుణాలు హృదయమును హరించేవిగా ఉన్నవే! ఇపుడు నేను ఏమిచేయాలి? అని ఒక కులీన ఆలోచన. ఆతని గుణాలు హృదయమును హరించు తున్నప్పటికీ శీలమును అతిక్రమించరాదు. అని ఆమె తలంచుచున్నందు వలన ఆమె యందు ధైర్యము ఉన్నది.

౬. లీల

ప్రియానుకరణం లీలా వాగ్భిర్గత్యాథ చేష్టితైః

వాక్కులచే గమనముచే చేష్టితములచే ప్రియుని అనుకరణము చేయడము లీల అవుతుంది ఉదా:—

ప్రేక్షధ్వం సఖ్య ఏషా లక్ష్మీ రాజ్ఞః ప్రతాపరుద్రస్య
చరితా న్యనుకుర్వంతీ రాజ్ఞీషు పతివ్రతా జాతా.

ఓ! సఖులారా! చూడండి! రాజు అయిన ప్రతాపరుద్రుని చరితాలను అనుకరించుతూ ఈ లక్ష్మి రాణులలో పతివ్రత అయింది. రాజు దాన భోగాదులలో ప్రవర్తించగా లక్ష్మి కూడా ఆతనికి అనుకూలముగానే ఉండి అచంచలముగా ఉంటున్నది. దీనిలో ప్రియుని అచంచలత్వమును ఆ లక్ష్మి అనుకరించింది. అనే వర్ణనము ఉన్నందు వలన లీల.

౭. విలాసము

తాత్కాలికో వికార స్స్యా ద్విలాసో దయితేక్షణే.

ప్రియుడు చూడగా తత్సమయములోని వికారమునకు విలాసము అని పేరు. ఆకస్మికముగా కలిగే వికార మన్న మాట. ఉదా:—

సహేలం పశ్యంత్యాః ప్రకృతిసుభగం రుద్రనృపతిం
తదాత్వ ప్రత్యుద్య ద్వివిధ లలితాటోప మధురం

రసప్రాదుర్భావా ద్యుగప దుదయ త్సాత్త్విక మహో
మృగాక్ష్యా స్తారుణ్యే కుసుమశరశిల్పం విజయతే.

కావ్య ప్రకరణములో శ్లాఘా ప్రస్తావములో ఈ పద్యము నిరూపిత మయింది. రుద్రనృపతి చూడగానే కలిగిన వికారము కుసుమశర శిల్పముగా దీనిలో ఉన్నందువలన విలాసము.

౮ విచ్ఛిత్తి

విచ్ఛిత్తి రతి రమ్యత్వం స్వల్పైరపి విభూషణైః

స్వల్పపు ఆభరణాలచే గూడా అత్యంతమూ రమ్యముగా ఉండడము విచ్ఛిత్తి అవుతుంది. ఆయా స్థానముల రమ్యతను బట్టి ఆయా భూషణాలు అటువంటి విచ్ఛిత్తిని సంపాదించుతవి. ఉదా.—

కస్యకృతే కేనకృతం కాకతిపుర స్త్రీణాం సౌందర్యం?
సాధారణ భూషయా యత్సఖి! త్రైలోక్యరమణీయం.

ఈకాకతి పురస్త్రీలయొక్క సౌందర్యము ఎవరికొరకై ఎవరు నిర్మించారో కదా! ఈస్త్రీలు సాధారణ భూషలు పెట్టుకున్నప్పటికి త్రైలోక్య రమణీయ సౌందర్యము కలవారై ఉన్నారు. సఖీ! ఈసౌందర్యము ఎవరికి అనుభవ యోగ్యమో కదా? స్రక్చందన తాంబూలాది సాధారణ భూషలు ఉన్నప్పటికీ విధాతృ శిల్పవైలక్షణ్యము ఉన్నట్లు వర్ణింప బడినందువలన విచ్ఛిత్తి అవుతుంది.

౯ విభ్రమము

విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థాన విపర్యయః

ప్రియాగమన సమయములో త్వరచేత ఆభరణాలను స్థాన విపర్యయము కలిగితే విభ్రమము అవుతుంది. ఒకచోట ఉంచవలసిన ఆభరణమును వేరొకచోట ఉంచితే పై వస్త్ర

మును అధరీయముగానూ, అధరీయమును పై వస్త్రముగానూ ధరించితే ఈభావము ఉన్నట్లు అని తాత్పర్యము. ఉదా:—

శ్రుత్వా సఖీముఖా ద్దివసో విరత ఇతి సంభ్రమేణవధూః
హస్తయో ర్నూపురే చరణయోః కరోతి వలయాని.

'పగటివేళ అయిపోయింది. సాయంకాలము ఆసన్న మయింది.' అని సఖీముఖాన విన్న ఆవధువు, హస్తములందు నూపురములను చరణములందు వలయములనూ కూర్చు కొంటున్నది. ఇక్కడ ఉత్తరార్ధములో ఆభరణ విపర్యయ మును ఊహించాలి.

## ౧౦ కిలికించితము

రోషాశ్రు హర్ష భీత్యాదేః సంకరః కిలికించితం

రోషము హర్షము అశ్రువు భీతి మొదలయిన వానియొక్క సంకరమునకు కిలకించితము అనిపేరు. ఈఅనేక భావాలు ఒకే పర్యాయము కూడిఉన్నట్లయితే కిలికించిత మవుతుంది. ఉదా:

గృహ్ణాతి కాకతినాథే విజనే పటాంచలం మృగాక్ష్యాః
వేపతే తనురపి నృత్యతి భ్రుకుట్యపి గద్గదా వాచః

నిర్జన ప్రదేశములో ఆమృగనయన యొక్క వస్త్రాంచల మును కాకతి నాథుడు గ్రహించగా ఆమె శరీరము కంపము పొందుతున్నది. కనుబొమ్మలు నర్తనము చేస్తున్నవి. వాక్కులు, గద్గదములు అవుతున్నవి. వీనిలో భయాది వికారములయిన కంపాదులకు మేళనము ఉన్నది కాబట్టి కిలికించితము.

## ౧౧ మోట్టాయితము

మోట్టాయితం స్యాదిష్టస్య కథాదౌ భావసూచనం

ఇష్టుడయిన వానియొక్క కథ మొదలయిన వానిలో తన అభిమానము భావమును సూచించడమునకు మోట్టాయితము

అనిపేరు. ప్రియుని గుణకథనము మొదలయిన వానియందు తన అభిలాష ప్రకటనము ఉండడమన్నమాట.

మధురాణి రుద్రనరపతి చరితాని వధ్వానను శృణ్వంత్యాః
తనుగోపనేన ప్రకటో యథా భావో న తథా పులకైః

మధురము లయిన రుద్ర నరపతి చరితములను వింటూ ఉన్న ఆ వధువునకు తను గోపనము చేత అనురాగ భావము ప్రకటన మయినట్లుగా పులకములచేత అంతగా ప్రకటము కావడము లేదు. తన ప్రియుని గురించి కథ రాగానే తనుగోపనము ద్వారా తన అనురాగ భావమును ఆ వధువు సూచించి నందువలన మోట్టాయితము.

౧౨ కుట్టమితము

సమ్మర్దేఽపి సుఖాధిక్యం రతే కుట్టమితం మతం.

సురతమునందు కేశగ్రహణాధరగ్రహణ కుచగ్రహణాదుల వల్లన సమ్మర్దము అధికముగా ఉన్నప్పటికీ సుఖాధిక్యము ఉంటుంది. సురత సుఖము అధికము అయినందువలన ఇవేవీ బాధా జనకములుగా ఉండవు. ఆ సుఖాధిక్యమును కుట్టమితము అని అంటారు. దీనిలో బయటికి క్రోధము కన్పించినా లోపల ఆయా కార్యవిశేషముల వలన సాంద్రానందము ఉంటుంది. ఉదా:—

నిర్మర్యాద మనోభవోత్సవ కథావిస్రంభ కర్ణేజపైః
అంగై ర్విస్మిత మానసాం ప్రియసఖీ మాలోక్య జాతత్రపా,
వైయాత్యం నిజ మాత్మవల్లభకృతాం రాగాన్ధతాం జానతీ
సద్యో నమ్రముఖేందు రిందువదనా క్షోణీం లిఖంతీ స్థితా.

ఒకనాడు మనోభవోత్సవము నిర్దయగా ప్రవృత్తమయింది. అప్పుడు కేశ గ్రహాధర గ్రహాది కామక్రీడ ఒక కథా

వాదము అయింది. నాయిక అవయవములు ఆసురతములోని ఉచ్ఛృంఖలత్వమును నఖ దంత పదాది ద్వారా సూచనము చేస్తున్నవి. ఇట్టి అంగాలతో ఉన్న నాయికను చూచి ప్రియ సఖీ మానసము విస్మయము పొందింది. ఇటువంటి విధాన మును ఎప్పుడూ ఎక్కడా చూడలేదు. ఈ నాయిక కూడా ఎట్లా సహించ గలిగిందో! అని ఆ ప్రియసఖి అనుభవ చతుర అయినా ఆశ్చర్య పడింది. ప్రియ సఖి ఈ విధముగా విస్మిత అయిందని చూచి నాయిక సిగ్గు పడింది. నన్ను చూచికదా! సఖి ఇట్లా అయింది! అని. ఇక ఆ ఇందువదన తన ధార్ష్ట్యమును తన వల్లభుడు చేసిన రాగాంధత్వమును తెలుసుకుంటూ అప్పుడే నమ్రముఖ చంద్రుడు కలదై భూమిని లిఖించుతూ ఉన్నది. "అభూతపూర్వము లయిన సంభోగ చిహ్నములను చూసి సఖి విస్మిత అయింది" అనడము వలన ఆ సమయంలో నాయిక సమ్మర్దము ఉన్నా సుఖమును బాగా అనుభవించిందని తెలుస్తున్నది. అందువలన కుట్టమితము.

౧౩ బిబ్బోకము

మనాక్ ప్రియకథాలాపే బిబ్బోకోఽ నాదరక్రియా

ప్రియుని కథల సల్లాపము రాగా గర్వాభిమానాదుల వలన కొంతగా అనాదర పద్ధతిని ప్రదర్శించడము బిబ్బోకము అవుతుంది. కేవలమూ ఆతని కథలను అనాదరము చేయడము కాక ప్రియుని అనాదర పరచడము కూడా బిబ్బోకమె అవు తుంది. ఉదా:—

లక్ష్మీః సద్మని నిర్భరం విహరతాం క్షోణీభుజాలంబన
క్రీడాం నైవ జహాతు కించ సతతం వాణీముఖే తిష్ఠతు

జ్ఞాతం రుద్రనరేశ్వరస్య బహుభి ర్విజ్ఞార పూర్వైః ప్రియ
వ్యాహారైః కృతమేవ దూతి మదన శ్చాపాయ సన్నహ్యతు.

ఓ! సఖీ! నీవు ఇట్లా కోపముతో ఉంటే లక్ష్మి మొదల యిన వారె ప్రేయసులు అవుతున్నారు. నీకు ఆ భాగ్యం లేదు. నీ ప్రియుడు నీపై ప్రియముగానె ఉన్నాడు. అని ప్రియుడు పంపిన దూతి పలికినా సాభిమానంతో ఉన్న నాయిక చావు అన్నా లక్ష్యపెట్టకుండా ఇట్లా పలుకుతు న్నది. లక్ష్మి భవనములో నిర్భరముగా విహరించనీ? భూమి భుజాలను అవలంబించి ఉండే క్రీడను విడువక పోనీ! వాణి నిత్యమూ ఆయన ముఖము లోనే ఉండనీ! రుద్ర నరే శ్వరుని ప్రియ వ్యాహారములు అన్నీ ఇది వరకు తెలిసినవె! ఇటువంటివి చాలా ఎరుగుదును. తెలిసిందిలె! చాలులె! ఓ! దూతీ! మన్మథుడు తన ధనువునకు సన్నాహ పడు గాక. నేనుమటుకు నమ్మ లేను. ఇంతే! ఈ పద్యములో ప్రియ వార్తపై అనాదరము ఉన్నది.

### ౧౪ లలితము

సుకుమారాంగ విన్యాసో లలితం పరికీర్త్యతే

సుకుమారముగా సవిలాసముగా అంగములను విన్యసించడ మునకు లలితము అని పేరు. ఉదా:—

పదన్యాస క్రీడా రణిత మణిమంజీర రశనం
సహేలం వ్యావల్గ త్కరవలయ నిక్వాణ సుభగం
స్మితజ్యోత్స్నా వీచీతరళ వచనం రుద్రనృపతేః
పురంధ్రీణా మాసీ దనురహసి సేవావిలసితం.

రుద్ర నృపతి స్త్రీల యొక్క ఏకాంత సేవలో సేవా విలసనము ఈ విధముగా ఉంటుంది. పదన్యాస క్రీడ చేత,

మణిమయ మంజీరములూ, రశనా (మొలత్రాడు) రణనము చేస్తున్నవి సవిలాసముగా ధ్వనించు తున్న త్రిప్పబడుచున్న చేతుల కంకణ నిక్వాణములు మనోహరముగా ఉన్నవి. వెన్నెలవంటి స్మితలవతరళము లయిన వచనములు ఆ సేవా విలసనములో మనోహరముగా ఉంటున్నవి. దీనిలో పద న్యాసము కరవల్గనము మందహాసము తరళ వచనము అనే సుకుమారాంగవిన్యాసము ఉన్నందున లలితము అవుతుంది.

౧౫ కుతూహలము

కుతూహలం రమ్యదృష్టౌ చాపలం పరికీర్త్యతే.

మనోహరుని చూచి నప్పుడు తత్సమయములో కలిగిన చాపలమునకు కుతూహలము అని పేరు. ఉదా:—

వీరరుద్ర మధిరూఢ సింధురం ద్రష్టు మంధ్రనగరీ పురంధ్రయః
కుర్వతే రచిత సంక్రమత్వరా స్తుంగసద్మశిఖరాధిరోహణం.

ఆంధ్ర నగరీ యువతులు గజమును ఎక్కిన వీర రుద్రుని చూడడానికి త్వరా సంక్రమము కలవారై ఉన్నత సౌధ శిఖరములను అధిరోహించు తున్నారు. దీనిలో ప్రతాప రుద్రుని చూడడమునకు స్త్రీల కుతూహలము వర్ణిత మయింది.

౧౬ చకితము

చకితం భయసంభ్రమః.

భయము వలన కలిగే తొందర పాటునకు చకితము అని పేరు. ఇక్కడ భయము కూడా శృంగారాంగము గానే ఉంటుంది. ఉదా:—

అవిజ్ఞాతాయాతం స్వమకధితమాల్యాపి హసితుం
హఠా దుత్పశ్యంత్యా శ్చకిత చకితోదంచిత దృశః

విలాసా నుద్వేలా నుదిత మదనా స్వీక్ష్య సుతనోః
తథైవ ప్రత్యేతుం పున రవనిపాలః స్పృహయతి.

అవని పాలుడు ఒకనాడు మెల్లగా పదములు వేస్తూ వెన కగా తెలియకుండగా వచ్చినాడు. ఆతడు రావడము నాయి కకు తెలియదు. అక్కడ ఉన్న సఖి కనిపెట్టుతూనే ఉంది. ఈ విధముగా ఆతడు వచ్చినప్పుడు నాయిక ఎంత సంభ్ర మము పడుతుందో చూడాలని చూచి హసించాలని చెలికత్తె ఆతని రాకను చెప్పలేదు. ఆతడు రాగానే నాయిక హఠాత్తుగా చూచింది. ఆమె దృక్కులు చకిత చకితోదంచితములు అయినవి. లజ్జోత్కంఠలు కలిగినందు వలన మాటి మాటికీ దృక్కులు ఆవృత్తము కావడము నిమీల నోన్మీలనములు కలవి కావడమూ సంభవించింది. ఊర్ధ్వ ప్రసారితాపాంగము కూడా అయింది. ఈ విధముగా ఉన్న ఆ సుతనువు యొక్క మాన్మథ భావముతో కూడుకొన్నట్టి, ఉద్వేలములు అయిన విలాసములను చూచి ఆలింగనాది సత్కారము లేకుండగానే మళ్లా ఆ విధముగానే రావడానికి అవని పాలుడు ఇష్టపడుతున్నాడు, మదన మహోత్సవము ఎంతటి దయినా చకిత సుఖము యొక్క పదునారవ వంతె యినా పొందదు. సమన్వయము సులభమే.

## ౧౭. విహృతము

విహృతం ప్రాప్తకాలస్య వాక్యస్య అకథనం హ్రియా.

అవసరములో తగిన వాక్యమును పలుక వలసిన వాక్య మును సిగ్గుచేత పలుకక పోవడము విహృతము అవుతుంది. ఆ వాక్యమును ఆ సమయములో పలుక వలసిన అవసరము

ఉన్నప్పటికి సిగ్గు వలన పలుక లేక పోయి నట్లయితే విహృతము అవుతుంది అన్నమాట. ఉదా:—

ప్రతాపరుద్రస్య భుజాంతరస్థాం
కల్హారమాలా మమునా స్పృశేతి
స్తనద్వయే పత్రలిపిం లిఖంతీం
సఖీం వధూః పశ్యతి సాభిమానం.

ప్రతాపరుద్రుని యొక్క భుజాంతరములో ఉన్న కల్హారమాలను ఈ స్తనముతో స్పృశించు ఆలింగన సమయములో ఆతని వక్షస్సునకు నీ కుచస్పర్శ కలిగేటట్లుగా చేయి ! అని అంటూ చెలికత్తె, స్తనద్వయము నందు మకరికా పత్రలిపిని లిఖించుతూ ఉంటే ఆ వధువు ఏమీ అన లేక, సఖివచనము తనకు ఇష్టమె కాబట్టి కృత్రిమ కోపము తెచ్చుకొని సిగ్గుతో సాభిమానముగా చూస్తున్నదే కాని ఏమీ అనడము లేదు. ఆ విధముగా పలికిన చెలికత్తెను ఆ సమయంలో ఏమయినా అనవలసిందే కాని ఏమీ అన లేదు. అందువలన విహృతము.

౧౮. హసితము

అకస్మికం తు హసితం యౌవనాది వికారజం.

యౌవనము మొదలయిన వికారము వలన హసితము ఆకస్మికంగా ఉత్పన్నము అవుతుంది. యౌవన విక్రియ వల్ల అది అహేతుకంగా కలుగుతుందే కాని హాస్యములో మాదిరిగా వేషభాషాది వికార జన్యము కాదు. ఉదా:—

యథాయథా హసతి మృగాక్షీ యౌవనలక్ష్మ్యా శిక్షితా మధురం
తథాతథా కుసుమేషు శరా వికసంతి ప్రియస్యాశా చ

యౌవన లక్ష్మిచేత శిక్షించబడి ఆ మృగాక్షి ఎట్లా ఎట్లా మధురముగా నవ్వుతున్నదో ఆ యా విధముగా మన్మ

బాణాలు వికసించు తున్నవి. ప్రియ మనోరథము కూడా వికాసము పొందుతున్నవి. మృగాక్షి హసితము మదనోద్దీపకంగా ఉన్నది. ఆకస్మికమయిన యౌవనహాసము ఆ యువతిలో ఉన్నది. కాబట్టి హసితము. ఇట్లా ఈ విధంగా శృంగార భావాలు నిరూపితములు అయినవి. ఇప్పటికి రస సామగ్రి కూడా ప్రతి పాదింప బడినట్లే గ్రహించాలి.

## మన్మథావస్థలు

శృంగార బీజము పాదు కొల్పినప్పుడు ప్రధానముగా నాల్గు అవస్థలను భావించవచ్చును. ఒకటి అంకురితత్వావస్థ. వేరొకటి పల్లవితత్వావస్థ మరి ఒకటి కుసుమిత త్వావస్థ ఫలితత్వావస్థ నాల్గవది. అంకురించిన మొక్క చిగిర్చి పుష్పించి ఫలించడము ప్రసిద్ధము. అట్లాగే శృంగారము కూడా ఆశ్రయముగా ఉన్న వానిలో క్రమికములు అయిన అవస్థా భేదములను పొందుతుంది. ఈ అవస్థలు హేతువుగా ద్వాదశావస్థలు. కలవు. వానిని ఇక నిరూపించుతాము.

౧. చక్షుః ప్రీతి ౨. మనస్సంగము ౩. సంకల్పము
౪. ప్రలాపము ౫. జాగరము ౬. కృశత్వము
౭. అరతి ౮. లజ్జాత్యాగము ౯. జ్వరము
౧౦. ఉన్మాదము ౧౧. మూర్ఛనము ౧౨. మరణము

అని ఇవి పన్నెండు అవస్థలు. కామశాస్త్రానుసారముగా వీనిని ఇట్లా చెప్పవలసి వచ్చింది. అలంకార శాస్త్రములో వీని సంఖ్యలో కొంత భేదము ఉన్నది. మన్మథావస్థలు పది అని కొందరంటున్నారు. వీని స్వరూపోదాహరణములను ఈ విధముగా గ్రహించాలి.

### ౧. చక్షుః ప్రీతి

ఆదరా ద్దర్శనం చక్షుః ప్రీతి రిత్యభిధీయతే

ప్రత్యక్షముగా గాని చిత్రములో కాని స్వప్నములో కా సాదరముగా చూడడమునకు చక్షుః ప్రీతి అని పేరు. ఉదా:-

సఖి! ఏష రుద్రనృపో నయనయో రతర్కితోత్సవో జాతః
మదన ఇవ మూర్తిమాన్ చంద్ర ఇవ ముక్తలాంఛనః పూర్ణః.

ఓ! సఖీ! ఈ రుద్రనృపుడు నేత్రాలకు అతర్కితోత్స వము అయినాడు. శరీరమును ధరించిన మన్మథుడు వ కళంకమును విడిచిన పూర్ణచంద్రుని వలె నేత్రోత్సవ దాయ కుడై ఉన్నాడు. దీనిలో రాజ దర్శనమునందు ఆదరము క పడుతున్నది.

### ౨. మనస్సంగము

మనస్సంగః ప్రియతమే నిత్యం చిత్తస్య విశ్రమః.

నిత్యమూ కూడా ప్రియుని యందు చిత్తమునకు విశ్రాంతి ఉండడమునకు మనస్సంగము అని పేరు. ఉదా:-

సదా మమ మనో విలగతి రుద్రనరేంద్రే కస్మా త్కుపితాః
తేనాహ మపి విముక్తా సఖ్యః! యుష్మాసు కా వార్తా?

నా మనస్సు ఎప్పుడూ కూడా రుద్రనరేంద్రుని యందు లగ్నము అవుతున్నది. నేను కూడా ఆ మనస్సుచేత విముక్త బడినాను. మీరు ఎందుకు కోపపడుతారు? సన్నిహితురాలై నయిన నా సంగతే ఇట్లా ఉంటే వ్యవహితముగా ఉన్న మీ విషయమై ఇంకా ఏమి చెప్పవలెను. అందువలన మీరు నన్ను ఏమీ అనవద్దు.

### ౩. సంకల్పము

సంకల్పో నాథవిషయో మనోరథ ఉదాహృతః.

ప్రియుడు విషయముగా ఉన్న కోరికకు సంకల్పము అని పేరు. మనస్సులో ఏ యే కోరిక పుట్టినా దానికి అంతకూ ప్రియుడే విషయముగా ఉండాలి. ఉదా:—

దరహసిత గర్భితాని స్నేహ స్నిగ్ధాని రాగభరితాని
రుద్రనృపవిలోకితాని కదాను మయి నిపతంతి?

మధుర మందస్మితము గర్భితముగా ఉన్నట్టిన్ని, సంభోగౌత్సుక్యము సూచనము చేయునట్టిన్ని, ఆర్ద్రాంతః కరణము కలిగి ఉండడము వలన స్నిగ్ధములుగా ఉన్నట్టిన్ని స్నేహ ప్రకర్ష రూపమయిన రాగముతో భరితములైనట్టి రుద్ర నృపుని విలోకితములు నాపై ఎప్పుడు ప్రసరించుతవో కదా! దీనిలో ప్రియ విలోకితముల కాంక్ష అధికముగా ఉన్నందువలన సంకల్పము.

## ౮ ప్రలాపము

ప్రలాపః ప్రియసంశ్లిష్ట గుణాలాపఉదాహృతః

ప్రియునియందు కూడుకొన్న గుణాలను గురించి సంలాపము చేయడము ప్రలాపము అవుతుంది. ప్రియుని గుణస్తవమె దీని రూపము అన్నమాట. ఉదా:—

తథా నిపుణ స్తథా మధుర స్తథా సుభగ స్తథాచ సౌమ్యస్వభావః
ఏకో రుద్రనృప ఏవేతి గోష్ఠీ ప్రౌఢమహిళానాం.

అట్లా నిపుణుడు అట్లా మధురుడు ఆవిధముగా సుభగుడూ అట్టి సౌమ్య స్వభావుడూ అయినవాడు ఒకరుద్రనృపుడే అని ప్రౌఢ మహిళల గోష్ఠి. దీనిలో నిపుణత్వాది గుణములు ఉన్నందువలన ప్రతాపరుద్రుడే మనలకు అభిగమ్యుడు అని ప్రౌఢాంగనలు ప్రసంగము చేస్తున్నారు. అందువలన ప్రలాపము

## ౧. చక్షుః ప్రీతి

ఆదరా ద్దర్శనం చక్షుః ప్రీతి రిత్యభిధీయతే

ప్రత్యక్షముగా గాని చిత్రములో కాని స్వప్నములో కాని సాదరముగా చూడడమునకు చక్షుః ప్రీతి అని పేరు. ఉదా:—

సఖి! ఏష రుద్రనృపో నయనయో ఽతర్కితోత్సవో జాతః
మదన ఇవ మూర్తిమాన్ చంద్ర ఇవ ముక్తలాంఛనః పూర్ణః.

ఓ! సఖీ! ఈ రుద్రనృపుడు నేత్రాలకు అతర్కితోత్సవము అయినాడు. శరీరమును ధరించిన మన్మథుడు వలె కళంకమును విడిచిన పూర్ణచంద్రుని వలె నేత్రోత్సవ దాయకుడై ఉన్నాడు. దీనిలో రాజ దర్శనమునందు ఆదరము కన పడుతున్నది.

## ౨. మనస్సంగము

మనస్సంగః ప్రియతమే నిత్యం చిత్తస్య విశ్రమః.

నిత్యమూ కూడా ప్రియుని యందు చిత్తమునకు విశ్రాంతి ఉండడమునకు మనస్సంగము అని పేరు. ఉదా:—

సదా మమ మనో విలగతి రుద్రనరేంద్రే కస్మా త్కుపితాః
తేనాహ మపి విముక్తా సఖ్యః! యుష్మాసు కా వార్తా?

నా మనస్సు ఎప్పుడూ కూడా రుద్రనరేంద్రుని యందు లగ్నము అవుతున్నది. నేను కూడా ఆ మనస్సుచేత విడువ బడినాను. మీరు ఎందుకు కోపపడుతారు? సన్నిహితురాల నయిన నాసంగతే ఇట్లా ఉంటే వ్యవహితముగా ఉన్న మీ విషయమై ఇంకా ఏమి చెప్పవలెను. అందువలన మీరు నన్ను ఏమీ అనవద్దు.

## ౩. సంకల్పము

సంకల్పో నాథవిషయో మనోరథ ఉదాహృతః.

ప్రియుడు విషయముగా ఉన్న కోరికకు సంకల్పము అని పేరు. మనస్సులో ఏ యే కోరిక పుట్టినా దానికి అంతకూ ప్రియుడే విషయముగా ఉండాలి. ఉదా:—

దరహసిత గర్భితాని స్నేహ స్నిగ్ధాని రాగభరితాని
రుద్రన్నృపవిలోకితాని కదాను మయి నిపతంతి?

మధుర మందస్మితము గర్భితముగా ఉన్నట్టిన్ని, సంభోగౌత్సుక్యము సూచనము చేయునట్టిన్ని, ఆర్ద్రాంతః కరణము కలిగి ఉండడము వలన స్నిగ్ధములుగా ఉన్నట్టిన్ని స్నేహ ప్రకర్ష రూపమయిన రాగముతో భరితములైనట్టి రుద్ర నృపుని విలోకితములు నాపై ఎప్పుడు ప్రసరించుతవో కదా! దీనిలో ప్రియ విలోకితముల కాంక్ష అధికముగా ఉన్నందువలన సంకల్పము.

## ౮ ప్రలాపము

ప్రలాపః ప్రియసంశ్లిష్ట గుణాలాపఉదాహృతః

ప్రియునియందు కూడుకొన్న గుణాలను గురించి సంలాపము చేయడము ప్రలాపము అవుతుంది. ప్రియుని గుణ స్తవము దీని రూపము అన్నమాట. ఉదా:—

తథా నిపుణ స్తథా మధుర స్తథా సుభగ స్తథాచ సౌమ్యస్వభావః
ఏకో రుద్రనృప ఏవేతి గోష్ఠీ ప్రౌఢమహిళానాం.

అట్లా నిపుణుడు అట్లా మధురుడు ఆవిధముగా సుభగుడూ అట్టి సౌమ్య స్వభావుడూ అయినవాడు ఒకరుద్రనృపుడే అని ప్రౌఢ మహిళల గోష్ఠి. దీనిలో నిపుణత్వాది గుణములు ఉన్నందువలన ప్రతాపరుద్రుడే మనలకు అభిగమ్యుడు అని ప్రౌఢాంగనలు ప్రసంగము చేస్తున్నారు. అందువలన ప్రలాపము

౫. జాగరము

జాగరస్తు వినిద్రతా ......

నిద్రలేక పోవడమునకు జాగరము అనిపేరు. రాగ కృతముగా కలిగిన చింతావ్యాకులత్వము వల: పట్టదు. దానికే జాగరము అనిపేరు ఉదా:—

గమితం కథంకథమపి దినం చంద్రాతప దుస్సహా నిశా దీర్ఘ
మదనోపి పుంఖితశరో నిద్రాపి నృపోపి నోపైతి.

· పగటి సమయమును ఏదో విధముగా గడిపాను. చ పము చేత నిశ దీర్ఘము ఉన్నది. రాత్రి గడవుటకు ? కాకుండాఉంది. మన్మథుడు కూడా బాణాలను ఎక్కు ఉన్నాడు. నిద్రకూడా రాదు. రాజున్నూ రాడు. స్వప్న · గమానికి పరిపంథిగా ఉన్న జాగర హాతకుడే జాగి తున్నాడు. దీనిలో వినిద్రత స్పష్టము.

౬. కార్శ్యము

..................కార్శ్య మంగస్య తానవం

శరీరము కృశించి పోవడమునకు కార్శ్యము అనిపేరు.

చంద్రాస్యే కథ మంగుళీయక మిదం కేయూరితం తే సఖి
ప్రేష్ణాం ప్రేయసి వైభవైః స ఖలు కః! భూమే స్సపత్నీ
జ్ఞాతం మానిని కాకతీయనృపతౌ సక్తాసి సత్యం శుభే!
శ్యామాంగీం స ఖలు స్థిరాం రమయతే త్వాం తాం చ ...

ఈపద్యములో ఇద్దరి సంభాషణము ఉన్నది. ... అంటున్నది. ఓ! చంద్రాస్యా! ఈఉంగరము నీకు ... ముగా అయిందేమి? ఇంతగా నీవు ఎందువలన చిక్కి ... నావు అనిభావము. నాయిక అంటున్నది సఖీ! ప్రియుని యమైన ప్రేమవైభవములచేత ఇట్లా కావలసి వచ్చింది

పలుకుతున్నది. ఆతడు ఎవడగునో? నాయిక : ఎట్లా అయితే భూమికి సవతిని కాగలుగుతానో ఆతడు. సఖి! మానినీ! తెలిసినది లే! కాకతీయ నృపతియందు అనురక్తురాలవు అయినావు. ఓ! శుభాంగీ! నాయీ ఊహ సత్యము ఆతడు శ్యామాంగి స్థిర శైల స్తని అయిన నిన్ను ఆభూమినిన్నీ రమించునులె భూ సదృశురాలవైన నిన్నుకూడా ఆతడు అదేవిధముగా ఉపభోగముల చేత లాలించుతాడు. భూమినల్లగా ఉండి స్థిరమైనదై స్తనాయమాన శైలములు కలదై ఉంటుంది. ఈనాయిక శ్యామ యౌవన మధ్యస్థ స్థిరానురాగ శైల సదృశ స్తని అనే ఈ అర్థము దీనిలో స్పష్టము అవుతున్నది. అంగుళీయకము కేయూరము కావడము దీనిలో నిరూపితమయింది కాబట్టి కార్శ్యమును ఊహించాలి.

౭. అరతి

అన్యత్రాప్రీతి రరతిః

ప్రియుని కంటె అతిరిక్తము లయిన విషయములందు ప్రీతి లేక పోవడము అనగా వైరాగ్యము ఉండడము అరతి అవుతుంది. ఉదా:—

దూషయతి చంద్రసృష్టిం నిందతి మలయానిలస్య మాహాత్మ్యం
ఉత్సవ పరాఙ్ముఖీ సా సుభగ త్వం కిం ను మంత్రయసే?

ఓ! సుభగా! ఆమె ఉత్సవ పరాఙ్ముఖి అయింది. చంద్రసృష్టిని దూషిస్తున్నది మలయానిల మాహాత్మ్యమును నిందించుచున్నది. ఇంకా ఏమి ఆలోచిస్తున్నావో? ఇతరములందు ఆమెకు ఏమీ కూడా ఆసక్తి లేదు. నిన్నే నమ్మి నీపొందు లేనందువలన విరహార్త అయి ఈ విధంగా చేస్తున్నది. దీనిలో అరతి సమన్వయము స్పష్టము.

## శృంగార నిరూపణము

శృంగారము రెండు విధాలు. సంభోగ శృంగారము విప్ర లంభ శృంగారము అని. సంయుక్త యోస్తు సంభోగో విప్ర లంభో వియుక్తయోః" అని శృంగార తిలకములో రుద్రభట్టు చెప్పుతున్నాడు. నాయికా నాయకులు సంయుక్తులు అం ఉన్నట్లయితే వారి అనురాగము సంభోగ శృంగారము అ తుంది. వారు వియోగము పొంది ఉన్నట్లయితే విప్రలంభ శృంగారము అవుతుంది అని దాని భావము. సంభోగములో అవాంతర విభాగాలు చాలా ఉన్నవి. నాయికా నాయకుల యొక్క పరస్పరావలోకనము అన్యోన్య సంభాషణముల ఒకరొకరి ఆలింగనములు వారి వీరి చుంబనాదులూ ఇట్లా అనేక వ్యాపారములు సంభోగములో ఉన్నవి. పురుషుల స్త్రీ విశేషాలను అనుసరించి దేశ స్వభావ కాలాది విశేషాలన బట్టిన్నీ ఈ వ్యాపారములు అనంత భేదములను పొందుతున్న ఇందులో కూడా సమరతములు నీచరతములు ఉచ్చరతముల వీని పరిస్థితి అన్నిటినీ గణనము చేయడము శక్యము కాదు ఇట్లా సంభోగము అనంతము అవుతున్నది. అందువలన అది ఒకే విధమని గణనము చేయడము ఉచితమే

### సంభోగ శృంగారము

రహఃప్రత్యాసన్నే హృదయదయితే రుద్రనృపతౌ
నివృత్తా మానాజ్ఞా విరళమపి లజ్జావిలసితం
కి మన్య త్తే గోప్యం బహిరబహి రానంద మసృణః
స్మరావేశః కోపి ప్రియసఖి! నృపేజ్జైకయతి మాం.

హృదయ దయితుడు అయిన రుద్రనృపతి రహః ప్రదేశము నకు రాగా కోప కృతముగా కలిగిన ఆజ్ఞ అంతాపోయింది.

లజ్జావిలసితము కూడా విరళము అయింది. సురత సమయములో స్త్రీలకు ప్రాగల్భ్యమే భూషణము అప్పుడు సిగ్గు చమత్కారకము కాదు. ఓ! ప్రియసఖీ! నీకు ఇంకా దాచదగినది ఏమి ఉంది? లోపల వెలుపలా అంతటా ఆనంద మసృణము అయిన ఏదో స్మరావేశము నన్ను ఆ నృపునితో ఏకము చేస్తున్నది. ఈ పద్యములో లజ్జామానములు పోవడము వలన మర్యాదను దాటిన విమర్దము కలిగి ఉంటుంది. అని గోచరము అవుతున్నది. ఈ పద్యములో దయితుడు ఆలంబన విభావము రహః ప్రదేశము ఉద్దీపనము. హర్షాదులు వ్యభిచారులు స్తంభాదులు అనుభావములు. వీనిచే సముల్లాసము పొందిన రతిస్థాయి శృంగార రసత్వమును పొందుతున్నది. నాయికా నాయకుల యొక్క సంభోగాంగములయిన ఆలింగనాది వ్యాపారములు "బహిరబహిరానంద మసృణః స్మరావేశః కోఽపి" అనే పద్యాంశము వలన వ్యంగ్యము లవుతూ ఉన్నవి.

## విప్రలంభ శృంగారము

విప్రలంభ శృంగారము అభిలాష హేతుకము, ఈర్ష్యా హేతుకము, విరహ హేతుకము, ప్రవాస హేతుకము అని నాలుగు విధాలు అవుతున్నది.

## అభిలాషము

వానిలో అభిలాషము అనగా; నాయికా నాయకులకు సంభోగము కలుగక పూర్వము ఉన్న అనురాగము. దీనికే అయోగము అని పూర్వానురాగము అని పేరు. సంభోగానుభవానికి పూర్వము నానా విధము లయిన అభిలాషలు ఉప్పొంగుతూ ఉంటవి. ఆ అభిలాషము హేతువుగా కలిగిన విప్రలంభము అభిలాష విప్రలంభము అవుతున్నది. ఉదా:—

అన్యోన్యభాషణ మనంగ విలాసగోష్ఠీ
శయ్యా చ సార్థ మపదాని మనోరథానాం
ప్రేమానుబంధ ముదయ ద్బహులానురాగం
లభ్యేత రుద్రనృపతే రవలోకితం వా.

అనురాగము కల ఒక కన్య ఈ విధముగా భావించుచున్నది: ఇష్టాలాప రూపమయిన అన్యోన్య భాషణము కాని నర్మకథా ప్రసంగము కాని సహశయ్య కాని నా మనోరథాలకు స్థానము కావు కదా! మనస్సులో నయినా అవి కలుగుతవని ఊహించడానికి అవకాశము లేదు కదా! ప్రేమానుబద్ధ మయిన ఉత్పన్న మవుతూ అభివృద్ధి పొందుతూ ఉన్న అనురాగము కలిగిన ఆ రుద్రనృపతి విలోకనమయినా లభించునా? దీనిలో ప్రాగనురాగము స్పష్టమె.

ఈర్ష్య

నాయకుడు ఇతర నాయికయందు ఆసక్తుడు కావడమును దర్శన శ్రవణానుమానముల చేత తెలిసికొని అది కారణముగా కోప రూపమయిన చిత్త విక్రియ కలిగి ఉండడము ఈర్ష్య అవుతుంది. ఈ ఈర్ష్య స్త్రీలకే కలుగుతుంది గాని పురుషులకు కలుగదు. ఇటువంటి ఈర్ష్యాహేతుకముగా విప్రలంభము ఉదయించుతుంది. ఉదా:—

లక్ష్మీ రస్య విలోచనాబ్జవసతిః సేర్ష్యా త్వదాలోకనే
వక్త్రస్థా చ సరస్వతీ న సహతే సాకం త్వయా భాషణం
లీలాకర్షణ విఘ్నకృత్ త్వయి మహీ వాహూస్థితా కాకతి
క్షోణీంద్రే న హి కైతవాని సుభగే మానేన కిం తామ్యసి.

ఈతని నేత్ర పద్మ నివాసము కలిగిన లక్ష్మీదేవి నిన్ను చూడడములో ఈర్ష్య కలిగి ఉన్నది. ముఖమందున్న సరస్వతి

కూడా నీతోపాటు భాషణమును సహించడము లేదు. బాహువునందున్న మహి (భూమి) నీ విషయమై లీలాకర్షణములో విఘ్నము కలుగ చేస్తున్నది. ఇంతే కాని ఓ! సుభగా! కాకతివల్లభుని యందు కైతవాలు లేవు. నీవు కోపము చేత ఏల బాధపడుతావు? దీనిలో నాయకుడు లక్ష్మి మొదలుగా గల స్త్రీలయందు ఆసక్తి కలిగి ఉన్నాడని నాయికకు ఈర్ష్య ఉన్నది. ఈ ఈర్ష్య కారణముగా ఆమె విప్రలంభము అనుభవించుతున్నది.

## విరహము

సమాగమము పొందిన నాయికా నాయకులకు మళ్ళా సమాగమానికి కాలాతిక్షేపము ఉండేటట్లయితే విరహము అవుతుంది. కాలాతిక్షేపములో ఇతర నాయికా సంగమము కారణము కాదు. ఇది నిర్నిమిత్తంగానే కలిగే విప్రయోగము ఇది స్త్రీ పురుషులకు ఇద్దరకూ కలుగవచ్చు. స్త్రీ విరహానికి ఉదా:—

అంగేషు జీర్ణేషు విభూషణానాం
వ్యత్యాస మార్గోపి మహానర్తశోభీ
సఖ్య స్తదాస్తాం పరికర్మరీతిః
ఆనీయతాం రుద్రనృపశ్చ కిమన్యత్.

అవయవాలు కృశించేపోతే వానియందు విభూషణాల వ్యత్యాస మార్గముకూడా క్షణకాలము శోభించేది గానే ఉంటుంది. ఓ! చెలియలారా! ఈఅలంకార పద్ధతిని ఇకఆపి పెట్టండి.మానివెయ్యండి. ఇతర కార్యాలు ప్రయోజనకారులు కావు. అవన్నీ విలంబన హేతువులు. కాబట్టి రుద్రనృపుణ్ణే తీసికొని రండి. సమన్వయము స్పష్టము,

## ప్రవాసము

నాయికా నాయకులు దేశాంతరమందు ఉండడము ప్రవాసము అవుతుంది. నాయిక ఒకచోట నాయకుడు వేరొక చోటా ఉండడము అయినట్లయితే ప్రవాసము అనిభావము ఆప్రవాసము హేతువుగా కలిగే విప్రలంభో దాహరణము!

సేవ్యోఽస్తు రుద్రనృపతిః నిఖిలై ర్నృపాలైః
అభ్యుత్సవేషు సులభా న హి వల్లభా నః
ఇత్థం కలింగసుదృశాం నిరహార్తితాపా
దంగాని యాంతి తనుతాం దివసా యుగంతి,

సర్వనరపాలురకూ రుద్రనృపతి సేవ్యుడు అవుగావుత. ఉత్సవదినాలలో కూడా మావల్లభులు మాకు సులభులు కాలేదే! అకించనులు కూడా ఉత్సవ దినాలలో ప్రియులను ఆదరించు కొంటారు. మాకు ఆభాగ్యము లేదే! ఈవిధంగా కళింగదేశ స్త్రీలకు విరహ బాధా పరితాపముల వలన అంగములు కృశించిపోతున్నవి. దినములు యుగములు అవుతున్నవి దీనిలో దేశాంతర వృత్తిత స్పష్టమె.

## రసాభాస

రసాభాస మూడు విధాలని ఇదివరలోనే చెప్పబడింది. తిర్యగ్గతమయిన రసాభాసకు ఇది. ఉదా:—

ప్రాసాదగర్భ వలభీషు కపోతపాల్యాం
పారావతీం రమణచుంబిత చంచుకోటిం
ఆవిర్భవ త్సురతకూజిత రక్తకంఠీం
ఆలోక్య కాకతివిభుః స్మిత మాతనోతి,

సౌధ మధ్యభాగములోని చూరులలో కపోతపాళియందు ఒకమగ పావురము తన పారావతీ చంచుకోటిని చుంబనము

చేసికొన్నది. అప్పుడు ఆఆడుపావురము సురత కూజితము ఉదయించగా మధురస్వనము కలదైనది. దానిని చూచి. కాకతి ప్రభువుస్మితముచేస్తున్నాడు. దీనిలో పారావతముల ప్రణయము రసాభాసము అయింది. పారావతాలకు కలా కౌశలము లేదు. అందువలన వాని శృంగారానికి విభావాది పరిపూర్తి ఉండదు. కాబట్టి ఇది ఆభాస అవుతుంది. కొందరు ఇదికూడా రసమె కాని ఆభాస కాదంటారు. విభావాదులు ఉండడమె రసత్వ ప్రయోజకము కాని విభావాది జ్ఞానము రసత్వ ప్రయోజకము కాదు ఇది విభావము ఇదిఅనుభావము ఆనేజ్ఞానము వానికి ఉండనక్కరలేదు. కాబట్టి తిర్యక్కులకు కూడా రసము ఉండనేఉంది. అంటున్నారు

## భావోదయము

భావము ఉదయమయినట్లు వర్ణించి నట్లయితే భావోదయము అవుతుంది. భావోదయాదుల లక్షణములు ఇదివరలో నిరూపింప బడినవి. ఉదా:—

ముగ్ధే! క స్తవ వ ర్తతే హృది మనోజన్మైవ నాన్య శ్శపే
సఖ్యై తస్య కిమత్ర కార్య మపరం కిం జన్మ సద్మాదరః
కోన్య స్తత్ప్రతిబింబ ఏవ నిపుణే! జానాసి కామాధికః
ప్రేమాశ్రు ద్రవ్యప స్తవేతికథితా న్యమాననాథాద్వధూః.

ఇది సంభాషణాత్మకమయిన పద్యము నాయికా సఖుల భాషణము.

సఖి:—ముగ్ధా ! నీ హృదయములో ఎవరు ఉన్నారు ?

సుందరి:—మనో జన్ముడే నే! ఇతరుడు ఎవరూ కాదు. ఒట్టు వేసికొని చెప్పుతున్నాను నమ్ము.

సఖి:—సఖీ ! ఆతనికి నీహృదయములో ఏమిపని ఉన్నదమ్మా?

ఆతడు ఇక్కడ ఉండి చేయవలసిన పని ఏమిటి?

సుందరి:—అయ్యో! ఇంకా ఏమి పని ఉంటుందే? అది అంతా జన్మ సద్మ పుట్టినిల్లు పై ఆదరము అందు వలననే ఆతడు ఇక్కడ ఉన్నాడు.

సఖి:—సరే! కాని, వేరొకరు ఎవరో ఉన్నట్లున్నారే! ఆ ఇతరుడు ఎవరు?

సుందరి:—ఆఁ ఎవరో కాదు. ఆతని ఆ మన్మథుని ప్రతిబింబమె

సఖి:—ఓసి! గడుసూ! నిపుణురాలవె! మమ్మల్ని అందరినీ వంచనము చేయడము ఎరుగుదువే! మన్మథుని కంటె నీకు అధికుడయిన ప్రియుడయిన రుద్రనృపుడు కాదా? ఆ రెండవ యాతడు?

అని సఖి పలికింది. ఇట్లా ఆమె పలికే టప్పటికి ఆ వధువు నమ్రానన అయింది. దీనిలో నాయిక నమ్రానన కావడము వలన ఆమెకు లజ్జ ఉదయించిందన్నమాట అందువలన భావోదయము.

భావశమము

భావము శమించుట భావశమమె. ఒక భావము శమించి నపుడు వేరొకటి తప్పకుండా ఉదయించుతుంది. ఇట్లాగే భావోదయములోకూడా తదితర భావము శమించుతుంది, ఒక్కొక్క స్థలములో రెండు రెండు భావాలు తప్పవు. అయినా ఉదయ దవస్థతో కూడుకొన్న భావము చమత్కారకము అయినప్పుడు భావోదయ మని పేరు. శామ్యదవస్థతో కూడు కొన్న భావము చమత్కారక మయినప్పుడు భావశాంతి అని వ్యప దేశము. ఉదా:—

లక్ష్మీ స్త్వం పురుషోత్తమ స్త్వ పతిః శ్రీవీరభద్రో నృపః
సృష్ట్యా సంబుజసంభవస్య కద్భుతో హ్యేగ శ్చిరా స్సంభృతః
తస్మా త్కృత్రిమ మస్యసాంప్రతి మిదం వాల వైమనస్యం మనా
గిత్యాలిం ప్రణతాం విలోక్య వికస ద్వక్త్రాంబుజా మానినీ

నీవు మహాలక్ష్మివి నీ పతి అయిన వీరభద్ర నృపుడు పురుషోత్తముడు. బ్రహ్మ సృష్టిలో చాలా కాలానికి సదృశులయిన మీకు సంబంధము సంపాదితమయింది. అందువలన కొంచెమయినా కృత్రిమంగా నయినా మీకు ఏ మాత్రమూ వైమనస్యము తగదు. అని పలికి చెలికత్తె నమస్కరించింది. ప్రణతురాలయిన ఆమెను చూచి మానిని అయిన ఆ నాయిక వికసించిన వక్త్రాంబుజ అయింది. దీనిలో నాయికకు కోపము శమించిందని ముఖ ప్రసన్నత వలన తెలుస్తున్నది. ఇక్కడ ప్రసన్నత అనే భావము పుట్టినట్లున్నా కోపశాంతియే చమత్కారకము.

భావసంధి

ప్రతాపరుద్రస్య దిగంత జైత్ర
యాత్రా ప్రభూతైః పటహ ప్రణాదైః
ప్రియానులాపైశ్చ తథా భటానాం
రోమాంచవర్మాప్యభి దంగ మాసీత్.

ప్రతాపరుద్రునకు సంబంధించిన దిగంత జైత్రయాత్రలో ఉత్పన్నములు అయిన పటహ ప్రణాదముల చేతను, ప్రియురాండ్ర యొక్క అనురాగ తరంగితము అయిన అనులాపముల చేతనూ యుద్ధభటుల అంగములు రోమాంచమనే కవచముచే సమావృతములు అయినవి. పటహనాదం వింటూ ఉంటే వీరోత్సాహం అతిశయించి యుద్ధము చేయాలన్న

సంకల్పమూ ప్రియానులాపములను వినేటప్పటికి రతి భావమయిన హర్షము ఉదయించగా ప్రియాలింగనాభిలాష కలగడమూ సంభవించింది. ఈ పద్యములో వీరశృంగారములకు సంబంధించిన రెండువిధములయిన హర్షములు పరస్పరము విరుద్ధములై స్పర్థతో, (అంటే, దానిని అణచ వలెనని ఇదీ దీనిని అణచవలెనని అదీ స్పర్థకలిగి ఉండడము అన్నమాట.) సంబంధము కలిగి ఉన్నట్లుగా వర్ణింపబడి నందువలన భావసంధి ఆస్వాద్యము అవుతున్నది.

భావ శబలత

నిందం త్వద్య కులస్త్రియః ప్రియతమో లభ్యః సుఖం కేన వా
భాగ్యేనానుమతం న కిం గురుజనైః కా వా సఖీ ప్రేష్యతే?
కిం లోకస్య భవేత్ప్రసిద్ధి? మచిరా త్స్వచ్ఛంద మంకం కదా
రోక్ష్యామి? స్థిరతా కదా హృది భవే? ద్యాతవ్య ఏవ ప్రియః.

నేను ఇప్పుడు ప్రియుని గురించి బయలు దేరాలని అనుకుంటున్నాను. ఈ సమయములో నేను చేసే పని ఉచితమయినది కాదని కులస్త్రీలు నిందచేస్తారు కాబోలు! ఈ వాక్యమువలన లజ్జ వ్యజ్యమానము అవుతున్నది. ప్రియతముడు ఏ భాగ్యము చేత సులభముగా లభ్యమవుతాడో? ప్రియ సౌలభ్యములో ఏ భాగ్యము నిమిత్తము అవుతుందో? ఈ వాక్యమువలన విమర్శ మూలకమయిన వితర్కము గోచరము అవుతున్నది. ఈ వితర్క-భావము పూర్వపు లజ్జాఖ్య భావమును ఉపమర్దనము చేస్తున్నది. ఈ వితర్కమునకు ఉపమర్దకంగా వేరొక భావము నిర్దిష్టము అవుతున్నది. నేను ఇప్పుడు ఆచరింప దలచిన పని గురుజనులచేత అంగీకృతము కాదల్లె ఉంది. దీన్ని వాళ్ళు అంగీకరింప వలసిందేనే! ఎందు

వలన అంగీకరించ లేదో? ఈ వచనములో కార్పణ్యము కన పడుతున్నందు వలన దైన్యము ధ్వన్యమానము అవుతున్నది. ప్రియుని తీసికొని రావడమునకు ఏ సఖిని పంపించేది? ఈ వాక్యము "గురు జనులకు ఇష్టము కాదే! నేను ఈ పని చేయరాదు కాబోలు" అనే పూర్వ భావానికి ఉపమర్దకంగా ఉన్నది. దీనివలన ప్రారంభించిన కార్యమును నిర్వహించక పోవడము అనే విషాదము వ్యంగ్య మవుతున్నది. దీనికి ఉప మర్దకంగా ఈ శంకాభావము గోచర మవుతున్నది. నేను ఇప్పుడు ఆచరించే ఈ దుర్వినీతి వైభవము అంతా లోకానికి ప్రసిద్ధము అవుతున్నదేమో?" దీని తరువాత "అబ్బా! ఎప్పుడెప్పుడు స్వేచ్ఛగా ఆయన అంకమును అధిరోహించు తానో కదా!" అనే దీనిలో కాలాక్షమ త్వరూప మయిన నిజౌత్సుక్యము గోచర మవుతున్నది. "అబ్బే! ఈ ఊహ అంతా అసముచితంగా ఉన్నది. ఇటువంటి భావాలు కలుగ కుండా నాహృదయములో స్థిరత ఎప్పుడు కలుగుతుందోకదా!" ఈ వాక్యములో ధృతి. దీనికి ఉప మర్దకంగా "ఇక నేను ఆగ లేను. ప్రియుణ్ణి గురించి తప్పకుండా అభి సరించాలిసిందే" అనే వాక్యములో మతి వ్యజ్యమాన మవుతున్నది. ఇట్లా ఈ స్థలములో ఈ ఎనిమిది భావాలూ అన్యోన్యోపమర్దకంగా సమావేశము పొంది ఉండడము వలన భావ శబలత అవుతుంది. తుట్ట తుదకు మతి ప్రధానముగా చర్వ్యమాణము అవుతున్నప్పటికీ మధ్యలో ఉపమర్దకము లయిన భావాల వలన కలిగే చమత్కారము కూడా వ్యామిశ్రితమై ఉన్నది. ఈ పద్యములో ఔత్సుక్యాదులకు శబలత్వము ఉన్నదని విద్యానాథుడు మూలములో వ్రాస్తున్నాడు. పద్యములో లజ్జ

మొదట నిరూపింప బడింది. ఔత్సుక్యము మొదట నిరూపితము కాలేదు. అయినప్పటికీ లజ్జాది భావములు ఔత్సుక్యమును ముఖ్యముగా చేసికొని సూచించడమునకు నాథుడు ఆ విధముగా చెప్పి ఉంటాడని ఊహించాలి.

## రస సంకరము

ఇప్పటికి భావముల మేళనము వలన కలిగే చమత్కారము ప్రదర్శిత మయింది. ఇట్లాగే రస మేళనము కూడా ప్రదర్శించడము ఉచితము కాబట్టి రససంకరమును ఉదాహరించాలి. అందు శృంగార కరుణములకు సంకరము ఉన్న. ఉదా:—

ఆసన్నేపి మహోత్సవే కథ మిత స్త్యక్త్వా ప్రవాసం వ్రజేః
ధిక్ 'ధిక్' సాహస మావయో ర్విఘటనం కోవా విధిః కాంక్షతి
ఇత్థం స్వప్ననివారిత ప్రియతమ ప్రస్థాన బుద్ధి స్తతో
బుద్ధ్వా మూర్ఛతి కాకతీయనృపతే! త్వద్వైరినారీజనః.

కావ్యప్రకరణములో దీని భావము నిరూపిత మయినది. ఈ పద్యములో శృంగార సంకీర్ణమయిన కరుణము ప్రతిపాదితము. రౌద్రబీభత్సములకు సంకరోదాహరణము.

పీత్వా మాంసోపదంశం ద్విరద గలగలద్రక్త మైరేయధారాం
మత్తో మస్తిష్కలగ్న స్ఖలిత నృపవపుః కీకసైః స్పష్టదంష్ట్రైః
బిభ్రద్రౌద్రాంత్రమాలాం జనిత జనభయో భైరవాకార ఘోరః
సంగ్రామోర్వ్యాః కలింగై ర్బలివిధి మకరో వీరరుద్రస్య ఖడ్గః.

వీర రుద్రఖడ్గము సంగ్రామ భూమికి కలింగుల చేత బలి విధిని ఏర్పాటు చేసింది. కలింగ దేశీయులను బలిగా పెట్టింది. ఇక ఈ పద్యములో ఆ ఖడ్గవర్ణనము ఉన్నది. ఆ ఖడ్గము ఏనుగుల గళమునుండి ప్రవహించుతూ ఉన్న రక్తమనే మద్యధారను మాంసములో నంజుకొంటూ పానము చేసింది. బాగా

మదించింది. శత్రురాజ శరీరములను దళనము చేయగా మస్తిష్కములో కూడుకొన్న సన్నని ఎముకలు ఖడ్గాగ్రములో కలుసుకొన్నవి. అప్పుడు ఆ ఖడ్గము కోరలను సృజించుకొన్నట్లుగా ఉన్నది. రౌద్రమయిన ఆంత్రమాలను (ప్రేవులు) ధరించుతున్నది. ఇట్లా ఉన్న ఆ ఖడ్గము కాలభైరవాకారము కలదై మహాఘోరముగా జనులకందరకూ భయము కలుగజేస్తున్నది.

ఈ చెప్పిన రెండు ఉదాహరణములలో మొదటి శ్లోకములో కరుణము రెండవదానిలో రౌద్రమూ చరమ విశ్రాంతి ధామముగా చర్వణా గోచరము అవుతున్నది. ఆస్వాదనములో అవే ముఖ్యముగా భాసించుతున్నవి శృంగార బీభత్సములు రెండూ ఆ రసాలకు ఆ ఉదాహరణములలో ఉపస్కారములై అంగిభూతములు గాఉన్నవి. ఈ అంగభూతముగా ఉన్న రసములు పరిపోషము పొంది ఉన్నవా? పరిపుష్టములు కాలేదా? పరిపుష్టము అయినట్లయితే ఉపస్కార్యములు కావాలి కాని అంగములు కావు కదా! పరిపోషము పొందక పోయినట్లయితే రసత్వమె సిద్ధము కాదే? కాగా రసాలకు సంకరము ఉన్నదని అనడము ఎట్లా కుదురుతుంది? అని సందేహము కలుగవచ్చును. కాని పరిపోషము ఉన్నప్పటికీ ఒకొక్కరసము ఒకొక్కదానికి ఒకొక్కప్పుడు ఉపస్కారకముగా ఉండవచ్చును. అంగము కావచ్చును. ఒక రసము తన విభావాదుల వలన పరిపోషము పొంది చమత్కారక మయినా దాని చమత్కారము అంతలోనే విశ్రాంతి పొందదు. వేరొక చమత్కారమును అది అనుధావనము చేస్తుంది. ఈ రెండు చమత్కారముల

సమ్మేళనంలో అంగాంగి భావత అవిరుద్ధముగా ఉండవచ్చును అని ప్రాచీనాచార్యులు అంగీకరించు తున్నారు.

ఈ రసముల లౌకికత్వము ఒక్కొక్క చోట స్వాభావిక మవుతుంది. వేరొకచోట ఆరోపిత మవుతుంది. ఈవిశేషము లను ఇతర స్థలములలో గ్రహించేది. ఈ విధముగానే యథా సంభవముగా ఉదాహరించి గ్రహింప వలెను.

## లౌకిక రసము

ఈ రసము లౌకిక మని అలౌకిక మని రెండు విధాలు. వానిలో లౌకిక రసము కదలీరసాలాది ఫలములను ఆస్వాదించే టప్పుడు కలిగే ఆనందముతో సదృశ ముగా ఉంటుంది. ఇది కార్యమున్నూ అవుతుంది. రెండవది అయిన అలౌకిక రసము బ్రహ్మానంద సబ్రహ్మచారి నిత్యమూను. లౌకికరసమునకు అనుకార్యులు అయిన రామాది నాయకులు ఆశ్రయముగా ఉంటారు. ఇది వారినే ఆశ్ర యించి ఉంటుంది. కాని ఇతరులను ఆశ్రయించి ఉండదు. ఆ రామాది నాయకుల యొక్క ధీరోదాత్త త్వాదికము లయిన అవస్థలను నటుడు తనయందు ఆరోపించుకొని అభ్యాస పాటవము వలన నిపుణము లయిన అభినయముల ద్వారా ప్రదర్శించు తాడు. అప్పుడు సామాజికులు రామాదుల తన్మయీ భావమును పొందడానికి యోగ్యమయిన మనస్సు కలవారై నటాభినయము ద్వారా గోచరము అవుతూ ఉన్న రామాది నాయకుల రస భావములను సాక్షాత్తుగా భావించు తారు. కేవలమూ తమకు సంబంధించినట్లుగా అనుసంధా నము చేస్తారు. అదేవిధముగా గుణాలంకారములచేత పరి ష్కృత మయిన రసోల్లసితములయిన శబ్దార్థములు సంఘటన

రూపమయిన కావ్యమును చక్కగా వినినందువలన తద్బల మును బట్టి సామాజికులు రామాదుల రసభావములను సాక్షా త్తుగా భావించుతారు. ఇట్లా ఈ రెండు విధములుగా కూడా సామాజికుల భావనకు రామాదుల రసము అందు బాటులో ఉంటుంది. ఆ రసము రామాదులదే అయినప్పటికీ సామాజికు లలో సమ్యగ్భావన ఉన్నందువలన నిరతిశయా నందము కలుగ వచ్చును ఇది ఏమాత్రమూ విరుద్ధము కాదు. భావనా విశే షము వలన ఆనంద విశేషము కలుగుట అయుక్తము కాదు. ఈ లౌకిక రసమునకు రామాదులె ఆశ్రయమయినా సామాజి కులలో ఆనందము కలగడముకూడా ఉపపన్నము అవుతుందని ఇంతవరకు నిరూపించిన ప్రఘట్ట సారము.

రసమునకు ఆశ్రయము వేరుగాఉండి వేరొక స్థలములో ఆనందము కలగడము అనేది అంతఉచితముగా కనపడడం లేదు. ఆనందము ఎక్కడ కలుగుతున్నదో అక్కడనే రసా శ్రయత్వము కూడా ఉండాలి. కాబట్టి ఆరసము సామాజికా శ్రయముకూడా కావచ్చును. అనే అర్థమును నిరూపించడము కొరకై వేరొకరీతి అనుసరింప బడుతున్నది.

## అలౌకికరసము

ఈచెప్పిన రసము సామాజికాశ్రయముగా ఉండడము కూడా విరుద్ధము కాదు. ఈఅంశములో ఈవిషయమును భావించాలి! నటుడు మాలతి సీత శకుంతల మొదలయిన శబ్దాలను ఉచ్చరించి నప్పుడు ఆతని అభినయ సమయంలో ఆశబ్దాలను సామాజికులు వినగానే అపూర్వమయిన భావన కలవారవుతారు. మాలత్యాది స్త్రీలు మాధవాదులకు సంబం ధించి ఉన్నారు. అయినప్పటికీ సామాజికుల భావనలో వారు

ములో వారిలోని సంస్కార బీజములు ఉద్బుద్ధములు అవుత సామాన్య రూపముగా భావింపబడిన రామాదులు ప్రత్యక్ష ముగా భాసించుతారు. శబ్దసముపారూఢ రూపము కలిగి రామాదులు ప్రత్యక్షముగా కనపడడమువింతకాదు. అయి ప్పటికీ వారు సామాన్య రూపముగా గోచరించుతారు అనే విషయమును గుర్తు పెట్టుకోవాలి. కనుకనే సీతారామాద లను స్వనాయికగా స్వనాయకునిగా భావించినప్పటికీ ఏ అన చిత్యమూ లేదు వాస్తవముగా వారు లోకములోని స్త్రీ పురు షులే. అయినప్పటికీ కావ్యముఖమున అభినయ ముఖమున భావింపబడగానే సామాజికాంతః కరణ ప్రతిబింబితులై సామాజిక నిష్ఠుల వుతున్నారు.

## రసాశ్రయము

లౌకిక రసమునకు రామాది నాయకులు ఆశ్రయము ఆ రామాదులను ఆశ్రయముగా చేసికొని లౌకిక రసము గోచర మవుతున్నట్లు ప్రతీత మవుతున్నది గదా! అలౌకిక రసానికి సామాజికులు ఆశ్రయము. రత్యాదులై శృంగారాది వ్యపదేశము పొందుతున్నవి. రత్యాదులు లౌకికములై అయినప్పటికీ స్థాయి భావ సామ్రాజ్యములో మూర్ధాభి షిక్తము లవుతున్నవి కదా! ఈ విభావము మొదలగునవి అన్నీ కూడా సామాజికుల చేత విలక్షణంగా ఆస్వాదింప బడుతూ ఉంటవి. అట్లాకాగానే అలౌకిక ప్రతీతిలో విషయ ములై అలౌకికములై అవుతున్నవి. ఇటువంటి విభావాదుల వలన నిష్పన్నమయిన రసముకూడా అలౌకికము కాక తప్పదు కదా! ఇదన్నీ సామాజికుల నిర్మలాంతః కరణములో ప్రతిబింబితమయిన స్థాయి స్వభావకము. ఇది సామాజిక

లందే ఉంటుంది. అందువలన ఈ అలౌకికరసానికి సహృదయ సామాజికులు ఆశ్రయమని అనడము సంగత మయినమాట. అలౌకిక మయిన రసానికి వేరొక ఆశ్రయము లేదు, సామాజికేతరాశ్రయము ఉంటుందని అనడము కూడా అసంగతము. కావ్యనాట్యములలో సామాజికేతరులు ఇద్దరు కనపడుతున్నారు. రామాది నాయకుడు తదభినయము చేసే సమర్థ నటుడు. వీరిద్దరిలో అలౌకిక రసానికి రామాది నాయకులు ఎప్పుడూ ఆశ్రయము కాజాలరు. వారు గతించి పోయినారు కదా! రసమేమో ప్రకృతానుభవప్రతిభాసము. అది అతీతాశ్రయము అని అనడము కుదురుతుందా? ఆ రామాదులను ఉద్దేశించి ఈ కావ్యనాట్యములున్నూ ప్రవృత్తములు కావడము లేదు. కాబట్టి అలౌకికము రామాద్యాశ్రయము కాదు. రామాదుల అవస్థానుకర్త అయిన నటుడు ఎపుడూ రసాశ్రయుడు కాడు. ఆతడు అనుకరణ మాత్ర తత్పరుడు అందువలన ఆతనికి రసాశ్రయ యోగ్యత లేదు. "అభినయము ఏవిధముగా చేయాలా?" అనే ఆతడు అనవరతమూ ఆలోచిస్తూ ఉంటాడు. ఈ విధంగా అభినయించితే బాగుంటుందేమో? ఇట్లా చేస్తే రుచిరంగా ఉంటుందేమో? అని ఆతడు అభినివిష్ట చిత్తుడై ఉంటాడు. అయినా ఆ నటుడు కూడా ఒకప్పుడు భావకుడు కావచ్చు. అప్పుడు ఆతనికి సామాజికత్వమె కాని నటత్వము లేదు. సామాజికునకు శ్రవ్యతా కృతముగా దృశ్యతా కృతముగా ఉభయాస్వాదము కలుగుతున్నది. నటునకు దృశ్యతా కృతమయిన ఆస్వాదము కుదరదు. కేవల శ్రవ్యతా కృతమయిన ఆస్వాదము కలగవచ్చును. అప్పుడు అట్లు ఆతడు భావించు వాడు అయినట్ల

యితే ఆతని యందు భావకత్వము మాత్రమె ఉంటుంది. నటుడు ఆనంద పరాధీనుడయినప్పటికి శిక్షాభ్యాస పాటవం వలన అనుభవాదులను ప్రకాశింప చేయగలడు. అంతేకాని ఆతడు ఏ రసానికీ ఆశ్రయుడు కాడు. నటుడు కేవలమూ సుధా పాత్ర, సుధాపాత్రకు సుధా స్వాదము ఉంటుందా ? కాబట్టి నటుడు రసాశ్రయుడు కాడు.

## రసముల పరస్పరవిరోధము

విరోధము లేని రసాలను ఒక చోట సమావేశింప చేసి వర్ణనము చేయడము విరుద్ధము కాదు. ఒకప్పుడు కొన్ని రసాలకు పరస్పరమూ విరోధము ఉన్నప్పటికి కవి ప్రౌఢోక్తి సమాశ్రయణము చేత ఒకచోట సమావేశము ఉండడము విరుద్ధము కాదు. అట్లా కూర్చబడిన రసాలలో ఒకటి అంగిగా వేరొకటి అంగముగా ఉంటుంది. కాబట్టే విరోధము ఉండదు. అటువంటి వర్ణనము ఉన్న స్థలములో సహృదయులకు ప్రహ్లాదాతి శయమె కలుగుతుంది. శృంగార తిలకము అనే గ్రంథములో రుద్రభట్టు రసముల విరోధ క్రమమును ఈ విధముగా చెప్పుతున్నాడు. శృంగార బీభత్సములు, వీరభయానకములు, రౌద్రాద్భుతములు; హాస్య కరుణములూ పరస్పరమూ వైరి రసములు. ఒక రసమును వేరొక రసము విరోధము కలది కావడము వలన బాధించేది అవుతుంది. అప్పుడు ఏరసము యొక్క ప్రతీతినీ సరిగా ఉండదు. ఒక స్థలములో ఏకవిషయంలో ఈ విరుద్ధ రసములను వర్ణించనే వర్ణించరాదు. ఒక వేళ వర్ణింప వలసి వస్తే వాని విరోధమును పరిహరించి వర్ణించాలి. ఈ విరోధ పరిహార రీతిని గ్రంథాంతరములందు దర్శించాలి.

ఒక రసమువలన వేరొక రసము ఉత్పన్నము కావడము కూడా సమ్మతమే. ఈ విషయము కూడా శృంగార తిలక ములో చెప్పబడింది. శృంగారమువలన హాస్యము రౌద్రము వలన కరుణము వీరము వలన అద్భుతము బీభత్సము వలన భయానకమూ ఉత్పన్న మవుతుంది. సాధారణంగా ఈ రసా దులకు సంబంధించిన విభావాది సామగ్రి ఏకవిధంగా ఉం టుంది. సత్వ రజ స్తమోగుణ సహితమయిన మనస్సుకు బయటి ప్రపంచంలోని పదార్థాలతో సంబంధము ఉన్నప్పుడు ఒకొ-క విధమయిన వికారము కలుగుతుంది. అటువంటి మనోవికార విశేషములె శృంగారాది రసములు. ఈ మనో వికృతులలోని భేదాలను బట్టి హాస్యాదులు కలుగుతవి.

## వ్యభిచారి భావ వ్యవస్థ

కొన్ని కొన్ని వ్యభిచారి భావాలు కొన్ని కొన్ని రసాలలో అనుగుణ్యము వహించి ఉంటవి. ఏ భావాలకు ఏ రసాల అను గుణత్వము ఉంటుందో శృంగార తిలకములో ఈ విధముగా ప్రతిపాదిత మయింది. శంక అసూయ భయము గ్లాని వ్యాధి చింత స్మృతి ధృతి ఔత్సుక్యము విస్మయము ఆవేగము వ్రీడ ఉన్మాదము మదము విషాదమూ జడత నిద్ర అవహిత్థ చాప లము మృతి అనే భావములను శృంగార రసములో ప్రయో గించాలి. శ్రమ చపలత నిద్ర స్వప్నము గ్లాని శంక అసూయ అవహిత్థ అనే భావాలు హాస్యములో ఉంటవి. త్రాసము మరణము దైన్యము గ్లాని భయానక రసములో ఉంటవి. అప స్మారము విషాదము భయము రోగము మృతి మదము ఉత్సా హాము అనే భావాలు బీభత్స సంభవములు. అద్భుత రస ములో 'ఆవేగము జడత మోహము' హర్షము విస్మయము

స్మృతి అనే భావములను నిబంధించాలి. కరుణ రసములో దైన్యము చింత గ్లాని నిర్వేదము, జడత స్మృతి వ్యాధి అనే వానిని భావ విశారదులు నిరూపించాలి. రౌద్రములో హర్షము అసూయ గర్వము ఉత్సాహము మదము చాపల్యము ఉగ్రతఅనే వానిని నిరూపించాలి. అమర్షము విబోధము వితర్కము మతిధృతి క్రోధము అసూయ సమ్మోహము ఆవేగము హర్షము గర్వము, మదము ఉగ్రత అనేభావములను వీరమునందు ప్రతిపాదించాలి. ఏరసమయినా సంపూర్ణము అయినట్లయితే రసాంతరమును తిరోధానించుతుంది. భరతుడు చెప్పిన ప్రక్రియాను సారముగా చూచినట్లయితే కావ్యములో రసము ఒక్కటే అనేక రసాలు ఉండవు. ఆ రసాలకుసంకరమున్నూ ఉండదు. అయినప్పటికీ మహాకవి ప్రసిద్ధిని అనుసరించి రససంకరమును స్వీకరించుతున్నారు.

## రసవదాద్యలంకారము

రస భావాదులు అప్రధానములు అయినట్లయితే రసవదాద్యలంకారములు సిద్ధములు అవుతున్నవి. రసాదులు ప్రధానము లయినప్పుడు రసభావములు ఇదివరలో నిర్దిష్టములయినవి. ఇతరములకు అంగముగా రసమును నిబంధించినప్పుడు రసవద లంకారము అవుతుంది. భావమును అన్యాంగముగా విధించినప్పుడు ప్రేయోలంకారము అవుతుంది. రసాభాస భావాభాసములను అన్యాంగముగా నిబంధించితే ఊర్జస్వి అలంకారము అవుతుంది, భావశాంతిని అన్యాంగముగా నిబంధించగా సమాహితాలంకారము అవుతున్నది. ఈవిధముగానే భావోదయ భావసంధి భావశబలతలను అన్యాంగముగా నిరూపించి నప్పుడు ఆయా నామములు కల అలంకారములు

అవుతున్నవి. ఈవిషయము అలంకార సర్వస్వములో విపులముగా నిరూపించ బడింది.

రసభావతదాభాస తత్ప్రశమన నిబంధనే
రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితాని
భావోదయ భావశాంతి భావసంధి
భావశబలతాశ్చ పృథగలంకారాః

అని ఇది సర్వస్వకార వచనము దీనిఅర్థము పై వచనముతో గతార్థమే. అలంకార ప్రకరణమునందు వీని ఉదాహరణము ఉంటుందని విద్యానాథుడు మూలములో చెప్పుతున్నాడు కాని అలంకార ప్రకరణములో వీనికిఉదాహరణము లేనే లేదు. కర్తమరచి ఉండవచ్చును. అయినప్పటికీ ప్రతిపత్తి సౌకర్యమునకై గ్రంథాంతరములనుండి ఉదాహరణములు ప్రదర్శింప బడుతున్నవి.

## రస వదలంకారము

అయం స రశనోత్కర్షీ పీనస్తన విమర్దనః
నాభ్యూరు జఘన స్పర్శీ నీవీవిస్రంసనః కరః

భారత యుద్ధములో అర్జునుడు భూరిశ్రవసుని భుజమును నరికితే ఆ భుజమును చూచి భూరిశ్రవసుని భార్య ఈ విధముగా విలపించుతున్నది. ఆ హస్తము రశనను (మొలనూలు) రతి సమయములో కర్షణము చేసింది. మా పీనస్తనవిమర్దనము చేసింది. నాభి ఊరువు జఘనములను స్పృశించింది. ఇంకా నీవీ విస్రంసనము చేసింది. దీనిలో భావ్యమాన విశేషములను అనుబంధించి ఉన్న శృంగార రసము ప్రకృతము ప్రబంధ ప్రవృత్తిమూ అయిన కరుణ రసమునకు అంగముగా ఉన్నది. అంగ భూత మయినప్పటికీ చమత్కారికి

ముగా ఉన్నందు వలన రసవదలంకార మని గ్రహించాలి. రసము వేరొక రసమునకు అంగమయి నప్పుడు రసవదలంకార మయినట్లే వేరొక భావమునకు అంగ మయినా రసవద లంకారమే.

## ప్రేయోలంకారము

త్వం ముగ్ధాక్షి! వినైవ కంచులికయా ధత్సే మనోహారిణీం
లక్ష్మీ మిత్యభిధాయిని ప్రియతమే తద్వీటికా సంస్పృశి
శయ్యోపాంత నివిష్ట సస్మిత వధూనేత్రోత్సవానందితః
నిర్యాతః శనకై రలీకవచనోపన్యాస మాలీజనః

ఓ ! సుందరాక్షీ ! నీవు రవిక లేకుండా ఉంటేనే మనోహర శోభను ధరించుతున్నావు. అని అంటూ ప్రియతముడు ఆనాయిక రవికముడిని స్పృశించగానే శయ్యాదగ్గరగా కూర్చొని ఉన్న ఆ వధువు చిన్న స్మితము కలదై సంతోష పడింది. కళ్ళు ఇంతగా చేసికొంది అప్పుడు ఇక నేం తక్కువ ? అని ఆనంద పడిన చెలికత్తెలు ఏదో వంక వంక మాటలు చెప్పి నెమ్మదిగా వెళ్ళి పోయినారు. దీనిలో చెలికత్తెలకు నాయికా విషయంలో ఉన్న అనురాగము నాయికా నాయకుల శృంగారరసములో అంగిమయింది. ఇట్లాగే భావము వేరొక భావానికి అంగమయినా ప్రేయోలంకారమే అవుతుంది

## ఊర్జస్విఅలంకారము

ఖందీకృత్య నృప! ద్విషాం మృగదృశః తాః పశ్యతాం ప్రేయసాం
శ్లిష్యంతి ప్రణమంతి లాంతి పరితశ్చుంబంతి తే సైనికాః
అస్మాకం సుకృతైః దృశోర్నిపతితో స్యౌచిత్య వారాంనిధే!
విధ్వస్తా విపదోఖిలా స్తదితి తైః ప్రత్యర్థిభిస్తూయసే.

ఓ! రాజా! నీ సేనాభటులు శత్రువుల స్త్రీలను బందీలనుగా చేసి వాళ్ళ ప్రియులు చూస్తూ ఉండగానే ఏమీ లక్ష్య పెట్టకుండగా ఆ స్త్రీలను ఆలింగనము చేసికొంటున్నారు. వాళ్ళు తిరస్కరించితే ప్రణమిల్లుతున్నారు. వాళ్ళు పక్కపక్కకు వెళ్ళుతూ ఉంటే బ్రతిమాలుకొంటున్నారు. వాళ్లు ఏమీ ఇష్ట పడక పోయినా బలాత్కారంగా చుంబిస్తున్నారు. ఇట్లా ఉండగా ప్రత్యర్థులయిన ఆ స్త్రీల భర్తలు నిన్ను ఈ విధముగా స్తవము చేస్తున్నారు. ఓ! సౌశీల్య సాగరా? మా పుణ్యము మంచిది. నిన్ను కనపడినావు. మా స్త్రీ పరిభవాది రూపములయిన ఆపదలన్నీ పోయినవి ప్రభూ! అని దీనిలో అంగీకారము లేని స్త్రీల విషయముగా ఉన్న శృంగారము ఆభాస. ఆ శృంగారాభాస ఉత్తరార్ధములో ప్రభు విషయిక రతిభావములో అంగమయినది. ఉత్తరార్ధములో రాజను శత్రువులు స్తవము చేయడమనేది భావాభాస. ఇది కూడా రాజ విషయక రతిభావాంగ మయినది. ఇట్లా రసాభాస భావాభాసలు అంగములయినందువలను ఊర్జస్వి అలంకారము.

## సమాహితాలంకారము

అవిరళ కరవాల కంపనైర్భ్రుకుటీ తర్జన గర్జనైర్ముహుః
దదృశే తవ వైరిణాం మదః స గతః క్వాపి తవేక్షణే క్షణాత్

ఎప్పుడూ ఖడ్గ కంపనములతోనూ భ్రూక్షేపము భయపెట్టడము గర్జనములతోనూ నూటికినూటికి కనబడ్డ నీ శత్రువుల మదము బాగానే కనపడింది గాని నిన్ను కనపడిన క్షణంలో ఇది ఎక్కడికో పోయింది. దీనిలో మదము అనే

భావము శమించడమూ అది ప్రభు విషయకరతి భావములో అంగము కావడమూ విశదముగానే ఉన్నది.

భావోదయాలంకారము

సాకం కురంగకదృశా మధుపానలీలాం
కర్తుం సుహృద్భిరపి వైరిణి తే ప్రవృత్తే
అన్యాభిధాయి తవ నామ విభో గృహీతం
కేనాపి తత్ర విషమా మకరోదవస్థాం.

తన ప్రియురాలి తోటి స్నేహితుల తోటీ కూడుకొని నీ శత్రువు మధుపాన ప్రవృత్తుడు కాగా ఎవరినో పిలుస్తూ ఎవరో నీ పేరు పలికారు. అప్పుడు అక్కడ చాలా విషమావస్థ కలిగింది. దీనిలో ఆ శత్రువుకు ఉదయించిన త్రాసము అనే భావము రాజ విషయ రతిలో అంగమయింది.

భావసంధి అలంకారము

అసోఢా తత్కాలోల్లస దసహభావస్య తపసః
కథానాం విస్రంభే ష్వథచ రసికః శైలదుహితుః
ప్రమోదం వో దిశ్యా త్కపటవటు వేషాపనయన
త్వరా శైథిల్యాభ్యాంయుగపదభియుక్తః స్మరహరః.

పార్వతీదేవి యొక్క ఆసమయంలో అతిశయించుచున్న తపస్సును సహింపలేని వాడున్నూ ఆదేవి కథల విస్రంభములలో రసికుడున్నూ అయి కపట వటువేషమును తీసివేయడములో త్వరా శైథిల్యములతో ఒకేసారి కూడుకొన్న శివుడు మీకు ప్రమోదమును ప్రసాదించుగావుత. ఆ దేవి ఆ విధముగా శరీరమును కూడా లక్ష్యము చేయకుండా ఉగ్ర తపస్సు చేస్తూ ఉంటే మాయా వటు వేషములో ఉన్న శివుడు క్షణమయినా ఉపేక్షింపలేక ఆ వేషమును తొల

గించుకొని స్వరూపముతో ఎదటికి రావాలను కుంటున్నాడు శివప్రేమతో ఉన్న పార్వతి ఇట్లా చేసింది. ఇటా చేసింది అని ఆయా కథా విశేషాలను చెప్పతూఉంటే ఆ మాయా వేష ములోనే ఉండి ఇప్పుడప్పుడే వేషమును తీసివేయకుండా ఇంకా విందాము. ఇంకావిందా మన్న అభిలాషతోనూ శివుడు ఉన్నాడు అని భావము. దీనిలో త్వర వలన ఆవేగము శైథి ల్యము వలనధైర్యము అనేరెండూ భావాలు వ్యంగ్యము లవు తున్నవి. అవి రెండూ శివవిషయకరతి భావములో అంగ ములయినందున భావ సంధి అలంకారము.

## భావశబలత

పశ్యేత్కశ్చిచ్చల ! చపల ! రే ! కా త్వరాహం కుమారీ
హస్తాలంబం వితర ! హ ! హ ! హా ! వ్యుత్క్రమః క్వాసియాసి
ఇత్థం పృథ్వీపరివృఢ! భవద్ద్వేషిణోఽరణ్యవృత్తేః
కన్యా కంచి త్ఫలకిసలయా న్యాదదానాభిధత్తే.

ఓ ! రాజా అరణ్య నివాసము చేస్తూ ఉన్న నీ శత్రువు కన్య ఫలములను కిసలయములను తీసికొంటూ ఒకని ఈవిధ ముగా అంటున్నది. "నాతో రమించుతూఉంటే నిన్నుఎవరయినా చూస్తారు" అని భయపెట్టడానికి కాముకుడు అంటే కన్య ఇట్లా అంటున్నది. "ఓయి ! చపలా ! అయితే పద! రహస్య ప్రదేశానికి నడు. నేను అక్కడికే వస్తాను. కాముకుడు ! ఆఁ అంత తొందరేమిటి ? ఏమిటీభయం ! అబ్బా ! కన్య : నేను చిన్నదాన్ని కాదూ ! నవ్వడంఎందుకు ?" కాముకుడు: అయితే ఏదీ నీ చేయి ? హస్తాలంబము ఇవ్వు. వివిక్తప్రదేశ మునకు వెళ్లవలసే ఉంటే ఒంటరిగా వెళ్లడమె ! హస్తా లంబం వితర" అన్నాడు. కన్య ఒహూ! హూ!! అంతా

వ్యగ్రత్వముంగా ఉందే! ఆడదాన్ని నేనా? ఎక్కడికీ? వెళ్ళుతున్నావు! దీనిలో శంక అసూయ స్మృతి శ్రమము దైన్యము ఔత్సుక్యము అనే భావాలకు శబలత్వము ఉన్నది. ఈ భావ శబలత రాజ విషయక రతి భావాంగము. అందువలన అలంకారము. విద్యానాథుడు రసభావాదులకు ఉదాహరించిన పద్యాలు అన్నిటిలోనూ ఆయా రసభావాదులు ప్రతాపరుద్ర విషయక రతి భావములో అంగములవుతూ ఉన్నవి కాబట్టి ఆ దృష్టితో ప్రతదుదాహరణత్వమును అభ్యూహించవచ్చు. అయినా స్పష్టతకు గ్రంథాంతర దర్శనము.

## రసనిష్కర్ష

రసప్రకరణ ప్రారంభములో కొంతగా రసస్వరూపము నిరూపించ బడింది. ఇంతకు పూర్వ భాగములో కూడా లౌకికా లౌకిక భేదమును అనుసరించి రస స్వరూపము కొంత చర్చితము అయింది. ప్రతిపత్తి సౌకర్యము కొరకై రస స్వరూపమును విశదముగా నిరూపించాలని విద్యానాథుడు ఈ శ్లోకములను నిరూపించుతున్నాడు.

గుణాలంకారశ్రీ కృత పరికరో భావవిభవః
స్ఫురత్ప్రాదుర్భావః క్రమగలిత వేద్యాంతరమతిః
సుఖం వా దుఃఖం వా నిబిడయతు యూనోః సహృదయే
ష్వమందానందాత్మా పరిణమతి పూర్ణో రసభరః

రత్యాది స్థాయిభావ వర్గము గుణాలంకార శోభల చేత బాగా అభివ్యక్తము అయినదై రసోన్ముఖత్వమును సంపాదించి క్రమ క్రమముగా ఇతర పదార్థముల విజ్ఞానమును విగలితము చేస్తుంది. అదే నాయికా నాయకులయిన సీతారాములకు సుఖమును గాని దుఃఖమును గాని సంధానించేది కావ

చ్చును. కాని సహృదయ సామాజికు నందయితే అమందానందాత్మకముగ పూర్ణ రసభరమై పరిణమించుచున్నది. కావ్యములో సీతారామాదులకు సంబంధించిన భావచక్రము వర్ణింపబడుతుంది. అది సంస్కారానువృత్తి రీత్యాదులచేత అభివ్యక్తము అవుతుంది. అట్లా కాగానే రసప్రవణము అవుతూ కేవలము తదేక విజ్ఞానమునే సంపాదించుతుంది. ఇటువంటి ఈ రసము శృంగారాదికమయితే సుఖమును కరుణాదికమయితే దుఃఖమును నాయికా నాయకులకు కూర్చవచ్చును. సహృదయునియందయితే అది శృంగారమయినా కరుణమయినా అఖండాహ్లాదాకరమై రసీభావము పొందుతుంది. అని పై శ్లోకమునకు సామాన్యాకారముగా భావము.

> రసో వాక్యార్థ, సన్నిలసతి పదార్థాః పునరమీ
> విభావాద్యాః యస్మిన్నిల దధతి విశ్రాంతి ముచితాం
> అతో భావా ఏవ క్రమసముదితాన్యోన్యవిభవా
> రసీభావం బిభ్రత్యథ చ పటతాం తంతవ ఇవ.

రసము వాకార్థమై విలసించుచున్నది. ఈ విభావాదులు అన్నీ పదార్థములై ఉంటున్నవి. పదార్థములు వాక్యార్థములో ఉచిత విశ్రాంతిని ధరించుతున్నవి కదా! అట్లాగే విభావాదులు రసములో సముచిత విశ్రాంతిని పొందుతూ ఉంటవి. కాగా రసము వాక్యార్థస్థానీయము అని విభావాదులు పదార్థస్థానీయములని గ్రహించవచ్చును. కాబట్టి ఈ భావములే క్రమ క్రమముగా అన్యోన్య విభవమును సమున్లసింపచేసి కొన్నవై తంతువులు పటత్వమును పొందినట్లుగా రసీభావమును పొందుతున్నవి. రసము వాక్యార్థము పటము మూడూ తుల్యాకత్వ్యగా ఎన్నదగి ఉన్నవి. భావములు

పదార్థములు తంతువులూ పై మూడింటికీ సంబంధించి సమాన కక్ష్యతో ఉన్నవి. పదార్థములు కలిసి పరస్పరాన్వయాన్వయి భావముతో కూడుకొన్నవై వాక్యార్థీ భావమును పొందుతున్నవి. తంతువులు పరస్పర సంయోజనము పొంది పటీభావము పొందుతున్నవి. భావములు అన్యోన్య విభవము కలవై రసీభావము పొందుతున్నవి. అని తాత్పర్యము

భావే స్థాయిని వర్ధమానవిభవే రత్యాదికే సింధువత్
కల్లోలా ఇవ సంభవంతి విలయంచాయాంతి భావాముహుః
నిర్వేదాద్యుపభోగ భావిత నిజాస్వాదాతి రేకోరసో
లోకే స్యాదనుకార్య ఏవ కథితో నాట్యేతు సామాజికే

రత్యాది స్థాయి భావము విభావాదుల వలన వైభవము కలది అవుతూ ఉన్నప్పుడు నిర్వేదాది వ్యభిచారి భావాలు సముద్రములో తరంగముల మాదిరిగా పుట్టుతూ ఉంటవి. విలయమును కూడా పొందుతూ ఉంటవి. మాటి మాటికీ ఇక్కడి పరిస్థితి ఇట్లాగే ఉంటుంది. ఈ నిర్వేదాది భావాలయొక్క అనుభవమువలన తనయొక్క ఆస్వాదాతిశయమె భావితము అవుతూ ఉంటుంది. ఇట్లా భావ్యమానస్వీయాస్వాదమె రసము. ఈరసము లోకపరిస్థితిలో చూచేటట్లయితే అనుకార్యుడు అయిన రామాది నాయకుని యందే ఉంటుంది. నాట్యదృష్టితో చూచేటట్లయితే సామాజికుడయిన సహృదయుని యందె ఉంటుంది. రామాది నాయకులందు రత్యాది భావము కలిగినప్పుడు ఇతర భావాలు ఎన్నెన్నివచ్చినా పుట్టిపోతూఉంటవి. అన్నిటికీ స్థాయి భావసమ్మిశ్రితమయిన వాని అనుభూతి తనలో సూక్ష్మరూపముగా ఉన్న స్వకీయాస్వాదమును అతిశయింప

చేస్తుంది. ఇదే రసము. ఇది లౌకిక మయినప్పుడు రామాదులున్నూ అలౌకిక మయినప్పుడు సామాజికులున్నూ ఆశ్రయము అవుతూ ఉంటారు. అని సామాన్యంగా భావము.

ఈ మూడు శ్లోకాల భావము జటిలముగా ఉంది. వీని అర్థము సవిశేషముగా తెలియదగినది. వ్యాఖ్యాత వీనిని భంగీ చిత్రతతో నిరూపించినాడు. తత్సారాంశమును ఈ క్రింది విధముగా గ్రహించాలి.

గుణాలంకార వృత్తి రీత్యాదుల యొక్క సంపత్తి చేత కావ్యము పరిష్కృతము అవుతుంది, అటువంటి విశిష్ట కావ్యములో భావాలు చక్కగా ప్రతిపాదింపబడుతవి. రత్యాది స్థాయి భావవర్గము వానిద్వారా అభివ్యక్త మవుతుంది అప్పుడు అది బాగా స్ఫురించుతూ చక్కని ప్రాదుర్భావము పొందుతుంది. మొదటగా సామాజికుడు కావ్యాభినయములలో అభినివేశము కలవాడు కాగానే రసప్రాదుర్భావ సమయములో నటునియందు రామాది ప్రతీతిని దృఢముగా సంపాదించుకొంటాడు. అప్పుడు సామాజిక హృదయము అనుకార్యుడయిన రామాది హృదయమూ అభిన్నముగా అవభాసించుతుంది, తరువాత సామాజికుని హృదయము నృత్యము గీతము మొదలయిన నానావిధ ధర్మాలలో నిమగ్నము ఉవుతుంది ఆసమయంలో ఇతరపదార్థాలు ఏవీ కూడా తెలియదగినవి అంటూ ఉండవు. తత్సమయములో అలౌకికమయిన రసము యోగి వేద్యమయిన బ్రహ్మానంద సదృశమైన స్వాదుముగా చర్వణాస్పదము అవుతుంది. కావ్యము వలనకాని ధ్రువాగానము వలనకాని రసము సంపూరితము వుతూ ఉన్నప్పుడు సహృదయుడు రసాస్వాదన భర్తైకాగ్ర్యమై

క్షణము అంతర్ముఖుడై హర్షము పొందుతాడు. నిర్విషయ స్థితిని అందుకొంటాడు. ఆసమయములో అతనికి స్వకీయ మయిన స్వరూపావస్థిత మయిన హ్లాద నిష్యందము అవభా సించుతుంది. బ్రహ్మానందమునకు రసాస్వాదమునకూ కొంచెము తేడా ఉన్నది. బ్రహ్మానందానుభవములో వేద్యాంతరము ఏమీకూడా స్ఫురించదు రసాస్వాదములో నయితే విభావా దుల కంటె అతిరిక్తముగా వేద్యపదార్థము ఏమీ ఉండదు. విభావాదికము మాత్రము రససమ్మిశ్రితమై గోచరించుతుంది విభావాది ప్రతీతి ఉన్నప్పటికీ అఖండానుభవానికి ఏమీ వ్యాఘాతము లేదు. నానా రసాలయొక్క సమ్మేళనము ఉన్నప్పటికీ అఖండ పానకరస స్వభావానికి ఏమీ వ్యాఘాతము లేనట్లు ప్రకృతంలో కూడా ఏమీ ఇబ్బంది లేదు.

శృంగారాదికము ఆనంద మూలము. దానిలో సుఖా స్వాదము ఉండవచ్చును. కరుణము శోకమూలము కదా! దానిలో సుఖాస్వాదము ఏ విధముగా సంబంధించుతుంది? అనే సందేహము అక్కరలేదు. ఈ రత్యాది భావములు స్త్రీ పురుషులకు శృంగారములో లౌకిక సుఖమును కరుణములో లౌకిక దుఃఖమును సంపాదించిన సంపాదించు గాక! సహృ దయుల మనోముకురము కావ్యానుశీలనాభ్యాసవశము వలన విశదమై వర్ణనీయ తన్మయీభవన యోగ్యత కలది అవు తుంది. ఆ విధముగా హృదయసంవాదము పొందిన సహృద యులలో ఆ రత్యాదికము విభావాద సముల్లాసితమై పూర్ణము అవుతుంది. అమందానందాత్మకమై బ్రహ్మానందమువలె నిర తిశయ సుఖస్వరూపమై పరిణమించుతుంది.

దీనిలో ఆనందాత్మక మయిన అశ్రుధార ఆవిర్భవించడము అయుక్తము కాదు. ఇది దుఃఖాత్మకమె అయినట్లయితే దీనిలో ఎవడూ ప్రవర్తించడు. సకల సహృదయ ప్రవృత్తిని బట్టి ఇది ఆనందాత్మకమె అని నిశ్చయించాలి. బ్రహ్మానందము అఖండమె అయినప్పటికీ, చంద్రకాంత సోపాన పంక్తిలో ప్రతి బింబించిన చంద్ర బింబము మాదిరిగా, ఉపాధి భేదమును బట్టి అనేకధా గోచరము అవుతూ ఉంటుంది. ఆ విధముగానే కావ్య రసాస్వాదమున్నూ విశేషము లేని అఖండ రూపమే అయినా వ్యంజకము లయిన విభావాదుల భేదమును బట్టి నానా విధముగా కన్పడుతూ ఉంటుంది.

కావ్యసముపాత్తమయినవిభావాది భావవర్గము కేవలమూ స్వరూప ప్రతిష్ఠానము పొందదు, తన రూపములో ప్రతిష్ఠితము కాదు. మహా వాక్యార్థముగా చెప్పదగిన రసమునందే పర్యవసానము పొందుతుంది. పదార్థాలకు వాక్యార్థ భావము రానిదే స్వరూప విశ్రాంతి లేనట్లుగా రసీభావము రాకపోతే విభావాదులకు కూడా స్వస్వరూప విశ్రాంతి ఉండదు. మొత్తానికి కావ్యములోనీ ఏ చిన్న భావమయినప్పటికి మహారసములో పర్యవసానము పొంది స్వవిశ్రాంతిని పొందినట్లవుతుంది. కావ్యోపాత్తమయిన ఈ భావచక్రము సహృదయులకు అవశ్యముగా హృదయ సంవాదమును సంపాదించుతుంది. భావనా బలము వలన ఆస్వాద పథములోనికి తీసికొని రాబడిన కావ్య భావములు హృదయస్పందనమును కలుగ చేస్తూ ఆత్మ చైతన్యమునకు ఆవరణముగా ఉన్న వానిని భంజిప చేస్తున్నవి, ఇట్లా ఆవరణ భంగమైన కొలగానే ఆత్మశ్రీ విలాసాను భూతి కలుగుతుంది. నిరావరణ

మయిన నిజాస్వాదాతిరేకము సహృదయునకు కలుగుతుంది. కావ్యదృష్టిలో చూడగా ఇటువంటి స్వసంవిదుపలబ్ధి సామాజికునకే ఉన్నది. అని రూఢము చేయవచ్చును. ఈ పరమ సిద్ధాంతమె సహృదయ సాహిత్య దర్శన రహస్య తత్త్వవేత్తలకు సమ్మతము.

రస ప్రకరణము




---

Printed at Kalyani Press, Tenali, P. I. C. G. 79 A
For Navya Sahitya Parishat, Guntur Q. H. No. G 80
Cat. D., 500 copies.




సాహిత్యశాస్త్రమాలిక : ౨
సంపాదకుడు : ఆచార్య రాయప్రోలు సుబ్బారావు

# ఆంధ్రప్రతాపరుద్రీయము

శ్రీ విద్యానాథుని కృతికి అనువాదము

## ద్వితీయ భాగము

సాహిత్యాచార్య, తర్కశిరోమణి
జమ్ములమడక మాధవరామశర్మ
పండితుడు
ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.

నవ్యసాహిత్య పరిషత్తు
గుంటూరు




సాహిత్యశాస్త్రమాలిక : ౨
సంపాదకుడు : ఆచార్య రాయప్రోలు సుబ్బారావు

# ఆంధ్ర ప్రతాపరుద్రీయము

శ్రీ విద్యానాథుని కృతికి అనువాదము

## ద్వితీయ భాగము

సాహిత్యాచార్య, ప్రాశ్నికశిరోమణి
**జమ్ములమడక మాధవరామశర్మ**
పండితుడు
ఆంధ్ర క్రైస్తవ కళాశాల, గుంటూరు.

నవ్యసాహిత్యపరిషత్తు
గుంటూరు

# సూచిక

శ్రీ ర్జయతు

# ఆంధ్ర ప్రతాపరుద్రీయము

## దోష ప్రకరణము

కావ్య జీవితభూత మయిన రసము నిరూపిత మయింది. ఇక రసోపస్కారకము లయిన గుణాలంకారాలను నిరూపించ వలసి ఉన్నది. అయినా ప్రస్తుతము దోషాలను నిరూపించు తాము. రసోపస్కారకము లయిన గుణాలంకారముల వివేకము బాగా కలుగ వలెనన్నట్లయితే ముందుగా దోషాలను నిరూపించడము ఆవశ్యకము. కాకపోయి నట్లయితే గుణ వివేకము బాగా ప్రరూఢము కాదు. ముందుగా దోష స్వరూపమును తెలిసి కొన్నట్లయితే అనంతరము గుణవిజ్ఞానము చక్కగా అలవడుతుంది. కాబట్టి ఈ ప్రకరణములో దోషనిరూపణము అవకాశము పొందుతుంది.

### దోష స్వరూపము

దోషాలు అనేకము లున్నవి. దోష స్వరూపమును తెలియడానికి ఇది సమర్థమయిన సామాన్య లక్షణము..

దోషః కావ్యాపకర్షస్య హేతుః శబ్దార్థగోచరః.

కావ్యమునకు అపకర్షమును కలుగజేయడములో హేతువగు నది దోషము. అది ముఖ్యమయిన అర్థమును బోధించేది అవుతుంది. రసాపకర్షకము దోషము అని భావము. దోషము ఉన్నట్లయితే ముఖ్యార్థమయిన రసము నిర్మలినముగా ప్రతీతము కాదు. కాబట్టి దోషము రసమును అపకర్షించుతుంది అనేమాట యుక్తమే. రసాపకర్ష ద్వార

ంగా ఇది కావ్యాపకర్ష హేతు వవుతున్నది. కనుక
షము కావ్యాపకర్ష హేతువు అని ఇక్కడ చెప్ప బ
న్నది.

ఇట్టి ఈ దోషము శబ్దగోచరదోష మని అర్థగోచ
ష మని రెండు విధాలు. దోషము శబ్దార్థగోచర మ
డము విభాగపరమె కాని లక్షణపరము కాదు. కావ్యవ
ర్థమయము కదా! తదపకర్ష హేతువు లయిన దోషా
డా శబ్దగతముగా అర్థగతముగా ద్వివిధములు అ
న్నవి. వానిలో శబ్దగతదోషాలు పదగతములని వాక్యగ
లని ద్వైవిధ్యము పొందుతున్నవి. రసాదిప్రతీతి విధ
ద్యర్థ మూలకము. విభావాది ప్రతీతి వాక్యాధీనమ
క్యము పదముచే ప్రారంభింప బడుతుంది. కాబట్టి పదా
క్షమభావులు. అందువలన పదగతదోషాలను ముందుగ
ాపించుతాము.

## పదగత దోషములు

అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకమ
హార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయో
ం, క్లిష్టము, గూఢార్థము, గ్రామ్యము, అన్యార్థమ
పతీతికము, అశ్లీలము, పరుషము, అని పదగత దోషము
యేడు దోషములు ప్రసిద్ధములై ఉన్నవి. ఇక వీని లక్ష
ణములను నిరూపించుతాము.

### ౧ అప్రయుక్తము

శబ్దకోశములలో ప్రసిద్ధమై ఉన్నప్పటికీ కవుల
యోగముల ద్వారా ఆదరింపక పోయి నట్లయితే అది అప్ర
క్త మవుతుంది. ఈ దోషప్రకరణములో వనవృత్తితో

ఉన్న ప్రతాప శత్రుయువతుల వచనాల లోని దోషాలు ఉదహరింప బడుతవి. ఉదా-

విముఖా దైవతా స్సర్వే తే నో దుశ్చ్యవనాదయః,
అరణ్య గృహమేధిన్యో యై ర్వయం హంత! కల్పితాః.

ఆ దుశ్చ్యవనుడు మొదలయిన దైవతు లందరూ మాకు విముఖు లయినారు. వారిచే మేము అరణ్య గృహ మేధినులము చేయబడి నారము కదా! అయ్యో! దీనిలో "దైవతాః" అని దైవత శబ్దము పుంలింగముగా ప్రయుక్త మయింది. అది దుష్టము. "బృందారకా దైవతాని పుంసి నా" అని అమరసింహుడు అమరకోశములో దైవత శబ్దము పుంలింగముగా కూడా అవుతుందని చెపుతున్నాడు. అయినా దానిని కవులు పుంలింగముగా ప్రయోగించడము లేదు. అందువలన ఇది అప్రయుక్తము. అట్లే దుశ్చ్యవన పదప్రయోగమున్నా. దుశ్చ్యవనుడు అంటే ఇంద్రుడు. ఇంద్ర పర్యాయముగా దీనిని అమరసింహుడు తన నిఘంటువులో చెప్పుకున్నాడు. కాని కవులు దుశ్చ్యవన పదమును ఇంద్రపరముగా ప్రయోగించడము లేదు. కావున దోషము. ఇవి పదములందు ఉన్నవి కాబట్టి పదదోషములు.

## ౨ అపుష్టార్థము

ప్రకృతానుపయుక్తార్థ మపుష్టార్థం త దుచ్యతే.

ప్రకృతములో ఉపయోగింపని అర్థము అపుష్టార్థమవుతుంది. అపుష్టము పోషింపబడనిది. ప్రకృతములో సరైన అనుకూల్యము ఉండక పోవడమె అపరిపోషము. అటువంటి అర్థము నిచ్చే పదము ప్రయోక్త మయితే అపుష్టార్థ మన్నమాట. ఉదా-

వ్యర్థాష్టార్ధార్ధ బాహూనా మమీషా మీదృశీం దశాం,
కథం సహామహే! ధిక్! ధిక్!! కఠినం హంత! జీవితమ్.

వ్యర్థములయిన అష్టార్ధార్ధ బాహువులు కల ఇట్టి మా యొక్క ఈ దశను ఎట్లా సహింపగలము? ఛీ! ఛీ!! అయ్యో!. మా జీవితము కఠినముగా ఉన్నది కదా! అష్ట ఎనిమిది. దానిలో అర్ధము నాలుగు. అందు అర్ధము రెండు. మొత్తము మీద వ్యర్థ బాహు ద్వయము కలిగిన అని అర్థము. అసలు ఇక్కడ వ్యర్థ బాహు ద్వయము కలిగిన అని వివక్షి తముకాగా; "అష్టార్ధార్ధ బాహూనాం" అని అనడము అనుపయుక్తము. ఇది ప్రకృతములో ఏమీ ఉపయుక్తము కాదు. కాబట్టి అపుష్టార్థ మనే దోషము ఉన్నదని ఊహింంచాలి.

## ౩ అప్రయుక్తము

యోగమాత్ర ప్రసిద్ధం య దసమర్థం త దుచ్యతే.

కేవలము శాస్త్రములో మాత్రమె ప్రసిద్ధముగా ఉండేది అసమర్థము అనే దోషము. అది శాస్త్రములోనే ప్రసిద్ధ మవుతుంది. కాని చెప్పదలచిన అర్థమును చెప్పుటలో సమర్థము కాదు. ప్రకృతాభీష్ట మయిన అర్థమును చెప్పడానికి ఆ పదములో వాచకశక్తి ఉండదన్నమాట. ఉదా:-

విహాయ వసుధా మేతాం చతురంబుధరావృతాం,
క్వ ను గంతవ్య మస్మాక మరణ్యే వ్యసుఖా స్థితిః.

నాలుగు అంబుధరములచే ఆవరింపబడి ఉన్న ఈ వసుధను విడిచి మేము ఎక్కడకు వెళ్ళవలెను? మాకు అరణ్యములోకూడా స్థితి సుఖకరముగా లేదుకదా? ఈపద్యములో అంబుధరము అనగా సముద్రము. అంబుధరశబ్దము

వలన సముద్రము అనే అర్థమును శాస్త్రప్రసిద్ధిచే గ్రహింప వలసినదే కాని ఇక్కడ వాచకశక్తి ఏమీ లేదు. కాబట్టి ఇది అసమర్థ మవుతున్నది.

### ౪ నిరర్థకము

పాదపూరణమాత్రం య త్త న్నిరర్థక ముచ్యతే.

పద్యపాదమును పూరించుటకు మాత్రమే ఉపయోగించే పదము నిరర్థక మవుతుంది. దానిలో అర్థము ఏమీ ఉండదు. ఉదా:—

విహాయ చ గృహాన్ తాన్వై వ్యత్యస్త నవవృత్తయః,
కదా భవిష్యతే వాసః కటకేషు మహీభృతామ్?

ఆగృహములను విడిచిపెట్టి వ్యత్యస్తములయిన నవ వృత్తులు కలవారమై ("నవ" వ్యత్యస్తమయినట్లయితే "వన" అవుతుంది. కాగా వనవృత్తులుకలవారమై అని అర్థము) ఉన్న మాకు మహీభృత్కటకములందు నివాసము ఎప్పుడు కలుగుతుందోకదా! (మహీభృత్కటకములు=పర్వతముల చరియలు రాజుల శిబిరములు) ఈపద్యములో 'వై' అనే పదము కేవలము పాదపూరణానికే స్వీకృతమయింది. కాబట్టి నిరర్థకము.

### ౫ నేయార్థము

స్వసంకేత ప్రసిద్ధార్థం నేయార్థం పరికీర్త్యతే,

కేవలము తమ సంకేతములోమాత్రము ప్రసిద్ధ మయిన అర్థము కలది నేయార్థము అవుతుంది. తాము ఏదో ఏర్పరచుకొన్న అర్థమును ఆపదము అధీనము చేసి కొంటుంది. ఉదాహరణము పూర్వపద్యము. దానిలో

"వ్యత్యస్తనవ" శబ్దమువలన వనప్రతీతి కలుగుట అనేది కేవలమూ స్వసంకేతాయత్తము. కాబట్టి అది నేయార్థము.

## ౬ చ్యుతసంస్కారము

శబ్దశాస్త్రవిరుద్ధం యత్ చ్యుతసంస్కార మిష్యతే.

శబ్దశాస్త్రానికి విరుద్ధముగా ఉండేది చ్యుతసంస్కారము. వ్యాకరణముచేత చేయబడిన సంస్కారము ఎక్కడ చ్యుత మవుతుందో అక్కడ చ్యుతసంస్కారము. అని సార్థకనామత ఉన్నది. ఉదా:— పూర్వపద్యమె. దీనిలో 'భవిష్యతే' అనే ప్రయోగము శబ్దశాస్త్రవిరుద్ధము. భూ ధాతువు పరస్మైపదమె కాని ఆత్మనేపదము కాదు. ఇక్కడ ఆత్మనేపదముగా ప్రయుక్తము కావడము దుష్టము. 'భవిష్యతి' అని ఉండడము సాధువు. ఆవిధముగా ఉంటే ఛందస్సు చెడిపోతుంది. అనుష్టభచ్ఛందములో ఆరవ అక్షరము గురువుగా ఉండవలెనని నియమము. దానిని గురువుగా చేయడానికై 'భవిష్యతే' అని అన్నట్లయితే దుష్ట మవుతున్నది.

## ౭ సందిగ్ధము

సందిగ్ధం తన్మతం యత్స్యా త్సంధిగ్ధార్థప్రతీతికృత్.

సందిగ్ధమయిన అర్థప్రతీతిని కలుగచేసేది సందిగ్ధ మని సమ్మతము. ~~ఈ~~వాక్యానికి ~~ఈ~~పదానికి అర్థము ఇదేనా? వేరొకటి అవుతుందా? అనే సందేహమును కలుగచేసేది అని భావము. ఉదా:— పూర్వపద్యమె. దీనిలో "మహీభృతాం కటకేషు వాసః" మహీభృత్కటకములలో నివాసము' అనేదానివలన రాజుల శిబిరములందు నివాసమా? పర్వతముల చరియలందు నివాసమా? అని సదేంహము

కలుతుగుంది కాబట్టి సందిగ్ధము. ఈవిధముగా ఒకే పద్యములో అనర్థక-నేయార్థ-చ్యుతసంస్కార-సందిగ్ధములు అనే నాలుగుదోషాలు ఉన్నవని గ్రహించాలి.

౮ అప్రయోజకము

త దప్రయోజకం యత్స్యా దవిశేషవిధాయకమ్.

విశేషార్థమును విశదముగా విధానించి చెప్పుటకు సమర్థముకానిది అప్రయోజకము అనే దోషము. ఉదా:—

హంత ! వర్తామహే వజ్రఘట్టనా త్ప్రాక్చలాత్మసు
నభస్వదశనారాతిధ్వజాగ్రజవిరోధిషు.

వాయువు ఆహారముగా కలిగిన సర్పములకు శత్రువు గరుడుడు. ఆతడు ధ్వజముగా కలవాడు విష్ణుదేవుడు. విష్ణుదేవునకు అగ్రజుడు ఇంద్రుడు. అట్టి ఇంద్రునకు విరోధులు అయినట్టిన్ని, వజ్రఘట్టనమునకు పూర్వము చలించు స్వరూపములు కల పర్వతములందు మేము సంచరించుచున్నాము కదా! అయ్యో!! ఈపద్యములో పర్వతములందు వర్తనము దుఃఖావహము అనేది ప్రకృతము. కాగా వజ్రఘట్టనమునకు పూర్వము చలించు స్వరూపములుకల అనే పర్వతవిశేషణము ఏమాత్రమూ ఉపయోగించడము లేదు. ఏవిశేషము కూడా దానివలన గోచరించడము లేదు. కాబట్టి ఇది అప్రయోజకదోషదుష్ట మవుతున్నది.

౯ క్లిష్టము

క్లిష్టం తదర్థావగతి ర్దూరదూరా యతో భవేత్,

అర్థావగమనము అత్యంతమూ దూరదూర మయినట్లయితే క్లిష్టము అనే దోషము. ఎంతో దూరము ఆలోచించితేనే కాని అర్థము గోచరము కాకపోవుట అని

భావము. ఉదా:— పూర్వపద్యములోని ఉత్తరార్థము. దానిలో నభస్వత్-వాయువు. అది అశన-ఆహారముగా కలవి సర్పములు. వానికి అరాతి - శత్రువు గరుడుడు. గరుడుడె ధ్వజముగా కలవాడు విష్ణువు. ఆతని అగ్రజుడు ఇంద్రుడు. "ఉపేంద్రఇంద్రావరజః" అనే నిఘంటువు వలన విష్ణువు ఇంద్రుని తమ్ముడు అని స్పష్టమవుతున్నది గదా! ఇంద్రవిరోధము కలవి పర్వతములు. ఈ అర్థప్రతీతి ఆయాకథలను అనుసంధానము చేసికొంటేనే కాని కలుగదు కనుక అత్యంతమూ దూరము. అందువలన క్లిష్టము అనే దోషము అని గ్రహించాలి.

### ౧౦ గూఢార్థము

ప్రయుక్త మప్రసిద్ధార్థే గూఢార్థం పరికీర్త్యతే.

పదములవలన బోధింపబడే అర్థము ప్రసిద్ధమూ అవుతుంది; అప్రసిద్ధమూ అవుతుంది. ఒకపదము అప్రసిద్ధార్థములో ప్రయోగింపబడినది అయినట్లయితే గూఢార్థమవుతుంది. ఉదా:—

శోణితాబ్జదృశః కామం శ్యామగల్లకటిస్థలాః
విదగ్ధహృదయాః శోకవహ్నినా రాజకన్యకాః.

రాజకన్యలు శోకాగ్నిచే మిక్కిలి దగ్ధహృదయ లయినారు. వారిదృక్కులు ఎర్రని పద్మసదృశములు. వారి కపోలభాగములు కటిస్థలములున్నూ మిక్కిలి శ్యామములు అయిఉన్నవి. శోణితశబ్దము రుధిర (నెత్తురు) రూపార్థములో ప్రసిద్ధము. ఇక్కడ పాటలవర్ణపరముగా ప్రయుక్తమయినది. ఈవిధముగా ఇది అప్రసిద్ధార్థములో ప్రయుక్తమయినందువలన గూఢార్థము.

## ౧౧ గ్రామ్యము

పామరవ్యవహారైకప్రసిద్ధం గ్రామ్య ముచ్యతే,

పామరుల వ్యవహారములోమాత్రమే ప్రసిద్ధమయిన అర్థము కలది గ్రామ్య మవుతుంది. విజ్ఞులయినవారు ఆ పదములను ఆ అర్థములలో ఉపయోగింపరు. ఉదా:— పూర్వ పద్యము. దీనిలో కపోలజఘనపరములైన గల్ల–కటిశబ్దములు పామరుల వ్యవహారములోనే ప్రసిద్ధములు. వానిని పండితులు ఆ అర్థములలో ప్రయోగింపరు. ఇవి గ్రామ్యప్రయుక్తములు.

## ౧౨ అన్యార్థము

య ద్రూఢిప్రచ్యుతం నామ త దన్యార్థ ముదాహృతమ్,

రూఢ్యర్థమునుండి ప్రచ్యుత మయినట్టిది అన్యార్థము. ఒకశబ్దానికి ప్రసిద్ధమయిన రూఢ్యర్థము ఉండగా దానిని విడిచి అన్యార్థములో అంటే అప్రసిద్ధార్థములో ఆశబ్దమును ప్రయోగించుట అన్యార్థ మనే దోషము. ఉదా:—పూర్వోదాహృతపద్యము. దీనిలో "విదగ్ధహృదయాః" అనేచోట ఈదోషము ఉన్నది. విదగ్ధపదము చతురము అనే అర్థములో ప్రసిద్ధము. రూఢమూ అయిఉన్నది. ఇక్కడ దహింపబడిన అనే అర్థములో ప్రయుక్తము. దగ్ధహృదయరూపార్థానికి ఇది వాచకము కాజాలదు. కాబట్టి అన్యార్థము అనే దోషము. ఇట్లా ఈపద్యములో గూఢార్థము గ్రామ్యార్థము అన్యార్థము అనే దోషత్రయము నిరూపిత మయింది.

## ౧౩ అప్రతీతికము

శాస్త్రమాత్రప్రసిద్ధం య దప్రతీతిక ముచ్యతే.

శాస్త్రములందు మాత్రము ప్రసిద్ధమై ఉండేది అప్రతీతికము. శాస్త్రీయసాంకేతికపదాలు (పారిభాషిక

ములు) కావ్యమార్గములో ప్రసిద్ధములు కావు. అటువంటివి అప్రతీతికములు అన్నమాట. ఉదా:—

మనూపదేశాః క్వ గతాః కులాచార్యై రుదీరితాః?

కులాచార్యులు ఉపదేశించిన మంత్రోపదేశములు ఎక్కడకు పోయినవో కదా! ఇక్కడ మనుశబ్దానికి మంత్రమని అర్థము. ఇది మంత్రపరముగా మంత్రశాస్త్రములోనే ప్రసిద్ధము. కావ్యమార్గములో ప్రసిద్ధము కాదు. మంత్ర శాస్త్రపారిభాషికము.

## ౧౪ అవిమృష్టవిధేయాంశము

అవిమృష్టవిధేయాంశం గుణీభూతవిధేయకమ్.

ప్రధానముగా విధింపతగిన అంశము గుణీభూతము (అప్రధానము) అయినట్లయితే అవిమృష్టవిధేయాంశము అవుతుంది. విమృష్టము కాని విధేయాంశము ఎక్కడ ఉంటుందో అక్కడ అవిమృష్టవిధేయాంశ మన్నమాట. విమృష్టము కాని విధేయాంశము ఉంటే; విధేయముగా చేయదగిన అంశము విమర్శింపబడకపోయినట్లయితే ఈదోషమని తాత్పర్యము. ఉదా:— అపుష్టార్థమునకు లక్ష్యముగా చూపిన పద్యములో "వ్యర్థాష్టార్థబాహూనాం" అనే భాగము. దీనిలో బాహుద్వయము ఏవిధముగా వ్యర్థ మయిందో ప్రధానముగా చెప్పవలసింది. ఆ బాహుద్వయ వైయర్థ్యమే విధేయము. సమాసములో కలిపి చెప్పడము వలన అది అవిమృష్ట మయింది. గుణీభూత మయింది. ఇక్కడ బహువ్రీహిసమాసము. అది అన్యపదార్థప్రధానము. ఆ అన్యపదార్థములో వ్యర్థపదము చేత సూచింపబడిన

వ్యర్థత ఉపసర్జనము అవుతున్నది. కాబట్టి ఇది అవిమృష్ట విధేయాంశ మనే దోషదుష్టము.

౧౫. విరుద్ధమతికృత్

విపరీతార్థధీ ర్యస్మా ద్విరుద్ధ మతికృ న్మతమ్.

ఏ పదమువలన విపరీతమయిన అర్థప్రతీతి కలుగుతుందో ఆపదము విరుద్ధమతికృత్ అనే దోషముకలది అవుతుంది. విరుద్ధమయిన మతిని కలుగజేయునది. ఉదా:—

అంబికారమణస్యాంఘ్రిసేవా వ్యర్థా కథం భవేత్,
రాజ్ఞా మకార్యమిత్రాణాం వినాశం సముపేయుషామ్?

అకార్యమిత్రులయిన వినాశముపొందిన రాజులకు అంబికారమణుని అంఘ్రిసేవ వ్యర్థము ఎట్లా అవుతుంది? ఈపద్యములో అంబికారమణశబ్దమువలన మాతృ సంభోగముచేయువాడు అనే అర్థము ప్రతీతమవుతున్నది. ఇట్లాగే అకార్యమిత్రశబ్దమువలనకూడా అకార్యములలో (దుష్టకార్యములు) మిత్రులెకాని యోగ్యకార్యములందు మిత్రులు కారుఅనే అర్థము గోచరమవుతున్నది. వినాశశబ్దము ఇక్కడ వియోగదుఃఖపరముగా ప్రయోగింపబడింది. అయినా విశేషముకల నాశము అనే అర్థము ప్రతీత మవుతుంది. ఆయా పదములు ఆయాఅర్థములలో ప్రయోగింపబడినప్పటికీ ప్రకృతములో అత్యంతమూ విపరీతమయిన అర్థములను చెప్పేవి కావడముచేత విరుద్ధమతికృత్తులు అవుతున్నవి.

౧౬. అశ్లీలము

అశ్లీలం య ద్యమాంగల్యాజుగుప్సావ్రీడధీకరమ్.

అశ్లీలదోషము మూడువిధాలు. అమంగళ ప్రతీతికరము, వ్రీడాప్రతీతికరము, జుగుప్సాప్రతీతికరమూ అని.

త్రివిధాశ్లీలమునకు ఉదా :-

అభిప్రేతపదావాసః కదా నః సంభవిష్యతి,
నీచం సాధన మేతేషాం పరోత్సర్గైకజీవినామ్.

ఇష్టస్థానములలో నివాసము మాకు ఎపుడు లభించుతుందో కదా! ఇతరులుచేసిన త్యాగమునే ముఖ్యముగా అవలంబించి జీవనముచేసే వీరి సాధనము (సైన్యరూపమయిన సహాయసంపత్తి) నీచముగా ఉన్నది. దీనిలో అభిప్రేతపదావాసపదమువలన 'ప్రేతలోకపదనివాసము' అనే అర్థము ప్రతీతమవుతున్నది. అది అమంగళరూపము. 'నీచం సాధనం' అనేదానివలన తుచ్ఛమగు శిశ్నము (పురుషావయవము) అనే అర్థము గోచరమవుతున్నది. ఇది లజ్జాకరమయిన అర్థము. 'పరోత్సర్గైకజీవినాం' అనేచోట ఉత్సర్గ శబ్దమువలన అధోవాయువు (అపానవాయువు) అనే అర్థము గోచరమవుతున్నది. ఇది జుగుప్సాకరము. ఇట్లా ఒకే పద్యములో త్రివిధమయిన అశ్లీలము ప్రదర్శితమయింది.

## ౧౭ పరుషము

పరుషం తత్ యత్స్యాద్విహితం పరుషాక్షరైః

పరుషములయిన అక్షరాలచే నిర్దేశింపబడేది పరుషము అనే దోషమవుతుంది. నిరూపింపబడే అర్థానికి అనుగుణముకాని పరుషాక్షరఘటనము ఉన్నప్పుడు పరుషమనే దోషము. ఉదా:-

కుతః కాంతారవృత్తీనాం కార్తార్థ్యార్థిత్వ మస్తి నః?

అరణ్యజీవనము కలిగిన మాకు కృతార్థత ఏవిధముగా ఉంటుంది? దీనిలో కార్తార్థ్యార్థిత్వమనేది పరుష

వర్ణాలచే ఘటితమయింది. కరుణరసానుగుణములు శ్రుతి కటువులూ అయిన వర్ణములు ఉన్నవి. రేఫసంయోగము ద్వితీయాక్షరసంయోగము ఉంటే వర్ణాలు పరుషములవుతవి. కాబట్టి పరుష మనేదోషము. ఈ నిరూపితములన్నీ పదగత దోషములని గ్రహించాలి.

## వాక్యదోషములు

ఇక వాక్యదోషాలను నిరూపించుతాము.

| | | |
|---|---|---|
| శబ్దహీనము | క్రమభ్రష్టము | విసంధి |
| పునరుక్తము | వ్యాకీర్ణము | వాక్యసంకీర్ణము |
| అపూర్ణము | వాక్యగర్భితము | భిన్నలింగము |
| భిన్నవచనము | న్యూనోపమ | అధికోపమ |
| భగ్నచ్ఛందము | యతిభ్రష్టము | అశరీరము |
| అరీతికము | విసర్గలుప్తము | అస్థానసమాసము |
| వాచ్యవర్జితము | సమాప్తపునరాత్తము | సంబంధవర్జితము |
| పతత్ప్రకర్షము | అధికపదము | ప్రక్రమభంగము |

అనే ఈ ఇరవైనాలుగూ వాక్యమును ఆశ్రయించి ఉండే దోషాలు. వీనిస్వరూపములను ఉదాహరణములనూ ఈక్రింది విధముగా తెలుసుకోవాలి.

### ౧ూ శబ్దహీనము

శబ్దశాస్త్రహతం వాక్యం శబ్దహీనం ప్రచక్షతే.

శబ్దశాస్త్రహతమయిన వాక్యము శబ్దహీనము అనే దోషముకలది అవుతుంది. వాక్యము వ్యాకరణశాస్త్ర సంప్రదాయమునకు విరుద్ధమై ఉన్నట్లయితే అది శబ్దహీనము అని భావము. ఉదా:— ప్రతాపరుద్రశత్రువాక్యములలో గ్రహించాలి.

న సంశృణుమహే హంత ! హిత మాప్తై ర్నిమంత్రితం,
యేన కాకతిభూభర్తుః సేవాం హిత్వా హతా వయమ్.

ఆప్తులయినవారు ఉపదేశించిన హితమును మేము వినకపోతిమికదా! అయ్యో! మేము అట్లా వినక కాకతి భూనాథుని సేవను విడిచి చెడిపోయినాము. హితము విన నందువలన వెంటనే రాజ్యభ్రంశము కలిగింది. దీనిలో "హితం న సంశృణుమహే" అనే వాక్యము శబ్దశాస్త్ర హతము కాబట్టి శబ్దహీనమనే దోషదుష్టము. ఈవాక్య ములో సంశ్రవణము క్రియ. హితము కర్మ. "హితం" సంశృణుమహే" అని సకర్మకముగా ప్రయోగించడము దోషము. సమ్ అనేది ఉపసర్గ. సంపూర్వకమయిన శ్రుధాతువు ఆత్మనే పది అయినట్లయితే సకర్మకము కారా దని వ్యాకరణము శాసించుతున్నది. "అర్తిశ్రుదృశిభ్యశ్చేతి వక్తవ్యం" అని వార్తికము. అకర్మకములు సమ్పూర్వక ములూ అయిన "అర్తి-శ్రు-దృశిర్" అనే ధాతువులకుకూడా ఆత్మనేపదత్వమును సంపాదించే 'తఙ్' ప్రత్యయము వస్తుందని వార్తికార్థము. ఈ ఆత్మనేపద విధాయక శాస్త్రములు "అకర్మకాత్" అనే అధికారములో ఉన్న వైనందువలన సమ్అనే ఉపసర్గ పూర్వమున్నపుడు ఆత్మనే పదము (తఙ్) ఉన్నప్పుడు ఈచెప్పిన ధాతువులు అకర్మకములై కావాలికాని సకర్మకములుకారాదు అని తాత్పర్యము. ప్రకృ తములో ఇది సకర్మకము అయినందువలన దుష్టమవుతున్నది.

ఇక్కడ కేవలమూ "సంశృణుమహే" అనేపదమే వ్యాకరణదుష్టము కాబట్టి ఇది పదదోషమె అవుతుంది అని శంకించవచ్చు. కాని అది సముచితముకాదు. "హితం

సంశృణుమహే'' అనే పదద్వయము ప్రయోగము పొంది నపుడె ఈదోషము ఆవిష్కృతము అవుతున్నది. కాని కేవలము ఏకపదప్రయోగములో దోషము లేదు. ''సంశృణుమహే'' అనేపదము దుష్టముకాదు. అది సకర్మకముకావడమె దుష్టము. 'హితం' అనేపదము ప్రక్కన ప్రయుక్తమయినపుడు అది సకర్మక మవుతున్నది. అప్పుడే దుష్టము. కనుకనే ఇది వాక్యదోషమెకాని పదదోషము కాదని గ్రహించాలి. 'రక్షాంసీతి పురాపి సంశృణుమహే' అని భట్టమురారికవి తన అనర్ఘరాఘవనాటకములో 'సంశృణుమహే'అనే దానిని సకర్మకముగా ప్రయోగించాడు. అక్కడకూడా ఈదోషమునే గ్రహించాలి.

### ౧౫ క్రమభ్రష్టము

క్రమభ్రష్టం భవే దార్థః శాబ్దో వా యత్ర న క్రమః.

క్రమము లేకపోయినట్లయితే అది క్రమభ్రష్టము అనే దోషమవుతుంది. ఇది రెండువిధాలు. అర్థగతమయిన క్రమ భంగమని శబ్దగతమయిన క్రమభంగమని. క్రమభంగమే క్రమభ్రష్టము. ఉదా:—

ప్రభవే కాకతీంద్రాయ తురగాః కరిణోఽథవా
ఉపాయన మకుర్వాణా వయం దైవేన వంచితాః.

ప్రభువయిన కాకతీంద్రునకు తురగములను కాని లేక ఏనుగులను కాని ఉపాయనము (కానుక) గా చేయని మేము దైవముచే వంచితులము అయినాముకదా! ఏవయినా వస్తువులను ఒకరికి ఇచ్చేపక్షములో ముందుగా గొప్పవానిని చెప్పాలి. అవి సులభములుకాని పక్షములో తక్కువవానిని చెప్పడము లోకమర్యాద. ఇక్కడ ఉపాయనము ఇవ్వడ

ములో ఏనుగులనుకాని అవి లేకపోయినట్లయితే అశ్వము లనుకాని చెప్పవలసిఉన్నది. గజములు దుర్లభములు. అశ్వములు సులభములుకదా! అశ్వములకన్న గజములు గొప్పవి కదా! గజములు అశ్వములు అని చెప్పడము క్రమము. అటువంటి క్రమము ఈపద్యములో లేదు. 'తురగములను లేక కరులను' అని ఆక్రమము వ్యుత్క్రమముగా చెప్పబడింది. గుఱ్ఱములనుగాని లేకపోయినట్లయితే ఏనుగులనుకాని అని అనడమువలన ఇది అర్థక్రమభంగము.

పాఠక్రమముకన్న అర్థక్రమము బలీయము అని నియమము ఉన్నది. శబ్దములవరుస ఏవిధముగా ఉన్నప్పటికీ అర్థక్రమానుసారంగా శబ్దములను విన్యసించుకొనడము ఆవశ్యకము. ''అగ్నిహోత్రం జుహోతి యవాగూన్ పచతి'' అని వైదికవాక్యము ఉన్నది. ఈవాక్యములో అగ్నిహోత్ర హోమము మొదట, యవాగూపాకము తరువాతనూ, నిరూపింపబడింది. క్రమము ఈవిధముగా ఉన్నప్పటికీ క్రియానుష్ఠానము ఆవిధముగా లేదు. యవాగూపాకము లేకపోయినట్లయితే అగ్నిహోత్రహోమము జరుగనేరదు. కాబట్టి ముందుగా యవాగూపాకమునె చేయాలి. అనంతరము అగ్నిహోత్రహోమమును చేయాలి. ఇట్లా పాఠక్రమము ఉపపన్నము కానిస్థలములో అర్థక్రమమును స్వీకరించడము సముచితము. అట్లాగే ప్రకృతములోకూడా యథాయోగముగా అన్వయమును అంగీకరింపవచ్చునుకదా! ''తురగాన్ కరిణోఽథవా'' అని పాఠము ఉన్నప్పటికీ అర్థక్రమమును అనుసరించి గజములనుకాని లేకపోయినట్లయితే అశ్వము లనుకాని అని అన్వయమును స్వీకరించినట్లయితే దోషము

ఏమీరాదే! అట్లాచేయకూడదా? దీనిని దోషమని అనటము ఎందుకు? అని ఒకశంక.

సత్యమె. ఈ విధానమంతా అపౌరుషేయములయిన వేదవాక్యములలో సముచితము. పౌరుషేయవాక్యాలలో ఈ విధానసమన్వయము సుందరము కాదు. ఇప్పుడు ఈపద్యములో ఉన్నవరుసను వినగానె దీనిని ప్రయోగించినవానికి తారతమ్యము తెలియదు అని గోచరమవుతుంది. భావకప్రతీతి అన్వయవిలంబనమును సహింపదు. కాబట్టి ఇది దుష్టమె అవుతుందని సమాధానమును భావించాలి.

## శబ్దక్రమభంగము

ఉదా:-

కా నామ గణనాస్మాసు కాకతీయస్య భూపతేః.
యశఃప్రతాపయో ర్మగ్నౌ సూర్యాచంద్రమసావపి.

కాకతీయభూపతికి మావిషయమై గణనము ఏమి ఉన్నది? సూర్యాచంద్రమసులు వీరరుద్రుని యశః ప్రతాపములలో మగ్నులయినారు. కాకతీయుని యశములో చంద్రుడు మగ్నుడయినాడు. ప్రతాపములో సూర్యుడు నిమగ్నుడయినాడు. అని భావము. ఈపద్యములో యశః ప్రతాపములలో చంద్రసూర్యులు నిమగ్నులయినారు. అనే శబ్దక్రమము ఉచితము. ఈపద్యములో అట్లా చెప్పలేదు. అందువలన దోషము.

యశః ప్రతాపములు ఒకసముదాయము. సూర్యాచంద్రమసులు వేరొకసముదాయము. ఈసముదాయద్వయమునకు అన్వయము చెప్పవచ్చు. అపుడు యథాయోగ్యముగా అర్థములకు అన్వయము కలుగుతుంది. శబ్దములు ఏక్రమాన

ఉంటే అర్థాలకు అదే క్రమము ఉండడము సముచితముగా ఉంటుంది; కాని కవిసమయసిద్ధమయిన ఉపమానోపమేయ భావమును ఇక్కడ అనుసరింపవలసిఉన్నది. యశశ్చంద్రులకు ప్రతాపసూర్యులకూ ఉపమానోపమేయభావము కవి సమయప్రసిద్ధమై ఉన్నది. దానిని అనుసరించి అన్వయము చెప్పాలి. అపుడు వ్యుత్క్రమంగా సంబంధము ఉన్నప్పటికీ బాధ లేదు. కాబట్టి ఇది అర్థక్రమభంగము కాదు. ఇక్కడ శబ్దప్రయోగములోనే క్రమభంగము ఉన్నదని గ్రహించాలి. యశస్సులో చంద్రునకు ప్రతాపములో సూర్యునకూ మగ్నత ఉంటుందని యథాసంఖ్యన్యాయనియతము. ఈపద్యములో అటువంటి యథాసంఖ్యన్యాయనియతి ఉల్లంఘింపబడింది. ఆ ఉల్లంఘనములో హేతువుగా ఉన్న శబ్దప్రయోగము దుష్టమవుతున్నది. కాబట్టి ఇది శబ్దక్రమభంగానికే ఉదాహరణము అని గ్రహించాలి.

ద్వంద్వసమాసములో ఉండే ఏ ఒకపదమయినా మిగిలిన సర్వార్థమునూ చెపుతుందని ఒక నియమము ఉన్నది. ఇక్కడ యశఃపదము యశఃప్రతాపములను చెప్పగలదు. ప్రతాపపదము ప్రతాపయశస్సులను చెప్పగలదు. ఇట్లాగే సూర్యాచంద్రమసౌ అనేచోటకూడ గ్రహించాలి. ఇప్పుడు మిథోన్వయము (పరస్పరము) చెప్పినట్లయితే అర్థక్రమభంగము లేనే లేదు. శబ్దక్రమభంగముకూడా కలుగదు. కాని ఈవిషయము ఇక్కడ పరిగ్రాహ్యము. ద్వంద్వసమాసములో ఉండని కేవలపదాలు ఒక్కొక్క అర్థమునే చెప్పడము సర్వప్రసిద్ధముగా ఉన్నది. ఒకేపదము అన్నిఅర్థాలనూ చెపుతుంది అనేది అంతగా అనుభవానికి అందడము లేదు. ఇట్లాగే

ద్వంద్వసమాసేతరస్థలములో ద్వంద్వసమాసస్థలములోనూ ఉంటే వ్యవహారము ఉపపన్నమవుతుంది. సమాసములలోని ఒక్కొక్కపదమె సర్వార్థబోధకము అనే నియమమును అందరూ సిద్ధాంతముగా అంగీకరించడము లేదు. కాబట్టి పైద్వంద్వవ్యవహారమును అనుసరించి సర్వవ్యవహారమును వ్యాకులము చేయడము సముచితముకాదు.

## ౨౦ విసంధి 3

విసంహితో విరూపో వా యస్య సంధి ర్విసంధి తత్

విసంధిపదానికి రెండుఅర్థాలు. విగతమయిన సంధి కలది అని ఒకఅర్థము. ఇదె విసంహితము. వర్ణముల పరస్పరసన్నికర్ష సంహిత అవుతుంది. అటువంటి పరస్పరసన్నికర్ష లేకపోయి నట్లయితే ఒకవిధమయిన విసంధి అవుతున్నది. దీనికె విశ్లిష్టము అనిపేరు. విరూపమయిన సంధి ఉన్నట్లయితే విసంధి అవుతుందని రెండవఅర్థము. విరూపము అనగా కర్ణకఠోరము. సంధివశాన కటుశబ్దాలు కలిగేటట్లయితే విసంధి అని భావము. అసలు సంధి లేకపోయినా దోషమె అవుతుంది. ఉన్నా అది కఠోరముగా ఉన్నప్పటికీ దోషమె అవుతుంది. అని తెలుసుకోవాలి. ఉదా :-

శౌర్యాణి ఈదృశా న్యాసన్ క్వ తద్వైశ్వర్యం క్వవాగతమ్.

శౌర్యములు ఇటువంటివి అయినవి. ఆ మహదైశ్వర్యము ఎక్కడికిపోయిందోకదా! శౌర్యాణి ఈదృశాని అనే స్థలములో ఇకారమునకు (ణి) పరముగా సవర్ణమయిన ఈకారము ఉన్నది కాబట్టి "అకస్సవర్ణేదీర్ఘః" అనే పాణినీయసూత్రానుసారముగా సవర్ణదీర్ఘసంధి చేయాలి. సంధి ఉన్నట్లయితే 'శౌర్యాణీదృశాని' అని అవుతుంది. అశ్లీ

అయితే అనుష్టుప్ ఛందము తప్పిపోతుంది. సంధిచేయ వలసిన పదాలకు సంధిచేయకపోవడము విసంహితాత్మకమయిన విసంధి దోషమని గ్రహించాలి. ఇక్కడ ఈసంధి చేయకపోవడమును వ్యాకరణదోషముగా తలచరాదు. సంధి ఏకపదములో నిత్యము. ధాతూపసర్గలకుకూడా సంధి నిత్యము. సమాసములోనూ సంధి నిత్యమె. వాక్యములోమాత్రము సంధి వివక్షాధీనము కాని నిత్యముకాదు. వాక్యములో సంధిచేస్తే చేయవచ్చును. మానితేమానవచ్చును. అందుచేత ఇక్కడ సంధి చేయబడక పోయినప్పటికీ వ్యాకరణవిరుద్ధముకాదు. ఇది విసంధిదుష్టమె. వాక్యములోని విసంహితత్వము వివక్షాధీనము అగుటవలన ఇది దుష్టముకాదని అనవచ్చును. కాని 'శౌర్యాణి ఈదృశాని" అని పట్టిపట్టి పలకడము అశ్రవ్యముగా ఉండడముచేత దోషమె అని పరిగ్రాహ్యము. "పృథ్వైశ్వర్యం" అనే స్థలములో పృథు + ఐశ్వర్యపదాలకు "ఇకోయణచి" అనే సూత్రానుసారముగా యణాదేశసంధి వచ్చింది. ఇది శాస్త్రీయమె అయినప్పటికీ విరూపముగా కర్ణకఠోరముగా ఉండడముచేత విరూపాత్మకమయిన విసంధి అవుతున్నది.

౨౧ పునరుక్తిమత్ ॥

శబ్దార్థపౌనరుక్త్యే తు తద్వాక్యం పునరుక్తిమత్.

శబ్దార్థములకు పౌనరుక్త్యము ఉన్నప్పుడు ఆవాక్యము పునరుక్తి కలది అవుతుంది. శబ్దపౌనరుక్త్యము ఉన్నట్లయితే శబ్దాలంకారము అవుతుంది. పునరుక్తపదాభాసము అని ఆ అలంకారము పేరు. శబ్దము పునరుక్తమయినా అర్థము అపునరుక్తముగానే ఉంటుందికాబట్టి అది అలంకారము.

అర్థపౌనరుక్త్యము అర్థగతదోషమని ముమ్మందు నిరూపిత మవుతుంది. శబ్దార్థములు రెండింటికీ పౌనరుక్త్యము ఉన్నట్లయితే ఈ వాక్యగతదోష మవుతుందని గ్రహించాలి.
ఉదా:—

జీర్ణకాననసంకీర్ణే వింధ్యే కాననవృత్తయః.

జీర్ణారణ్యవ్యాప్తమయిన వింధ్యాద్రియందు మేము అరణ్యజీవనము కలవారమయినాము. ఈ ఉదాహరణములో కానన–కానన అని కాననశబ్దము పునరుక్తమయింది. అరణ్యము అనే దాని అర్థముకూడా పునరుక్తమె. ఇట్లా శబ్దార్థపౌనరుక్త్యము ఉండడము కవిఅశక్తి సూచకము. కాననసంకీర్ణములో కాననవృత్తులమై ఉన్నాము అని అనడము పునరుక్తిమత్తను వాక్యదోషము.

౨౨ వ్యాకీర్ణము ః

వ్యాకీర్ణం తద్విభక్తీనాం వ్యాకీర్ణే చ మిథోన్వయే.

విభక్త్యంతములయిన పదములయొక్క పరస్పరాన్వయము పదాంతరములతో సంబంధము కలిగి వ్యాకీర్ణము అయినట్లయితే వ్యాకీర్ణమనే దోషము. ఉదా:—

సుఖార్థినో మహీపాలా వర్తధ్వం కాకతీశితుః,
ఆజ్ఞా మురసి బిభ్రాణాః శిరసి క్రోడముద్రికాం.

సుఖమును అభిలషించే ఓమహీపాలకులారా! కాకతీశ్వరుని ఆజ్ఞను శిరస్సున, క్రోడాకారముగా ఉన్న ముద్రికను ఉరమునా ధరించినవారై వర్తించండి. పరాజితులు విజేత ముద్రను ఉరమున ధరించాలి అనడము దాస్యలక్షణముగా నిర్దిష్టము. ఇక్కడ ముద్రిక కాకతీయధ్వజమున ఉండే వరాహ ముద్ర అని గ్రహించాలి. క్రోడముద్రను వక్షస్థలాన

ధరించడము ఆజ్ఞను శిరస్సున ధరించడమూ ఉండాలి. అట్లాగే ఆయా పదాలకు అన్వయసంబంధము వివక్షితము. కాని పద్యములో ఆజ్ఞను ఉరమున ధరించడము క్రోడముద్రికను శిరస్సున ధరించడము ఉన్నది. అందువలన దోషము.

౨౩ వాక్యసంకీర్ణము :

వాక్యాంతరపదైః కీర్ణం వాక్యసంకీర్ణ ముచ్యతే,

ఇతరవాక్యములోని పదాలతో వ్యాప్తమయినపుడు వాక్యసంకీర్ణము అనే దోషము. వేరొకవాక్యములో ఉండవలసినపదాలు ప్రకృతవాక్యములో కలిసిఉన్నపుడు ఈదోషమవుతుంది. ఉదా:—

మానేన మహతాఽస్మాభి ర్వనే వక్త్రే న తిష్ఠతాం
వింధ్యస్య జీవితం తన్నో జాత మద్య తృణం కృతమ్.

గొప్పఅభిమానముతో ఏ గడ్డిపోచనయినా ముఖాన ఉంచుకోలేమో ఆగడ్డిపోచయే ఇప్పుడు వింధ్యారణ్యములో తిరుగుతున్న మాకు జీవితమయింది. ఈ పద్యములో "మహతా మానేన యత్ తృణం వక్త్రే న కృతం" అని ఒకవాక్యము. "అద్య వింధ్యస్య వనే తిష్ఠతాం నో జీవితం జాతం" అనేది వేరొకవాక్యము. ఈవాక్యద్వయములోని పదాలు అటూ ఇటూ అన్యోన్యమూ సంకీర్ణములై ఉన్నవి. కాబట్టి వాక్యసంకీర్ణము.

౨౪ అపూర్ణము :

అపూర్ణం తద్భవే ద్యత్ర న సంపూర్ణః క్రియాన్వయః.

ఏవాక్యములో క్రియాన్వయము సంపూర్ణము కాదో అక్కడ అపూర్ణము అనే దోషము. వాక్యపరిపూర్ణతకొరకు

అవసరములయినవి అన్నీ కలియకపోయినట్లయితే క్రియా న్వయము సంపూర్ణత్వము పొందదు. అపుడు ఈదోషము.
ఉదా :—

శైలే ష్వస్మాక మావాసః వన్యైః సోచ్ఛ్వసితా వయం,
మృగై ర్బంధుమత శ్చాస్మాన్ పశ్యన్ ధాతా ప్రమోదతామ్.

మాకు పర్వతములలో నివాసము. మేము వనాలలో ఉత్పన్నములయిన కందమూలాదులతో ఉచ్ఛ్వాసము కలిగి ఉన్నాము. వానిచేతనే ప్రాణాలుకలిగి ఉన్నాము. మృగము లతో బంధువులుకలవార మయినాము. మమ్ములను చూస్తూ విధాత ప్రమోదము పొందుగావుత. ఈపద్యములో "మృగైః బంధుమతశ్చ" అనే మూడోపాదములో 'చ' శబ్దము ఉన్నందువలన అది ఇతరవిశేషణాలను సముచ్చితము చేస్తున్నది. "అస్మాన్" అనే విశేష్యపదానికి 'బంధుమతః' అనేది ఒకవిశేషణము. ఈసరసతనుబట్టి పూర్వార్ధము లోనివికూడా విశేషణములు కావలసింది. అవి ఆవిధముగా నిరూపితములు కాలేదు. 'శైలవాసాన్-వన్యవృత్తీన్-మృగ బాంధవాన్ అస్మాన్ పశ్యన్' అనేది ప్రకృతపద్యములో వివక్షితసంబంధము. ఇది కలుపుకొంటేనే కలగడము లేదు. అందువలన క్రియాన్వయము సంపూర్ణము కావడము లేదు. ఉత్తరార్ధములోఉన్న పశ్యన్ అనే క్రియతో పూర్వార్ధానికి ఉండవలసిన సంబంధము ఏమీ నిరూపితము కానందువలన అపూర్ణమనే దోషము.

## ౨౫ వాక్యగర్భితము ౭

త ద్వాక్యగర్భితం యస్య మధ్యే వాక్యాంతరం భవేత్,

ఒకవాక్యమధ్యములో వాక్యాంతరము కూడిఉన్నట్ల యితే అది వాక్యగర్భితము అనేదోషము. ప్రకృతవాక్య

ములో సంబంధించనట్టి వేరొకవాక్యము ప్రకృతవాక్య మధ్యములో ప్రవేశించి గర్భితముగా ఉన్నట్లయితే ఈదోషము అవుతుంది. ఒకవాక్యార్థమధ్యములో వేరొక వాక్యార్థము చేరినా ఈదోషమె అవుతుంది. అపుడు దీనిని అర్థదోషముగాకూడా చెప్పవచ్చు. కాగా ఈవాక్యగర్భిత మనేది ఉభయదోషము కావచ్చును అన్నమాట. అర్థదోషమని అనడముకంటె ముందుగా శబ్దదోషమని అనడము అంతరంగంగా ఉంటుంది. కాబట్టి ఇక్కడ ఇది శబ్దదోషాలలో పరిగణింపబడింది. ఉదా:—

**జ్ఞాత్వా ప్యంధ్రపురీంద్రస్య క్రోధాగ్ని మతిదుస్సహం,**
**యద్వా న లంఘ్యతే దైవం తస్మిన్నిపతితా వయం.**

ప్రతాపరుద్రుని క్రోధాగ్ని అత్యంతమూ దుస్సహము అని తెలిసికూడా మేము ఆఅగ్నిలో పడిపోయినాము కదా! ఇట్లా చెప్పుకొని ఏమిప్రయోజనము? దైవము ఎవరికీ లంఘింప శక్యముకాదు. ఈపద్యములో "అతి దుస్సహం క్రోధాగ్నిం జ్ఞాత్వాపి తస్మిన్ నిపతితా వయం" అనేది ఒక వాక్యము. ఈవాక్యమధ్యములో "యద్వా న లంఘ్యతే దైవం" అనే వాక్యాంతరము అనుప్రవేశము పొందిది. కాబట్టి ఇది వాక్యగర్భితము.

**౨౬, ౨౭, భిన్నలింగము; భిన్నవచనము ౯, ౧౦.**

యత్రోపమా భవేత్ భిన్నవచనా భిన్నలింగకా
తద్భిన్నవచనం భిన్నలింగం చాహు ర్మనీషిణః.

ఉపమలో ఉపమానము ఉపమేయమున్నూ సమాన వచనములు కలవై సమానలింగములు కలవై ఉండాలి. అట్లాకాక ఎక్కడనయినా ఉపమ భిన్నవచనములో ఉన్నప్పుడు

అనగా ఉపమానము ఒకవచనములోఉంటే ఉపమేయము వేరొక వచనములో ఉన్నప్పుడు భిన్నవచనము అనేదోషము కలుగుతుందని పండితులు పలుకుతున్నారు. ఏదయినా వాక్యములో ఉపమ భిన్నలింగకముగా ఉన్నపుడు అనగా ఉపమానము ఒకలింగములోనూ ఉపమేయము వేరొకలింగములోనూ ఉన్నపుడు భిన్నలింగము అనే దోషమవుతుంది. ఈ రెండిటికి ఉదా :

సముద్రా ఇవ గంభీరం మనో యాదవభూభుజః,
గిరిణేవాంధ్రనృపతిధ్వజిన్యా కలుషీకృతమ్.

యాదవభూమీశుని మనస్సు సముద్రాలవలె గంభీరము. ఆమనస్సు పర్వతముచేవలె ప్రతాపరుద్రుని సేనచే కలుషము చేయబడింది. ఈపద్యములో "సముద్రాఇవ గంభీరం మనః" అనేచోట భిన్నవచనమనే దోషమున్నది. ఇక్కడ ఉపమానము 'సముద్రాః'. ఇది బహువచనములో ఉన్నది. ఉపమేయము 'మనః'. ఇది ఏకవచనములో ఉన్నది. కాబట్టి ఈఉపమ భిన్నవచనము అయింది. ఇక్కడనే ఉపమానోపమేయములయిన సముద్రమనస్సులు భిన్నలింగములుగాకూడ ఉన్నవి. అనగా ఉపమానము పుంలింగములోనూ ఉపమేయము నపుంసకలింగములోనూ ఉన్నది. అయినప్పటికీ ఇది భిన్నలింగానికి ఉదాహరణము కాదు. భిన్నలింగత్వము ఉద్వేగజనకముగా ఉండకపోయినట్లయితే దోషముకాదు. 'ముఖం చంద్రః' అన్నప్పుడు భిన్నలింగత ఉన్నది. అయినా ఉద్వేగము కలుగనందువలన దోషము లేదు. ఆచార్యదండి ఈవిధముగానే అంగీకరించుతున్నాడు. ఆ అభిప్రాయముతో ఇక్కడ భిన్నవచనము అనే దోషమునే విద్యానాథుడు

చెప్పినాడు. 'గిరిణేవ ధ్వజిన్యా' అనేచోట భిన్నలింగత్వము ఉన్నది. అనగా గిరిశబ్దము పుంలింగములోనూ ధ్వజినీ శబ్దము స్త్రీలింగములోనూ ఉన్నది. ఇక్కడఉన్న భిన్న లింగత ఉద్వేజకముగా తలచబడుతున్నది. కాబట్టి ఈ అంశ ములో భిన్నలింగము అనేదోషమును ఊహించాలి.

### ౨౮, ౨౯, అధికోపమ - న్యూనోపమ ౧౧, ౧౨

యత్రోపమాన మధికం న్యూనం వా స్యా ద్విశేషణైః,
తత్రాధికోపమం పూర్వం న్యూనోపమ మతఃపరమ్.

ఉపమానోపమేయాంశములు న్యూనములు అధికములూ కాకుండాఉన్నపుడు ఉపమ అలంకార మవుతుంది. ఆ భేదాలు వచ్చినప్పుడు దోష మవుతుంది. ఏ వాక్యములో ఉపమానము విశేషణాలతో అధికమవుతుందో అక్కడ అధికోపమము అనేదోషము వాటిల్లుతున్నది. ఉపమానము విశేషణాలతో న్యూన మయినట్లయితే న్యూనోపమ అవుతుంది. ఈరెండిటికీ యథాక్రమముగా ఉదాహరణములను పర్శించాలి. అధికోప మకు ఉదా:—

క్షామక్షామముఖాః కాంతాః కాననే మాలవేశితుః,
గ్రీష్మే నద్య ఇవ మ్లానపద్మోత్పలబిసావిలాః.

అరణ్యములో మాళవేశ్వరుని ప్రియురాండ్రు, గ్రీష్మ ఋతువులో పద్మములు ఉత్పలములు బిసములూ వాడి పోవడమువలన పంకిలములై ఉన్న నదులవలె, బాగా ఎండి పోయిన ముఖము కలవారయినారు. దీనిలో కాంతలు ఉప మేయము. నదులు ఉపమానము. ముఖములు ఉపమేయము. పద్మములు ఉపమానము. క్షామక్షామముఖములు కలిగిన కాంతలకు ఉపమానములయిన నదులలో మ్లానపద్మత్వ

మును మాత్రము చెప్పితేచాలు. "మ్లానోత్పలబిసావిలాః" అనేది అంతా అధికమె. దానికి తగిన ఉపమేయములు ఏవీ లేవు. ఇట్లా ఆ విశేషములచేత ఉపమానము అధికమయి నందువలన ఇది అధికోపమ అవుతున్నది.

## న్యూనోపమ

హారాంగరాగసుభగా నగరేషు యథా వయం,
తథైతే నిర్ఝరాకీర్ణా విభాంతి ధరణీభృతః.

పట్టణాలలో మేము హారాలు అంగరాగాలచేత మనోహరముగా ఉన్నట్లే పర్వతములు అదేవిధముగా సెలయేళ్ళతో వ్యాప్తములై భాసించుతున్నవి. ఈ శ్లోకములోని 'యథాతథా' శబ్దముల సన్నివేశమునుబట్టి పర్వతములు ఉపమేయములుగాను. అస్మత్పదార్థము ఉపమానముగానూ గోచరమవుతున్నది. కాని విద్యానాథుని సమన్వయము చూస్తే పర్వతాలు ఉపమానములని అస్మత్పదార్థము ఉపమేయమని తెలుస్తున్నది. దానినిబట్టి "యథాతథా" శబ్దాలకు స్థానమును మార్చుకొనడము సముచితముగా ఉంటుంది. హారాలకు నిర్ఝరాలకూ ఉపమానోపమేయభావము అనుకూలముగా ఉన్నది. ఉపమేయములో అంగరాగము ఉన్నది. కాని దానికి తగిన ఉపమానము లేదు. హారస్థానములో నిర్ఝరములు చెప్పబడినప్పుడు అంగరాగస్థానములో బాలాతపముకాని ధాతురాగముకాని చెప్పబడవలసింది. అట్లా ఏమీ ఉక్తముకాలేదు. అందువలన ఇది న్యూనోపమ. అధికోపమ న్యూనోపమ అనే పేరులలో ఉపమాశబ్దము ఉపమానపరము. కరణవ్యుత్పత్తినిబట్టి అది ఉపమానమును చెపుతుంది. అధికవిశేషణోపమానము ఉన్నట్లయితే అధి

నోపమ అని, న్యూనవిశేషణోపమానము ఉన్నట్లయితే న్యూనోపమ అని గ్రహించవచ్చును. కాగా సాధారణధర్మాధిక్యము ఉన్నప్పుడు అధికోపమ, ధర్మన్యూనత్వము ఉన్నపుడు న్యూనోపమ అని ఫలితార్థము.

౩౦. ౩౧ భగ్నచ్ఛందము : యతిభ్రష్టము ౧౩, ౧౪

ఛందోభగ్నం వచో యత్ర తద్భగ్నచ్ఛంద ఉచ్యతే,
యత్ర స్థానే యతిభ్రంశః తద్యతిభ్రష్ట ముచ్యతే,

ఛందస్సు అనగా వృత్తలక్షణము. అది భగ్నమయినపుడు భగ్నచ్ఛందము అనేదోషము. ఏ స్థానములో యతి అనగా విరతి, విచ్ఛేదము, పదచ్ఛేదముకలుగుట అన్నమాట. అది చెడిపోతుందో అక్కడ యతిభ్రష్టము అనే దోషము ఉంటుంది. వీని ఉదా :-

వింధ్యారణ్యకృత కుటుంబరక్షణస్య,
కింభద్రం భవతి జనస్య మాదృశస్య.

వింధ్యారణ్యములో కుటుంబరక్షణము చేసికొన్న మాకు మావంటి జనునకు భద్రము ఏమయినా కలుగుతుందా? ఈ పద్యములో పై రెండుదోషాలూ కూడిఉన్నని. భగ్నచ్ఛందమును ఈవిధముగా సమన్వయించుకోవాలి. ఇది ప్రహర్షిణీవృత్తముయొక్క పూర్వార్థము. ప్రహర్షిణీ వృత్తములో మగణ నగణ జగణ రగణములున్నూ ఒక గురువున్నూ ఉండాలి. మూడు పది ఈ స్థానములలో యతి ఉండాలి. 'మ్నౌ జ్రౌ గ స్త్రిదశయతిః ప్రహర్షిణీయం' అని వృత్తరత్నాకరములోని ప్రహర్షిణీలక్షణము. కాగా ప్రకృత పద్యములో 'స్య' అనే పాదాంతవర్ణము లఘువు అయిందే కాని గురువుకాలేదు. ద్వితీయపాదాంతములోని 'స్య' అనే

అక్షరము ప్రకృతములో ఉదాహరణము కాదు. ఒక్కొక్క చోట అవసానమందున్న లఘువు ఐచ్ఛికంగా గురువు కావచ్చును. కాగా 'మాదృశస్య' పదములోని 'స్య' వర్ణము ఇచ్ఛాధీనముగా గురువు అవుతుందని అంగీకరించితే ప్రహర్షిణీవృత్తలక్షణము కుదిరింది కాబట్టి దోషోదాహరణము కాదు. అయితే ప్రథమపాదాంతములో ఉన్న 'స్య' అనే వర్ణమే ప్రకృతము లక్ష్యముగా చెప్పదగిఉన్నది. గురువు కావలసినది లఘువు అయినందువలన ఇది భగ్నచ్ఛందము. ఇదికూడా పాదాంతవర్ణమె అయినప్పటికీ గురుత్వము పొందదు. ప్రథమ తృతీయ పాదాంతములలోని లఘువులయిన వర్ణాలు సంయుక్తవర్ణాలు పరములుగా ఉన్నపుడే గురువు లవుతవి. కాని ద్వితీయ చతుర్థ పాదాంతవర్ణాలవలె ఐచ్ఛికంగా గురుత్వము పొందవు. ఈ ప్రథమపాదాంతవర్ణము సంయుక్తపరముగా లేనందువలన గురుత్వమును పొందదు. ఇక్కడ ఈవిషయమును ఈవిధముగానే గ్రహించాలి. వేరొక విధముగా గ్రహించడము అంతగా సముచితము కాదు.

ఇక యతిభ్రష్టము. ప్రథమపాదములో మూడవ అక్షరములు అయినపిమ్మట విచ్ఛేదాత్మకమయిన యతి ఉండవలసింది. 'వింధ్యార' అనే మూడక్షరాలకు విచ్ఛేదము లేదు. అందువలన యతిభ్రష్టము అవుతున్నది.

## ౩౨ అశరీరము ౧౩

క్రియాపదేన రహిత మశరీరం ప్రకీర్త్యతే

క్రియాపదముతో శూన్యముగా ఉండేది అశరీరము అనేదోషము. వాక్యములో క్రియాపదము ఉన్నప్పుడే వాక్యానికి శరీరముఉన్నట్లు. క్రియాపదము లేకపోతే అది

అశరీరమె. దీనినే అనన్వయము అనేదోషముగా చెః తున్నారు. క్రియాపదము లేనప్పుడు అన్వయమే ఉండడి అందువలన ఈపేరు సార్థకము. ఉదా:—

హంత ! నిష్కరుణో ధాతా క్రీడతో మణికుట్టిమే,
కాననే కంటకాకీర్ణే స్థితాన్ పాండ్యశిశూ నిమాన్.

దయలేని ఆవిధాత, మణిమయకుట్టిమప్రదేశాలల క్రీడించుతూఉన్న, కంటకాకీర్ణమయిన అరణ్యమందుఉన ఈపాండ్యదేశపురాజుయొక్క ఈశిశువులను.... ఎంతకష్టము ఈఅర్థముకల పైశ్లోకములో క్రియాపదము విధింపబడలేడ సౌధాంగణములలో క్రీడించు ఈ శిశువులను దయలేనిధా అరణ్యాలలో ఉండేవారినిగా చేసినాడుకదా ! ఎంతకష్టము అనే అన్వయము ఇక్కడ కవికి వివక్షితమె కావచ్చున కాని అది ఈపద్యములో కుదురుపాటు పొందలేదు. తగి క్రియాపదము లేదుకాబట్టి ఇది అశరీరమయింది.

౩౩ అరీతికము ౧౬

రసాననుగుణా రీతి ర్యత్రారీతి స్తదుచ్యతే.

రసానికి అనుగుణము కానట్టి రీతి ఉన్నట్లయితే అ అరీతి అవుతుంది. ఇదే విరుద్ధరీతికమున్నూ అవుతుం ఒక్కొక్క రసానికి ఒక్కొక్కవిధమయిన రచన అనుగుణము అనుగుణరచన ఉండక విరుద్ధరచన ఉన్నట్లయితే అది అరీతి మనే దోష మవుతుంది. ఉదా :—

అఖర్వగర్వదుర్వార దోరర్గళనిరర్గళాః,
హా ! బంధువర్గాః ! సర్వేపి కృతాంతాతిథయః కృతాః.

అతిశయించిన గర్వముకలవారు వారింపశక్యముకా అర్గళములవంటి భుజములుకలవారు అడ్డులేని పరాక్రమమ

కలవారూ అయిన ఓ! బంధుజనులారా! మీరందరూ యమునకు అతిథులుగా చేయబడినారుకదా. దీనిలో కరుణ స్థాయిఅయిన శోకము ఉన్నది. కరుణములో వర్ణపారుష్యముకాని దీర్ఘసమాసముకాని ఉండరాదు. గౌడీరీతి కరుణోచితముకాదు. అయినప్పటికీ ఇక్కడ అనుచితమయిన వర్ణాడంబరము ఉన్నది. దీర్ఘసమాసమూ ఉన్నది. కాబట్టి ఇది అరీతికము.

### ३४ విసర్గలుప్తము ౧౭

ఓత్వం లోపో విసర్గస్య అసకృల్లుప్తవిసర్గకం.

లుప్తవిసర్గము విసర్గలుప్తము రెండూ సమానార్థకములె. విసర్గ లోపించిపోయినట్లయితే ఈదోషము అవుతుంది అని అభిప్రాయము. విసర్గ లోపించిపోవుట అనేక విధాల ఉంటుంది. ఒక్కొకచోట సంధివశాన విసర్గ లోపించుతుంది. వేరొకచోట విసర్గస్థానములో వేరొకవర్ణము వస్తుంది. కాబట్టి అప్పుడున్నూ విసర్గ లోపించుతున్నది. వేరొకవర్ణము వచ్చినా అదీ లుప్తవిసర్గమె. ఓత్వముకలిగినా విసర్గకు లోపముకలిగినా అది లుప్తవిసర్గక మనే దోషము అని లక్షణార్థము. ఇది కేవలమూ ఒకపర్యాయము వస్తే దోషము కాదు. వాక్యములో అసకృత్తుగా ఓత్వము లోపమూ వచ్చినట్లయితే దోషము అవుతుంది. ఉదా:—

వ్యర్థో మనోరథో యాతో జాతో వాసో ధృవో మరౌ,
మ్లానా దీనా హతా జీర్ణా వనాంతే క్ష్వేదృశా వయం.

మా మనోరథము వ్యర్థమయింది. ఆ కోరికంతా పోయింది. మరుభూమిలో శాశ్వతవాసము కల్గింది. వనాంతములో వాడిపోయి దీనులమై జీర్ణులమై హతులమయినాము.

ఇదివరకు భోగభాగ్యాలను అనుభవించిన మేము ఇప్పుడు ఇటువంటివారమ మయినాము. ఈపద్యము పూర్వార్ధములో ఆరుపర్యాయములు విసర్గకు ఓత్వము వచ్చింది. ఉత్తరార్ధములో అయిదుపర్యాయములు విసర్గ లుప్తమయింది ఇటువంటి అనేకపర్యాయములు ఉన్నందువలన దోషము

౩౪ అస్థానసమాసము ౧౮

అపదస్థసమాసం తత్సమాసో యత్ర నోచితః.

అస్థానసమాసము అపదస్థసమాసము రెండూ సమానార్థకములు. సమాసము ఉచితముకానిస్థలములో సమాసము ఉంటే అస్థానసమాసము అవుతుంది. ఉండవలసిన చోట సమాసము లేకపోవడము అక్కరలేనిచోట సమాసము ఉండడము ఈ దోషస్థానము. ఉదా:—

కుతో వైముఖ్య మస్మాసు బ్రహ్మణః పురుషాత్మనః,
ఇత్యుగ్రతరభ్రామ్య ద్భ్రుకుటీకుటిలాననాః.

కఠినహృదయుఁడయిన ఆ బ్రహ్మకు మాయందుపవైముఖ్యము ఎందుకు? అని తీవ్రతరముగా భ్రమించుచూ ఉన్న, కనుబొమలచే కుటిలములయిన ముఖములు కలవారయినారు. దీనిలో, ప్రతాపరుద్రనిర్జితులయిన శత్రువులు బ్రహ్మను కోపించుచూ ఇట్లా పలికారు. ఆవిధముగా పలుకుతూఉన్న ఆ శత్రురాజుల వచనాలలో కోపోద్రేకమును అనుసరించిన సమాసము ఉండవలసింది. వారివచనాలలో సమాసము లేదు. ఉత్తరార్ధమంతా కోపోద్రిక్తశత్రుస్థితిని వర్ణించే కవివచనము. కవివచనములో సమాసము ఉండవలసిన అక్కరలేదు. అది అస్థానము. అక్కడనే సమాసము ఉంది. కాబట్టి ఇది అస్థానసమాసము.

## ౩౬ వాచ్యవర్జితము ౧౯

నోక్తం స్యా ద్యత్ర వక్తవ్యం తదాహు ర్వాచ్యవర్జితం.

వక్తవ్యము ఉక్తము కానప్పుడు వాచ్యావర్జిత మనే దోషము కలుగుతుంది. వాచ్యము చెప్పబడవలసినది. అది వర్జితమయి ఉన్నప్పుడు ఈదోషము. ఉదా:—

దుర్దశాం ప్రతిపన్నానా మస్మాకం జీవితం మతం,

దుర్దశను పొందిన మాకు జీవితము ఇష్టము. ఈపద్య పాదములో "దుర్దశాం ప్రతిపన్నానా మపి" అని "అపి" శబ్దము ఉండవలసింది. దుర్దశను పొందినప్పటికిన్ని అని దాని అర్థము. ఈ అపిశబ్దప్రయోగము ఉన్నప్పుడే జీవితము లోని హేయత్వము స్పష్టమవుతుంది. కాకపోతే వివక్షిత మయిన ఆ అర్థము రాదు. అందుచేత ఇది వాచ్యవర్జిత మనేదోష మవుతున్నది.

## ౩౭ సమాప్తపునరాత్తము ౨౦

సమాప్య పున రాదానే సమాప్తపునరాత్తకం.

అన్వయముద్వారా వాక్యమును సమాప్తము చేసి మళ్లా వేరొకవిశేషణమును కూర్చడముతో వాక్యమును మరల స్వీకరించినట్లయితే సమాప్తపునరాత్తకము అనే దోషము అవుతుంది. ఉదా :

ధావన్మృగేషు సంభ్రామ్య త్కరిషూ వ్యత్తరక్షుషు,
వింధ్యారణ్యేషు తిష్ఠామః క్షుభ్య ద్భల్లూకపంక్తిషు,

పరుగెత్తేమృగాలు కలిగినట్టిన్ని, సంభ్రమముపడుతూ ఉన్న ఏనుగులుకలిగినటువంటివిన్ని, అతిశయించే చిరుతపులులు కలిగిన వింధ్యారణ్యములలో నివసించుతున్నాము. ఆ అర ణ్యములు ఇంకా క్షోభపడే భల్లూకముల పంక్తులు కలిగి

ఉన్నవి. ఈ పద్యములో 'వింధ్యారణ్యేషు తిష్ఠామః' అనే చోట అన్వయము సమాప్తమయింది. వాక్యము అక్కడికి కుదిరింది. "క్షుభ్య ద్భల్లూకపంక్తిషు" అని వింధ్యారణ్య విశేషమును మళ్లా స్వీకరించడమువలన పూర్వవాక్యము ఆకృష్టమయింది. కాగా ఇది సమాప్తపునరాత్తక మనే దోషము.

### ౪౭ పతత్ప్రకర్షము ౨౧

పతత్ప్రకర్షం తత్ప్రాహుః ప్రకర్షో యత్ర విశ్లథః.

ప్రకర్షము శిథిల మయినపుడు పతత్ప్రకర్షమనే దోషము. ఒక్కొకవర్ణనవిధానాన్నిబట్టి ఒక్కొక్కచోట ప్రకర్ష కలుగుతున్నది. ఆ ప్రకర్ష భిన్నరీతివర్ణనమువలన చెడి పోయినపుడు ఈదోష మవుతున్నది. ఉదాహరణము "ధావ న్మృగేషు" అనే పైపద్యమే. దానిలో మృగ గజ తరక్షువుల క్రమము నిర్దిష్టమయింది. దానివలన వింధ్యారణ్యానికి వివక్షించిన ప్రకర్ష కలగడము లేదు. కరి తరక్షుమృగాల క్రమములో ఒక ప్రకర్ష ఉంది. తరక్షువులకన్న గజములు ప్రకృష్టములు. మృగాలు అన్నిటికన్నా అపకృష్టాలు. కాబట్టి "సంభ్రామ్యత్కరిషు, ఉద్వృత్తతరక్షుషు, ధావన్మృగేషు" అని క్రమాన్ని చెప్పవలసింది. అట్లాచెప్పక మృగాలను మొదటగా ఉపాదానము (స్వీకారము) చేయడమువలన వివక్షితప్రకర్ష భ్రంశమైపోయింది. అందుచేత ఈఅంశములో పతత్ప్రకర్ష అనేదోషము ఉన్నది.

### ౪౮ సంబంధవర్జితము ౨౨

**సంబంధవర్జితం తత్స్యాత్ యత్రేష్టేనాన్వయో హతః,**

సంబంధము- ఇష్టయోగము. తద్రహిత మయినది

సంబంధవర్జితము. దీనినే కొందరు అభవన్మత యోగము అని అంటున్నారు. ఎక్కడ ఇష్టమయిన దానితో అన్వయము హతమయిపోతుందో అంటే, ఎక్కడ ఇష్టమయినట్టిది ఉండవలసిన విధాన ఉండదో అక్కడ సంబంధవర్జిత మనే దోషము ఉన్నది. అని భావము. ఉదా:

**భద్రాసనాని దృషదః ఛత్రాణి చ మహీరుహాః,**
**దుర్దశారాజ్యమూర్ధాభిషిక్తాః పున రహో! వయమ్.**

శిలాఫలకములు భద్రాసనములు. వృక్షములు ఛత్రములు. మళ్లా మేము దుర్దశారాజ్యమూర్ధాభిషిక్తులము అయినాము. ఎంత ఆశ్చర్యము. ఈ పద్యములో దుర్దశారాజ్య శబ్దము సమాసములో గుణీభావము పొందింది. అందువలన భద్రాసనాదులతో సంబంధించదు. ఈదుర్దశారాజ్యములో మాకు భద్రాసనములు శిలాఫలకములు. అనే ఇష్టార్థయోగము దీనిలో లేదు. కాబట్టి ఇది సంబంధవర్జిత మనే దోషము.

**౪౦ అధికపదము ౨౩**

యత్రాధికపదోక్తిః స్యాత్తత్రాధికపదం మతం.

ఏ వాక్యములో అధికముగా పదాలు చెప్పబడుతవో అక్కడ అధికపద మనే దోషము. ఉండవలసిన పదాలకంటె అవసరముకాని అధికపదాలు కూర్చబడినప్పుడు అధికపదము అనే దోషము అవుతుంది. ఉదా:—

విముక్తా వల్లభై రేతా వనాంతే ఘూర్జరస్త్రియః,
సుధాంశుమండలాకార రూపక్రమవిపాండురాః.

ఈఘూర్జరస్త్రీలు చంద్రమండలముయొక్క ఆకారము లోని రూపక్రమమువలె విశేషముగా పాండువర్ణము కల

న్వారై ప్రియులచే వనాంతములో విడువబడినారు. దీనిలో స్త్రీవర్ణనములో "సుధాంశుమండలాకారాః" అంటే చాలు. అంతమాత్రాన మండలాకారవిపాండురత్వము పరిపూర్ణ మవుతూనేఉన్నది. అయినప్పటికీ "రూపక్రమ" అని అధిక ముగా చెప్పడమువలన అధికపదము అనేదోషము.

## ౪౧ భగ్నప్రక్రమము ౨౪

ప్రక్రాంతనియమత్యాగే భగ్నక్రమ మిహేష్యతే.

మొదటగా ఉపక్రమించిన నియమమును పరిత్యజించి నప్పుడు భగ్నప్రక్రమము అనేదోష మవుతుంది. మొదట నిరూపించిన క్రమమునే చివరవరకూ నిర్వహించాలి. కావ్య మధ్యలో అది చెడిపోయినట్లయితే ఈదోషము కలుగుతుంది. ఉదా:—

గుహా గృహాణి శబరా బాంధవా వింధ్యభూః పురీ,
సరితో దీర్ఘికాః కష్ట మాక్రీడాః కాననాని నః.

మాకు గుహలు గృహములు. శబరులు బాంధవులు. వింధ్యభూమి పట్టణము. నదులు దిగుడుబావులు. అరణ్య ములు క్రీడావనాలు. అయినవికదా! ఎంతకష్టము!! ఈ పద్యములో అయిదు అంశాలు నిరూపితములు అయినవి. మొదట బహువచనముతో ప్రక్రమము ఉన్నది. మధ్యలో "వింధ్యభూః పురీ" అని ఏకవచనముతో ఒకవిషయము చెప్పబడింది. అందువలన మొదటిక్రమము భ్రష్టము. కాబట్టి ఇది భగ్నప్రక్రమము.

అధికపదము అనే దోషముదగ్గర న్యూనపదము అనే వేరొక దోషాన్నికూడ కలిపికొనడము ఉచితముగా ఉంటుం దని వ్యాఖ్యాతల సూచనము.

వ్యాధైః సహోషితం వింధ్యే హంత వల్కలధారిభిః.

వింధ్యారణ్యములో వల్కలములు ధరించిన (మాచే) వ్యాధులతో కూడా నివసింపబడెను. అనే అర్థము కలిగిన దీనిలో "వల్కలధారిభిః" అనే విశేషణానికి "అస్మాభిః" అనే పదము విశేష్యముగా ఉండవలసింది. అది లేదు. అందు వలన న్యూనపదము అనేదోషము. ఇప్పటికి ఇట్లా చతుర్వింశతి వాక్యదోషాలు నిరూపితము లయినవి. ఇక అర్థదోషములను చెప్పవలసిఉన్నది.

## అర్థదోషములు

| | | |
|---|---|---|
| అపార్థము | వ్యర్థము | ఏకార్థము |
| ససంశయము | అపక్రమము | భిన్నము |
| అతిమాత్రము | పరుషము | విరసము |
| హీనోపమ | అధికోపమ | అసదృశోపమ |
| అప్రసిద్ధోపమ | హేతుశూన్యము | నిరలంకృతి |
| అశ్లీలము | విరుద్ధము | సహచరచ్యుతము |

అని అర్థసమాశ్రయములయిన దోషాలు అష్టాదశ విధములుగా కీర్తితము లవుతున్నవి. వీని స్వరూపోదాహరణములను ఇటుపై ప్రదర్శించుతాము.

### ౧౨ అపార్థము ౧

సముదాయార్థశూన్యం య దపార్థం తత్ప్రకీర్త్యతే.

సముదాయార్థరహితమయినది అపార్థ మనిచెప్పబడుతున్నది. వాక్యములో ప్రత్యేకప్రత్యేకముగా అర్థముఉన్నా సముదాయరూపముగా అర్థము లేకపోయినట్లయితే ఈ దోషము వాటిల్లుతుంది. ఉదా:—

కుత శ్శుష్యదపా నద్యః కా వార్తా చోళమండలే,
ఫణాః సహస్రం శేషస్య భారః కతి కులాచలాః.

నదులఉదకము ఎందువలన ఎండిపోయింది? చోళ మండలములో వార్తయేమిటి? సహస్రఫణాలు ఆదిశేషునకు భారము. కులపర్వతాలు ఎన్ని? దీనిలో ప్రత్యేకప్రత్యేక వాక్యాలకు ఏదోఅర్థము ఉన్నది. సముదాయముగా విశిష్ట వాక్యార్థము ఏదీలేదు. ఇక్కడ వాక్యార్థము ఏదీ ప్రతీయ మానము కాదు. అందువలన అపార్థము.

౪౩ వ్యర్థము ౨

యత్ ప్రయోజనశూన్యం స్యా ద్వ్యర్థం తత్పరికీర్త్యతే.

ప్రయోజనరహితముగా ఉండేది వ్యర్థము అనబడు తుంది. నిరూపింపబడేవానికి ప్రయోజనసంపాదకత్వము ఉండితీరాలి. అట్లా ప్రయోజనకారిత లేకపోయినట్లయితే ఈదోషము వాటిల్లుతుంది. ఉదా :-

నిర్మలం కుల ముద్వేలం శౌర్యం వః ప్రథితం యశః,
కిమి త్యంధ్రపతేః పాదపీఠం పాండ్యై ర్న సేవ్యతే॥

కులము నిర్మలమయినది. శౌర్యము వేలాతిక్రాం తము. మీయశస్సుకూడా ప్రఖ్యాతమె. అంధ్రపతిఅయిన ప్రతాపరుద్రుని పాదపీఠమును పాండ్యులు ఏల సేవించడము లేదు ? దీనిలో 'ప్రతాపరుద్రుని పాదసేవ చేయదగినది' అనేది ఉపదేశములో "నిర్మలం కులం" అనేమొదటిప్రశంస ఈ ఉపదేశములో ఏమీ ఉపయోగించడము లేదు. అందువలన అదిఅంతా వ్యర్థమై వ్యర్థదోషానికి అవకాశము ఇచ్చింది.

౪౪ ఏకార్థము ౩

ఉక్తాభిన్నార్థకం యత్ స్యా దేకార్థం త న్నిగద్యతే.

చెప్పినఅర్థముకన్న అభిన్నమయిన అర్థమే ఉన్నపుడు ఏకార్థము అనేదోషము. ఇదే పునరుక్తార్థము. ఉదా :-

విశీర్ణం శతధా చేతః మూర్ఛితా న్వీక్ష్య బాలకాన్,
శిశూ న్నిశ్చేతనాన్ దృష్ట్వా ఖండితం శతశో మనః,

మూర్ఛపొందిన బాలకులను చూచి మనస్సు శతధా శీర్ణ మయింది. నిశ్చేతనులయిన శిశువులను చూచి మనస్సు నూరువిధాల ఖండితమయింది. దీనిలో పూర్వోత్తరార్థము లలో ఒకేఅర్థ మున్నది. అందువలన ఏకార్థము.

## ౪౨ ససంశయము ౪

వాక్యార్థసంశయో యత్ర తత్ససంశయ మిష్యతే.

వాక్యార్థమువిషయమై సందేహము ఉన్నపుడు ఇది వాక్యార్థమవుతుందా? అది వాక్యార్థమవుతుందా? అని వాక్యార్థసందేహము కలిగినపుడు ససంశయము అని అర్థము. సంశయముతో కూడుకొనిఉన్నది కాబట్టి ఇది సార్థకము. ఉదా :-

కరికుంభౌ స్తనావద్య జయేతాం క్షామతాం గతౌ,
లతా వపుః శ్రియ స్త్రీణాం హసంతు మ్లానతాం గతాః.

ఇపుడు కృశత్వము పొందిన కరికుంభములు స్తనములను జయించుగావుత. అట్టివే అయిన స్తనములు కరికుంభములను జయించుగావుత. మ్లానత్వము పొందిన లతలు స్త్రీల శరీరశోభలను హసించుగావుత. అట్టివేఅయిన స్త్రీల వపుశ్శ్రీలు లతలను హసించుగావుత. ఈపద్యములో:- "కరికుంభౌ స్తనౌ జయేతాం" "లతా వపుఃశ్రియః హసంతు అని రెండువాక్యములు ఉన్నవి. వీనిలో కర్మ ఏదో కర్త ఏదో స్పష్టముగాలేదు. కరికుంభములు కర్త స్తనములు కర్మ. లతలు కర్త. వపుఃశ్రీలు కర్మ. ఈదృష్టితో వాక్యార్థ నిర్ణయము చేయవలయునా? అట్లాకాక స్తనాలు కర్త,

కరికుంభాలు కర్మ. వపుఃశ్రీలు కర్త. లతలుకర్మ. ఈదృష్టితో వాక్యార్థమును నిర్ణయము చేయవలెనా? అనే సందేహము కలుగుతున్నది. ఏ అర్థనిర్ణయానికిగాని సాధకము లేదు. బాధకమూ లేదు. ఇట్లా కర్మకర్తృత్వసంశయము ఉన్నందు వలన ఈదోషము వాటిల్లుతున్నది.

౪౯ అపక్రమము ౫

యత్ర పూర్వాపరీభావవిహతి స్తదపక్రమం.

క్రియలలో కొన్ని పూర్వము ఉంటవి. కొన్ని తరువాత ఉంటవి. అట్లా ఆక్రియలు పూర్వాపరీభావముతో ఉండడము ఒక నియమము. అది ఒక క్రమము. ఇటువంటి పూర్వాపరీభావానికి విహతి కలిగితే అపక్రమము అనేదోష మవుతుంది. ఉదా :-

హంత! వ్యాదాయ వక్త్రాణి నిద్రాంత్యం తర్వణం స్త్రియః,
తృణై స్తత్పతితై రస్మాన్ శిక్షయంత్య స్తథాక్రమం.

వనమధ్యములో స్త్రీలు ముఖాలను తెరచుకొని నిద్రించుతున్నారు. ఆముఖాలలో గడ్డిపోచలు పడుతున్నవి. మమ్మల్నికూడా అదేపద్ధతిని శిక్ష నేర్పుతున్నారా? అన్నట్లున్నది. అంటే, మీరుకూడా ఈవిధంగా గడ్డికరిచినట్లయితే ఈబాధలు ఉండవు. చక్కగా జీవించవచ్చును. అని ఉపదేశించుతున్నట్లుగా ఆస్త్రీలు ఉన్నారు. అని భావము. ఈ పద్యములో నిద్రపోవుటతరువాత ముఖము తెరచుకొనుట అనే లోకప్రసిద్ధమయిన పూర్వాపరీభావము తారుమారయింది. నిద్రోత్తరకాలములో ఉండవలసిన ముఖవ్యాదానము పూర్వకాలములో ఉన్నట్లు చెప్పబడింది. అందువలన అపక్రమ మనే దోష మవుతున్నది.

ఈవిషయమును కొంత విమర్శించి గ్రహించవలసి ఉన్నది. సామాన్యముగా మానవులు ముఖముద్రతో నిద్రించుతారు. నిద్రించగానే శరీరము అవశమవుతుంది. అప్పుడు ముఖము తెరవబడుట సిద్ధమవుతుంది. ఇది మామూలుగా ఉన్నమర్యాద. ముందుగానె ముఖము తెరచుకొని నిద్రపోవడము ఉన్నట్లయితే ఈపద్యములో అదే విధముగా ఉన్నది కాబట్టి ఇది దోషోదాహరణము కాదు. దానిని దోషానికి ఉదాహరించుతున్న కర్త ఆశయమును మనము ఊహించవలసిఉన్నది. "వక్త్రం వ్యాదాయ స్వపితి" అనే ఉదాహరణములో ఒక చిత్రమయిన చర్చ ఉన్నది. దానిని ప్రకృతములోకూడా సమన్వయించుకుంటే తత్వము వెలుపడుతుంది. ఇక్కడ వ్యాదానము స్వాపము అనే రెండు క్రియలు ఉన్నవి. వ్యాదానము స్వాపము అనే ఈరెండు క్రియలకూ ఒకవ్యక్తియే కర్తగా ఉన్నప్పుడు మొదటిక్రియకు వాచకమయిన పదమునకంటె 'క్త్వా' ప్రత్యయము వస్తుంది. అని వ్యాకరణానుశాసనము. 'వ్యాదాయ స్వపితి, అన్నప్పుడు, నిద్రానంతరమే వ్యాదానము సంభవించుతుందిగాని ముందుగా వ్యాదానము సంభవించదుగదా! అప్పుడు వ్యాదానానికి పూర్వకాలత్వము లేదే! పూర్వకాలత్వము లేకపోతే క్త్వాప్రత్యయము ఎట్లావచ్చింది? అని ఒకశంక. లోకప్రసిద్ధముగా ముందు నిద్రపోవడము, తరువాత ముఖవ్యాదానమూ ఉంటుంది. దానిని అనుసరించి ఈ ప్రశ్న ఉత్పన్నమవుతుంది. దీనిని ఈ విధముగా సమన్వయించుకోవచ్చు. ఒక మనుష్యుడు ముందుగా నిద్రపోయినాడు. తరువాత ముఖమును తెరుచుకున్నాడు. ముఖము తెరువబడిన

తరువాత కూడా ఆతడు నిద్రపోతూనే ఉన్నాడు. ఇపుడు ముఖవ్యాదానమునకు పూర్వనిద్ర ఒకటి, తరువాతనిద్ర రెండు. ఇట్లా మొదటినిద్ర రెండవనిద్ర అని పరిగణనకై అనుకోవచ్చు. రెండవనిద్రకంటె ముఖవ్యాదానము పూర్వ కాలములో ఉన్నది కాబట్టి క్త్వాప్రత్యయము రావచ్చును. అందువలన 'వక్త్రం వ్యాదాయ స్వపితి' అనేస్థలంలో ఏఅనుపపత్తిన్నీ లేదు. ఈ విధముగానే వైయాకరణులు అంగీకరించుతున్నారు. ఇంతకూ ప్రకృతపద్యములో అదే విధముగా చూస్తే రెండుక్రియలకూ పౌర్వాపర్యవిహతి ఏమీ లేదే! ఇది దోషము ఎట్లాఅవుతుంది? అని శంకించడానికి వీలుఉన్నది. క్త్వాప్రత్యయమును ఉపపాదించుకొనడానికై రెండవనిద్రకంటె ముఖవ్యాదానము పూర్వక్షణవృత్తి అవుతుందని అనడము సమ్మతమె కాని దోషసమన్వయము కొరకై రెండవనిద్రను గ్రహించకుండా మొదటినిద్రనే స్వీకరించాలి. అయితే స్వాపముకంటె వ్యాదానము మొదట్లో ఉండడానికి వీలు లేదు. వీలు లేనిదానిని పద్యములో నిబంధించడమువలన పౌర్వాపర్యవిఘాత ఉండనే ఉంటున్నది. అందువలననే ఇది అపక్రమ మనేదోష మవుతుంది.

## ౪౭ భిన్నము ౭.

సంబంధవర్జితం యత్ స్యాత్తద్భిన్నం పరికీర్త్యతే.

సంబంధరహితమయిన అర్థము భిన్నము అనే దోషము కలది అవుతుంది. పద్యములో నిరూపింపబడే అర్థాలకు పరస్పరము హేతుహేతుమద్భావము ఉండాలి. ఈ హేతుహేతుమద్భావరూపమయిన సంబంధము, నిరూపించిన అర్థానికి లేనపుడు ఈ చెప్పినదోషము కలుగుతుంది. హేతువు-

కారణము; హేతుమత్-కార్యము. కార్యకారణసంబంధము అని భావము. ఉదా:—

నూనం ఫాలేషు లాటానాం న ధాత్రా లిఖితా లిపిః,
యదస్మాకం కుటుంబాని విషీదంతి మరుస్థలే.

లాటదేశీయుల ఫాలములందు బ్రహ్మ లిపిని లిఖించ లేదు. ఎందువలనంటే మాకుటుంబాలు మరుభూములలో విషాదము పొందుతున్నవికదా! ఈపద్యములో మరుస్థలనివాస విషాదమునకు ఫాలస్థలమున లిపి లేకపోవడమునకూ ఏమీ సంబంధము లేదు. మరుస్థలనివాసవిషాదము పొందవలసినదని ధాత లిపి లిఖించినందువలననె అది జరిగిందికదా! అందు వలన లిపి లిఖితముకాలేదు అనడమునకు, కుటుంబాలు మరు స్థలంలో విషాదము పొందుతున్నవి అని అనడమునకూ కార్యకారణభావము కనబడడములేదు. ప్రతీయమానమవు తూఉండే హేతు హేతుమద్భావము వాస్తవముకాదు కాబట్టి అది పరిగ్రాహ్యముకాదు. ఇట్లా దోషసమన్వయమును దర్శించాలి.

రు. అతిమాత్రము ౭

యత్సర్వలోకాతీతం త దతిమాత్రం ప్రకీర్త్యతే.

సర్వలోకాలనూ అతిక్రమించిఉన్న అర్థము అతి మాత్రము అవుతుంది. ఏమాత్రమూ ఏలోకములోనూ సంబంధించిఉండకుండా ఉండేఅర్థమును వర్ణించితే అది ఈదోషదుష్టము. ఉదా :

మాభూ దేకార్ణవం విశ్వ మితి సంకోచితాశ్రుభిః,
అరణ్యే లాటనారీభి రసంఖ్యా నిమ్నగాః కృతాః.

ఈప్రపంచమంతా ఒకే మహాసముద్రముగా కాకుండు

గావుత అనే అభిప్రాయముతో లాటదేశపుస్త్రీ
కన్నీటిని తగ్గించుకొన్నారు. ఉన్నకన్నీటిని అంత
రింపచేసినట్లయితే ప్రపంచమంతా మహాసముద్ర
వారు చాలావరకు కన్నీటిని తగ్గించడముచేత
సంఖ్యలేనన్ని నదులు అరణ్యములో సిద్ధములయిన
ములో కన్నీటిని సంకోచింపచేసికొన్నప్పటికీ కొద్ది
విడిచిపెట్టినా లెక్కలేనన్ని నదులువచ్చినవని చెప్ప
ఈఅర్థము లోకాతీత మయింది. కన్నీటిచే జగత్తు ఏ
అవుతుందని అనడమున్నూ అత్యుక్తి అని గ్రహిం

౪౯ పరుషము ౭

అతిక్రూరార్థసహితం పరుషం పరికీర్త్యతే.

అతిక్రూరార్థముతో కూడినట్టిది పరుషము
దోషము. మృదువయిన అర్థముతో నిరూపింప
ములో క్రూరముగాచెప్పడము ఉచితముకాదు.

దావానలేంధనం సద్యః క్రియంతా మర్భకా ఇమే.

ఫలములను కోరుతూఉన్న పిల్లలను గురిం
క్యము ప్రవృత్తమయింది. ఈఅర్భకుల సందరి
చ్చులో కట్టెలనుగా పడవేయండి. ఫలములను
వారిని ఇంతక్రూరముగా మాట్లాడడము పరుష
పోతుందా ?

౫౦ విరసము ౯

అప్రస్తుతరసం యత్ర ద్విరసం పరికీర్త్యతే.

సమయముకాని సమయములో రసప్రవృ
డము విరసము అనేదోషము. ఒక్కొక్క ర

ఒక్కొక్క సమయము తగిఉంటుంది. అట్లాకాక అసమయ ములో రసప్రసారమును సూచించితే విరసము. ఉదా :-

చంద్రాననాః కటాక్షై ర్నః పశ్యతామృతవర్షిభిః
శోచిత్వా అల మితి క్లిష్టాః కిరాతై శ్చోళసుభ్రువః.

పురుషవియోగమువలన స్త్రీలు ఖిన్నలైఉండగా వన చరులు చుట్టుముట్టుకొని ఈవిధముగా సంభోగముకొరకై ప్రార్థనముచేస్తున్నారు. ఓ! చంద్రవదనల్లారా! అమృత మును వర్షించు కటాక్షాలతో మమ్మలను చూడండి. మీరు దుఃఖపడవద్దు. మేము ఉన్నాములే! అని చోళదేశస్త్రీలను కిరాతులు క్లేశపెట్టుతున్నారు. భర్తృవిరహంవలన వారు దుఃఖించుతూఉంటే వీరు విరసంగా ఈవిధంగా అనడము ఏమిటి? ఇదంతా విరసంగాఉంది.

## ౫౧ హీనోపమము ౧౦

హీనం యత్రోపమానం స్యాత్తద్ధి హీనోపమం మతం.

ఉపమానము జాతిచేకాని ప్రమాణముచేకాని హీన ముగా ఉన్నట్లయితే అది హీనోపమ అనేదోష మవుతుంది. ఉపమానోపమేయములు జాతిప్రమాణాది విషయములలో సమానములుగా ఉన్నపుడే ఉపమ సముచిత మవుతుంది. అట్లాకానప్పుడు దోషము.

శునకైరివ సారంగా భవద్భి ర్నిహతా ద్విషః,
క్వగతం పౌరుషం తద్వః కాననైకనివాసినాం?

కుక్కలు లేళ్లను కొట్టినట్లు మీరు శత్రువులను కొట్టి నారు. అరణ్యములోనే ముఖ్యముగా నివసించుతూ ఉన్న మీయొక్క ఆ ప్రసిద్ధపౌరుషము ఎక్కడకు పోయింది?

దీనిలో "శునకై రివ భవద్భిః" అని హీనోపమ ఉన్నది. ఉప మానముగా ఉన్న శునకములు జాతిహీనములు.

### ౫౨ అధికోపమము ౧౧

యత్రోపమాన మధికం తద్భవే దధికోపమం.

జాతిచేగాని ప్రమాణముచేగాని ఉపమానము అధిక మయినపుడు అధికోపమము అనేదోష మవుతుంది. ఉదా:-

అమీ పారే సరస్తీరం బకా నిశ్చలమూర్తయః,
మహర్షయ ఇవాస్మాభి రద్య సోపద్రవాః కృతాః.

సరస్తీరముదగ్గరగా నిశ్చలరూపముతో ఉన్న ఈకొంగ లను మహర్షులనువలె మేము ఉపద్రవపెట్టినాము. మహర్షు లను ఉపద్రవము కలుగజేసి వెళ్లగొట్టినట్లు కొంగలను రాళ్లు రువ్వి పోగొట్టినాము. "బకా మహర్షయ ఇవ" అని అధి కోపమము. ఉపమానముగా మహర్షులు జాత్యధికులు. ఈ చెప్పిన రెండుశ్లోకాలలోనూ జాతిన్యూనతకు జాత్యాధిక్యము నకూ ఉదాహరణములు ఇవ్వబడినవి. ఇదేవిధముగా ప్రమాణహీనత్వానికి ప్రమాణాధిక్యమునకు లక్ష్యములను చూచుకోవాలి. ఏదో ఒక సాధర్మ్యమును నిరూపించి చమ త్కారమును సంపాదించాలని కవి వివక్షించుతాడు. ఆ వివక్షితార్థానికి జాతిప్రమాణములను అనుసరించిన ఈ హీన త్వాధిక్యములు కదర్థీకృతిని సంపాదించుతున్నవి. అందువలన అనౌచిత్యము ఒకటి సంభవించుతున్నది. ఇటువంటి దోషా లలో అనౌచిత్యమె దూషకతాబీజమని పెద్దలంటున్నారు.

### ౫౩ అసదృశోపమము ౧౨

యదతుల్యోపమానం తద్భవే దసదృశోపమం

అసమానమయిన ఉపమానము ఉంటే అది అసదృ

శోపమము అనేదోష మవుతుంది. దేనిని ఉపమానముగా నిరూపించుతున్నామో అది ఉపమానముగా ఉండడానికి ఏ మాత్రమూ తగనిదిగా ఉన్నపుడు అంటే ఉపమానోపమేయ ములకు సంబంధించిన ధర్మాలు ఏవీకూడా ఎటువంటి సామ్య మునూ నిరూపించేవిగా లేనపుడు ఈదోషము అవుతుందన్న మాట. ఉదా :-

ఏష విన్ధ్యాచలః సాంద్రకుంజోచ్ఛలితనిర్ఝరః,
ఫాలేక్షణస్ఫురద్వహ్నిశిఖాటోపా ఇవేశ్వరః.

దట్టమయిన నికుంజములలోనుండి పైకి వెలువడిన ప్రవాహములుకల ఈవింధ్యపర్వతము, ఫాలనేత్రములో స్ఫురించుతున్న అగ్నిశిఖాతిశయముకల ఈశ్వరునివలెఉన్నది. దీనిలో కుంజోచ్ఛలిత నిర్ఝరమయిన వింధ్యాచలానికి ఫాలే క్షణస్ఫురద్వహ్నిఅయిన ఈశ్వరునకున్నూ ఏమీ సాదృశ్య ము లేదు. ఉపమానోపమేయాలకు ఏమీ సాదృశ్యప్రసిద్ధి లేదు. తద్ధర్మాలయిన నిర్ఝరవహ్నులకున్నూ ఏమీ సాదృ శ్యము లేదు. అందువలన ఉపమానము తగియుండలేదు. దోషసమన్వయము స్పష్టము.

## ౫౪ అప్రసిద్ధోపమము ౧౩

అప్రసిద్ధోపమానం య దప్రసిద్ధోపమం మతం.

ఉపమానము అప్రసిద్ధమయినది అయినపుడు అనగా కవిలోకక్షుణ్ణము కానపుడు అప్రసిద్ధోపమము అనేదోష మవుతుంది. ఉదా :

బాష్పాంబుక్లిన్ననేత్రాణి ముఖాన్యంగ! మృగీదృశాం
హిమదూషితపత్రాణి కుముదానీవ నిర్ముదాం.

సంతోషములేని ఈమృగనయనలయొక్క బాష్పోద కములచే తడిసిన నేత్రాలుకల ముఖములు, మంచుచే చెడిన

పత్రాలుకల కుముదాలవలె ఉన్నవి. దీనిలో ముఖాలకు కుముదాలకూ ఉపమానోపమేయభావము ఉన్నది. ముఖాలకు కుముదాలు ఉపమానములుగా ఉండడము కవిలోకములో ఎక్కడా ప్రసిద్ధముకాదు.

౨౨ హేతుశూన్యము ౧౪

హేతో ర్వినార్థకథనం హేతుశూన్యం ప్రచక్షతే.

హేతువులేకుండా ఒకవిషయమును చెప్పడము హేతుశూన్య మనేదోషము. ఏదయినా ఒకదానిని నిరూపించితే హేతువు ఉండాలి. అపుడే అది సమంజసము. అహేతుకమయిన విషయవిన్యాసము దుష్టము. ఉదా :-

ముఖానుధావనం జాతం మార్గేస్మిన్ మౌక్తికాంకితే
అన్వేష్ట మన్యతో యామి పదవీయం న సుభ్రువః.

ముత్యాలతో చిహ్నితమయిన ఈ మార్గములో నేను వ్యర్థముగా పరుగెత్తడమయింది. ఇది ఆసుభ్రూమార్గము కాదు. ఆమెను వెతకడానికి వేరొకమార్గాన వెళ్లుతాను. ప్రియురాలి మెడలోని ముత్యాలహారమందలి ముక్తామణులు జారి క్రిందపడినవి కాబోలు. ఇటు ప్రియురాలు వెళ్లిఉంటుంది, అని భ్రాంతిపడి ఇటువచ్చాను. కాని ఈమార్గము ప్రియురాలిదికాదు. ఇక్కడిముత్యాలు ఆమెవి కావు. సింహాము కరికుంభమునుండి తన హస్తముతో ఈముత్యాలను లాగింది. అవి దారిలో పడినవి. అంతే అయియుంటుంది. కాని ఇది ప్రియామార్గము ఎట్లా అవుతుంది. అనిభావము. ఇది సుభ్రూమార్గము కాదనడములో హేతువును చెప్పలేదు, అందువలన హేతుశూన్యము.

## ౫౬ నిరలంకృతి ౧౫

అలంకారేణ రహితం నిరలంకార ముచ్యతే.

అలంకారరహితమయినట్టిది నిరలంకారము అవుతుంది. అలంకారము కాదగిన అలంకారమును కూర్చినపుడే శోభ కలుగుతుంది. ఏమీ అలంకారము లేకుండా చెప్పితే దోషము. ఉదా:—

ఆఘ్రాయ సురభేర్యోని ముఖ్మైః దీర్ఘమేహనైః
మహోక్షైః లంబమానాండై ర్వ్యాకులితం వనం.

గోవుయోనిని ఆఘ్రాణించి ముఖాలను పైకెత్తినవై మేహనములను అనగా పుంవయవములను దీర్ఘములను చేసికొని అండములను వ్రేలాడవేసికొంటూ ఆబోతులు ఈ వనమునంతా వ్యాకులము చేసినవి. దీనిలో అలంకారము ఏమీ లేదు. చమత్కారవిశేషము ఏమీ ఇక్కడ లేదు. వర్ణ్యమానవస్తుస్వభావము గ్రామ్యముగా ఉన్నందువలన సహృదయులకు శ్లాఘాపాత్రము కాదు. శ్లాఘ్యవిశేషణాలున్నూ లేవు. అందువలన స్వభావోక్త్యలంకారమున్నూ లేదు. కాబట్టి ఇది నిరలంకృతి.

## ౫౭ అశ్లీలము ౧౬

అశ్లీలార్థస్య కథన మశ్లీలం పరికీర్త్యతే.

అశ్లీలమయిన అర్థమును చెప్పడము అశ్లీలము అనే దోషము. ఇది అమంగళరూపముగాను జుగుప్సాకరముగానూ వ్రీడాబుద్ధిజనకముగానూ ఉంటుందని ఇదివరలో నిరూపితమయింది. దీని ఉదాహరణముకూడా పూర్వమె ప్రదర్శితము. ఇపుడు ఇది అర్థదోషాలలో పరిగణింపబడుతున్నది. పూర్వము అశ్లీలము పదదోషముగా చెప్పబడింది. అయితే

అసలు అశ్లీలమనేది పదదోషమా ? అర్థ దోషమా ? అనే సందేహము కలుగవచ్చు. పదదోషముగా పరిగణించి ఇది వరకు ప్రదర్శించిన ఉదాహరణములను చూస్తే ఒకవి శేషము గోచరమవుతుంది. పదవినిమయమును సహించని పదాలతో వ్రీడ కలిగేటట్లు అశ్లీలనిబంధనము చేస్తే వ్రీడా జనకాశ్లీలము పదదోష మవుతుంది. పర్యాయపదాలతో వ్రీడ కలిగేటట్లుగా అశ్లీలమును నిబంధించితే వ్రీడాజనకమయిన అశ్లీలము అర్థ దోష మవుతుంది. ఈవి శేషమును పూర్వోదాహరణమువలన గ్రహించవచ్చు. ఇతరోదాహరణములనుకూడా ఈవిధము గానే అభ్యూహించుకొనవచ్చునని విద్యానాథుడు మూలములో చెప్పలేదు.

౫౧ విరుద్ధము ౧౭

విరుద్ధం దేశకాలాది విరుద్ధం బహుధోచ్యతే.

దేశవిరుద్ధము కాలవిరుద్ధము విద్యావిరుద్ధము స్వభావ విరుద్ధమూ అయిన అర్థము విరుద్ధ మనే దోషదుష్టము. ఈ చెప్పినవిధముగా ఇది అనేకవిధాలు కావచ్చు అని సూచన. ఉదా:—

దిశ్యుత్తరస్యాం నేదీయా నుద్వేలో లవణార్ణవః,
మరుదేశేపి గంగా నః పిపాసాం శామయిష్యతి.

ఉత్తరపుదిక్కునందు దగ్గరగా వేలాతిగము అయిన లవణార్ణవము ఉన్నది. మరుభూమిలోకూడా గంగానది మా దప్పికను శమింపజేయగలదు. 'ఈఉదాహరణములో ఉత్తర దిక్కునందు ఉప్పుసముద్రము దగ్గరలో ఉన్నది' అని చెప్పడము దిగ్విరోధము. మరుభూమిలో గంగ అని అనడము దేశవిరోధము. వేరొక ఉదా:—

అరణ్యమహిషోదగ్ర విషాణోదరజన్మనాం
మహత్యర్ఘేపి ముక్తానాం స్త్రియో ముక్తా విభూషణాః

అడవిదున్నపోతుల పెద్దకొమ్ములలో పుట్టిన ముత్యాలకు పెద్దఖరీదుఉన్నా స్త్రీలు ముత్యాలఆభరణాలనుపెట్టుకొంటున్నారు. మహిషవిషాణాలనుండి ముత్యాలు పుట్టుతవి అని అనడము లోకవిరుద్ధము. ఏనుగులు మేఘములు శంఖము ముత్యపుచిప్ప (శుక్తిక) వెదురు మొదలయినవానియందే ముత్యాలు పుట్టడము ప్రసిద్ధము. ఇట్లాగే విరుద్ధాంతరములను ఉదాహరించుకోవాలి.

౫౯ సహచరభ్రష్టము ౧౮

మతం సహచరభ్రష్ట మతుల్యానాం నిబంధనే.

అసమానములను నిబంధించినప్పుడు సహచరభ్రష్టము అనే దోషము. ఒకేస్థలాన నిబంధనములో సమాన ప్రతిపత్తికలవానిని కూర్చాలి. అట్లాకాక అతుల్యనిబంధనము ఉన్నప్పుడు ఈదోషము తప్పదు. ఉదా:—

శాంత్యా శ్రుతం హ్రియా నారీ మన్మథేన రతోత్సవః
శ్రుతేన ధిషణా వన్యవృత్త్యా జీవంతి శాత్రవాః.

శాంతిచే శ్రుతము, సిగ్గుచే యువతి, మన్మథునిచే రతోత్సవము, శాస్త్రముచే బుద్ధి, వన్యవృత్తిచే శాత్రవులూ జీవించెదరు. శాంత్యాదివిశేషములు ఉన్నప్పుడు శ్రుతాదులు బాగాఉంటవి అని భావము. ఈపద్యములో శ్రుతము ధిషణ వీనితో నారీరతోత్సవములు తుల్యములుగా ఉండదగవు. అవి అపకృష్టములు. శ్రుతధిషణలు అందరకూ అత్యంతమూ ఉపాదేయములు సర్వోత్కృష్టములు. నారీరతోత్సవములు కొందరకే ఉపాదేయములు. "వన్యవృత్త్యా జీవంతి శాత్ర

వా:'' అనేది అన్నిటికన్న అపకృష్టము. ఈవిధముగా ఇక్కడ సహచరభ్రష్టమును ఊహించాలి. ఇట్లాగే దోషాంతరము లను యథాసంభవముగా గ్రహించాలి.

## రసదోషము

రసములుకాని భావములుకాని స్వశబ్దవాచ్యములు కావడము దోషము. శృంగారాది రసాలనుకాని నిర్వేదాది వ్యభిచారిభావాలనుగాని రత్యాది స్థాయిభావాలనుగాని స్వస్వశబ్దములతో ఎప్పుడూ చెప్పరాదు. శృంగారరసము పుట్టింది. హాస్యము తిరోహిత మయింది. శంక ఉత్పన్న మయింది. ఉత్సాహము జనించింది. అని ఈరీతిగా స్వస్వ శబ్దాలతో చెప్పకూడదు. సామాన్యముగానూ చెప్పరాదు. విశేషరూపముగానూ చెప్పరాదు. ఆవిధముగా శబ్దాభిధేయత దుష్టము.

విభావాదులు ఉంటేనే రసము ప్రతీత మవుతుంది. విభావాదులు లేకపోతే రసప్రతీతి లేదు. కాబట్టి విభావాది ద్వారకముగానె రసప్రతీతి ఉండాలని సిద్ధాంతము. విభా వాదిప్రతిపాదనము లేకపోతే రసముపుట్టింది భావముపుట్టింది అని వేయిపర్యాయములు చెప్పినా ఎంతబిగ్గరగా చెప్పినా రసము ప్రతీతము కాదు. రసభావాదులయొక్క స్వశబ్దములు లేకపోయినా విభావాదులు చక్కగా ప్రతిపాదింపబడినట్లయితే రసము ప్రతీత మవుతుంది. ఈవిధముగా చూస్తే రసము ఎప్పుడూకూడా స్వశబ్దవాచ్యము కాదని తేలుతుంది. రసము ఎప్పుడూ వ్యంగ్యమేకాని అది స్వప్నములోకూడా వాచ్యము కాదు. నిత్యవ్యంగ్యమయిన రసమును స్వశబ్దములచేత వాచ్యముగా చేస్తే దోషము కలుగుతుంది అన్నమాట.

విభావాది ప్రతిపాదనము ఉన్నప్పుడు స్వశబ్దప్రతిపాదనము ఉన్నా లేకపోయినా ఒక్కటే. అయినప్పటికీ స్వశబ్దాభిధానము ఉంటే వ్యంగ్యమవుతూఉన్న రసము కొంతవరకు అనూదిత మవుతుందేగాని అంతకంటె అధికంగా విశేషమయిన ప్రయోజనము ఏమీ లేదన్నమాట. విభావాదులు బాగా సుయోజితములు అయినప్పుడు ఒక్కొక్కపర్యాయము స్వశబ్దము ఉన్నప్పటికీ దోషము లేదు అనికూడా ప్రకృతములో గ్రహించాలి. అయితే విభావాదిప్రతిపాదనము లేకుండా కేవల స్వశబ్దప్రతిపాదనము ఉన్నప్పుడు దోషమవుతుందని గ్రహించాలి.

రసము అవాఙ్మానసగోచరము. బ్రహ్మానంద సబ్రహ్మచారి. విభావాదుల అనుసంధానానంతరము రసప్రతిపత్తి కలుగుతూఉంటుంది. అది కేవలమూ చర్వ్యమాణైకసారము. ఇది వాచ్యము కావడానికి ఏమీ వీలు లేదు. అయినా బ్రహ్మానందము యథాతథాశబ్దప్రతిపాద్యము అవుతూఉన్నది కాబట్టి రసముకూడా ఎప్పుడయినా ఒకప్పుడు శృంగారాదిశబ్దవాచ్యమయినా ఏమీ దోషము లేదు. అని కొందరు భావించుతారు. ప్రాచీనులు రసమును స్వశబ్దము చేత కూడా చెప్పవచ్చు నన్నారు. అది యుక్తము కాదని గ్రహించాలి.

# గుణప్రకరణము

ఇక గుణాలను నిరూపించుతాము. గుణాలు దోష ప్రతిభటములు. అనగా దోషాలకు విరుద్ధముగా ఉండేవి అని కొందరి భావము. కాని గుణాలకు ప్రత్యేకస్వరూపము లేకపోలేదు. ఈ విషయము మూలములోనే ముమ్మందు విశద మవుతుంది. భామహుడు మొదలయినవారు మూడు గుణాలనె అంగీకరించుతారు. వామనాదులు పదిగుణాలను అంగీకరించారు. భోజరాజు తన సరస్వతీకంఠాభరణములో ఇరవైనాలుగు గుణాలను అంగీకరించి నిరూపించాడు. విద్యానాథుడున్నూ భోజరాజమతానుసారముగా చతుర్వింశతి గుణాలను అంగీకరిస్తాడు.

## గుణములు

| | | | |
|---|---|---|---|
| శ్లేష | ప్రసాదము | సమత | మాధుర్యము |
| సుకుమారత | అర్థవ్యక్తి | ఉదారత | కాంతి |
| ఉదాత్తత | ఓజస్సు | సౌశబ్ద్యము | ప్రేయస్సు |
| ఔర్జిత్యము | విస్తరము | సమాధి | సౌక్ష్మ్యము |
| గాంభీర్యము | సంక్షేపము | భావికము | సమ్మితత్వము |
| ప్రౌఢి | రీతి | ఉక్తి | గతి. |

అనేవి గుణముల పేర్లు. వీనిలో కొన్ని దోషపరిహారకములు కాబట్టి గుణాలు అవుతున్నవి. కొన్ని స్వాభావికంగానె ఉత్కర్ష హేతువులు అగుటవలన గుణము లవుతున్నవి. సహజంగా తామంతట తాము చారుత్వాతిశయమును కలుగజేసే గుణాలు ఉత్కృష్టములు. దుష్టత్వ పరిహార హేతువులుగా ఉండేవానిని అందరూ గుణాలనుగా భావింపరు. దోషాభావరూపములు కావడమువలన గుణత్వము ఉన్నదని

అంగీకరించేవారి మతములోనే సౌకుమార్యము మొదలయినవి గుణాలు అవుతవి. గుణాలకు ప్రత్యేకస్వరూపము ఉన్నదని అనేవారి మతములో ఇవి గుణములు కావు అని గ్రహించవచ్చు.

## దోషాభావరూప గుణములు

| | | |
|---|---|---|
| సౌకుమార్యము | కాంతి | అర్థవ్యక్తి |
| సమ్మితత్వము | ఉదాత్తత | ఔర్జిత్యము |
| రీతి | ప్రసాదము | ఉక్తి |
| సౌశబ్ద్యము | సమత | ప్రేయము |

అనే ఈ పండ్రెండు గుణాలూ దోషాభావరూపములై దోషపరిహారకములుగా ఉండడమువలన గుణములు అవుతున్నవి. ఏ యే గుణము ఏ యే దోషపరిహారకమో ఈ విధముగా తెలుసుకోవాలి.

౧ శ్రుతికటురూప దోషమును నిరాకరించడానికై సౌకుమార్యము గుణముగా అంగీకృతము.

౨ గ్రామ్యదోష నిరాకరణానికి కాంతి అనే గుణము స్వీకృతము అవుతున్నది.

3 అపుష్టార్థము అనే దోషమును దూరీకరించడానికి అర్థవ్యక్తి సమర్థము.

౪ న్యూనపదము అధికపదము అనే దోషాలను నిరాకరించడానికి సమ్మితత్వగుణము అభిమతము.

౫ అనుచితార్థము అనే దోషమును పోగొట్టడానికి ఉదాత్తత స్వీకృతమయింది.

౬ విసంధిదోష నిరాకరణానికి ఔర్జిత్యము అనే గుణము కావాలి.

౭ పతత్ప్రకర్షము అనే దోషమును పోగొట్టడానికి రీతి గుణము అవసరము అవుతుంది.
౮ క్లిష్టదోష పరిహారమునకు ప్రసాదగుణము
౯ అశ్లీలదోషపరిహారానికి ఉక్తిగుణము.
౧౦ చ్యుతసంస్కృతిపరిహారార్థమై సౌశబ్ద్యము
౧౧ ప్రక్రమభంగనిరాకరణానికి సమత అనేది
౧౨ పరుషదోషనివృత్తికై ప్రేయోగుణము అంగీకృతములు అవుతున్నవి. ఇట్లాగే యథాసంభవంగా కొన్ని దోషపరిహారకములు అవుతున్నందువలన గుణములు అవుతున్న వని ఊహించాలి. ఇక ఈ చెప్పిన చతుర్వింశతి గుణాలకూ స్వరూపోదాహరణములను చెప్తాము.

## ౧ శ్లేష

మిథ స్సంశ్లిష్టపదతా శ్లేష ఇత్యభిధీయతే.

పరస్పరమూ పదాలు సంశ్లేషము పొంది ఉంటే శ్లేష అనే గుణ మవుతుంది. సంశ్లేషము పొందడము అంటే అనేకపదాలు ఏకపదము మాదిరిగా అవభాసించడము అని భావము. ఉదా:—

శ్రీమత్కాకతివీరరుద్ర మఖిలక్ష్మాపాల మౌళిస్ఫుర
న్మాణిక్యద్యుతి రంజితాంఘ్రి మఖిలప్రఖ్యాత శౌర్యోదయం
విశ్వత్రాణ వినిద్ర మక్షయగుణజ్యోత్స్నావితానావృత
వ్యోమాగార మనల్పవైభవ మముం స్తోతుం వయం నేశ్మహే.

శ్రీమత్కాకతివీరరుద్రుని పాదాలు, నిఖిలరాజన్యుల శిరములపై ఉన్న స్ఫురన్మాణిక్యద్యుతులచే రంజితములు అవుతున్నవి. సర్వలోకానికీ ఆతని శౌర్యోదయము ప్రఖ్యాత

మయింది. ఆతడు ప్రపంచ సంరక్షణంలో జాగరూకుడు. అతని అనశ్వరగుణజ్యోత్స్నావితానముచేత గగనాగార మంతా ఆవృతము అయింది. ఆతని వైభవము అనల్పము. ఆ వీరరుద్రుని స్తవము చేయడానికి మేముశక్తులము కాము. దీనిలో పాఠసమయములో పదాలు ఒకేపదమువలె అవభా సించుతున్నవి. ఒకపదమువలె అవభాసించడము అంటె అభి ప్రాయము ఇది-పదము పదమూ కలిసినప్పుడు సంధిసౌష్ఠవము వలన ఆపాతతః ఒకే విధానం చెవికి అవభాసించుతూ ఉంటవి. ఆపదాల కలయికలోని సముచ్చారణమున్నూ మసృణమై సంశ్లిష్టంగా వినపడుతుంది. శ్లేష అనే పదవ్యు త్పత్తి సరిసతకూడా ఈభావానికి దోహద మిస్తుంది. 'శ్లిష – సంయోగే' అనేధాతువునుండి శ్లేషపదము ఉత్పన్నమయింది. అనేకపదాలు ఒకటిగా కూడిఉండడము అని అభిప్రాయము.

## ౨ ప్రసాదము

ప్రసిద్ధార్థపదత్వం య త్ప్రసాదో వినిగద్యతే.

ప్రసిద్ధమయిన అర్థాన్ని చెప్పే పదాలు కలిగిఉంటే ప్రసాదము అనే గుణము అవుతుంది. శబ్దమువినగానే అర్థ ప్రత్యయము కలగాలి. ఈ ప్రసాదగుణము అన్నిరసాలకూ అనుకూలము. ఏరచనకయినా అనుగుణము. మాధుర్యగుణ ములో మాదిరిగా ప్రత్యేకంగా ఈ శబ్దాలే ఉండాలి అనే నియమం దీనిలో లేదు. ఉదా:—

ప్రతాపరుద్రదేవోఽయం భాతి లక్ష్మీపతిః స్వయం,
యేనాస్య లోచనే ఫుల్లపుండరీక మనోహరే.

ఈ ప్రతాపరుద్రదేవుడు తాను స్వయముగా లక్ష్మీ పతి అయి అవభాసించుతున్నాడు. ఈతనినేత్రాలు ప్రఫుల్ల

పుండరీక మనోహారములు కదా! శ్రీలక్ష్మీవల్లభుడు పుండరీకాక్షుడు. ప్రతాపరుద్రుడుకూడా పుండరీకాక్షుడు అందువలన లక్ష్మీపతి. దీనిలో వినినంతనే అర్థమును సమర్పించే పదాలు ఉన్నవి. కాబట్టి ప్రసాదగుణము. దూరదూరార్థమును గోచరము చేసికోవలసిన క్లిష్టత ఇక్కడ లేదు.

### ౩ సమత

అవైషమ్యేణ భణనం సమతా సా నిగద్యతే.

విషమత్వము లేకుండాఉండేటట్లు చెప్పడము సమత అనే గుణమని అంటున్నారు. పద్యములోని రచన ఎగుడు దిగుడుగా ఉండక అంతటా ఒకేవిధముగా ఉంటే సమత అన్నమాట. సమానశైలి ఉండాలి. శైలీభేదము ఉండరాదని తాత్పర్యము. ఉదా:—

వదాన్యతరుమంజరీసురభయః శ్రవఃపారణం
గుణా విదధతే సతాం జగతి వీరరుద్రప్రభోః
సుధామధురిమాధరీకరణ చాతురీచుంచవో
వియచ్చర తరంగిణీ విహారదూర్మిమర్మస్పృశః.

వీరరుద్రప్రభువుగుణాలు జగత్తులో సత్పురుషులకు శ్రవఃపారణము చేస్తున్నవి. ఆగుణాలు కల్పవృక్ష మంజరులవలె సురభిళములు మనోహారములూను. అవి ఇంకా అమృత మాధుర్యమును అధఃకరించడములో చాతుర్యము కలిగి ఉన్నవి. ఆకాశగంగలో తిరుగాడుతూఉన్న తరంగాలవలె ఉన్నవి. ఈపద్యము నాలుగుపాదాలలోనూ సమానంగా చెప్పడము ఉన్నది. శైలి సమరీతిలో నడిచింది. కాబట్టి ప్రక్రమభంగదోషము లేదు. అది పరిహృత మయింది.

అంతటా అవిషమ మయినరీతి ఉన్నది కాబట్టి సమత అన్న మాట.

### ౪ మాధుర్యము

యా పృథక్పదతా వాక్యే తన్మాధుర్యం ప్రకీర్త్యతే.

వాక్యములో పదాలు విడివిడిగా ఉండడము మాధుర్యము అనే గుణము. పదాలలో పరస్పరము సంధి లేకపోవడమువలన ఒకటొకటి అతుతుకొనకుండా వేరువేరుగా ఉంటే మాధుర్యము. భోజదేవుడు మాధుర్యలక్షణమును ఈవిధముగానే అంగీకరించుచున్నాడు. ఉదా:—

యశశ్శ్రియః కాకతిభూపతే ర్దిశాం
నితంబబింబేషు దుకూలరీతయః
ఉరోజయో ర్మౌక్తికహారవిభ్రమాః
శిరస్సు జాతీకుసుమస్రగుజ్జ్వలాః.

కాకతిభూపతియశశ్శోభలు దిశానితంబ బింబములందు దుకూలరీతి కలవి అయినవి. వక్షోజములందు మౌక్తికహారవిలాసములు పొందుతున్నవి. శిరస్సులందు మల్లెపువ్వుల మాలలవలె సముజ్జ్వలములై ఉన్నవి. దీనిలో పాఠసమయాన పదాలు వేరువేరుగా ఉన్నట్లు ప్రతీత మవుతుంది. ఇక్కడ దీర్ఘసమాసాలు లేవు. కాబట్టి మాధుర్యము.

### ౫ సౌకుమార్యము

సుకుమారాక్షరప్రాయం సౌకుమార్యం తదుచ్యతే.

సుకుమారము లయిన వర్ణాలు ప్రచురంగా ఉన్నట్లయితే సౌకుమార్యము అవుతుంది. వర్ణాలలో సుకుమారత్వము అంటే అనుస్వారములతో కూడుకొన్న కోమలవర్ణాల

బంధము కలిగిఉండడము అని గ్రహించాలి. సౌకుమార్యము అపరుషత్వము అన్నమాట. ఉదా:—

అమన్దానన్దనిష్యంద సున్దరీవదనేన్దుభిః
నగరే కాకతీన్ద్రస్య దివాప్యాభాతి చంద్రికా.

కాకతీంద్రుని నగరములో అమందానందమును కలుగ జేసే సుందరుల ముఖచంద్రులు ఉండడముచేత పగటిసమయానకూడా వెన్నెల ప్రకాశించుతున్నది. దీనిలోని కోమల వర్ణబంధము సానుస్వారమై ఉన్నది కాబట్టి సౌకుమార్య మును గ్రహించవచ్చు.

## ౬ అర్థవ్యక్తి

యత్తు సంపూర్ణవాక్యత్వం అర్థవ్యక్తిం వదంతి తాం.

వాక్యము సంపూర్ణముగా ఉంటే అర్థవ్యక్తి అవుతుంది. వాక్యములో ఉండవలసిన అంశాలు అన్నీ ఉన్నప్పుడు ఇదేమిటి? ఇదెందుకు? అనే ఆకాంక్ష రాదు. సర్వాంశములూ ఉంటే సంపూర్ణత్వము. అప్పుడు అర్థవ్యక్తి. ఉదా:-

భాగ్యం మధ్యమలోకనిష్ఠ మధునా యేనాస్య సంరక్షితా
జాతః ఖేలతి వీరరుద్రనృపతిః నిస్సీమశౌర్యోదయః.
యద్వా త్రీణ్యపి విష్టపాని దధతే ధన్యత్వ మంశో హరేః
యత్సాక్షా దవతీర్య కాకతికులే స్వైరం సముజ్జృంభతే.

ఈపృథివీమండలానికి నిస్సీమశౌర్యోదయము కల వీర రుద్రనృపతి సంరక్షకుడయి శోభించుతున్నాడు. కాబట్టి ఇప్పుడు భాగ్యమంతా మధ్యమలోకాయత్తమై ఉన్నది. కేవలమూ ఈమధ్యమలోకమె అని అనడమెందుకు? మూడు భువనాలుకూడా ధన్యత్వమును ధరించు తున్నవి. ఏమంటే

శ్రీవిష్ణువు అంశమె కాకతికులములో సాక్షాత్తుగా అవతరించి సాక్షాత్తుగా సముజ్జృంభించుతున్నది. దీనిలో అర్థాన్ని నిరూపించుకొనేటప్పుడు వాక్యము నిరాకాంక్షముగా పరిపూర్ణము అవుతున్నది. క్రియాపదము సరిగా ఉండకపోతే అశరీరము మొదలయిన కొన్నిదోషాలు పరిపూర్ణత బాగాలేక సాకాంక్షములుగా ఉంటున్నవి. నిరాకాంక్షముగా వాక్యము పరిపూర్ణమయినప్పుడు అశరీరాది దోషాలకు అవకాశం ఉండదు. అందువలన ఈగుణము అశరీరాది దోషాలు లేకుండా చేస్తుందని వాటికి ఇది ప్రత్యుదాహరణము అనీ గ్రహించవచ్చు, అయితే అపుష్టార్థ మనే దోషనిరాకరణానికి అర్థవ్యక్తిగుణము సమర్థ మవుతుందని ఇదివరలో అన్నమాట నిజమె. అశరీరాదిదోషాలుకూడా క్రియాపదము లేనందువలన సరైన పరిపోషము లేనివె. కాబట్టి అవిన్నీ అపుష్టార్థములు కావచ్చు. వానిని ఇది నిరాకరించుతుంది అన్నమాట. ప్రకృతములో ఉపయోగించని అర్థము ఉంటే అపుష్టార్థ దోషము అని పూర్వోక్తలక్షణము. ప్రకృతములో ఉపయోగించినా లేకపోయినా అపుష్టార్థముకూడా నిరాకాంక్షముగానే పరిపూర్ణ మవుతున్నది. కాబట్టి అర్థవ్యక్తిగుణముకంటె అది విపరీతముకాదు. అందువలన అటువంటి అపుష్టార్థము ప్రత్యుదాహరణ మని అనుకోరాదు. కాబట్టి సాకాంక్షముగా ఉన్నందువలన అపరిపూర్ణముగా ఉంటే అశరీరాదులుకూడా ఉండవలసిన పరిపోషము లేకుండా ఉంటున్నవి. కాబట్టి అపుష్టార్థములె కావచ్చును అని గ్రహించితే వాని దూరీకరణానికి ఈ అర్థవ్యక్తి అర్హ మవుతుంది అని గ్రంథసమన్వయము చూడాలి.

౭ కాంతి

అత్యుజ్జ్వలత్వం బంధస్య కావ్యే కాంతి రితీష్యతే.

కావ్యములో బంధము అత్యంతమూ ఉజ్జ్వలంగా ఉంటే కాంతి అనే గుణము. ఈ ఉజ్జ్వలత్వము లేకపోతే ప్రాతబడిన బొమ్మమాదిరిగా ప్రబంధచ్ఛాయ బాగా ఉండదు. ఇటువంటి ఉజ్జ్వలత ఉండడమె కాంతి. ఉదా:-

జేతుః కాకతివీరరుద్రనృపతేః జైత్రప్రయాణోత్థితే
క్షోణీరేణుభరే నభస్యతిభృశం భూవిభ్రమం బిభ్రతి,
జాతా మర్త్యనదీవిశంకటతటీ దీర్ఘావియద్దీర్ఘికా
గాఢం గూఢతమా చ గౌతమనదీ పాతాళగంగాయతే.

ఈపద్యము కావ్యప్రకరణములో నిరూపిత మయింది. దీనిలోని రచన ఉదాత్తముగా ఉజ్జ్వలముగా ఉన్నది. కనుక కాంతి అనే గుణము.

౮ ఔదార్యము

వికటాక్షర బంధత్వ మార్యై రౌదార్య మిష్యతే.

అక్షరబంధము వికటముగా ఉన్నప్పుడు ఔదార్యము అనేగుణము. పదాలు నర్తనము చేస్తున్నట్లుగా ఉండాలి అని భావము. వాక్యము పదాలతో కూర్పబడినప్పుడు అది మంచి నడకతో ఉన్నట్లు ఉండాలి. ఆపదాలు నృత్యం చేస్తూ ఉన్నట్లుగా కన్పడాలి. దీర్ఘములతో అనుస్వారములతో కలిసి సహృదయసంవేద్యములై విశాలములుగా ఆపదాలు ఉండాలి. అక్షరాలు ఆవిధముగా ఉన్నప్పుడే వికటాక్షరత. నృత్యములో అంగములు (అంగుళిమొదలయినవి) ఆకుంచన ప్రసారణముల క్రమవిన్యాసము కలిగి రంజకములుగా ఉంటవి. అట్లాగే

ప్రకృతంలోకూడా ముందు మాటలు నర్తనము చేస్తున్నట్లుగా గమించుతూ ఉంటే వెనక వస్తువు వస్తూఉంటుంది. ఉదా:-

జగ్ధ్వా భూయాంసి మాంసా న్యహమహమికయా బద్ధగార్ధ్యా స్సపీత్వాః
అస్రస్రోస్సైచస్తురాస్థ్యుత్కషణభవ కటత్కారరౌద్రాగ్రదంష్ట్రాః
సంభ్రాణాః క్షపాటాః ద్విపగలితవసా నిర్ఝరాంత ర్నదీష్ణాః
కుర్వంత్యాయోధనోర్వోభయ మవనిభృతా మంధ్రసైన్యైనసృష్టాః

అంధ్రసైన్యాలు సృజించిన యుద్ధభూములు సామంత భూపాలకులకు భయమును కలుగజేస్తున్నవి. ఆ యుద్ధభూములలో పిశాచాలు మిక్కుటముగా మాంసమును భక్షించి రక్తపానగోష్ఠిలో "మేము ముందు మేము ముందు" అని అసూయాసహితములై ప్రవర్తించుతున్నవి. అవి పెద్దపెద్ద ఎముకలను గట్టిగా కొరకడముచేత "కటత్ కటత్" అని ధ్వని పుట్టుతున్నది. ఆ కటత్కారముచేత వాని ముందు కోరలు రౌద్రములై ఉన్నవి. చచ్చిపోయిన ఏనుగులనుండి స్రవించిన వసానదులలో ఆపిశాచాలు మునుకలు పెట్టుతున్నవి. ఇట్లా భూతప్రేతపిశాచాలతో కూడుకొన్న యుద్ధభూములు భయజనకములు కదా! దీనిలో అక్షరాలు కదను తొక్కిన విధాన ఉండడముచేత ఔదార్యగుణము.

## ౬ ఉదాత్తత

శ్లాఘ్యై ర్విశేషణై ర్యోగో యస్తు సాస్యా దుదాత్తతా.

సముచితవిశేషణాలతోకూడికఉన్నట్లయితే ఉదాత్తత అనేగుణ మవుతుంది. కూర్పబడే విశేషణాలు మెచ్చదగినవి విశేష్యాలకు తగినవిన్నీ కావాలని భావము. ఉదా:-

బృంహమాణగజాకీర్ణా ప్రేషమాణ హయాకులా
సంక్రీడత్స్యందనా క్ష్వేడభటా రుద్రవిభోశ్చమూః.

రుద్రవిభుసేనలో ఏనుగులు బృంహణము చేస్తూ వ్యాపించిఉన్నవి. అశ్వాలు హ్రేషలుపెట్టుతూ ఆకులములు అయిఉన్నవి. రథాలు సంక్రీడనము చేస్తున్నవి. భటులు సింహనాదము చేస్తున్నారు. దీనిలో గజాశ్వరథభటవిశేషణాలు ఉచితంగా ఉన్నవి. గజాలకు బృంహణము, అశ్వాలకు హ్రేష, రథాలకు సంక్రీడనము, భటులకు సింహనాదము అనేవి అనుగతములయిన ధర్మాలు అని శ్లాఘ్యముగా కూర్పబడినవి కాబట్టి ఉదాత్తత.

## ౧౦ ఓజస్సు

ఓజ స్సమాసభూయ స్త్వం.

సమాసాలు అధికముగా ఉండడము దీర్ఘసమాసాలు ఉండడమూ ఓజోలక్షణము. ఉదా:—

ఉద్దామద్విరదౌఘదానలహరీ సౌరభ్యలోభభ్రమత్
భృంగశ్రేణినిబద్ధఝుంకృతికలావాచాలితప్రాంగణాః
నిస్సీమప్రథమానభూమ విభవారంభప్రియంభావుకా
మోదంతే భువి వీరరుద్రనృపతేః విద్వద్గృహశ్రేణయః.

వీరరుద్రనృపతియొక్క విద్వాంసుల గృహపంక్తులు జగములో సమోద్మదముతో కూడుకొని ఉన్నవి. ఆగృహప్రాంగణాలలో ఉద్దామద్విరదసమూహములు ఉన్నవి. ఆగజాల దానధారాప్రవాహములోని పరిమళలోభముచేత భ్రమరాలు బారులు తీర్చి భ్రమించుతూ ఝుంకారములు చేస్తున్నవి. ఆప్రాంగణములన్నీ ఆఝుంకృతికలావాచాలితములు అవుతున్నవి. ఇంకా ఆగృహాలు నిస్సీమమహిమాతిశయముతో ప్రఖ్యాతములు అయిఉన్నవి. అత్యంతమూ

అందరకూ ప్రియములు అయినవి. దీనిలో సమాస భూయస్త్వము ఉన్నది. కనుక ఓజస్సు.

## ౧౧ సౌశబ్ద్యము

సుపాం తిఙాం చ వ్యుత్పత్తిః సౌశబ్ద్యం పరికీర్త్యతే.

సుబంత తిఙంత విశేషములకు చక్కని వ్యుత్పత్తి ఉండడము సౌశబ్ద్యము అనేగుణము. నామపదాలు ధాతు పదాలున్నూ వ్యుత్పత్తిరమ్యములుగా కూర్పబడినప్పుడు ఈగుణము. ఉదా:—

ఆశామండలకూలముద్వహకథై రభ్రంకషై ర్వైభవైః
రక్షన్ సుప్రజసః ప్రజా స్త్రిభువనక్షేమంకరప్రక్రియః
దుష్టానాం భువి నిప్రహంతు మతులై రాఢ్యంభవిష్ణు ర్గుణైః
భూమ్నా సంచరతేఽద్య కాకతికులే రుద్రావతారో హరిః.

రుద్రావతారముగాఉన్న శ్రీహరి కాకతికులములో ఇప్పుడు మహిమతో సంచరించుచున్నాడు. ఆతని వైభవ కథలు ఆశామండలకూలమును ఒరిపిడిచేస్తూ ఉన్నవి. అభ్రంకషముగా ఉన్నవి. వీనిచేత సుప్రజసులయిన అంటే మంచి సంతానముకలిగిన ప్రజలను రక్షించుచుతూ మూడులోకాలకూ క్షేమంకరమయిన ప్రక్రియకలవాడై ఉన్నాడు. భువిలో దుష్టులను నశింపజేయడానికి అసమానగుణాలతో పరిపూర్ణుడై ఉన్నాడు. దీనిలో "కూలముద్వహకథ, అభ్రంకష, సుప్రజస, క్షేమంకర, ఆఢ్యంభవిష్ణు" అనేపదాలు సుప్తిఙ్ వ్యుత్పత్తికలవి కాబట్టి సౌశబ్ద్యము అనేగుణము. "కూలం ఉద్వహంతీతి కూలముద్వహాః, అభ్రం కషంతీతి అభ్రంకషాః, శోభనాః ప్రజా యాసాంతాః సుప్రజసః, క్షేమం కరోతీతి క్షేమంకరః, ఆఢ్యో భవతీతి ఆఢ్యంభవిష్ణుః" ఈవిధము

లయిన వ్యుత్పత్తులు ఆయా వ్యాకరణసూత్రనియమాను సారంగా ఉన్నవి. ఈ సౌశబ్ద్యము అనేగుణము చ్యుతసం సంస్కారరూప దోషపరిహారార్థము అని అనడము యుక్తము కాదు. అపశబ్దాలు లేకపోతే చ్యుతసంస్కృతి ఉండదు. అంతమాత్రంతో ఆదోషాన్ని పరిహరించవచ్చు. ఈనిరూపిత మయిన స్థలములో సకలసచేతస్కులకున్నూ చేతశ్చమత్కా రమును కలుగజేసే విశిష్టపదప్రయోగము ఉన్నదికాబట్టి స్వతంత్రగుణత్వము ఉంటుందని ఊహింపవచ్చును. అని వ్యాఖ్యాతఅయిన కుమారస్వామిసోమపీథి అభిప్రాయపడు తున్నాడు.

## ౧౨ ప్రేయము

ప్రేయః ప్రియతరాఖ్యానం చాటూక్తౌ యద్విధీయతే.

చాటూక్తిలో విధానింపబడే ప్రియతరాఖ్యానము ప్రేయోగుణము అవుతుంది. చాటూక్తి అంటే ప్రియోక్తి. ఉదా:—

దాక్షిణ్యం త్వయి దక్షతా త్వయి దయా త్వయ్యున్నతత్వం త్వయి
ప్రాగల్భ్యం త్వయి పౌరుషం త్వయి కలాసంపత్త్వయి శ్రీస్త్వయి
ఔదార్యం త్వయి ధీరతా త్వయి జగద్ధౌరేయతా చ త్వయి
శ్రీమత్కాకతినాథ! పాలయ భువం వైరించకల్పాన్ శతం.

ఓ ! కాకతిమహీనాథా ! నీలో దాక్షిణ్యము ఉన్నది. నీలో దక్షత్వము ఉంది. దయ నీలోఉంది. ఉన్నతత్వము నీయందు ఉన్నది. ప్రగల్భత నీలో ఉంది. పౌరుషము నీలో ఉన్నది. నీయందు కలాసంపద ఉంది. నీలో శ్రీ ఉన్నది. నీయందు ఔన్నత్యము ఉంది. నీయందు ధీరత్వము ఉంది. నీలో జగద్ధౌరేయత్వము ఉన్నది. కాబట్టి నీవు నూరు

బ్రహ్మకల్పాలు భూమిని పరిపాలించు. ప్రేమాతియమున వచ్చేపలుకులు ఇక్కడ ఉన్నందువలన ప్రేయోగుణము. ఇది నిష్ఠురవచనాత్మకమయిన పరుషదోషానికి ప్రతిపక్షి.

## ౧౩ ఔర్జిత్యము

ఔర్జిత్యం గాఢబంధత్వం.

విసంధులు లేకుండా ఉండేటట్లుగా గాఢమయిన బంధము కలిగిఉండేటట్లయితే ఔర్జిత్య మనే గుణము. ఉదా:-

క్షోణీరక్షణదక్షిణాః క్షతజగత్క్షోభా ద్దురీక్షక్రమాః
క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధౌ ప్రోత్క్షిప్తకౌక్షేయకాః,
ఉద్దామోద్యమనస్య రుద్రనృపతేః దోర్దండయో శ్చండయోః
గర్జద్దుర్జనగర్వపర్వతభిదా దంభోళయః కేళయః.

దీనిలో రచన గాఢముగా ఉన్నది. ఈ పద్యము కావ్య ప్రకరణము శబ్దచిత్రప్రసంగములో నిరూపితము.

## ౧౪ సమాధి

సమాధి రన్యధర్మాణాం యదన్యత్రాధిరోపణం.

ఒకదాని ధర్మమును వేరొకదానియందు నిరూపించడము సమాధి. చేతనధర్మాలను అచేతనములందు నిరూపించడము కాని అచేతనధర్మాలను చేతనములందు నిరూపించడముకాని, రసనాధర్మములను కర్ణధర్మాలనుగా చెప్పడముకాని ఇట్లాగే అన్యధర్మాలను అన్యములకు చెప్పితే సమాధిగుణము అవుతుంది. ఉదా:—

పృచ్ఛంతీ దుగ్ధసింధుం కుశల మనుసరం త్యాదరా చ్ఛంకరాద్రిం
చాటూక్త్యా మానయంతీ ముహు రమరనదీం చంద్ర మాగేహసంతీ
వైధాత్రీం యానహంసావలి మనుకృపయా స్వాగతం వ్యాహరంతీ
లోకేషు త్రిష్వమీషు ప్రభవతి మహతీ వీరరుద్రస్య కీర్తిః.

వీరరుద్రునికీర్తి పాలకడలిని కుశలము అడుగుతున్నది. కైలాసమును ఆదరముతో అనుసరించుతున్నది. వియన్నదిని మరలమరల చాటూక్తిచే సమ్మానించుతున్నది. ఎదట చంద్రుణ్ణి నవ్వుతున్నది. బ్రహ్మవాహనహంసపంక్తిని అనుసరించుతూ కృపతో స్వాగతము పలుకుతున్నది. మహనీయమయిన ఆకీర్తి ఇట్లా మూడు లోకాలలోనూ ప్రభావముతో కూడుకొని ఉంది. కుశలప్రశ్న మొదలయినవి చేతనధర్మాలు. అవి అచేతనము అమూర్తమూ అయిన కీర్తియందు ఉన్నట్లుగా వర్ణితములు అయినవి కాబట్టి సమాధి.

## ౧౫ విస్తరము

సమర్థనప్రపంచోక్తి రుక్తస్యార్థస్య విస్తరః,

చెప్పినఅంశమును సమర్థించడానికి స్వీకరించిన విస్తృత వచనము ఉన్నప్పుడు విస్తరము అనేగుణము. చెప్పవలసిన అర్థాన్ని విపులంగా చెప్పడము అన్నమాట. చెప్పదలచినది కొంచమె అయినా వచనపల్లవము చమత్కారమును కలుగజేసేదిగా ఉన్నప్పుడు విస్తరము. ఉదా:—

లోకేషు త్రిషు కాకతీశ్వరగుణా౯ స్తోతుం ముహు ర్వీక్షితుం
శ్రోతుం బహ్వభినందితుం చ ఫణినా మేకః క్షమో నాయకః,
యద్వక్త్రాణి సహస్ర మస్య కృతినో యద్ద్వేసహస్రే దృశః
తావేవ శ్రుతయః ఫణా దశశతా న్యత్యద్భుతాందోళనే.

ఈమూడులోకాలలోనూ కాకతీశ్వరుని గుణాలను స్తవముచేయడానికి, మళ్ళీమళ్ళీ చూడడానికి, వినడానికి, బాగా అభినందించడానికిన్నీ ఫణినాయకుడు ఆదిశేషువు ఒక్కడే సమర్థుడు. ఏమంటే? ఆసమర్థుని ముఖాలు వేయి ఉన్నవి. దృక్కులు రెండువేలు ఉన్నవి. చెవులుకూడా అవే.

అత్యద్భుతాందోళనములో పడగలు వేయి ఉన్నవి. పూర్వార్థములో చెప్పినఅర్థాన్ని సమర్థించడానికి పరార్థములో ఉపపత్తులు ప్రదర్శింపబడినవి కాబట్టి విస్తరగుణము ఉన్నది.

### ౧౬. సమ్మితత్వము

యావదర్థపదత్వం తు సమ్మితత్వ ముదాహృతం.

నిరూపించదలచిన అర్థానికి తగినంతగా పదాలు ఉంటే సమ్మితత్వము అవుతుంది. చెప్పదలచిన అర్థముకంటె ఒకపదము ఎక్కువా కారాదు. తక్కువా కారాదు. శబ్దార్థాలు రెండిటికీ సరిగా సామరస్యము ఉండడము అన్నమాట. ఉదా:—

కాకతీయనరేంద్రస్య కీర్తిచందనచర్చనం,
దిగంగనా వితన్వంతి వతంసీకృతతద్గుణాః.

ఇది గతార్థము. సమన్వయము స్పష్టమే. అర్థానికి తగినన్ని శబ్దాలరచన ఉన్నదికదా!

### ౧౭. గాంభీర్యము

ధ్వనిమత్తా తు గాంభీర్యం.

ధ్వని కూడుకొనిఉంటే గాంభీర్యము అనేగుణము. ధ్వన్యమానార్థమును పొదుపుకుంటూ రచనఉండాలి. ఉదా:-

విషం కౌక్షేయకే గంగా కీర్తౌ దిగ్వసనం రిపౌ,
ఇందు ర్ముఖే చ రుద్రస్య కాకతీయస్య దృశ్యతే.

కాకతీయుడయిన రుద్రునకు ఖడ్గములో విషము, కీర్తియందు గంగానది, శత్రువులలో దిగ్వసనము, ముఖములో చంద్రుడూ, కనపడుతున్నారు. ఈపద్యములో శంకరునకు గళమున విషము ఉంది. శిరస్సున గంగ ఉంది. కటిస్థలమున

దిగ్వస్త్రము ఉన్నది. శిరమున చంద్రుడు ఉన్నాడు. అని ధ్వనించుతున్నది. ఇట్లా ధ్వని ఉన్నందువలన గాంభీర్యము.

## ౧౮. సంక్షేపము

సంక్షిప్తార్థాభిధానం య త్సంక్షేపః పరికీర్త్యతే.

సంక్షేపాత్మకమయిన అర్థమును చెప్పడము సంక్షేపము అనే గుణము. ఒక్కొక్కసారి విషయప్రతిపాదనములో విస్తృతిలేకుండా తగినంతగా కొద్దిగా చెప్పడము శోభించుతుంది. ప్రకృతౌచితీవశాన వాక్యసంకోచము చమత్కారకారణంగా ఉంటుంది. అప్పుడు అది సంక్షేపము. ఉదా:-

వంశోఽస్తి కాకతీయానాం తత్రాసన్ బహవో నృపాః
తేషాం భాగ్యవివర్తోయం వీరరుద్రో నరేశ్వరః.

కాకతీయులవంశము ఒకటి ఉంది. అందు అనేక రాజులు ఉండేవారు. ఆవీరరుద్రనరేశ్వరుడు వారందరి భాగ్యవివర్తము. దీనిలో అతివిస్తరముగా చెప్పడమునకు యోగ్యమయిన అర్థము సంక్షేపముగా చెప్పబడింది కాబట్టి సంక్షేపము అనేగుణము.

## ౧౯. సౌక్ష్మ్యము

అంతస్సంజల్పరూపత్వం శబ్దానాం సౌక్ష్మ్య ముచ్యతే.

శబ్దాలకు సంబంధించిన వివక్షితార్థము గర్భీకృతమయిన రూపముతో ఉన్నట్లయితే సౌక్ష్మ్యము అనేగుణము. శబ్దములద్వారా చెప్పదలచిన అర్థము స్పష్టముగా ఉండడము కాక లోలోపల దాగిఉన్నట్లుగాఉంటే ఈగుణమన్నమాట. కరి తురగాదిరూపములు పాషాణాదులలో చెక్కబడి ఒక విధమయిన అభివ్యక్తిని పొందుతున్నప్పటికీ గర్భీకృతమయిన

సూక్ష్మాకారముతో అవభాసించుచుతూ ఉంటవి. అట్లాగే వివక్షితార్థము లోలోపల దాగి లీనాలీనముగా గోచరించుతూ ఉండడమే కాక గర్భగూఢముగా ఉన్నట్లయితే ఈ గుణము అని భావము. ఉదా :-

అధ్యధఃపరిసంశ్లిష్టాః స్థాకృఞ్భూధాతవ స్సదా
వర్తంతే కాకతీయేంద్రే కర్తర్యన్యత్ర కర్మణి.

స్థా, కృఞ్, భూ అనే మూడుధాతువులూ అధి, అధః, పరి అనే ఉపసర్గలతో కూడుకొని నిత్యము కాకతీయ ప్రభువునందు కర్త్రర్థములో ఉంటున్నవి. కాకతీయేతర వ్యక్తియందు కర్మార్థములో ఉంటున్నవి. దీనిలో ధాతువులకూ ఉపసర్గలకూ యథాక్రమముగా అన్వయము ఉన్నది. కర్త్రర్థములో అధితిష్ఠతి, అధః కరోతి, పరిభవతి, అని వివక్షితరూపాలు మూడు నిష్పన్నములు అవుతున్నవి. కర్మార్థములో అధిష్ఠీయతే, అధఃక్రియతే-పరిభూయతే, అని మూడు ఇష్టరూపాలు కలుగుతున్నవి. వీనిని అనుసరించి వాక్యాలు ఇట్లా సిద్ధములవుతవి. "ప్రతాపరుద్రః సింహాసన మధితిష్ఠతి, శత్రూన్ అధఃకరోతి, అరీన్ పరిభవతి, ప్రతాపరుద్రేణ శత్రుపుర మధిష్ఠీయతే, శత్రుః అధః క్రియతే, అరిః పరిభూయతే" అని. ఇట్లా ఈపద్యములో అంతఃసంజల్ప రూపత్వము ఉన్నందువలన సౌక్ష్మ్యగుణము ఉన్నది.

## ౨౦ ప్రౌఢి

ప్రౌఢి రుక్తేః పరీపాక ఇతి కావ్యవిదో విదుః

ఉక్తిలోని పరిపాకము అనగా వైచిత్రీవిశేషము ప్రౌఢి అవుతుంది అని కావ్యవేత్తలు అంగీకరిస్తున్నారు. చెప్పే

మాటలో వైచిత్ర్యవిశేషము కూడుకొని ఉన్నట్లయితే ఈ గుణము ఉంటుందన్నమాట. ఉదా :-

వీప్సా పద్మభవస్య చంద్రముకుటస్యావృత్తి రామ్రేడితం
దైత్యారేః ప్రతిబింబనం సురగిరేః ఇందో స్సముత్తేజనం
కర్ణాదేః పునరుద్భవః సురతరో స్సర్వస్వ మావిష్క్రియా
స్వర్ధేనో రితి తర్కయంతి కవయః శ్రీవీరరుద్రప్రభుం.

శ్రీవీరరుద్రప్రభువును కవులు ఈవిధముగా వితర్కించుతూ ఉన్నారు. శ్రీవీరరుద్రుడు బ్రహ్మదేవుని ద్విర్భావము. ఈశ్వరుని ఆవృత్తి. శ్రీవిష్ణువునకు ఆమ్రేడితము. మేరుపర్వతానికి ప్రతిబింబము. చంద్రునకు సముత్తేజనము. కర్ణాదులకు మళ్లీఉత్పత్తి. కల్పవృక్షముయొక్క సర్వస్వము. కామధేనువు ఆవిష్కారము. అని. అంటే బ్రహ్మదులు మళ్ళీ అవతరించివచ్చి వీరరుద్రరూపముగా ఉన్నారని తాత్పర్యము. దీనిలో అంతటా వీరరుద్రుడు ద్వితీయబ్రహ్మాది రూపముగా వైచిత్ర్యవిశేషముగా చెప్పబడడముచేత ప్రౌఢి గుణము.

## ౨౧ ఉక్తి

విదగ్ధభణితి ర్యాస్యా దుక్తిం తాం కవయో విదుః.

చతురులవచనము ఉక్తి అవుతుందని కవులు అంటారు. చాతుర్యముతో కూడుకొన్నవచనము ఉక్తి అని తాత్పర్యము. విశిష్టమయిన భణితి ఉంటుందన్నమాట. ఉదా:-

దిట్ఠా కమలాసత్తీ రణ్ణో తహసుహా అచిత్తచరిఅస్స
భాసంతో వితుమంతాం కువలఅలచ్ఛిం పసాహేసి.

సుభగుడవు చిత్రచరితుడవూ రాజువూ అయిన నీకు కమలాసక్తి కన్పడుతూనే ఉన్నది. నీవు భాస్వంతుడవూ అవు

తావు. ఆకువలయలక్ష్మిని అలంకరించుతున్నావు. రాజు - చంద్రుడు, కమలాసక్తి-పద్మాసక్తి, సంపదాసక్తి. చంద్రునికి పద్మాలలో ఆసక్తి అనడము చిత్రము. భాస్వంతుడు- సూర్యుడు. కువలయము-భూవలయము, కలువ. సూర్యునకు కలువల ప్రసాదనము చిత్రము. కాబట్టే సుభగచిత్రచరిత్రత. దీనిలో ఈవిదగ్ధభణితి ఉక్తిగుణము అవుతున్నది.

## ౨౨ రీతి

యథోపక్రమనిర్వాహో రీతి రిత్యభిధీయతే.

ఉపక్రమించిన విధాన నిర్వాహము ఉంటే రీతి అనే గుణము. మొదట ఏవిధాన ఉపక్రమము ఉంటుందో ఆవిధంగానే నిర్వహణము ఉండాలి అని భావము. ఉదా:-

షడ్గుణా న్సేవతే రాజా షడ్రిపూ నవమన్యతే
షడ్దర్శనా న్యుపాదత్తే షడ్బలాని చ వీక్షతే,

రాజు షడ్గుణాలను సేవించుతున్నాడు. షడ్రిపువులను శత్రువులను అవమానించుతున్నాడు. షడ్దర్శనాలను స్వీకరించుతున్నాడు. షడ్బలాలను చూస్తున్నాడు. సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము అనేవి షడ్గుణాలు. కామము క్రోధము లోభము మదము మోహము మాత్సర్యము అనేవి షడ్రిపువు లని ప్రసిద్ధము. న్యాయము వైశేషికము, సాంఖ్యము యోగము పూర్వమీమాంస ఉత్తరమీమాంస అనేవి షడ్దర్శనాలు. మూలబలము, భృత్యబలము, మిత్రబలము, శ్రీబలము, ఆటవికబలము, ఆమిత్ర (శత్రువులకు సంబంధించిన) బలము అని షడ్బలాలు. దీనిలో నాలుగుపాదాలలోనూ షట్పదోపక్రమము నిర్వహింప

బడినందువలన రీతిగుణము. ఇది పతత్ప్రకర్ష అనేదోషానికి పరిహారకము అని పూర్వము ఉక్తము.

౨౩ భావికము

భావతో వాక్యవృత్తి ర్యా భావికం తదుదాహృతం.

మంచి ప్రేమకలవాని వాక్యవ్యాపారము ఉన్నట్లయితే భావికము అనేగుణము. ఉదా:-

స్వామిన్ ! తాత ! కులోత్తంస ! వీరరుద్ర ! జగత్ప్రభో !
పుత్రిణాం ధుర మేషోహం పుత్రేణారోపిత స్త్వయా.

ఓ ! స్వామీ ! ఓ ! నాయనా ! కులాభరణుడా ! వీరరుద్రా ! జగత్ప్రభూ ! ఈ నేను పుత్రుడవయిన నీచేత పుత్రులుకలవారి అగ్రపీఠమును అధిరోహింపచేయబడితిని గదయ్యా ! దీనిలో ప్రేమరూపమును విశదముచేసే వాక్యరచన ఉన్నందువలన భావిక మనేగుణము. కుమారుని తండ్రి ఈవిధముగా పిలవడములో ప్రేమఉంటుందికదా !

౨౪ గతి

గతిర్నామ సురమ్యత్వం స్వరారోహావరోహయోః.

పద్యమును పలికేటప్పుడు ఉండే స్వరముల ఆరోహావరోహములయొక్క సురమ్యత ఉంటే గతి అనేగుణము. దీర్ఘాక్షరములు ఉన్నప్పుడు స్వరాలకు ఆరోహము ఉంటుంది. అట్లా లేకపోతే అవరోహము ఉంటుంది. అటువంటి ఆరోహావరోహాలలోకూడా మంచిరమ్యత ఉండాలి. ఉదా:—

ప్రకాశ్యే త్రైలోక్యే సతత మతులైః కాకతివిభోః
మహోభి ర్నిస్సీమై ర్దినకరకరాటోపపటుభిః,
తమఃకృత్స్నం శోకజ్వలదనలరోచిఃపరిచయం
దధత్స్వప్యుద్వేలత్యరిన్నృపమన స్స్వేవ సతతం.

సూర్యకిరణాలవలె అతిశయిత సామర్థ్యముకలిగిన, నిస్సీమములు అసమానములూ అయిన కాకతివిభుని తేజస్సులచేత మూడులోకాలూ నిత్యమూ ప్రకాశితములు అవుతూఉన్నా, శత్రురాజులమనస్సులు సతతము శోకాగ్నిరోచిఃపరిచయమును ధరించుతూఉన్నప్పటికీ, అంధకారము అంతా శత్రురాజుల మనస్సులలోనే అతివేలమై ఉన్నది. ఈపద్యము పూర్వార్థములో దీర్ఘాక్షరములు ఉన్నందువలన స్వరము ఆరోహము పొందుతున్నది. ఉత్తరార్థములో అవరోహము ఉన్నది. గానానుగుణపాఠములో ఈ ఆరోహావరోహాలు విశదములు అవుతవి. ఇట్లా గతిని సమన్వయించుకోవాలి.

## గుణాలంకారభేదము

ఈగుణాలు అర్థగతములుకూడా అవుతవని వామనాదులు అంగీకరించుతున్నారు. వామనుడు తన కావ్యాలంకారసూత్రవృత్తిలో శ్లేష, ప్రసాదము, సమత, మాధుర్యము, సుకుమారత, ఉదారత, కాంతి, ఉదాత్తత, ఓజస్సు, ప్రౌఢి, అనే పది శబ్దగుణాలను మొదటగా అంగీకరించి అవే అర్థగతములుకూడా అవుతవని నిరూపించాడు. ఇట్లా వామనుడు అంగీకరించడము ఉచితముగా లేదు. ఇట్లాగే అయితే గుణాలంకారాలకు భేదము కుదరదు. గుణములుశబ్దగతములు. అర్థగతములూను. అలంకారములుకూడా శబ్దగతములు అర్థగతములుగానే ఉన్నవి. కాగా భేదము ఎట్లాకుదురుతుంది? వామనుడు ఒకవిధముగా గుణాలంకారభేదమును అంగీకరిస్తున్నాడు కాని అది ఉపపన్నము కాదు.

వామనుడు అంగీకరించేభేదము ఇట్లా ఉంటుంది. గుణాలు కావ్యశోభాసంపాదకధర్మాలు. గుణాలు స్వతస్సిద్ధముగానే కావ్యశోభను ఆపాదించగలవు. అలంకారములు అట్లాకాదు. అవి తమంతటతాము శోభాకారులు కాలేవు. గుణాలు కావ్యములో సంపాదించిన శోభను అలంకారాలు అతిశయింపచేయగలవు. కాబట్టే అలంకారాలు శోభాతిశయాధాయకములు అని.

ఈవామనోక్తి వామనమెకాని వికల్పసహానముకాదు. చూడండి! రీతి కావ్యానికి ఆత్మ అని వామనమతము. రీతి అంటే ఆతనిమతంలో గుణవిశిష్టపదరచన. అది వైదర్భిరీతి గౌడీరీతి పాంచాలీరీతి అని త్రివిధము. వైదర్భి సర్వగుణ విశిష్టము. గౌడీపాంచాలీరీతులు కొన్నిగుణాలుమాత్రమె కలిగిఉంటవి. ఇదంతా వామనుడు అంగీకరించిన ప్రణాళిక. ఇది ఇట్లాఉండగా;

ఈవిషయమును ఇక్కడ పరిశీలించాలి. గుణాలు కావ్యశోభాహేతువులు అయితే సర్వగుణాలూ కావ్యశోభాహేతువులె అని అనాలికదా? అప్పుడు సర్వగుణవిశిష్ట అయిన వైదర్భియె కావ్యాత్మ అవుతుందికాని కతిపయగుణాలు కలిగినగౌడీపాంచాలీరీతులు కావ్యాత్మ కాజాలవు. వానిని రీతిభేదములలో పరిగణించడము అసముచితము అవుతుంది. కాబట్టి సర్వగుణాలూ ఉంటేనే కావ్యశోభ కలుగుతుంది అని అనడము యుక్తముకాదు. గౌడీపాంచాలీరీతులనుకూడా కలిపికొనడానికి కతిపయగుణాలు ఉన్నా కావ్యశోభ కలుగుతుంది అని అంగీకరించితే కేవలమూ ఓజస్సు శ్లేషగుణాలు కలిగి శుష్కశాస్త్రానుకూలార్థము కలిగిన నీరసస్థలములో

కూడా కావ్యత్వము ఉన్నదని అనవలసివస్తుంది. కేవలమూ అంతమాత్రాన కావ్యత్వము ఉంటుందని సహృదయులు ఎవరూ అనరు. కాబట్టి గుణాలు కావ్యశోభాకారులు అని అనడము యుక్తిసహము కాదు. అదే కుదరనపుడు తన్మూలకమయిన అలంకారాలశోభాతిశయాధాయకత్వమున్నూ ఉపపన్నము కాదు.

గుణాలంకారాలకు భేదకథనము ఆవశ్యకము కాబట్టి ప్రాచీనులయిన సాహిత్యాచార్యులమతమును అనుసరించి "గుణాలు సంఘటనాశ్రయములె" అని అనడము ఉచితపక్షము. అలంకారసర్వస్వములో ఇట్లాగే నిరూపితము అయింది "గుణాలు సంఘటనాధర్మములు. అలంకారాలు శబ్దార్థధర్మములు. ఈవిధముగానే గుణాలంకారవ్యవస్థానము ఉన్నది" అని. ఈభంగిని అనుసరించియే గుణాలంకారాలకు స్వరూపభేదము నిరూపితమయింది. ఇట్లాకాకపోతే గుణాలంకారాల స్వరూపభేదము దుర్నిరూపమవుతుంది. ఏవిధముగానూ భేదము చెప్పడము కుదురదు. కావ్యానికి శోభ కలగజేయడము అనేది గుణాలకు అలంకారాలకూ సమానమె. ఈవిషయమునె రుద్రభట్టు ఈవిధంగా చెపుతున్నాడు.

యో హేతుః కావ్యశోభాయాః సోఽలంకారః ప్రకీర్త్యతే
గుణోపి తాదృశో జ్ఞేయః దోషః స్యాత్తద్విపర్యయః.

కావ్యానికి శోభాహేతువు అగునది అలంకారము. అని చెప్పబడుతున్నది. గుణముకూడా అటువంటిదే అని గ్రహించాలి. కావ్యశోభాకారికాకుండా తద్విపర్యయాత్మకముగా ఉండేది దోషము అవుతుంది అని. కాబట్టి గుణాలకు

సంఘటనాశ్రయత్వమును చెప్పడమె యుక్తము. అదే వానికి భేదకధర్మము.

ఈచెప్పిన గుణాలంకారభేదము ప్రాచీనమతానుసారి అని గ్రహించాలి. శ్లేషాదిగుణాలు పది ఉన్నవని అవి మాధుర్యాదులలో అంతర్భావింపవని అవి శబ్దధర్మములని ప్రాచీనులు అంగీకరిస్తారు. కాబట్టి ఉద్భటాదిమతములలోనే ఇది ఉపపన్నము అవుతుంది. భామహుడు మొదలయిన కొందరు శ్లేషాదిగుణాలను మాధుర్యాదిత్రికములో అంతర్భవింప చేస్తారు. వారిమతాన్నిబట్టి గుణాలు రసధర్మాలు, అలంకారాలు శబ్దార్థధర్మములు అని భేదమును అంగీకరించాలి. ఈవిధముగా వీనికి స్వరూపభేదము కలుగుతుంది. కాబట్టే పూర్వము కావ్యప్రకరణములో అనుప్రాసోపమాదులు హారాద్యలంకారములవంటివని శ్లేషాదిగుణములుశౌర్యాదుల వంటివని నిరూపిత మయింది. గుణాలంకారభేదనిర్వచనంలో విద్యానాథహృదయము కావ్యప్రకరణములోనే సునిరూపిత మయింది. ఈగుణప్రకరణములో ఈవిధముగా గుణములను నిరూపించడము గుణాలంకారభేదకథనములో వాదాంతరములను ప్రదర్శించడమూ అనేది అంతా, ప్రాచీనజరత్తరానుసారిత, అప్పటి పెద్దలను అనుసరించడమూ ఉన్నపుడు తన్మతప్రదర్శనముకూడా ఆవశ్యకమని సూచించడానికే అని గ్రహించాలి.

# శబ్దాలంకార ప్రకరణము

## అలంకారస్వరూపము

కావ్యసామగ్రిలో అలంకారాలు తప్ప మిగతావి అన్నీ నిరూపితము లయినవి. గుణాలను నిరూపించిన తరువాత అలంకారాలను నిరూపించవలసి ఉన్నది. అలంకార శబ్దముయొక్క వ్యుత్పత్తిని ప్రదర్శించితే సామాన్యంగా అలంకారలక్షణము చెప్పిన ట్లవుతుంది. 'అలంక్రియతే అనేన ఇత్యలంకారః' అని అలంకారపదవ్యుత్పత్తి. దేని నయినా అలంకరించేది అలంకారము అవుతుంది అని భావము. అలంకారములచేత సామాన్యముగా రసము అలంకరింపబడేది అవుతూ ఉంటుంది. ధ్వని ప్రస్థానానుయాయులు అంగీకరించే గుణాలు నియమంగా రసోపకారములు అవుతూ ఉంటవి. అలంకారాలు అట్లా కాదు. రసానికి ఇవి ఉపకారులు కావచ్చు కాకపోవచ్చు. గుణాలకు అలంకారాలకూ ఈ తేడా కనపడుతూ ఉంది. ఈవిషయంలో పెద్దలయిన కావ్యప్రకాశకర్తలున్నూ ఇట్లే అభిప్రాయపడుతున్నారు. అలంకారాలు కావ్యాంగము లయిన శబ్దార్థాలకు ఉత్కర్ష కలుగచేస్తూ వానిద్వారా అంగి అయిన రసము అనేది ఉన్నప్పుడు దానిని ఉపస్కరించుతూ ఉంటవి. వివక్షితంగా రసము లేని చిత్రకావ్యస్థలములో అలంకారాలు శబ్దార్థాలకు వైచిత్ర్యమును మాత్రము సంపాదిస్తూ అంతమాత్రములో పర్యవసానము పొందుతవి. అనుప్రాసాదిశబ్దాలంకారములుకాని ఉపమాదులయిన అర్థాలంకారములుకాని, ఈ

విధముగా ఉంటవి. కనుకనే ఇవి లోకప్రసిద్ధము లయిన హారకేయూరాద్యలంకారముల వంటివి. అనే ఈ అభిప్రాయము కల కారిక కావ్యప్రకాశలో;

ఉపకుర్వంతి తం సంతం యేఽంగద్వారేణ సంశ్రితాః,
హారాదివ దలంకారాః తేఽనుప్రాసోపమాదయః.

అని నిరూపిత మయింది. కరచరణాద్యవయవము లందు కూర్చబడే వలయనూపురాదులు అలంకారము లని ప్రసిద్ధముకదా! అవి ఆయా అవయవములందు ఉంటూ వానికి ఉత్కర్షను కలుగజేస్తూ తద్ద్వారా అవయవిని అలంకరించుతున్నవి. అట్లాగే కావ్యావయవము లయిన శబ్దార్థములందున్న అనుప్రాసోపమాదులు శబ్దా లంకారములుగా అర్థాలంకారములుగా ప్రసిద్ధి పొంది వానికి శోభను కలుగజేస్తూ అవయవి అయిన కావ్యమును ఉపస్కరించుతున్నవి. రసము వివక్షితముగా ఉంటూ ఉండఁగా ఈ అనుప్రాసోపమాదులు తమకు ఆశ్రయభూతము లయిన శబ్దార్థాలను అలంకరించడమె కాక అవయవి అయిన కావ్యాన్నికూడా శోభింపచేస్తూ ఉంట వనే అభిప్రాయమును గ్రహించాలి. లోకములో ఆశ్రయము అలంకార్యము అవుతుం దని, ఆశ్రయి అలంకారము అవుతుం దని ప్రసిద్ధి ఉన్నదికదా! అలంకార్యాలంకారభావము ఆశ్రయాశ్రయి భావముతో ఉండడము లోకములో ఉన్నట్లుగా కావ్యములోకూడా సమ్మతమె.

## గుణాలంకారభేదము

గుణాలు అలంకారాలూ చారుత్వహేతువులె. అయినా ఆశ్రయభేదాన్నిబట్టి వానికి భేదము సిద్ధమవుతున్నది. గుణా

ములు సంఘటనాశ్రయములు. శబ్దార్థాశ్రయములు అలం కారములు. ఇటువంటి గుణాలంకారభేదము ఇదివరలో నిరూపితమె. అయినా ఈఅంశమును కూడా ఇక్కడ గ్రహించాలి.

## గుణములు

౧ గుణములు రసధర్మములు.

౨ గుణములు రసమును విడిచి ఉండవు.

౩ గుణములు అవశ్యంగా రసోపస్కారములు.

౪ గుణములు తమంతట తామె సాక్షాత్తుగా రసములో ఉపకరించుతవి.

## అలంకారములు

౧ అలంకారములు రసధర్మములు కావు.

౨ అలంకారములు రసము లేకపోయినా ఉంటవి.

౩ అలంకారములు అవశ్యంగా ఉపస్కారకములె అనే నియమము లేదు.

౪ అలంకారములు రసములో అంగద్వారముగా ఉపకారకములు అవుతూ ఉంటవి.

## అలంకార విభాగము

మొదటగా అలంకారాలు మూడు విధాలు. శబ్దాలంకారములు, అర్థాలంకారములు, ఉభయాలంకారములు, అని. అనుప్రాసాదులు మొదటిరకము. ఉపమాదులు రెండవవి. లాటానుప్రాస సంసృష్టి అనేవి ఉభయాలంకారాలు. విద్యానాథునినిరూపణానుసారముగా శబ్దాలంకారములు ఎనిమిది. అర్థాలంకారములు అరవై అయిదు. ఉభయాలంకారములుగా చెప్పబడేవి రెండు.

## శబ్దాలంకారములు

౧ ఛేకానుప్రాస ౨ వృత్త్యనుప్రాస
౩ యమకము ౪ పునరుక్తవదాభాస
౫ లాటానుప్రాస ౬ పద్మబంధము
౭ చక్రబంధము ౮ నాగబంధము

## అర్థాలంకారములు

౧ ఉపమ ౨ అనన్వయము ౩ ఉపమేయోపమ
౪ స్మరణము ౫ రూపకము ౬ పరిణామము
౭ సందేహము ౮ భ్రాంతిమత్తు ౯ అపహ్నుతి
౧౦ ఉల్లేఖ ౧౧ ఉత్ప్రేక్ష ౧౨ అతిశయోక్తి
౧౩ సహోక్తి ౧౪ వినోక్తి ౧౫ సమాసోక్తి
౧౬ వక్రోక్తి ౧౭ వినోక్తి ౧౮ స్వభావోక్తి
౧౯ మీలనము ౨౦ సామాన్యము ౨౧ తద్గుణము
౨౨ అతద్గుణము ౨౩ విరోధము ౨౪ విశేషము
౨౫ అధికము ౨౬ విభావన ౨౭ విశేషోక్తి
౨౮ అసంగతి ౨౯ విచిత్రము ౩౦ అన్యోన్యము
౩౧ విషమము ౩౨ సమము ౩౩ తుల్యయోగిత
౩౪ దీపకము ౩౫ ప్రతివస్తూపమ ౩౬ దృష్టాంతము
౩౭ నిదర్శన ౩౮ వ్యతిరేకము ౩౯ శ్లేష
౪౦ పరికరము ౪౧ ఆక్షేపము ౪౨ వ్యాజస్తుతి
౪౩ అప్రస్తుతప్రశంస ౪౪ పర్యాయోక్తము ౪౫ ప్రతీపము
౪౬ అనుమానము ౪౭ కావ్యలింగము ౪౮ అర్థాంతరన్యాసము
౪౯ యథాసంఖ్యము ౫౦ అర్థాపత్తి ౫౧ పరిసంఖ్య
౫౨ ఉత్తరము ౫౩ వికల్పము ౫౪ సముచ్చయము
౫౫ సమాధి ౫౬ భావికము ౫౭ ప్రత్యనీకము

౫౮ వ్యాఘాతము ౫౯ పర్యాయము ౬౦ సూక్ష్మము ౬౧ ఉదాత్తము ౬౨ పరివృత్తి ౬౩ కారణమాల ౬౪ ఏకావళి ౬౫ మాలాదీపకము ౬౬ సారము.

## ఉభయాలంకారములు

౧ లాటానుప్రాస, ౨ శబ్దార్థోభయసంసృష్టి

## మిశ్రాలంకారములు

౧ సంసృష్టి, ౨ సంకరము

ఈనిరూపితానుసారముగా లెక్కపెట్టితే ౯+౬౬+౨+౨=౭౮ అవుతున్నవి. వీనిలో పద్మచక్రనాగబంధము లను మూడింటినీ చిత్రాలంకార మని ఒకటిగానే పరిగణించితే లాటానుప్రాసను శబ్దాలంకారములలోనూ ఉభయాలంకార ములలోనూ లెక్కపెట్టడమునకన్న ఏఒకచోటనో లెక్కించితే ౭౮లో ౩ తగ్గుతవి. కాబట్టి అలంకారాలసంఖ్య ౭౫ అవు తుంది. మిశ్రాలంకారములుగా చెప్పిన సంసృష్టిసంకరములు రెండూ అర్థాలంకారములలోనివే కనుక అర్థాలంకారములు ౬౮ అన్నమాట. వీనిలో కొన్ని అలంకారాలకు అవాంతర భేదాలు ఉన్నవి. వానివాని నిరూపణములో అవి స్పష్టము లవుతవి. రసప్రకరణములో రూపించి ప్రదర్శించిన రసవ దాద్యలంకారములు ఏడింటినీకూడా కలిపితే మొత్తము విద్యానాథాభిమతాలంకారాలు ౮౨ అవుతున్నవి.

## అర్థాలంకారవిభాగము

అర్థాలంకారములను నాలుగువిధాలుగా విభాగించ వచ్చు. కొన్నిటిలో వస్తురూపమయిన అర్థము ప్రతీయమాన మతుతూఉంటుంది. కొన్నిటిలో ఔపమ్యము ప్రతీయమాన

మవుతుంది. కొన్నిటిలో రసభావాదులు గోచరము లవుతూ ఉంటవి. కొన్నిటిలో ప్రతీయమానార్థము అస్ఫుటముగా ఉంటుంది. రసాదులు గోచరించే అలంకారాలలో రసాదులు గుణీభూతవ్యంగ్యములుగా ప్రతీయమానము లవుతూఉంటవి.

## ప్రతీయమానవస్తుకములు ౧౦

ఈనిరూపించే అలంకారాలలో ప్రతీయమానము అవుతున్న వస్తువు కావ్యానికి ఉపస్కారకము అవుతుంది. వీనిలో ఉపస్కరింపబడే రసాదికము ముఖ్యముగా ఉంటుందన్న నియమము లేదు కాబట్టి అవయవి అయిన కావ్యము ఉపస్కృతము అవుతుంది. ఈ సమాసోక్త్యాదులలో ఏవిధముగా ప్రతీయమానము కావ్యోపస్కారత్వమును పొందుతుందో ఆవిషయము వాని లక్ష్యలక్షణప్రస్తావములో విశదమవుతుంది. ఇట్లాగే ఆయా అలంకారవర్గాలలో ఆయా విశేషములు వానివాని ప్రకరణములలో విస్పష్టము లవుతవని తలచాలి.

౧ సమాసోక్తి ౨ పర్యాయోక్తి ౩ ఆక్షేపము
౪ వ్యాజస్తుతి ౫ ఉపమేయోపమ ౬ అనన్వయము
౭ అతిశయోక్తి ౮ పరికరము ౯ అప్రస్తుతప్రశంస
౧౦ అనుక్తనిమిత్తవిశేషోక్తి.

## ప్రతీయమానౌపమ్యములు ౧౬

ఈ అలంకారాలలో ఔపమ్యము గమ్యమానమవుతుంది.

౧ రూపకము ౨ పరిణామము ౩ సందేహము
౪ భ్రాంతిమత్ ౫ ఉల్లేఖము ౬ అపహ్నవము
౭ ఉత్ప్రేక్ష ౮ స్మరణము ౯ తుల్యయోగిత

౧౦ దీపకము ౧౧ ప్రతివస్తూపమ ౧౨ దృష్టాంతము
౧౩ సహోక్తి ౧౪ వ్యతిరేకము ౧౫ నిదర్శన
౧౬ శ్లేషాలంకారము.

## ప్రతీయమానరసాదులు ౭

౧ రసవత్ ౨ ప్రేయస్సు ౩ ఊర్జస్వి ౪ సమాహితము
౫ భావోదయము ౬ భావసంధి ౭ భావశబలత.

వీనిలో రసభావాదులు వ్యజ్యమానములు అవుతవి. కాని అవి అప్రధానముగా అభివ్యక్తము లవుతవి. కాబట్టి గుణీభూతవ్యంగ్యములు అనే వ్యవహారము. రసాదులు ఎపుడూ స్వప్నములోనయినా వాచ్యములుకావు. అవి నిత్యవ్యంగ్యములు. ప్రధానముగా వ్యంగ్యములయితే అలంకార్యములే అవుతవికాబట్టి ధ్వని అనే వ్యవహారమె కలుగుతుంది. అప్రధానముగా వ్యంగ్యములయినపుడు స్వేతరమును అలంకరించేవి అవుతవికనుక అలంకారములు అనే పేరు పొందుతవి అని గమనిక.

## అస్ఫుటప్రతీయమానములు ౩౯

ఈ ఉపమాద్యుదాత్తాంతములయిన ముప్పయితొమ్మిది అలంకారాలలో సహృదయులహృదయములను ఆహ్లాదపరిచే స్ఫుటమయిన ప్రతీయమానము ఉండదు. ఏదయినా ప్రతీయమానము దూరముగా అవభాసించినా అది అస్ఫుటము కాబట్టి అంతగా హృదయానంది కాదు. ఎక్కడనయినా సరే కొంచెముగా ప్రతీయమానము ఉండనే ఉంటుంది. అది వివక్షితముగా ఉండనపుడు అనుకొన్నంత అందముగా ఉండదు. కాగా, ఈ ఉపమాదులు సాధారణ

ముగా స్వరూపవిశ్రాంతములై చమత్కారమును కలుగ జేస్తూ ఉంటవి.

౧ ఉపమ ౨ వినోక్తి ౩ అర్థాంతరన్యాసము
౪ విరోధము ౫ విభావన ౬ ఉక్తగుణనిమిత్తవిశేషోక్తి
౭ విషమము ౮ సమము ౯ చిత్రము
౧౦ అధికము ౧౧ అన్యోన్యము ౧౨ కారణమాల
౧౩ ఏకావళి ౧౪ వ్యాఘాతము ౧౫ మాలాదీపకము
౧౬ కావ్యలింగము ౧౭ అనుమానము ౧౮ సారము
౧౯ యథాసంఖ్యము ౨౦ అర్థాపత్తి ౨౧ పర్యాయము
౨౨ పరివృత్తి ౨౩ పరిసంఖ్య ౨౪ వికల్పము
౨౫ సముచ్చయము ౨౬ సమాధి ౨౭ ప్రత్యనీకము
౨౮ ప్రతీపము ౨౯ విశేషము ౩౦ మీలనము
౩౧ సామాన్యము ౩౨ అసంగతి ౩౩ తద్గుణము
౩౪ అతద్గుణము ౩౫ వ్యాజోక్తి ౩౬ వక్రోక్తి
౩౭ స్వభావోక్తి ౩౮ భావికము ౩౯ ఉదాత్తము

## అలంకారకక్ష్యావిభాగము

ఈచెప్పినట్లుగా అలంకారాలు నాలుగువిధాలుగా విభక్తములవుతున్నవి. ఇంకా వీనిలో అవాంతరవిభాగాలు ఉన్నవి. వానిని ఈవిధముగా గ్రహించాలి. సాధారణంగా అనేకాలంకారాలలో సాధర్మ్యము ఉంటుంది. ఆ సాధర్మ్యము మూడువిధాలు. భేదప్రధానసాధర్మ్యము, అభేదప్రధాన సాధర్మ్యము, భేదాభేదప్రధానసాధర్మ్యము, అని. సాధర్మ్యములో అభేదప్రధానత వాస్తవముకాదు. ఉపమానము ఉపమేయము అనే రెండూ వేరుపదార్థములై. అవి భేదము కలవి అయినపుడు వాని సాధర్మ్యములో అభేదము ఉన్నది

అంటే అది స్వాభావికము ఎట్లా అవుతుంది? అందువలన ఈ అభేదప్రధానత్వము శబ్దసిద్ధమై ఆరోపితముగా ఉంటుంది అని గ్రహించాలి. ఇటువంటి అవాంతరభేదములతో కూడు కొన్న విభాగమును ఒకవిధమయిన వర్గవిభాగముగా భావించ వచ్చును.

౧ అభేదప్రధానములు ౬

౧ రూపకము ౨ పరిణామము ౩ సందేహము
౪ భ్రాంతిమత్ ౫ ఉల్లేఖము ౬ అపహ్నవము

ఈ ఆరు అలంకారములలోనూ ఉండే సాధర్మ్యము అభేదప్రధానకముగా ఉంటుంది. అటువంటి అభేదప్రధాన సాధర్మ్యమును నిబంధనము ఆధారము చేసికొని ఈ అలంకారాలు స్వరూపలాభమును పొందుతవి. కనుక వీనిని అభేదప్రధానసాధర్మ్యమూలకములు అని అంటారు.

౨ భేదప్రధానములు ౮

౧ దీపకము ౨ తుల్యయోగిత ౩ దృష్టాంతము
౪ నిదర్శన ౫ ప్రతివస్తూపమ ౬ సహోక్తి
౭ ప్రతీపము ౮ వ్యతిరేకము

అనే ఈ ఎనిమిది అలంకారాలలో సాధర్మ్యము భేద ప్రధానకముగా ఉంటుంది. అటువంటి సాధర్మ్యమును నిబంధనముగా చేసికొని ఇవి ప్రవర్తించుతవి అని భావము. కనుకనే వీనిని భేదప్రధానసాధర్మ్యనిబంధనములయిన అలంకారములు అని పరిగణించుతారు.

౩ భేదాభేదప్రధానములు ౪

౧ ఉపమాలంకారము ౨ అనన్వయము
౩ ఉపమేయోపమ ౪ స్మరణము

## ౧౦ అపహ్నవమూలములు ౩

౧ వ్యాజోక్తి ౨ వక్రోక్తి ౩ మీలనము

ఈ మూడున్నూ అపహ్నవమూలకములు. ఒకదాని చేత ఒకదానిని కప్పిపుచ్చడము చమత్కారంగా వీనిలో ఉంటుంది.

## ౧౧ విశేషణవైచిత్ర్యమూలములు ౨

౧ సమాసోక్తి ౨ పరికరాలంకారము

అనే ఈ రెండూ విశేషణములలోని చమత్కారమును అనుసరించి ఉంటవి. అక్కడ విశేషణములలోని అభిప్రాయవిశేషత అనగా సాభిప్రాయత ఈ అలంకారాలకు స్వరూపమును సంపాదిస్తుంది. ఈవిధముగా అలంకారాలలో వర్గవిభాగమును గుర్తించవచ్చు. అర్థాలంకారాలలోని ఈవర్గవిభాగము ఇట్లా పదకొండువిధాలుగా ఉన్నది.

ఇటు మీదట ఈ ప్రసంగములోనే అర్థాలంకారముల పరస్పరవైలక్షణ్యము నిరూపితమయింది. అలంకారాలకు లక్ష్యలక్షణప్రదర్శనము చేయనిదీ పరస్పరభేదము ఎంతగా నిరూపించినా నవపాఠకులకు దురవగాహంగా ఉంటుంది కాబట్టి ఆయా అలంకారాల ప్రస్తావములో ఆ వైలక్షణ్యము నిరూపిస్తాను. సౌకర్యాపేక్షమయిన ఈ మూలాతిక్రాంతి సహృదయులకు సమ్మతమె అవుతుంది కదా!

## శబ్దాలంకారములు

ఇప్పటికి అలంకారాలకు సంబంధించిన పీఠికాబంధరచన అయింది. మొదట చెప్పిన క్రమమునుబట్టి శబ్దాలంకారములను నిరూపించడము సముచితముకూడాను. అలం

కారస్వరూపవిభాగమును చూస్తే శబ్దార్థములు కన్పడుతున్నవి కదా! ఆ శబ్దార్థాలలో అర్థముకంటె శబ్దము అంతరంగము. ముందుగా శబ్దము ప్రతీత మవుతుంది. తరువాత అర్థము ప్రతీత మవుతుంది. శబ్దప్రతీతి ఉంటేనేకాని వాక్యములో అర్థప్రతీతి ఉండదు. అందువలన ప్రతీతిలో శబ్దము అంతరంగము అవుతున్నది. కనుకనే శబ్దానికి ప్రాధాన్యము ప్రాథమ్యమూను. కేవలశబ్దమె శోభను కలుగచేసేటట్లయితే శబ్దాలంకార మని వ్యవహారము. అక్కడి చమత్కారము కేవలము శబ్దములోనే ఉంటుందన్నమాట. శబ్దాలంకారములో కూర్చబడిన శబ్దాలకు మార్పు ఉండదు. అక్కడ ఆశబ్దములు ఉంటేనే ఆ చమత్కారము ఉత్పన్నమవుతుంది. శబ్దములు మార్పుపొందితే ఆ చమత్కారము రాదు.

## ఛేకానుప్రాస

అలంకారాలలో శబ్దావిభాగము శోభను కలుగజేస్తుంది. పౌనరుక్త్యము మూడువిధాలు. అర్థపౌనరుక్త్యము శబ్దపౌనరుక్త్యము శబ్దార్థపౌనరుక్త్యము అని. అర్థపౌనరుక్త్యము ప్రరూఢదోషమని అంటారు. శబ్దపౌనరుక్త్యములో అచ్చులు పునరుక్తములు కావచ్చు. హల్లులు పునరుక్తములు కావచ్చు. రెండూ పునరుక్తములు కావచ్చు. అలంకార ప్రస్తావములో కేవలము స్వర (అచ్చులు) పౌనరుక్త్యము చారుత్వము కలుగచేయదు కాబట్టి దానిని పరిగణించనక్కర లేదు. వ్యంజనమాత్రపౌనరుక్త్యము స్వరవ్యంజనసముదాయ పౌనరుక్త్యము చారుతాహేతువులు అవుతవి. స్వరవ్యంజనములు పునరుక్తములు కావడములో సంఖ్యానియమము ఉంటే ఛేకానుప్రాస అవుతుంది. లేకపోతే వృత్త్యనుప్రాస

అవుతుంది. అందువలన ముందుగా ఛేకానుప్రాసను నిరూపించడము యుక్తముగా ఉంటుందని అలంకారసర్వస్వకారుల భావము. తదనుసారముగా ప్రకృతము ఛేకానుప్రాసకు విద్యానాథుడు ఈలక్షణమును చెప్పుతున్నాడు.

భవే దవ్యవధానేన ద్వయో ర్వ్యంజనయుగ్మయోః,
ఆవృత్తి ర్యత్ర స బుధై శ్ఛేకానుప్రాస ఇష్యతే.

ఛేకులు వ్యవహరించే అనుప్రాస ఛేకానుప్రాస. ఛేకులు అంటే విదగ్ధ (చతుర) జనులు. వారి కిది వల్లభము. ఛేకానుప్రాస అంటే వేరొక అర్థముకూడా ఉంది. తమ గూటి (కులాయములో) పొదుపుగా ఆసక్తితో ఉండే పక్షులకు ఛేకములు అనిపేరు. కులాయాభిరతములై ఉండేవానికి ఇతరములు బాధపెట్టడము ఆయాసపెట్టడమూ ఉండదు. అందువలన ఈ అనుప్రాసతో సదృశమయిన మధురశబ్దము వెలువడుతుంది. కాబట్టి ఇది ఛేకానుప్రాస. అసలు అనుప్రాస అనేపదానికి ఈఅర్థమును గుర్తించాలి. ఒకటొకటి ఏకరూపము కలవై రసాద్యభివ్యక్తిలో ఉత్కర్షను పొందిన వర్ణములుకాని వర్ణసముదాయములుకాని కావ్యములో శోభాతిశయహేతువులుగా కూర్చబడుతూ ఉంటవి కాబట్టి అనుప్రాస అనే పదము సార్థకము. విదగ్ధులు ఉపలాలనము చేసే అనుప్రాస కనక ఛేకానుప్రాస అనడము యుక్తము. రెండురెండు వ్యంజనయుగ్మములకు వ్యవధానము లేకుండా ఆవృత్తి ఉన్నట్లయితే ఛేకానుప్రాస అని లక్షణార్థము. రెండు వ్యంజనాలకు సమానానుపూర్వితో ఆవృత్తి ఉండాలి. ఆ వ్యంజనయుగ్మానికి ఆవృత్తమయ్యే వ్యంజనయుగ్మానికి మధ్యలో ఏమీ వ్యవధానము ఉండరాదు. వ్యవధానము

ఉంటే ఛేకానుప్రాస కాదు. అందువలన అవ్యవహితము లయిన రెండువ్యంజనయుగ్మాలకు పౌనరుక్త్యము ఉన్నప్పుడే ఛేకానుప్రాస అవుతుంది అని గ్రహించాలి. ఇక దీని ఉదాహరణము.

మహీ మహీనవిభవే ధత్తే క్షేమంకరే కరే,
రాజన్యజన్యవిజయీ రాజా రాజద్గుణోదయః.

క్షత్రియులను యుద్ధములో జయించినట్టిన్ని శోభించుతూఉన్న గుణోదయముకల ప్రతాపరుద్రమహారాజు (అహి–సర్ప–ఇన–ప్రభువు–సర్పరాజు ఫణీంద్రుడయిన ఆది శేషుడు) ఫణీంద్రసదృశమయిన క్షేమంకరమగు తన హస్తము నందు భూమిని ధరించుతున్నాడు. అనే అర్థముకలిగిన ఈ పద్యములో నాలుగుపాదాలలోకూడా వ్యంజనయుగ్మములకు అవ్యవధానముగా ఆవృత్తిఉన్నది. మహీ–మహీ, కరే–కరే, జన్య–జన్య, రాజా–రాజ, అని. కనుక ఛేకానుప్రాస.

## వృత్త్యనుప్రాస

వృత్తిఅంటే; రసవిషయమయిన వ్యాపారమునకు వృత్తి అనిపేరు. అటువంటి వ్యాపారముకలిగిన వర్ణరచనను ఇక్కడ వృత్తిగా గ్రహించడము ఔపచారికము. ఆ వృత్త్యుప లక్షితమయిన అనుప్రాస వృత్త్యనుప్రాస అవుతుంది. రసాదుల అభివ్యక్తిలో అనుకూలవ్యవహారముకల వృత్తులను మూడువిధాలుగా ప్రాచీనులు పరిగణనము చేశారు. పరుష ఉపనాగరిక గ్రామ్య అని వానిపేర్లు. వీనికే కూర్చబడే వర్ణాలను అనుసరించి మసృణ లలిత కోమల అని కూడా వ్యవహారము ఉన్నది. మొదటిదానిలో దీప్తములయిన అక్షరము లుంటవి కాబట్టి పరుష అనే పేరు బాగానే ఉంది. వైదగ్ధ్

భూషితఅయిన నాగరికవనితతో పోల్చబడుతున్నందువలన ఉపనాగరికాపదము సార్థకము. వైదగ్ధ్యవిహీనస్వభావము కలిగిన గ్రామ్యవనితాసాదృశ్యము ఉన్నందువలన గ్రామ్య అనే పేరున్నూ తగిఉంది. ఇవే కాలాంతరంలో గౌడి వైదర్భి పాంచాలి వృత్తులుగా మారినట్లు తోస్తుంది. పరుషవృత్తిని గౌడదేశమువారు బాగా ఆదరించడముచేత గౌడీవృత్తి అనే పేరు వచ్చింది. ఇట్లాగే ఇతరములున్నూ. వృత్తిపదానికి వేరొక అర్థముకూడా ఉన్నది. "వర్తంతే అనుప్రాసభేదా ఆసు ఇతి వృత్తయః" అని వ్యుత్పత్తి. పరుషలలితమధ్యమ (గ్రామ్య) స్వరూపముతో వర్ణత్రయము కలిగిఉన్న అనుప్రాస జాతులు వృత్తులు అని భావము. ఈ అభిప్రాయములను మనస్సులో పెట్టుకొని విద్యానాథుడు ఈవిధముగా లక్షణము చెప్పుతున్నాడు.

ఏకద్విప్రభృతీనాం తు వ్యంజనానాం యథా భవేత్,
పునరుక్తి రసౌ నామ వృత్త్యనుప్రాస ఇష్యతే.

సంఖ్యానియమము ఉంటే ఛేకానుప్రాస చెప్పబడింది. అటువంటి సంఖ్యానియమం లేకపోతే వృత్త్యనుప్రాస. ఒక వర్ణమునకుకాని రెండువర్ణాలకుగాని మూడువర్ణాలకుగాని ఇంకా అటుపైవర్ణాలకుగాని పునరుక్తి ఉన్నట్లయితే వృత్త్యనుప్రాస అవుతుంది. ఒకవ్యంజనమును ఒకపర్యాయము ఆవృత్తి చేస్తే అటువంటిది సామాన్యంగా సంభవిస్తూనే ఉంటుంది కాబట్టి ఏమీ చమత్కారం ఉండదు. అందువలన ఒకవర్ణము అనేక పర్యాయములు ఆవృత్తమయితేనే వృత్త్యనుప్రాసఅవుతుంది. రెండువర్ణాలకు ఆవృత్తి ఉండేటట్లయితే ఒకసారే ఆవృత్తి ఉండాలి. అట్లాకాక వ్యంజనయుగ్మములు అసకృదా

వృత్తములయితే ఛేకానుప్రాస అవుతుంది. మధ్యలో వ్యవధానము ఉంచుతూ రెండువర్ణాలకు అసకృదావృత్తి చెప్పినా చెప్పవచ్చు.

మూడువర్ణాలకు ఆవృత్తిని చెప్పడములో ఒకపర్యాయమూ చెప్పవచ్చు. అనేకపర్యాయములూ చెప్పవచ్చు. వ్యవధానం లేకుండా చెప్పవచ్చును. వ్యవధానసహితంగానూ చెప్పవచ్చును. నాలుగు అక్షరాలవిషయములోకూడా ఇదే రీతిని గ్రహించాలి. నాలుగక్షరాల పునరుక్తిదాకా వృత్త్యనుప్రాసను పరిశీలించితే ఈవిధముగా భేదములు కలుగుతున్నవి.

౧ ఏకవర్ణావృత్తిని అసకృత్తుగా చెప్పుట.

౨ వర్ణద్వయావృత్తిని వ్యవధానం లేకుండా ఒకసారి చెప్పుట.

౩ వర్ణద్వయావృత్తిని వ్యవధానముతో ఒకసారి చెప్పుట.

౪ వర్ణద్వయావృత్తిని వ్యవధానముతో అసకృత్తుగా

౫ మూడువర్ణాలను వ్యవధానరహితంగా ఒకసారి

౬ మూడువర్ణాలను వ్యవధానరహితంగా అనేకపర్యాయములు.

౭ మూడువర్ణాలను వ్యవధానంతో ఒకసారి

౮ మూడువర్ణాలను వ్యవధానంతో అనేకపర్యాయములు

౯ నాలుగువర్ణాలను అవ్యవధానంగా ఒకసారి

౧౦ ,, ,, అనేకపర్యాయములు

౧౧ ,, వ్యవధానముతో ఒకసారి

౧౨ ,, ,, అనేకపర్యాయములు.

వీనిని సంయుక్తాక్షరములతో చెప్పడము అసంయుక్తాక్షరములతో చెప్పడము అనే విభాగాలతోకూడా గ్రహించితే అర భేదము లవుతవి. ఈ ఛేకానుప్రాస వృత్త్యనుప్రాస అనే రెండూ వ్యంజనపౌనరుక్త్యముతో మాత్రమే ఉంటవి. ఎక్కడయినా స్వరపునరుక్తి ఉన్నదంటే అది వివక్షితము కాదు. ఆ అంశము లక్షణములో చేరదు. ఇక ఉదా:-

రే! రేః క్షుద్రమహీభృతః! క్షణ మితః శ్రీకాకతిక్ష్మాపతే
ర్వీక్షధ్వం ధ్వజినీం దురీక్ష్యసుభటాం ప్రోత్క్షిప్తకాక్షేయకైః
యోత్స్యధ్వే యది లభ్య మక్షయపదం కాంతారపక్షో వృథా
క్ష్మాభృత్కుక్షిచరత్తరక్షునికరా త్తత్రాత్మరక్షా కుతః?

ఓరీ! క్షుద్రరాజుల్లారా! క్షణకాలము ఇటు శ్రీకాకతినాథుని సేనను చూడండి. ఎత్తిన ఖడ్గాలతో సుభటులు దుర్నిరీక్షంగా ఉన్నారు. మీరు యుద్ధము చేసేటట్లయితే శాశ్వతపదము లభిస్తుంది. అరణ్యాలకు పారిపోవడ మనేది అంతా వ్యర్థము. పర్వతగుహల్లో చిరుతపులుల గుంపులు తిరుగుతూఉంటే అక్కడ మీకు ఆత్మరక్ష ఎట్లా కలుగుందోయి? అరణ్యంలో పులివాతబడి దుర్మరణం పొందడముకంటె శుభోదర్కమయిన యుద్ధమరణము మంచిదికదా! ఇందులో క్షకారావృత్తి అసకృత్తుగా ఉన్నది కాబట్టి ఒకవిధమయిన వృత్త్యనుప్రాస.

## యమకము

యమకములో అచ్చులు హల్లులూ రెండిటి సముదాయపౌనరుక్త్యము ఆశ్రితమవుతుంది. 'మహీమహీన విభవే' అనే ఛేకానుప్రాసోదాహరణములో ''మహీమహీ'' అని స్వరవ్యంజనసముదాయపౌనరుక్త్యము ఉన్నది. ఒక్కొక

చోట వృత్త్యనుప్రాసలోకూడా సముదాయపునరుక్తి ఉంటుంది. అయినా అది ఆనుషంగికము. యమకలక్షణము—

యమకం పౌనరుక్త్యే తు స్వరవ్యంజనయుగ్మయోః,

స్వరములు వ్యంజనయుగ్మము అనే రెండిటికీ పౌనరుక్త్యము ఉన్నట్లయితే యమకాలంకారము అవుతుంది. ఛేకవృత్త్యనుప్రాసలలో స్వరపౌనరుక్త్యము ఆనుషంగికము. యమకములో స్వరములకు ఆవృత్తి ఉండితీరాలి. వ్యంజనయుగ్మానికీ ఆవృత్తి ఉండాలి. ఈ ఉభయావృత్తి మొదట ఉండటము మధ్యలో ఉండడము చివర ఉండడములలోని చమత్కారమునుబట్టి యమకము మూడువిధాలవుతుంది, ఇట్లాగే ఒక శ్లోకములో సగము పాదము ఆవృత్తము, ఒక పాదమె ఆవృత్తముకావడము మొదలయిన విధానాలవలన కూడా భేదములు సిద్ధములవుతవి. మొదటచెప్పబడినది ఆవృత్తమయినట్టిది అనే రెండిటిలో ఒక్కొకచోట రెండూ వేరువేరు అర్థములుకలవి అవుతవి. ఒక్కొక చోట రెండిటికీ ఒకే అర్థము ఉంటుంది. వేరొకచోట ఒకటి నిరర్థక మవుతుంది. రెండవది సార్థక మవుతుంది. ఇటువంటి భేదాలనన్నిటినీ పరిగణించడము చాలా శ్రమ. చాలాభేదాలున్నవి. ఏదో కొంచెము దిఙ్మాత్రంగా ఒక ఉదా :—

ప్రతాపః కాకతీంద్రస్య మహామహిమతేజసః
శ్రియం దధాతి పద్మేష్టమహామహిమతేజసః.

గొప్ప మహిమ తేజస్సుకల కాకతీంద్రునియొక్క ప్రతాపము (పద్మేష్టమహాం అహిమతేజసః) పద్మములకు ప్రియోత్సవమయిన సూర్యుని శోభను ధరించుతున్నది. దీనిలో

మహా "మహిమ తేజసః, మహామహిమ తేజసః" అని స్వర వ్యంజనసముదాయపౌనరుక్త్యము ఉన్నదికనుక యమకము.

## పునరుక్తవదాభాస

పునరుక్తవదాభాసము అర్థాలంకారమని చిరంతన ప్రసిద్ధి. ఆదృష్టితో చూస్తే దీనిని అర్థాలంకారములలో పరిగణించడమే యుక్తము. అయినా ఇక్కడ నిరూపించడములో ఉపపత్తి లేకపోలేదు. ఈవిషయము ముందు స్పష్ట మవుతుంది. పునరుక్తమువలె ఆభాసించేది పునరుక్తవదాభాస. దీని లక్షణము.

యత్రార్థః ప్రముఖే కించిత్ భాసతే పునరుక్తవత్
పునరుక్తవదాభాసోఽలంకారః స సతాం మతః.

అర్థము మొదట్లో కొంత పునరుక్తమయినట్లుగా భాసించినట్లయితే అది పునరుక్తవదాభాసమనే అలంకార మవుతుందని అలంకారవిదులు అంగీకరించుతున్నారు. ఇంత వరదాకా శబ్దపౌనరుక్త్యమును ఆశ్రయించిన అలంకార కథన మయింది. ఈ అలంకారము మొదలుకొని అర్థపౌనరుక్త్య మూలకమయిన అలంకారాలకథనము ఉంటుంది. ఈ అలం కారములో అర్థము మొదట పునరుక్తమయినట్లుగా ఉంటుంది. సరిగా అన్వయించినట్లు కసపడదు. బాగా పరిశీలించితే అది పునరుక్తముకాదు. వేరువిధాన అది పర్యవసానము పొందు తుంది. అర్థపౌనరుక్త్యముఉంటే అది ప్రరూఢమయిన దోషము. దీనిలో అర్థము మొదట పునరుక్తమయినట్లుగా ఉన్నా అన్వయసమయములో ఆవిధంగా ఉండదు. అది ఇంకొకరూపాన మారుతుంది. అర్థము వేరురూపాన మారిన తరువాత చూస్తే ఈఅలంకారమే ఉండదు. మొదటగా

కలిగిన ప్రతీతియె అలంకారబీజము. పర్యవసానంలో కలిగే ప్రతీతినిబట్టి అలంకారనిర్ణయము ఉండదు. ఇక్కడ ప్రథమ ప్రతీతిలో పునరుక్తముగా కన్పడుతున్నదికాబట్టి అలంకార మవుతుంది. ఇది అర్థపౌనరుక్త్యాశ్రయము కాబట్టి అర్థాలంకారమె అని అనాలి. కాని పర్యాయశబ్దములను ఆశ్రయించి ఉన్నందువలన ఒకవిధంగా శబ్దపౌనరుక్త్యాశ్రితమెఅవుతుంది. ఇంద్రుడు పురందరుడు అనే పర్యాయశబ్దాలలోకూడా ఒకే అర్థసాదృశ్యము ఉంటుందికాబట్టి శబ్దపౌనరుక్త్యము అనేది ఇక్కడ ఔపచారికమని గ్రహించాలి. కావ్యప్రకాశకర్త దీనిని ఉభయాలంకారమని అంటున్నాడు. ఇది శబ్దాలంకార మన్న భావమె విద్యానాధునకు ఉన్నది. అయినా ఛేకవృత్త్యను ప్రాసలవంటి శబ్దాలంకారము కాదు. అలంకారసర్వస్వకారాదులు ఇది అర్థాలంకార మనే అభిప్రాయపడుతున్నారు. విద్యానాథుడు ఉద్భటమతానుసారముగా చిరంతనమతమును ఉల్లంఘించినట్లు కాకుండా ఉండడానికి దీనిని శబ్దాలంకారముగా నిరూపిస్తున్నాడని భావించవచ్చు. ఉదా :—

> జిష్ణు రింద్రః క్షితిభుజాం శ్రీపతిః పురుషోత్తమః
> భాస్వాన్ సూర్యస్ఫురత్తేజాః కాకతీంద్రో విరాజతే.

జయశీలుడు రాజేంద్రుడు శ్రీపతి పురుషులలో ఉత్తముడు దీప్తిమంతుడు సూర్యునివలె స్ఫురత్ప్రతాపుడూ అయిన కాకతీంద్రుడు ప్రకాశించుతున్నాడు. అనే పర్యవసానార్థముకలిగిన దీనిలో జిష్ణుః ఇంద్రః శ్రీపతిః పురుషోత్తమః భాస్వాన్ సూర్యపదములలో మొదట ఏకార్థము భాసించుతున్నది. అందువలన ఆముఖపౌనరుక్త్యము ఉన్నట్లు. ఇది అన్వయసమయములో పునరుక్తముకాదు. కనుక పునరుక్త

ము కాదు. కనుక పునరుక్తవదాభాస మనే అలంకార మవుతుంది. ఈఅలంకారవిషయమై ఆకరగ్రంథాలలో అధికర్చ ఉన్నది.

## లాటానుప్రాస

శబ్దపౌనరుక్త్యమును ఆశ్రయించిన అలంకారాలు అర్థపౌనరుక్త్యమును ఆశ్రయించిన పునరుక్తవదాభాస నిరూపితమయిన తరువాత శబ్దార్థోభయపౌనరుక్త్యముమ ఆశ్రయించిన అలంకారమును చెప్పడము సముచితము. లాటానుప్రాస ఉభయమూలకము. లాటదేశములోని జనులు ఈఅనుప్రాసను బాగా ఉపలాలించుతారుకాబట్టి లాటానుప్రాస అని వ్యవహారము. శబ్దార్థాలకు పౌనరుక్త్యముఉంటే ప్రబంధ దోషముగా ఎన్నుతారు. ఆదోషము అప్రరూఢమయితే లాటానుప్రాస అవుతుంది.

> శబ్దార్థయోః పౌనరుక్త్యం యత్ర తాత్పర్యభేదవత్
> స కావ్యతాత్పర్యవిదాం లాటానుప్రాస ఇష్యతే.

తాత్పర్యభేదము కలిగిన శబ్దార్థములపౌనరుక్త్యము ఉన్నట్లయితే అది లాటానుప్రాస అవుతుందని కావ్యతాత్పర్యవిదుల అభిప్రాయము. కేవలము శబ్దమె పునరుక్తమయితే ఛేకానుప్రాసకాని వృత్త్యనుప్రాసకాని కావచ్చు. అందువలన అర్థపునరుక్తికూడా ఉండాలి. శబ్దానికీ అర్థానికీ మామూలుగా పౌనరుక్త్యముఉంటే ప్రరూఢదోషము అవుతుంది. అందువలననే తాత్పర్యభేదము ఉండాలని లక్షణాంశము. దీనిలో శబ్దార్థములు పునరుక్తములయినపుడు స్వరూపములో భేదము ఉండకపోయినా అర్థభేదము ఉంటుంది కాబట్టి అర్థపునరుక్తి ఉండదు. ఈలాటానుప్రాసలో మొదట

శబ్దమువలె అర్థముకూడా ఒకేవిధముగా కనపడుతున్నప్పటికీ పర్యవసానములో వేరుగా భాసించుతుంది. ఒకపదముయొక్క అర్థము వాచ్యముగానే ఉండి అక్కడే విశ్రాంతమవుతుంది. రెండవపదముయొక్క అర్థము లక్ష్యార్థములోకాని వ్యంగ్యార్థములోకాని విశ్రాంతి పొందుతుంది. అందువలననే తాత్పర్యభేదము ఉంటుందని భావము. రెండూ వాచ్య విశ్రాంతములయితే అక్కడ దోషము లేకపోయినా అలంకారముకాదు. వాచ్యము లక్ష్యవ్యంగపరమయితేనే చమత్కారము ఉంటుంది కాబట్టి అటువంటిదే అలంకారము. అనన్వయాలంకారములో శబ్దార్థపౌనరుక్త్యము ఉంటుంది. అయినా అక్కడకూడా లాటానుప్రాస అని అనవక్కరలేదు. శబ్దైక్యంలేకపోయినా అనన్వయమును నిరూపించవచ్చు. అనన్వయములో శబ్దైక్యము లేకపోతే ఒక్కొక్కచోట ఔచిత్యము అంతగా ఉండకపోయినా ఒక్కొకచోట ఔచిత్యానికి ఏమీ భంగంరాదు. అందువలన అనన్వయంలో శబ్దైక్యము ఉండాలని నియమము లేదు. "ఇందురిందురివ" ఇత్యాదిస్థలాలలో శబ్దైక్యముకూడా ఉన్నా అది కేవలము ఆనుషంగికమె. అనన్వయాలంకారములో అర్థపౌనరుక్త్యము ఉంటేచాలు. నిర్దేశప్రతినిర్దేశాలలో ఏకరూపత్వము లేకపోతే ప్రక్రమభంగదోషమేమో? అని అంటారని అక్కడ శబ్దైక్యమును అనుసరించడమేకాని అది అనన్వయత్వసాధనానికికాదు. శబ్దైక్యము లేనిచోట అనన్వయప్రతీతి కొంత విఘ్నితమయితే అవుతుంది. అంతేకాని అటువంటి స్థలంలో

అనన్వయాలంకారము ఉండకపోదు. లాటానుప్రాసలో ఉభయపౌనరుక్త్యము అవశ్యంగా ఉండితీరాలి. ఇక ఉదా:—

గుణా గుణాస్తే గణ్యంతే యే రుద్రనృప మాశ్రితాః
నీతి ర్నీతి రసౌ తస్య లక్ష్మీ ర్లక్ష్మీశ్చ కథ్యతే.

రుద్రనృపుని ఆశ్రయించిన గుణములు ఏవి కలవో అవే గుణములు. గుణములని చెప్పతగిన ఉత్తమగుణములు ఆతనివే. ఇతరాశ్రయగుణములు ఉత్తమగుణములు కావు. అట్లాగే ఆప్రతాపరుద్రుని నీతియే నీతి. ఆతని లక్ష్మియే లక్ష్మి. దీనిలో రెండవగుణనీతిలక్ష్మీశబ్దాలు ఉత్తమగుణాది పరములు. మొదటిగుణాదులు కేవలము వాచ్యార్థములోనే పర్యవసానముపొందుతున్నవి. రెండవగుణాదులు అర్థాంతరము సూచించుతూ అన్యపరము లవుతున్నవి కాబట్టి తాత్పర్యభేదము ఉన్నది. ఇప్పటికి పౌనరుక్త్యమును ఆశ్రయించిన అలంకారాలు అయిదు అయినవి. శబ్దపౌనరుక్త్యాశ్రితములు మూడు. ఛేకానుప్రాస వృత్త్యనుప్రాస యమకము పునరుక్తవదాభాస అర్థపౌనరుక్త్యాశ్రితము లాటానుప్రాస ఉభయపౌనరుక్త్యాశ్రితము.

## చిత్రము

పద్మాద్యాకారహేతుత్వే వర్ణానాం చిత్ర ముచ్యతే.

వర్ణములు పద్మాదుల ఆకారమును పొందడములో హేతువు లయినట్లయితే చిత్రాలంకార మవుతుంది. శ్రవణ గోచరములయ్యే వర్ణాలకు పద్మాద్యాకార హేతుత్వము కుదరదే! అని అనుకోనక్కరలేదు. ఇక్కడ వర్ణములు అంటే వర్ణములను స్మరింపచేసే లిప్యక్షరములు అని గ్రహించితే ఈశంక కలుగదు. లిప్యక్షరాలకూ ముఖ్యవర్ణాలకూ

అభేదమును అంగీకరించాలి. లోకవ్యవహారము ఆవిధంగానే ఉన్నది. పద్మాదిబంధాలలో ఈవర్ణాలను కూర్చినపుడు కొన్నికొన్నిస్థానాలలో వర్ణాలకు పౌనరుక్త్యము వస్తూఉంటుంది. పౌనరుక్త్యమూలకములయిన అలంకారాలను చెప్పిన తరువాత చిత్రాలంకారమును చెప్పడములో ఇదే హేతువు. ఈచిత్రము పద్మబంధము చక్రబంధము నాగబంధము మురజబంధము ముసలబంధము గోమూత్రికాబంధము మాలాబంధము ఇట్లా అనేకవిధాలుగా ఉన్నది. వీనిలో మొదటి మూడింటికిమాత్రము ఇక్కడ నిబంధనము ఉంటుంది. ఇటువంటి చిత్రవిశేషాలను కవులు అక్కడక్కడ కమగ్రంథాలలో నిరూపించారు. వీనిలో ఆయా బంధకృత మయిన చమత్కారముమాత్రమె ఉంటుంది. అర్థనిబంధ నకంగా చమత్కారం ఉంటుందని అనలేము. సామాన్యంగా ఏదో అర్థము ఉంటుందికాని అది అట్టే వివక్షితము కాదు. ఈపద్మబంధాదులను ఏయేవిధంగా లిఖించి ఏయేవిధంగా వానిలో వర్ణాలను విన్యసించాలో పరిశిష్టములో ప్రదర్శిస్తాము. ఇక్కడే వానిని నిరూపించడము వరుసగా కలిగే ఆస్వాదములో విఘ్నము కలుగచేస్తుంది. వీతవిఘ్నమయిన ఆస్వాదము మంచిదికదా!

### అష్టదళపద్మబంధము

యాతా యస్యాసమగ్రానతి మిహ కనకాస్థానసక్తాసనా యా
యానాసక్తాసనస్థా సుఖయతు కమలాభ్యాససుజ్ఞానమాయా
యా మానజ్ఞా సుసభ్యా క్షితిపతితిలకం జ్ఞాతిరక్తా సగేయా
యాగే సక్తా రతిజ్ఞా సుకృతిషు ఫలితగ్రామసస్యాయతా యా.

పద్మచిత్రము వేసి కర్ణిక మొదలుగా దిక్కువిదిక్కులలో వ్రాయవలసినవిధముగా ఈపద్యమును వ్రాసిచూస్తే పద్మా

కారవర్ణవిన్యాసము దీనిలో గోచరమవుతుంది. ఇటువంటి బంధకవిత్వాలలో అర్థము క్లిష్టముగా ఉంటుంది. దీని అర్థమును ఇట్లా గ్రహించాలి. కనకాస్థాన-సువర్ణమయసభామంటపములో ఉన్న సింహాసనమును పొందిఉన్నట్టిన్ని, యానాసక్తాసన-తురగము మొదలయిన యానములందు కూడుకొన్న ఆసనములందు ఉన్నట్టిన్ని, అభ్యాస-ఉపాసన చేయడముచేత చక్కగా తెలియబడు స్వరూపవైచిత్ర్యము కలిగినట్టిన్నీ, మానజ్ఞానాదకులు చేసిన పూజావిశేషమును తెలిసినట్టిన్నీ, సుసభ్యా-యోగ్యులయిన సభ్యులు కలిగినట్టిన్ని, జ్ఞాఽతిరక్తా-వివేకులయినవారియందు మిక్కిలి అభిమానము కలిగినటువంటి, సగేయా-స్వనామాంకముఉన్న అనేకగీతములు కలిగినటువంటిన్నీ, శ్రీయాగములో నిత్యమూ సంబద్ధరాలై ఉన్నటువంటిన్నీ, రతిజ్ఞా-తనయందు సాధకులు ప్రదర్శించు భక్తిరూపమయిన రతిని తెలిసిఉన్నటువంటిన్నీ, సుకృతులవిషయమై ఫలయుక్తముగా చేయబడిన గ్రామసస్యముల చేత గొప్ప శుభవిధానము కలిగినట్టి కమలాదేవి వీరరుద్రప్రభువునకు ఆసమగ్రానతిం-అతిసంపూర్ణమయిన వశ్యత్వమును పొందినదై ఈజన్మలో బాగా సుఖపెట్టుగావుత.

## చక్రబంధము

లక్ష్మీవీక్షిత వైభవస్య జగతాం నాథస్య భద్రశ్రియో
దిక్ప్వరబ్ధనిజప్రతాపజనితాం భాకృద్ధురాం యచ్ఛతః
నిత్యం రుద్రజనాధిపస్య జయినో భాతి ప్రకాశం స్థిరా
రాజత్పాలనమోదితాత్మని భుజే యోగ్యాశ్రితత్వా ద్ధరా.

జయస్వభావుడయిన రుద్రనరాధిపునిభుజమునందు భూమి నిత్యమూ భాసించుతున్నది. ఆతనిభుజము శోభాయమాన

మయిన పాలనము ఉండడముచేత అనుమోదితస్వరూప ముగా ఉన్నది. యోగ్యభుజమును ఆశ్రయించినందు వలన భూమి నిశ్చితస్థైర్యముకలదై ఉన్నది. ఇంకా జగన్నాథు డయిన వీరప్రతాపరుద్రుని విభవము లక్ష్మీకటాక్షముతో ఉన్నది. బాగా అభివృద్ధిపొందిన తన ప్రతాపముచేత సర్వ దిక్కులందూ భాస్కరకృత్యమును ఆయన నిర్వహించు తున్నాడు. ఇది పద్యభావము. చక్రాకారమయిన బంధ ములో ఈపద్యమును యోజనము చేసి బిగించవచ్చును. ఆ విధముగా బిగించి పద్యమును అటూ ఇటూ త్రిప్పి చూచే టట్లయితే "వైజనాథకృతి"అని ఒకవిధంగా ప్రతీతమవుతుంది. ఈఅక్షరాలను పద్యములో చూడదలచితే మొదటి మూడు పాదాలలో చూడాలి. ప్రతిపాదంలోనూ ఆరవ అక్షరమును కూర్చి ప్రతిపాదంలోనూ పదునాల్గవఅక్షరాన్ని వరుసగా కూర్చితే మూడుమూడు ఆరు అక్షరాలూ వైజనాథకృతి అనేరూపముగా గోచరము లవుతవి. ఇట్లాగే "వీరరుద్రయశ" అనికూడా ప్రతీత మవుతున్నది. దీనినికూడా మొదటి మూడు పాదాల్లోనే లక్షించాలి. ప్రతిపాదంలోనూ మూడవఅక్ష రాన్ని పదునేడవఅక్షరాన్ని వరుసగా కూర్చితే వీరరుద్రయశ అని వస్తుంది. ఈచమత్కారమంతా చక్రబంధాకారములో స్పష్టమవుతుంది. మొత్తానికి మూడుపాదాల్లోనూ ౩, ౬, ౧౪, ౧౭ అక్షరాలను సావధానంగా నిబంధించాలని తేలుతుంది. నాల్గవపాదములో నిబంధింపబడే అక్షరాలు పాదత్రికాక్ష రాలతో సంబంధంకలిగి ఉంటవి. పరిశిష్టంలో ఇది స్పష్ట మవుతుంది.

## నాగబంధము

ఓజస్యే రుద్రదేవే విభవతి మహిమత్యా జితాన్యప్రతాపే
విద్యావర్యేఽభినేతర్యురుహరిచరితం విశ్వవిస్తారభాజి
వైరివ్రాతా భజంతే వన మతిమలినఖ్యాతయో దేహవిద్ధా
వన్యై రధ్వన్యవారిక్షతిమతివివిధే జంతుభిః స్థానభాజః.

ఓజస్యే - ప్రబలుడయిన (సూర్యసదృశుడయిన) స్వమహిమచేత ఇతరుల ప్రతాపమును పరిత్యజింపచేసిన, వేదవేదాంగాది విద్యలచేత శ్రేష్ఠుడయిన, గొప్పదయిన శ్రీవిష్ణుచరితమును అనుకరించుతూఉన్నట్టి, విశ్వవిస్తృతిని పొందిఉన్న రుద్రదేవుడు ప్రభువై ఉండగా; అతిమలినఖ్యాతి కలిగిన శత్రుసంఘములు యుద్ధములో క్షతదేహులై వన్యములయిన సర్పమృగములతోపాటు క్షతికలిగిన నానావిధ దుఃఖభాజనమయిన ఉదకములేని మరుప్రదేశములో స్థితిని పొందినవారై వనమును సేవించుతున్నారు. అని ఈపద్యభావము. చుట్టలుచుట్టలుగా చుట్టుకొనిఉన్న పామువిన్యాసములో ఈపద్యాక్షరములను లిఖించాలి. వచ్చిన అక్షరములే మళ్ళీమళ్ళీరావడము పాదాక్షరములు సంకీర్ణములు కావడము దీనిలో ఉంటుంది. దీని రచన కవికి క్లేశకరము. మొత్తానికి ఈచిత్రబంధాలలో అర్థకృతమయిన చమత్కారము అంతగా ఉండదు. ఏదోవిధమయిన అర్థంఉంటుంది. అంతే, పద్యాక్షరముల విలేఖనములో చిత్రచమత్కారము గోచరమవుతూ ఉంటుంది. ఇటువంటి బంధభేదాలు చాలా ఉన్నవి. ఈనాగబంధోద్ధారముకూడా పరిశిష్టములో ప్రదర్శిత మవుతుంది.

# అర్థాలంకార ప్రకరణము

ఇంతవరకూ శబ్దాలంకారములు నిరూపితములు అయినవి. ఇక అర్థాలంకారములు అవసరప్రాప్తములు. వానిని ఈ ప్రకరణములో నిరూపించాలి. అర్థాలంకారములలో కూడా ఉపమాలంకారము అనేకాలంకారబీజభూతము కాబట్టి మొదటగా ఉపమాలంకారమును నిరూపించడము సముచితము. అలంకారములు అనేకవిధాలుగా ఉన్నవి. కొన్ని వాచ్యౌపమ్యములు. అనన్వయము ఉపమేయోపమ మొదలయినవి ఇటువంటివి. వీనిలో ఔపమ్యము వాచ్యముగా ఉంటుంది. కొన్ని అలంకారాలు గమ్యౌపమ్యములు రూపకము పరిణామము మొదలయినవి ఇటువంటివె. వీనిలో ఔపమ్యము వాచ్యముగా ఉండక గమ్యముగా ఉంటుంది. మీలనము సామాన్యము మొదలయిన కొన్ని అలంకారాలు సాదృశ్యమూలకములె. ఈ సాదృశాలంకారాలకు అన్నిటికీ ఉపమ నిదానభూతముగా ఉంటుంది. వీనిలో ఉపమ అంతటా గర్భీకృతమై ఉంటుందన్నమాట. కనుక ముందుగా ఉపమాలంకారమును నిరూపించాలి.

## ఉపమాలంకారము

స్వతస్సిద్ధేన భిన్నేన సమ్మతేన చ ధర్మతః
సామ్య మన్యేన వర్ణ్యస్య వాచ్యంచే దేకదోపమా.

ఇది ఉపమాలంకారలక్షణము. ప్రకృతమునకు అప్రకృతముతోటి సాదృశ్యము వాచ్యముగా ఉన్నట్లయితే ఉపమాలంకారము అని సామాన్యముగా అభిప్రాయము. అన్వ

ముతోటి వర్ణ్యమునకు సామ్యము ఒకేపర్యాయము వాచ్యమయినప్పుడు ఉపమ అని భావము. అన్యమనగా ఉపమానము. వర్ణ్యము ఉపమేయము లక్షణ పూర్వార్థములో ఉపమానవిశేషణములు ఉన్నవి. వాని తాత్పర్యమునుకూడా కలుపుకొంటే లక్షణము ఈవిధముగా పర్యవసన్నమవుతుంది. స్వతస్సిద్ధము, స్వతోభిన్నము, సహృదయసమ్మతమూ అయిన అప్రకృతముతోటి ప్రకృతమునకు గుణక్రియారూపమయిన సాదృశ్యమును ఒకపర్యాయమె వాచ్యముగా నిరూపించినట్లయితే ఉపమ అవుతుంది. అన్యశబ్దానికి ఉపమానమని వర్ణ్యశబ్దానికి ఉపమేయమనీ అర్థమును గ్రహించాలి. సాదృశ్యము=సామ్యము ఉండాలి అనేమాటవలన ఈఅర్థము లభించుతున్నది. సామ్యము అంటే సాధర్మ్యమనేది ఉపమానోపమేయములకె కుదురుబాటు పొందుతుంది కాని కార్యకారణములకు సామ్యము సంభవించదుకదా! ఈ ఉపమాలక్షణగతములయిన దళములన్నీ సాభిప్రాయములు. వాని అభిప్రాయవత్త్వమును ఈవిధముగా గ్రహించాలి.

ఉపమానము స్వతస్సిద్ధముగా ఉండవలెను. అని లక్షణార్థము. ఈవిధముగా అనడముచేత ఉత్ప్రేక్షాలంకారము వ్యావృత్తము అవుతున్నది. ఉత్ప్రేక్షలో ఉపమానము స్వతస్సిద్ధముగానె ఉండనక్కరలేదు. అప్రసిద్ధానికికూడా అక్కడ ఉపమానత్వము సంభవించుతుంది. ఉపమాలంకారములోనయితే ఉపమానము స్వతస్సిద్ధముగానె ఉండాలికాని కవికల్పితము కారాదు. స్వతస్సిద్ధముకాక కవికల్పితమై అప్రసిద్ధమయిన ఉపమానమె అయితే అక్కడ ఉపమాలంకారమని వ్యవహరించరాదు. ఈభావమును విశదపరచ

డానికే లక్షణములో "స్వతస్సిద్ధేన" అని నివేశితమయింది. కనుక ఉత్ప్రేక్ష వ్యావృత్తము అంటే మరలింపబడినది అవుతున్నది. ఈ అంశమును ఈ ఉదాహరణములో స్పష్టముగా గ్రహించవచ్చు.

> కీర్తిః కాకతీవీరరుద్రనృపతేః సింహాసనాధ్యాసినః
> ప్రాచాం భూమిభుజాం యశఃపిదధతీ కోటీందుతుల్యద్యుతిః
> రక్షాదక్షిణరాజలాభజనితామందప్రమోదోత్థితా
> త్రైలోక్యాట్టహాసప్రభేవ కకుభాం ప్రాంతేషు విద్యోతతే.

సింహాసనమును అధిష్ఠించిఉన్న కాకతివీరరుద్రనృపతి కీర్తి ప్రాచీనులయిన భూపతుల యశస్సును పిధానించుతున్నదై (కప్పిపుచ్చుట) కోటిచంద్రసమానకాంతికలదై భాసించుతున్నది. బాగా రక్షించడములో సమర్థుడయిన రాజు లభించినాడుకదా! అని మూడులోకాలకున్నూ అమంద ప్రమోదము ఉదయించింది. అటువంటి అమందప్రమోదము వలన త్రైలోక్యమునకు అట్టహాసప్రభ కలిగింది. ఆ అట్టహాసప్రభవలె కీర్తి దిశాప్రాంతములలో ప్రకాశించుతున్నది. అని పద్యతాత్పర్యము. దీనిలో కీర్తి ఉపమేయము. అట్టహాసప్రభ ఉపమానము. విద్యోతన మనేది రెండిటికీ సాధర్మ్యము. త్రైలోక్యాట్టహాసప్రభ అనేది జాతిని చెప్పే శబ్దము. ప్రభాత్వము జాతి. ప్రభాశబ్దము జాతివచనము. ఇక్కడ ఉపమానముగా ఉన్న త్రైలోక్యాట్టహాసప్రభ స్వతస్సిద్ధము కాదు. మూడులోకాలకూ అట్టహాసప్రభ ఉదయించడము కవిప్రౌఢోక్తిసిద్ధము కావలసినదేకాని స్వతస్సిద్ధము ఎట్లా అవుతుంది? అందువలన ఈపద్యములో ఉపమాశంకకు ఏమీ అవకాశము లేదు. ఉపమానము తథా

విధము అయినందువలన ఉత్ప్రేక్ష అని గ్రహించాలి. కీర్తి అట్టహాసప్రభగా సంభావిత మవుతున్నదన్నమాట. ఉత్ప్రేక్ష లోని విశేషాంశాలను ఆ అలంకారప్రఘట్టములో గ్రహించ వచ్చును.

"స్వతో భిన్నేన" అనే విశేషణదళము చేత అనన్వయ వ్యావృత్తి కలుగుతున్నది. అనన్వయములో ఉపమానత్వము ఉపమేయత్వమున్నూ ఒకేవస్తువునకు సంభవించుతుంది. అంతేకాని ఉపమానము ఉపమేయమూ అక్కడ భిన్నముగా ఉండవు. ఉపమాలంకారములో రెండూ భిన్నభిన్నములుగా ఉండాలి. అనన్వయములో ఒకదానికే ఉపమానోపమేయత్వ సంభవమును ఈ లక్ష్యములో గ్రహించాలి.

సంతు లోకే సువర్ణాద్రిరత్నాకరసుధాకరాః
తథాపి వీరరుద్రోయం వీరరుద్ర ఇవ స్వయం,

లోకములో సువర్ణాద్రి సాగరము సుధాకరుడు అనే వీరు ఉంటేఉండనీ! అయినా ఈవీరరుద్రుడు వీరరుద్రునివలె ఉన్నాడు. ఈతనికిసాటి ఈతడేకాని మేరుసాగరచంద్రులు ఏమీ సాటికారు. అనేభావంకలిగిన దీనిలో వీరరుద్రుడనే ఒకేవ్యక్తికి ఉపమానత్వోపమేయత్వాలు ఉన్నవి. కాని ఉప మానము ఉపమేయముకంటె భిన్నముగా లేదు. అందువలన ఇక్కడ అనన్వయాలంకారమె కాని ఉపమకాదు.

లక్షణములో 'సంమతేన' అని ఉన్నది. ఉపమాలం కారములో సహృదయసమ్మతమయిన ఉపమానము ఉండాలి అని దాని భావము. ఈ 'సమ్మతేన' అని లక్షణములో ఉండడముచేత న్యూనోపమ అధికోపమ అనేవి దోషాలు. ఇవి దోషప్రకరణములో నిరూపితములు. వాటిలో ఉపమా

నము సహృదయసమ్మతంగా ఉండదు. ఉపమానానికి విశేష ణాలు ఉపమేయమునకంటె తక్కువగా ఉన్నప్పుడు ఎక్కువగా ఉన్నప్పుడున్నూ అది సహృదయులకు సంమతము కానేరదు. సహృదయసంమతితో ఉండే ఉపమానము అంటే ఈవిధంగా ఉండాలి.

ఉదన్వానివ గంభీరః సువర్ణాద్రి రివోన్నతః,
దిఙ్మహేభ ఇవ క్షోణీధారేయః కాకతీశ్వరః.

కాకతీశ్వరుడయిన ప్రతాపరుద్రుడు సముద్రమువలె గంభీరుడు. సువర్ణాద్రివలె సమున్నతుడు. దిగ్గజమువలే భూభారభరణసమర్థుడు. దీనిలో సముద్రసువర్ణాద్రి దిగ్గజము లకు ఉపమానత్వము ఉచితముగా సంమతముగా ఉంది. కనుక ఇది ఉపమే. ఇట్లాగే ఉపమాలంకారములో సంమతోపమానౌచిత్యం ఉండాలి. ఈ భావమును సూచించ డానికే "సంమతేన" అనే పదము.

"ధర్మతః" అనికూడా లక్షణంలో ఒకదళం ఉంది. ధర్మతః' అని ఉండడముచేత శ్లేషాలంకారముకంటె ఉపమా లంకారమునకు వైలక్షణ్యము సిద్ధించుచున్నది. ఉపమాలంకా రములో గుణసామ్యముకాని క్రియాసామ్యముకాని ఉండాలి. శబ్దసామ్యము ఉండరాదు. శ్లేషాలంకారములో శబ్ద సామ్యము ఉండరాదు. శ్లేషాలంకారములో శబ్దసామ్యము మాత్రము ఉంటుందని అంగీకరించుచున్నారు. అంతేకాని అక్కడ గుణక్రియాసామ్యమును అంగీకరించరు. ఉపమలో ధర్మసామ్యము ఉండాలి. అంటే గుణక్రియలలో ఏదయినా ఉండవచ్చు నన్నమాట. ఉపమకు ఈనియమం ఉండడము చేత ఇటువంటి నియమంలేని శ్లేషాలంకారముకంటె వైలక్ష

ణ్యము సిద్ధమవుతున్నదని భావము. ఈవివేకము ఈలక్ష్య ములో విశదమవుతుంది.

నీరాజయంత్యంధ్రపురీరమణ్యః ప్రదీపజాలై ర్వరవీరరుద్రం
చంద్రాననా గోత్రపతిం రజన్యః తారాగణై ర్మేరుమివ స్ఫురద్భిః.

ఆంధ్రపురీయువతులు చంద్రాననలు గోత్రపతి=కుల పతి అయిన వరవీరరుద్రుని స్ఫురించుతున్న ప్రదీపజాలము లచే నీరాజనము చేస్తూన్నారు. ఏవిధముగానంటే, స్ఫురించు తున్న తారాగణములచేత మేరుపర్వతమును చంద్రానన లయిన రజనులు=రాత్రులు వలె. రజనులు మేరువునకు నక్ష త్రాలతో నీరాజన మిచ్చినట్లుగా రమణులు ప్రతాపరుద్రు నకు దీపకళికలతో నీరాజన మిస్తున్నారు. అని అభిప్రాయము. ఈపద్యములో "ప్రతాపరుద్రం పురస్త్రియః నీరాజయంతి మేరుం రజన్య ఇవ" అని అలంకారస్వరూపమును నిరూపించే వాక్యము. మేరువును రాత్రులువలె ప్రతాపరుద్రుని పుర స్త్రీలు నీరాజనము చేస్తూన్నారు అని ఆవాక్యార్థము. ధర్మ సామ్యము లేనందువలన ఇది ఉపమాలంకారము కాదు. ఈపద్యములో "గోత్రపతిం" అనేది ప్రతాపరుద్రమేరు పర్వతములకు సమానధర్మమును రూపించే విశేషణముగా నిరూపితమయింది. "చంద్రాననాః" అనేది పురస్త్రీరజను లకు సమానధర్మమును రూపించే విశేషణముగా నిరూపిత మయింది. కాని వాటివలన ఉపమాలంకార ప్రయోజక మయిన గుణక్రియాసామ్యము సంభవించదు. అవి ఉపమా నోపమేయములకు అనుగతమయిన సమానధర్మమును సమ ర్పించలేవు. వానివలన గుణసామ్యమూ రాదు. క్రియా సామ్యమూ రాదన్నమాట. గోత్రపతి–చంద్రాననాశబ్దాలకు

ఉపమేయమునకు సంబంధించిన అర్థము ఒకటి. ఉపమానమునకు సంబంధించిన అర్థము వేరొకటి. రాజపక్షములో గోత్రపతి అంటే కులమునకు పతి అని అర్థము ప్రతీత మవుతున్నది. మేరుపక్షములో పర్వతపతి అని అర్థము ప్రతీత మవుతున్నది. అట్లాగే చంద్రాననాః అంటే స్త్రీపక్షములో చంద్ర ఇవ ఆననం యాసాం అని సమాసవిగ్రహము చెప్పవలె. కాబట్టి చంద్రునివంటి ముఖముకలవారు అని అర్థము. రాత్రిపక్షములో చంద్రఏవ ఆననం యాసాం" అని విగ్రహము చెప్పవలె. కాబట్టి చంద్రుడె ఆననముగా కలిగిన అని అర్థము. ఇట్లా అర్థము పక్షద్వయములో భిన్నభిన్నముగా ఉన్నదికాని ఉభయానుగతమై ఏకవిధముగా లేదు. అందువలన గుణక్రియాసామ్యము లేదని పర్యవసన్నము. రాజమేరువులకు గోత్రపతి అని రమణీరజనులకు చంద్రానన అని శబ్దసామ్య మయితే ఉంది. కాని ఆశబ్దమాత్రసామ్యముచేత ఉపమాప్రాప్తి లేదు. కనుక ఇది శ్లేషాలంకారమె.

ఇటువంటి స్థలములో శబ్దసామ్యముమాత్రము ఉన్నప్పటికీ ఉపమాలంకారము కావచ్చును, అని కావ్యప్రకాశకర్తలు అంగీకరిస్తారు. ధర్మసామ్యము ఉన్నప్పుడే ఉపమ కావడముకాక శబ్దసామ్యముఉన్నా ఉపమె అవుతుంది. అక్కడ ఉపమాలంకారమని అనడమె యుక్తము అని వారి భావము. అలంకారసర్వస్వకారుడయిన శ్రీరాజానక రుయ్యకుడు గుణక్రియాసామ్యమె ఉపమాప్రయోజకంకాని శబ్దమాత్రసామ్యము ఉపమాప్రయోజకం కాదంటాడు. ఇటువంటిస్థలంలో ఉపమాప్రతిభ ఉన్నప్పటికీ ఉపమాప్రతిభో

త్పత్తిలో హేతువయిన శ్లేషనే నిశ్చయించాలి. అనిన్నీ రుయ్యకుని భావము. విద్యానాథుడు సర్వస్వకారసిద్ధాంత శ్రద్ధాళువు కనుక ప్రకృతస్థలంలో శ్లేషాలంకారమేకాని ఉపమాలంకారము కాదు అని అంటున్నాడు.

"అన్యేన వర్ణ్యస్య సామ్యం" అని లక్షణములో ఉన్నది. అన్యముతో వర్ణ్యమునకు సామ్యము ఉన్నప్పుడు ఉపమఅవుతుంది. అనేదానివలన ప్రతీపాలంకారము వ్యావృత్తమవుతుంది. ప్రతీపాలంకారములో ప్రసిద్ధమయిన ఉపమానోపమేయభావము విపర్యస్తమవుతుంది. చంద్రపద్మాదులు ఉపమానములని ముఖాదులు ఉపమేయములని ప్రసిద్ధి. ఉపమానముతో ఉపమేయానికి సామ్యకథనము ఉంటేనే ఉపమ. ప్రతీపములో ఇట్లాకాక ఉపమేయముతో ఉపమానమునకు సామ్యకథనము ఉంటుంది. ఈవిషయము ఈఉదాహరణములో స్పష్టమవుతుంది.

**లోకోయ మవిశేషజ్ఞః కిం కుర్మః కస్య కథ్యతే**
**యత్ కాకతినరేంద్రేణ సుమేరు రుపమీయతే.**

ఈలోకము విశేషము తెలుసుకొన్నది కాదు. మేము ఏంచెయ్యాము? ఎవరికి చెప్పుతాము? కాకతీనరేంద్రునితో మేరువును ఉపమించుతున్నారుకదా! కాకతినరేంద్రునితో మేరువు సమానమని అంటున్నారే! దీనిలో అప్రకృతమయిన మేరువునకు ప్రకృతమయిన రాజుతో సాదృశ్యము చెప్పడము ఉంది. కాబట్టి ఇది ప్రతీపాలంకారమేకాని ఉపమ కాదు. దీనిలో అన్యముతో వర్ణ్యమునకు సామ్యము లేదు. వర్ణ్యముతో అన్యమునకు సామ్యము ఉన్నది.

'ఏకదా సామ్యం' అని లక్షణములోని దళము.

ఉపమానోపమేయములకు నిరూపింపబడే సాదృశ్యము ఒక పర్యాయమె ఉండాలి అని అనడముచేత ఉపమేయోపమా లంకారవ్యవచ్ఛేదము కలుగుతుంది. ఉపమేయోపమాలంకారములో ఉపమానోపమేయములకు 'ఏకదా' సామ్యము ఉండడముకాక 'అనేకదా' సామ్యము ఉంటుంది. ఉపమానముతో ఉపమేయమునకు సామ్యము ఒకమారు, ఉపమేయముతో ఉపమానమునకు సామ్యము మరొకమారు, నిరూపితమవుతుంది కాబట్టి అనేకపర్యాయములు అక్కడ సామ్యకథనము ఉంటుంది. ఈవిషయము ఈపద్యములో స్పష్టమవుతుంది.

ధర్మోऽర్థఇవ పూర్ణశ్రీ రర్థో ధర్మఇవ స్థితః
కామస్తావివ తౌ కామఇవ రుద్రనరేశ్వరే.

రుద్రనరేశ్వరునియందు ధర్మము అర్థమువలె పూర్ణశ్రీకమై ఉన్నది. అర్థము ధర్మమువలె పూర్ణశ్రీకమై ఉన్నది. కామము వాని (ధర్మార్థముల) వలె ఉన్నది. అవి (ధర్మార్థములు) కామమువలె ఉన్నవి. ఏకదాసామ్యము ఉండాలి అనేదానికి ప్రథమార్థము ప్రత్యుదాహరణము. అక్కడనే ఉపమేయోపమకూడా చరితార్థమవుతున్నది. ధర్మమునకు అర్థసాదృశ్యము అర్థమునకు ధర్మసాదృశ్యమూ ఉన్నందువలన అనేకదాసాదృశ్యము ఉన్నది. 'అర్థఇవ ధర్మ ఇవ' అని శబ్దద్వయముచేత అనేకపర్యాయములు సాదృశ్యకథనము ఉన్నందువలన ఇది ఉపమేయోపమ.

సామ్యము వాచ్యముగా ఉండాలి అనిన్నీ లక్షణములో వివక్షితము. సామ్యము వాచ్యముగా ఉండని అలంకారములన్నీ దీనిచేత వ్యావృత్తము లవుతున్నవి.

రూపకము సందేహము భ్రాంతిమత్తు ఉల్లేఖము అపహ్నవము తుల్యయోగిత దీపకము ప్రతివస్తూపమ దృష్టాంతము సహోక్తి వ్యతిరేకము నిదర్శనము ఈఅలంకారములు ప్రతీయమానౌపమ్యములు. అంతేకాని వీనిలో సామ్యము వాచ్యముకాదు. కనుక వాచ్యౌపమ్యకమయిన ఉపమ వీని కంటె విలక్షణము. గమ్యౌపమ్యములుగా ఉండేవానిని కొన్నిటిని ఈఉదాహరణాలలో స్పష్టముగా తెలిసికోవచ్చును.

౧ ప్రతాపరుద్రనృపతే ర్మండలాగ్రవిధుంతుదః
**అఖండవిక్రమోద్దామో గ్రసతే రాజమండలం,**

ప్రతాపరుద్రభూపతియొక్క ఖడ్గమనే రాహువు అఖండమయిన విక్రమాతిశయము కలిగినదై సామంతరాజమండలమనే చంద్రమండలమును గ్రసించుతున్నది. ఈపద్యములో రూపకాలంకారము ఉన్నది. మండలాగ్రము=ఖడ్గమునందు విధుంతుదత్వము రాజమండలమునందు రాజమండలత్వము (చంద్రమండలత్వము) ఆరోపితమయినందువలన రూపకము. ఇక్కడ సాదృశ్యము ఏమీ వాచ్యముగా నిరూపితము కాలేదు. వానివానికి ఉండే సాదృశ్యము ఇక్కడ గమ్యమానమవుతున్నది. వాచ్యము కాకపోయినప్పటికీ సాదృశ్యము ఉన్నదని అంగీకరించాలి. గమ్యసాదృశ్యమును ఇక్కడ ఒప్పుకోకపోతే మండలాగ్ర-విధుంతుద ఈరెండిటికీ నిరూపితమై ఉన్న సామానాధికరణ్యము (ఏకార్థాశ్రయత్వము) ఏవిధంగానూ ఉపపన్నము కాదు. వాని ఆ సామానాధికరణ్యము వేరొకవిధంగా కుదరదు కనుక దాని కుదురుబాటును సంపాదించే సాదృశ్యము లక్షిత మవుతుంది. అన్యవిధంగా కుదరని ఈ సమానాధికరణత్వమును సాదృశ్యమె కుదుర్చు

తున్న దన్నమాట. అయితే ఈసాదృశ్యము లక్ష్యమాణము కాబట్టి ఉపమ కాదు. రూపకాలంకారమె.

౨ కిమేష నవమో హరిత్పతి రమందసంపత్ప్రదం
కిమేష దశమః ప్రజాపతి రపూర్వసర్గక్రమః
కిమేష హరి రుర్వరోద్ధరణచుంచు రేకాదశః
చిరాదితి విలోక్యతే జగతి కాకతీంద్రో జనైః,

అనల్పసంపత్తునకు స్థానమయిన ఈతడు తొమ్మిదో దిక్పాలకుడా ఏమి? అపూర్వసృష్టిప్రక్రియకలిగిన ఈయన పదో ప్రజాపతియా ఏమి? భూమీసముద్ధరణసమర్థుడయిన ఈయన పదకొండవ విష్ణువా ఏమి? ఈవిధముగా చాలా సేపటిదాకా కాకతీంద్రుడు జగతిలో జనులచే చూడబడు తున్నాడు. దీనిలో సందేహాలంకారము ఉన్నది. సంపదాది సాదృశ్యము ఉన్నందువలన పేరరుద్రుడు లోకపాలాది రూపముగా సందేహింపబడుతున్నాడు. కాకతీశ్వరునకు దిగీశ్వరాదులకున్నూ పరస్పరము అభేదము ప్రతీత మవు తున్నది. కనుకనే ఇక్కడకూడా సాదృశ్యము వాచ్యముగా లేదు. కాకతీశ్వరదిగీశ్వరాదులకు ఉండే సాదృశ్యము గమ్య మాన మవుతున్నది. గమ్యమయినా సాదృశ్యస్థితిని అంగీక రించాలి. అట్లా అంగీకరించకపోతే ఈతడు దిక్పతిఅవునా? ప్రజాపతిఅవునా? అనే సందేహానింబంధనము కుదరదు. ఈ గమ్యసాదృశ్యమువినా సందేహము వేరొకవిధంగా ఉప పన్న మవుతున్నందువలన సాదృశ్యము ఆక్షిప్యమాణము అవుతున్నది. కాబట్టి సందేహాలంకారము. సాదృశ్యము ఆక్షిప్యమాణము అని అనడములో ఈభావమును గ్రహిం చాలి. ఉపపన్నము కానిది నిరూపితమయినపుడు ఆనిరూప

ణము కుదరక ఉపపత్తిని (కుదురుబాటును) సంపాదించే దానిని తెలియచేస్తుంది. ఆ తెలియచేయడమునె ఆక్షేప మంటారు. దీనినే అర్థాపత్తిప్రమాణముచే గోచరము కావడము అనిన్నీ అంటారు. "ఆయన పగలు భోజనము చేయడు; బలిసిఉన్నాడు" అని ఉన్నదనుకోండి. భోజనము లేకపోతే బలిసిఉండడము కుదరదు. ఈఉపపన్నముకాని బలిసిఉండుట "ఈతడు రాత్రి భోజనము చేస్తున్నాడు" అనే ఉపపాదకార్థమును ఆక్షిప్యమాణము చేస్తుంది. ఇట్లాగే ప్రకృతంలోకూడా

౩ కాకతీయవిభోః కీర్తివిభవే వ్యాప్తరోదసి
దివాపి చంద్రికాబుద్ధ్యా చకోరా యాంతి నిర్వృతిం.

ప్రతాపరుద్రుని కీర్తివిభవము భూమ్యాకాశములను వ్యాపించగా చకోరములు పగలుకూడా చంద్రికాబుద్ధితో తృప్తిని పొందుతున్నవి. దీనిలో భ్రాంతిమదలంకారము ఉన్నది. చకోరములకు కీర్తివిభవమును చూస్తే చంద్రికాబుద్ధి కలిగింది. అంటే వానికి వెన్నెల అనే భ్రాంతి కలిగిందన్నమాట. ఇక్కడకూడా సాదృశ్యము ఆక్షిప్తమె అవుతున్నది. కాని వాచ్యముగాలేదు. ఇటువంటి ఈసాదృశ్యము ఇక్కడ లేకపోతె వానికి చంద్రికాబుద్ధి కలగడము ఉపపన్నము కాదు. చంద్రికాసాదృశ్యమువలననే ఇది కుదురుతుంది. ఇట్లా సాదృశ్యాక్షేపము ఉన్నందువలన ఇక్కడ సందేహాలంకారమె కాని ఉపమ కాదు.

౪ లక్ష్మీనివాసగృహ మిత్యఖిలా నరేంద్రాః
శౌర్యాతిభూమిఖనిరి త్యరివీరవర్గాః
విద్యావిహారపదవీతిచ లబ్ధవర్ణాః
శ్రీకాకతీంద్రనగరీ మనిశం స్తువంతి.

శ్రీకాకతిప్రభుపట్టణమయిన వరంగలునగరమును శ్రీలక్ష్మీనివాసగృహము అని సర్వనరేంద్రులు, శౌర్యాతిశయమునకు గని అని శత్రువీరసమూహములున్నూ, విద్యలకు విహారపదవి అని విద్వాంసులున్నూ నిత్యము స్తవము చేస్తున్నారు. దీనిలో ఉల్లేఖాలంకారము ఉన్నది. ఒకే వస్తువును అనేకులు ఆయా నిమిత్తభేదమునుబట్టి అనేకవిధముగా అభ్యూహించడము ఈఅలంకారరూపము. సాదృశ్యము దీనిలోనూ వాచ్యముగాలేదు. సాదృశ్యము లేకపోయినట్లయితే నగరియందు ఆయా సమారోపము సంభవించదు. దానికి దీనికీ పరస్పరమూ సాదృశ్యము లేకపోతే ఒకపదార్థమందు వేరొకపదార్థసమారోపము చేయడము కుదరదుకదా! కాబట్టి ఇక్కడ సాదృశ్యమును కల్పించుకోవాలి కనుక ఉల్లేఖమె కాని ఉపమ కాదు.

౫ వీరరుద్రస్య భూపాలజయహోమం వితన్వతః
ధూమరాజి రియం భాతి న చమూరేణు రుత్థితా.

ఈ బయలుదేరినట్టిది భూపాలజయహోమం చేస్తున్న వీరరుద్రుని ధూమపంక్తియే భాసిస్తున్నది. అంతేకాని ఇది సేనాపరాగం కాదు. హోమంచేసేటపుడు పొగవరుస బయలు దేరుతుంది. జైత్రయాత్రలో ఆకాశవీధి వ్యాపించిన సేనాపరాగమును చూచి ఇది ధూమపంక్తే కాని పరాగం కాదు అని అపహ్నవము (కప్పిపుచ్చడము) ఉన్నందువలన ఇక్కడ అపహ్నవాలంకారము ధూమరాజిత్వమును ఆరోపించడము చమూరేణువు కాదని అపహ్నవించడమూ దీనిలో ఉన్నది. ఇక్కడకూడా సాదృశ్యము ఆక్షిప్తము కావలసినదే కాని వాచ్యముగాలేదు. ఆక్షిప్యమాణసాదృశ్యము ఇక్కడ ఉన్న

దని అంగీకరించాలి. కాకపోతే ఈఆరోపము అపహ్నవమూ కుదరదు. ఇక్కడి సమారోపము సాదృశ్యమూలకమె. ఇట్టి సాదృశ్యాక్షేపంవలన ఇక్కడ అపహ్నవమేకాని ఉపమకాదు. ఈచెప్పిన అయిదు ఉదాహరణాల్లోమాదిరిగా తుల్యయోగిత మొదలయిన వానిలోకూడా సాదృశ్యము గమ్యమెకాని వాచ్యముకాదు. అందువలన వాటిల్లోనూ ఉపమాశంకకు అవకాశం లేదు. కనుక సాధర్మ్యమూలకములయిన సర్వా లంకారాలకంటె ఈఉపమ విలక్షణమని గ్రహించాలి.

## ఉపమావిభాగము

ఉపమ మొదట రెండువిధాలు. పూర్ణోపమ లుప్తో పమ అని. ఉపమానము ఉపమేయము సాధారణధర్మము సాదృశ్యము అనే ఈనాలుగూ ఉపమాశరీరము. వీనిప్రతి పాదకములు నాలుగూ కంఠోక్తిగా ప్రతిపాదింపబడినట్లయితే పూర్ణోపమ అవుతుంది. చంద్రాదిపదార్థములు ఉత్కృష్ట గుణములు కలవి అని, అవి ఉపమానములని, కవికులప్రసిద్ధి. ముఖాదిపదార్థములు అపకృష్ట (తక్కువ) గుణములుకలవి అని, అవి ఉపమేయములని, ప్రసిద్ధి. గుణముకాని క్రియకాని ఉపమానోపమేయములకు సంబంధించిఉండేది సాధారణ ధర్మము అవుతుంది. సంస్కృతభాషలో 'ఇవ వా యథా' మొదలయినవి సాదృశ్యప్రతిపాదకశబ్దములు. ఈనాలుగూ ప్రయుక్తములయితే పూర్ణ. కతిపయములులోపించితే లుప్తో పమ. ఉపమాశరీరచతుష్కములో ఒకటి లోపించినా రెండు లోపించినా మూడు లోపించినా లుప్తఅవుతుంది. ఈలోపిం చడమనేది ఒక్కొకచోట శాస్త్రీయముగా ఉంటుంది. అంటే అక్కడి లోపము శాస్త్రముచేత విధింపబడేది (శాస్త్ర

'ము) అవుతుంది. ఒక్కొకచోట స్వారసికము. లోపించ
ం స్వారసికంగా ఉంటే ఇచ్ఛానుసారంగా దాన్ని లుప్త
వవచ్చు. దానినే ఐచ్ఛికము అనికూడా అంటారు. ఇక
అవాంతరభేదాలు___

## పూర్ణావిభాగము

పూర్ణోపమ రెండువిధాలు. శ్రౌతీపూర్ణ, ఆర్థీపూర్ణ,
. సాదృశ్యప్రతిపాదకములయిన శబ్దములు రెండువిధాలుగా
టవి. కొన్ని విన్నవెంటనే సాదృశ్యమును ప్రతిపాదించేవి
ుతవి. 'యథా, ఇవ, వా' మొదలయినవి ఇటువంటివే.
ని సాక్షాత్సాదృశ్యప్రతిపాదకములు అని అంటారు.
తికి సంబంధించినది శ్రౌతి. శ్రుతిచే సాదృశ్యప్రతి
దకము ఉంటే శ్రౌతిఉపమ అవుతుంది. సాదృశ్యప్రతిపాదక
లలో కొన్ని వెంటనే శ్రుతిమాత్రాన సాదృశ్యమును
తిపాదించేవి కాలేవు. అవి ముందుగా సదృశమును
ాదృశ్యంకలదానిని) చెప్పి ఆధర్మివ్యవధానముతో సాదృశ్య
ను ప్రతిపాదించుతవి. సదృశ-సంకాశ-నీకాశ-ప్రతీకా
దిశబ్దములు ఇటువంటివే. సదృశపదానికి సమానము
ాదృశ్యముకలది) అని వెంటనే గోచరించే అర్థము.
అర్థమును భావించగా అనంతరసమయములో సదృశ
ందు విశేషణముగా ఉన్న సాదృశ్యము వ్యవహితమై
చరిస్తుంది. ఇట్లా సదృశాభిధానద్వారకముగా సాదృశ్య
ును ప్రతిపాదించే సదృశాదిశబ్దములను ప్రయోగించినపుడు
ర్థి అవుతుంది. సదృశాదిశబ్దములు సాదృశ్య విశిష్టమయిన
ర్థపరములు అవుతున్నవి. యథేవాదిశబ్దములు సాదృశ్య
రము లవుతున్నవి. ఇవి సాదృశ్యపరము లయినా తాత్పర్య

ప్రభావంవలన సాదృశ్యము కలవానివిషయమై ప్రవర్తించేవి కాగలవు. ఇంతకూ శ్రుతిచే సాదృశ్యపరములయిన వానిని ప్రయోగించితే శ్రౌతి. శ్రుతిచే సాదృశ్యవిశిష్టపరములయినా అర్థమును అనుసరించి సాదృశ్యపరములయిన వానిని ప్రయోగించితే ఆర్థి అని ఈరెండిటి వివేకము. ఈ శ్రౌతి ఆర్థి అనేవి రెండూ వాక్యగతముగా సమాసగతముగా తద్ధితగతముగా విభాగముపొందితే మూడుమూడువిధములవుతున్నవి. ఇట్లా విభాగము పొందిన పూర్ణోపమ ఆరురకాలు. వానిపేర్లు;

౧ వాక్యగత శ్రౌతి పూర్ణోపమ
౨ సమాగత శ్రౌతి పూర్ణోపమ
3 తద్ధితగత శ్రౌతి పూర్ణోపమ
౪ వాక్యగతార్థి పూర్ణోపమ
౫ సమాసగతార్థి పూర్ణోపమ
౬ తద్ధితగతార్థి పూర్ణోపమ

## లుప్తా విభాగము

లుప్తోపమ పందొమ్మిదివిధము లవుతుంది. ఇతరాలంకారికులు విద్యానాథుడు అంగీకరించిన పద్ధతినేకాక వేరొక విధంగా ఇంకా భేదాలను పరిగణించారు. విద్యానాథోక్త లుప్తాభేదములపేర్లను ముందు ఈవిధముగా గ్రహించవచ్చు.

౧ వాక్యగత శ్రౌతి ధర్మలుప్త
౨ సమాసగత శ్రౌతి ధర్మలుప్త
3 వాక్యగత. ఆర్థి ధర్మలుప్త
౪ సమాసగత ఆర్థి ధర్మలుప్త
౫ తద్ధితగత ఆర్థి ధర్మలుప్త
౬ కర్మక్యచ్ ధర్మవాచక లుప్త

౭ ఆధారక్యచ్ ధర్మవాచకలుప్త
౮ కర్మణముల్ ధర్మవాచకలుప్త
౯ కర్తృణముల్ ధర్మవాచకలుప్త
౧౦ క్విప్ ధర్మవాచకలుప్త
౧౧ కర్తృక్యచ్ ధర్మవాచకోపమేయలుప్త
౧౨ కర్తృక్యచ్ ధర్మవాచకలుప్త
*౧౩ సమాసగత ధర్మవాచకలుప్త
౧౪ వాక్యగతోపమానలుప్త
౧౫ సమాసగతోపమానలుప్త
౧౬ వాక్యగత ధర్మోపమానలుప్త
౧౭ సమాసగతధర్మోపమానలుప్త
౧౮ సమాసగతవాచకలుప్త
౧౯ సమాసగత ధర్మవాచకోపమానలుప్త

వీనిలో పదమూడవది అయిన సమాసగతధర్మవాచకలుప్తను విద్యానాథుడు తన రచనలో నిరూపించలేదు. ఇప్పటికి ఉపలబ్ధము లవుతున్న గ్రంథాలలో దీని పాఠము లేదు. మొదట సంఖ్యానించడములో లుప్తోపమ ఏకోనవింశతి (౧౯) భేదము లవుతుందని ఉన్నది. దీనిని కలుపుకుంటే కాని ౧౯ భేదపూర్తికాదు. అందువలననె వ్యాఖ్యాత సోమపీథి దీనిని కలుపుకొని పరిగణింపవలసిందని సూచించాడు. ఈలుప్తాభేదములనె ప్రతిపత్తిసౌకర్యముకోసరము ఈవిధంగా కూడా గ్రహించడము యుక్తముగా ఉంటుంది. వీనిలో ఏకలుప్తలు ఎనిమిది, ద్విలుప్తలు తొమ్మది. త్రిలుప్తలు రెండు.

ఏకలుప్తలు

౧ వాచకలుప్త సమాసగత
౨ ఉపమానలుప్త సమాసగత

౩ ఉపమానలుప్త వాక్యగత
౪ ధర్మలుప్తశ్రౌతి వాక్యగత
౫ ,, ,, సమాసగత
౬ ,, ఆర్థి వాక్యగత
౭ ,, ,, సమాసగత
౮ ,, ,, తద్ధితగత

ద్విలుప్తలు

౧ ధర్మవాచకలుప్త కర్మక్యచ్
౨ ,, ఆధారక్యచ్
౩ ,, కర్మణముల్
౪ ,, కర్తృణముల్
౫ ,, క్విప్
౬ ,, కర్తృక్యజ్
౭ ,, సమాసగత
౮ ధర్మోపమానలుప్త సమాసగత
౯ ,, వాక్యగత

త్రిలుప్తలు

౧ ధర్మోపమేయవాచకలుప్తక్యచ్
౨ ధర్మోపమానవాచకలుప్త సమాసగత.

పూర్ణావిభాగములో లుప్తావిభాగములోనూ తద్ధితగతముగా ఉండే భేదములు నిర్దిష్టము లయినవి. సంస్కృతములో 'వతి' అనేది తద్ధితప్రత్యయము. దీనిప్రయోగము రెండువిధాల కన్పించుతున్నది. వతిప్రత్యయభేదమువలన కూడా ఉపమాభేదము సిద్ధమవుతుందన్నమాట. ''తేనతుల్యం

రాచేద్వతిః'' అనే సూత్రముచేత 'వతి' ప్రత్యయము శార్థములో విహిత మవుతున్నది. ''తత్రతస్యేవ'' అనే త్రముచేత 'వతి' ప్రత్యయము 'ఇవా'ర్థములో విహిత తున్నది. సదృశార్థములో విహితమయితే 'అర్థి' అని, ర్థమయిన సాదృశ్యపరముగా విహితమయినట్లయితే తి అని తెలుసుకోవచ్చు. సాదృశ్యార్థములో విహిత యిన వతి ప్రయోగములో సామాన్యధర్మప్రయోగం డా అవశ్యంగా ఉండాలి. ఆ ధర్మముకూడా ఉపాత్త యితేనే అన్వయసౌకర్యం ఉంటుంది. ధర్మోపాదానం పోతే అన్వయరీతి సరిగాఉండదు. ''కూర్మవత్ భుజే దినీ భాతి''అని ఉన్నదా! భూమి భుజమునందు ఆది ర్మమునందువలె భాసించుతున్నది. అని దీనిఅర్థము. క్కడ భుజము ఉపమేయము. కూర్మము ఉపమానము. త్ అనే తద్ధితప్రత్యయము ఉపమావాచకము.'భాతి' అనే దినీభానము సమానధర్మము. ఇక్కడ వత్ ప్రత్యయము వార్థమయిన సాదృశ్యార్థములో విహితమయింది. అందు నే కూర్మమునందువలె అని అర్థమును చెపుతున్నాము. క్కడ భానరూపమయిన సమానధర్మముకూడా ప్రయు మై ఉన్నందువలననె అన్వయసౌకర్యము సరిగా ఉంది. భాతి' అనే భానము (సామాన్యధర్మము) ఉపాత్తము కాక యినట్లయితే భూమి భుజమందు కూర్మమునందువలె- నేఅర్థము వస్తుంది. కూర్మమునందువలె ఏమిటో? ఏమవు న్నదో? ఏమో? స్పష్టముకాదు. అన్వయంలో సౌక ్యంపర్పడదు. కనుక తద్ధితగత అయిన శ్రౌతిలో అవ శ్యంగా ధర్మోపాదానం ఉండాలి కాబట్టి తద్ధితగతశ్రౌతి

ధర్మలుప్త ఉండదు. తద్ధితప్రత్యయమయిన వతివిధానంలో ఉన్న భేదమునుబట్టి శ్రౌతి ఆర్థివిభాగము రావడము ఇప్పటికి స్పష్టమయినట్లె. ఇంకా కల్పప్, దేశ్య, దేశీయర్ అనికూడా కొన్నిప్రత్యయాలు ఉన్నవి. అవికూడా తద్ధితప్రత్యయాలే. కొంచెము తక్కువఅనే అర్థంలో ఈప్రత్యయాలు విహితము లవుతూ ఉంటవి. ముఖము చంద్రకల్పము అని అంటాము అనుకోండి. ముఖము చంద్రునికంటె కొంచెముతక్కువ అని అర్థము. ఇట్లాగే ముఖము చంద్రదేశ్యము చంద్రదేశీయము అని ప్రయోగించినపుడున్నూ గ్రహించాలి. ఈకల్పబాది ప్రయోగం ఉన్నపుడు సదృశార్థమె (ధర్మి) ముందుగా గోచర మవుతుంది. వినినవెంటనే సాదృశ్యార్థము గోచరముకాదు. కనుక వీని ప్రయోగంలో ఆర్థివిభాగమునె గ్రహించాలి. ఈస్థలంలో సాదృశ్యప్రతిపాదనం ఉండకపోదు. అయితే అది ధర్మివ్యవధానంతో ఉంటుందన్నమాట.

## పూర్ణోపమోదాహరణములు

ఇటుమీాదట వరుసవరుసగా పూర్ణోపమాభేదాలకు లుప్తోపమాభేదాలకున్నూ ఉదాహరణములను నిరూపించవలసిఉన్నది. ముందుగా పూర్ణోపమాప్రభేదాలు ఆరింటికి ఉదా :-

### ౧ వాక్యగతశ్రౌతి

ఉద్దామోద్యతవిక్రమే కృతయుగే బాహే యయాతే ర్యథా
త్రేతాయాం రఘునాయకస్య మహితఖ్యాతౌ భుజాయాం యథా
దోర్దండేచ యుధిష్ఠిరస్య విలసచ్ఛౌర్యే యథా ద్వాపరే
విస్రబ్ధాద్య కలౌ తథైవ రమతే క్షోణ్యాంధ్రభర్తు ర్భుజే.

కృతయుగములో అతిశయితమహాపరాక్రమంకలిగిన

మయయాతిమహారాజు భుజమునందువలె, త్రేతాయుగంలో శ్రీరఘునాయకుని మహితఖ్యాతికల భుజమునందువలె, ద్వాపరయుగంలో యుధిష్ఠిరుని విలసించు శౌర్యముకల దోర్దండమునందువలె విశ్వాసముకలిగిన భూమి ఈకలియుగమందు ఆంధ్రప్రభువయిన ప్రతాపరుద్రుని భుజమందు (ఆవిధముగానె) క్రీడించుతున్నది. పూర్వయుగాలలో ఏవిధంగా వారివారి భుజములందు భూమి క్రీడించిందో ఆవిధంగా కలిలో కాకతీయభుజమందు క్రీడిస్తున్నదని భావము. దీనిలో కాకతీయభుజము ఉపమేయము. యయాతిభుజము ఉపమానము. రమణము సమానధర్మము. 'యథా' అనేది ఉపమావాచకము. నాలుగూఉన్నందువలన పూర్ణ. యథా అనేది సాదృశ్యపరముకాబట్టి శ్రౌతి. ఉపమావాచకము ఉపమానము వ్యస్తముగా ఉన్నందువలన వాక్యగతమయినట్లు ఈవిధముగానే ఉత్తరోదాహరణములలోకూడా గ్రహించాలి.

## ౨ సమాసగతశ్రౌతి

భాస్వానివోద్యన్నుదయాద్రిలంబీ భద్రాసనస్థో వరవీరరుద్రః
ఉత్పశ్యతా మంధ్రపురీజనానాం నేత్రాబ్జజాడ్యం శమయ త్యశేషం.

సింహాసనస్థితుడయిన వీరరుద్రుడు ఉదయపర్వతమును అవలంబించిఉన్న 'సూర్యుడువలె' దర్శనముచేస్తూఉన్న ఆంధ్రపురీజనుల నేత్రపద్మజడిమనంతా శమింపచేస్తున్నాడు. సూర్యుడు పద్మజడిమను శమింపచేస్తున్నాడు. వీరరుద్రుడు నేత్రముల మాంద్యమును పోగొట్టుతున్నాడు. ఇవ ప్రయోగమువలన శ్రౌతి. చతుష్కమూ ఉన్నదికాబట్టి పూర్ణ. "భాస్వానివ"అనేది సమస్తపదము. కనుక సమాస

గత. "ఇవేనసహ నిత్యసమాసః" అనే నియమము ఉన్నందు వలన ఇది నిత్యసమాసము.

ఇక్కడ ఈవిషయమును గ్రహించాలి. "సుపోధాతు ప్రాతిపదికయోః" అనే సూత్రందగ్గర సిద్ధాంతకౌముదిలో "ఇవేనసహ సమాసః విభక్త్యలోపః పూర్వపదప్రకృతిస్వరత్వంచ" అనే వార్త్తికము పఠితమయింది. ఇదే మహాభాష్యములో 'సహసుపా' అనే సూత్రందగ్గర పఠితము. ఇది కాత్యాయనవార్త్తికముకాని సూత్రముకాదు. వ్యాకరణ శాస్త్రంలో 'సమాసః' అనే ఉందికాని 'నిత్యసమాసః' అని లేదు కాబట్టి నిత్యపదము ప్రక్షిప్తము. అది ప్రామాణికం కాదు. 'భాస్వానివ' మొదలయినవి నిత్యసమాసములని అనడము పొరబాటు. విద్యానాథుడు నిత్యపదమును ప్రయోగించడము భ్రాంతిమూలకము. కావ్యప్రకాశలో 'ఇవేన నిత్యసమాసః' అని ఉండడమును చూచి విద్యానాథుడున్నూ అనిఉంటాడు. కావ్యప్రకాశలో నిత్యపదము ప్రక్షిప్తము. ఇవతోసమాసము వైకల్పికముకాబట్టే "జీమూతస్యేవ భవతి ప్రతీకం"అనే తైత్తిరీయవైదికవాక్యమును పృథక్పదముగా పఠించడమున్నూ ఉపపన్న మవుతున్నది. "ఉద్బాహురివ వామనః; అనయేనేవ రాజ్యశ్రీః; ప్రావృషేణ్య ఇవ వారిధరః" అనే ప్రయోగములున్నూ కుదురుతున్నవి. కనుక ప్రకృతములో నిత్యపదము ఉచితముకాదు. "భాస్వానివ" అనేది సమాసము. అక్కడ ఉపమ సమాసగత.

### ౩ తద్ధితగతశ్రౌతి

కూర్మవచ్ఛేషవద్గోత్రగిరివద్దిజ్మహేభవత్
భుజే ప్రతాపరుద్రస్య ధురీణే భాతి మేదినీ.

ప్రతాపరుద్రుని ధురంధరమయిన (సమర్థమయిన) భుజమందు, ఆదికూర్మమునందువలె, ఆదిశేషునందువలె, కులపర్వతమునందువలె, దిగ్గజమునందువలె భూమి భాసించుతున్నది. దీనిలో వతి (వత్) తద్ధితప్రత్యయము. "తత్ర తస్యేవ" అనే వ్యాకరణసూత్రముచేత అది విహిత మవుతున్నది. సప్తమ్యర్థములో ప్రవర్తించే ఇవార్థమునందు ఇది విహితమయింది. ఉపమాదులు నాలుగూ ఉన్నవి. సమన్వయము సులభము.

## ౪ వాక్యగత ఆర్థి

తైస్తై ర్మహీపాలనసంవిధానైః తైస్తైః ప్రజారంజనవైభవైశ్చ
విరాజతే సంప్రతి కాకతీయ లక్ష్మీపతి ర్దాశరథే స్సమానః.

ఆయా భూమీపాలనవిధానములచేత ఆయా ప్రజలను రంజింపచేసే విభవములచేతా ఇపుడు కాకతీయలక్ష్మీపతి శ్రీరామునకు సమానుడై విరాజిల్లుతున్నాడు. దీనిలో పూర్ణోపమ. దాశరథేః సమానః అని విడిగా ఉండడముచేత వాక్యగత. సమానశబ్దమును ప్రయోగించినందువలన ఆర్థి. ఈసమానశబ్దము ముందుగా ధర్మిని చెప్పి అనంతరము ఉపపత్తిసంపాదనానికి సాదృశ్యమును చెపుతున్నది.

## ౫ సమాసగత ఆర్థి

తాదృక్పాలనసామర్థ్యసంపదా కాకతీశ్వరః
హరిదీశ్వరసంకాశః శాస్తి మధ్యమవిష్టపం.

కాకతీశ్వరుడు అటువంటి పాలించే సామర్థ్యసంపదచేత దిక్పతిసమానుడై మధ్యమలోకమును శాసించుతున్నాడు. దీనిలో ఉపమానవాచకమయిన హరిదీశ్వరపదముతో ఉపమావాచకమయిన సంకాశపదము సమసించి

ఉన్నదికాబట్టి సమాసగతత్వమునుఊహించాలి. నిభసంకాశ నీకాశాదిశబ్దములు సమాసగతములయినపుడు ఉత్తర పదముగా ఉండాలి అని నియమము. సంకాశప్రయోగము వలన ఆర్థి.

## ౬ తద్ధితగత ఆర్థి

హేమాచలవ దౌన్నత్యే గాంభీర్యే క్షీరసింధువత్
ప్రతాపే భానువ ద్భాతి వీరరుద్రనరేశ్వరః.

వీరరుద్రనరేశ్వరుడు ఔన్నత్యములో మేరువుతో సమానుడు. గాంభీర్యములో క్షీరసాగరముతో సదృశుడు. ప్రతాపములో సూర్యునితో సమానుడు అయి భాసించు తున్నాడు. దీనిలో వతి (వత్) ప్రత్యయము "తేనతుల్యం క్రియాచ" అనే వ్యాకరణసూత్రముచే విహితమయింది. ఇది తుల్యార్థమును (సాదృశ్యవత్) సూచిస్తుంది, కనుక ఆర్థి. తద్ధితగతఅయిన ఉపమ. ఈనిరూపించిన ఆరుఉదాహరణా లలోనూ ఉపమానాదిచతురంగనిబంధనము ఉన్నందువలన పూర్ణోపమ.

## లుప్తోపమోదాహరణములు

ఇకలుప్తోపమలను ఉదాహరించాలి. మొదటగా నిరూ పించే ఈఅయిదుఉదాహరణాలలోనూ సామాన్యధర్మో పాదానము ఉండదు. రెండు శ్రౌతీలుప్తలు. మూడు ఆర్థి లుప్తలు. ఇట్లా ఈధర్మలుప్తలు అయిదు.

## ౧ వాక్యగత శ్రౌతి

యథా రుచాం స్వామిని చక్రవాక్యో యథా చ నీహారరుచౌ చకోర్యః
యథా ప్రసూనస్తబకే భ్రమర్యః తథా ప్రజాః కాకతివీరరుద్రే.

చక్రవాకులు సూర్యునియందు ఏవిధముగా ఉంటున్నవో, చకోరికలు చంద్రునియందు ఏవిధముగా ఉంటున్నవో, తుమ్మెదలు పువ్వులగుత్తియందు ఏవిధముగా ఉంటున్నవో అదేవిధముగా ప్రజలు కాకతివీరరుద్రునియందు ఉంటున్నారు. దీనిలో ఉపమ యథాప్రయోగమువలన శ్రౌతి. వ్యస్తముగా ఉన్నందువలన వాక్యగత. ధర్మము ఉపాత్తముకానందువలన ధర్మలుప్త. వర్తంతే ఉంటున్నారు అనే అధ్యాహృతమయిన క్రియ సాధారణధర్మము కాదు. సామాన్యముగా ఉండే క్రియామాత్రము. అంటే ఉండకతప్పనిసరిగాఉండే క్రియ. చమత్కారకము కాదు. కాబట్టి సమానధర్మము కాతగదు. ఏదోవిధముగానయినా చమత్కారమును కలుగజేసేది అయితేనే సమానధర్మ మవుతుంది. ఈపద్యములో చమత్కారమును కలుగజేసే ప్రతాపము ఆహ్లాదము సారస్యము అనే ధర్మాలు ఉపాత్తములు కాలేదు కాబట్టి ధర్మలుప్త. ఇట్లాగే ఇతరస్థలములలో కూడా గ్రహించాలి.

### ౨ సమాసగతశ్రౌతి

ప్రతాపరుద్రదేవస్య పాదపీఠీ మనారతం
ఆరాధయంతి భూపాలాః ప్రణతా దేవతా మివ.

సామంతులు నిత్యమున్నూ ప్రతాపరుద్రదేవుని పాదపీఠమును ప్రణతులై దేవతనువలె ఆరాధిస్తున్నారు. 'దేవతా మివ' అనేది 'భాస్వానివ' మాదిరిగా సమాసము. సమన్వయము స్పష్టము. పాదపీఠీదేవతలకు సమానధర్మము సంపత్ప్రదత్వము. అది అనుపాత్తము కనుక ధర్మలుప్త. శ్రౌతిలో తద్ధితగతముగా ధర్మలుప్త ఉండదని అన్వయసౌకర్యము కలదని ఇదివరలో నిరూపితము.

### ౩ వాక్యగత ఆర్థి

కాకతిక్ష్మాపతే ర్జైత్రప్రస్థానపటహధ్వనిం
తుల్యం దంభోలినిర్ఘోషైః శృణ్వంత్యరిమహీభృతః.

కాకతిభూపతియొక్క జయస్వభావము కలిగిన దండయాత్రలోని భేరీధ్వనిని శత్రురాజులు వజ్రనిర్ఘోషములతో సమానమయిన దానినిగా వింటున్నారు. దీనిలో 'తుల్యం' అనేది వ్యస్తముగా ఉన్నందువలన ఉపమ వాక్యగత. భీషణరూపమయిన సమానధర్మము గమ్యమాన మవుతున్నదే కాని పద్యములో ఉపాత్తము కాలేదు. కాబట్టి ధర్మలుప్త. తుల్యపదప్రయోగమువలన ఆర్థి.

### ౪ సమాసగతఆర్థి

శశ్వత్పురీ మేకశిలాభిధానాం వస్వోకసారాసదృశీ మవేక్ష్య
నమంతి భూపా భువి కాకతీయరాజ్యప్రతిష్ఠాం బహుమన్యమానాః

రాజులు ఏకశిలాపట్టణమును అలకాపురీసదృశమైన దానినిగా చూచి భూమిలో కాకతీయరాజ్యప్రతిష్ఠను బాగా కొనియాడుతూ మాటిమాటికీ కొనియాడుతున్నారు. దీనిలో 'వస్వోకసారాసదృశీం' అని కలిపిఉండడముచేత ఉపమ సమాసగత. వైభవరూపమయిన సమానధర్మము ఉపాత్తము కాలేదు.

### ౫ తద్ధితగత ఆర్థి

ప్రతాపరుద్రనృపతే ర్జగన్మహితతేజసః
కందర్పకల్ప మాకారం పశ్యంత్యంధ్రపురంధ్రయః.

ప్రపంచములో మెచ్చదగిన పరాక్రమముకల ప్రతాపరుద్రుని ఆకారమును మన్మథునితో సమానమయిన దానినిగా ఆంధ్రస్త్రీలు చూస్తున్నారు. ఇక్కడ కల్పప్ప్రత్యయము

కొంచెము తక్కువ అనే అర్థములో విధింపబడిన తద్ధిత ప్రత్యయము. రూపసంపద అనే సమానధర్మము లేదు. ఇప్పటికి ధర్మలుప్తలు అయిదూ నిరూపితములు అయినవి. ఇటుమీదట ద్విలుప్తలో భేదాలు ఉదాహృతములు అవుతవి. ఇదివరలో ప్రకారాంతరముగా నిరూపించిన విధానాన్నిబట్టి సమాసగతమయిన వాచకలుప్తను వాక్యసమాసగతము లయిన ఉపమానలుప్తలను మొత్తం ఇంకా మూడులుప్త లను ఏకలుప్తాప్రసంగములో నిరూపించవలసిందేకాని విద్యా నాథుడు ఆవిధముగా ఉదాహరించలేదు. తాను తలచిన వరుసను అనుసరించి ఆతడు ఉదాహరించడమువలన సామా న్యముగా ఆప్రణాళికను అనుసరించే ఈరచనలోకూడా ఆపద్ధతి ప్రదర్శనమె సంగతముగా ఉంటుంది. ముందుగా ఈచెప్పబోయే అయిదింటిలో ధర్మవాచకలోపమును గుర్తించాలి.

### ౬ కర్మక్యచ్

దుగ్ధార్ణవీయ త్యంభోధీః కైలాసీయతి భూధరాః
ప్రతాపరుద్రదేవస్య యశోవైశద్యవైభవం.

ప్రతాపరుద్రుని యశోవైభవము సముద్రములను దుగ్ధార్ణవములనుగా చేస్తున్నది. పర్వతములను కైలాసము లనుగా చేస్తున్నది. దీనిలో సముద్రములు ఉపమేయము దుగ్ధార్ణవము ఉపమానము. దుగ్ధార్ణవీయతి అనేచోట 'ఉపమానాదాచారే' అనేపాణినిసూత్రముచేత 'క్యచ్' ప్రత్యయము వచ్చింది. ఇది ఉపమానవాచకమయిన 'దుగ్ధార్ణవం' అనే కర్మపదముకంటె ఆచారార్థములో వచ్చిన ప్రత్యయము. అంభోధీః అనే ఉపమేయములో ద్వితీయా

విభక్తి కన్పడుతున్నది కాబట్టి ఈ దుగ్ధార్ణవీయతి అనే స్థలములో ద్వితీయాంతముకంటె క్యచ్ప్రత్యయము వచ్చింది. ఇంతకూ ఇక్కడ సాదృశ్యప్రతిపాదకములయిన ఇవాదిపదాలకుగాని తుల్యాదిపదాలకుగాని ప్రయోగము లేదు. కాబట్టి వాచకలోపము ఉంది. క్యచ్ ప్రత్యయము ఉపమాప్రతిపాదకము కాదు. అది ఆచారార్థములో విహితమయిన ప్రత్యయముకదా! ఉపమాప్రయోజకమయిన ధావళ్యాదిసమానధర్మమున్నూ ఇక్కడ లేదు. అందువలన ధర్మముకూడా లుప్తము. ఆచారమనేది క్యజర్థముగా ఉన్నా అంతమాత్రము అది ఉపమాప్రయోజకము కాలేదు. కనుక ఇది ధర్మవాచకలుప్త.

## ౭ ఆధారక్యచ్

క్రీడాద్రీయతి గోత్రశైలశిఖరే ష్మాస్థానసద్మీయతి
ద్వీపేష్వబ్ధిషు దీర్ఘికీయతి హరిత్స్వాకాంతగేహీయతి
ఉద్యానీయతి సీమపర్వతతటారణ్యే సుపర్వాచలే
ప్రాసాదీయతి వీరరుద్రనృపతేః స్ఫారః ప్రతాపోదయః.

వీరరుద్రుని అతిశయించిన ప్రతాపోదయము కులపర్వతశిఖరములలో క్రీడాపర్వతమునందువలె ఆచరించుతున్నది. నానాద్వీపములలో సభామంటపమునందువలె ఆచరిస్తున్నది. సముద్రములలో క్రీడాసరస్సులందువలె ఆచరిస్తున్నది. దిక్కులలో అంతఃపురములోవలె ఆచరిస్తున్నది. లోకాలోకపర్వతతటారణ్యములో ఉద్యానమునందువలె ఆచరిస్తున్నది. మేరుపర్వతములో ప్రాసాదమునందువలె ఆచరిస్తున్నది. దీనిలో గోత్రశైలశిఖరాదులు ఉపమేయములు. క్రీడాద్రిప్రభృతులు ఉపమానములు. (క్రీడాద్రిష్వివ వర్తత

ఇతి (క్రీడాద్రీయతి) క్రీడాద్రీయతి మొదలయిన పదాలలో "అధికరణాచ్చ" అనే వార్తికమువలన వచ్చినక్యచ్ ప్రత్యయము ఉన్నది. ఉపమానవాచకమయిన అధికరణ శబ్దము కంటె ఆచారార్థములో క్యచ్ప్రత్యయము వస్తుంది. అని దాని అర్థము. గోత్రశైలశిఖరేషు అనే ఉపమేయములో సప్తమి కన్పడుతున్నది. కాబట్టి ఇక్కడకూడా సప్తమ్యంతము కంటె క్యచ్ ప్రత్యయము వచ్చింది. ఉపమాప్రతిపాదకము లయిన ఇవాదులుకాని తుల్యాదిపదాలుకాని లేవు. అందు వలన వాచకలోపము. సుఖసాధనత్వరూపమయిన సామాన్య ధర్మము గమ్యమవుతున్నది. వాచ్యముగా లేదు. కేవలా చారమాత్రము ఉపమాప్రయోజకధర్మము కాదు. కాబట్టి ధర్మవాచకలుప్త. ఆధారక్యచ్గతముగా ఉన్నది.

## ౮ కర్మణముల్

పశ్యం త్యాత్మజదర్శ మిందు మమరస్రోతస్వినీం సత్సఖీ
దర్శం క్షీరపయోనిధిం ప్రియసుహృద్దర్శం గిరిం రాజతం
లీలాదర్పణదర్శ మన్యదమలం తారాది హారావళీ
దర్శం ఖేలతి వీరరుద్రనృపతేః కీర్తి ర్జగద్వ్యాపినీ.

వీరరుద్రనృపతియొక్క జగద్వ్యాపిని అయినకీర్తి చంద్రుని పుత్రునివలె చూస్తూ, వియద్గంగను చెలికత్తెవలె చూస్తూ, పాలసముద్రమును ప్రియస్నేహితునివలె చూస్తూ, ఇంకా స్వచ్ఛమయిన నక్షత్రాదికమును హారావళివలె చూస్తూ విహరించుచున్నది. దీనిలో చంద్రాదులు ఉపమేయము. ఆత్మజాదులు ఉపమానము 'ఆత్మజదర్శం పశ్యంతీ' అనేచోట "ఉపమానే కర్మణిచ" అనే పాణిని సూత్రముప్రకారము ణముల్ ప్రత్యయము వచ్చింది. ఉప

మానవాచకమైన 'ఆత్మజం' అనే కర్మ ఉపపదముగా ఉండగా 'దృశి' ధాతువునకు ణముల్ప్రత్యయము వచ్చి నందువలన మళ్లా దృశిధాతువే అనుప్రయుక్తమయింది. ఆత్మజకర్మకముగా ఉన్న దర్శనక్రియ ఇందుకర్మకమయిన దర్శనక్రియా రెండూ ఉపమానోపమేయభావము పొంది ఉన్నవి. ఇంతకూ ఇక్కడ ఉపమాప్రతిపాదకములయిన ఇవాదులకు ప్రయోగము లేదు. నైర్మల్యరూపమయిన సాధర్మ్యము ఉపమాప్రయోజకమయిన ధర్మము. అదిన్నీ ఉపాత్తముకాలేదు. ణముల్ ప్రత్యయము ఉపమాప్రతి పాదకము కాదు. అది భావరూపార్థములో విహితమయింది కాబట్టి కేవలమూ భావార్థకమే అవుతుంది. కేవలమూ అటువంటి అర్థము సమానధర్మముకావడానికి వీలులేదని ఇది వరలో నిరూపితము.

## ౯ కర్తృణముల్

నృపేషు శిక్షావిధిదండచారం కాంతాసు పుష్పాయుధధన్వచారం
ప్రజాసు చాలంబనయష్టిచారం చరత్యయం రుద్రనరేంద్రఖడ్గః.

రుద్రనరేంద్రునిఖడ్గము రాజులలో శిక్షావిధిదండమువలె సంచరిస్తున్నది. కాంతలలో మన్మథధనుస్సువలె సంచరిస్తు న్నది. ప్రజలలో ఆలంబనయష్టివలె సంచరించుతున్నది. దీనిలో దండధనుర్యష్టులు ఉపమానములు. ఖడ్గము ఉపమే యము. 'దండచారం చరతి' మొదలయిన పదాలలో ణముల్ ప్రత్యయము ఉన్నది. ఉపమానవాచకమయిన కర్త ఉప పదముగా ఉండగా ధాతువునకు ణముల్ప్రత్యయము వస్తుందని 'ఉపమానే కర్మణిచ' అనే సూత్రములోని చకా రమువలన గోచరమయిన అర్థము. ఉపమాప్రతి పాదకము

లయిన ఇవాదులు ప్రయుక్తములు కాలేదు. ఉపమాప్రయోజకమయిన భీషణోద్దీపనవిశ్రామభూమిత్వము లనే సమాన ధర్మములున్నా ఉపాత్తములు కాలేదు. కనుక వాచక ధర్మలుప్త.

## ౧౦ క్విప్

సుధాప్రవాహతి సతా మసతాం కాలకూటతి
వీరరుద్రనరేంద్రస్య **గుణజ్యోత్స్నావిజృంభితం.**

వీరరుద్రునియొక్క గుణజ్యోత్స్నావిజృంభణము సత్పురుషులకు సుధాప్రవాహమువలె ఆచరిస్తున్నది. అసత్పురుషులకు కాలకూటమువలె ఆచరిస్తున్నది. దీనిలో "సర్వప్రాతిపదికేభ్యః క్విప్ వా వక్తవ్యః" అనే వార్తికము చేత ఉపమానవాచకములయిన సుధాప్రవాహ కాలకూట ప్రాతిపదికలకంటె ఆచారార్థములో క్విప్ప్రత్యయము వచ్చింది. గుణవిజృంభణము ఉపమేయము. సుధాప్రవాహము ఉపమానము. ఉపమావాచకమయిన ఇవాదికము లేదు. క్విప్ప్రత్యయము ఆచారార్థములో విధించబడించి కనుక ఉపమాప్రతిపాదకము కాదు. కేవలాచారము ఉపమాప్రయోజకధర్మము కాదు. కాబట్టి ధర్మలోపమున్నూ ఊహించాలి. అందువలననే ఇది ధర్మవాచకలుప్త.

ఈచెప్పిన మొదటి తొమ్మిదిఉదాహరణాలలో ప్రాచీనులు కొందరు ఆచారరూపమయిన సమానధర్మము ఉపాత్తమయ్యే ఉన్నదని అంకగీరిస్తూ కేవలవాచకలోపమును మాత్రమె నిరూపిస్తున్నారు. విద్యానాథుడు పూర్వము చెప్పినట్లుగా కేవలము ఆచారముమాత్రము సమానధర్మము కాదని వీనిని ద్విలుప్తలనుగా ఉదాహరిస్తున్నాడు.

౧౧ ధర్మవాచకోపమేయలుప్తః క్యచ్గత

జ్యోత్స్నయంతి సుధీయంతి చందనీయంతి సర్వతః
ప్రతాపరుద్రనృపతేః శుభ్రాః కీర్తేర్మహోర్మయః.

ప్రతాపరుద్రుని శుభ్రములయిన కీర్తితరంగాలు అంతటా, తమస్వరూపమును వెన్నెలవలె చేసికొంటున్నవి. అమృతమువలె చేసికొంటున్నవి. చందనమువలె చేసికొంటునవి. దీనిలో జ్యోత్స్నయంతిమొదలయిన పదాలలో జ్యోత్స్నమివ ఆత్మానం ఆచరంతి జ్యోత్స్యయంతి అని అర్థమును నిశ్చయించినపుడు ద్వితీయాంతముగాఉన్న (ఆత్మానం) కీర్తిస్వరూపమునకు ఉపమేయమునకు ఉపాదానము లేదు. ఉపమావాచకముమయిన ఇవాదికము లేదు. నైర్మల్యాదిసాధర్మ్యమున్నూ ఉపాత్తము కాలేదని స్పష్టగోచర మవుతున్నది. కాబట్టి ఇది త్రిలుప్త. కీర్తిమహోర్మయః అనేది ఉపమేయము కాదు. ఉపమానోపమేయములు సమానవిభక్తి కలిగిఉండాలి. ఉపమానముకంటె ఇది భిన్నవిభక్తికముగా ఉన్నందువలన ఉపమేయమనరాదు. మహోర్మయః అనేది ప్రథమాంతముగా ఉందికాబట్టి దీన్ని అనుసరించి జ్యోత్స్నయంతి అనేచోట 'జ్యోత్స్నఇవ ఆచరంతి' అని ప్రథమాంతముగానె చెప్పి సమానవిభక్తికత్వమును కల్పించుకొని ఉపపత్తిని సంపాదించరాదా ? అని అనడము వ్యాకరణశాస్త్రవిరుద్ధము.

౧౨ ధర్మవాచకలుప్త కర్తృక్యజ్గత

శేషాయతే మహీం వోఢుం కల్పశాఖాయతేర్థినాం
ప్రతాపరుద్రదోర్దండః కాలదండాయతే ద్విషాం.

ప్రతాపరుద్రునిభుజదండము భూమిని వహించడానికి

'శేషునివలె ఆచరించుతున్నది. శత్రువులకు కాలదండమువలె ఆచరించుతున్నది. దీనిలో శేషాయతే కల్పశాఖాయతే కాల దండాయతే' అనేచోట "కర్తుః క్యజ్ సలోపశ్చ" అనే సూత్రమువలన వచ్చిన క్యజ్ప్రత్యయము ఉన్నది. భుజదండము ఉపమేయము. కల్పశాఖ ఉపమానము. ఉపమావాచకము లేదు. వదాన్యత్వము కోరికలు పూరించడమనే సమానధర్మమున్నూ ఉపాత్తము కాలేదు. అందువలన ధర్మవాచకలుప్త. శేషాయతే మహీం వోఢుం అనేవి ప్రకృతోదాహరణం కాదు. మహీవహనరూపమయిన సమాన ధర్మము ఉపాత్తమయినందువలన ధర్మలుప్తత రాదు. 'శేషాయతే అనేది వాచకలుప్తకు ఉదాహరణం కావచ్చు.

## ౧౩ సమాసగత ధర్మవాచకలుప్త

దీనికి మూలములో విద్యానాథుడు ఉదాహరణము ప్రదర్శించలేదు. పురుషవ్యాఘ్రః అనేది ప్రకృతోదాహరణ మవుతుంది. "పురుషో వ్యాఘ్ర ఇవ పురుషవ్యాఘ్రః" అని విగ్రహము. సామాన్యధర్మప్రయోగము ఉంటె ఈపదములు ఈవిధముగా సమసించవు. "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" అని అనుశాసనము. సామాన్యధర్మ ప్రయోగము లేనపుడే సమాస మన్నమాట. కనుక ఈస్థలంలో ధర్మలోపము ఉన్నది. ఉపమావాచకములయిన ఇవాదులకు ప్రయోగము లేదు. ఇది ధర్మవాచకలుప్తకు ఉదాహరణము.

## ౧౪ ఉపమానలుప్త వాక్యగత

వదాన్యో నాన్యోస్తి త్రిజగతి సమో రుద్రనృపతేః
గుణశ్రేణీశ్లాఘాపిహితహరిదీశానయశసః

సమంతాదుద్భూతై ర్ద్విరదమదగంధై స్సురభయః
క్రియంతే యద్విద్వజ్జనమణిగృహప్రాంగణభువః.

ఇది గతార్థము. దీనిలో రుద్రనృపతి ఉపమేయము. సమః అనేది ఉపమావాచకము. వదాన్యత్వము సమాన ధర్మము. ఈమూడింటికీ ప్రయోగము ఉన్నది. సము డయిన వాడు లేడు అనడమువలన ఉపమానము ఉపాత్తము కాలేదు. అందువలన ఉపమానలుప్త. వ్యస్తవ్యస్తముగా ఉన్నందువలన వాక్యగతత్వము స్పష్టము.

౧౫ ఉపమానలుప్త సమాసగత

వీరరుద్రసమో రాజా నాస్తి నాస్త్యేవ భూతలే
యస్య ధర్మానుబంధేన కలిః కృతయుగీకృతః.

వీరరుద్రసమానుడయిన రాజు భూతలములో లేడు. లేనేలేడు. ఆవీరరుద్రుని ధర్మానుబంధముచేత కలియుగము కృతయుగముగా చేయబడింది. దీనిలో వీరరుద్రసమః అని సమస్తముగా ఉన్నందువలన ఉపమ సమాసగత. వీరరుద్రుడు ఉపమేయము. సమః అనేది ఉపమావాచకము. రంజనము చేయడమువలన రాజు అనుట సమానధర్మము. నాస్తినాస్త్యేవ అనడమువలన ఉపమానలుప్త.

౧౬ ధర్మోపమానలుప్త వాక్యగత

లోకే కాకతివీరరుద్రనృపతే రుద్దామభూమ శ్రియః
కీర్త్యా కార్తికకౌముదీధవళయా తుల్యం న కించిత్ క్వచిత్
యస్మాద్ధుర్యవిజృంభితక్షతవిషాం గ్రీవాం విలోక్యాధునా
కంఠాలింగన మీశితు ర్విత నుతే నీరంధ్ర మద్రేస్సుతా.

లోకములో అతిశయితమహాశోభగల కాకతీశ్వరుని కార్తికమాసములోని వెన్నెలవలె ధవళమయిన కీర్తితో

సమానమయినది ఏదీ ఎక్కడా లేదు. పార్వతీదేవి కాకతీశ్వరుని కీర్తి మాధుర్యము చేత విషముపోయిన ఈశ్వరుని కంఠసీమను ఇప్పుడు చూచి నిశ్శంకముగా గాఢముగా కంఠాలింగనము చేసికొంటున్నది. పూర్వార్థము ప్రకృతలక్ష్యము. అక్కడ ఉప మానధర్మముల లోపము సుగ్రహమే. ఉత్తరార్థములో సాధర్మ్యము ఉన్నా అది వాక్యాంతరగతము కాబట్టి అను పాత్తప్రాయమె.

## ౧౭ సమాసగత ధర్మోపమానలుప్త

**ప్రతాపశ్రీతుల్యం క్వచిదపి నభూతం నచభవ**
**న భావి త్రైలోక్యే కిమపి జయినః కాకతివిభోః**
**యథా లోకాలోకక్షితిధరతటే ష్వర్కదృషదః**
**ప్రకాశంతే నక్తందివ ముదితరోచిఃపరిచయాః.**

జయశీలుడయిన కాకతీశ్వరుని ప్రతాపశ్రీతుల్యమైనది మూడులోకాలలో ఎక్కడా ఏదీకూడా ఇదివరలో లేదు. ఇప్పుడూ లేదు. ఇకముందూ ఉండబోదు. ఏమంటే; లోకా లోకపర్వతతటాలలో సూర్యకాంతమణులు రాత్రింబవళ్లు సముత్పన్న కాంతిపరిచయం కలవై ప్రకాశిస్తున్నవి. దేశకాల పరిచ్ఛేదం లేక ప్రతాపరుద్రుని ప్రతాపశ్రీ విహరిస్తున్నదని భావము. దీనిలో 'ప్రతాపశ్రీతుల్యం' అనేచోట ఉపమేయము వాచకమూ రెండూ ఉన్నవి. ఉపమానము లేదు. సమాన ధర్మము లేదు. ప్రతాపశ్రీతుల్యం అని సమస్తముగా ఉన్నందు వలన సమాసగతధర్మోపమానలుప్త అని గ్రహించాలి.

ఇప్పటి ఈనాలుగు ఉదాహరణాలలో ఒకచిన్న విశే షము ఉన్నది. మొదటి రెండుఉదాహరణాలలో "వదాన్యో నాన్యోఽస్తి, వీరరుద్రసమో రాజా" అనేచోట వదాన్య-

రాజశబ్దాలచేత వితరణశీలత్వము ప్రజారంజకత్వము అనే సాధర్మ్యము నిరూపిత మవుతున్నది. తరువాతి రెండు ఉదాహరణాలలో ధర్మముకూడా లేదు. అందువలన ధర్మోపమానములకు రెండిటికీ లోపమును ఊహించాలి. మొత్తం మీద ఈనాలుగు ఉదాహరణాలలో ప్రతీపాలంకారము ఉన్నదని శంకించరాదు. "రుద్రనృపతే స్సమః వీరరుద్రసమః కీర్త్యా తుల్యం, ప్రతాపశ్రీతుల్యం" ఈనాలుగు పదాలున్నూ సామాన్యంగా ప్రతీపాలంకారమేమో అనేశంకను కలుగచేస్తున్నవి. సాధారణంగా ఉపమావాచకమయిన పదము ఉపమానముతో సంబంధించి ఉండడము ప్రసిద్ధము. ఉపమావాచకము ఉపమేయముతో సంబంధించిఉన్నట్లయితే ఉపమేయనిరూపితసాదృశ్యము ప్రతిపాదితమవుతుంది. ఉపమావాచకము ఉపమానముతో సంబంధించిఉన్నపుడు ఉపమాననిరూపితసాదృశ్యము ప్రతిపాదితమవుతుంది. చంద్రనిరూపితసాదృశ్యాశ్రయము ముఖము; ముఖనిరూపితసాదృశ్యాశ్రయము చంద్రుడు; అనే రెండు స్థలాలలో ప్రతీతిభేదము స్పష్టము. ప్రకృతచతుష్కములో ఉపమేయనిరూపితసాదృశ్యమే ప్రతిపాదితము అవుతున్నందువలన ఉపమాలంకారము కాదేమో అనిపిస్తుంది. ప్రతీపాలంకారములో అంతటా ఉపమేయనిరూపితసాదృశ్యప్రతిపాదనమె ఉంటుంది. ఇక్కడకూడా రుద్రనృపతినిరూపిత సామ్యాశ్రయము కీర్తినిరూపితతౌల్యాశ్రయము వీరరుద్రనిరూపితసామ్యాశ్రయము ప్రతాప శ్రీనిరూపితతౌల్యాశ్రయము అనే అర్థప్రతీతి ఉన్నందువలన ప్రతీపాలంకారమె కావచ్చుకదా! అనేశంక ఒకపుడు కలుగవచ్చును. కాని అది యుక్తముకాదు. ప్రతీపాలంకారస్వరూపము అంతా ఇక్కడ ప్రసక్తముకాలేదు.

ప్రతీపాలంకారములో ఉపమానాక్షేపము ఉండాలి. ఉప మేయమునకు ఆధిక్యమునున్నూ వివక్షించాలి. ఉపమేయము నకు ఆధిక్యమును చెప్పదలచి ఉపమానత్వమును నిరూపించి నప్పుడే ప్రతీపాలంకారము అవుతుందని అనుశాసనము. ప్రకృతస్థలములో ఉపమానానికి ఆక్షేపము లేదు. ఉపమానము లేదు అని చెప్పడములోనే కవితాత్పర్యముకాని ఉపమాన మును నిరసించడములో కవితాత్పర్యము లేదు. ఉపమేయా నికి ముఖ్యంగా ఆధిక్యమును వివక్షించడమున్నూ లేదు. ఇక ప్రతీపాలంకారము ఎట్లాఅవుతుంది? ఉపమేయమే ఉంటూ ఉంటే ఉపమానము దేనికి? అనే అభిప్రాయము పీటిలో రాదు. అందువలన ప్రతీపాలంకారమునకు ఇక్కడ అను ప్రవేశము లేదు. కనుకనే ప్రతీపాలంకారముతో సాంకర్యము ఉన్నదేమో! అనే శంకాకలంకావకాశముకూడా లేదు.

## ౧౮ సమాసగత వాచకలుప్త

అసతా ముష్ణభానూష్ణం సతాం శీతాంశుశీతలం
ప్రతాపరుద్రదేవస్య చరితం విశ్వమంగళం.

ప్రతాపరుద్రదేవుని విశ్వమంగళమయిన చరితము అసత్పురుషులకు సూర్యునివలె వేడిగా ఉన్నది. సత్పురుషులకు చంద్రునివలె శీతలముగా ఉన్నది. దీనిలో "ఉష్ణభానూష్ణం, శీతాంశుశీతలం" అనేస్థలములలో ఉష్ణభానుశీతాంశురూప మయిన ఉపమానము, ఉష్ణశీతలలక్షణమయిన సమాన ధర్మము, చరితం అనే ఉపమేయము మూడూ ఉన్నవి. ఉపమావాచకము లేదు. సమాసములో అది లోపించింది. సమన్వయము సులభమె.

## ౧౯ సమాసగత ధర్మోపమాన వాచకలుప్త

కాకతీంద్రో రణే భాతి భీమసేనపరాక్రమః
కిం త్వదుశ్శాసనా స్సర్వే తస్య ప్రత్యర్థిపార్థివాః.

కాకతీంద్రుడు యుద్ధములో భీమునియొక్క పరాక్రమమువంటి పరాక్రమముకలవాడై భాసించుచున్నాడు. కాని శత్రురాజులు అందరూ అదుశ్శాసనులు. భీమసేనప్రత్యర్థులు దుశ్శాసనునితో కూడి ఉన్నారు. సిరసప్రత్యర్థులు దుశ్శాసనరహితులు అని సామాన్యంగా అర్థము. దుష్కరమయిన శాసనముకలవారు దుశ్శాసనులు. అటువంటివారు కాకపోతే అదుశ్శాసనులు. కాకతీంద్రప్రత్యర్థిపార్థివులు అదుశ్శాసనులై ఉన్నారంటే దుష్కరశాసనరహితులై ఉన్నారని భావము. దీనిలో భీమసేనపరాక్రమః అనేచోట భీమసేనుని పరాక్రమమువంటి పరాక్రమము ఎవరికి కలదో ఆతడు భీమసేనపరాక్రముడు అనే అర్థము వస్తున్నది కాబట్టి ధర్మోపమానవాచకలుప్త. భీమసేనపరాక్రమము ఉపమానము. ప్రతాపరుద్రపరాక్రమము ఉపమేయము. దుస్సహత్వము సమానధర్మము. ఇవాదికము వాచకము. "భీమసేనపరాక్రమః" అనే సమస్తపదానికి "భీమసేనస్య పరాక్రమఇవ పరాక్రమో యస్య సః భీమసేనపరాక్రమః" అని విగ్రహవాక్యము. సమస్తపదములో ఉపమేయపరాక్రమమె నిరూపితమయింది కాని ఉపమానపరాక్రమము నిరూపితము కాలేదు. వాచకము సమానధర్మమున్నూ లేవు. అందువలన త్రిలుప్త.

ఇక్కడ ఈవిశేషమును గుర్తించాలి. భీమసేనపరాక్రమః అన్నప్పుడు భీమసేనపదమును భీమసేనపరాక్రమమునకు లక్షకముగా అంగీకరించితే "భీమసేనఇవ (అంటే-భీమసేన

పరాక్రమఇవ) పరాక్రమః యస్యసః భీమసేనపరాక్రమః'' అని సమాసము చేయగా, భీమసేనపదమె ఉపమానప్రతిపాదక మవుతుంది. కాబట్టి ఉపమానము ఉన్నందువలన ఇది త్రిలుప్తకు ఉదాహరణము కాదు. భీమసేనుని పరాక్రమమువంటి పరాక్రమముకలవాడు అనే అర్థమును వివక్షించినప్పుడే ఇది త్రిలుప్తోదాహరణము. ''సప్తమ్యుపమానపూర్వపదస్య బహువ్రీహి రుత్తరపదలోపశ్చ'' అనే వార్తికము చేత ''భీమసేనపరాక్రమః'' అనేదానికిపరాక్రమపదముతో బహువ్రీహిసమాసము వస్తే ఉపమానమును చెప్పే ''భీమసేనపరాక్రమ'' అనే పూర్వపదములో ఉత్తరపదముగా ఉన్న పరాక్రమపదానికి లోపము వస్తుంది. అప్పుడు ''భీమసేన'' అనే ఉంటుంది. ఉపమేయభూతమయిన పరాక్రమమె ఉపాత్తమై ఉంటుంది. ధర్మవాచకాలూ లేనందున అప్పుడే ఇది త్రిలుప్త. ఇప్పటికి పందొమ్మిదిలుప్తోపమలూ ప్రదర్శితములయినవి. ఇవన్నీ చమత్కారకములు కావు. వ్యాకరణశాస్త్రవ్యుత్పత్తికౌశలమును ప్రదర్శించడానికి పనికివస్తవేకాని అలంకారశాస్త్రంలో ఆస్వాద్యములు కావు.

## సాధర్మ్య విశేషము

సాధారణధర్మమును నిరూపించడములో సర్వభేదసాధారణములయిన కొన్నివిశేషాలు ఉన్నవి. వానిని ఇపుడు చెప్పడము సముచితము. సాధారణధర్మమును స్వీకరించడములో ద్వైవిధ్యముఉన్నది. ధర్మము ఉపమానోపమేయములలో అనుగతముగా ఉండేటట్లు రెండిటిలోనూ ఒకే పర్యాయము ప్రసరించేదిగా ఉండేటట్లు ఒకమారు నిర్దేశించడము ఒకపద్ధతి. రెండిటిని పొందిఉండేవిధంగా వేరువేరుగా

సమానధర్మమును నిర్దేశించడము. రెండవపద్ధతి వేరువేరుగా నిర్దేశించడమునే పృథగుపాదానము అంటారు. ఈపృథగుపాదానముకూడా వస్తుప్రతివస్తుభావవిధాన నిర్దేశించడము బింబప్రతిబింబభావవిధముగా నిర్దేశించడమూ అని రెండు విధాలు. ఒకేఅర్థమును వేరువేరుశబ్దాలతో చెప్పడమును వస్తుప్రతివస్తుభావము అంటారు. సాదృశ్యము కలిగిఉన్న రెండుధర్మాలను వేరువేరుగా భిన్నభిన్నశబ్దములతో నిరూపించడమును బింబప్రతిబింబభావము అని అంటారు. ఈవిశేషముకల ఉదాహరణములను ఇట్లా గ్రహించాలి.

## సకృన్నిర్దేశము

నృపాః ప్రణతమూర్ధానః సేవంతే కాకతీశ్వరం
అసాధూనాం వినేతారం గురుం శిష్యాఇవాభితః.

ప్రణతశిరస్కులయిన రాజులు అసాధుశిక్షకుడయిన గురువును అంతటా శిష్యులువలె కాకతీశ్వరుని సేవించుతున్నారు. దీనిలో రాజులకూ శిష్యులకూ 'ప్రణతమూర్ధానః' అనే సమానధర్మము ఒకేసారి నిర్దిష్టమైంది. అసాధూనాం వినేతారం అని రాజునకు గురువునకున్నూ తుల్యధర్మత్వము ఒకేసారి చెప్పబడింది. రాజు అసాధు శిక్షకుడు. గురువూ అసాధు శిక్షకుడు. శిష్యులు ప్రణత శిరస్కులు. సామంత రాజులున్నూ ప్రణతశిరస్కులె. సమానధర్మములుగా నిర్దేశింపబడిన ఇవి ఆయా ఉపమానోపమేయాలలో అనుగతములై సమన్వయము పొందుతున్నవి. కాబట్టి ధర్మానికి సకృన్నిర్దేశమును అభ్యూహించాలి.

## వస్తుప్రతివస్తుభావము

వస్తుప్రతివస్తుభావముతో రెండువిధాలుగా; ధర్మము

ఉపమానగతముగానూ ఉపమేయగతముగానూ ఉండేటట్లు నిర్దేశించడమునకు ఉదాహరణమును ఇట్లా గ్రహించాలి.

వంశోయం కాకతీయానాం వీరరుద్రేణ భూషితః
అన్వవాయః కకుత్థ్సానాం రామేణేవ పరిష్కృతః.

కాకతీయుల ఈవంశము కకుత్థ్సుల అన్వవాయము (వంశము) రామునిచే పరిష్కృతమయినట్లుగా వీరరుద్రునిచే భూషితమయింది. దీనిలో భూషితపరిష్కృతశబ్దాలు వేరు వేరుగా ఉన్నప్పటికిన్నీ 'అలంకృతము' అనే ఒకేఅర్థము వాని వలన ప్రతీతమవుతున్నది. ఏకార్థమే సంబంధిభేదముతో నిరూపితమయింది. ఈవిధంగా భూషితపరిష్కృతశబ్దాలచేత సమానధర్మకథనము ఉన్నందువలన ఇది వస్తుప్రతివస్తుభావ మవుతుంది.

## బింబప్రతిబింబభావము

స్ఫురత్ శ్వేతాతపత్రశ్రీః కాకతీయనరేశ్వరః
హాటకాద్రిరివాభాతి శృంగసంగీందుమండలః.

ప్రకాశించుతున్న శ్వేతాతపత్రశోభకల కాకతీయ నరేశ్వరుడు, శిఖరములందుకూడుకొన్న చంద్రుమండలముకల మేరుపర్వతమువలె ఆభాసించుతున్నాడు. దీనిలో బింబప్రతి బింబభావము ఉన్నది. కాకతీంద్రమేరుపర్వతములకు స్వరూ పానుసారముగా సాదృశ్యము లేదు. ప్రధానములయిన ఉప మానోపమేయాలకు స్వరూపసాదృశ్యము కుదరకపోతే వాని వాని విశేషణాలకు ఉన్న సాదృశ్యాలనుబట్టి సాదృశ్యనిర్ణయం చేయాలి. కాగా ఇటువంటి స్థలాలలో విశేష్యసాదృశ్యము విశేషణసాదృశ్యాధీనముగా ఉంటుంది. ఈపద్యములో ఉప మేయమయిన కాకతీశ్వరునకు స్ఫురచ్ఛ్వేతాతపత్రశ్రీకత్వము

విశేషణముగా ఉన్నది. మేరుపర్వతానికి శృంగసంగీందు మండలత్వము విశేషణముగా ఉంది. ఈరెండూ ఉపమేయోపమానధర్మాలు. ఈరెండిటికీ ధావళ్యయోగిత్వము అనే సాదృశ్యమువలన అభిన్నత్వము భాసిస్తుంది. పరస్పరసాదృశ్యమువలన అభిన్నముగా భాసించిన ఇవి "స్ఫురచ్ఛ్వేతాతపత్రశ్రీః, శృంగసంగీందుమండలః" అని వేరువేరుగా ఉపాత్తములయినవి. శ్వేతాతపత్రము బింబము. ఇందుమండలము ప్రతిబింబము. ఈధర్మాలు ఈచెప్పినవిధంగా ఇక్కడ నిరూపితములు కావడము, శ్వేతాతపత్రచంద్రమండలములకు కల సాదృశ్యముచేత కాకతీంద్రసువర్ణాచలములకు సాదృశ్యము కలగడమూ ఇక్కడ ఉన్నది. కాబట్టి బింబప్రతిబింబభావమని గ్రహించాలి.

## ఉపమా విశేషములు

ఈ ఉపమాలంకారానికి వేరొకవిధముగా కూడా భేదాలు సిద్ధములవుతున్నవి. సమస్తవస్తువిషయమయిన ఉపమ అని, ఏకదేశవర్తిని అయిన ఉపమ అని, మాలారూపముగా ఉన్న ఉపమ అని, ఈమూడుభేదాలూ ఇక్కడ నిర్దిష్టములవుతవి. సమస్తములయిన వస్తువులు అంటే; అవయవములు అవయవిన్ని ఏఉపమలో విషయములుగా ఉంటున్నవో ఆఉపమ సమస్తవస్తువిషయ అవుతుంది. కేవలమూ ఒక్క అవయవికి ఉపమాననిర్దేశము ఉండడముకాక అవయవాలకున్నూ ఉపమానములు నిర్దిష్టములయినప్పుడు సర్వవస్తువులూ ఔపమ్యభూషితములై ఉంటవికాబట్టి అటువంటిది సమస్తవస్తువిషయ అవుతుంది. అవయవము అవయవి అనే ఈరెండిటిలో ఏదయినా ఒకదానికే ఉపమాననిర్దేశముతో

సాదృశ్యకథనము ఉన్నప్పుడు ఉపమ ఏకదేశవర్తిని అవుతుంది. అవయవ్యవయవములకన్నిటికీ ఉపమాననిర్దేశము ఇక్కడ ఉండదు. కేవలమూ అవయవాలకయినా ఉపమాననిర్దేశము ఉంటుంది. కేవలమూ అవయవికిఅయినా ఉపమాననిర్దేశము ఉంటుంది. ఒకదానికి ఉండి రెండవదానికి లేకపోయినా రెండవదానికి ఉపమానము అర్థసామర్థ్యబలాన ప్రతీతమవుతుంది. ఇటువంటిది ఏకదేశవర్తి, అని భావము. ఒకే ఉపమేయానికి అనేకోపమానములు నిరూపితములయినప్పుడు మాలారూపమయిన ఉపమ. ఇక్కడ కూర్పబడిన ఉపమానాలు వేరువేరుగా ఉన్నప్పటికీ ఉపమేయము ఒకటే కావడమువలన నానోపమాచమత్కారము ఇక్కడ భాసిస్తుంది. ఇటువంటిది మాలోపమ అని భావము. వీనిని ఈవిధముగా ఉదాహరణాలలో గ్రహించాలి.

## సమస్తవస్తువిషయ

విభాతి భూ ర్ద్యౌరివ కాకతీంద్రపురీ విరాజ త్యమరావతీవ
పౌరాః ప్రథంతే త్రిదశాఇవర్ధిం ధత్తే మరుత్వానివ వీరరుద్రః.

భూమి స్వర్గమువలె ప్రకాశిస్తున్నది. కాకతీంద్ర పట్టణము అమరావతివలె విరాజిల్లుతున్నది. పౌరులు దేవతలవలె ప్రసిద్ధి పొందుతున్నారు. వీరరుద్రుడు ఇంద్రునివలె సమృద్ధి వహించుతున్నాడు. దీనిలో వీరరుద్రుడు అవయవి. భూపురీ పౌరులు అవయవములు. అన్నింటిలోనూ ఉపమానము ఉన్నది. అందువలన సమస్తవస్తువిషయ. దీనిలో ఇవి ప్రత్యేకముగా నాలుగు ఉపమలు అవుతవని అనుకోరాదు. వీనిలో వీనికి పరస్పరమూ సంబంధము ఉండడముచేత ఇదంతా ఒకటే ఉపమగా సహృదయులకు అవభాసిస్తున్నది. భూపురీ

పౌరులకు ప్రత్యేకప్రత్యేకంగా ఉపమను నిర్దేశించకపోయినప్పటికీ విశిష్టముగా ముఖ్యవిశేష్యమునకు సంబంధించిన ఉపమాననిర్దేశమువలననే విశేషణాలకుకూడా ఔపమ్యం గోచరం కావచ్చు. ఆవిధముగా అయితే దానిని విశిష్టోపమ అంటారు. అక్కడ అఖండమయిన ఒకేచమత్కారము ఉదయించుతుంది. ఈస్థలములో అఖండచమత్కారముతోబాటు ఖండరూపములయిన చమత్కారములున్నూ భాసించుతవి. అవయవగతోపమలుకూడా ఇక్కడ స్పష్టవాచ్యములుగా ఉన్నందువలన సమస్తవస్తువిషయ ఉపమ అనడమె స్వారసికముగా ఉంటుంది. విశిష్టోపమలో విశేషణోపమ వ్యంగముగా ఉంటుంది. ఇక్కడ వాచ్యముగా ఉంటుంది. ఇదీవిశేషము.

ఏకదేశవివర్తిని

ద్విపైశ్చరద్భి ర్ధరణీధరైర్వా తురంగమశ్రేణిభి రూర్మిభిర్వా
నానాయుధై ర్వ్యాలజలగ్రహైర్వా బలం త్రిలింగాధిపతే ర్దురాపం.

త్రిలింగదేశాధీశ్వరుడయిన ప్రతాపరుద్రుని సేన మైనాకాదిపర్వతాలవలె ఉన్న సంచరించే ఏనుగులచేత తరంగాలవలె ఉన్న తురంగమపంక్తులచేతా పాములు మొసళ్లువలెఉన్న నానావిధాయుధములచేతా పొందశక్యముకాకుండా ఉన్నది. దీనిలో త్రిలింగాధిపతిబలము అవయవి. దానికి ఉపమానము పద్యములో స్పష్టనిర్దిష్టము కాలేదు. ద్విపతురంగాయుధములు అవయవములు. వానికిపర్వతతురంగవ్యాళాదులు ఉపమానములుగా నిర్దిష్టములయినవి. త్రిలింగాధిపతిబలము సముద్రమువలె ఉన్నది అనే అర్థము అర్థసౌందర్యబలము వలన ప్రతీత మవుతున్నదేకాని వాచ్యముగాలేదు. కేవలము

అవయవగతముగానే ఉపమానము ఉన్నందువలన ఇది ఏకదేశవర్తిని ఉపమ.

## మాలోపమ

కుందతి కుముదతి హంసతి హారతి హరతి క్షపాకరతి
కైలాసతి చ యశఃశ్రీవైశద్యం వీరరుద్రస్య.

వీరరుద్రుని యశఃశ్రీవైశద్యము కుందపుష్పమువలె ఆచరిస్తున్నది. కుముదమువలె హంసవలె హారమువలె హరుని వలె చంద్రునివలె కైలాసమువలె ఆచరించుతున్నది. దీనిలో క్విప్ప్రత్యయగతముగా అనేకోపమలు ఉన్నవి. అందువలన ఉపమాలంకారము. మాలారూపముగా ఉన్నట్లు కుందకుము దాద్యనేకోపమానములున్నా యశఃశ్రీవైశద్యరూపమయిన ఉపమేయము ఒక్కటే. ఒకేఉపమేయానికి అనేకోపమానములు ఉన్నందువలన ఇది మాలోపమ అవుతుంది.

సాధర్మ్యము మూడువిధాలు. భేదప్రధానము, అభేద ప్రధానము, భేదాభేదప్రధానమూ, అని. వ్యతిరేకము మొదలయిన అలంకారాలలో భేదప్రధానకమయిన సాధర్మ్యము ఉంటుంది. రూపకాద్యలంకారములలో అభేదప్రధానసాధర్మ్యము ఉంటుంది. భేదాభేదసాధారణమయిన సాధర్మ్యము ఉపమాలంకారములో ప్రయోజకముగా ఉంటుంది. ఆయా అలంకారాలకు అటువంటి సాధారణధర్మాలు ఆవశ్యకములన్నమాట. ఈచెప్పిన భేదాలే కాక ఉపమాలంకారములో ఇంకా చాలా భేదాలు ఉన్నవి. ప్రాచీనసాహిత్యకారులు రశనోపమ మొదలయిన భేదాలను చాలా పరిగణించారు. వాటినన్నిటినీ యథాసంభవముగా గ్రహించాలి.

## ౨ అనన్వయము

భేదాభేద సాధారణ మయిన సాధర్మ్యము మూల ముగా కలిగిన అలంకారాలలో అనన్వయముకూడా చేరు తుంది. అందువలన ఉపమ తరువాత అనన్వయమును నిరూ పించడము సముచితము. అనన్వయములో ఉపమేయోపమ లోనూ వస్తువు ప్రతీయమాన మవుతూ ఉంటుంది. ప్రతీయ మానవస్తుకము లయిన ఈ రెండింటిలో అనన్వయము ఒకే వాక్యమును ఆశ్రయించి ఉంటుంది. కాబట్టి దీనినిముందుగా చెప్పడము యుక్తము.

ఏకస్యైవోపమానోపమేయత్వేఽనన్వయో మతః.

ఒకేపదార్థానికి ఉపమానత్వము ఉపమేయత్వము చెప్పితే అనన్వయము అవుతుంది. సాదృశ్య మనేది రెండు పదార్థములకు సంబంధించి ఉంటుంది. ముఖము చంద్రుడు అనేవి రెండూ భిన్నభిన్నపదార్థాలు. పదార్థములు ఇట్లా వేరుగా ఉన్నపుడే ఉపమానోపమేయభావము సంగత మవు తుంది. ముఖము చంద్రుడు రెండిటికీ సాదృశ్యము చెప్పితే ఒకదానిసాదృశ్యము వేరొకదానియందు ఉంటుంది కాబట్టి రెండువస్తువులకు సాదృశ్యకథనమె ఉపపన్నముగా ఉంటుంది. చంద్రసాదృశ్యము ముఖములో ఉన్నదన్నా, ముఖసాదృ శ్యము చంద్రునిలో ఉన్నదన్నా ఉపమానోపమేయభావము ఉపపన్నముగా కనిపిస్తుంది. చంద్రసాదృశ్యము చంద్రునిలో ఉన్నది. ముఖసాదృశ్యము ముఖములో ఉన్నది. అని అన్న పుడు సాదృశ్యానికి అన్వయము సరిగా కుదరదు. వర్ణ్యమాన సాదృశ్యానికి అన్వయము సరిగా ఉండదుకాబట్టి ఈ అలం కారానికి అనన్వయ మన్న పేరు సార్థకముగా ఉంది. అన్వ

యము పొందనిసాదృశ్యమును వర్ణించడమువలన ఒక ప్రయో జనము ఉన్నది. వర్ణ్యమానసాదృశ్యము తాను అన్వయము పొందక ప్రకృతమునకు అనుపమత్వమును గోచరింప చేస్తుంది. ముఖము ముఖముతో సమానము అని చెప్పితే ముఖముతో పోల్చదగిన వస్తువు వేరొకటి ఏమీ లేదు అనే అర్థము వ్యంగ్యముగా భాసిస్తుంది. కాగా ఒకేపదార్థానికి ఉపమా నోపమేయభావమును చెప్పడము ద్వితీయ సబ్రహ్మచారి నివృత్త్యర్థమన్నమాట. ఈ చెప్పిన అభిప్రాయాన్ని అవగా హనం చేసికొంటే ఒకవిధంగా ఇక్కడ ఉపమానోపమేయ భావముయొక్క కుదురుపాటును భావించవచ్చును. ఉపమేయ ముగా ఉన్నవస్తువుకు ఉపమానత్వము చెప్పడము ఈ అనన్వ యములో ఉంటుంది. అంటే వాచ్యమర్యాదను అనుసరించి ఉపమేయముగా ఉన్నవస్తువునకు రెండో సదృశవస్తువు లేదు అనే వ్యంగ్యాభిప్రాయముతో ఉపమానత్వమును చెప్పితే అనన్వయము అని తేలుతుంది. ఈదృష్టిలో ఉపమానోప మేయభావము కుదరవచ్చు. వాచకరీతినే అనుసరించి చూస్తే ఏకవస్తుగతంగా ఉపమానోపమేయభావము కుదరదు కాబట్టి కుదరని అది ప్రకృతమునకు అనుపమత్వమును గోచరింప చేస్తుంది అని గ్రహించాలి. ఈభావమును లక్షణార్థములో గ్రహించాలి. ఉదా :—

సంతు లోకే సువర్ణాద్రిరత్నాకరసుధాకరాః
తథాపి వీరరుద్రోయం వీరరుద్ర ఇవ స్వయం.

లోకములో సువర్ణాద్రి రత్నాకర సుధాకరులు ఉండనీ! ఉపమానత్వము పొందడానికి అనర్హు లయిన వారివలన ఏమి ప్రయోజనము ? అయినా ఈవీరరుద్రుడు స్వయంగా వీరరు

ద్రునివలె ఉన్నాడు. దీనిలో వీరరుద్రనిరూపిత మయిన సాదృశ్యమునకు వీరరుద్రుడే ఆశ్రయముగా చెప్పబడుతున్నాడు. ప్రకృతమై ఉపమేయముగా ఉన్న వీరరుద్రునకే ఉపమానత్వము నిరూపిత మయింది. అందువలన వీరరుద్రునితో సమానుడు ఎవడూ లేడు, వీరరుద్రుడు అనుపముడు, అని గోచర మవుతున్నది.

### 3 ఉపమేయోపమ

ఈఉపమేయోపమాలంకారము అనన్వయముకంటె విలక్షణము. ఇది ఏకవాక్యమునందు ఉండడము కాక వాక్యభేదమును ఆశ్రయించి ఉంటుంది. ఉపమేయముతో ఉపమ కాబట్టి ఉపమేయోపమ. ఉపమ అనగానే ప్రసిద్ధినిబట్టి ఉపమానముతో ఉపమేయమునకు సాదృశ్యమును నిరూపించుట అనే అర్థము వస్తుంది. దీనిలో అది ఉండడమే కాక ఉపమేయముతో ఉపమానమునకు సాదృశ్యమును చెప్పడము కూడా ఉంటుంది. కాబట్టి ఉపమేయోపమ అనే పేరు సంగతంగా ఉంది. దీనిలక్షణము—

పర్యాయేణ ద్వయో స్తస్మి న్నుపమేయోపమా మతా

ఉపమానముగా ఉపమేయముగా ప్రసిద్ధము లయిన రెండుపదార్థములకు ఉపమానోపమేయత్వమును పర్యాయముగా చెప్పితే ఉపమేయోపమ అవుతుంది. అని లక్షణార్థము. ఉపమాలంకారములో మాదిరిగా ఉపమానముతో ఉపమేయానికి సాదృశ్యమును ఒకమారుచెప్పి ప్రతీపాలంకారములోమాదిరిగా ఉపమేయముతో ఉపమానమునకు సాదృశ్యమును చెప్పితే మొత్తంమీద ఉపమానోపమేయభావమును పర్యాయముగా చెప్పినట్లవుతుంది. అటూ ఇటూ

చెప్పినా ఉపమానోపమేయములు రెండే ఉంటవి. వీటితో సదృశ మయిన మూడవపదార్థము ఏదీ లేదు అని ఇక్కడ గోచరిస్తుంది. కనుకనే తృతీయసబ్రహ్మచారినివృత్తి దీనిలో ఉంటుంది. ముఖము చంద్రునివలె ఉన్నది అని అంటే చంద్రుడు ముఖమువలె ఉన్నాడు అని గోచరము కాకపోదు. అయినా అట్లా గోచర మవుతూ ఉండే అర్థమును స్పష్ట ముగా శబ్దాలతో చెప్పినందువలన తృతీయసదృశనిరాసము కలుగుతుంది. ఇటువంటి ఫలము ఇక్కడ ఉన్నది కాబట్టే "ఈ ఉపమేయోపమాలంకారము ప్రతీపాలంకారము ఉప మాలంకారము కలిసినందువలన సిద్ధ మవుతుంది. ప్రతీపోప మాసమ్మేళనమె కాని ఇది ప్రత్యేకాలంకారము కాదు." అని అనరాదు. ఇంకా ఈఅలంకారానికి సంబంధించిన విష యవిస్తరణానికి ఇది సమయం కాదు. ఉదా :—

ధర్మోఽర్థ ఇవ పూర్ణశ్రీ రర్థో ధర్మ ఇవ స్థితః
కామ స్తా వివ తౌ కామ ఇవ రుద్రనరేశ్వరే.

దీనిభావము నిరూపిత మయింది. ప్రథమపాదములో అర్థనిరూపితసాదృశ్యము ధర్మమునందు, ద్వితీయపాదములో ధర్మనిరూపితసాదృశ్యము అర్థమునందూ, చెప్పబడింది. మొదట ఉపమానోపమేయములుగా ఉన్న అర్థధర్మములు తరువాత ఉపమేయోపమానము లయినవి. ధర్మార్థము లనే రెండిటికి పర్యాయముగా ఉపమానోపమేయభావము ఉపని బద్ధ మయింది. అందువలన ఉపమేయోపమాలంకారము. ధర్మోఽర్థ ఇవ పూర్ణశ్రీః అనేది ఒకవాక్యము. "అర్థో ధర్మ ఇవ స్థితః" అనేది రెండవ వాక్యము. ఈవిధంగా ఇది వాక్యభేదమును ఆశ్రయించి ఉంది. పూర్ణశ్రీకత్వము సమాన

ధర్మము. ఈధర్మము కలిగి ఉండడములో అర్థమునకు ధర్మము సాటి, ధర్మానికి అర్థము సాటి. అంతేనేకాని మూడవపదార్థ మేదీ వీటితో సాటిగా చెప్పదగినది లేదు. కనుక తృతీయసదృశవస్తువు లేదు అని ప్రతీత మవుతున్నది. పూర్ణశ్రీరూప మయిన ధర్మము తప్ప ధర్మాంతరము ఏదీ నిర్దిష్టము కాలేదు. మరొకధర్మము ఏ దయినా నిర్దిష్ట మయి నట్లయితే ఆధర్మము కలిగిన తృతీయవస్తువు ఏ దయినా సదృశ మయినది ఉండవచ్చు అనే అర్థము వస్తుంది. అప్పుడు తృతీయసబ్రహ్మచారినివృత్తి రాదు. ఈపద్యంలో ఉత్త రార్థము ప్రకృతాలంకారానికి ఉదాహరణంగా ఎంచరాదు.

౪ స్మరణము

సదృశానుభవా దన్యస్మృతిః స్మరణ ముచ్యతే

ఈఅలంకారముకూడా భేదాభేదప్రధానసాధర్మ్య కము. సదృశ మయిన పదార్థముయొక్క అనుభవమువలన సమాన మయిన వేరొకవస్తువుస్మరణము ఉన్నట్లయితే స్మరణాలంకార మవుతుంది. పూర్వము ఏ దయినా ఒకవస్తు వును అనుభవించినట్లయితే ఒకవిధసంస్కారము హృదయ గతమై ఉంటుంది. ఆవస్తువుతో సమాన మయిన వస్తువు ప్రకృతము గోచరించినప్పుడు తదనుభవమువలన పూర్వ సంస్కారము ఉద్బుద్ధ మవుతుంది. ఆవస్తువు స్మృతిలోకి వస్తుంది. ఈవిధానము నిబంధింపబడినప్పుడు స్మరణాలంకా రము. స్మరింపబడే వస్తువునకు స్మరింపచేసే వస్తువునకూ సాదృశ్యసంబంధము లేకపోతే స్మరణాలంకారము కాదు.

రాజ్ఞా ప్రతాపరుద్రేణ పాలితేయం వసుంధరా
హరిశ్చంద్రనలాదీనాం ప్రాచాం స్మరతి భూభుజాం

ప్రజాపాలకు డయిన ప్రతాపరుద్రునిచేత పాలింప బడిన ఈభూమి హారిశ్చంద్రుడు నలుడు మొదలయిన ప్రాచీన భూపతులను స్మరించుతున్నది. ప్రతాపరుద్రుడు హారిశ్చంద్రాదిసదృశుడు. భూమి ప్రతాపరుద్రానుభవమువలన సామ్యమునుబట్టి పూర్వులను స్మరించుతున్నది. నలనహుషాదులతో సమాన మయిన పాలన ప్రావీణ్యం కలిగిన ప్రతాపరుద్రుని తనకు రక్షకునిగా పొందిన వసుంధర పూర్వరాజులను స్మరించడము దీనిలో నిబద్ధ మయింది కాబట్టి స్మరణాలంకారము.

## ౫ రూపకము

ఇప్పటికి భేదాభేదసాధారణమయిన సాధర్మ్యము నిమిత్తముగా కల అలంకారములను ప్రదర్శించడ మయింది. ఇక ఆరోపగర్భము లయిన అలంకారాలను ప్రస్తావించాలి. ఆరోప స్వరూపము కావ్యప్రకరణములో ప్రదర్శిత మయింది. ఆరోపగర్భాలంకారములు అభేదప్రధానములుగా ఉంటవి. అభేదప్రధానకము లయిన అలంకారాలలో రూపకము ముఖ్యము. సాదృశ్యమూలాలంకారములలో ఉపమ ప్రధాన మయినట్లు ఆరోపమూలకములలో రూపకము ప్రధానము, బీజభూతమూను.

ఆరోపవిషయస్య స్యా దతిరోహితరూపిణః
ఉపరంజక మారోప్యమాణం త ద్రూపకం మతం

ఒకచోట వేరొకధర్మమును ఆరోపించడము ఆరోపము. ఆరోపములో విషయము ఆరోపవిషయము. ఇదే ప్రకృతము. సామాన్యముగా దీనిని ఉపమేయము అని గ్రహించవచ్చు. ఆరోపింపబడేదానికి ఆరోప్యమాణము అని పేరు. దీనినే ఆరోపవిషయి అంటారు. ఇది అప్రకృతమనిన్నీ

వ్యవహృతమవుతుంది. సామాన్యంగా ఉపమానము అని దీన్ని గ్రహించవచ్చు. కాగా లక్షణార్థము ఈవిధముగా పర్యవసన్న మవుతుంది. అతిరోహితరూపముగా ఉన్న ఆరోపవిషయము నకు ఆరోప్యమాణము ఉపరంజక మయితే రూపకాలం కారము అవుతుంది అని. ముఖచంద్రుడు అనే ఉదాహరణ ములో ముఖము ఆరోప విషయము. చంద్రుడు ఆరోప్య మాణము. చంద్రారోపమువలన ముఖానికి ఉపరంజనము కలుగుతున్నది. చంద్రుడు ముఖానికి ఉపరంజకు డయినాడు. ఇక్కడ ఉపరంజనము అంటే తాద్రూప్యప్రతీతి కలగడము అనే గ్రహించాలి. (ఉపరంజకము-తాద్రూప్యప్రతీతిని కలుగ జేసేది) ఈస్థలంలో ఉపయోగించిన తాద్రూప్యపదమువలన స్థూలంగా అభేదము అని అర్థమును గుర్తించాలి. ముఖము చంద్రుడు ఈ రెండిటికీ సంబంధించి ఉన్న ఆరోపము తాద్రూప్యప్రతీతిని కలుగజేసినంతమాత్రాన చరితార్థమవు తున్నది. అంతేకాని పరిణామాలంకారములో మాదిరిగా ప్రకృతమునకు ఉపయోగము కలిగేవరకూ వివక్షింపవలసిన అవసరము లేదు. ఈవిషయము కొంచెం ముందు స్పష్ట మవుతుంది. ఇట్లా ఉపరంజనము ఉంటే రూపకము అని తేలింది. ప్రకృతము అప్రకృతముచేత రూపము కలదిగా చేయ బడుతుంది. "ప్రకృత మప్రకృతేన రూపవ త్క్రియతే ఇతి రూపకం" పెద్దలు ఈవిధంగానే అంగీకరించారు. ప్రకృతము నందు ఆరోపింపబడే అప్రకృతము ప్రకృతమునకు రూప సంపాదకమై ఉపరంజనము చేసినట్లయితే రూపకాలంకారము అవుతుంది. అని సారాంశము.

ఈలక్షణములో ఉన్న విశేషణములు సాభిప్రాయ

ములు. వానివలన కొంత ప్రయోజనము ఉంది. 'ఆరోప
విషయస్య' అని నిర్దేశించడమువలన ఉత్ప్రేక్షాదులకు ఉప
మాదులకూ వ్యావృత్తి కలుగుతుంది. వానిలో ఆరోపము
ఉండదు. ఉత్ప్రేక్ష మొదలయినవి అధ్యవసాయ గర్భాలం
కారాలు. ఆరోపాధ్యవసాయములకు తేడా ఇదివరలో
ప్రదర్శితమె. ఉపమాద్యలంకారాలు సాదృశ్యమూలకములు
కాని ఆరోపమూలకములు కావు. రూపకంలో ప్రకృతము
ఆరోపవిషయ మవుతుంది. ఇతరస్థలాలలో అట్లా కాదు.
ఆరోపవిషయము అతిరోహితరూపముగా ఉండాలి. అని
కూడా లక్షణంలో వివక్షితము. ప్రకృతము పిహితరూపము
కాకూడదు. ఈవిధంగా అనడమువలన సందేహము భ్రాంతి
మత్ అపహ్నవము మొదలయినవి వ్యావృత్తము లవుతున్నవి.
సందేహాదులలో ప్రకృత స్వరూపము తిరస్కృత మవుతుంది.
ఈవిషయమును ఇట్లా విశదంగా గ్రహించాలి. ముఖమా ?
చంద్రుడా ? అన్న సందేహములో ముఖజ్ఞానము కలిగి
నప్పుడు చంద్రుడు అనే జ్ఞానము కలుగదు. చంద్రజ్ఞానము
కలిగినప్పుడు ముఖము అనే జ్ఞానం కలుగదు. అదా ? ఇదా ?
అని సందేహింపబడినప్పుడు విషయము చెప్పిన విధంగా తిరో
హిత మవుతుంది. భ్రాంతిమదలంకారములో భ్రాంతిచేత
విషయము తిరోహితమవుతుంది. ముఖమును చూచినప్పుడు
పద్మము అనే భ్రాంతి కలిగితే ముఖము తిరోహిత మయిం
దన్నమాట. అపహ్నుత్యలంకారములో అపహ్నవము (కప్పి
పుచ్చడము) చేయడముచేత ఆరోపవిషయమునకు తిరో
ధానము కలుగుతున్నది. "ఇది ముఖము కాదు. పద్మము"
అనే అపహ్నవస్థలములో ముఖమును ముఖము కాదు అని
అపహ్నవించడమువలన విషయము తిరోహితమె అవుతున్నది.

జైత్రయాత్రలో వీరరుద్రనృపతి నిస్సాణము (భేరి) శత్రుగర్వభేదన భయంకరంగా ధ్వనించగా శత్రుస్త్రీలకు బాగా కన్నీరు ఒలికింది. దాని వలన దిగంతాలలో జగదానందకరమయిన వీరరుద్రుని యశస్సు వృద్ధిపొందింది. ఈ భావము ప్రకృతమునకు సంబంధించి ఉన్నది. వర్షాకాలములో మేఘము పర్వతభేదన భయంకరంగా గర్జించగా అంతటా మాటిమాటికీ వర్షాలు వచ్చినవి. అప్పుడు మొలకలు వృద్ధిపొందినవి. అనే భావము అప్రకృతముగా దీనిలో ఉన్నది. అప్రకృత సముదాయము ప్రకృత సముదాయమందు ఆరోపితము కావడముకాక ప్రత్యేక ప్రత్యేకముగా ఆయా ప్రకృతములందు ఆయా అప్రకృతములు సమారోపితములు అవుతున్నవి. యాత్రయందు ప్రావృట్, నిస్సాణమందు ధారాధరము, గర్వమందు పర్వతము, నయనాంబువునందు వృష్టి, యశస్సునందు కందళము. ఈ ఆరోపితములయిన ప్రావృడాదులు యాత్రాదులకు ఉపరంజనము కలుగజేస్తున్నవి. అందువలన రూపకము. ఆరోపవిషయములయిన యాత్రాదులు ఆరోప్యమాణములయిన ప్రావృడాదులూ శబ్దోపాత్తములై ఉన్నందున సమస్తవస్తువిషయమవుతుంది. యాత్రాప్రావృట్ మొదలయినవి అవయవములు. యశః కందళాః అనేది అవయవి. అవయవములు అవయవి అన్నీ నిరూపితములయినవి కాబట్టి ఇది సావయవము.

ఈపద్యములో ఒక చిన్నవిశేషమును గుర్తించాలి. యశః కందలాః అనేచోట "యశాంసి కందలా ఇవ" అని ఉపమితసమాసమా ? 'యశాంస్యేవకందలాః' అని రూపకసమాసమా ? అనిసందేహము కలిగితే రూపకసమాసమే అని నిశ్చయించాలి. జగదానందాః అని సామాన్యధర్మ

ప్రయోగముఉన్నది. అది రూపకసమాసమునే సాధించి పెట్టుతుంది. ఉపమిత సమాస మయితే సామాన్య ధర్మ ప్రయోగము ఉండ రాదు. అని వైయాకరణాను శాసనము. కాబట్టి రూపకమె.

## ౨ ఏకదేశవివర్తి సావయవము

అవయవ నిరూపణము వలన అవయవి నిరూపణము గోచర మయ్యేటట్లయితే అది ఏకదేశవివర్తి అవుతుంది. అని సామాన్యంగా స్వరూపము. అవయవి నిరూపణము వలన అవయవ నిరూపణము గోచరమయినా ఏకదేశవివర్తి అవుతుంది. ఈ అవయవావయవి నిరూపణాలలో ఒకచోట ఆరోపము శాబ్దముగా ఉండడము వేరొక చోట ఆర్థముగా ఉండడము కన్పడు తుంది. ఏక దేశంలో ఇది విశేషంగా వర్తించేది కనుక ఏకదేశవివర్తి అనే పేరు సార్థకంగా ఉంది. ఉదా :

ప్రసాధితాశావలయాంతరాళః శౌర్యాకరః కాకతి వీరరుద్రః
వికస్వరై ర్వాసనయా త్రిలోకీం గుణప్రసూనైః సురభీకరోతి

దిఙ్మండలమును వశీకరించుకొన్న శౌర్యనిధి అయిన ప్రతాపరుద్రుడు పరిమళముతో కూడుకొని వికసించిన గుణ ప్రసూనాలచేత మూడులోకాలనూ పరిమళింప చేస్తున్నాడు. దీనిలో గుణములు అవయవములు. వానియందు ప్రసూనత్వ రూపణము ఉన్నది. దానివలన అవయవి అయిన ప్రతాప రుద్రునకు కల్పశాఖిత్వము నిరూపిత మవుతున్నది. గుణ ములందు ప్రసూనత్వారోపము శబ్దోపాత్తమై ఉన్నది కాబట్టి శాబ్దము. నృపతియందు కల్పశాఖిత్వ గోచర మవుతున్నదే కాని శబ్దోపాత్తము కాలేదు కాబట్టి ఆర్థము. కనుక ఇది ఏకదేశవివర్తి రూపకము. ఇది అవయవ రూపణము

వలన అవయవి రూపణము గోచరము కావడమనే భేదము నకు సంబంధించిన ఉదాహరణము. అవయవ నిరూపణము వలన అవయవిరూపణము గోచరము అయినప్పటికీ ఏకదేశ వివర్తి అవుతుంది.

**మథితా ద్వైరివారాశేః భుజా మందరభూభృతా**
**జాతా ప్రతాపరుద్రస్య కీర్తి ర్లోకాన్ ధినోత్యమూన్॥**

భుజమనే మందర పర్వతముచేత తరచ బడిన శత్రు సముద్రమునుండి పుట్టిన ప్రతాపరుద్రునికీర్తి ఈలోకాలను సంతోషపెట్టుతున్నది. దీనిలో వైరిజనమునకు వారాశిత్వ రూపణము ఉన్నది. భుజమునకు మందరాద్రిత్వరూపణము ఉన్నది. ఉత్పన్నమయిన కీర్తికి సుధాత్వరూపణము శబ్దో పాత్తముగా లేదు. అది అర్థబలమువలన గోచర మవుతున్నది. ఆవిధంగానే జనులకు అమరత్వరూపణముకూడా అర్థగోచర మవుతున్నది. కనుక ఏకదేశవివర్తి రూపకము. ఈనిరూ పించిన సావయవోదాహరణాలలో అవయవములందు రూప ణము అవయవియందు రూపణమున్నూ కవికి అభీష్టము. కనుకనే ఏకదేశవివర్తిలో ఒకటి శాబ్దమని మరొకటి ఆర్థ మని రూపణమును గ్రహించుతున్నాము. అవయవావయవ్యు భయరూపణమునందు కవిసంరంభము ఉన్న దన్నమాట.

## నిరవయవము

అవయవరూపణములోనే కవిసంరంభవిశ్రాంతి ఉండి అవయవిరూపణములో కవిసంరంభవిశ్రాంతి లేకపోతే నిరవ యవరూపకము అవుతుంది. కవికి ఒక్కొకపుడు అవయవము లందు ఆరోపణము చెప్పడములోనే తాత్పర్యము ఉంటుంది. అవయవియందుకూడా ఆరోపణము చెప్పవలె నని ఆతనికి

అభిప్రాయము ఉండదు. అట్లాగే ఒక్కొకచోట అవయవి యందు ఆరోపణము చెప్పడమె కవికి అభీష్టము. అవయవా రోపణంలో అభిప్రాయం ఉండదు. అటువంటిస్థలంలో నిరవ యవరూపకము అవుతుంది. ఈనిరవయవానికి కేవలము, మాల, అని భేదాలు ఉన్నవి. ఆరోపవిషయము ఒక్కటే ఉండి ఆరోప్యమాణముకూడా దానికి తగినది ఒక్కటే ఉండే టట్లయితే అది కేవలము అవుతుంది. ఆరోపవిషయము ఒక్కటే అయి ఆరోప్యమాణములు చాలా ఉండే టట్లయితే మాలారూపక మవుతుంది. ప్రకృతము ముందుగా కేవల నిరవయవ రూపకోదాహరణము ఇట్లా ఉంటుంది.

> యాత్రారంభ విజృంభమాణ సుభటప్రక్ష్వేడితామ్రేడితైః
> నిస్సాణధ్వనిభిః స్ఫుటం ప్రతిదలద్రోదఃకటాహాంతరైః
> క్షుబ్ధే ష్వబ్ధిషు కంపితేషు గిరిషు శ్రుత్వైవ ముంచం త్యసూన్
> భీతాః కాకతివీరరుద్రనృపతేః ప్రత్యర్థినః పార్థివాః.

జైత్రయాత్రారంభములో విజృంభించుతున్న మహా భటుల సింహనాదాలు భేరీధ్వనులను రెట్టింపు చేస్తున్నవి. ఆ ధ్వనులు రోదఃకటాహముల మధ్యభాగములను బ్రద్దలుకొట్టు తున్నవి. అప్పుడు సముద్రాలు క్షుబ్ధములు కాగా పర్వతాలు కంపించిపోగా ప్రతాపరుద్రుని శత్రురాజు లందరూ భయపడి ఆధ్వనిని వినడముచేతనే ప్రాణాలు విడిచిపెట్టుతున్నారు. (రోదఃకటాహము – బ్రహ్మాండభాండము.) దీనిలో రోదస్సు నకు కటాహత్వము నిరూపిత మయింది. కవికి అంతవరకే అభీష్టము. అటుమీాదట అన్యరూపణములలో ఆతనికి అభి లాష లేదు. కనుక నిరవయవము.

## మాలానిరవయము

రాజ్ఞాం మౌళివిభూషణ స్రగమలా దిక్కుంజరశ్రోత్రయోః
స్ఫారం చామరభూషణం ధరణిభృచ్ఛృంగేషు గంగా సరిత్
వ్యోమ్నః క్షౌమవితాన ముజ్జ్వలతరం ముక్తాకలాపో భువః
స్ఫారః కాకతివీరరుద్రయశసాం జాగర్తి విస్ఫూర్జితం

కాకతివీరరుద్రుని యశస్సుల విస్ఫురణము రాజులకు స్వచ్ఛమయిన శిరోఽలంకారమాల. దిగ్గజకర్ణములలో విశాల మయిన చామరభూషణము. పర్వతశిఖరాలలో గంగానది. ఆకాశమునకు సముజ్జ్వల మయిన క్షౌమవితానము. భూమికి విస్తార మయిన ముక్తాహారము. దీనిలో యశస్సు ఆరోపవిష యము ఒక్కటే. ఆరోప్యమాణములు చాలా ఉన్నవి. యశము నందు మాత్రము మాలాదులను రూపణము చేయడమె కవి తాత్పర్యము. ఇక సమన్వయము స్పష్టము.

## పరంపరితము

రూపకము హేతువుగా ఉన్న రూపకము పరంపరిత రూపకము. పరంపర కలది పరంపరిత మవుతుంది. ఒక రూప కము వేరొక రూపకములో హేతువుగా ఉండాలి అంటే ఆరూపకము ఈరూపకసిద్ధిలో కారణ మయితే ఈరూపకము ఆరూపకసిద్ధిలో కారణమవుతూ ఉంటుం దని భావము. ఒక రూపకం నిష్పన్నము కావడానికి వేరొక రూపకము ఉండి తీరా లన్నమాట. కూర్చబడే రూపకములు పరస్పరమూ సాపేక్షము లయి ఉంట వని పరమార్థము. ఇంతకూ ఈ పరం పరితములో ఒకరూపకము ఉండడము కాక అనేక రూపకాలు ఉండాలని తేలింది. అనేకరూపకాలు ఉన్నప్పటికీ ఇది అనేక రూపకాల కూడిక అని అనరు. అనేకరూపకాల కలయికలో

ఉండే చమత్కారముకంటె వీనిలోని చమత్కారము విలక్షణముగా ఉంటుంది కాబట్టి ఇది ప్రత్యేకంగా పరిగణనార్హమె. సమస్తవస్తువిషయరూపకంలో కూడా ఇట్లాగే అనేకరూపకాలు ఉంటవి. అక్కడకూడా విలక్షణ చమత్కారోదయమూ ఉంది. అయినా అదీ ఇదీ అభిన్నమని అనుకోరాదు. రెండిటికీ కొంత తేడా ఉంది. పరంపరితరూపకము రెండు రూపకములను మాత్రం అనుసరించి వ్యవస్థిత మవుతుంది. సమస్తవస్తు విషయరూపకము అట్లా కాదు. ఇదివరలో ఉదాహరించినట్లుగా అది రెండిటికంటె అధికంగానే రూపకములను అనుసరించి ఉంటుంది. ఏకరూపక సాపేక్షరూపకము సమస్తవస్తువిషయరూపక మని భేదమును గ్రహించాలి. ఇటువంటి స్పష్టభేదము ఉన్నదికాబట్టే సమస్తవస్తువిషయములో పరంపరితము అంతర్భవించదు.

ఇక్కడ గ్రహింపదగిన విశేషము ఒకటి ఉంది. ఎక్కడనయినా ఒకచోట సమస్తవస్తువిషయము రెండు రూపకములతోనే అనుబంధించి ఉండవచ్చు. అంటే అటువంటి చోట అది ఏకరూపకసాపేక్షముగానే ఉండవచ్చునన్నమాట. అక్కడ ఉన్న రెండు రూపకాలకూ అవయవావయవిభావ సంబంధమును కూడా కవి వివక్షించి ఉంటాడు. అట్టి స్థలంలో అది పరంపరితరూపకము ఎందుకు కాదు ? చాలా రూపకాల సంబంధం ఉన్నచోట పరంపరితము కాకపోయినా ఇటువంటి స్థలంలో కావచ్చునే ! అనే ఉదయించే శంకకు విద్యానాథునిరచనలో సమాధానము కనపడడము లేదు. పూర్వము చెప్పినదాన్నిబట్టి చూస్తే రెండే రూపకాలు ఉన్నపుడు పరంపరితమే అని అనాలి. కేవలము లెక్కలభేదాన్ని బట్టి అలంకారభేదమును చెప్పడము అంత సంగతంగా

ఉండదు. అంతకంటె ఏదయినా భేదనిరూపకయుక్తి ఉండాలి. కనుక ఈచెప్పేవిధంగా ఆ రెండిటి వివేకమును గ్రహించడము సముచితము.

పరంపరితములో కూర్చబడే రూపకాలు ఒక టొకటి సంబంధించి ఉంటవి. స్వస్వసిద్ధిలో అవి ఇతరమును ఉప యోగించుకోవు. అసలు ఇతరము ఏమీకూడా వానిసిద్ధిలో ఉపకారకము కాలేదు. సమస్తవస్తువిషయంలోని వ్యవస్థ వేరుగా ఉంటుంది. అక్కడ ఉపాత్తరూపకమె రూపకసిద్ధిని సంపాదించా లని లేదు. అక్కడ ఉన్న రూపకములు కవి సమయప్రసిద్ధ మయిన సాధర్మ్యమువలన సిద్ధము లవుతవి. ఇక్కడ ఒక ఆరోపము ఆరోపాంతరములో నిమిత్త మవు తుంది. ఈవిధముగా ఈ రెండిటికి భేదమును ఊహించడమె సమంజసముగా ఉంటుంది.

### ౫ శ్లిష్ట కేవల పరంపరితము

దీనిలో పదములు నానార్థములు కలవై శ్లిష్టములు కావడము, నిమిత్తము ఒకటే కావడము, ఆరోపములు పర స్పరము సంబంధము కలవి కావడమూ, ఉంటుంది.

ప్రతాపరుద్రదేవస్య మండలాగ్రవిధుంతుదః
అఖండవిక్రమోద్దామో గ్రసతే రాజమండలం

ఉపమా ప్రస్తావములో దీనిభావము నిరూపిత మయింది. మండలాగ్రమునందు విధుంతుదారోపము క్షత్రి యసమూహమందు రాజమండలారోపము ఉన్నందువలన రూపకము. రాజమండలపదము నానార్థములు కలది కాబట్టి శ్లిష్టము. రాజులసమూహము విషయరూప మయిన అర్థము. చంద్రమండలము విషయ రూపార్థము. ఖడ్గము రాజుల

సమూహమును గ్రసించడము రాహువు చంద్రమండలమును గ్రసించడమూ లోకప్రసిద్ధము. ఖడ్గమునందు రాహుసమారోపము ఉంటేనే నృపమండలమందు చంద్రమండలసమారోపము ఉపపన్న మవుతుంది. రాజమండలమందు రాజమండలసమారోపము ఉన్నపుడే మండలాగ్రమునందు విధుంతుదారోపము కుదురుతుంది. ఒక ఆరోపములో వేరొక ఆరోపము అపేక్షిత మవుతున్నది కాబట్టి ఇది పరంపరితము. ఇక్కడ నిరూపితము లయిన రెండు ఆరోపములూ ఒకటొకటి ఉపకరించుకొంటున్నవే కాని కవిసమయప్రసిద్ధ మయిన సాధర్మ్యము ఇక్కడ అవసరము కావడము లేదు. ఈఉపాత్తములకంటె అతిరిక్త మయిన సాధర్మ్యము ఏదీ ఈరూపకాలను సిద్ధింపచేయ లేదు. ఈవిధంగా శ్లిష్ట కేవలపరంపరితమును సమన్వయించుకోవాలి.

### ౬. శ్లిష్ట మాలా పరంపరితము

పద్మోల్లాససహస్రభాను రసకృ త్సన్మార్గచర్యా బుధః
క్ష్మాభృత్పక్షభిదాశనిః కువలయాలంకారరాకాశశీ
నిత్యోద్య త్సుమనోవికాస సురభిః కళ్యాణసంపత్సర
క్షోణీభృ ద్భువనాశ్రయాంబుధి రయం శ్రీవీరరుద్రో నృపః

పద్మోల్లాసము=లక్ష్మీసముల్లాసము, పద్మములసముల్లాసము. సన్మార్గము=సాధుమార్గము, నక్షత్రమార్గము. క్ష్మాభృత్పక్షము=రాజులబలము, పర్వతములపక్షములు. కువలయ=భూవలయము, కలువలు. సుమనోవికాసము=విద్వదామోదము, పుష్పవికాసము. కళ్యాణసంపత్=మంగళసంపత్తి, అక్షయస్వర్ణసమృద్ధి. భువనాశ్రయము=లోకమునకు ఆశ్రయము, ఉదకమునకు ఆశ్రయము. ఈవిధముగా

ఈపద్యములో ఆయాపదాలకు అర్థద్వయము ఉన్నది. ఇక ఈ పద్యభావమును ఈవిధముగా గ్రహించాలి. శ్రీవీరరుద్రనృపాలకుడు పద్మోల్లాసమనే పద్మోల్లాసములో సహస్రకరములు కలిగిన సూర్యుడు. లక్ష్మిని అభివృద్ధిపరచడములో సమర్థుడయిన కాకతిభూపతి పద్మాలను వికసింపజేయడములో సమర్థుడయిన సూర్యుడు. సన్మార్గ మనే సన్మార్గమునందలి చర్యలో బుధుడు. సాధుమార్గచర్యాసమర్థుడయిన వీరరుద్రుడు నక్షత్రమార్గచర్యలో బుధుడు. క్ష్మాభృత్పక్ష మనే క్ష్మాభృత్పక్షముయొక్క భేదనములో వజ్రాయుధము. శత్రుబలభేదనసమర్థుడయిన ప్రతాపరుద్రుడు పర్వతపక్షచ్ఛేదనసమర్థమయిన వజ్రాయుధము. కువలయ మనే కువలయముయొక్క అలంకారములో పూర్ణిమా చంద్రుడు. భూవలయాలంకార నిపుణుడయిన ప్రతాపరుద్రుడు కలువల అలంకారకుశలుడయిన పూర్ణిమాచంద్రుడు. నిత్యమూ అతిశయించె సుమనోవికాస మనే సుమనోవికాసములో వసంతుడు. విద్వదాహ్లాదమును కూర్చడములో నేర్పరి అయిన వీరరుద్రుడు పుష్పవికసనములో నేర్పరి అయిన వసంతుడు. కళ్యాణసంపద అనే కళ్యాణసంపదలో మేరుపర్వతము. మంగళసంపత్తిని సంపాదించే సురపర్వతము. భువనాశ్రయ మనే భువనాశ్రయమునకు సముద్రము. లోకాశ్రయదాత అయిన కాకతీయుడు జలాశ్రయ మయిన జలధి. ఈపద్యములో ప్రతాపరుద్రుడు ఒక్కడే విషయము. సూర్యబుధాదులు విషయిపదార్థములు చాలా ఉన్నవి. అందువలన మాలాత్వమును గ్రహించాలి. వీరరుద్రునియందు సహస్రభానుసమారోపము ఉంటేనే పద్మోల్లాసమందు పద్మోల్లాససమారోపము కుదురుతుంది. పద్మోల్లాసమందు పద్మోల్లాససమారోపము ఉంటేనే

వీరరుద్రునియందు సూర్యారోపము కుదురుతుంది. అందు వలన పరంపరితము. ఇట్లాగే ఇతరస్థలాలలోకూడా గ్రహించాలి. పూర్వపద్యములో చెప్పినవిధంగా మిగతా సమన్వయమును ఊహించాలి.

## ౬ అశ్లిష్ట కేవల పరంపరితము

కాకతీయస్య దుగ్ధాబ్ధే ర్యశోలీలామహోర్మయః
దిక్కూల ముద్రుజాటోపాః ఖేలం త్యభ్రంకషోచ్ఛ్రయాః.

కాకతీయు డనే దుగ్ధార్ణవముయొక్క యశోలీల లనే మహాతరంగములు దిక్కూలములను ఒరిపిడి చేసే ఆటోపము కలవై ఆకాశమును కషించే ఔన్నత్యము కలవై విహారిస్తున్నవి. దీనిలో పదములు శ్లిష్టములు కావు. యశోలీలలకు మహోర్మిత్వరూపణము కాకతీయునకు సంబంధించిన దుగ్ధార్ణవత్వారోపణాధీనముగా ఉన్నది కాబట్టి పరంపరిత మవుతుంది.

## ౭ అశ్లిష్ట మాలా పరంపరితము

దోరాశీవిషజిహ్వయా రిపువనశ్రేణీమహావాత్యయా
శౌర్యోగ్రానల ధూమ్యయా జయరమాయోషావిలాసభ్రువా
సంహృష్య ద్ధరణీవిలాస శిఖినీ సంవాసయష్ట్యా జగత్
ప్రాసాదార్గలయా కృపాణలతయా రుద్రో నృపః క్రీడతి.

కృపాణలతతో రుద్రనృపుడు క్రీడించుతున్నాడు. ఈపద్యములో ఆరు ఆరోపములు కృపాణలతకు నిరూపితములై ఉన్నవి. ఆకృపాణలత భుజము లనే సర్పముల నాలుక. శత్రువు లనే వనపంక్తికి సుడిగాలి. ప్రతాప మనే ప్రచండాగ్నికి ధూమసమూహము. జయలక్ష్మి అనే యువతికి విలాసభ్రుకుటి. బాగా హర్షము పొందుతున్న భూదేవి అనే

క్రీడామయూరికి నివాసయష్టి. జగత్తుఅనే భవనానికి అర్గళము. దీనిలో కృపాణలతయందు జిహ్వా వాత్యా భూమ్యాదులు చాలా ఆరోపితము లయినవి. అందువలన మాలారూపక మవుతుంది. కృపాణలతయందు జిహ్వాద్యారోపము భుజాదు లందు సర్పాద్యారోపమును ప్రతీక్షిస్తూ ఉంది. సర్పాద్యా రోపమున్నూ జిహ్వాద్యారోపమును అపేక్షిస్తున్నది. అందు వలన పరంపరితము. ఇట్లా పరంపరములో అంతటా హేతు హేతుమద్భావము కనిపిస్తూ ఉంటుంది.

ఈ ఉదాహరణములో వేరొక విశేషమును గుర్తిం చాలి. కృపాణలత అన్నపుడు కృపాణమందు లతారోపము ఉన్నదని గుర్తింపగలము. అయితే జిహ్వావాత్యాదులు కృపా ణమందు ఆరోపితము లవుతున్నవా? లతయందు ఆరోపి తము లవుతున్నవా? కాకతీయునికృపాణమె ప్రకృతములో వర్ణ్యము. లత కాదు. కృపాణమందు లతారోపము చేస్తే రూపకసమాసములో లతకే ప్రాధాన్యము వస్తుంది కాబట్టి జిహ్వాదులు లతయందే సమారోపితము లవుతున్నవి అని అనవలసిఉంది. అప్రకృత మయిన లత ఆరోపవిషయ మయితే మనకు ఇక్కడ కలిగే చమత్కార మేమిటి? ఆరోప్యమాణమునకు వేరొక ఆరోప్యమాణము ఉంటే చమ త్కారము వాడిపోతుంది. అమ్లానంగా భాసించదు. అందు వలన కృపాణలత అంటే అఖండంగా కృపాణము అని గ్రహించితే ఈయిబ్బంది రాదు. కృపాణలతాపదానికి ఈ అర్థం ఉన్నదా? అనేది వేరేవిషయము. విద్యానాథుడు ఇక్కడ కృపాణలతాపదముతో కృపాణమును వివక్షించు తున్నా డని నిరూపించుకోవాలి. ఇటువంటిదే వేరొక చిన్న అంశమున్నూ ఈపద్యంలో ఉంది. 'జయరమాయోషిత్'

అన్నపుడు యుద్ధవిజయమందు లక్ష్మీసమారోపము ఆలక్ష్మి యందు యోషిదారోపము అని ఆరోప్యమాణమునకు ఆరోప్యమాణము కల్పించుతున్నది. అందువలన అక్కడకూడా జయరమ అంటే యుద్ధవిజయ మని సామాన్యంగా గ్రహించితే సరిపోతుంది. ఇంతవరకు ఈపరంపరితము సాధర్మ్యముతో నిరూపిత మయింది. ఈ అశ్లిష్టమాలాపరంపరితము వైధర్మ్యముతోకూడా సంభవించుతుంది. సాధర్మ్యము అంటే ఇక్కడ నిరూపితము లవుతున్న రెండిటికి పరస్పరము విరోధభావము ఉండకుండా మైత్రము (ఆనుకూల్యము) ఉంటుం దని, వైధర్మ్యము అంటే మైత్రము లేకుండా విరోధభావము (విరుద్ధధర్మవత్త్వము= ప్రాతికూల్యము) ఉంటుం దని గ్రహించాలి. ఉదా :—

త్రాసాంధకారమధ్యాహ్నః కైతవాతపరాత్రయః
జయంతి వీరరుద్రస్య రణప్రాంగణకేళయః.

వీరరుద్రుని రణప్రాంగణ క్రీడలు భయ మనే అంధకారమునకు మధ్యాహ్నములు. కపట మనే ఆతపమునకు రాత్రులు అయి సర్వోత్కర్షగా ఉంటున్నవి. ఇక్కడ క్రీడలందు మధ్యాహ్నరోపము త్రాసమందు అంధకారారోపమును అపేక్షిస్తున్నది. రాత్రిసమారోపము కైతవమందు ఆతపారోపసాపేక్షముగా ఉన్నది. అంధకార మధ్యాహ్నములకు ఆతప రాత్రులకూ వైధర్మ్యము స్పష్టము. సమన్వయము సులభము. ఈవిధంగా రూపకము ఎనిమిది విధాలు. ఈ అష్టవిధ మయిన రూపకమున్నూ వాక్యగత మని సమాసగత మని మళ్లా విభాగము పొందితే పదహారు విధా లవుతుంది. ముఖచంద్రుడు అనే రూపకము సమాసగతము.

ముఖ మనే చంద్రుడు అని ఉంటే వాక్యగతము. ఈవిధ ముగానే ఇతరములలో కూడాను. వీని ఉదాహరణ ప్రపంచ మును ఇతరగ్రంథాలలో దర్శించాలి.

## ౬ పరిణామము

రూపకాలంకారానికి పరిణామాలంకారానికి కొంత సంబంధము ఉంది. ప్రకృతమందు అప్రకృతమును ఆరో పించడము అక్కడా ఇక్కడా కూడా సమానమె. కాని ఆరో ప్యమాణములో ప్రకృతోపయోగి అవుతుంది. ఈవైధర్మ్య ము వలన పరిణామము రూపకముకంటె భిన్న మవుతున్నది.

ఆరోప్యమాణ మారోపవిషయాత్మతయా స్థితం
ప్రకృత స్యోపయోగిత్వే పరిణామ ఉదాహృతః.

ఆరోప్యమాణము ఆరోపవిషయము అనే పదాల అర్థము ఇదివరలో నిరూపిత మయింది. ఆరోప్యమాణము ఆరోపవిషయరూపముగా ఉండి ప్రకృతమునకు ఉపయోగిం చేది అయినప్పుడు పరిణామము అవుతుంది అని సామాన్యంగా లక్షణార్థము. ముఖచంద్రునిచే తాపము శమించును అనే ఉదాహరణములో చంద్రుడు ఆరోప్యమాణము. ఆచంద్ర పదార్థము తాపము శమింపజేయడ మనే ప్రకృతక్రియలో ఉపకరించేది అవుతున్నది. తాపము శమించడ మనేది ముఖము వలననే కలగాల కాని చంద్రునివలన కలగదు. సౌరతాప మయితే చంద్రునివలన శమించవచ్చు. కాని మాన్మథ తాపము చంద్రునివలన శమించదు. ఈతాపశాంతిలో ముఖమే నిమిత్తము. కాగా చంద్రునివలన ఉపయోగం ఏమి ఉంటుంది ? ఆరోప్యమాణచంద్రుడు ప్రకృతోపయోగి

కావాలంటే ప్రకృతతాదాత్మ్యమును పొందితీరాలి. చంద్రుడు ముఖతాదాత్మ్యము పొందకపోతే తాపశమనోపయోగి కాలేదు. అందువలననే ఆరోప్యమాణము ప్రకృతోపయోగి అయ్యే పర్యంతమూ వివక్షింపబడడము, ప్రకృతోపయోగిత్వముకొరకు ఆరోపవిషయాత్మకముగా ఉండవలసి ఉండడమూ, దీనిలో వివక్షితము. ప్రకృతము అతిరోహిత స్వరూపంగానే ఉండి అంటే; తనరూపమును తాను విడిచిపెట్టకుండా ఉండి ఆరోప్యమాణాత్మకంగా పరిణమించుతుంది కాబట్టి పరిణామాలంకారము అని లక్షణభావము పర్యవసన్న మవుతుంది. రూపకాలంకారములో ఆరోపము తాద్రూప్యప్రతీతితోనే పర్యవసానం పొందుతున్నందువలన ప్రకృతము కొంత అపహ్నుతస్వరూపమై అప్రకృతస్వరూపం పొందుతుంది. రూపకాలంకారప్రస్తావములో ప్రకృతము అతిరోహితస్వరూపంగా ఉండా లని చెప్పినమాట నిజమె. తిరోహితస్వరూపంగా విషయము ఉంటుంది అని ఇక్కడ చెప్పడము పూర్వవచనానికి విరుద్ధంగా ఉండవచ్చు. కాని తత్వ మిది. ప్రకృతము అప్రకృతరూపరూపిత మయినప్పుడు ప్రకృతస్వరూపము తిరోహిత మయినట్లే భావించాలి. ప్రకృతము తనరూపాన్ని కప్పిపుచ్చుకొని అప్రకృతరూపమును పొందినపుడు ఇట్లా చెప్పక తప్పదుకదా! అయితే సందేహాద్యలంకారాలలోఉండే తిరోహితము కావడమునకూ రూపకంలో తిరోహితం కావడమునకూ తేడా ఉంది. ఈ భేదమును గుర్తింపచేయడానికే రూపకలక్షణంలో 'అతిరోహితరూపిణః' అని నిరూపిత మయింది. విషయ్యాకారారోపము ఉండగానే విషయస్థగనము రూపకంలో ఉంటుందన్నమాట. పరిణామంలో విషయము స్వస్వరూపమునుండి ఏమీ జారిపో

కుండా విషయియొక్క ఆకారమును ఉపయోగించుకుంటుంది. ఇదీ ఈరెండిటికీ భేదము. ఈభేదకథనంలో ప్రాచీనులకూ నవ్యులకూ వైషమ్యం ఉంది. ప్రాచీనమతానుసారంగా ఇక్కడ విద్యానాథుని అర్థము చేసికోవాలి. ఆరోప్యమాణము ప్రకృతోపయోగి అవుతుంది అని అనడముచేత సర్వాలంకారములకూ వ్యావృత్తి కలుగుతుంది. ఇతరాలంకారాలలో ఎక్కడా ఆరోప్యమాణము ప్రకృతోపయోగి కాదు. ఈ పరిణామాలంకారము సమానాధికరణ్య వైయధికరణ్యముల చేత ద్వివిధ మవుతుంది. విషయము విషయి రెండూ సమానవిభక్తి కలవిగా ఉంటే సామానాధికరణ్య మని, భిన్న విభక్తి కలవిగాఉంటే వైయధికరణ్య మని నియమము. ఉదా:

శశ్వత్ ప్రసాధనవిధానకృతాభిలాషా
నమ్రైర్భజంతి మకుటై రవనీపవర్గాః
శ్రీవీరరుద్రనృపతేః కకుభాం విజేతుః
ఆజ్ఞామయీం స్రజ మమందవిలాసలక్ష్మీం.

మాటిమాటికీ అలంకరించుకొనడములో అభిలాష కలిగిన రాజులు వినమ్రశిరస్సులతో దిశావిజేత అయిన శ్రీవీరరుద్రనృపతియొక్క అధికవిలాసశోభ కల ఆజ్ఞారూప మయిన మాలను భజించుతున్నారు. ఆజ్ఞ ప్రకృతము విషయము. స్రక్కు (మాల) అప్రకృతము విషయి. మకుటధారణ మనేది ప్రకృతక్రియ. ఆరోప్యమాణ మయిన మాల ప్రకృతాజ్ఞాతాదాత్మ్యము పొంది మకుటధారణాత్మక మయిన ప్రకృతోపయోగము కలిగి ఉన్నది కనుక పరిణామము. "ఆజ్ఞామయీం స్రజం" అని విషయ విషయి పదార్థములు సమాన విభక్తి కలవిగా ఉన్నందున సామానాధికరణ్యము.

వైయధికరణ్యమునకు ఉదా :—

కిరీటమాణిక్యమయూఖజాలైః విధాయ పుష్పాంజలి మర్చయంతే
ఫలార్థినో రుద్రనరేంద్రపాద పీఠాన్తసీమాన మరిక్షితీంద్రాః

ప్రయోజనార్థు లయిన శత్రురాజులు రుద్రనరేంద్రుని పాదపీఠాంతప్రదేశమును, తమకిరీటాలలోని మాణిక్యముల కిరణసమూహాలచేత పుష్పాంజలి చేసి అర్చనము చేస్తున్నారు. కిరణసమూహము విషయము. పుష్పాంజలి విషయి. అర్చనము ప్రకృతక్రియ. ఆరోప్యమాణ మయిన పుష్పాంజలి ప్రకృత మయూఖజాలతాదాత్మ్యము పొంది అర్చనోపయోగి అవుతున్నది. "మయూఖజాలైః పుష్పాంజలిం" అని భిన్నవిభక్తికములుగా ఉన్నందువలన వైయధికరణ్యము. సమాసోక్తిలో కూడా ఆరోప్యమాణము ప్రకృతోపయోగి అవుతుంది. అయినా అక్కడ ఆరోప్యమాణము గమ్యమానము అవుతుందేకాని పరిణామంలో మాదిరిగా శబ్దోపాత్తము కాదు. పరిణామంలో రెండూ వాచ్యములుగా ఉంటవి. కనుక సమాసోక్తికి పరిణామంలో అంతర్భావం రాదు. అది వేరు. ఇది వేరు.

## సందేహము

విషయో విషయీ యత్ర సాదృశ్యా త్కవిసమ్మతాత్
సందేహగోచరౌ స్యాతాం సందేహాలంకృతి శ్చ సా.

ఆరోపగర్భాలంకారములలో కొన్ని నిశ్చయాత్మకంగానూ కొన్ని అనిశ్చయాత్మకంగానూ ఉంటవి. సందేహాలంకారము అనిశ్చయాత్మకము. కవిసంమత మయిన సాదృశ్యమువలన విషయము విషయి అనే రెండూ సందేహగోచరములై ఉన్నట్లయితే సందేహాలంకారము అవుతుంది. కవిసమ్మతసాదృశ్యమువలన ప్రకృతాప్రకృతములు సందిహ్యమానములు కావాలి. కవిసమ్మతసాదృశ్యము లేకపోతే

సందేహమాత్రము అలంకారము కాదు. ఇది రజ్జువా? సర్పమా? అనే సందేహము అలంకారము కాదు. కవిప్రతిభాసముత్థాపిత మైన సందేహము ప్రకృతమునకు ఉత్కర్షను సంపాదించుతుంది. అనియతంగా రెండు అంశములను అవలంబించి ఉండే విమర్శను సందేహము అని అంటారు. ఇటువంటి విమర్శ ఏ ఒకదానికో సంబంధిచి ఉండదు. ప్రకృతము అప్రకృతము రెండిటినీ అవలంబించి ఉంటుంది. ఒక్కొకచోట విషయపదార్థములే సందేహగోచరములు అవుతూ ఉంటవి. వేరొకచోట విషయి విషయములు రెండూ సందేహగోచరము లవుతవి. ఈఅలంకారము మూడు విధాలు. శుద్ధము, నిశ్చయగర్భము, నిశ్చయాంతమూ అని. కేవలము సందేహములోనే పర్యవసానము పొందితే శుద్ధ సందేహ మవుతుంది. ఉదా :

శుద్ధ సందేహము

కిం మేష నవమో హరిత్పతి రమంద సంపత్పదం
కిం మేష దశమః ప్రజాపతి రపూర్వ సర్గక్రమః
కిం మేష హరి రుర్వరోద్ధరణచుంచు రేకాదశః
చిరా దితి విలోక్యతే జగతి వీరరుద్రో జనైః

దీని భావము ఇదివరలో నిరూపితము. కవిసమ్మత మయిన సంపదాది సాదృశ్యము వలన వీరరుద్రరూపమయిన విషయము లోకపాలాది రూపమయిన విషయి అనే కోటిద్వయము సందేహ గోచరముగా ఉన్నది కనుక సందేహాలంకారము. ఇక్కడ నిరూపిత మయిన సందేహము తావన్మాత్రములోనే పర్యవసానము పొందినందువలన శుద్ధము. ఈ పద్యములో నవమః దశమః ఏకాదశః అనే పదాలు ఉన్నందు

వలస సర్వప్రసిద్ధమయిన లోకపాలబుద్ధి కలుగదు. నూతన మయిన లోకపాలాదిభావం కలుగుతుంది. అప్పుడు లోకపాలాదులకు ఆరోప్యమాణత్వము రాదు. లోకపాలాది సంభావనమె అక్కడ సిద్ధమవుతుంది. నవమాదిపదాలు లేక పోతే కేవలలోకపాలాదులకు ఆరోప్యమాణత్వము సిద్ధము కావచ్చు. అప్పుడది సందేహమూ కావచ్చు. నవమాది పదాలు ఉన్నందువలన సంభావనాబుద్ధి కలుగుతున్నది. కనుక ఇది ఉత్ప్రేక్ష అవుతుంది కాని సందేహము కాదే! అనే శంక ఈ పద్యంలో కలుగవచ్చును. అప్పుడు ఈ విషయమును గ్రహించాలి. సందేహాలంకారములో ఆరోపమూ ఉండ వచ్చు. సంభావనకూడా ఉండవచ్చును. ఏది ఉన్నా సందేహము కోటిద్వయమును అవలంబించి ఉంటే సరి! అలంకారమవు తుంది. అందువలననే ఇటువంటి స్థలంలో ఉత్ప్రేక్షాశ్రయ మయిన సందేహము ఉంటుందనికొందరంటారు. ఈ పద్యంలో వీరరుద్రలోకపాలాది కోటిద్వయ గోచరమయిన సందేహము ఉన్నది కాబట్టి అలంకార సమన్వయమును గ్రహించాలి. అని వ్యాఖ్యాత అంటున్నాడు. బాగాచూస్తే ఇక్కడ ప్రకృత మయిన వీరరుద్రుడు సందేహప్రతీతి విషయంగా ఉన్నట్లు కనపడదు. లోకపాలాది విషయి పదార్థములే సందేహ ప్రతీతిలో గోచరము లవుతున్నవి. లోకపాలాది నానాకోటి కంగా సందేహము ఉన్నందువలన సమన్వయానికి ఏమీ బాధ లేదు. ఇక్కడ విషయిపదార్థములే సందేహ గోచరము లయినవి. ఇంకొకచోట విషయి విషయములు రెండూ సందేహ గోచరములు కావచ్చు అని గ్రహించాలి.

## నిశ్చయగర్భము

మొదట సంశయము ఉంటుంది. మధ్యలో నిశ్చయము ఉంటుంది. మళ్లీ చివర సంశయము ఉంటుంది. ఈ విధంగా ఉంటే నిశ్చయగర్భ సందేహము. ఉదా:-

కాలాహిః కిమయం ? మృణాలమృదులం భోగం స ధత్తే పునః
కాలభ్రూకుటి రేష కిం ను ? ముఖ ఏవోజ్జృంభతే సా పునః
కాలోగ్రానల ధూమపద్ధతి రసౌ కిం? సా పున ర్ధూయతే
వాతేనేతి వికల్పతే ప్రతిభటై రుద్రస్య కౌక్షేయకః.

వీరరుద్రుని ఖడ్గమును శత్రువులు ఈ విధంగా వికల్పించుచున్నారు. ఇది కాలసర్పమా ? అయితే అది మృణాల మృదుల మయిన శరీరమును ధరించుచుండే ! పోనీ ఇది అంతకుని భ్రూభంగమా ? అది ముఖమందే విజృంభించుచుండే ! ఇది అంతటా విజృంభిస్తున్నది. పోనీ ఇది ప్రళయకాల ప్రచండానల ధూమరేఖ అవుతుందా ? అయితే అది గాలికి కదిలి చలించి పోతుందే ! ఇది ఆ విధంగా చలించడము లేదు. దీనిలో మొదట కాలాహి అవుతుందా ? అని సంశయము. సుకుమారశరీరాది విశేషము కన్పడనందువలన సర్పము కాదు అని నిశ్చయము మధ్యలో ఉన్నది. అయినా ఖడ్గమనే నిశ్చయము లేదు. అందువలన నిశ్చయగర్భమైన సందేహము. పూర్వపద్యంలో మాదిరిగా ఇక్కడకూడా విషయిపదార్థములె సందేహగోచరములై ఉన్నవి.

## నిశ్చయాంతము

ఉపక్రమము సంశయంలో ఉంటుంది. పర్యవసానము నిశ్చయంలో ఉంటుంది. అందువలన నిశ్చయ పర్యవసాన మయిన సందేహము. ఉదా :

కిం కల్పద్రుమమంజరీస్రజ ఇమే ? కిం వా పయోరాశయః
స్వర్ధేనో ? రథవా కిముజ్జ్వలతరా శ్చింతామణేః స్ఫూర్తయః
కిం వా సిద్ధరసోర్మయ ? శ్చిరమితి వ్యామృశ్య నిశ్చిన్వతే
సంతః కాకతివీరరుద్రనృపతేః స్మేరాః కటాక్షా ఇతి.

ఇవి కల్పవృక్షాల మంజరీ మాలలా ? కామ ధేనువు క్షీరధారలా? లేకపోతే సముజ్జ్వలములయిన చింతా మణి విస్ఫురణములా ? సుధారస కల్లోలములా ? అని సందే హించి తుదకు ఇవి కాకతివీరరుద్ర నృపతి యొక్క స్మిత ప్రధానములు సానుగ్రహములు అయిన కటాక్షములు అని సహృదయులు నిశ్చయించు కుంటున్నారు. ఇది నిశ్చ యాంతమయిన సందేహమని స్పష్టముగా తెలుస్తూ ఉన్నది. పూర్వపద్యాలలో మాదిరిగా ఇక్కడ కూడా విషయిపదార్థ ములే సందేహ గోచరములుగా ఉన్నవి. విషయము విషయి రెండూ సందేహ గోచరములు కావాలని లక్షణములో ఉన్నది. లక్ష్యములో ఒకటే ఉంది. అయినా ఉదాహరణము సరిగా లేదని అనుకోనక్కర లేదు. విషయిగోచరమయిన సందే హము కూడా సందేహాలంకారమె అని తెలియ జేయడానికి నాథుడు ఈ విధంగా ఉదాహరించి ఉంటాడు. ఒక విధంగా ఈ మూడు లక్ష్యాలున్నా విషయివిషయములు రెండూ గోచరములుగా ఉండే సందేహానికి కూడా సరిపోతూ ఉంటవని ఊహించవచ్చు. "కిమేష హారిత్పతిః, కిమయం కాలాహిః, కిం కల్పద్రుమ మంజరీ స్రజ ఇమే" అనే ఈ పద్యాలలో విషయములు సర్వనామ శబ్దాలతో నిరూపితములయినవి. కింశబ్ద బోధ్యమయిన సందేహము ఏతచ్ఛబ్ద ప్రతిపాద్య విషయమును హారిత్పతిరూప మయిన విషయిని గోచరము చేసి కొంటున్నదని సమన్వయించు కోవచ్చు. ఇట్లాగే ఇతర

ములలో కూడా. ఈ రీతిలోని ఔచిత్యమును సహృదయులు భావించాలి.

## భ్రాంతిమదలంకారము

సందేహాలంకారానికి భ్రాంతిమదలంకారానికిన్నీ ఒక విషయంలో కొంత సాధర్మ్యము ఉంది. ఒక పదార్థమును వేరొక పదార్థముగా భావించడము రెండిటిలోనూ సమానమె. అందువలననే సందేహానంతరము ఇది ప్రసక్తమవుతున్నది.

> కవిసంమత సాదృశ్యా ద్విషయే పిహితాత్మని
> ఆరోప్యమాణానుభవో యత్ర స భ్రాంతిమా న్మతః.

ఆచ్ఛాదితస్వరూపము కలిగిన విషయములో (ప్రకృతములో) కవిసంమతమయిన సాదృశ్యము వలన ఆరోప్యమాణము యొక్క అనుభవము కలిగితే భ్రాంతిమదలంకారము అవుతుంది. ఒక వస్తువును వేరొకవస్తువని అనుకొనడము అది ఒక విధమయిన చిత్తభ్రాంతి. అయితే భ్రాంతి చిత్తధర్మ మని తేలుతుంది. ఇటువంటి చిత్తధర్మము కల భణితి ప్రకారము భ్రాంతిమాన్. కవిప్రతిభ వలన ప్రాకరణికమును అప్రాకరణికముగ గ్రహించుట భ్రాంతిమదలంకార మని భావము. దీనిలో కవిప్రతిభా సముత్థాపిత మయిన సాదృశ్యము ఉంటుంది. అటువంటి సాదృశ్యము లేకపోతే కేవలభ్రాంతి అలంకారము కాదు.

> కాకతీయవిభోః కీర్తివిభవే వ్యాప్తరోదసి
> దివాపి చంద్రికాబుద్ధ్యా చకోరా యాంతి నిర్వృతిం.

స్పష్టార్థము. దీనిలో కీర్తి విషయము. చంద్రిక ఆరోప్యమాణము. చకోరములకు కీర్తియందు చంద్రికాను

భవము ఉన్నట్లు వర్ణింప బడినందువలన భ్రాంతిమ దలంకారము.

## అపహ్నవము

సాదృశ్యము వలన ఒక వస్తువు వేరొక వస్తువుగా ప్రతీతము కావడము పూర్వాలంకారములో మాదిరిగా దీనిలో కూడా ఉంటుంది. అందువలననే భ్రాంతిమదనంతరము అప హ్నుతి నిరూపిత మవుతున్నది.

నిషిధ్య విషయం సామ్యా దన్యారోపే హ్యపహ్నుతిః.

కవిసమ్మతమయిన సాదృశ్యము వలన విషయమును నిషేధించగా అన్యారోపము ఉంటే అపహ్నుతి అవుతుంది. ప్రకృత వస్తువు అపహ్నవింపబడడము అన్యవస్తువు ఆరోపింపబడడము ఉండాలి. విషయాపహ్నవమనేది ఇతరాలంకారాలలో కూడా ఉన్నప్పటికి దీనిలో స్పష్టంగా విషయనిషేధం ఉంటుంది. సాదృశ్యమువలన ఆరోప్యమాణానుభవము ఉంటే అపహ్నవ మవుతుం దన్నమాట. ఈ అపహ్నవాలంకారము మూడు విధాలు. అపహ్నవించి ఆరోపించడము, ఆరోపించి అపహ్నవించడము, ఛల కపట వ్యాజ మిషాది శబ్దాల ద్వారా విషయాసత్యత్వమును ప్రతిపాదించడము అని. మొత్తానికి ఈ అలంకారములో విషయాపహ్నవకృతంగా చమత్కారము కలుగుతుంది. ఉదా:-

ఉద్వేల్లచ్చతురర్ణవీకలకలో నాయం చమూడంబరః
నేదం దుందుభిగర్జితం త్రిపురజిత్కల్పాంత ఢక్కారవః
ఇత్థం రుద్రనరేంద్రభాటిషు మహీభారావనమ్రీభవ
చ్ఛేషాశేషశిరస్సు విస్మిత మధ భ్రష్టం దిగీశైరపి

పొంగుతూ ఉన్న నాలుగు సముద్రాల కలకలమె

కాని ఇది సేనాడంబరము కాదు. ఇక్కడ కలకలత్వారోపము చమూడంబరత్వ నిషేధము ఉన్నది. మొదటి భేదాన్ని ఇక్కడ సమన్వయించాలి. ఇది దుందుభిగర్జితము కాదు శివుని కల్పాంత ఢక్కారవము. ఇక్కడ ముందు నిషేధము తరువాత ఆరోపము ఉన్నది. ద్వితీయ భేదమును ఊహించాలి. ఈ విధంగా రుద్రనరేంద్రుని ధాటులలో (శత్రుదేశపీడనానికి భటులతో అశ్వములతో విజిగీషువు చేసే ప్రయత్నము-ధాటి) భూభారము చేత ఆదిశేషుని శిరస్సులు వంగి పోతూ ఉంటే దిగీశ్వరులు కూడా ఆశ్చర్యపడుతున్నారు. ఎక్కడో జారి పోతున్నారు. ఆరోపము నిషేధము అనే రెండూ ఈ అలంకారానికి ప్రాణమిచ్చేవిగా ఉన్నవి. ఆరోపము మొదట ఉండడము తరువాత ఉండడము అనే విశేషాన్నిబట్టి భేదములు కలుగుతున్నవి. ఒకసారి నిషేధమె చమత్కారి అయితే వేరొకసారి ఆరోపము చమత్కారి అవుతుంది. ఈ పద్యంలో మొదటి రెండు భేదాలూ కనపడుతున్నవి. ఇక మూడవ భేదానికి ఉదా:-

సర్వాం కాకతివీరరుద్ర ధరణీనాథ చ్ఛలేన క్షితిం
పాతుం మధ్యమలోకపాల పదవీం ప్రాప్తః స్వయంభూః శివః
నైవం చే ద్విషమావలోకన కలామాత్రేణ భస్మీకృతైః
జాతం వైరిపురైః కథం? కథ మవాగ్భూతం చ భూభృద్గణైః?

స్వయంభూ శివుడు ఈ భూమినంతా ప్రతాపరుద్రుడన్న మిషతో పాలించడానికి భూలోకములో అవతరించాడు. ఇది సత్యము. ఇట్లా కాకపోతే విషమావలోకనం చేయగానే శత్రువుల పట్టణాలు ఎట్లా భస్మములవుతవి? భూభృద్గణములున్నూ ఎట్లా న్యగ్భూతములు అవుతవి.

త్రిపురదాహసమయంలో శివుడు తృతీయనయన ప్రసారం చేయ గానే వైరిపురాలు భస్మములయినవి. కైలాసము (భూభృత్) ప్రమథగణములూ (గణ) ఎటో పోయినారు. ప్రతాప రుద్రుడు విషమంగా చూడగానే శత్రుపట్టణాలు ఏమో అయి పోతున్నవి. ఎదురు వచ్చిన రాజులున్నూ పరాభూతు లవుతున్నారు. దీనిలో ఛలశబ్ద ప్రయోగము ఉన్నది. దాని వలన ఒకవిధంగా సుకృతమునకు అసత్యత్వము ప్రతిపాదిత మవుతుంది.

## ఉల్లేఖము

అర్థయోగరుచిశ్లేషై రుల్లేఖన మనేకధా
గ్రహీతృభేదా దేకస్య స ఉల్లేఖః సతాం మతః.

ఉల్లేఖము కూడా ఆరోపగర్భాలంకారము. ఒకవస్తు వును అనేకులు అనేకవిధాల ఉల్లేఖించితే ఉల్లేఖము. అనేకధా ఉల్లేఖించడములో హేతువులు ఉంటవి. అర్థయోగము-రుచి-శ్లేష ఈ మూడూ హేతువులు. అర్థయోగము అంటే ఒక ప్రయోజనసంబంధము. రుచి అంటే అభిరతి. ఆ వస్తువుపై అభిమానము. శ్లేష నానార్థములు ఉండడము. ఈ మూడు హేతువులూ ఒక చోట ఉండాలని నియమం లేదు. ఉండ కూడదని నిషేధమూ లేదు. ఈ మూడూ ఉండవచ్చు. రెండే ఉండవచ్చు. ఒకటే ఉండవచ్చును. ఆయా వస్తువులను ఆయా విధముగా గ్రహించే వారు ఈ విశేషములు కల వారై ఆయా వస్తువులు నానాధర్మములు కలిగి ఉన్నందు వలన అనేకవిధాలగా నిర్ధారించి నప్పుడు ఉల్లేఖాలంకారము అవుతుంది. గ్రహించే వారు అనేకులు ఉండడమనేది ఇతరా లంకారాలలో ఎక్కడా ఉండదు.

లక్ష్మీనివాసగృహ మిత్యఖిలా నరేంద్రాః
శౌర్యాతిభూమిఖని రిత్యరివీరవర్గాః
విద్యావిహారపదవీతి చ లబ్ధవర్ణాః
శ్రీకాకతీంద్రనగరీ మనిశం స్తువంతి

దీని భావము నిరూపితమయింది. కాకతీంద్రనగరములో సమృద్ధి మొదలయిన ధర్మముల సంబంధము ఉన్నందువలన నరేంద్రులు శత్రువులు పండితులు అనే అనేకులు లక్ష్మీనివాసగృహము మొదలయిన అనేకవిధాలుగా ఉల్లేఖించి నందువలన ఇది ఉల్లేఖాలంకారము. దీనిలో రుచి అర్థయోగము అనే రెండూ ఉన్నవి. ఈ చెప్పబోయేది శ్లేషోల్లేఖమునకు ఉదాహరణము.

ఉగ్రః సపత్నేషు గుణేషు భాస్వాన్ రామః ప్రతీకేషు రణేషు భీమః
లీలాసు లక్ష్మ్యాః పురుషోత్తమశ్చే త్యాచక్షతే రుద్రనృపం కవీంద్రాః.

రుద్రనృపాలకుని కవీంద్రులు ఈ విధముగా చెప్పుతున్నారు. ప్రతాపరుద్రుడు శత్రువులవిషయమై ఉగ్రుడు= శివుడు, క్రూరుడు. గుణములలో భాస్వాన్=సూర్యుడు, తేజస్వి. అవయవములలో రాముడు=శ్రీరాముడు, మనోహరుడు. లక్ష్మీలీలలలో పురుషోత్తముడు=విష్ణువు, పురుషులలో ఉత్తముడు. దీనిలో గ్రహీతృభేదం లేదు. అయినా సపత్నాది విషయభేదము ఉన్నది కాబట్టి శ్లేషతో ఉగ్రత్వాద్యనేక ధర్మోల్లేఖము ఉన్నందువలన ఉల్లేఖము.

## ఉత్ప్రేక్ష

ఆరోపములో మాదిరిగా అధ్యవసాయములో కూడా అభేద ప్రతిపత్తి (జ్ఞానము) కలుగుతుంది. అయినా ఆరోపముకంటె అధ్యవసాయము ఉత్కృష్టము. అందువలన

ఆరోపమూలములను చెప్పిన తరువాత అధ్యవసాయ మూలములను చెప్పడము సముచితము. అధ్యవసాయగర్భము లయిన అలంకారాలు రెండు. ఉత్ప్రేక్ష అతిశయోక్తి. అధ్యవసాయగర్భములలో ఆరోపగర్భత ఉండక పోదు. ఆరోపగర్భములలో అధ్యవసాయ గర్భత ఉండక పోదు. అయినా ప్రాధాన్యమును బట్టి ఆ విధంగా వ్యపదేశము. ప్రకృతములో అప్రకృత గుణక్రియా సంబంధము ఉన్నందు వలన చమత్కారవిశేషమును అధ్యవసాయము కలుగ జేస్తుంది. కాబట్టి ఇది ఆరోపము కంటె ఉత్కృష్టము. అధ్యవసాయము అంటే నిశ్చయజ్ఞానము. అభిన్నముగా భాసించడము. అది ఒకచోట సమ్యగ్రూపంగా ఉంటుంది. వేరొకచోట మిథ్యా రూపంగా ఉంటుంది. సర్పమును చూచి సర్పమె అనుకొనడము సమ్యగధ్యవసాయము. రజ్జువును చూచి సర్పమని అనుకొనడము మిథ్యాధ్యవసాయము. ఇక్కడ చమత్కారము లేదు కాబట్టి అలంకారము కాదు. బుద్ధిపూర్వకముగానే అది కానిదానిని తద్ధర్మసంబంధము ఉన్నందువలన అదిఅని అనుకొనడము అలంకారమూలమయిన అధ్యవసాయము. ఇది లోకాధ్యవసాయము కంటె విలక్షణము. ఇటువంటిదే లోకోత్తర చమత్కార కారణము. కావ్యప్రకరణములో అధ్యవసాయలక్షణము నిరూపితమె.ఇక్కడ దానిని విశదంగా గహించడము అవసరము. విషయము విషయి ఈ రెండిటిలో ఏదో ఒక దానిని నిగరణముచేసి అభేదప్రతిపత్తిని సంపాదించడము అధ్యవసాయము. నిగరణము అంటే ఏదోవిధంగా అసత్యత్వమును చెప్పడము. విషయి నిగరణము ఒకచోట ఉంటుంది. విషయ నిగరణము ఇంకొక చోట ఉంటుంది.

విషయమును నిగీర్ణము చేసి అభేదప్రతిపత్తిని సంపాదించడమనే అధ్యవసాయము చాలాప్రసిద్ధము. కావ్యప్రకరణంలో చెప్పిన అధ్యవసాయలక్షణము ఇదే. విషయికి అసత్యాత్వమును చెప్పే అధ్యవసాయము సాధ్యమని విషయమునకు అసత్యాత్వమును చెప్పేఅధ్యవసాయము సిద్ధమని అంటారు. ఈ వివేకమును ఇట్లా ఉదాహరణంలో గ్రహించాలి. ముఖము విషయము. చంద్రుడు విషయి. చంద్రాది విషయిగతముగా ఉండే మాధుర్యాదికమును విషయమయిన ముఖాదులందు నిబంధించి ముఖమును ముఖము అని తెలుసుకుంటూ కూడా ఇది సత్యముగా చంద్రుడె అనిప్రయోగించి నప్పుడు విషయి అయిన చంద్రుడు ముఖరూపంగా సత్యము కాదు. కాబట్టి నిగీర్ణుడుగా భాసిస్తాడు. ముఖరూప మయిన విషయము పరమార్థంగా సత్యమె. 'నిశ్చయంగా ముఖము చంద్రుడె' అని ప్రయోగించిన చోట సత్యమయిన ముఖానికి అసత్యమయిన చంద్రునకూ అభేదప్రతిపత్తి సంభవించదు. అయినా సంస్కృతంలో 'మన్యే, శంకే ధ్రువం, ప్రాయః, నూనం' మొదలయిన శబ్దాలచేత అసత్యమయిన చంద్రునకున్నూ సత్యత్వము సమర్థిత మవుతున్నది. అందువలననే ఇక్కడ అధ్యవసాయము సాధ్యమవుతున్నది. ఇటువంటి స్థలాలలో అధ్యవసాయప్రాధాన్యం ఉంటుంది. ముఖపదమును శబ్దముతో చెప్పకుండా చంద్రోయం అని ప్రయోగించి నపుడు వాస్తవంగా అక్కడ విషయి అసత్యమె అయినా సత్యత్వము గోచర మవుతుంది. చంద్రునకు అసత్యాత్వమును నిరూపించడములో నిమిత్తమయిన ముఖపదమునకు అక్కడ ప్రయోగము లేదుగా! విషయమయిన ముఖము వాస్తవంగా

సత్యమె అయినా ఏమాత్రమూ శబ్దము చేత చెప్పబడనందు వలన అది అసత్యమె అయి నిగీర్ణమవుతున్నది. అందువలన ఇటువంటి స్థలంలో అధ్యవసాయము సిద్ధము. ఇక్కడ అధ్యవసితానికి ప్రాధాన్యం ఉంటుంది. సాధ్యాధ్యవసాయము మూలముగా ఉత్ప్రేక్షాలంకారము ఉంటుంది. ఇక దాని లక్షణము—

> యత్రాన్యధర్మసంబంధా దన్యత్వేనోపతర్కితం
> ప్రకృతం హి భవే త్ప్రాజ్ఞా స్తా ముత్ప్రేక్షాం ప్రచక్షతే.

గుణ క్రియా రూప మయిన అన్యధర్మసంబంధము వలన ప్రకృతము అప్రకృతముగా సంభావిత మయినపుడు ఉత్ప్రేక్షాలంకారము అవుతుంది అని ప్రాజ్ఞులు భావిస్తున్నారు. ముఖము ప్రకృతము. చంద్రుడు అప్రకృతము అన్యము. ముఖమందు చంద్రునకు సంబంధించిన స్వచ్ఛత ఆహ్లాదకారిత్వము మొదలయిన గుణక్రియాసంబంధము ఉన్నందువలన ముఖమును చంద్రుడుగా సంభావించుతాము. అపు డది ఉత్ప్రేక్ష అవుతుంది. ఇది వాచ్యోత్ప్రేక్ష. ప్రతీయమానోత్ప్రేక్ష అని రెండువిధాలు. సంభావనను ప్రతిపాదించే "నూనం ధ్రువం ప్రాయః" మొదలయిన వానిని ప్రయోగించితే వాచ్య అవుతుంది. సంభావనావాచకములను ప్రయోగించకపోతే ప్రతీయమాన అవుతుంది. జాతి క్రియ గుణము ద్రవ్యము అనే నాలుగూ అధ్యవసాయములో విషయములుగా నిరూపితము లయినపుడు ఒక్కొక్కటి మళ్లీ నాలుగు విధాలవుతుంది. జాత్యాదులు నాలుగూ భావరూపములుగాను అభావరూపములుగానూ ఉత్ప్రేక్షింపబడడము ఉంటుంది కాబట్టి ఈ ద్వైవిధ్యమును కలుపు

కొంటే వాచ్య ఎనిమిది విధాలు, ప్రతీయమాన ఎనిమిది విధాలూ అవుతుంది. అధ్యవసాయము గుణనిమిత్తముగా ఉండవచ్చు. క్రియానిమిత్తముగా ఉండవచ్చు. ఈ రెండు విధాలూ మేళవించితే ఒక్కొక్కటి పదహారు విధాలు. ఈ జాతిక్రియాగుణద్రవ్యాల స్వరూపము ఉత్ప్రేక్షింపబడడము అవి హేతువుగా ఉత్ప్రేక్షింపబడడమూ ఫలముగా ఉత్ప్రేక్షింపబడడము కలిపినపుడు ఒక్కొక్కటి నల్భై ఎనిమిది విధాలు. వీనినే భంగ్యంతరముగా భావించితే జాత్యుత్ప్రేక్ష పన్నెండు విధాలు, క్రియోత్ప్రేక్ష ౧౨, గుణోత్ప్రేక్ష ౧౨, ద్రవ్యోత్ప్రేక్ష ౧౨ విధాలూ, అవుతుంది. గ్రహణసౌకర్యముకొరకు వానిపేర్లను ఈవిధంగా గ్రహించవచ్చు.

౧. గుణనిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష
౨. ,, జాత్యభావ ,,
3. క్రియానిమిత్త జాతిభావ ,,
౪. ,, జాత్యభావ ,,
౫. గుణనిమిత్త జాతిభావ హేతూత్ప్రేక్ష
౬. ,, జాత్యభావ ,,
౭. క్రియానిమిత్త జాతిభావ ,,
౮. ,, జాత్యభావ ,,
౯. గుణనిమిత్త జాతిభావ ఫలోత్ప్రేక్ష
౧౦. ,, జాత్యభావ ,,
౧౧. క్రియానిమిత్త జాతిభావ ,,
౧౨. ,, జాత్యభావ ,,

క్రియాగుణద్రవ్యోత్ప్రేక్షలున్నూ ఈవిధంగానె ఒక్కొక్కటి పన్నెండుఅవుతుంది. ప్రతిపత్తిసౌకర్యంకొరకు స్వరూపో

ప్రేక్ష ౧౬, హేతూత్ప్రేక్ష ౧౬, ఫలోత్ప్రేక్ష ౧౬ విధాలు అవుతుంది అనిన్నీ గ్రహించవచ్చు.

స్వరూపోత్ప్రేక్షలో—
గుణనిమిత్తజాతిభావోత్ప్రేక్షలు ౪
,, అభావోత్ప్రేక్షలు ౪
క్రియానిమిత్త భావ ,, ౪
,, అభావ ,, ౪

ఈవిధంగానే హేతుఫలోత్ప్రేక్షలలో కూడా గ్రహించాలి. ఇట్లా వాచ్యోత్ప్రేక్ష ౪౮, ప్రతీయమానోత్ప్రేక్ష ౪౮, విధాలు. విద్యానాథమతానుసారంగా చూస్తే ప్రతీయమానోత్ప్రేక్షలో హెచ్చింపులు తగ్గింపులు ఏమీ లేవు. వ్యాచ్యోత్ప్రేక్షలో ఇంకా కొన్ని కలుపవలసినవి ఉన్నవి. దీనిలో నిమిత్తము వాచ్యముగా ఉండడము గమ్యముగా ఉండడము వలని భేదము కూడా సంభవిస్తుంది. నిమిత్తము వాచ్యముగా ఉన్నప్పుడు గుణనిమిత్తము క్రియానిమిత్తమన్న భేదము స్పష్టమే. నిమిత్తము గమ్యముగా ఉన్నప్పుడు గుణక్రియాభేదము రాదు. నిమిత్తము ఉపాత్తమే కానప్పుడు గుణము ఉపాత్తము కాలే దని క్రియ ఉపాత్తము కాలే దని పరిగణించడము సముచితంగా ఉండదు ఇది అజాతపుత్రనామకరణతుల్యంగా ఉంటుంది. అందువలన నిమిత్తానుపాదానంలో ఒకే భేదము కలుగుతుంది. ఈనిమిత్తము ఉపాత్తము కాకపోవడ మనేది వాచ్యోత్ప్రేక్షలో కూడా అన్నిటిలోనూ సంభవించదు. ఒక స్వరూపోత్ప్రేక్షలో మాత్రమే దీనిభేదాలు కలుగుతవి. హేతూత్ప్రేక్ష ఫలోత్ప్రేక్షలలో ఈవిశేషము కుదరదు. హేతూత్ప్రేక్షలో ఫలము నిమిత్త

మవుతుంది. ఫలోత్ప్రేక్షలో హేతువు నిమిత్త మవుతుంది. ఒకదానిని హేతువుగా సంభావించినప్పుడు అది దేనికొరకో ఆ నిమిత్త మయిన ఫలమును నిర్దేశించకపోతే అన్వయము సరిగా కుదరదు. అదేవిధంగా ఒకదానిని ఫలముగా సంభావించి నప్పుడు అది దేనికి ఫలమో ఆ నిమిత్త మయిన హేతువును నిర్దేశించకపోతే అన్వయానికి కుదురుబాటు లేదు. అందు వలన హేతుఫలోత్ప్రేక్షలలో నిమిత్తము ఉండితీరాలి. ఈవిషయమును ముందు సోదాహరణంగా నిరూపిస్తాము. పూర్వము చెప్పినవిధముగా స్వరూపోత్ప్రేక్ష నిమిత్తసహితమై ఉంటే ౧౬ విధా లయిందికదా! దానిలో గుణనిమిత్తకములు ౮, క్రియానిమిత్తకములు ౮; వానికితోడు అనుపాత్తనిమిత్త కము లయిన ౮ భేదాలను కూడా కలిపితే మొత్తం స్వరూపో త్ప్రేక్ష చతుర్వింశతి భేదాలు కల దవుతుంది. నిమిత్తమును చెప్పనప్పుడు గుణక్రియాభేదము రాదు కాబట్టి ఇవి ఎనిమిది భేదాలె.

అనుపాత్త నిమిత్త జాత్యాది భావోత్ప్రేక్షలు ౪
,, జాత్యాద్యభావోత్ప్రేక్షలు ౪

వీనికి నామనిర్దేశము చేయడము సులభమె. గ్రహణ సౌకర్యముకొరకు మొదట చెప్పిన జాతి క్రియా గుణ ద్రవ్యో త్ప్రేక్షా విభాగానుసారముగా చూస్తే ఒక్కొకదానిలో అను పాత్త నిమిత్తకములు రెండు రెండు చేరుతవి.

అనుపాత్త నిమిత్తక జాతిభావ స్వరూపోత్ప్రేక్ష
,, జాత్యభావ ,,

అని పేర్లు. హేతు ఫలోత్ప్రేక్షలలో ఈ భేదములు కలుగ వనే విశేషమును గుర్తుపెట్టుకోవాలి. గుణ క్రియా

ద్రవ్యోత్ప్రేక్షలకు సంబంధించిన స్వరూపోత్ప్రేక్షలలో కూడా ఈ భేదద్వయమును అభ్యూహించాలి.

నిమిత్తము వాచ్య గమ్య భేదాలతో ఉంటుం దనే విభాగము వాచ్యోత్ప్రేక్షలోనే సంబంధించుతుంది కాని ప్రతీయమానోత్ప్రేక్షలో సంబంధించదు. ప్రతీయమానోత్ప్రేక్షలో సంభావనావాచకము లయిన ఇవ, నూనం, ప్రాయః ఇత్యాదిశబ్దాలు ఉండవుకదా! సంభావనావాచకములూ ఉండక నిమిత్తముకూడా ప్రయోగింపబడకపోతే ఉత్ప్రేక్ష నిరవలంబ మవుతుంది. ఉత్ప్రేక్షాశరీరము నాలుగు విధాల ఉంటుంది. ప్రకృతము, అప్రకృతము, నిమిత్తము, సంభావనావాచకము అని. వీనిలో చివరివి రెండూ లేకపోతే ప్రకృతము అప్రకృతము రెండే ఉంటవి. అంతమాత్రంచేత ఉత్ప్రేక్షాలంకార మని ఎట్లా నిర్ధారిత మవుతుంది ?

మహిళాసహస్రభరితే తవ హృదయే సుభగ! సా అమాంతీ
అనుదిన మనన్యకర్మా అంగం త న్వపి తనయతి

ఓ! సుందరుడా! వేయిస్త్రీలతో కూడుకొన్న నీహృదయంలో ఆమె ఉండడానికి తగినచోటు లేక ప్రతి దినమూ ఏమీ పని లేకుండా సన్నగా ఉన్న శరీరాన్నికూడా ఇంకా కృశింపచేసికొంటున్నది. దీనిలో "మహిలాసహస్రభరిత మయిన నీహృదయంలో ఇముడలేక" అనే ఉత్ప్రేక్ష ఇవాదిపదాలు లేనందువలన ప్రతీయమాన మవుతున్నది. ఈఉత్ప్రేక్షలో అంగతనూకరణము నిమిత్తము. ఈనిమిత్తమె ఇక్కడ ఉపాత్తము కాకపోయినట్లయితె పై ఉత్ప్రేక్ష నిష్ప్రమాణక మయ్యేది. అందువల్ల ప్రతీయమానోత్ప్రేక్షలో అవశ్యంగా నిమిత్తం ఉండితీరాలి అని నియమము. వాచ్య

లోనే నిమిత్తోపాదా నానుపాదానములు సంభవించుతవి కాబట్టి అది మొత్తంమీద యాభైఆరు విధా లవుతుంది. ప్రతీయమాన నలభై ఎనిమిది విధాలు. మొత్తం ఉత్ప్రేక్ష నూటనాలుగువిధా లని తేలింది.

వాచ్యోత్ప్రేక్షలోకూడా హేతుఫలములు ఉత్ప్రేక్షా విషయములు అయినప్పుడు నిమిత్తము చెప్పబడవలసిందే. సాధ్యమును చెప్పక దేనినో సాధనముగా నిర్దేశించడము అన్వయపరిపోషం ఇవ్వదు. అట్లాగే సాధనమును చెప్పక పోతే దేనినో సాధ్యముగా నిర్దేశించడమున్నూ అన్వయ సౌకర్యం కలుగచేయలేదు. సాధ్యము సాధనము అనేవి రెండూ ఎప్పుడూ పరస్పరాపేక్ష కలిగి ఉంటవి. ఒకటొకటి విడిచి ఉండవు. హేతూత్ప్రేక్షలో ఫలము నిమిత్తము. ఫలో త్ప్రేక్షలో హేతువు నిమిత్తము. ఒకటి నిమిత్త మయితే రెండోది నైమిత్తికము. నిమిత్తనైమిత్తకములలో ఏ ఒక దానినో చెప్పడములో అన్వయపరిపోషం ఉండదు. రెండిటిని చెప్పవలసిందే అని నియమము. కాగా వీనిలో నిమిత్తము ఉపాత్తము కావలసిందే. హేతూత్ప్రేక్షలో ఫలము నిమిత్త మయినప్పుడు ఆఫలమును చెప్పకపోతే అది దేనినిగూర్చి హేతువుగా ఉంది, అనిపిస్తుంది. ఈఉదాహరణంలో ఈవిష యము స్పష్ట మవుతుంది.

ప్రతాపరుద్రనృపతే రపారే కీర్తిసాగరే
మగ్నా దురీశ దుష్కీర్తిసంగా దివ జగత్త్రయీ

ప్రతాపరుద్రుని అపారమయిన కీర్తిసాగరంలో, దుష్ట ప్రభువుల దుష్కీర్తిసంగమువలనకాబోలు జగత్త్రయి మగ్న మయింది. దీనిలో జగత్త్రయి మునగడములో దుష్కీర్తి

సంగము హేతువు కాకపోయినా హేతువుగా ఉత్ప్రేక్షిత మయినందువలన హేతూత్ప్రేక్ష. ఈఉత్ప్రేక్షలో మజ్జనము నిమిత్తము. దీనిని ఇక్కడ చెప్పకపోతే "సంగాదివ" అనే హేతూత్ప్రేక్ష అంద మివ్వదు. ఫలోత్ప్రేక్షలో హేతువు నిమిత్త మవుతుంది. దానిని చెప్పకపోతే "ఇది దేనిని గురించి ఫలంగా ఉంది ?" అనిపిస్తుంది. ఈపద్యంలో చూడండి.

జయశ్రీవాసపద్మస్య వికాసాయేవ భానుమాన్
ప్రతిబింబమిషాత్ ఖడ్గం ప్రవిశ త్యంధ్రభూభుజః

జయలక్ష్మీనివాసపద్మముయొక్క వికాసముకొరకు కాబోలు సూర్యుడు ప్రతిబింబ మన్న మిషతో ప్రతాపరుద్రునిఖడ్గమును ప్రవేశిస్తున్నాడు. సూర్యుడు ప్రతిబింబముగా ఖడ్గములో ప్రవేశించడమునకు పద్మవికాసము ఫలము కాదు. అయినా పద్మవికాసము ఫలముగా చెప్పబడినందువలన ఫలోత్ప్రేక్ష. దీనిలో సూర్యప్రవేశము నిమిత్తము. దానిని ఇక్కడ చెప్పకపోతే "జయలక్ష్మీవాసకమలవికాసాయేవ" అనే ఫలోత్ప్రేక్షణము సముచితంగా ఉండదు. కాబట్టి హేతుఫలోత్ప్రేక్షలలో నిమిత్తము ఉండవలసిందే. అక్కడ నిమిత్తానుపాదానం అంటూ ఉండదు. పూర్వము చెప్పినట్లుగా స్వరూపోత్ప్రేక్షలోనే నిమిత్తోపాదానానుపాదానభేదములు కుదురుతవి. ఇట్లా ఈ విధానాలు అన్నీ చూచుకోగా వాచ్యోత్ప్రేక్షకు ౫౬, ప్రతీయమానకు ౪౮, మొత్తము ౧౦౪ ఉత్ప్రేక్షాభేదాలు సిద్ధము లవుతున్నవి. గుణక్రియలు రెండూ ఉత్ప్రేక్షావిషయములు కావడము ఉత్ప్రేక్షానిమిత్తములు కావడము ఉంటుం దని పెద్దలు అంగీకరించారు. ప్రాచీనుల అలంకారప్రబంధాలలలో ఉత్ప్రేక్ష తొంభయిఆరు భేదాలు

అవుతుంది అని అనడము ఉత్త పరిగణనముమాత్రమే. మేము నిరూపించిన యాభై ఆరు భేదాలే చమత్కారాతిశయము కలిగి ఉంటవి. మిగతావి చారుత్వాతిశయము కలవి అని అనలేము.

* అలంకారసర్వస్వకర్త ఈవిధముగా భేదాలను సంఖ్యానిస్తున్నాడు. వాచ్యోత్ప్రేక్ష జాత్యాదులవలన ౪ విధాలు. భావాభావపద్ధతిని ౮ విధాలు గుణక్రియానిమిత్తాన ౧౬ విధాలు. నిమిత్తోపాదానానుపాదానముల వలన ౩౨ విధాలు. స్వరూప హేతు ఫలాలవలన ౯౬ విధాలు. ఈ విధంగా షణ్ణవతిభేదత్వమును చెప్పడమునే విద్యానాథుడు ఆక్షేపిస్తున్నాడు. నిమిత్తమును చెప్పనప్పుడు గుణక్రియాభేదపరికల్పనము ఏమి సమంజసముగా ఉంటుంది? అని నాథునిభావన.

---

* చిత్రమీమాంసలో అప్పయ్యదీక్షితుడు సర్వస్వకారుని భేద సంఖ్యానమును ఈవిధంగా అందిస్తున్నాడు. పైన చెప్పిన విధంగా ౯౬ విధాలలో ౪౦ తగ్గించి వాచ్యోత్ప్రేక్ష ౫౬ విధాలని, గమ్యోత్ప్రేక్ష ౪౦ విధాలని, మొత్తము రెండూ కలిస్తే మళ్లీ ౯౬ విధాలవుతుందని, ఆతనిసూచన - చూడండి. సర్వస్వకారమతంలో ద్రవ్యానికి స్వరూపోత్ప్రేక్షణమే కాని ఇతరములు ఉండవు. కనుక ౯౬ లో ౧౬ భేదాలు తగ్గించాలి. ఇంకా హేతుఫలోత్ప్రేక్షలలో నిమిత్తము ఉండి తీరాలి కాబట్టి ౨౪ తగ్గించాలి. ఈవిధంగా ౪౦ తగ్గగా, స్వరూపోత్ప్రేక్ష ౩౨, హేతూత్ప్రేక్ష ౧౨, ఫలోత్ప్రేక్ష ౧౨. మొత్తం వాచ్యోత్ప్రేక్ష ౫౬ అవుతుంది. ప్రతీయమానకు కూడా ఈవిధంగానే పరిగణనము. అయితే దీనిలో నిమిత్తము అనుపాత్తము కావడమంటూ ఉండదు. కాబట్టి స్వరూప ౧౬. పూర్వముమాదిరి హేతు ౧౨. ఫల ౧౨. మొత్తము ౪౦ గమ్యోత్ప్రేక్షాభేదాలు. వీనితో వాచ్యభేదాలు ౫౬ కలిపితే మొత్తం ౯౬ సంఖ్య సిద్ధమవుతున్నది. అని విద్యానాథుని మాటను కుదర్చడానికి దీక్షితుడు అటు త్రిప్పి ఇటు త్రిప్పి ౯౬ భేదాలు సాధించినట్లుగా

ఈచెప్పిన భేదాలకు యథాసంభవముగా ఉదాహరణములు ప్రదర్శితము లవుతవి. ముందుగా జాతిస్వరూపోత్ప్రేక్ష ఉదాహృత మవుతుంది.

గుణనిమిత్తము

కీర్తిః కాకతివీరరుద్రనృపతేః సింహాసనాధ్యాసినః
ప్రాచాం భూమిభుజాం యశః పిదధతీ కోటీందుతుల్యద్యుతిః
రక్షోదక్షిణరాజలాభజనితామందప్రమోదోత్థితా
త్రైలోక్యాట్టహాసప్రభేవ కకుభాం ప్రాంతేషు విద్యోతతే.

దీని భావ సమన్వయములు ఉపమాప్రస్తావములో నిరూపితము లయినవి. దీనిలో ప్రమోదగుణము నిమిత్తముగా ఉన్నది. ప్రభాశబ్దము జాతివచనము. మామూలుగా అట్టహాసప్రభ అనేది స్వతస్సిద్ధ మయినా మూడులోకాలకు

ఉన్నది. సర్వస్వకారమతంలో ప్రతీయమానోత్ప్రేక్ష ౪౦ కాదు. ౪౮. ఈవిషయమును సర్వస్వవ్యాఖ్యాత జయరథుడు విమర్శినిలో స్పష్టంగా ప్రదర్శించాడు. అలంకారసర్వస్వకర్త అయిన రాజానక రుయ్యకుడు అలంకారానుసారిణి అనే గ్రంథంలో "ప్రతీయమానోత్ప్రేక్షాభేదా అష్టచత్వారింశత్" అన్నాడట. ఇంతకూ దీక్షితవచనము పొరపాటు. ఇంకా దీక్షితుడు ద్రవ్యానికి స్వరూపోత్ప్రేక్షణము తప్ప హేతుఫలోత్ప్రేక్షలు ఉండనే ఉండవు అనే గట్టినమ్మకంతో చాలా భేదాలు తగ్గించాడు. ఇది సర్వస్వకారునకు సమ్మత మయిన భావం కాదు. ద్రవ్యానికి ఏదో ప్రాయః హేతుఫలోత్ప్రేక్షలు ఉండవు అని అంటున్నాడే కాని అసలు ఉండనే ఉండవు అని అనడంలేదు. "తత్రాపి ద్రవ్యస్య ప్రాయః స్వరూపోత్ప్రేక్షణమే వేతి" అని రుయ్యకుడు "ప్రాయః" పదమును వాడితే దానిని చిత్రమీమాంసాకర్త జారవిడిచాడు. ద్రవ్యానికికూడా హేతుఫలములు ఎక్కడనయినా ఒక్కొక్కచోట ఉంటే ఉండవచ్చునని రుయ్యకభావము. కనుకనె అలంకారానుసారిణి గ్రంథంలో రుయ్యకుడు హేతుఫలసంభవమును ప్రదర్శించాడట. జయరథవ్యాఖ్యలో ఇదంతా విశదంగా ఉంది.

సంబంధించిన అట్టహాసప్రభ కవికల్పితమె కాబట్టి ఉపమ అనే శంక ఇక్కడ రాదు. అందువలన ఈపద్యంలో ఉన్న 'ఇవ' శబ్దముకూడా సంభావనావాచకమె కాని ఉపమావాచకము కాదు. ఉపమానాంశము లోకసిద్ధ మయినపుడు ఇవ శబ్దము సాధర్మ్యమును సూచిస్తుంది. ఉపమానాంశము లోకసిద్ధము కాక కవికల్పిత మయినపుడు ఇవశబ్దము సంభావనాపర మవుతుంది అని ప్రాచీనులు నిరూపిస్తున్నారు. కీర్తి స్వరూపము అట్టహాసప్రభగా ఇక్కడ ఉత్ప్రేక్షితము.

## క్రియానిమిత్తము

వీరస్య రుద్రనృపతేః ప్రియవల్లభస్య
రాజ్యాభిషేకసలిలైః సరసీకృతాయాః
సద్యః సముచ్ఛలితసాంద్రపరాగరేఖా
క్షోణ్యాః ప్రమోదపులకాంకురమంజరీవ.

ఇష్టప్రియుసి కలిగిన ప్రతాపరుద్రుని రాజ్యాభిషేకోదకములచేత సరసీకృత అయిన భూమికి అపుడే బయలుదేరిన దట్టమయిన పరాగరేఖ ఆనందపులకాంకురముల మంజరివలె ఉన్నది. దీనిలో పరాగరేఖ విషయము. పులకమంజరి విషయి. 'ఇవ' సంభావనావాచకము. సరసీకరణము క్రియారూప మయిన నిమిత్తము. కాగా సరసీకరణము నిమిత్తముగా ఉన్న పులకాంకురమంజరీ తాదాత్మ్య సంభావనలో పరాగవిషయముగా ఉన్నది. అని ఈవిధంగా ఉత్ప్రేక్షా స్థలంలో అంతటా బోధస్వభావమును గుర్తించాల.

## అనుపాత్తనిమిత్తము

ప్రతాపరుద్రస్య నఖేందుకాంతిః ప్రణామభాజాం పదయో ర్నృపాణాం
లలాటలగ్నా విధినిర్మితాయాః వర్ణావలేః వాచనదీపికేవ.

ప్రతాపరుద్రుని నఖేందుకాంతి, పాదాలపై ప్రణామము చేస్తున్న రాజుల లలాటములందు విధి వ్రాసిన వర్ణావలికి వాచనదీపిక వలె ఉన్నది. నఖ కాంతి విషయము. వాచనదీపిక విషయి. ఇవ వాచకము. 'దీపికేవ' అని జాతి ఉత్ప్రేక్షిత మయింది. నిమిత్తము ఉపాత్తము కాలేదు.

## గుణనిమిత్త జాత్యభావము

ప్రతాపరుద్రస్య గుణామృతోర్మి ధౌతా విరాజం త్యమలీకృతాంగాః
ప్రక్షాళితాత్యుద్ధత భూమిపాలా ఖడ్గాంబుభిః స్వచ్ఛతరా భవంతి

ఈ పద్యార్థము నాదృష్టిలో సుసమన్వితముగా కనపడడము లేదు. వాచ్యోత్ప్రేక్షాప్రస్తావములో సంభావనా వాచకము లేని ఉదాహరణము ఎందుకు వచ్చిందో? ఈ పద్యాన్వయమును కుదర్చడానికి పాఠక పండితులు నానా విధంగా పాఠమును సవరించారు. ''ప్రతాపరుద్రస్య గుణామృతోర్మిధౌతేవ రాజత్యమలీకృతాంగా'' అని ఒకరిసవరణ. ''స్వచ్ఛతరాభవంతీ''అనిన్నీ ఏకవచనంగా చివర దిద్దుబాటు. ఈ పక్షంలో కీర్తిని అధ్యాహారం చేసికొని (లేని దానిని తెచ్చి పెట్టుకొనుట) అన్వయమును సంపాదించాలి. ప్రతాపరుద్రుని కీర్తి, గుణామృతతరంగాలచేత కడుగబడి ఖడ్గోదకములచేత ఉద్ధతరాజులను ప్రక్షాళనము చేసినదై స్వచ్ఛముగా అవుతూ అమలీ కృతావయవములు కలదిగా ఉన్నది. అని ఏదో ఒక భావము. మలీకృతాంగత లేక పోవడము జాత్యభావమని స్వచ్ఛమగుట గుణము నిమిత్తమని సమన్వయించుకోవాలి. ''ప్రక్షాళితా వ్యుద్ధత భూమిపాలాః ఖడ్గాంబుభిఃస్వచ్ఛతరా భవంతి'' అని పూర్వార్థము కంటె ఉత్తరార్థము వేరు అని భావించే కొందరి సవరణ. కీర్తిని అధ్యాహారం చేసికోవడం

కంటె ఉన్నదానినే ఏదోవిధంగా కుదుర్చుకొంటే బాగుం టుంది. సంభావనా వాచకమును పద్యములో సూచించడానికి చివర "భవంతి" తీసివేసి "ఇవాజౌ" అని ఏర్పాటు చేస్తే సరి. "సంయతి వీరవర్యాః" అని నాల్గవ పాదంలో పాఠాంతరం ఉన్నట్లు ముద్రిత గ్రంథాలె చెప్పుతున్నవి గదా! ఆజా= యుద్ధములో భూమి పాలకులు అమలీకృతాంగులై విరాజిల్లు తున్నారు అని అర్థం లభిస్తుంది. అని మా మిత్రకవి ఘట్టి లక్ష్మీనరసింహశాస్త్రి సూచన. ఈ భాగము మూలములో ఏమయినా కొంచెము గ్రంథ పాతము ఉన్నదేమో ? అని పిస్తుంది. ఉన్నదానికి ఒక సమన్వయము అవసరము కదా !

## అనుపాత్త నిమిత్త జాత్యభావము

దిశాం జేతుః విశ్వప్రథితమహసో రుద్రనృపతేః
జయప్రస్థానోద్య త్కరితురగ సంమర్ద జనితం
రజః కృత్వా గ్రస్తప్రతిబల మసూర్యా మివ దివం
ప్రతాపాఖ్యా నన్యాన్ దిశి దిశి విధత్తే దినకరాన్.

రుద్రనృపతి దిగ్విజేత. ప్రపంచ ప్రఖ్యాత పరా క్రముడు. ఆతని జయప్రస్థానములో గజాశ్వసంమర్దము వలన పుట్టిన పరాగము శత్రు బలమును ఆక్రమించి ఆకాశ మును అసూర్యముగా చేసి ప్రతి దిక్కులోనూ ప్రతాప మన్న పేరుతో ఇంకా సూర్యులను సృష్టిస్తున్నది. "దివం అసూర్యా మివ కృత్వా" అనే అంశములో అనుపాత్త నిమిత్త మయిన జాత్య భావస్వరూపోత్ప్రేక్ష ఉన్నది. సూర్యుడు జాతి. సూర్యాభావము జాత్యభావము. ఈ అయిదూ జాతి స్వరూపోత్ప్రేక్షాపరముగా నిర్దిష్టము లయినవి.

## జాతి హేతూత్ప్రేక్ష

ఉదారరీత్యా భుజయా ప్రతాప రుద్రస్య విశ్వైకధురంధరస్య
విశ్వంభరా కోమలశయ్యయేవ విస్మారితా గోత్రమహీధ్రవాసం

విశ్వైకధురంధరు డయిన ప్రతాపరుద్రుని ఉదార స్వభావము కలిగిన భుజముచేత కోమలశయ్యచే వలె భూమి కులపర్వత నివాసమును మరచి పోయేటట్లుగా చేయబడింది. శయ్య జాతివచనము. పర్వతనివాసమును మరచి పోవడములో కోమలశయ్య హేతువు కాకపోయినా హేతువుగా నిరూపిత మయినందు వలన జాతి హేతూత్ప్రేక్ష. పర్వత నివాస విస్మరణము నిమిత్తము.

## జాత్యభావ హేతూత్ప్రేక్ష

భూమే రకల్పవృక్షత్వాదివ ధాతా విచింతయన్
సృష్టవాన్ కాకతీశానం నిర్వ్యాజ త్యాగవైభవం.

భూమి కల్పవృక్షములు లేకుండా ఉన్నందువలన కాబోలు విధాత విచారించి కపటము లేని త్యాగ వైభవము కల కాకతీశ్వరుని సృజించెను. కాకతీశ్వర నిర్మాణములో భూమి కల్పవృక్ష రహితము కావడము హేతువు కాదు. అయినా హేతువుగా వర్ణితమయినందువలన హేతూత్ప్రేక్ష. ఫలరూప మయిన కాకతీశ్వరసృష్టి నిమిత్తము. అకల్పవృక్షత్వము జాత్యభావము. అది హేతువు.

## జాతిఫలోత్ప్రేక్ష

నూనం విశ్వంభరాధార స్తంభీభవితు మాయతౌ
వీరరుద్రనరేంద్రస్య భుజా వాజానులంబినౌ.

వీరరుద్రుని ఆజానులంబి భుజములు భూమికి ఆధార స్తంభములగుటకు దీర్ఘము లయినవి. నిశ్చయము. స్తంభీ

భవనము ఫలము కాకపోయినా ఫలముగా ఉత్ప్రేక్షిత మయింది. ఆయతత్వమనే గుణము నిమిత్తము. సమన్వయము స్పష్టము. స్తంభము జాతి. ఫలముగా నిరూపిత మయింది.

### జాత్యభావఫలోత్ప్రేక్ష

పశూ నవధ్యా నాలోక్య శత్రవః కాకతీశితుః
ప్రాయేణామానుషత్వాయ తృణవృత్తిం సమాశ్రితాః

ప్రతాపరుద్రుని శత్రువులు పశువులు అవధ్యములు అని తెలుసుకొని మానుషత్వము లేకుండుటకు తృణవృత్తిని ఆశ్రయించారన్నట్లుగా ఉన్నది. అమానుషత్వము జాత్యభావము. అమానుషత్వాయ అని చతుర్థీ విభక్త్యంతముగా నిర్దిష్ట మయినందు వలన ఫలముగా ఉత్ప్రేక్షింప బడడము స్పష్ట మవుతున్నది. తృతీయా విభక్తి కాని పంచమీ విభక్తి కాని ఉంటే హేతుత్వము గోచరమవుతుంది. ఒక్కొక చోట ఈ విభక్తులు లేక పోయినా హేతుత్వము సామర్థ్యము వలన వ్యక్త మవుతుంది. కాని ఇవి ఉంటే స్పష్ట గోచరమవుతుంది. ఇదే విధంగా చతుర్థీ విభక్తి ఫలమును గోచరము చేస్తుంది. ఈ పద్యంలోని ఉత్ప్రేక్షలో తృణవృత్తిని ఆశ్రయించుట అనే క్రియ నిమిత్తము. ఇంతవర కేదో సామాన్యంగా జాత్యుత్ప్రేక్షలు నిరూపితములయినవి. ఊహాబలాన్ని అనుసరించి సంఖ్యానించితే చాలా ఉత్ప్రేక్షా భేదములు సిద్ధములయినవి. కాని వీనిని అన్నింటినీ లక్ష్యములలో నిర్దేశించడము కష్టము. ఆ ప్రక్రియ దురవబోధంగా ఉంటుంది కూడాను. ఇక కొన్ని క్రియోత్ప్రేక్షలు నిరూపితము లవుతవి.

### క్రియాస్వరూపోత్ప్రేక్ష

శ్రీకాకతీయనృపతేః ద్విషదంగనానాం
శ్వాసోర్మిభిః సపది మర్మరితాంతరాళాః

త్తాసాం నివాసవిధయే కృతయాచనానాం
ప్రత్యుత్తరాణి దదతీవ మరో ర్వనాంతాః

ప్రతాపరుద్రుని శత్రుస్త్రీల యొక్క నిశ్వాస తరంగములచేత మధ్య భాగాలలో మర్మరధ్వనులు కలవిగా చేయబడిన ఎడారుల లోని వనాంతములు వనంలో నివసించడానికి యాచిస్తూ ఉన్న వాళ్లకు ప్రత్యుత్తరములు ఇస్తూ ఉన్నట్లుగా ఉన్నవి. దీనిలో దదతీవ అని దాన క్రియా స్వరూపము ఉత్ప్రేక్షిత మయింది. మర్మరితాంతరాళాః అని మర్మర ధ్వని కలిగి ఉండడము గుణ రూపమయిన నిమిత్తము.

## క్రియా ఽభావస్వరూపోత్ప్రేక్ష

విముఖే సతి కాకతిక్షితీంద్రే వనసీమాపి కఠోరకంటకాగ్రా
చికురేషు వికర్షతి ప్రతీశాః అదదానేవ నిజాంతర ప్రవేశం.

శత్రువుల విషయమై ప్రతాపరుద్రుడు విముఖుడు కాగానే వనసీమకూడా కఠోరము లయిన కంటకాగ్రములు కలదయింది. తన ఆంతర ప్రవేశమును ఇవ్వని దానివలె శత్రువులను జుట్టు పట్టి లాగుతున్నది. దీనిలో "అదదానేవ" అని క్రియయొక్క అభావము ఉత్ప్రేక్షిత మయింది. వికర్షణము నిమిత్తము. నిమిత్తానుపాదానమునకు మూలములో లక్ష్యము నిరూపితం కాలేదు.

## క్రియా హేతూత్ప్రేక్ష

రాజ్ఞాం గర్వాంకురోద్భేదాః పరిమ్లానా దినే దినే
కాకతీంద్ర ప్రతాపార్క తీవ్రోష్మాభిభవా దివ

రాజుల గర్వాంకురములు ప్రతాపరుద్రుని ప్రతాపమనే సూర్యుని తీవ్రోష్మాభిభవము (తిరస్కారము) వలన

కాబోలు దిన దినము వాడిపోయినవి. అభిభవనక్రియ హేతువుగా ఉత్ప్రేక్షితము కావడములో ఫల రూపమయిన పరిమ్లానము నిమిత్తము.

### క్రియాఽభావహేతూత్ప్రేక్ష

కపోలఫలకా వస్యాః కథం భూత్వా తథావిధౌ
అపశ్యంతా వివాన్యోన్య మీదృశీం క్షామతాం గతౌ.

ఈ భేదానికి మూలములో ఉదాహరణము లేదు. వ్యాఖ్యాత సముచితంగా ఉంటుందని దీనిని అందిస్తున్నాడు. ఈ కన్య కపోలములు ఏదో అయి ఆవిధంగా అయినవి. ఒకటొకటి చూచుకోకుండా ఉండి కాబోలు ఇంతగా చిక్కిపోయినవి. దీనిలో 'అపశ్యంతావివ' అని దర్శన క్రియాఽభావము హేతువుగా ఉత్ప్రేక్షిత మయింది. క్షామత్వము పొందడము నిమిత్తము.

### క్రియాఫలోత్ప్రేక్ష

దంభోళిసంరంభ మహాజిగోపః ప్రస్థానభేరీ నినదోఽస్యభర్తుః
లీనా నివాన్వేష్టు మరాతివర్గాన్ విగాహతే శైలగుహాంతరాణి,

దంభోళి—వజ్రాయుధము. దాని సంరంభమనే మహాజి—మహాయుద్ధము ఇతరతిరస్కారము. దానిని ఆచ్ఛాదించునది దంభోళి సంరంభమహాజిగోపము. మొత్తముమీద అశని ధ్వనిని తిరస్కరించినట్టి అని అర్థము. అటువంటి, ఆంధ్ర ప్రభువు ప్రస్థానములోని భేరీనినాదము ఎక్కడో దాగి కొన్న శత్రువర్గములను వెతుకుటకు కాబోలు పర్వత గుహాంతరములను ప్రవేశించుతున్నది. దీనిలో అన్వేషణక్రియ ఫలముగా ఉత్ప్రేక్షితము. గుహాంతర ప్రవేశ క్రియ నిమిత్తము.

## క్రియాఽభావ ఫలోత్ప్రేక్ష

సీమాద్రి కుంజేషు విహార భాజః సిద్ధాంగనా కల్పిత చంద్రికార్ఘాః
శ్రీవీరరుద్రస్య యశోవిలాసాః గాయంత్యసంస్పృష్టమివాంధకారం

సీమపర్వత నికుంజములలో విహరించే వారు సిద్ధాంగనలు వెన్నెలకు చేసినట్లుగా చేసిన పూజ కల వీరరుద్రుని యశోవిలాసములను, అంధకారమును స్పృశించకుండా ఉండడానికి కాబోలు గానము చేస్తున్నారు. దీనిలో 'అసంస్పృష్టమివ' అని స్పర్శనక్రియాఽభావము ఫలముగా ఉత్ప్రేక్షితమయింది గానక్రియనిమిత్తము. ఇంతవరకు క్రియోత్ప్రేక్షలు.

## గుణస్వరూపోత్ప్రేక్ష

చకాస్తి కాకతీంద్రస్య కృపాలోకన విభ్రమః
ప్రకృతిష్వపి సర్వాసు ప్రసాద ఇవ మూర్తిమాః

కాకతీంద్రుని కృపాదృష్టివిలాసము సర్వప్రకృతులందున్నూ మూర్తిమంతమయిన ప్రసాదము (అనుగ్రహము) వలె ప్రకాశిస్తున్నది. ప్రసాదము గుణము. ప్రసాదతాదాత్మ్య సంభావన ఉన్నందున గుణోత్ప్రేక్ష. ప్రసాదమునకు మూర్తిమాః అని విశేషణము ఉన్నది. ఈ విశేషణము లేకపోతే ఇది ఉపమాలంకారమె కావచ్చు. కాని అధికవిశేషణ స్వీకారము వలన ఇవార్థము సంభావనలోనే పర్యవసానము పొందుతుందని అనాలి.

## గుణాభావస్వరూపోత్ప్రేక్ష

ప్రతాపరుద్రస్య మహాభిషేక పయఃకణైః శీతలితాఖిలాంగా
ప్రశాంతభారార్త ఫణీంద్ర గాఢ శ్వాసానిలోష్మేవ విభాతి పృథ్వీ

ప్రతాపరుద్రుని అభిషేకసమయములోని జలకణముల

చేత చల్లనయిన సర్వాంగములు కలదై భూమి, ఇంత కాలంవరకూ భూభారము చేత పీడితుడయిన ఆదిశేషువు శ్వాసవాయువుల వేడి ప్రశాంత మైనట్లుగా (ప్రశాంత మయిన శ్వాసోష్మకలదిగా) ప్రకాశిస్తున్నది. పైన అభిషేక జలం పడేటప్పటికి శేషుని శ్వాసముల వలన కలిగిన వేడి శాంత మయింది. ఊష్మ గుణము. అది తగ్గినట్లు చెప్పినందు వలన గుణాభావము. అది ఉత్ప్రేక్షితమయింది. పృథ్వి విషయమయిన ధర్మి.

గుణహేతూత్ప్రేక్ష

**జయశ్రియా మాశ్రయతా ముపైతి శ్రీవీరరుద్రస్య రణే కృపాణః**
**జయశ్రియం వైరిమహీపతీనాం సముత్సుకో హర్తు మసూయయేవ**

యుద్ధములో వీరరుద్రుని కృపాణము జయశ్రీలకు ఆశ్రయ మవుతున్నది. అసూయచే కాబోలు శత్రురాజుల జయశ్రీని హరించుటకు సముత్సుకమై ఉన్నది. దీనిలో 'అసూయయేవ' అని అసూయా గుణము హేతువుగా ఉత్ప్రేక్షిత మయింది. ఫలమయిన హరణౌత్సుక్యము నిమిత్తము.

గుణాభావహేతూత్ప్రేక్ష

**జాతా వయం సంపది వీరరుద్ర నరేంద్ర గంభీరిమ గుల్ఫదఘ్నాః**
**ఇత్యప్రమోదాదివ జీవనేషు మాలిన్య మంభోనిధయో భజంతే**

మేము ఇప్పుడు వీరరుద్రుని గాంభీర్యమునకు చీల మండలలోతు కలవార మయినాము అనే అసంతోషము వలన కాబోలు సముద్రములు జీవనములందు (ఉదకములందు) మాలిన్యము (నలుపుదనము, క్లిష్టత) వహించు తున్నవి. దీనిలో 'అప్రమోదాదివ' అని గుణాభావము హేతువు. మాలిన్యము పొందుట నిమిత్తము.

## గుణఫలోత్ప్రేక్ష

ఆశిషాం విషధూమ్రాణాం నైర్మల్యార్థ మివోత్సుకాః
భుజంగ్యః కాకతీంద్రస్య గుణా న్గాతుం సుధాముచః

సర్పములు విషమలినములయినకోరలకు నిర్మలత్వము కొరకు కాభోలు కాకతీంద్రుని గుణములను గానము చేయుటకు సుధను వెలువరించుతున్నవి. దీనిలో 'నైర్మల్యార్థమివ' అని గుణము ఫలముగా ఉత్ప్రేక్షిత మయింది. గుణగానము నిమిత్తము నైర్మల్యము–మాలిన్యము లేకపోవుట అనే అర్థమును బట్టి గుణాభావము ఫలముగా ఉన్నదనుకో రాదు. నైర్మల్యపదము వలన స్వచ్ఛతా రూప మయిన గుణమునే గ్రహించాలి. అదే కవివివక్షితము.

## గుణాభావఫలోత్ప్రేక్ష

అరణ్యవాసోచిత బాంధవాసు మృగీ ష్వవైరార్థ మివాశరణ్యాః
త్రిలింగదేశేశ్వర వైరినార్యః పరాఙ్ముఖా లోచనవిభ్రమేషు

ఆంధ్రప్రభువు శత్రుస్త్రీలు రక్షించేవారు ఎవరూ లేనివారై అరణ్యనివాసములో బంధువులయిన మృగము లందు వైరము లేకుండా ఉండడము కొరకు కాభోలు లోచన విలాసములందు పరాఙ్ముఖులై ఉన్నారు. విలోచనవిలాస విముఖులయిన మృగాంగనలు విలోచనవిలాసినులను చూచి వైరము పొందవచ్చును. ఆ వైరము లేకుండా చేసికొనడానికి వారు విభ్రమవిముఖ లయినారు. దీనిలో 'అవైరార్థమివ' అని వైరాభావ రూపమయిన గుణాభావము ఫలముగా ఉత్ప్రేక్షితము. విభ్రమ విముఖత నిమిత్తము. ఇటు మీాద ద్రవ్యోత్ప్రేక్షలను భావించాలి.

## ద్రవ్యస్వరూపోత్ప్రేక్ష

న నిత్య మస్మిన్ పరిపూర్ణతేతి త్యక్త్వా నభః క్షోణితలావతీర్ణః
ఆనందయన్ ఇందు రివ స్వధామ్నా విభాతి లోకే నవకాకతీంద్రః

ఈ ఆకాశములో నిత్యపూర్ణత్వము లేదని ఆకాశమును విడిచి పెట్టి భూమిలో అవతరించిన చంద్రుడో అన్నట్లుగా నవకాకతీంద్రుడు తన తేజస్సుతో ఆనందపెట్టుతూ లోకములో భాసించుతున్నాడు. దీనిలో 'ఇందురివ' అని ద్రవ్యస్వరూపము ఉత్ప్రేక్షితము. చంద్రుడు ఏకవ్యక్తి. వ్యక్తిభేదము లేకపోతే జాతి అనరాదు అని నియమము. అందువలన చంద్రుడు ద్రవ్యము. ఇందుతాదాత్మ్య సంపాదనము ఇక్కడ ఉన్నందువలన ఉత్ప్రేక్ష. "ఇందురివ కాకతీంద్రః" అని ఉన్నప్పటికీ ఉపమాలంకారమని అనుకోరాదు. ఇక్కడ ఇవ శబ్దము సంభావనా వాచకమె కాని సాదృశ్య వాచకము కాదు. ఇక్కడ చంద్రుడు చంద్రుడుగా స్వతస్సిద్ధుడే అయినా క్షోణితలావతీర్ణుడుగా నిరూపింపబడి నందువలన స్వతస్సిద్ధుడు కాడు. చంద్రుడు భూమిలో అవతరించడము కవికల్పితము. ఉపమానము కవికల్పితమయితే ఇవార్థము సాదృశ్యము కాదు. సంభావనే అవుతుంది. కనుకనే ఉత్ప్రేక్ష అని ఊహించాలి.

## ద్రవ్యస్వరూపాభావోత్ప్రేక్ష

అనన్యసాధారణ దానశౌండే సద్యఃకృతార్థీభవ దర్థిసార్థే
శ్రీకాకతీంద్రే భువి రాజమానే ద్యౌః పారిజాతేన వినాకృతేవ

ఇతరసాధారణము కాని దానశౌండుడూ, వెంటనే యాచకులను కృతార్థులను చేసేవాడూ అయిన కాకతీంద్రుడు భూమిలో ప్రకాశిస్తూ ఉంటే స్వర్గము పారిజాతరహితముగా

చేయబడినట్లయింది. పారిజాతము ఒక్కటే. అది ద్రవ్యము. తదభావము ఉత్ప్రేక్షితము.

### ద్రవ్యహేతూత్ప్రేక్ష

ప్రతాపరుద్రదేవేన క్ష్మాభృత్పక్షవిజృంభితం
సమున్మూలిత మామూలా దపరేణేవ వజ్రిణా

ప్రతాపరుద్రునిచేత ప్రసిద్ధ దేవేంద్రునికంటె అతిరిక్తుడయిన (అపర) దేవేంద్రునిచే వలె క్ష్మాభృత్పక్ష విజృంభణము (పర్వతపక్ష-శత్రురాజబల) సమూలముగా ఉన్మూలనము చేయబడినది. దీనిలో "అపరేణేవ వజ్రిణా" అని ఉండడముచేత ద్రవ్యము హేతువుగా ఉత్ప్రేక్షిత మయినదని గ్రహించాలి. ఉన్మూలనము నిమిత్తము. ఇక్కడ అపర శబ్దము లేకపోయి నట్లయితే ఉత్ప్రేక్ష అయ్యేది కాదు. శబ్దమాత్ర సాధర్మ్యము ఉన్నందు వలన శ్లేష అయ్యేది.

### ద్రవ్యాభావహేతూత్ప్రేక్ష

కాకతీయ ప్రతాపోష్మ విలీనాంగేన మేరుణా
అసువర్ణాచలేనేవ విరించి ర్వ్యాకులీకృతః

ప్రతాపరుద్రుని ప్రతాపము వేడిలో కరిగి పోయిన అవయవాలు కలిగిన మేరువు పర్వతము చేత సువర్ణపర్వతము కానిదానిచే వలె బ్రహ్మ వ్యాకులముగా చేయబడినాడు. బంగారమయితే ఎంతటి నిప్పులో నయినా కరిగి నశించిపోదు. ఇప్పుడు మేరువు ప్రతాపోష్మలో కరిగిపోయి సువర్ణము లేనిది కావడము చేత బ్రహ్మకు వ్యాకులపాటు కలిగింది. సువర్ణాచలము ఏకవ్యక్తి కాబట్టి ద్రవ్యము. అసువర్ణాచలేనేవ అని ద్రవ్యాభావము హేతువుగా అధ్యవసితమయింది. వ్యాకులపాటు నిమిత్తము.

### ద్రవ్యఫలోత్ప్రేక్ష

దుగ్ధార్ణవశతాయేవ కైలాసాచలకోటయే
నూనం ప్రతాపరుద్రేణ యశో దిక్షు ప్రసారితం

నూరు పాలసముద్రాల కొరకు కాబోలు కోటి కైలాస పర్వతాలకొరకు కాబోలు ప్రతాపరుద్రుడు తన యశస్సును దిక్కులలో ప్రసరింప చేసినాడు. యశఃప్రసారము నిమిత్తముగా దుగ్ధార్ణవశతము కైలాసాచలకోటిన్నీ ఫలముగా ఉత్ప్రేక్షితమయింది.

### ద్రవ్యాభావఫలోత్ప్రేక్ష

వీరరుద్రనరేంద్రస్య జయప్రస్థానసంభవం
రజః పిహితదిగ్గోళం నిరాకాశ మివ స్థితం

ప్రతాపరుద్రుని జయప్రస్థానములో ఉత్పన్నమయిన పరాగము దిగ్గోళమును కప్పిపెట్టినదై ఆకాశము లేకుండా చేయడమునకో అన్నట్లుగా ఉన్నది. ఆకాశాభావము ఫలముగా ఉత్ప్రేక్షిత మయింది. దిగ్గోలపిధానము నిమిత్తము. ఇప్పటికి ఏదో యథాసంభముగా ఉత్ప్రేక్షలను ఉదాహరించడ మయింది. ఇంకా కొందరు ఈ అలంకారానికి నానాభేదములను నిరూపించారు. ఉపమతో ఉపక్రమము ఉండే ఉత్ప్రేక్షలు కొన్ని. అపహ్నవ గర్భములయిన ఉత్ప్రేక్షలు కొన్ని. ఈ విధంగా ఎన్నో భేదాలు ఉన్నవి. వానిని అలంకార సర్వస్వము విమర్శిని మొదలయిన గ్రంథాలలో గ్రహించాలి. గమ్యోత్ప్రేక్ష ఇక్కడ ఉదాహృతమె కావడము లేదు. సంభావనావాచకములు లేకపోతే గమ్యమవుతుంది అని నిరూపితమె. ఈ చెప్పిన ఉదాహరణములనె వాచకపదరహితంగా గ్రహించితే ప్రతీయమానోత్ప్రేక్షోదాహరణత్వమును భావించడము కష్టము కాదు.

## అతిశయోక్తి

సాధ్యాధ్యవసాయ మూలక మయిన ఉత్ప్రేక్ష నిర్ణీత మయింది. ఇక సిద్ధాధ్యవసాయ మూలక మయిన అతిశయోక్తిని నిరూపించ వలసి ఉన్నది. అధ్యవసితమునకు ప్రాధాన్యం ఉంటే అతిశయోక్తి అవుతుంది. అధ్యవసాయమును పొందిన వస్తువు అధ్యవసితము. అతిశయోక్తిలో నిగరణము భూతకాలమునకు సంబంధించినది గాను, ఉత్ప్రేక్షలో నిగరణము వర్తమానకాలమునకు సంబంధించినది గానూ ఉంటుంది. అతిశయోక్తిలో అధ్యవసాయమును స్వీకరించడములోని తాత్పర్యమును ఈ విధంగా స్వీకరించ వచ్చు. ఒక వస్తువు వేరొక వస్తువు గర్భప్రవిష్ట మవుతుంది. స్వస్వరూపంతో వేరుగా కనపడదు. వాస్తవ మయిన వస్తువు అన్యవస్తువు యొక్క ఉదరంలోనే ఉండి ప్రతీత మవుతుంది. ఈ వస్తువును ఉదరంలో పెట్టుకొని ఈ విధంగా నిగరణము చేసిన వస్త్వంతరము ఆ స్థలంలో వాస్తవంగా లేదు. అది లోకం హద్దును దాటి ఉంటుంది. ముఖమును చెప్పదలచి కమలము అని ప్రయోగించి నప్పుడు ఈ అంశమునె గుర్తించాలి. అక్కడ కమలము ముఖమును నిగీర్ణము చేసింది. ముఖము స్పష్టంగా శబ్దము వలన ప్రతిభాసించడము లేదు. అది కమలగర్భ ప్రవిష్ట మయింది. కమలము కమలమనే శబ్దముతో ఉపాత్తమై ఉన్నప్పటికి కమలవస్తువు అక్కడ వాస్తవంగా లేదు. వాస్తవ మయిన ముఖమును అవాస్తవంగా నిశ్చయపరచి అవాస్తవ మయిన కమలమును వాస్తవంగా గోచరింప చేస్తూ నిరూపించడ మంతా లోకమార్గమును అతిక్రమించి ఉంటుంది. అందువలననే ఇది అతిశయోక్తి. ఉత్ప్రే

క్షలో ఇట్లా ఉండదు. అది సంభావనా రూపము. ఉత్కట్యైక కోటికమయిన సందేహ మన్నమాట. ముఖము చంద్రుడు అనే రెండుకోటులలో (అంశము) చంద్రరూప మయిన ఒక కోటి యందు సందేహజ్ఞానము యొక్క మొగ్గుదల ఉంటుంది. అంతేకాని అక్కడి జ్ఞానమునకు నిశ్చయరూపత్వము ఉండదు. అందువలననే అది లోకాతిక్రాంతము కాదు. అంతటా అధ్యవసానంలో మూడు సంభవించుతూ ఉంటవి. అధ్యవసాన స్వరూపము విషయము విషయి అని. విషయము విషయిచే కుక్షీకృతమై నిగీర్ణ మయినప్పుడు అధ్యవసాయానికి స్వరూప లాభము ఉంటుంది. విషయానికి స్వరూప ప్రతిపత్తి ఉండదు. సంభావనా వాచకము లయిన "నూనం, ధ్రువం, ప్రాయః" మొదలయిన శబ్దాలచేత అధ్యవసాయము సాధ్య మయినప్పుడు ఉత్ప్రేక్ష అవుతుందని ఇదివరలో నిరూపితము. నూనమాది శబ్దాలు లేకపోతే విషయికే ప్రాధాన్యం ఉంటుంది. అందువలననే అక్కడ అధ్యవసాయము సిద్ధము. ఇటువంటి విషయవివేకమును అవగతం చేసికొన్న తరువాత లక్షణ భావనము చేయుడము యుక్తముగా ఉంటుంది.

విషయస్యానుపాదానా ద్విషయ్యుపనిబధ్యతే
యత్ర సాఽతిశయోక్తి స్స్యా త్కవిప్రౌఢోక్తిజీవితా

ఇది అతిశయోక్తి లక్షణము. ప్రకృతమయిన ముఖాదికము విషయము. దానిని శబ్దముచేత చెప్పనందువలన అంటే; విషయిపదార్థముచేత నిగీర్ణ మయినందువలన, అప్రకృతమయిన చంద్రాది విషయి, ప్రధానముగా నిరూపింపబడినప్పుడు అతిశయోక్తి అవుతుంది. ముత్తెపు చిప్పను చూచి "ఇది రజతము" అని ప్రయోగించిన చోట కూడా

కేవలము విషయి మాత్రమె శబ్దోపాత్త మయినందువలన అతిశయో క్తి అని అనుకోవలసి వస్తుంది. కాని అది అతిశయో క్తి కాదు. అతిశయో క్తిలో కవిప్రౌఢో క్తి జీవ మిచ్చేదిగా ఉండాలి. ఇది రజత మనే చోట కవిప్రౌఢో క్తి జీవితత్వము లేదు. కవిప్రౌఢో క్తి చేత విషయమును తిరోధానించి విషయి నిబంధింపబడి నప్పుడు అతిశయో క్తి అవుతుంది. ఇటువంటి ఇది నాలుగు విధాలు.

౧. భేదమున్నా అభేదము చెప్పడము
౨. అభేదమున్నా భేదమును చెప్పడము
౩. సంబంధము ఉన్నా అసంబంధము చెప్పడము
౪. అసంబంధము ఉన్నా సంబంధము చెప్పడము

కార్యకారణములకు పౌర్వాపర్యమును విపర్యయముగా చెప్పడము (ముందు వెనుకలను మార్చి చెప్పడము) రూపముగా ఉన్న దానినికూడా అతిశయో క్తి అని అంటున్నారు. కాని అది అధ్యవసాయ మూలకము కాదు. కాబట్టి ఇది పూర్వము చెప్పిన వానికంటె వ్యతిరి క్తము. అయినప్పటికీ కవిప్రౌఢో క్తి మూలకముగా ఉన్నందువలన అతిశయో క్తి అని వ్యవహారము కలిగింది.

## ౧ భేదమున్నా అభేదము

స్థానే కల్పతరు ర్జాతః కాకతీయ మహోదధేః
లక్ష్మీపతి రసౌ చిత్రం మర్త్యరూప మహోత్సవః

కాకతీయ వంశమనే సముద్రమునుండి కల్పతరువు ఉత్పన్నమయింది. ఇది యు క్తమె. కాని ఈ పుట్టినట్టిది మానవులకు మహోత్సవముగాను లక్ష్మీపతిగానూ ఉండడము చిత్రముగా ఉన్నది. సముద్రమునుండి కల్పతరువు పుట్టడము

యుక్తమె. లక్ష్మి కూడా సముద్రము నందె పుట్టింది. కల్ప తరువు లక్ష్మీదేవికి సోదరభావంతో ఉండడము అమర్త్యులకు మహోత్సవము కావడమూ యుక్తము. కాని ఈ కల్పతరువు ఈ విధముగా కావడము మాత్రము చిత్రము అని పద్య భావము. ఈ పద్యము ప్రథమపాదములో కల్పతరుపదము విషయివాచకము. దానిచేత ప్రతాపరుద్రుడు అధ్యవసితు డయినాడు. విషయమయిన ప్రతాపరుద్రుడు శబ్దోపాత్తము కాలేదు. ఇక్కడ అధ్యవసిత కల్పవృక్షమునకే ప్రాధాన్యము ఉన్నందు వలన అతిశయోక్తి. కల్పతరువునకూ ప్రతాపరుద్రు నకూ వాస్తవంగా భేదము ఉంది. అయినా అధ్యవసాన ప్రభావం వలన అభేదము గోచర మవుతున్నది. కాబట్టి ఇది ప్రథమభేదోదాహరణము. "కాకతీయమహోదధేః" అనేది ప్రకృతోదాహరణము కాదు. అది రూపకమె అవుతుందని స్పష్టమె. మొత్తం మీద దీనిలో ప్రతాపరుద్రకల్పవృక్ష ములకు అభేదాధ్యవసాయము ఉన్నదని గ్రహించాలి.

ఈ పద్యంలో కాకతీయమహోదధేః అని రూపకము ఉంది. దాని బలం వలన 'కల్పతరు ర్జాతః' అనే చోట కూడా రూపకమునే సాధించుకోవలె గదా! ఒకే పద్యంలో అఖండంగా వాక్యార్థమును భావన చేయవలసిన అవసరం ఉన్నప్పుడు ఐకార్థ్యమునకు భంగం లేకుండా రూపకమె అని అనడము బాగుంటుందేమో? అని శంకించడానికి అవకాశం లేకపోలేదు గాని లక్షణసమన్వయము కోసరము ఖండ రూపంగా భావించి అభేదాధ్యవసాయముతో అతిశయోక్తిని నిశ్చయించుకోవాలి.

## ౨ అభేదమున, భేదము

ఔన్నత్యం మహ దన్యదేవ మహితః కోప్యేష గంభీరిమా
కాప్యన్యా సరణిః ప్రతాపయశసో రన్యైవ బాహ్వోః ప్రథా
సర్వం నూతన మేవ రుద్రనృపతే ర్జానే న తన్నిర్మితౌ
సామగ్రీ చతురాననేన కియతీ కీదృక్క్రమా కల్పితా.

ఇది నిరూపితార్థమె. దీనిలో ఔన్నత్యము గంభీరిమ మొదలయిన వానికి వాస్తవంగా భేదము లేకపోయినా 'అన్య దేవ కోపి' అని చెప్పడము చేత కాల్పనిక మయిన భేదము ఉన్నది. అందువలన సమన్వయము విశదము. ఈ భేద ములో కేవలమూ ఈ రూపంగానే సమన్వయము చెప్పు కొంటే అసలు అధ్యవసాయ లక్షణము సుసంగతమయి నట్లుగా లేదుకదా! ఇది ఎట్లా కుదురుతుంది? అనే సందే హము కలుగ వచ్చు. అపుడు ఈ అభిప్రాయముతో సమ న్వయమును దర్శించాలి. ఈ అతిశయోక్తి అలంకారభేదా లలో అంతటా కవిప్రతిభా నిర్మితమయిన అతిశయము కన్ప డుతూ ఉంటుంది. ఈ అతిశయరూపమయిన ఫలమె అతిశ యోక్తిలో ప్రయోజకముగా ఉంటుంది. అదె ఇక్కడ నిమి త్తము. ఈ భేదాలలో ఈ అతిశయాఖ్యఫలమునే కవి ప్రధా నంగా ప్రతిపాదింప దలచి ఉంటాడు. ఇట్లా కవి ముఖ్య తాత్పర్యవిషయమైన నిమిత్తమునందె అధ్యవసాయమును గ్రహించాలి. ఔన్నత్యం మహాదన్యదేవ అన్నపుడు వాస్త వము స్వతస్సిద్ధమయిన ఔన్నత్యము ఒకటిన్ని కవిసమర్పిత మయిన ఔన్నత్యము వేరొకటిన్ని ఉన్నదని గ్రహించాలి. ఫలరూపములయిన ఈ రెండు ఔన్నత్యాలకు భేద మున్నప్ప టికీ అభేదాధ్యవసాయము ఉన్నదని గ్రహించాలి. అంతే కాని ఆఫలము కలిగిన ఫలి పదార్థములకు (ధర్మి పదార్థము

లకు) అభేదాధ్యవసాయము కుదరదు. వాస్తవంగా భేదము ఉన్నవానికి అభేదము కుదరదు. అందువలన అక్కడ అభేదాధ్యవసాయకల్పన యుక్తము కాదు. ఎక్కడ అతిశయము ఉంటుందో అక్కడే అధ్యవసాయము యుక్తము. ఫలము లోనే అతిశయము ఉన్నది కాబట్టి అక్కడే అధ్యవసాయము. ఇదే విధంగా ప్రథమోదాహరణంలో కూడా గ్రహించాలి. అక్కడ స్వతస్సిద్ధమయిన వదాన్యత్వము ఒకటి కవిప్రతిభాసిద్ధ మయిన వదాన్యత్వము వేరొకటి. ఆ రెండిటికీ అక్కడ అభేదాధ్యవసాయము. అంతటానిమిత్తాంశములోనే అభేదాధ్యవసాయమును అంగీకరించాలి. అంతే కాని రాజకల్పవృక్షములకు అభేదాధ్యవసాయము రాదు. అయితే ఆ శ్లోక సమన్వయ కథన సమయంలో రాజ కల్పవృక్షములకు అభేదాధ్యవసాయము ఉన్నదని చెప్పినమాట సత్యమె. అంతటా ఫలములకె అధ్యవసాయమునుఅంగీకరిస్తూ అక్కడమాత్రము ఫలిపదార్థములకు అభేదాధ్యవసాయమును చెప్పడము విరూపముగా ఉంటుంది. అక్కడ ప్రతాపరుద్రకల్పవృక్షములకు అభేదాధ్యవసాయము అనే మాటను ఫలగతాధ్యవసాయ విషయముగా భావించితే విరోధము ఏమీ లేదు. రెండవ భేదంలో అభేదాధ్యవసాయమును కుదర్చడానికి ధర్మ్యభేదాధ్యవసాయమును అంగీకరించక తప్పడం లేదు. మొదటి భేదంలో ధర్మిఅధ్యవసాయము రెండవభేదంలో ధర్మ్యధ్యవసాయము అనే రీతి యుక్తంగా ఉండదు. అంతటా ఒకే విధముగా ధర్మ్యధ్యవసాయమును గ్రహించడమె సమంజసము.

## ౩ సంబంధములో అసంబంధము

శిలా చింతారత్నం తరు రమరశాఖీ పశు రసౌ
వియద్ధేనుః సర్వం జగదపి తథా దోషవిధురం
న సృష్టి ర్వైధాత్రీ తదిహ చతురశ్రీః కథ మియం
స్పృశే ద్దేవం రుద్రం సకలగుణసామ్రాజ్యనిలయం.

చింతామణి శిల. కల్పవృక్షము చెట్టు. ఆ కామ ధేనువు పశువు. సర్వజగత్తున్నూ ఇట్లా దోషవివశమై ఉంది. ఇదంతా చూస్తే బ్రహ్మసృష్టిరచన చతురశోభ కలదిగా కన పడడము లేదు. ఇటువంటి ఈ సృష్టి సకలగుణసామ్రాజ్య నిలయుడయిన ప్రతాపరుద్రదేవుని ఏవిధంగా స్పృశిస్తుంది? దీనిలో ప్రతాపరుద్రునకు బ్రహ్మసృష్టిసంబంధము ఉంది. అయినా అసంబంధము నిరూపితమయింది. ఈశ్వరుడు బ్రహ్మసృష్టిని అతిక్రమించినవాడు. వీరరుద్రుడున్నూ బ్రహ్మ సృష్ట్యతీతుడు. కనుక ఆ ఈశ్వరునితో అధ్యవసాయము ఉన్నదని ఊహించాలి. ఇట్లా అధ్యవసాయమును చెప్పితే మొదటి భేదములో మాదిరిగా ధర్మి అధ్యవసాయమునే చెప్పినట్లవుతున్నది. కనుక దీని భావమును ఈ విధంగా గ్రహించాలి. ప్రతాపరుద్రుడు సకలగుణ సామ్రాజ్య నిల యుడు కదా! ఈశ్వరుడూ అటువంటి వాడే. స్వతస్సిద్ధ మయిన గుణాతిశయము కవిప్రౌఢోక్తి సిద్ధమయిన గుణాతి శయము అనే రెండింటికీ అభేదాధ్యవసానము ఉన్నది. ఇటు వంటి నిమిత్తాంశములోని అధ్యవసాయము మూలముగా ఈశ్వర ప్రతాపరుద్రులకు అభేదాధ్యవసాయము ప్రతిభా సిస్తుంది. కాగా ఇక్కడ కూడా పూర్వములో మాదిరిగానే ధర్మ్యధ్యవసాయమును గుర్తించాలి.

## ౪ అసంబంధములో సంబంధము

బ్రహ్మన్! మేరుగిరౌ కృతేపి కిమిదం? నైవంవిధా స్తే ముదః
స్వామిన్! సత్య మధిక్రియాఽద్య ఫలితా యద్వీరరుద్రః కృతః
మిథ్యా కిన్ను వికత్థసే? త్రిజగత స్త్రాణాయ మత్ప్రార్థితః
శంభుః క్ష్మా మవతీర్ణవానితి కథా జాతా హరిబ్రహ్మణోః

ఇది హరిబ్రహ్మల సంవాదాత్మక పద్యము. మొదట హరివాక్యము. ఓ బ్రహ్మ! మేరుపర్వతమును సృజించినా నీకు ఇటువంటి సంతోషములు కలుగ లేదే! ఇదేమిటి? ఇప్పుడు ఇంతగా సంతోషిస్తున్నావు? ఇక బ్రహ్మ సమాధానం చెప్పుతున్నాడు. స్వామి! నిజమె. నా జగత్సృష్టి అధికారము నేడు ఫలించింది. శ్రీవీరరుద్ర నిర్మాణము అయిందికదా! అందువలన ఇంతగా సంతోషపడుతున్నాను. హరి:- ఓహో! అంతా అబద్ధము చెప్పుతున్నావె! నీవా? వీరరుద్రనిర్మాణం చేసింది? సరి సరి!! మూడు లోకాలను రక్షించడానికి నేను ప్రార్థించితే శంభుడు తనంతట తాను భూమికి అవతరించాడు." ఈ విధంగా ఒకనాడు హరిబ్రహ్మలకు కథ సాగింది. దీనిలో హరిబ్రహ్మలకు ఇటువంటి గోష్ఠీసంబంధము లేక పోయినా సంబంధము ఉన్నట్లుగా నిరూపిత మయింది. శంభువుతో కాకతీంద్రునకు అభేదాధ్యవసాయము ఉన్నదని గ్రహించాలి. కేవలము ఈ విధంగానే చూస్తే ధర్మి అధ్యవసాయమె ఉన్నట్లు కన్పడుతుంది. అయినా శివవీరరుద్రులకు అభేదమును గోచరింప చేయడములో నిమిత్తమయిన సర్వలోకరక్షా దక్షత్వ రూపమయిన ధర్మమును భావించి స్వతస్సిద్ధమయిన రక్షాదక్షత్వమునకు కవిప్రతిభా ప్రసూతమయిన రక్షాదక్షత్వమునకూ అభేదాధ్యవసానమును అభ్యూహించాలి. శంభువుతో అభేదాధ్యవ

సాయము అనే మాట ఈ నిమిత్తాధ్యవసాయ మూలకమని గ్రహించితే అన్నిటిలోనూ అనుగతమయిన సమన్వయం లభిస్తుంది.

## ౫ పౌర్వాపర్యవిపర్యయము

ఇది అతిశయోక్తికి అయిదవ భేదము. అధ్యవసాయము దీనిలో ఉండదని మొదటిమాట. ఈ భేదానికి కార్యకారణ పౌర్వాపర్య విధ్వంసము అని పూర్వపు పేరు. కార్యకారణ విధ్వంసము పౌర్వాపర్య విధ్వంసము అని దీనిని విభాగించవచ్చు. కాగా దీనిని అయిదు విధాలుగా గ్రహించడానికి వీలుంది. లోకప్రసిద్ధము లయిన కార్యకారణములను విధ్వంసము చేయడము మార్చి వేయడము అని రెండు విధాలు. పౌర్వాపర్యము అనేది మొదట తర్వాత అన్న క్రమంతో ఉంటుంది. ఇటువంటి ప్రసిద్ధక్రమమును విధ్వంసము చేయడము అటూ ఇటూ మార్పు చేయడము రెండిటినీ సమకాలంలో చెప్పడము అని మూడు విధాలు లభిస్తున్నవి. కార్యకారణముల ముందు వెనుకలను మార్చి వేయుట అనే ఒక భేదమునె ప్రస్తుతము విద్యానాథుడు స్వీకరించినాడు. ఉదా:-

**మాతః కథం కాకతినాథ దృష్టే రగ్రేసరాః కామశరాః పతంతి ?**
**తద్రూపలావణ్యజితః స్మరోపి నూనం గతః కింకరతా మముష్య.**

కామశరపీడ సహించలేక ఒకపిల్ల తనతల్లితో అంటున్నది. అమ్మా ! కాకతినాథుని దృష్టి కంటె ముందుగా మన్మథబాణాలు ఎట్లా పడుతున్నవోనే ? ఆయన రూప లావణ్య పరాజితుడయిన మన్మథుడు కూడా ఆయనకు కింకరుడు అయినాడేమోనమ్మా ! దృష్టిపాతము కారణము. స్మర

శరపాతము కార్యము. మొదట కార్యము ఉండదు. కారణమె ఉంటుంది. దీనిలో వ్యత్యయము ఉన్నది కాబట్టి సమన్వయము *స్పష్టము.

---

* స్పష్టసంబద్ధమయిన ఒక అంశమును ఇక్కడ మీమాంసించ వలసి ఉన్నది. ఈ మీమాంసాఫలముగా తేలే సారాంశ మిది. కార్య కారణ పౌర్వాపర్య విపర్యయరూపమయిన అతిశయోక్తి పంచమభేదము కూడా అధ్యవసాయమూలకమె. మొదటి నాలుగు భేదాలలోనూ అధ్యవసాయమును సమర్థించడానికి నిమిత్తాంశము దాకా ధావనము చేయనక్కర లేదు. అంతటా ధర్మి పదార్థాధ్యవసాయమే సిద్ధమవుతుంది. అన్నిటిలోనూ అధ్యవసిత ప్రాధాన్యమె లభిస్తుంది. కాబట్టి అతిశయోక్తిహాని లేదు. అని విద్యానాధుని అర్థాలంకార భాగరచన కంతకూ అలంకార సర్వస్వము తద్వ్యాఖ్యానమయిన విమర్శిని మూలాధారము. వాఖ్యామూల సారాంశమును తన గ్రంథంలో నిబంధించినాడు. ఎక్కడనయినా ఒక్కొక చోట కొంత అతిక్రమణము ఉన్నప్పటికీ అది అహేతుకము కాదు. ఈ అతిశయోక్తి రచనలో విమర్శినీ సర్వస్వాతిక్రమణమును సూచించే మాటలు కన్పడుతున్నవి. అవి సహేతుకంగా లేవు. ఇటువంటి అతిక్రాంతిని విద్యానాధుడు స్వయముగా చేసి ఉంటాడని అనుకోలేము. ఎవరో కొందరు కొన్ని ఇతరగ్రంధాలనుచూచిన వారు అసంస్కారంతో కొన్ని పంక్తులను విద్యానాధగ్రంథంలో సంబంధింపచేసి ఉంటారు. ఆ రీతినే వ్యాఖ్యాత సోమపీధి కూడా అనుసరించాడు చూడండి.

సర్వస్వకర్త అతిశయోక్తికి అధ్యవసిత ప్రాధాన్యమును అంగీకరించి ఆయిదు ప్రకారములనూ చెప్పి కార్యకారణ పౌర్వాపర్యవిధ్వంసనమును కూడా వానిలోనే కూర్చినాడు. ఈ భేద భేదోదాహరణములను విశదం చేసిన విమర్శినీకర్త అధ్యవసిత ప్రాధాన్యమును కూడా సమన్వయించి ప్రదర్శించాడు. కాబట్టి "కార్యకారణ పౌర్వాపర్య విపర్యయరూపము అనధ్యవసాయమూలము" అనే అర్థమిచ్చే పంక్తి విద్యానాధరచనలో ప్రక్షిప్తమై ఉంటుంది. ఇంకా రెండవ భేదంలో అధ్యవసాయమును సమర్థించడానికి స్వతస్సిద్ధ కవిప్రౌఢోక్తిసిద్ధమయిన ధర్మములను అభేదాధ్యవసాయమును చెప్పడము అసంగతము, పూర్వాపర వచన విరుద్ధమూను. ప్రథమభేదములో ప్రతాపరుద్ర కల్పవృక్షము

ఇంతగా ఇది అపపాఠమని జయరథుడు చెప్పుతూ ఉంటే దానిని ప్రామాణికంగా ఎందుకు గ్రహింపవలసి వచ్చిందో ? సర్వస్వమునకు సంజీవినీవ్యాఖ్యానమురచించిన శ్రీ విద్యాచక్రవర్తి ఫలాధ్యవసాయమును అంగీకరించే

---

లకు అభేదాధ్యవసాయము ఉన్నదని స్పష్టముగా పంక్తిరచన ఉన్నది. అట్లాగే మూడవభేదములో ఈశ్వరునితో వీరరుద్రునకు అభేదాధ్యవసాయము అని, నాలుగో భేదములో శంభువుతో కాకతీంద్రునకు అభేదాధ్యవసాయము అని ధర్మి పదార్థాధ్యవసాయమె నిరూపితమయింది. దీనిని బట్టి రెండవభేదములో చెప్పిన ధర్మాధ్యవసాయ పరమయిన పంక్తి ప్రక్షిప్తమనక తప్పదు.

అయితే వ్యాఖ్యాత సోమపీఠి మూలములో ధర్మి అధ్యవసాయమును చెప్పే వచనాలను కూడా ధర్మాధ్యవసాయ పరంగా సమన్వయించ వలసిందని నిరూపించాడు. ఎందుకై ఆ పండితుడు ఆ సమన్వయమును అందించుతున్నాడు ? అని ఆలోచిస్తే అలంకారసర్వస్వ గ్రంథంలోని ఒక అపపాఠము ఆయనకు కన్పడి ఉండవచ్చు అని తోస్తుంది. సర్వస్వగ్రంథంలో ధర్మాధ్యవసాయందాకా ధావనం చేసిన రచన కన్పడుతున్నది. అది అపపాఠమని విమర్శినీకర్త జయరథుడు చక్కగా నిరూపించాడు. అతని ఆ పంక్తులు ఇక్కడ స్మరించడం అవసరం.

“అతఏవ చాత్రాతిశయ్యాఖ్య మిత్యాదిః తదభిప్రాయేణైవ అధ్యవసిత ప్రాధాన్యం ఇత్యంతశ్చ ఉత్తరకాలికో గ్రంథః స్వమతి జాడ్యాత్ లేఖకై రన్యథా లిఖిత ఇతి నిశ్చినుమః. అయం హి గ్రంథకృతః పశ్చాత్ కైశ్చి ద్విపశ్చిద్భిః పత్రికాభి ర్లిఖిత ఇత్యవగీతా ప్రసిద్ధిః. తతశ్చ తై రనవధానేన గ్రంథాంతరప్రసంగత్వాత్ అనుపయుక్తత్వాద్వా పత్రికాంతరా దయ మసమంజసప్రాయః గ్రంథఖండో లిఖిత ఇతి న పున రేకత్రైవ తత్రైవ “ముఖాదీనాం కమలాద్యై ర్భేదేఽప్యభేదః” ఇత్యుక్త్వాపి “న తు వదనాదీనాం కమలాదిభి రభేదాధ్యవసాయః యోజనీయః” ఇత్యాది వచనం పూర్వాపర పరాహతం అస్య వైదుష్యశాలినో గ్రంథకారస్య సంభావ్యం. ....................ఇత్యలం అసంగత గ్రంథార్థోదీరణేన.”

వాడు కావడము వలన ఆ వ్యాఖ్యానశరణులు అట్లాగే తలచి ఉంటారు. అందువలననే ధర్మి అధ్యవసాయమును నిరూపించే పంక్తులను కూడా ధర్మ్యధ్యవసాయ పరంగానే సమన్వయించారు. కుమారస్వామిసోమపీథి, విమర్శినీగ్రంథమును నిభాలనము చేసిన వాడయినా తండ్రి అయిన మల్లినాథునిపై అభిమానంతో ధర్మ్యధ్యవసాయమును సమన్వయించాడు. మల్లినాథుడు విద్యాధరుని ఏకావళి గ్రంథ వ్యాఖ్యాత. ఆ వ్యాఖ్యానంలో ఆయన సంజీవినీకర్తను బంధువుగా తలచి ఫలాధ్యవసాయమును నిరూపించాడు. సోమపీథిన్నీ తండ్రి అడుగులో అడుగు వేశాడు. అబాల సులభమయిన ఈ ప్రసంగమును ఇంతతో ఆపి ఏతద్విషయ విజ్ఞానమును విమర్శించి విశదము చేయడము యుక్తమని మనవి చేస్తున్నాను.

## ౧౩ సహోక్తి

అతిశయోక్తి సహోక్తి వినోక్తి సమాసోక్తి మొదలయిన కొన్ని అలంకారాలలో ఉక్తి అన్న పదము ఉన్నది. ఈ ఉక్తిసామ్యము వీనికి ఉన్నందు వలన అలంకార నిరూపణములో ఇక్కడ సహోక్తి నిరూపణము అవసర మవుతున్నది. ఇంకా సహోక్తి అతిశయోక్తిహేతుకము. కనుక నే దాని తరువాత దీని నిరూపణము ఉచితము.

సహార్థే నాన్వయో యత్ర భవే దతిశయోక్తితః
కల్పితౌపమ్య పర్యంతా సా సహోక్తి రితీష్యతే.

అతిశయోక్తి వశము వలన సహార్థముతో అన్వయము ఉన్నచోట సహోక్తి అలంకారము అవుతుంది. ఔపమ్యము దీనిలో పార్యంతికముగా (చివర-పర్యవసాన

ములో) గోచరిస్తుంది. ఆ ఔపమ్యము వాస్తవము కాదు. కల్పితము. ఇటువంటిది సహోక్తి అని సామాన్యంగా లక్షణ భావము. రెండు పదార్థములలో ఒక దానికి సహార్థముతో అన్వయము ఉంటుంది. "కీర్తిః శత్రుభిః సహ దిగంతం అగమత్" అనే చోట కీర్తికి శత్రువులకు గమన క్రియా న్వయము ఉన్నది. కీర్తి శత్రువులతో కూడా దిగంతములకు పోయినది అని దాని అర్థము. ఇక్కడ సహార్థముతో అన్వయము. 'సహ' అనే పదమునకు కూడా అని అర్థము. కేవలము సహ పదమె ఉండనక్కర లేదు. సహశబ్దము యొక్క అర్థము కల ఏ పదమయినా ఉండ వచ్చును. సహ పర్యాయములు సాకం సార్థం సమం సహ మొదలయినవి. రెండు పదార్థములకు సహార్థాన్వయము ఉంటే గుణప్రధాన భావం వస్తుంది. ఆ రెండింటిలో ఒకటి ప్రధాన మవుతుంది. వేరొకటి అప్రధాన మవుతుంది. ఒక క్రియలో రెండిటికి సమంగా అన్వయము కలగదు. ఒకటి ప్రధానము, వేరొకటి అప్రధానమూ కాక తప్పదు. 'పుత్రేణ సహ ఆగతః పితా' అనే చోట పితకు ఆగమనక్రియతో సాక్షాదన్వయము ఉన్నది. పుత్రుడు సహార్థముతో సంబంధించి అన్వయము పొందు తున్నాడు. సాక్షాత్తుగా సంబంధించేది ప్రధానము. 'సహ యుక్తేఽప్రధానే' అనే వ్యాకరణ నియమానుసారంగా అప్రధానమునకు సహయోగం ఉంటుంది. సహయోగం ఉన్న దానికి నియమానుసారంగా తృతీయా విభక్తి కలుగుతుంది. 'త్వం అనేన సహ విహర' నీవు ఈతనితో కూడా విహరించు అనేచోట సహార్థయోగం ఉన్నప్పటికీ అంతమాత్రాన అది సహోక్తి అలంకారము కాదు. ఉపమానోపమేయభావము

ఉన్నప్పుడే సహోక్తి అలంకార మవుతుంది. తృతీయాంతము నియమంగా అప్రధానమవుతుంది కాబట్టి ఉపమానము. మిగతా రెండవది విధివిభక్తి కలిగి ఉంటుంది కాబట్టి ఉప మేయము. ఇట్లా రెండిటికీ ఉపమానోపమేయభావం ఉంటే ఇది అలంకారము. ఇక్కడఉండే ఉపమానోపమేయభావము కల్పితమె కాని వాస్తవం కాదు. ఉపమానము అప్రకృతము కావాలి. ఉపమేయము ప్రకృతము కావాలి. అని ఒక నియ మము. ఇక్కడ రెండూ సహార్థసామర్థ్యము వలన ప్రాకరణిక ములు అవుతవి. కొన్నిచోట్ల రెండూ అప్రాకరణికము లె అవుతవి. అందువలన వాస్తవప్రసిద్ధమయిన ఉపమానోప మేయభావం రాదు. వివక్షాధీనమయిన ఉపమానోపమేయ భావం ఉంటుంది. కనుకనే ఇక్కడ భేదప్రధాన సాధర్మ్యము ఉంటుంది. ఇక్కడ రెండుపదార్థాలకు కనపడుతున్న గుణ ప్రధానభావము శబ్దము వలన సిద్ధమయినదే కాని వాస్తవం కాదు. ఇటువంటి గుణప్రధానభావమును అవలంబించి ఉన్న భేదప్రాధాన్యం కూడా వాస్తవం కాదు, శాబ్దమె. సాదృ శ్యము చక్కగా పర్యవసన్న మవుతున్నపుడు భేదము అభే దమూ కనపడవు. ఈ సహోక్తి నియమంగా అతిశయోక్తి మూలమై ఉంటుంది. భేదమున్నప్పటికీ అభేదరూపమయిన అతిశయోక్తి, కార్యకారణ పౌర్వాపర్య విపర్యయ రూప మయిన అతిశయోక్తి సహోక్తిమూలములు. ఇట్లా ఈ అతి శయోక్తి వలననే గుణప్రధానభావంతో అన్వయము వస్తుంది. వైవక్షిక మయిన ఉపమానోపమేయభావము సిద్ధి స్తుంది.

కార్యకారణ పౌర్వాపర్య విపర్యయ రూపమయిన అతిశయోక్తి మూలముగా ఉన్న సహోక్తికి ఉదా :—

అంధ్రక్షమాభృ త్సుభటాసిధారా రణేషు నీలోత్పలపత్రభాసః
పతంతి కంఠేష్వరిభూపతీనాం సాకం సురస్త్రీజన ముక్తమాల్యైః

ప్రతాపరుద్రుని సుభటుల ఖడ్గధారలు యుద్ధాలలో నల్లగలువ కాంతి కలవై దేవతాస్త్రీలు (అప్సరసలు) వేసిన మాల్యములతో పాటు శత్రురాజుల కంఠములందు పడు తున్నవి. దివ్యమాల్యముల వలె ఖడ్గధారలు కంఠములందు పడుతున్నవి అని ఉపమానోపమేయభావము ప్రతీయమాన మవుతున్నది. ఖడ్గధారలు మాల్యములు రెండూ ప్రకృతములె కాబట్టి ఉపమానోపమేయభావము వైవక్షికము. ముందుగా ఖడ్గము కంఠముపై పడితే తరువాత దివ్యమాల్యములు పడుతవి. కృపాణపతనము కారణము. మాల్యపతనము కార్యము. ఈ రెండిటికీ పౌర్వాపర్యము దీనిలో లేదు. రెండూ సమకాలములో జరిగినట్లు నిరూపితము. ఇక సమ న్వయము స్పష్టమే. భేదము ఉన్నప్పటికీ అభేదాధ్యవసా యము చెప్పెడమనే అతిశయోక్తిమూలక మయిన సహోక్తి శ్లేషభిత్తికంగా ఉండవచ్చు. అది లేకుండానూ ఉండవచ్చు. శ్లేషగర్భమయిన అభేదాధ్యవసాయ రూపమయిన సహోక్తి చారుత్వాతిశయమును కలుగ జేస్తుంది. ఉదా:—

దినే దినే రుద్రనరాధిపస్య ప్రతాపలక్ష్మీ రుదయం ప్రయాతి
ప్రకాశితాశేష దిగంతరాళా వివస్వతా సార్థ మనింద్యభాసా.

ప్రతాపరుద్రుని ప్రతాపశోభ ప్రతిదినమున్నూ అశేష దిగంతరాళమును ప్రకాశింపచేస్తూ పవిత్ర తేజస్సుకల సూర్యు నితో పాటు ఉదయము (అభ్యుదయము) పొందుతున్నది. సూర్యుడు ఉదయపర్వతము పొందుతున్నాడు. ఇక్కడ ఉదయ శబ్దము రెండు అర్థాలు కలది. ఉదయపర్వతము అభ్యు

దయము అనేవి రెండూ పరస్పరము భిన్నములే అయినా అభేదము అధ్యవసిత మవుతున్నది. అందువలన శ్లేషభిత్తికా భేదాధ్యవసాయము ఇక్కడ సహోక్తిమూలము అయింది. ఇంకా భేదాలను ఇతరగ్రంథాలలో చూడవలసిందే.

## ౧౪ వినోక్తి

సహోక్తికి వినోక్తి ప్రతిపక్షముగా ఉంటుంది. కనుకనే ఇది అవసరప్రాప్త మయింది.

> వినా సంబంధి యత్కించి ద్యత్రాన్యస్య పరాభవేత్
> అరమ్యతా రమ్యతా వా సా వినోక్తి రితి స్మృతా

సంబంధించి ఉన్న ఒకవస్తువు లేనందువలన ప్రతిసంబంధి వస్తువునకు రమ్యత కలిగినా అరమ్యత కలిగినా వినోక్తి అవుతుంది. ఒకవస్తువు యొక్క అసాన్నిధ్యం వలన వేరొక వస్తువు రమ్యము కాని అరమ్యము కాని అయితే వినోక్తి అన్నమాట. ఇది రెండు విధాలు. అరమ్యత అని. రమ్యత అని. ఉదా:—

> ప్రతాపరుద్రదేవస్య గుణవర్ణనయా వినా
> కీదృశీ కావ్యరచనా సంశృణుధ్వం కవీశ్వరాః

ప్రతాపరుద్రుని గుణవర్ణన లేకపోతే ఇంకా కావ్యరచన ఏమిటి? కవీశ్వరులంగరూ ఈ మాట బాగా వినండి! ఆ గుణవర్ణన లేకపోతే కావ్యరచన రమ్యము కాదు అని భావము. ప్రతాపరుద్ర గుణవర్ణనము లేకపోతే కావ్యశ్రీకి అశోభనత్వము నిరూపిత మయింది. కాబట్టి కావ్యశోభను కాంక్షించే కవులు ప్రతాపరుద్రుని గుణాలనే వర్ణించాలి అని విధియే ప్రకాశిత మవుతున్నది.

కలాపూర్ణే నిత్యం జయతి జగతీందౌ త్రిజగతో
వపుష్మ త్యానందే విమలవిభవే రుద్రనృపతౌ
వినా లక్ష్మ ప్రాప్య ప్రతిదివసపూర్ణాం నిజతనుం
ప్రకాశః స్యా దిందు ర్యది దివి భవే త్సోపి సుభగః

నిత్యమూ కలాపూర్ణుడు భూలోకచంద్రుడు మూడు లోకాల మూర్తమయిన ఆనందము విమలైశ్వర్యశాలి అయిన రుద్రభూపతి సర్వోత్కర్షగా విలసిస్తూ ఉంటే చంద్రుడు కళంకము లేకుండా ప్రతిదివస పరిపూర్ణమయిన నిజతనువు పొంది ఆకాశంలో ప్రకాశించే వాడయితే ఆతడు కూడా సుభగుడు కావచ్చు. దీనిలో ప్రతాపరుద్రుడు ప్రకాశిస్తూ ఉంటే చంద్రునకు కలంకము లేక పోయినపుడు శోభనత్వము ఉంటుందని నిరూపితము. సకలగుణశాలి అయిన ప్రతిపక్షుని ఎదుట అటువంటి గుణాలుంటేనే రమ్యత. లేకపోతే లేదు. చంద్రుడు ఆ విధంగా అయితే అరమ్యత్వము ఉండదని చెప్పినందువలన ఇది రమ్యతకు లక్ష్యము.

౧౨. సమాసోక్తి

"సమాసేన ఉక్తిః సమాసోక్తిః" చెప్పవలసిన దానిని సంక్షేపముగా చెప్పితే సమాసోక్తి అవుతుందని భావము. రెండు అర్థములను సంక్షేపముగా చెప్పడము ఉంటుంది అన్న మాట. ప్రస్తుతార్థము వివక్షితము. దానిని చెప్పేటపుడు అప్రస్తుతము కూడా చెప్పబడి నట్లయితే సమాసోక్తి అవుతుంది. అని శబ్దసామర్థ్యము వలన లభించే అర్థము.

విశేషణానాం తౌల్యేన యత్ర ప్రస్తుతవర్తినాం
అప్రస్తుతస్య గమ్యత్వే సా సమాసోక్తి రిష్యతే

ప్రస్తుతార్థమునకు అనుకూలములై ప్రవర్తించుతున్న విశేషణములు అప్రస్తుతార్థానికి కూడా అనుకూలములై

ఉండడము చేత తౌల్యము ఉంటుంది. ఇటువంటి విశేషణ తౌల్యము చేత అప్రస్తుత వృత్తాంతము గమ్యము అయినట్ల యితే సమాసోక్తి అలంకారము అని అనడము యుక్తము ప్రకృతవిశేషణ సామ్యము వలన అప్రస్తుతము గమ్యమౌ మయితే అది సమాసోక్తి. దీనిలో ఉండే విశేషణసామ్యము మూడువిధాలు. శ్లిష్టవిశేషణసామ్యము సాధారణమయిన విశేషణసామ్యము ఔపమ్యగర్భమయిన విశేషణ సామ్యము అని. ఒకే పర్యాయము ఒకే శబ్దమును ఉచ్చరించగా అర్థ ద్వయము ప్రతీతమయితే అది శ్లిష్టము. ఏదయినా ఒక విశే షణము ప్రస్తుతమును అప్రస్తుతమును చెప్పడములో సమాన ముగానే ఉంటే సాధారణ విశేషణ మవుతుంది. ఇటువంటి విశేషణము ఏ అర్థములో ప్రవర్తించడాని కయినా ఒకే నిమిత్తముతో ఉంటుంది. ప్రవృత్తి నిమిత్తము ఇక్కడ భిన్న భిన్నముగా ఉండదన్నమాట. ఔపమ్యగర్భితమయిన సమాస విశేషణమును ఆశ్రయించిన విశేషణమయితే ఔపమ్యగర్భ విశేషణము అంటారు.

## ౧ శ్లిష్టవిశేషణ సామ్యము

సద్యో విశ్లథమేఖలాం పులకితాం ఋజ్వీం తనుం బిభ్రతీ
రాగా దంధ్రపతేః కృపాణలతికా గృహ్ణాతి కంఠే ష్వరీన్
తద్యోగా దనురక్తభావ వివశాః సంమీలితాక్షా శ్చిరం
శూన్యాంతఃకరణా భజంతి ఖలు తే భావస్థితిం కామపి

విశ్లథమేఖల=ప్రయోగానుకూల మయిన కంఠరజ్జువు కలది. జారి పోయిన మొలనూలు కలది. పులకిత=ఛాయలు కలది, రోమాంచము కలది. ఋజ్వీ=వంకర లేనిది, రణ యందు పెడమోము పెట్టనిది. రాగ=ఎరుపు దనము, అను

రాగము, అనురక్తభావ వివశాః=అనువృత్త మయిన రక్తము ల స్వరూపము ఉన్నందువలన పరవశులు, అనురాగ భావము చేత పరవశులు. ఈ అర్థములను అనుసరించి చూస్తే ప్రకృ తార్థము : ఆంధ్రభూపతి యొక్క కృపాణలత ప్రయోగాను కూల మయిన కంఠరజ్జువు కల ఛాయలు కలిగిన వంకర లేని శరీరమును ధరించి శత్రువులను కంఠములందు పట్టుకొంటు న్నది. ఆ కృపాణలతా సంబంధము వలన, ఆ శత్రువులు అనువృత్తమయిన నెత్తురు కలస్వరూపము ఉన్నందు వలన పరవశులై నేత్రాలు మూసికొని శూన్యాంతఃకరణులై చెప్పడానికి వీలుకాని భావస్థితిని అంటే వినాశమును పొందు తున్నారు. ఇది ప్రకృతార్థము. ఈ ప్రకృతార్థ పరముగా ఉన్న విశేషణములు పైన చెప్పినవిధాన శ్లిష్టములుగా ఉన్నందు వలన అప్రకృత మయిన అర్థాంతరమున్నూ గోచర మవు తున్నది. కృపాణలతిక అనే నాయిక అనురాగము వలన అప్పుడే జారిపోయిన మొలనూలు కల రోమాంచము కలిగిన సురతములో అనుకూల మయిన శరీరమును ధరిస్తూ నాయకు లను కంఠములందు గ్రహిస్తున్నది. ఆ నాయికా సంబంధము వలన అనురాగ భావం చేత పరవశులై సుఖపారవశ్యం వలన నేత్రాలు మూసికొని అనిర్వాచ్యమయిన ప్రేమానుబంధ మును పొందు తున్నారు. ఈ పద్యంలో విశ్లథమేఖలాం పులకితాం ఋజ్వీం అనే శ్లిష్టము లయిన విశేషణముల సామర్థ్యం చేత కృపాణలతిక నాయిక అని ప్రతీయమాన మవు తున్నది. అనురక్త భావ వివశా అనే విశేషణాల ద్వారా రిపులకు నాయకత్వము గోచర మవుతున్నది. ఈ నాయికా నాయక వ్యవహారము ఖడ్గము శత్రువులందు సమారోపితమై భాసిస్తున్నది. సమారోపిత నాయికా నాయకవ్యవహారము

కలిగిన కృపాణలతా రిపువృత్తాంతమె వాక్యార్థముగా గో·
మవుతున్నది.

## ౨ సాధారణ విశేషణసామ్యము

పీతవ్రీడ మపాస్తమాన ముదయద్వైవస్వర్య మావిర్భవత్
స్వేదం నిర్భరగాత్రవేపథు మిళన్మూర్ఛం గలద్బాష్పకం
సంజాతప్రళయంచ కాకతిమహీనాథ! స్మరోద్వేజితా
భూపాః శైలగుహాసు యాంతి విజనం భీత్యా సమాలింగితాః.

ఇది నిరూపితార్థము. పీతవ్రీడత్వాది విశేషణా రెండర్థాలలోనూ సమానములె. ఒక అర్థములో శృంగ ప్రతీతి ఉన్నది. వేరొక అర్థములో భయానక ప్రతీతి ఉన్న విశేషణాలు రెండింటికీ అనుకూలముగా ఉన్నవి. ఇ శృంగార భయానక సాధారణ విశేషణ బలము ఉన్నం వలన భీతి నాయిక అని భూపాలకులు నాయకులు గోచర మవుతుంది. భీతిసమాలింగిత భూపాలనాయక వ్య హారము ప్రతీయమాన మవుతున్నది. ఈ విధంగా ప్రతీ మాన మవుతున్న శృంగారనాయికా నాయకవ్యవహారము ప్రకృత భయానకమునకు సంబంధించి ఉన్న భూపులం సమారోపించాలి. ఈ సమారోపములో పీతవ్రీడత్వా మొదలయిన ధర్మసమారోపము నిమిత్తము. ఇక్కడ అ కృతధర్మసమారోపము ఉన్నట్లుగా కొన్ని స్థలాలలో అ కృత కార్య సమారోపము ఉంటుంది. ధర్మసమారోప కాని కార్యసమారోపము కాని లేకపోతే విశేషణసావ మాత్రము చేత అప్రకృతవ్యవహారము గోచరము కా సాధారణవిశేషణ సమాసోక్తి ఇపుడు రెండు విధాలం నట్లు. ఈ సమాసోక్తి మొదటిసమాసోక్తి కంటె కొం అస్పష్టము.

### ౩ ఔపమ్యగర్భవిశేషణము

భృతాత్మా గుణ రత్నౌఘైః పూర్ణః సౌజన్య వారిణా
ప్రతాపరుద్ర నృపతిః ధత్తే విశ్వంభరాశ్రియం.

భరించిన తన గుణరత్న సమూహములతో కూడు కొనినవాడు సౌజన్యోదకముచే పూర్ణుడూ అయిన ప్రతాప రుద్రుడు విశ్వంభరాశోభను ధరించుతున్నాడు. దీనిలో రత్నములవంటి గుణములు ఉదకము వంటి సౌజన్యము అని ఉపమిత సమాసమును అంగీకరించ వచ్చును. గుణములనెడు రత్నములు సౌజన్యమనెడి ఉదకము అని రూపకసమాసము నయినా స్వీకరించ వచ్చును. ఆ సమాసమే తగును, ఇది తగదు, అని నిర్ణయించడానికి ఏమీ ఇక్కడ సాధక బాధక ములు లేవు. కాబట్టి "గుణసదృశైః రత్నైః సౌజన్యసదృశేన వారిణా" అని మధ్యమపదలోప సమాసమును స్వీకరించాలి. అప్పుడు ఔపమ్య గర్భ విశేషణసామ్యము సిద్ధిస్తుంది. ప్రతా పరుద్రుని యందు సముద్ర వ్యవహారము ప్రతీత మవుతుంది. కనుక సమాసోక్తి. ఎక్కడ నయినా ఉపమాసమాసంలో సాధకము ఉంటే అక్కడ ఉపమాసమాసమును స్వీకరించాలి. సాధకబాధకములు లేనిచోట సంకరసమాసమును అంగీ కరించాలి. ఈ విధంగా చూస్తే ఇప్పటికి ఈ సమాసోక్తి అయిదువిధాలయినట్లు గ్రహించాలి. వాని పేర్లు ఇవి.

౧. శ్లిష్టవిశేషణ సముత్థాపితము
౨. సాధారణ విశేషణములో ధర్మ సమారోపము
౩. ,, కార్య సమారోపము
౪. ఔపమ్యగర్భవిశేషణములో ఉపమిత సమాసము
౫. ,, సంకర సమాసము

ఇంకా దీనికి సంబంధించిన అవాంతరభేదాలు ఇంకా ఉన్నవి. వాని స్వరూపోదాహరణములకు ఇక్కడ అవకాశము లేదు.

ఇన్ని విధములయిన ఈ సమాసోక్తిలో అంతట అప్రస్తుతవ్యవహార సమారోపమె జీవితము. వ్యవహారసమారోపం లేకపోతే సమాసోక్తిలో చమత్కారము లేదు. ఈ విధంగా అంగీకరించినందు వలననే రూపక సమారోప వ్యవచ్ఛేదము కలుగుతుంది. ఆ విధంగా కాక సమాసోక్తిలో కూడా అప్రస్తుతారోపమునే స్వీకరించితే రూపకాలంకారము కంటె సమాసోక్తికి భేదము లేక పోవలసి వస్తుంది. అప్రస్తుతము శబ్దముచే ప్రయుక్తము కాక ప్రస్తుతమునకు సంబంధించిన విశేషణముల సామ్యము వలన ప్రతీయమానమయిన చోట వ్యవహార సమారోపమునే అంగీకరించి సమాసోక్తిని నిర్ణయించాలి. అటు వంటి స్థలములో ప్రస్తుతమయిన రాజాదులు విశేషణ సామ్యము వలన గోచరమయిన అప్రస్తుత సముద్రత్వాది ధర్మములతో కూడుకొని గోచరిస్తారు. అప్రస్తుతము కూడా శబ్దముచే ప్రయోగింప బడిఉన్నప్పుడు అప్రస్తుతము ప్రస్తుతమును తనరూపముతో రూపము కలదానినిగా చేస్తుంది. ప్రకృతమును న్యగ్భావించుతుంది. ప్రస్తుతమున్నూ తన రూపమును విడిచి పెట్టుకొని అప్రస్తుత తాద్రూప్యమును స్వీకరించు తుంది. అందు వలన అటువంటి చోట రూపకమని నిశ్చయించాలి. ప్రస్తుతములో అప్రస్తుతము న్యగ్భూతమయితే సమాసోక్తి. అప్రస్తుతములో ప్రస్తుతము న్యగ్భూతమయితే రూపకము. సమాసోక్తిలో వ్యవహార సమారోప

మును జీవితముగా అంగీకరించి నందువలన ఈ చెప్పిన విధ ముగా రూపకము కంటె భేదము సిద్ధ మవుతున్నది.

ఇటువంటి వ్యవహార సమారోపము నాలుగు విధాలు. లౌకిక వస్తువునందు లౌకిక వ్యవహార సమారోపము. లౌకిక వస్తువునందు శాస్త్రీయ వస్తు వ్యవహార సమారోపము. అని ఇది రెండు విధాలు. అట్లాగే శాస్త్రీయవస్తువు నందు శాస్త్రీయవస్తు వ్యవహారసమారోపము. శాస్త్రీయవస్తువు నందు లౌకికవస్తు వ్యవహారసమారోపము. అని ఇది రెండు విధాలు. మొత్తము ఈ వ్యవహారసమారోపము ఇట్లా నాలుగు విధాలు. యథాక్రమంగా వీనికి ఉదా:-

సప్తాంగ స్ఫుర దుద్దామ దానలక్ష్మీ విరాజితః
ప్రతాపరుద్రో భద్రాత్మా తనుతే సార్వభౌమతాం.

సప్తాంగములందు గోచరించు అతిశయించిన దాన శోభతో విరాజిల్లుతున్న ప్రతాపరుద్రుడు భద్రాత్మకుడై సార్వభౌమత్వమును విస్తరింప చేస్తున్నాడు. స్వామి అమాత్య సుహృత్ కోశ రాష్ట్ర దుర్గ బలములు సప్తాంగ ములు. ఇది లౌకికమయిన ప్రకృతవస్తువు. దీనియందు లౌకికమె అయిన సార్వభౌమమనే పేరుగల దిగ్గజ వ్యవ హారము ప్రతీత మవుతున్నది. ఈ పద్యములో స్ఫురించే దాని స్వరూపమును ఈ విధముగా గ్రహించాలి. ఏడు అవయవముల నుండి ప్రసరించుతున్న దానలక్ష్మిచేత విరాజత మయిన భద్రజాతికరి సార్వభౌమము అనే దిగ్గజము. ఇక్కడ ప్రకృత ప్రతాపరుద్రుని యందు అప్రకృత మయిన భద్రగజ వ్యవహారము సమారోపిత మయింది.

గురుప్రమాణేన నిజేన సద్య స్తిరస్కృతోద్య త్ప్రతిపక్ష హేతౌ
ప్రతాపరుద్రస్య సమిత్యుదగ్రే ఖడ్గే మహత్ ఖండన పండితత్వం

దీనిలో లౌకికవస్తువునందు శాస్త్రీయవస్తు సమారోపము కనపడుతున్నది. లౌకికవస్తువు ఖడ్గము. దానికి సంబంధించిన అర్థమును ఈ విధముగా గ్రహించాలి. ప్రతాపరుద్రుని యుద్ధములోని ఖడ్గమునందు గొప్ప ఖండనపండితత్వము ఉన్నది. ఆ ఖడ్గము తన శ్రేష్ఠమైన ప్రమాణము చేత శత్రువుల ఆయుధములను తిరస్కరించింది. తర్కశాస్త్రప్రసిద్ధమయిన వస్తువు అప్రకృతము. దాని స్వరూపమిది. వ్యాప్తి పక్షధర్మత మొదలయిన విశేషాలు కలిగి గొప్పదయిన అనుమాన ప్రమాణము సభలో ప్రతివాదికి సంబంధించిన వాద హేతువులను అన్నిటినీ క్షణములో తిరస్కరించి వేస్తున్నది. అపుడు ఇతర మత దూషణ నైపుణ్యము స్పష్టము. ఖడ్గమునందు ఇటువంటి శాస్త్రీయ మయిన వ్యవహారము సమారోప సుందరమై దీనిలో భాసిస్తున్నది.

అపూర్వార్థ శ్లాఘా గురుభణిత సారస్య పదవీ
శ్రుతిగ్రాహ్యం తత్వం కిమపి కలయంతీ ప్రతిపదం
ప్రబంధశ్రీ ర్వీరక్షితిభుజి కవీనాం విజయతే
బుధశ్రేణీ యస్యాం నిపుణ మధికర్తుం ప్రభవతి.

ఈ పద్యంలో అలంకారశాస్త్రమునకు సంబంధించిన వస్తువు ప్రకృతము. దాని యందు మీమాంసాశాస్త్ర ప్రసిద్ధమయిన వస్తువ్యవహార సమారోపము కన్పడు తున్నది. మొదటగా అలంకారశాస్త్రీయ వస్తువును ఇట్లా గుర్తించాలి. ప్రతాపరుద్రుని విషయమై కవుల యొక్క ప్రబంధశోభ సర్వోత్కర్షగా విలసిల్లు తున్నది. ఆ కావ్యనాటకాది ప్రబంధలక్ష్మి యందు చతురసహృదయుల యొక్క పరిషత్తు చక్కగా రసభావాలను ఆస్వాదించడానికి సమర్థ మవుతున్నది. ఆ ప్రబంధశ్రీ ఈ విధముగా ఉన్నది. అచుంబితము లయిన

అర్థముల యొక్క శ్లాఘచేత ఉదాత్తవాక్యముల యొక్క సరసతాసరణిగా ఉన్నది. ప్రతిపదములోనూ శ్రవణసుభగ మయిన అనిర్వచనీయమగు మాధుర్యాదికము కలిగి ఉన్నది. శ్రుతికటువు మొదలయిన దోషాలు లేవు. స్రవత్సుధా మధురములయిన శబ్దార్థశరీరము కల ప్రబంధశ్రీ చక్కగా ఉన్నది. తంత్రశాస్త్రవస్తువును ఈ విధముగా గ్రహించాలి. వేదవాక్యములుబోధించిన అపూర్వములయినఅగ్నిహోత్రాది యాగముల యొక్క శ్లాఘ చక్కగా ఉండడముచేత విధి వాక్యములు ఉత్తమములుగా ఉన్నవి. అవి చక్కని సరసత్వ మును అంటే ప్రవర్తింపచేయడము లోని ఉన్ముఖత్వమును కలిగి ఉన్నవి. ప్రతి పదము లోనూ శ్రుతి లింగ వాక్యాదుల చేత గ్రహింపదగిన తత్వము కూడుకొని ఉన్నది. ఇటువంటి ప్రబంధశ్రీ అనగా; మీమాంస శ్రేయస్సాధన మయిన ధర్మమును బోధించు తున్నది. దీని యందు దేవతల సమూహము నిపుణముగా అధికరించడానికి సమర్థము. ఇటువంటి మీమాంసా వస్తు వ్యవహార సమారోపము ఇక్కడ ఉన్నది.

సాలంకార లసద్వర్ణా సుగుణా రసనిర్భరా
భావానుబంధినీ భాతి భారతీ కాకతీశ్వరే.

దీనిలో అలంకారశాస్త్రీయమయిన భారతీరూపమగు వస్తువు ప్రకృతము. దీనియందు లౌకికమయిన నాయికా వ్యవహార సమారోపము ఉన్నది. ఉపమాద్యలంకారములు కలిగిన రసవ్యంజకము లయిన, మధురాక్షరముల శోభ కల శ్లేషాది గుణ సహిత మయిన, శృంగారాది రసనిర్భర మయిన, నిర్వేదాది భావానుబంధము కల భారతి ప్రతాప రుద్రుని విషయమై భాసించు తున్నది. భారతి అనేపేరు కలి

గిన నాయికా వ్యవహారము అప్రకృతము. భారతీ నాయిక కటకాద్యలంకారములు కలిగి, మనోజ్ఞకాంతి కలదై, గాంభీర్యాది గుణాలు కలదై, అనురాగ పూర్ణురాలై ప్రేమానుబంధము కలదై ప్రతాపరుద్రుని విషయమై భాసించు తున్నది. ఈ లౌకిక వ్యవహార సమారోపము ఇక్కడ స్పష్టముగా ఉన్నది. సమాసోక్త్యలంకారములో విశేషణము విశేష్యము అనేవి రెండూ ఉపాత్తములు కావు. ఒక ప్రకృతవిశేష్యమె ఉంటుంది. అప్రకృతవిశేష్యము ప్రతీయమాన మవుతుంది. కాని వాచ్యము కాదు. శ్లేషాలంకారములో నయితే విశేష్యములు రెండూ ఉపాత్తము లవుతవి. అప్రకృత విశేష్యము కూడా శ్లేషలో వేరుగా ఉంటుంది. అందువలన శ్లేషకంటె సమాసోక్తి భిన్నము. సమాసోక్తిలోని విషయమీమాంస చాలా జటిలంగా ఉంటుంది. తద్విస్తరము ఇక్కడ అవసరము కాదని నిరూపించడము లేదు.

## ౧౭. వక్రోక్తి

వక్రోక్తి స్వభావోక్తి వ్యాజోక్తి మొదలయిన ఇంకా కొన్ని అలంకారాలకు ఉక్తి సామ్యము ఉన్నది. అయినా వక్రోక్తి అలంకారములో శ్లేషగర్భత్వ మన్న విశేషము ఉన్నది కాబట్టి సమాసోక్తి తరువాత వక్రోక్తినిరూపణము సంగతంగా ఉంటుంది.

> అన్యథోక్తస్య వాక్యస్య కాక్వా శ్లేషేణ వా భవేత్
> అన్యథా యోజనం యత్ర సా వక్రోక్తి ర్నిగద్యతే.

ఒకడు ఒకవిధముగా పలికిన వాక్యానికి కాకువుచే గాని శ్లేషచే గాని వేరొకవిధముగా యోజనము ఉన్నట్లయితే అది వక్రోక్తి అవుతుంది. ఒకడు తానేదో చెప్పవలె

నని ఒక వాక్యమును ప్రయోగించితే వేరొకడు తానేదో చెప్పవలెనన్న ఊహతో ఆ వాక్యానికి అన్యథా యోజనము చేసినట్లయితే అది వక్రోక్తి. వక్రమయిన ఉక్తి వక్రోక్తి. వక్రము అంటే లోకము కన్న విలక్షణము. లోకములో ప్రసిద్ధమయిన విధానము కంటె దీని విధానము విలక్షణముగా ఉంటుంది. కాబట్టి ఇది వక్రోక్తి. సామాన్యంగా అన్ని అలంకారాలకూ ఏదో విధముగా ఉక్తి వక్రత ఉంటుంది. కావ్యభాష లోకభాష కంటె స్వాభావికంగా విలక్షణమె కదా! సామాన్యంగా సర్వాలంకారాలలోనూ ఉక్తివక్రత్వము ఉంటేనే చమత్కారము ఉంటుంది. అయినా ఈ వక్రోక్తికి చెప్పిన లక్షణము వాటిలో వేనికీ ఉండదు. కాబట్టి ఇది సర్వాలంకారాలకంటె విలక్షణము. కాకువక్రోక్తి శ్లేషవక్రోక్తి అని ఇది రెండు విధాలు. కాకువు అంటే ఒక విధమయిన స్వరము. వాక్యములను పలికేటప్పుడు ఒకస్వరము వలన ఒక విధమయిన అర్థము వేరొక స్వరము వలన వేరొక విధమయిన అర్థము లంభించుతుంది. ఒకడు సామాన్యంగా ఒకమాటను పలికిన తరువాత వేఱొకడు విభిన్నమయిన స్వర యోజనముతో అర్థాంతరము వచ్చేటట్లుగా చేస్తే అది కాకు వక్రోక్తి. ఉదా :

> బహువల్లభః ఖలు రాజా సఖి! తస్య శ్రియాం నిర్భరాసక్తిః
> న్యూనా శ్రియోఽపి త్వం? ఆత్మానం కిం ను లఘయసి?

పూర్వార్ధము నాయికా వాక్యము. సఖీ! రాజు బహువల్లభుడు కదా! ఆయనకు శ్రీదేవి యందు అనురాగము ఎక్కువ. శ్రీదేవి మాదిరిగా నేను ఆయన ప్రేమను పొందగలిగిన అర్హత కలదాననా? నేను అంతటి దానను

కాను. అనే అభిప్రాయము నాయికా వాక్యాలలో గోచరము కాగానే సఖి ఈ విధముగా అంటున్నది. నీవు మాత్రము శ్రీదేవి కంటె తక్కువ దానవా? ఏమి? నీవేమీ తక్కువ దానవు కావు. ఎందుకు నిన్ను తక్కువగా చేసి కొంటావు? ఈ పద్యము ప్రథమార్ధములో నాయిక తన న్యూనత్వమును సంభావించితే, ద్వితీయార్ధములో సఖి "శ్రియో న్యూనా" అనే చోట కాకు స్వరమును కలిపి తక్కువదానవు కావని నిషేధయోజనము చేసినందు వలన కాకు వక్రోక్తి అవుతున్నది. కాకువువలన వ్యంగ్యమున్నప్పటికీ అది వాచ్యములోనే విశ్రాంత మవుతున్నది. నీవు తక్కువ దానవు కావు కాబట్టి నీయందు కూడా రాజు ఆసక్తి కలిగి ఉన్నాడు. నిన్ను నీవు ఎందుకు అంతగా చులకన చేసికొంటావు? అని గోచర మవుతున్నది. శ్లేష వక్రోక్తికి ఉదా:-

కస్తే సుందరి! వర్తతే హృది సదా? రాజా, కిమిందుః? న హి
క్షోణీభృత్తిలకః, సుమేరు రయి! కిం? నో రుద్రదేవో విభుః
ఈశః కిం? సఖి! సత్యమాత్థ సుభగే త్వం గోత్రసారోద్భవే
త్యాశ్యాం ఖల్వపహాసవాచి విరహం కించి ద్వధూ ర్వ్యస్మరత్

ఈ పద్యంలో సఖీనాయకుల యొక్క ఉక్తి ప్రత్యుక్తి వాక్యములు తొమ్మిది ఉన్నవి.

సఖి:- నీహృదయంలో ఉన్నవా రెవరే ఎప్పుడూ?

సుందరి:- ఎవరా! రాజు

సఖి:- చంద్రుడా ఏమిటి?

సుందరి:- ఉఁహుఁ. క్షోణీభృత్తిలకము

సఖి:- ఓహో! మేరు పర్వతమటమ్మా?

సుం:- కాదు. రుద్రదేవ ప్రభువు.

సఖి:- అట్లాగా! ఈశ్వరు డేమిటి?

సుం:- సఖీ! సత్యము చెప్పినావె!

సఖి:- సుభగా! నీవు గోత్రసారోద్భవు రాలవు (సత్కుల ప్రసూతవు-పర్వతరాజపుత్రివి).

అని ఈ విధంగా చెలికత్తె అపహాసప్రధానంగా పలికే టప్పటికి ఆ నాయిక కొంతగా విరహమును విస్మరించింది. ఈ పద్యంలో 'రాజా క్షోణీభృత్తిలకః రుద్రదేవః' అనే పదాలు శ్లిష్టములు. నాయిక ఒక అర్థముతో వానిని ప్రయోగించితే సఖి తాను ఏదో చెప్పడానికి అర్థాంతర యోజనము చేసినందువలన శ్లేషవక్రోక్తి అవుతుంది. ఈ వక్రోక్తి శబ్దము సామాన్యంగా సర్వాలంకారాలకూ సంబంధించిన పదము. సంపూర్ణమయిన అలంకారవర్గమంతా వక్రోక్తి స్వరూపమె. ఈ విధంగానే భామహుడు అంగీకరించు తున్నాడు. అయినప్పటికిన్నీ ఇక్కడ ఆ శబ్దము అలంకారవిశేషము నందు ప్రయోగింపబడింది.

## ౧౭ స్వభావోక్తి

వక్రోక్త్యలంకారముకంటె స్వభావోక్తి అలంకారము విపర్యయముగా ఉంటుంది.

స్వభావోక్తిరసౌ చారు యథావద్వస్తు వర్ణనం

ఉన్న వస్తువును ఉన్నవిధంగా హెచ్చు తగ్గులు లేకుండా వర్ణము క్రియ అవయవముల కూర్పు మొదలయిన రూపము కలిగిన వస్తుస్వభావమును కవిప్రతిభలో గోచరించిన విధంగా హృదయరమ్యంగా వర్ణించినట్లయితే స్వభావోక్తి అలంకారమవుతుంది. కేవలము వస్తుస్వభావవర్ణనం

లేని కావ్యము ఉండదు. కుశాగ్రీయ ధిషణులు అయిన సు
వులు తమ ప్రతిభలో భావించి భాసింప చేసికొన్నవిధా
స్వభావవర్ణనము ఉన్నపుడే ఈ స్వభావోక్తి; వస్తుస్వభా
వర్ణనము అలంకార మవుతుంది. స్థూలమతులయిన అకవుల
కుకవులూ ఈ స్వభావరమ్య విధానమును బాగా గుర్తించ
పోవచ్చును. ఉదా:-

మదచ్యుతా నర్తితకర్ణతాళం ఉద్ధూతమూర్ధ్నా త్రిపదస్థితేన
లోలాగ్రహస్తేన గజేన జాతో నిత్యోత్సవః కాకతివీరరుద్రః.

మదమును స్రవించునట్టి, నర్తనము చేస్తూ ఉన్నట్లుగా ఉన్న చెవులు తాళము వేస్తూ ఉంటే కుంభస్థలమును కంపింప చేస్తూ ఉన్న, త్రిపదస్థితిలో ఉన్న, తొండమును ఊగించుతూ ఉన్న పట్టపు గజముతో కాకతివీరరుద్రుడు నిత్యోత్సవము వాడుగా అయినాడు. దీనిలో గజమునకు సంబంధించిన క్రియాస్వభావము సూక్ష్మపరిశీలనంతో హృదయహారిగా నిరూపితమయింది. ఈ విధంగానే వర్ణ సంస్థానములకు సంబంధించి ఉండే సూక్ష్మవర్ణనము కూడా స్వభావోక్తి అలంకారము అవుతుందని ఉదాహరించి గ్రహించాలి. వస్తు స్వభావమును స్థూలరూపంగా గ్రహించి ఉన్న దానిని ఉన్నట్లుగా వర్ణించినపుడు ఈ అలంకారము కాదు. అది ఒకదోష మవుతుందని దోష ప్రకరణములో నిరూపితమయింది.

## ౧౮. వ్యాజోక్తి

ఉక్తి సామ్యము ఉన్నది. కాబట్టి పర్యాయోక్తికి ఇక్కడ అవకాశం ఉన్నది.

వ్యాజోక్తిః సా సముద్భూతం వస్తు యత్ర నిగూహ్యతే.

ప్రకాశముగా ఉన్న వస్తువు నిగూహిత మయితే

వ్యాజోక్తి అని సామాన్యంగా అర్థము. అసలు నిగూఢంగా ఉన్న వస్తువు ఏదో నిమిత్తము వలన ప్రకటమై ఉన్నప్పుడు సామ్యగర్భముగా ఉన్నందు వలన ఏదోవిధంగా నిగూహ నార్హమై ఉంటుంది. కాబట్టి ఏదో ఒక వ్యాజముచేత దానిని కప్పిపుచ్చినట్లయితే అది వ్యాజోక్తి అవుతుంది. "వ్యాజస్య ఉక్తిః వ్యాజోక్తిః" వస్త్వంతరమును ప్రక్షేపించడము అనే వ్యాజము యొక్క వచనము ఉంటుంది కాబట్టి వ్యాజోక్తి అవుతుంది. ఉదా:—

క్షోణీ పాణిగ్రహణ సమయే సంమదా ద్రోమహర్షే
సర్వాంగీణే నృపతితిలకః కాకతీయాన్వయేందుః
ధీరోదాత్తః శిశిరసలిలైః కింను రాజ్యాభిషేకః
కర్తవ్యః స్యాః దితి మృదు హసన్ వీక్షతే మంత్రివృద్ధాన్.

ప్రతాపరుద్రుడు క్షోణీపాణిగ్రహణ సమయంలో సముత్కటమయిన ఆనందము వలన రోమహర్షము సర్వావయవములందూ వ్యాపించగా ధీరోదాత్తుడు కాబట్టి శిశిరోదకములతో రాజ్యాభిషేకము చేయవలెనా ఏమి? అని అంటూ మెల్లగా నవ్వుతూ వృద్ధమంత్రులను అవలోకనము చేస్తున్నాడు. దీనిలో క్షోణీ పాణిగ్రహణ జన్యమయిన రోమహర్షమును ప్రతాపరుద్రుడు ధీరోదాత్తుడు కాబట్టి మహాభిషేకసలిల శైత్య వ్యాజాన కప్పిపుచ్చి మంత్రులను చూస్తున్నాడు. మొదట్లో నిగూఢంగా ఉన్న క్షోణీ పాణిగ్రహణ జన్య హర్షము రోమహర్షము చేత ప్రకాశితమయింది. దానిని నిమిత్తాంతరము చెప్పుతూ సలిల శైత్య వ్యాజాన కప్పిపుచ్చడము చేత వ్యాజోక్తి అలంకారమయింది.

## ౧౯ మీలనము

వ్యాజోక్తి అలంకారమును చెప్పిన తరువాత క
సామ్యము ఉన్నందు వలన మీలనము ఇక్కడ నిర
మవుతుంది.

మీలనం వస్తునా యత్ర వస్త్వంతర నిగూహనం.

దీనికే మీలితాలంకార మనిన్నీ పేరు. ఒక వస్తువు
వేరొక వస్తువునకు నిగూహనము చెప్పినచోట మీల
కార మవుతుంది. ఉత్కృష్ట వస్తువుచేత అపకృష్ట వస్తు
నిగూహనము ఉంటుంది. చెప్పబోయే సామాన్యాల
ములో ఈ విధంగా ఉండదు. అక్కడ సాధారణ గుణ
గము వలన భేదము కనపడక పోవడమె దాని స్వరూప
ఉంటుంది. మీలనాలంకారము రెండువిధాలు. సహజ
చేత ఆగంతుక వస్తువునకు తిరోధానము మొదటి భే
ఆగంతుక వస్తువు చేత సహజ వస్తువునకు తిరోధానము
రెండవ భేదము. యథా క్రమముగా ఉదా :

ఉగ్రైః కాకతివీరరుద్ర నృపతే ర్దోర్దండ విస్ఫూర్జితైః
యుద్ధప్రాంగణ వర్జితేషు పతిషు క్వాపి ప్రలీనాత్మసు
విష్వక్తీవ్రతర స్మరజ్వర జుషా మంగే ద్విషద్యోషితాం
సంక్రాతోపి న లక్ష్యతే పథి మహా నూష్మా చిరం మారవ

ప్రతాపరుద్ర మహారాజు యొక్క అత్యుగ్రము
భుజవిజృంభణముల చేత శత్రుస్త్రీల భర్తలందరూ
ప్రాంగణమును విడిచిపెట్టి ఎక్కడనో ప్రలీనమై పోయి
కాగా ఆ స్త్రీలకు తీవ్రతరమయిన స్మరజ్వరము క
వారి శరీరంలో మరుప్రదేశములకు సంబంధించిన
ప్రయాణవశాన కలుసు కొన్నప్పటికీ కనపడడము

దీనిలో శత్రుస్త్రీల యందున్న మన్మథాగ్ని వేడిమి సహజము. మార్గవశము వలన కలిగిన మహూష్మ ఆగంతుకము. సహజముచేత ఆగంతుకము తిరోహితము అయినట్లు వర్ణిత మయింది. కాబట్టి మొదటి మీలితము. ఇక రెండవది–

ప్రతాపరుద్రస్య భుజప్రభావా దంతర్భయా ద్భూమిభుజా మజస్రం
స్వేదాశ్రు కంపాద్యుదయే ప్యనంగగోష్ఠ్యాం స్త్రియః ప్రేష్ణి న విశ్వసంతి.

ప్రతాపరుద్రుని భుజప్రభావము వలన రాజులకు నిత్యమూ అంతర్భయము పుట్టింది. మన్మథగోష్ఠిలో వారికి స్వేదాశ్రు కంపాదులు కలిగినప్పటికీ వారి స్త్రీలు విశ్వసించడము లేదు. దీనిలో భయజన్యమయిన కంపాదికము ఆగంతుకము. ప్రేమజనితమయిన కంపాదికము సహజము. ఆగంతుకము చేత సహజతిరోధానము స్పష్టము.

## ౨౦ సామాన్యము

సామాన్యం గుణసామ్యేన యత్ర వస్త్వంతరైకతా,

గుణసామ్యము చేత ప్రకృతవస్తువునకు ఇతరవస్తువునకున్నూ ఏకత్వము వర్ణిత మయినట్లయితే సామాన్యాలంకారము. ప్రస్తుతమయిన వస్తువునకు అప్రస్తుతవస్తువుతో ఐకాత్మ్యము ఉండాలి. అక్కడ ప్రస్తుతాప్రస్తుతములకు సాధారణమయిన గుణసంబంధము హేతువు. ఐకాత్మ్యము అంటే భేదనిశ్చయము లేకపోవడము. ఉదా:–

కైలాస దుగ్ధార్ణవ యానహంసే ష్వాలక్షితే ష్వాంధ్రనరేంద్ర కీర్త్యా
త్రయః పుమాంసః ప్రథమే స్మయంతే స్వసేవకా సంభ్రమతో విలోక్య.

ఆంధ్రనరేంద్రకీర్తిలో కైలాసము పాలసముద్రము హంసవాహనము కన్పడకపోగా మొదటి ముగ్గురు పురుషులూ అటూ ఇటూ తిరుగుతూ ఉన్న తమ సేవకులను చూచి

మందహాసము చేస్తున్నారు. ప్రతాపరుద్రుని కీర్తి లోకాలలో విజృంభించగానే కైలాసము మొదలయిన విమల వస్తువు లన్నీ కీర్తిలో కలిసి పోయి తదేకాత్మతను పొందినవి అని వర్ణించడము చేత అభేద ప్రతీతి వర్ణిత మయినట్లు ఊహించాలి. అందువలన ఇక్కడ సామాన్యాలంకారము.

## ౨౨ తద్గుణము

ఇతరవస్తువుల యొక్క గుణములు దగ్గరలో ఉండడమువలన కలిగే అతిశయము సామాన్యంలో మాదిరిగా తద్గుణంలో కూడా ఉంటుంది. అందువలన దీనికి ఇక్కడ అవకాశము ఉన్నది.

తద్గుణః స్వగుణత్యాగా దన్యోత్కృష్ట గుణాహృతిః.

స్వాభావికమయిన తన గుణమును విడిచి పెట్టడము వలన ఇతరవస్తువు యొక్క ఉత్కృష్టగుణ స్వీకారము వర్ణింపబడిన చోట తద్గుణాలంకారము అవుతుంది. న్యూనమయిన తన గుణమును విడిచిపెట్టి దగ్గరలో ఉన్న వస్తువునుండి గొప్ప గుణమును స్వీకరించడము ఉంటే తద్గుణ మన్నమాట. "తస్య గుణాః అస్మిన్నితి తద్గుణః" ఉత్కృష్టగుణము కలవస్తువు యొక్క గుణాలు దీనియందు ఉంటున్నవి కాబట్టి ఇది తద్గుణ మవుతుంది. మీలితాలంకారానికి దీనికీ భేదము ఉన్నది. మీలితంలో ప్రకృతవస్తువు ఇతరవస్తువుచేత ఆచ్ఛాదిత మవుతుంది. దీనిలో ప్రకృతము అట్లా ఆచ్ఛాదితము కాదు. అనపహ్నుత స్వరూపముగానే ఉంటుంది. ఇతరవస్తువు యొక్క గుణాలచేత ఉపరంజితమై గోచరిస్తుంది. ఉదా:—

ప్రతాపరుద్ర దేవాంఘ్రి నఖ జ్యోత్స్నా విజృంభితైః
నమన్నృపతి మాణిక్య మౌళయః శుచయః కృతాః.

ప్రతాపరుద్రదేవుని పాదనఖముల జ్యోత్స్నా విజృంభణములచేత నమస్కరించుతూ ఉన్న రాజుల యొక్క మాణిక్యములతో కూడుకొన్న మౌళులన్నీ శుభ్రములుగా చేయబడినవి. దీనిలో నమస్కరించుతూ ఉన్న రాజుల యొక్క పద్మరాగమకుటములు తమ ఎఱ్ఱని కాంతిని విడిచి పెట్టి ప్రతాపరుద్రుని పాదనఖజ్యోత్స్న యందున్న ధవళిమను స్వీకరించు తున్నవి. అని వర్ణించడముచేత పరిమితమయిన స్వగుణత్యాగము ఉత్కృష్టమయిన అన్యగుణస్వీకారమూ స్పష్టముగా ఉన్నది. కాబట్టి తద్గుణాలంకారము.

## ౨౨ అతద్గుణము

తద్గుణమునకు ఇది విపర్యయరూపము. అందువలన అతద్గుణము ఇక్కడ నిరూపణార్హము.

సతి హేతా వన్యగుణాస్వీకారః స్యా దతద్గుణః.

తగినంత హేతువు ఉన్నప్పటికీ ఇతర గుణస్వీకారము లేకపోయినట్లయితే అతద్గుణాలంకార మవుతుంది. ఒకవస్తువు వేరొకవస్తుగుణమును స్వీకరించడములో సన్నిధానము (దగ్గరలో ఉండడము) హేతువు. న్యూనగుణమయిన వస్తువు సన్నిధానహేతువు ఉన్నప్పుడు విశిష్ట గుణాలు కలిగి పదార్థము యొక్క ధర్మాలను స్వీకరించడము న్యాయము. అటువంటి స్వీకారము లేనపుడు అతద్గుణ మవుతుంది. ''తస్య గుణాః అస్మిన్ న సంతీతి అతద్గుణః'' దాని గుణములు దీనిలో లేవు కాబట్టి ఇది అతద్గుణము. ఇంకా అర్థాంతరమునకు సంబంధించిన భేదాంతరములు ఇతరగ్రంథాలలో నిరూపితములు. ఉదా :—

ఈశానం సమయా జగత్యటతి తల్లీలాట్టహాసోజ్జ్వలే
దైత్యారిం పరితః తదంగ విలసన్నీలద్యుతి ద్యోతితే
బ్రహ్మాణం నికషా చ తత్తనుమిళత్స్వర్ణప్రభా భాస్వరే
పుష్ణా రుద్రనరేంద్రకీర్తివిభవః స్వామేవ శుభ్రాం ఛవిం.

ప్రతాపరుద్రుని కీర్తివిభవము ఈశ్వరుని దగ్గర ఆతని లీలాట్టహాసములచేత సముజ్జ్వలమైన జగత్తులో తిరుగుతున్నది. విష్ణువు దగ్గర ఆతని శరీరవిలసన్నీలకాంతిచే ప్రకాశితమయిన లోకములో తిరుగుతున్నది. బ్రహ్మసమక్షంలో ఆతని శరీరమందు కూడుకొన్న స్వర్ణప్రభా భాస్వరమయిన లోకములో సంచరించుతున్నది. అయినప్పటికిన్నీ తన శుభ్ర కాంతినే పోషించు కుంటూ విహరిస్తున్నది. దీనిలో త్రిమూర్తుల సమీపమందున్న లోకాలు ఆ యా నానాకాంతి సమగ్రములై ఉన్నప్పటికి తెంపు లేకుండా కీర్తి తిరుగుతూ ఉన్నా ప్రతాపరుద్రయశస్సునకు నిరంకుశమయిన స్వీయ ధవళిమ విజృంభించు తున్నది. సన్నిధానరూపహేతువు ఉన్నప్పటికీ ఇతరగుణముల స్వీకారము లేకపోవడము దీనిలో నిబద్ధమయినందు వలన ఇది అతద్గుణము.

## ౨౩ విరోధము

అతద్గుణాలంకారములో కొంతగా విరోధము ప్రక్రాంతమయింది. విరోధాలంకారములో కూడా విరోధము ఉంది. కాబట్టి ఇది ఇక్కడ ప్రాప్తావసరము.

ఆభాసత్వే విరోధస్య విరోధాలంకృతి స్మృతా

విరోధము ఆభాసరూపముగా ఉన్నట్లయితే విరోధాలంకార మవుతుంది. మొట్ట మొదట్లో ఆభాసరూపంగా గోచరించిన విరోధము పర్యవసానంలో పరిహృతమయితే

విరోధాలంకారము. దీనికే విరోధాభాసాలంకారమనిన్నీ పేరు. విరోధము మొదట్లోనే భాసించాలి. కాని తరువాత ఉండ రాదు. విరోధము సమాధానరహితంగా ఉంటే ప్రరూఢ దోష మవుతుంది. సమాధానము ఉన్నప్పుడు మొదట్లోనే విరోధభానము ఉంటుంది కాని తరువాత ఉండదు. అందు వలన విరోధాభాసము. జాతి క్రియా గుణ ద్రవ్యములు నాల్గింటికి సజాతీయ విజాతీయ విరోధులతో సంబంధము చెప్పినట్లయితే విరోధాలంకారము. జాతివిరోధము క్రియా విరోధము గుణవిరోధము ద్రవ్యవిరోధము అనే నాలుగు విరోధములున్నూ ఒకటొకటి పెంపు పొంది పది విధములవు తున్నవి. జాతికి జాతిక్రియాగుణద్రవ్యములతో విరోధమును చెప్పితే నాలుగు భేదాలు. క్రియకు క్రియాగుణద్రవ్యములతో విరోధమును చెప్పితే మూడు భేదాలు. గుణమునకు గుణ ద్రవ్యములతో విరోధమును చెప్పితే రెండు భేదాలు. ద్రవ్యానికి ద్రవ్యముతో విరోధములో ఒక భేదము. ఈ విధ ముగా పది విరోధభేదాలు. జాతికి క్రియతో విరోధమును చెప్పినప్పుడు మళ్లీ క్రియకు జాతితో విరోధమును ప్రత్యేకంగా పరిగణించ నక్కర లేదు. ధ్వనిప్రసంగంలో నిరూపించిన అభిప్రాయమును ఇక్కడ కూడా అభ్యూహించాలి. అందు వలననే అక్కడ మాదిరిగా ఇక్కడ కూడా ఒక్కొక్క భేదానికి న్యూనత్వము కలుగుతుంది. వాని పేర్లను ఈ విధముగా గుర్తించ వచ్చు.

౧ జాతికి జాతితో విరోధము

౨ జాతికి క్రియతో విరోధము

౩ జాతికి గుణముతో విరోధము

౪ జాతికి ద్రవ్యముతో విరోధము

౫ క్రియకు క్రియతో విరోధము
౬ క్రియకు గుణముతో విరోధము
౭ క్రియకు ద్రవ్యముతో విరోధము
౮ గుణమునకు గుణముతో విరోధము
౯ గుణమునకు ద్రవ్యముతో విరోధము
౧౦ ద్రవ్యానికి ద్రవ్యముతో విరోధము.

పద్మాకరోపి విలసతి నితరా మజడాశయోయ ముర్వీశః
విమలతరవారిధారా ప్యాసీ ద్వైరిక్షితీశ తాపకరీ.

ఈ పద్యము జాతికి జాతితో విరోధమును క్రియతో విరోధమును సూచిస్తున్నది. ఈ భూపాలుడు పద్మాకరు డయినా మిక్కిలి అజడాశయుడై విలసిల్లుతున్నాడు. ఈ పూర్వార్ధములో జాతులకు విరోధమున్నది. ఇక్కడ విరోధము శ్లేషమూలము. పద్మాకరమయినా అజడాశయము అని విరోధము. పద్మములకు ఆకరమయిన సరస్సు జలస్థానము కాకపోదు. డ ల లకు అభేదమును ఆశ్రయించి ఈ అర్ధమును గ్రహించాలి. పద్మాకరము జలస్థానము కాకపోవడములో విరోధమున్నది. మొదట భాసించే ఈ విరోధము అనంతర సమయములోని సమాధానరూపమయిన అర్థభావనచేయగా ఆభాసరూపమై పరిహృత మవుతుంది. ప్రతాపరుద్రుడు లక్ష్మీనివాసమయినా మూర్ఖాశయుడు కాడు అని పరిహారము. ఈ విధముగానే విరోధపరిహారమును ముమ్మందు గ్రహించాలి. ఉత్తరార్థములో జాతిక్రియలకు విరోధము వర్ణితము. విమలతరవారిధార కూడా వైరిరాజులకు తాపకరి అయింది. వారిధార సంతాపమును కలగజేయడము విరుద్ధము. విమల-తరవారి ధార అని శబసుందరతను భావిం

చితే తరవారి ధార=ఖడ్గధార తాపకరి కావడము విరుద్ధము కాదు.

అమదః సార్వభౌమోపి భాస్వానపి కలానిధిః
వీరరుద్రనరేంద్రోయ మద్భుతానాం విహారభూః.

జాతికి గుణముతో ద్రవ్యముతో విరోధము దీనిలో ప్రదర్శిత మవుతున్నది. ఈ వీరరుద్రుడు సార్వభౌముడయినా అమదుడు. సార్వభౌమత్వము జాతి. మదము గుణము. సార్వభౌమమనే దిగ్గజము మదరహితము అనడము విరుద్ధము. ప్రజాపాలకుడయిన్నీ మదసహితుడు కాదు అనేది పరిహారము. భాస్వంతుడయినా కలానిధుడై ఈతడు అద్భుతములకు విహారభూమి అవుతున్నాడు. సూర్యుడు చంద్రుడు కావడము విరుద్ధము. చంద్రుడు ఏకవ్యక్తి కాబట్టి ద్రవ్యము. ప్రకాశమానుడు కళలకు నిధి అనే అర్థము పరిహారకము. ఇది కూడా శ్లేషమూలమె.

ధర్మద్విషా మర్థముషాం చ భంగ ముత్పాదయ న్కాకతివీరరుద్రః
త్రివర్గసాధారణగోచరోపి కరోతి కామద్విషి భావమార్ద్రం.

ధర్మశత్రువులకు అర్థశత్రువులకూ భంగపాటు కలుగజేస్తూ ఉన్న ప్రతాపరుద్రుడు ధర్మార్థకామములనే త్రివర్గములను సమానముగా చూచేవాడయినప్పటికీ కామశత్రువునందు ఆర్ద్రభావమును కలుగజేసికొంటున్నాడు. దీనిలో త్రివర్గములందు సాధారణ వ్యాపారము కలవానికి ధర్మార్థవిరోధులకు భంగముసంపాదించడము కామవిరోధియందు స్నేహము కలుగజేసికొనడమున్నూ విరుద్ధము. కామశత్రువు అయిన శివుని యందు భక్తిభావము కలిగిఉన్నాడని పరిహారము. క్రియకు క్రియతో విరోధము దీనిలో స్పష్టమె. పూర్వోదా

హారణములో విరుద్ధములయిన రెండూ శ్లిష్టములయినవి. ఇక్కడ కామద్విషి అనేది ఒక్కటే శ్లిష్టమయింది.

ఏష జిష్ణువిహారోపి గోత్రవాత్సల్యలాలసః
కరోతి కమలోల్లాసం రాజా ప్యంధ్రనరేశ్వరః

క్రియకు గుణద్రవ్యములతో విరోధము దీనిలో నిరూపిత మవుతుంది. ఈ ఆంధ్రనరేశ్వరుడు జిష్ణువిహారుడయినా గోత్రవాత్సల్యమునందు ఆసక్తి కలిగి ఉన్నాడు. ఇంద్రవిహారుడు పర్వతవాత్సల్యముతో ఉండడము విరుద్ధము. విహారము క్రియ. వాత్సల్యము గుణము. జయశీల వ్యవహారము కలవాడయ్యీన్నీ వంశ వాత్సల్యమందు లాలసుడై ఉన్నాడు అనేది పరిహారము. రాజు అయి కూడా కమలోల్లాసము కలుగజేస్తున్నాడు. అనే పూర్వార్ధార్థములో క్రియాద్రవ్యములకు విరోధము ఉన్నది. చంద్రుడు కమలములకు వికాసమివ్వడము విరుద్ధమె. భూపాలకుడై లక్ష్మీసముల్లాసమును సంపాదిస్తున్నాడు. అనే అర్థము పరిహారకము. చంద్రుడు ద్రవ్యము. ఉల్లాసకరణము క్రియ. రెండింటికీ ఆముఖవిరోధము వర్ణితమయినది.

రంజయ౯ా భువనమిదం రాజేతి యథా శ్లాఘనీయోసి
రుద్రనరేంద్ర ! కథం సా రక్తాపి చ పాండురా జాతా,

రుద్రనరేంద్ర ! ఈ భూమిని రంజింపచేస్తూ నీవు రాజా అని శ్లాఘనీయుడవు అయినావు కదా ! ఆ తరుణి రక్త అయి కూడా పాండుర ఎట్లా అయింది ? ఎఱ్ఱనిది తెల్లగా కావడము విరుద్ధము. గుణానికి గుణముతో విరోధానికి ఇది ఉదాహరణము. అనురాగము కలదై విరహము చేత పాండుర వర్ణము కలదయింది అనేది పరిహారము.

జ్వలత్ప్రతాపరౌద్రోపి కాకతీయనరేశ్వరః
భూత్వా జైవాతృకో భాతి శశ్వ ద్విశ్వప్రియంకరః

గుణమునకు ద్రవ్యముతో విరోధము దీనిలో ఉన్నది. జ్వలించుతున్న ప్రతాపరౌద్రు డయినప్పటికీ కాకతీశ్వరుడు మాటిమాటికీ విశ్వప్రియంకరుడయిన జైవాతృకుడై భాసించుచు తున్నాడు. ప్రతాపరౌద్రుడయినా జైవాతృకుడు=చంద్రుడు అని గుణద్రవ్యములకు విరోధము. జైవాతృకపదానికి ఆయుష్మంతుడు అనే అర్థములో విరోధపరిహార మున్నది.

విభాతి కాకతీంద్రోయం రుద్రోపి చతురాననః
తథాపి జిష్ణురిత్యేష కథ్యతే పురుషోత్తమః.

ద్రవ్యమునకు ద్రవ్యముతో విరోధము ఈ పద్యములో ఉన్నది. ఈ కాకతీంద్రుడు రుద్రుడయినా చతురాననుడై భాసిస్తున్నాడు. అదేవిధముగా జిష్ణువయినప్పటికీ పురుషోత్తముడని చెప్పబడుతున్నాడు. రుద్రుడు చతురాననుడు అనే పదాలకు శివుడు బ్రహ్మ అనే అర్థాలలో విరోధము ఉన్నది. జిష్ణు పురుషోత్తమ పదాలకు ఇంద్రుడు విష్ణువు అనే అర్థాలలో విరోధము ఉన్నది. చతురమయిన ముఖము కలవాడు. పురుషులలో ఉత్తముడు. అనే అర్థాంతరస్వీకారములో విరోధము లేదు. రుద్రాది పదములు ద్రవ్యవాచకములు అనే అభిప్రాయముతో ఇది ద్రవ్యమునకు ద్రవ్యముతో విరోధోదాహరణముగా ఉదాహృతమయింది. ఏకాదశ రుద్రులు నవబ్రహ్మలు అనే విధాన వ్యక్తిభేదమును ఊహించి నపుడు ఇవి ద్రవ్యవాచకములు కాక పోవచ్చును. ఏకాదశరుద్రులలో రుద్రుడు ఒకడని నవబ్రహ్మలలో చతురాననుడు ఒకడని వారు ఏక వ్యక్తి రూపులె అని భావించి

దీనిని ఉదాహరణముగా గ్రహింపవచ్చును. ఇప్పటికి మొదట చెప్పిన పది భేదాలూ నిరూపితములయినవి. ఈ చెప్పిన వాటిలో అంతా సామాన్యంగా శ్లేష కన్పడుతున్నది. అందు వలన ఈ అలంకారము శ్లేషగర్భముగానే ఉంటుందని అనుకోనక్కరలేదు. ఇది శ్లేష లేకుండగా కూడా ఉంటుంది.

స్వభావశిశిరా దృష్టిరపి కాకతిభూభుజః
సర్వాంగతాపినీ జాతా ప్రతిపక్ష మహీభృతాం

ప్రతాపరుద్రుని దృష్టి స్వభావము చేత చల్లనిది అయినా శత్రురాజులకు తాపపెట్టేది అయింది. చల్లనిది తాపం పెట్టేదికావడము విరుద్ధము. శత్రువులకు తాపజనకముగ ఉన్నది అనే అర్థములో విరోధము లేదు.

## ౨౪ విశేషము

ఇటు మీదట విరోధమూలాలంకారాలను నిరూపించుతాము. విరోధమూలములలోనూ విశేషము బహు భేదాలు కలది కాబట్టి ప్రథమ నిరూపణీయము.

ఆధారరహితాధేయ మేకం చానేకగోచరం
అశక్యవస్తుకరణం విశేషాలంకృతి స్త్రిధా

ఆధారరహితము లయిన ఆధేయములను వర్ణించినా ఒకే వస్తువును అనేకాధారములందు ఉన్నట్లు వర్ణించినా అశక్యవస్త్వంతర కరణమును నిబంధించినా విశేషాలంకారము మూడు విధాలవుతుంది. అని సామాన్యంగా అర్థము అసలు ఆధారం లేకుండా ఆధేయము ఉండదు. ఆవిధంగ ఉండడము విరుద్ధము. ఆ విరోధాన్ని పరిహరిస్తూ ఆధేయమును ఉపనిబంధించితే ఒక విశేషము. ఆధారములు రెండు విధాలు. ఒకటి ప్రసిద్ధాధారము. వేరొకటి అప్రసిద్ధాధారము

ప్రసిద్ధాధారము లేకుండా ఆధేయము ఉండడము అప్రసిద్ధము. అయినప్పటికీ అప్రసిద్ధాధారమును చెప్పి ఆధేయమును వర్ణించితే అది ఒక విశేషమవుతుం దన్నమాట. ఈ విధంగా చెప్పినప్పటికీ అనాధారాధేయమును చెప్పినట్లే. ఒక పరిమితమయిన వస్తువును ఒకే పర్యాయము అనేకము లందున్నట్లుగా వర్ణించితే రెండవ విశేష మవుతుంది. పరిమితవస్తువును ఈ విధముగా వర్ణించినపుడే ద్వితీయ విశేషము. అపరిమితమయిన వస్తువును అనగా వ్యాపకవస్తువును ఈ విధంగా వర్ణించినపుడు అలంకారము కాదు. వ్యాపకము ఒకేసారి అనేకములందు ఉండడము అసంభవము కాదు. ఇది రెండవ విశేష స్వరూపము. ప్రకృతమయిన దానికంటె అశక్యమయిన ఇతరముకూడా సిద్ధమయినట్లు వర్ణించడము నూతన విశేషస్వరూపము. కేవలమూ ఆరంభించిన వస్తువు యొక్క సిద్ధి కలగడమె కాక అసంభావ్యమయిన వస్త్వంతరము కూడా సిద్ధమయినట్లు వర్ణించాలి అని తాత్పర్యము. ఆ వస్త్వంతరము చికీర్షితము (చేయదలచినది) కావచ్చును. అచికీర్షితము కావచ్చును. మొత్తానికి ఫలాంతరనిష్పత్తి ఉంటే తృతీయ విశేష మవుతుంది. యథాక్రమముగా వీని ఉదా :

> నల నహుష దిలీప ధర్మపుత్ర ప్రభృతి నరేశ్వర సంశ్రితా యశఃశ్రీః
> అనుదిన మధునా ప్యుపేత్య మైత్రీం విలసతి కాకతివీరరుద్రకీర్త్యా

నలుడు నహుషుడు దిలీపుడు ధర్మజుడు మొదలయిన రాజులను ఆశ్రయించిన యశఃశ్రీ ప్రతిదినమున్నూ ఇప్పుడు కాకతీయకీర్తితో మైత్రి పొంది విలసిల్లుతున్నది. దీనిలో యశఃశ్రీకి ప్రాచీనరాజులు ప్రధానాధారము. వారు తిరోధానము పొందినప్పటికిన్నీ వారిని ఆశ్రయించిన యశఃశ్రీకి స్థితి వర్ణిత మయింది.

పశ్యంతో భయవిహ్వలాః ప్రతినృపాః పశ్చా త్పురః పార్శ్వయో
రప్యంత ర్బహి రంధ్రపార్థివపతిం ప్రోత్క్షిప్త కౌక్షేయకం
నిస్సీమోల్బణధావన వ్యతికర ప్రభ్రష్ట దోరాయుధాః
శైలాచ్ఛైల మటంతి కంపవిగల ద్గాంభీర్య శౌర్యశ్రియః

శత్రురాజులు, ప్రతాపరుద్రుని ఖడ్గము ఎత్తిపట్టుకొన్న వానినిగా వెనుక ఎదుట పార్శ్వములలో లోపల బయటా భయవిహ్వలులై చూస్తూ అంతు లేకుండా బాగా పరుగెత్తడముచేత ఆయుధాలు అన్నీ జారిపోతూ ఉండగా గాంభీర్యము శౌర్యమూ అన్నీ కంపముతో నశించి పోతూ ఉండగా ఒక పర్వతము నుండి ఒక పర్వతానికి తిరుగుతున్నారు. దీనిలో భయభ్రాంతులయిన శత్రురాజులకు ప్రతాపరుద్రుడు ఒక్కడే అయినా అనేకస్థలాలలో గోచరిస్తున్నట్లు చెప్పబడింది. సమన్వయము సులభము.

అపారకరుణానిధేః సదసి వీరరుద్రప్రభోః
ప్రసాదమధురక్రమా లగతి యత్ర దృష్టి ర్జనే
అతీంద్ర మతికిన్నరాధిప మశేషలోకోన్నతం
న కిం కిమధితిష్ఠతి త్రిభువనే స సర్వాధికః

అపారకరుణానిధి అయిన ప్రతాపరుద్రుని ఆస్థానంలో ప్రసాదమధురమయిన దృష్టి ఎవనియందు లగ్నమవుతున్నదో ఆతడు అతీంద్రము అతికుబేరము అశేషలోకోన్నతమూ అయిన ఏ యే స్థానమును ఆతడు పొందకుండా ఉంటున్నాడు? త్రిభువనాలలో ఆతడు సర్వాధికుడు. దీనిలో సాధారణజనుడు ప్రతాపరుద్రుని దృష్టిప్రసాదపాత్రీకృతుడై ఏమి యేమి పొందడు? అని అశక్య వస్త్వంతర కరణము నిరూపితమయింది.

## ౫౫. అధికము

ఆధారాధేయములలో వైచిత్ర్యము ఉన్నందువలన ఇక్కడ అధికాలంకారము నిరూపణార్హము.

ఆధారాధేయయో రానురూప్యాభావోఽధికో మతః

ఆధారాధేయములకు ఆనురూప్యము లేక పోవడము అధికాలంకారము అవుతుంది. అది రెండు విధాలు. ఆశ్రయమునకు అల్పత్వము చెప్పడము మహత్వము చెప్పడము అని. ఆశ్రయమునకు వైపుల్యము ఉంటే ఆశ్రితము పరిమితమై ఉంటుంది. ఆశ్రితమునకు వైపుల్యము ఉంటే ఆశ్రయమునకు పరిమితత్వము ఉంటుంది. ఇక్కడ ఉన్న పరిమితత్వాపరిమితత్వములు సాపేక్షములు. అటువంటి వస్తుద్వయ సంఘటనము చేతనే అననురూపత్వము గోచరమవుతుంది. ఈ విధంగా ఆధారాధేయములకు అనానురూప్యము ఉన్నపుడు అధికాలంకారము. ఉదా :—

స్తోకే బ్రహ్మాండరంధ్రే విపులతరతయా స్వైరసంచారహేలా
సంకోచా దేకరాశీభవ దతనురుచా కాకతీంద్రస్య కీర్త్యా
ఏతైః ప్రాలేయపృథ్వీధర రజతగిరి స్వర్నదీ శీతభాను
క్షీరాంభోరాశి ముఖ్యైః ప్రకటిత మధునా తద్ఘనీభావరూపం

అల్పమయిన బ్రహ్మాండరంధ్రంలో కాకతీంద్రుని కీర్తి చాలా విపులతరము కావడము చేత స్వేచ్ఛాసంచార విలాసములకు సంకోచము కలిగినందువలన ఒకేరాశిగా అయి పెద్దకాంతి కలదిగా అయ్యేటప్పటికి హిమాలయము కైలాసము వియన్నది చంద్రుడు పాలసముద్రము మొదలయినవన్నీ ఇపుడు ఆ కీర్తి యొక్క ఘనీభావరూపమునే ప్రకటనము చేస్తున్నవి. దీనిలో ఆశ్రయమయిన రోదఃకుహరానికి

అల్పత్వమున్నూ ఆశ్రితమయిన ప్రతాపరుద్రకీర్తికి మహత్వ మున్నూ నిరూపిత మయింది.

క్వాపి క్వాపి కలింగ మాలవ మహారాష్ట్రాంగ వంగాదయో
భూపా స్తాదృశసైన్య వైభవ సమాక్రాంతాఖిలాశాంతరాః
లీనాః కాకతివీరరుద్రనృపతేః వ్యూహప్రపంచశ్రియా
నిస్సీమే బలవారిధౌ విదధతే పూర్తిం న కోణేఽప్యహో!

ప్రతాపరుద్రుని వ్యూహరచనచేత అపారమయిన బల సముద్రంలో కలింగ మాలవ మహారాష్ట్రాంగ వంగాది రాజులు అటువంటి సైన్యవైభవముచేత దిగంతములను ఆక్రమించిన వారయినా ఎక్కడో ఎక్కడో లీనమయినారు. ఏదో ఒక కోణంలో కూడా పూర్తిని సంపాదించ లేకపోతు న్నారు. దీనిలో ఆధారమయిన బలవారిధి మహత్వము కలది గానూ ఆధేయమయిన భూపుల సేనలు అల్పత్వము కలవారు గానూ వర్ణితమయినందువలన అధికాలంకారము. ఈ ఆధి క్యాల్పత్వములు ప్రమాణవిరుద్ధములని అనుకో నక్కరలేదు. పరస్పరమూ ఇవి అనురూపములుగా=తగినవిగా లేకపోవ డమే ప్రకృతంలో గుర్తింప దగినది. అందువలననె మొదట లక్షణంలో ఆనురూప్యాభావము లక్షిత మయింది.

## ౨౬. విభావన

ఈ విభావనాలంకారములో పూర్వాలంకారములో మాదిరిగా ఆనురూప్యము లేకపోవడమనేది సమానంగా ఉంది. అందువలన అధికానంతరము ఇది ప్రసక్తము.

కారణేన వినా కార్యస్యోత్పత్తిః స్యా ద్విభావనా

కారణము లేకుండా కార్యము ఉత్పన్నమయినట్లు వర్ణించితే విభావన అవుతుంది. ఏమీ కారణమె లేకుండా

కార్యము పుట్టడము అత్యంతమూ విరుద్ధము. అప్పటి విరోధము దుష్పరిహారము కూడాను. కారణం ఉంటేనే కార్యం ఉంటుంది. అని నియమము. అందువలన ఈ విధంగా చెప్పాలి. ప్రసిద్ధమయిన కారణము లేకుండా కార్యము యొక్క ఉత్పత్తి నిబద్ధమయినపుడు విభావన అవుతుంది అని. ప్రసిద్ధకారణము లేక పోయినా అప్రసిద్ధకారణము ఉండవచ్చును. ప్రసిద్ధకారణ పరిత్యాగముతో కార్యము యొక్క ఉత్పత్తి విభావిత మవుతుంది కాబట్టి ఇది విభావన అవుతుంది. ఉదా :—

ప్రతాపరుద్రేణ పరాజితానాం ప్రత్యర్థినాం వింధ్యగుహాగతానాం
తమాంస్యరాత్రిణి సముద్భవంతి తేజాంసి ఘస్రేష్వపి నోద్భవంతి

ప్రతాపరుద్రుని చేత పరాజితులై వింధ్యగుహాను పొందిన శత్రువులకు రాత్రులు లేని చీకట్లు పుట్టుతున్నవి. పగటిసమయములో కూడా తేజములు పుట్టడము లేదు. దీనిలో తమఃప్రాదుర్భావమునకు ప్రసిద్ధకారణము రాత్రి. అది లేకపోయినా తమ ఉత్పత్తి నిబద్ధ మయింది. శోకాదికము అప్రసిద్ధమయిన కారణము. అది ఉండనే ఉంది. ఈ పద్యములో తమాంసి తేజాంసి అన్నపుడు రెండు తమస్సులను రెండు తేజస్సులను గ్రహించాలి. చీకటి మోహము అని తమోద్వైవిధ్యము ఉన్నప్పటికీ ఆ రెండిటికీ అభేదాధ్యవసాయమును గ్రహించాలి. ఈ అభేదాధ్యవసాయమును సంపాదించే అతిశయోక్తి ఇటువంటి స్థలాలలో తప్పదు. అయినా అతిశయోక్తి విభావన రెండూ ఒకటొకటి బాధించుకోవడం ఉండదు. అతిశయోక్తి సంపాదించి ఇచ్చిన బలమును గ్రహించి విభావన స్వరూపము పొందుతున్నది. ఇంకా ఈ విషయంలోని చర్చకు భేదాలకూ ఇది అదను కాదు.

## ౨౭ విశేషోక్తి

విభావనాలంకారము కంటె విశేషోక్తి విపర్యయ రూపము. కాబట్టి ఇక్కడ అవకాశము ఉన్నది.

తత్సామగ్ర్యా మనుత్పత్తి ర్విశేషోక్తి ర్నిగద్యతే

కారణసామగ్రి పుష్కలంగా ఉన్నప్పటికీ కార్యము యొక్క ఉత్పత్తి లేకపోయినట్లు నిబంధించితే విశేషోక్తి అలంకార మవుతుంది. కారణము ఉన్నపుడు కార్యము పుట్టకపోవటము కుదరదు. కారణసామగ్రిలో ఏదో వైగుణ్యము ఉన్నందు వలననే కార్యము పుట్టడము లేదు. విభావనలో కార్యోత్పత్తిలోనే విరోధము ఉంది. విశేషోక్తిలో కారణము యొక్క ఉనికిలో మాత్రమె విరోధము ఉంది. విరోధాలంకారములో నయితే ఉభయవిరోధములూ ఉజ్జీవము ఇచ్చేవిగా ఉంటున్నవి. కాబట్టి ఉభయవిరోధానుప్రాణనం ఉన్న విరోధాలంకారంకంటె ఏకైకవిరోధానుప్రాణనం ఉన్న విభావన విశేషోక్తులు విభిన్నములె అని గ్రహించవచ్చు. విభావనాలంకారానికి లక్ష్యముగా ఇచ్చిన పద్యమే దీనికి కూడా లక్ష్యమవుతుంది. ఉదాహరణ లాఘవమును భావించి అసలు మూలములో లక్షణముకూడా ఒకచోటనే నిర్దిష్టమయింది. పై పద్యంలోని నాల్గవపాదము విశేషోక్తి లక్ష్యము. తేజః ప్రాదుర్భావములో పగలు కారణము. పగటి రవి కిరణాలు ఉంటున్నప్పటికీ తేజోనుత్పత్తి వర్ణిత మయినందు వలన విశేషోక్తి అవుతుంది. ఇక్కడ కూడా తేజాంసి అంటే పరాక్రమములు వెలుతురులు అని రెండు అర్థములున్నవి. ఈ రెండిటికీ అభేదాధ్యవసాయము వలన ఏకత్వమును నిశ్చయించాలి. ఇక్కడ ఉన్న అతిశయోక్తి కూడా విశేషోక్తికి అనుప్రాణక

ముగా ఉన్నదని భావించాలి. అసలు కారణసామగ్రి ఉంటే కార్యము పుట్టక పోదు. కారణంలో ఏదో వైగుణ్యము ఉన్నందువలన ఇక్కడ కార్యము ఉత్పన్నము కాలేదు. శత్రువులకు తేజస్సు ఉదయించక పోవడములో నిష్ప్రతాపత్వము మొదలయిన నిమిత్తము ఇక్కడ ఉండనే ఉన్నది. ఏదయినా ఒక విశేషమును అభివ్యక్తము చేయడానికి విశేషరూపమయిన ఉక్తి ఉంటుంది కనుక ఇదివిశేషోక్తి. సామగ్రి ఉండగా కార్యము పుట్టకపోవడములో విరోధము ఉంది. అనుత్పత్తిలో నిమిత్తము ఉంటుంది కాబట్టి విరోధపరిహారము కలుగుతుంది. కాగా ఈ విశేషోక్తి ఉక్తనిమిత్త అని అనుక్త నిమిత్త అని రెండువిధాలవుతుందని అనేక గ్రంథాలలోని మాట. విద్యానాథుడు విశేషోక్తి ప్రస్తావములో ఈ భేదకథనం చేయలేదు. అలంకారాలకు పరస్పరమూ భేదములను చెప్పే ప్రసక్తిలో ఉక్తనిమిత్తవిశేషోక్తి, అనుక్తనిమిత్తవిశేషోక్తి అనే పదాలను స్మరించి కూడా అవసరసమయంలో వానిని చెప్పకుండా ఎందుకు విడిచినాడా ? అనిపిస్తుంది. పై పద్యంలో విశేషోక్తిని సమన్వయించుతూ నిష్ప్రతాపత్వాది నిమిత్తము ఉన్నది అనే భావమును స్పష్టము చేయడము వలన నిమిత్తానుపాదానోపాదాన విశేషమును మనస్సులో పెట్టుకొని ఆ రచన చేసి ఉండవచ్చు అని నిశ్చయించితే మూలగ్రంథస్వరసతకు ఆట్టే భంగపాటు రాదు. ఇంకా ఈ అలంకారద్వయ భేదప్రభేదాలకు ఇది స్థలం కాదు.

### ౨౮ అసంగతి

ఇంతవరకూ కార్యకారణముల విరోధ ప్రస్తావము

జరిగింది. అసంగత్యలంకారము కూడా కార్యకారణవిరోధముతో ఉంటుంది. కనుక ఇక్కడ నిరూపించాల.

కార్యకారణయో ర్భిన్నదేశత్వే స త్యసంగతిః.

కార్యకారణములకు భిన్నదేశస్థితిని వర్ణించితే అసంగతి అవుతుంది. కారణము ఏ ప్రదేశములో ఉంటుందో కార్యము కూడా ఆ ప్రదేశములో ఉండడము ప్రసిద్ధముగా కనపడుతున్నది. వంటఇంటిలోని వహ్ని పర్వతముమీాద ధూమమును పుట్టించ లేదు. కారణము ఒక ప్రదేశంలోనూ కార్యము వేరొక ప్రదేశంలోనూ వర్ణితమయితే ఉచితసంగతి నశించి పోతుంది కాబట్టి అసంగతి అలంకార మవుతుంది. కొన్ని కార్యకారణాలు భిన్నదేశంలో ఉండడము విరుద్ధము కాదు. ఏ కార్యకారణాలు భిన్నదేశంలో ఉండడము విరుద్ధమో అటువంటి కార్యకారణాలకు భిన్నదేశస్థితిని చెప్పితే అసంగత్యలంకార మవుతుందని తాత్పర్యము. ఈ అసంగత్యలంకారానికిన్నీ అతిశయోక్తి అలంకారము అనుప్రాణకముగా ఉంటుందని గ్రహించాలి. ఉదా :

బిభర్త్యుర్వీధురాం గుర్వీం వీరరుద్రనరేశ్వరే
భపం త్యతితరాం శశ్వ న్నమ్రాః సామంతమౌళయః

వీరరుద్రుడు గొప్ప భూభారమును భరించు తున్నాడు. సామంతరాజుల శిరస్సులు మాటిమాటికీ మిక్కిలి నమ్రములవుతున్నవి. దీనిలో ప్రతాపరుద్రుని యందు భూభారము శత్రువులందు నమనమూ వర్ణితము. ఎవరిలో భారము ఉంటే వారే వంగిపోవాలి. ఇక్కడ కార్యకారణాలు భిన్నదేశగతములు కావడము విరుద్ధము. అవి అట్లా నిరూపితములు కాబటి అసంగత్యలంకారము.

## ౨౯ విచిత్రము

విచిత్రము కూడా విరోధప్రస్తావములో చేరదగిన అలంకారము.

విచిత్రం స్వవిరుద్ధస్య ఫలస్యాప్త్యర్థ ముద్యమః

కారణవిరుద్ధమయిన ఫలము యొక్క ప్రాప్తికై ఉద్యమము నిబంధింపబడి నపుడు విచిత్రాలంకారము. ఒక హేతువునకు ఒకకార్యము ఉంటుంది. ఎపుడయినా కార్యము హేతువునకు విపరీతముగా ఉండవచ్చు. అటువంటి కారణ విపరీత ఫల నిష్పత్తి కొరకు ఒకని ప్రయత్నము అంటే ఉత్సాహము నిబంధింప బడినప్పుడు విచిత్రా లంకారము. విపరీతఫల నిష్పత్తి కయిన ప్రయత్నము ఆశ్చర్య హేతువవుతుంది కదా! ఉదా :

ప్రతాపరుద్రనృపతే రగ్రే దూరా న్నరేశ్వరాః
అవరోహంతి హస్తిభ్య స్తా నారోఢు మనర్గళం

ప్రతాపరుద్రుని ఎదుట దూరముగానే రాజులు, అడ్డు లేకుండా ఆరోహించడానికై ఏనుగుల నుండి దిగుతున్నారు. దీనిలో ఆరోహించడానికి దిగుతున్నా రనడము విపరీతఫల ప్రాప్తి ప్రయత్నము.

## ౩౦ అన్యోన్యము

తదన్యోన్యం మిథో యత్రోత్పాద్యోత్పాదకతా భవేత్

ఈ అలంకారము కూడా విరోధమూలము. పుట్టించేది ఉత్పాదకము. పుట్టేది ఉత్పాద్యము. రెండిటికి పరస్పరము ఉత్పాద్యోత్పాదకత వర్ణిత మయినట్లయితే అన్యోన్యాలంకార మవుతుంది. సాక్షాత్తుగా పరస్పరమూ జన్యజనక భావము విరుద్ధము. కాబట్టి క్రియా ద్వారముగా పరస్ప

రము ఉత్పాద్యోత్పాదకత ఉంటే అన్యోన్యమని తాత్ప ర్యము. దాని క్రియ దీనియందు దీనిక్రియ దానియందు వర్ణిత మయినపుడు ఇది కుదురుతుంది.

ఆరోహతా రుద్రనరేశ్వరేణ విరాజతే కాకతిరాజపీఠం
ఆరుహ్య తేనోజ్జ్వలరత్నభాజా రాజాపి లక్ష్మీమధికాం బిభర్తి

కాకతి రాజపీఠము ఆరోహించిన రుద్రనరేశ్వరునిచే శోభించింది. ఆ పీఠమును అధిష్ఠించిన రుద్రనరేశ్వరుడున్నూ సముజ్జ్వలరత్నాలతో కూడుకొన్న ఆ పీఠము చేత అధిక శోభను ధరించు తున్నాడు. ఇక్కడ అలంకరణక్రియా ద్వార ముగా పరస్పర నిష్పాదకత్వము ఉన్నది. ప్రతాపరుద్ర భద్రా సనములకు అన్యోన్యాలంకార్యత్వము స్పష్టము.

### ౩౧ విషమము

విరుద్ధ కార్యస్యోత్పత్తి ర్యత్రానర్థస్య వా భవేత్
విరూపఘటనా చాసౌ విషమాలంకృతి స్త్రిధా.

విషమాలంకారము విరోధమూలము. ఇది మూడు విధాలు. విరుద్ధకార్యము యొక్క ఉత్పత్తిని వర్ణించితే మొదటి విషమము. అనర్థోత్పత్తిని వర్ణించితే రెండవ విష మము. విరూపములయిన వస్తువుల ఘటనము ఉంటే మూడవ విషమము. వీని విపులీకరణమును ఈ విధముగా గుర్తించాలి. మొదటి విషమంలో కారణవిరుద్ధమయిన కార్యోత్పత్తి ఉండాలి. కారణగుణములను సంబంధించి కార్యము ఉత్పన్న మవుతుంది అని సామాన్యంగా లోకప్రసిద్ధి. ఈ విధముగా లేక కారణగుణాల కంటె కార్యగుణాలు వేరుగా ఉండి విరూప కార్యము ఉత్పన్నమయినట్లు వర్ణితం కావాలి. ఇట్లా అను రూపం కాని సంసర్గము ఉన్నందు వలన ఇది విరోధగర్భము.

కారణము కంటె కార్యము విజాతీయముగా ఉండి అతద్గుణంగా ఉంటుంది కాబట్టి కార్యము విరూప మన్నమాట. గోమయము నుండి తేలు పుట్టుతుంది. ఈ రీతిగా కార్యకారణాలు విరూపములు అవుతూనే ఉంటవి. అయినా కవిప్రతిభా నిర్వర్తిత మయిన విరూపత్వమును ఇక్కడ పరిగ్రహించాలి. ఒక విశిష్టమయిన కారణము వలన పైన చెప్పిన విధముగా విరూపమయిన కార్యము పుట్టడమును వర్ణించితే మొదటి విషమము అవుతుంది అని తేలింది. రెండవ విషమంలో అనర్థసముత్పత్తి ముఖ్యము. ఒక ప్రయోజనమును సాధించడానికి ప్రత్నించిన వ్యక్తికి ఆ ప్రయోజనము సిద్ధించక పోవడమె కాక అనర్థప్రాప్తికూడా ఉంటే ఇది అవుతుంది. అత్యంతమూ అననురూపములు విరూపములు అయిన వస్తువులకు ఘటనము ఉంటే మూడవది. ఆ కూర్పబడిన పదార్థములు కేవలము విరూపములుగా ఉండడమె కాక వాని సంఘటన (కూర్పు) కూడా అనను రూపముగా ఉండాలి. అని తాత్పర్యము. ఇటువంటి విరూపఘటనము మూడవ విషమ మన్నమాట. ఈ విధముగా మూడూ మూడు విషమములు. ఈ మూడింటికీఅనుగతమైన సామాన్యలక్షణము లేదు. మొత్తానికి అంతటా అననురూప సంసర్గము విషమాలంకారము అని తేలుతుంది. వరుసగా ఉదా :—

> రాజ్ఞః కాకతివీరరుద్రనృపతేః ఖడ్గాత్ తమాలప్రభాత్
> ఉద్భూతాం శరదిందుకాంతి ధవళాం కీర్తిశ్రియం పశ్యతాం
> లోకానాం మురవైరిపాదకమలా జ్జాతాం వియన్నిమ్నగాం
> శ్రుత్వా సంప్రతి విస్మయా ద్విరమతి ప్రాప్తానుభావం మనః.

ప్రతాపరుద్రుని తమాలకాంతి కలిగిన ఖడ్గమునుండి

ఉత్పన్నమయిన శరచ్చంద్రకాంతి ధవలకీర్తిని చూస్తూ ఉన్న జనుల మనస్సు విష్ణుపాదోద్భవ అయిన గంగను విన్న తర వాత ఒక అనుభవమును సంపాదించి విస్మయమునుండి విరమిస్తున్నది. విష్ణువు నల్లనివాడు. ఆతని పాదకంజాతజాత గంగ తెల్లనిది. నల్లని ఖడ్గము వలన తెల్లని కీర్తి కారణ విరూపకార్యము. కారణగుణము కార్యములో లేదు. ఇక్కడ కార్యకారణముల అననురూపత్వములో కవిప్రతిభ కనపడ తూనే ఉన్నది.

ఆస్తాం జయాశా రిపుభూపతీనాం సంగ్రామసీమాన ముపాగతానాం
ప్రతాపరుద్రస్య విలోకనేన భ్రశ్యంతి జీవై స్సమ మాయుధాని

యుద్ధభూమికి వచ్చిన శత్రురాజులకు జయాశ ఆ విధ ముగా ఉండనీ! ప్రతాపరుద్రుని చూపుచేతనే జీవములతో బాటు ఆయుధాలు కూడా జారిపోతున్నవి. శత్రువులు జయ మును ఉద్దేశించి యుద్ధము ప్రారంభించారు. వారికి జయము లభించక పోగా జీవాయుధములు కూడా పోయినవని వర్ణిత మయినందువలన అనర్థప్రాప్తి ఉన్నది. కనుక ద్వితీయ విషమము.

క్వ భూపాలా స్తాదృగ్విభవమహనీయ ప్రకృతయః
క్వచేయం కాంతారస్థితి రశివవృత్త్యేకనిలయా
ఇతి ప్రేక్షం ప్రేక్షం వనభువి రిపూణా రుద్రనృపతేః
ప్రతాపం శ్లాఘంతే శబరపురవీరాః ప్రతిదిశం.

అటువంటి వైభవము చేత మహనీయమయిన స్వభా వం కల రాజులెక్కడ! అమంగళవృత్తి నివాసమయిన ఈ వన స్థితి ఎక్కడ!! ఈ రెండిటికీ చాలా అంతరం ఉంది. ఇటు వంటి వానికి కూడా ఇక్కడ ఘటనము ఉన్నదే! అని

తాత్పర్యము. ఈవిధంగా వనభూమిలో శత్రువులను చూస్తూ చూస్తూ కిరాతవీరులు ప్రతాపరుద్రుని ప్రతాపమును ప్రతి దిశలోనూ శ్లాఘించుతున్నారు. మహానగర నివాసయోగ్యులయిన రాజులకు అమంగళములయిన వనప్రదేశములకున్నూ ఘటనము ఉన్నది. ఇవి విరూపములు. వీని ఘటనము కూడా అననురూపము. కనుక తృతీయవిషమమును ఊహించాలి. ఇప్పటికి ఈవిధముగా విరోధగర్భాలంకారములు నిర్ణీతమయినవి.

## ౩౨ సమము

సమవిషమాలంకారములకు పరస్పరము వైషమ్యము ఉన్నది. కనుక సమాలంకారమును ఇక్కడ ఇప్పుడు నిరూపించాలి. విషమ విపర్యయము సమము. విషమానికి భేదత్రయము ఉన్నది. ఆ భేదత్రయానికి విపర్యయరూపంగా భేదత్రయము దీనిలో ఉంటుంది అని అనుకో కూడదు. విషమంలోని మొదటి రెండుభేదాల విపర్యయము అలంకారరూపము కాదు. కారణము వలన కార్యము పుట్టడము వస్తుసాధనోద్యతునకు అది సిద్ధించడము వాస్తవమె కాబట్టి అవి అనలంకారములు. ఇక మిగిలిన మూడవ భేద విపర్యయమె బాగా ఉంటుంది కాబట్టి అలంకారంగా పరిగణించాలి. సమము విషమవిపర్యయముగా ఉంటుంది అంటే ఈ అభిప్రాయమునె గుర్తించాలి.

సా సమాలంకృతి ర్యోగే వస్తునో రనురూపయోః

అనురూప వస్తువులకు సంబంధము ఉన్నట్లయితే సమాలంకారమవుతుంది. అన్యోన్యము అనురూపములయిన పదార్థములకు సంఘటనము కుదిర్చినట్లయితే సమాలంకార

మన్నమాట. విషమంలో చెప్పిన విధంగా కూర్పబడే పదార్థములు అనురూపములుగా ఉండడమె కాక వాని సంఘటన కూడా అనురూపముగా ఉండాలని తాత్పర్యము. ఉదా :—

విద్యా స్సకలా లక్ష్మ్యా సమం ప్రతాపరుద్రే
సంఘటయ్య సుసదృశం భవతి కృతార్థః స్వయంబ్రహ్మా.

సకలవిద్యలనూ లక్ష్మితో సమంగా ప్రతాపరుద్రునిలో సుసదృశంగా తానంతట తాను సంఘటించి బ్రహ్మ కృతార్థు డవుతున్నాడు. దీనిలో లక్ష్మీసరస్వతులకు ఇద్దరకూ అనుగుణమయిన కూర్పు నిబద్ధమయింది. కూర్పులో సంబంధించి ఉండే వస్తువులు శ్లాఘ్యములయినవి కావడము అశ్లాఘ్యములయినవి కావడము అని రెండువిధాలుగా ఉంటవి. ఇక్కడ శ్లాఘ్యయోగము ఉన్నది. సుసదృశసంఘటనము అని చెప్పడము చేత సంఘటనమున్నూ అనురూపముగా ఉన్నదని తాత్పర్యము.

### ౩౩ తుల్యయోగిత

ఇక ఇటు మీదట గమ్యమానౌపమ్యములయిన అలంకారముల వర్గప్రస్తావము ఉంటుంది.

ప్రస్తుతానాం తథాన్యేషాం కేవలం తుల్యధర్మతః
ఔపమ్యం గమ్యతే యత్ర సా మతా తుల్యయోగితా

కేవలము ప్రస్తుతములకు కాని కేవలము అప్రస్తుతములకు కాని గుణక్రియారూపమయిన తుల్యధర్మసంబంధము వలన ఔపమ్యము గమ్యమాన మయినట్లయితే తుల్యయోగితాలంకార మవుతుంది. "తుల్యస్య యోగః అస్యాం సంజాత ఇతి తుల్యయోగితా" తుల్యమయిన దానికి దీనిలో సంబంధము కలిగింది కాబటి ఇదితుల్యయోగిత అవతుంది. సమాన

ధర్మసంబంధము వలన ఔపమ్యము గమ్యమానము కావడము ఉండవలెనని చెప్పినందు వలెనని ప్రస్తుతము లయిన రెండు పదార్థాలు కాని అప్రస్తుతములయిన రెండు పదార్థాలు కాని దీనిలో ఉండాలి అనే అర్థము లభిస్తున్నది. అయినా లక్షణవాక్యంలో "ప్రస్తుతానాం తథాన్యేషాం" అని బహువచనము ఉన్నందు వలన కూర్పబడే ప్రస్తుతములూ అనేకములు ఉండాలి. అప్రస్తుతములూ అనేకములు ఉండాలి" అనే అర్థము రావచ్చును. దాన్ని బట్టి తుల్యయోగితలో బహుపదార్థములను గ్రహించాలి. బహుపదార్థములకు ఔపమ్యమును వ్యంగ్యముగా చేయడము దీనిలో ఉంటుంది—అని ఇటువంటి అభిప్రాయమును ఇక్కడ గ్రహింపచేయనక్కరలేదు. ఉదాహరణానురోధముగా చూస్తే రెండు పదార్థములకున్నూ ఔపమ్యము భాసించేటట్లు నిబంధనమున్నది. కాబట్టి రెండు పదార్థములూ ఉండవచ్చు. అనేకపదార్థములూ ఉండవచ్చు అని బోధింప చేయడమె యుక్తము. ఈ విధంగానే దీపకంలో కూడాను. సమానధర్మము గుణక్రియారూపముగా ఉంటుంది కాబట్టి ప్రత్యేక ప్రత్యేకంగా ప్రస్తుతములకు అప్రస్తుతములకూ వానిని సంబంధింపచేస్తే తుల్యయోగిత నాలుగు విధాలవుతుంది. వానిపేర్లు స్పష్టము. ఈ తుల్యయోగితకు అవశ్యంగా అతిశయోక్తి అనుప్రాణకంగా ఉంటుందని అనుకోనక్కరలేదు. అతిశయోక్తి లేకుండగా కూడా తుల్యయోగిత ఉంటుంది. ఔపమ్యము అవశ్యంగా గోచరము కావాలి. ఉదా :-

భద్రాసనాధ్యాసిని రుద్రదేవే తత్కీర్త్యయ స్తద్ద్విషదంగనాశ్చ
అనారతం భ్రాంతివిశేష భాజః ప్రతిక్షణం పాండురతాం భజంతే

రుద్రదేవుడు సింహాసనమును అధిష్ఠించగా ఆతని కీర్తులు శత్రుస్త్రీలున్నూ నిత్యమూ భ్రాంతివిశేషమును పొంది ప్రతిక్షణము తెల్లనవుతున్నారు. ఇది ప్రాకరణికమయిన తుల్యయోగిత. ప్రతాపరుద్రుడు వర్ణ్యమానుడు. ఆతని కీర్తులు శత్రుస్త్రీలున్నూ ప్రస్తుతములె. పాండురత్వము పొందుట సమానధర్మము. కీర్తికి శత్రుస్త్రీలకూ ఔపమ్యము గోచరమవుతున్నది. ప్రాకరణికములకు కాని అప్రాకరణికములకు కాని గోచరమవుతున్న ఔపమ్యము వివక్షానుసారముగా ఉంటుంది. కీర్తివలె స్త్రీలు ఉన్నారు, అనిగాని స్త్రీలవలె కీర్తులు ఉన్నవనిగాని గ్రహించవచ్చును.

కూర్మేంద్ర పన్నగాధీశ హరిత్కరి కులాద్రయః
మిథో నిస్సారతాం ప్రాప్తాః కాకతీంద్రే మహీభృతి

ప్రతాపరుద్రుడు రాజు కాగా ఆదికూర్మము ఆదిశేషువు దిగ్గజము కులపర్వతము అన్నీ పరస్పరము నిస్సారత్వము పొందినవి. దీనిలో కూర్మేంద్రాదులు ప్రాకరణికములు. కూర్మేంద్రసదృశము పన్నగము, పన్నగసదృశము కూర్మేంద్రము అని ఏ విధముగా నయినా ఔపమ్యమును ఊహించవచ్చు. ఇదిన్నీ వైవక్షికమె.

## ౩౪ దీపకము

ప్రస్తుతాప్రస్తుతానాం తు సామస్త్యే తుల్యధర్మతః
ఔపమ్యం గమ్యతే యత్ర దీపకం తన్నిగద్యతే.

తుల్యయోగితాలంకారము కేవలము ప్రస్తుతములకు గాని కేవలము అప్రస్తుతములకు గాని సంబంధించి ఉంటుంది. దీపకము ప్రస్తుతాప్రస్తుతములను ఆశ్రయించి ఉంటుంది. ప్రస్తుతాప్రస్తుతములకు మొత్తముగా గుణక్రియారూప

మయిన తుల్యధర్మమును అనుసరించి ఔపమ్యము గమ్యమయ్యేటట్లుగా నిరూపించినట్లయితే దీపకాలంకారమవుతుంది. ప్రాకరణికాప్రాకరణికములలో ఏదో ఒకచోట సమానధర్మమును నిర్దేశించితే అది ప్రసంగవశాన ఇతరమునకు కూడా ఉపకరించుతుంది. దానిని దీపనము చేస్తుంది. అందువలన దీపసాదృశ్యము స్పష్టము. కనుకనే దీపకమనే పేరు సముచితముగా ఉన్నది. దీనిలో కూడా ఔపమ్యము గోచరము కావాలి. సాదృశ్యవాచకము లయిన ఇవాదులు ఇక్కడ ప్రయోగింపబడవు. కాబట్టి ఔపమ్యము గమ్యమే అవుతుంది. ప్రకృతాప్రకృతములు రెండూ ఉపమేయముగా ఉపమానముగా ప్రసిద్ధములై ఉంటని కాబట్టి ఉపమానోపమేయభావము ఇక్కడ వాస్తవమే. ఈ దీపకంలో సాధర్మ్యము వాక్యార్థగతము గానే ప్రతీతమవుతుంది. అందువలన ఆదిమధ్యాంతగతముగా ధర్మము ఉంటే ఆదిదీపకము మధ్యదీపకము అంతదీపకము అని ఇది మూడు విధాలు.ఉదా:

భాతి నలేన కృతయుగం రఘుకులదీపేన శౌరిణా త్రేతా
ద్వాపర స్తపోజనినా కలియుగం వీరరుద్రేణ.

నలునిచే కృతయుగము రఘుకులదీపకుడయిన శ్రీరామునిచే త్రేతాయుగము ధర్మరాజుచే ద్వాపరము వీరరుద్రునిచే కలియుగము భాసించుతున్నది. దీనిలో 'భాతి' అనే సమానధర్మము మొదటి వాక్యగతముగా ఉంది కాబట్టి ఆది దీపకము. నల రామ ధర్మపుత్రులచేత కృత త్రేతా ద్వాపరములు శోభించినట్లుగా వీరరుద్రునిచే కలియుగము శోభించుతున్నది. అని ఔపమ్యము గోచర మవుతుంది.

భాగీరథ్యా జలనిధీ రాజతే జ్యోత్స్నయా పూర్ణిమాచంద్రః
శ్రుత్యా కమలభవః కీర్త్యా ప్రతాపరుద్రోపి,

భాగీరథిచే జలనిధి, వెన్నెలచే పూర్ణిమాచంద్రుడు
వేదముచే బ్రహ్మ, కీర్తిచే ప్రతాపరుద్రుడు రాజిల్లుతున్నారు
దీనిలో ధర్మము మధ్యవాక్యగతముగా ఉన్నది. గం
మొదలయిన వానిచేత సముద్రాదులు ఏ విధముగా శోభి
చుతున్నవో ఆ విధముగా కీర్తిచే ప్రతాపరుద్రుడు శోభి
చుతున్నాడు. అని ఔపమ్యప్రతీతి ఉన్నది.

సురలోకం సురనాథో నరలోకం వీరరుద్రనరనాథః
ఫణిలోకం ఫణినాథో రక్షతి నిరుపద్రవోద్వేగం.

సురలోకమును సురనాథుడు, ఫణిలోకమును ఫ
నాథుడు, నరలోకమును వీరరుద్రనరనాథుడూ ఉపద్రవవ
ఉద్వేగము లేకుండా రక్షించుతున్నారు. దీనిలో సమా
ధర్మము చివరి వాక్యములో ఉన్నది. అందువలన అం
దీపకము. సురలోక ఫణిలోకములు సురనాథ ఫణినాథుల
రక్షితములయినట్లుగా వీరరుద్రునిచేత నరలోకము రక్షి
మైనది. అని ఔపమ్యము గోచరమవుతున్నది. ఇంకా దీ
సంబంధించిన భేదప్రభేదాలు గ్రంథాంతరములలో నిరూపి
ములయినవి. దీపకంలో సాధర్మ్యము వాక్యార్థగతముగా
గోచరమవుతుంది. అయినప్పటికిన్నిపదార్థగతముగానే ఇక
ఉంటుంది. అని అంటున్నారు. అనేకములు ఏకక్రియా
సంబంధముతో ఏకగుణాభిసంబంధముతో ఉన్నందు వ
ఈ ఔచిత్యమును అనుసరించి పదార్థత్వ వచనమును స
తము చేసికోవచ్చు; ఒకే క్రియ ఒకే గుణము అనేక
ముగా ఉన్నప్పటికీ క్రియారూపంగా గుణరూపంగా
విధాన ఉంటుంది కాబట్టి పదార్థగతమె అని అన్నారు. అ
వాక్యార్థ గత మని అనడమె సమంజసంగా ఉంటుంది. ఆ

అభిప్రాయముతో ఆదిమధ్యాంతగతముగా వాక్యమును ఆవృత్తి చేసి మూడు దీపకములను ప్రాచీనానుసారముగా నిరూపించినాడు.

## ౩౫ ప్రతివస్తూపమ

పదార్థగతమయిన అలంకారద్వయమును నిరూపించిన తరువాత వాక్యార్థగతమయిన అలంకారద్వయమును నిరూపించుతాము.

> యత్ర సామాన్యనిర్దేశః పృథగ్వాక్యద్వయే యది
> గమ్యౌపమ్యాశ్రితా సా స్యాత్ప్రతివస్తూపమా మతా.

సామాన్యధర్మ నిర్దేశము వాక్యద్వయములో వేరు వేరుగా ఉన్నపుడు ప్రతివస్తూపమ అవుతుంది. ఇది గమ్యౌపమ్యమును ఆశ్రయించి ఉంటుంది. వస్తు ప్రతివస్తు భావమును అనుసరించిన సామాన్యధర్మము ఔపమ్యము గమ్యము అయ్యేటట్లుగా వాక్యద్వయములో నిర్దిష్టము కావాలి. అపుడది ప్రతివస్తూపమ "ప్రతివస్తు ప్రతివాక్యార్థం ఉపమా సామాన్యం యస్యాం సా ప్రతివస్తూపమా" ప్రతి వాక్యార్థమును సంబంధించి సామాన్యధర్మము ఉంటుంది కాబట్టి దీని పేరు సార్థకము. పదార్థముల ద్వారా నిష్పన్నమవుతుంది. కనుకనే ప్రతివస్తూపమకు ఇక్కడ ప్రసక్తి ఉన్నది. వాచకశబ్దములను చెప్పి సామాన్యధర్మమును ఒక పర్యాయము నిర్దేశించితే ఉపమాలంకార మవుతుంది. వస్తు ప్రతి వస్తు భావముతో అసకృన్నిర్దేశము ఉన్నప్పటికీ ఉపమాలంకారమే. వాచకపదములు లేకుండా ధర్మానికి అసకృన్నిర్దేశము ఉన్నప్పుడు రెండు విధానాలు ఉన్నవి. అందులో వస్తు ప్రతివస్తు విధానమయితే ప్రతివస్తూపమాలంకారము.

బింబప్రతిబింబభావము ఉంటే దృష్టాంతాలంకారము. వస్తు ప్రతివస్తుభావ బింబప్రతిబింబభావముల స్వరూపములు ఉపమాప్రసంగములో నిరూపితము లయినవి. ఈ ప్రతివస్తూపమాలంకారము సాధర్మ్య వైధర్మ్యములతో రెండు విధాలు. ఉదా :

మంథానాచల ఏవైకః క్షమః సింధువిలోడనే
ప్రతాపరుద్ర ఏవైకః శక్తః శత్రువిలోడనే.

సముద్రవిలోడనములో మంధానపర్వతమె క్షమమయింది. శత్రువిలోడనములో ప్రతాపరుద్రుడె శక్తుడు. ఏ విధంగా సముద్రవిలోడనములో మంథానాచలము క్షమమో ఆ విధంగా శత్రువిలోడనంలో ప్రతాపరుద్రుడు శక్తుడు. అని ఔపమ్యము గమ్యమాన మవుతుంది. సమర్థుడు అనే ఒకే అర్థము సంబంధి భేదముతో క్షమ శక్త శబ్దాల చేత చెప్పబడి నందువలన ప్రతివస్తూపమ.

ప్రతాపరుద్ర ఏవైకః పటీయాన్ జనరంజనే
చంద్రాదృతే క్షమో నాన్య శ్చకోరపరితోషణే.

జనులను రంజింప చేయడములో ప్రతాపరుద్రుడు ఒక్కడే సమర్థుడు. చకోరములను సంతోష పెట్టడములో చంద్రుడు తప్ప ఇతరుడు ఎవరూ సమర్థుడు కాడు. దీనిలో చంద్రుడు ఏ విధముగా చకోరపరితోషణము చేస్తున్నాడో ఆ విధముగానే ప్రతాపరుద్రుడు జనరంజనము చేస్తున్నాడు అని వైధర్మ్యముగా ఔపమ్యము గోచర మవుతుంది. పటీయాన్ క్షమః అనే రెండుశబ్దాల చేతా ఏకార్థమే సంబంధభేదాన నిరూపితమయింది కాబట్టి వస్తుప్రతివస్తుభావమును గ్రహించ వచ్చును.

## ౩౬. దృష్టాంతము

యత్ర వాక్యద్వయే బింబ ప్రతిబింబతయోచ్యతే
సామాన్యధర్మో వాక్యజ్ఞైః స దృష్టాంతో నిగద్యతే

వాక్యద్వయములో సమానధర్మము బింబప్రతిబింబ భావముతో నిరూపితమయినప్పుడు దృష్టాంతాలంకార మవుతుంది. సాదృశ్యవాచకము లయిన ఇవాదులకు ఇక్కడ ప్రయోగము ఉండరాదు. ఇవాది ప్రయోగము ఉంటే ఉపమాలంకార మవుతుంది. "దృష్టః అంతః నిశ్చయో యత్ర స దృష్టాంతః" నిశ్చయము ఎక్కడ కన్పడుతున్నదో అక్కడ అది దృష్టాంతము. ఇది కూడా సాధర్మ్యవైధర్మ్యలతో రెండు విధాలు. ఉదా :—

క్షోణీం బిభ్రతు భూభృతః కతిపయే కాపి ప్రతిష్ఠా పునః
స్వర్ణాద్రే ర్దిగధీశ వాస నగరీ సందిగ్ధ కుంజశ్రియః
రాజానో జనరంజనం విదధతాం శ్రీవీరరుద్రప్రభోః
కోప్యన్యో మహిమా జగత్త్రియధురా ధౌరేయ దోశ్శాలినః.

కొన్ని పర్వతాలు భూమిని భరించినా, దిక్పతులకు నివాసనగరము లేమో! అనే సందేహమును కలిగించే నికుంజముల శోభ గల మేరువు పర్వతానికే అనిర్వాచ్య మయిన గొప్ప ప్రతిష్ఠ ఉంది. రాజులు జనరంజనము చేయుదురు గావుత! మూడులోకముల భారమును వహించ డములో సమర్థమయిన భుజశోభ కలిగిన శ్రీవీరరుద్ర ప్రభువునకే అనిర్వాచ్యము అసాధారణమూ అయిన మహిమ ఉన్నది. ఉపమాన ధర్మమయిన ప్రతిష్ఠ ఉపమేయధర్మమయిన మహిమ రెండున్నూ పరస్పరమూ సాదృశ్యము వలన అభిన్నములుగా గోచరము లవుతున్నవి.

వేరువేరుగా పేనికి నిరూపణము ఉన్నది. ఇటువంటి బింబ ప్రతిబింబభావముతో సామాన్యధర్మ నిరూపణము వాక్య ద్వయములో ఉన్నందువలన దృష్టాంతాలంకారము అవుతున్నది. ప్రకృతాప్రకృతధర్మ పదార్థములయిన ప్రతాప రుద్రుడు మేసవు రెండిటికే బింబ ప్రతిబింబభావము వలన ఔపమ్యము గోచరమవుతున్నది. కేవలము ప్రకృతా ప్రకృతములయిన ధర్మిపదార్థములకే బింబప్రతిబింబభావము ఉండటము కాక ధర్మములకున్నూ బింబప్రతిబింబభావ ముతో నిర్దేశము ఉండాలి.

కాకతీంద్ర కృపాదృష్టిమాత్రా జ్జాగ్రతి సంపదః
తావదబ్జాని నిద్రాంతి యావన్నోదేతి భానుమాన్

ప్రతాపరుద్రుని దయాదృష్టిమాత్రాన సంపదలు మేల్కొంటున్నవి. సూర్యుడు ఉదయించనంతవరకూ పద్మాలు నిద్రిస్తున్నవి. ఈ పద్యములో భాస్వదుదయ మాత్రాన పద్మాలు ఏ విధంగా సమున్మీలనము పొందుతున్నవో ఆ విధంగా ప్రతాపరుద్రుని దయావిలోకనమాత్రము చేత సంపదలు సంభవిస్తున్నవి. అని వైధర్మ్యముతో బింబప్రతి బింబనము ఉన్నది.

౩౭ నిదర్శన

గమ్యమానౌపమ్యముల ప్రస్తావములో నిదర్శనాలం కారమును కూడా నిరూపించాలి.

అసంభవద్ధర్మయోగా దుపమానోపమేయయోః
ప్రతిబింబక్రియా గమ్యా యత్ర సా స్యా న్నిదర్శనా.

సంభవించని ధర్మసంబంధము వలన ఉపమానోప మేయములకు ప్రతిబింబక్రియ గమ్య మయినపుడు నిదర్శన

అవుతుంది. ఉపమానధర్మమును ఉపమేయగతముగా నిబంధించి నపుడు అన్వయము సంభవించదు. దాని సంబంధము కొరకు బింబప్రతిబింబభావమును గోచరింప చేసేటట్లయితే ఒక నిదర్శనము. ఉపమేయధర్మమును ఉపమానగతముగా నిబంధించి నపుడు అన్వయము కుదరదు. అపుడున్నూ బింబ ప్రతిబింబభావమును గోచరింపచేసి నట్లయితే రెండో నిదర్శన మవుతుందని ఇది రెండు విధాలు. ఉదా :—

రిపుతిమిర ముదస్యన్ రత్నసింహాసనస్థః
త్రిభువనరమణీయః కాకతీయక్షితీశః
వహతి మహితవిశ్వోల్లాసి లీలా మఖిఖ్యాం
ఉదయగిరి శిఖరి చూడా చుంబిన స్తీవ్రభానోః.

రిపుతిమిరమును పోగొట్టుతూ రత్నసింహాసనస్థుడై మూడు లోకాలలో మహనీయుడయిన ప్రతాపరుద్రుడు ఉదయపర్వతశిఖరమును స్పృశించుతూ ఉన్న సూర్యుని లోకానంది స్వరూపము కల శోభను వహించుతున్నాడు. ఈ పద్యంలో సూర్యుడు ఉపమానము. ప్రతాపరుద్రుడు ఉపమేయము. సూర్యశోభ ప్రకృతములో సంభవించదు, దాని సంబంధమును సంపాదించడానికై శోభాసదృశమయిన శోభను వహించుతున్నాడు అని బింబప్రతిబింబకరణాక్షేపము ఉన్నది. ఉపమానధర్మమును ఉపమేయమందు నిరూపించుట ఈ పద్యములో ఉన్నది.

వీరరుద్రనరేంద్రస్య యశోవైశద్యసంపదః
లక్ష్యంతే క్షీరవారాశి లీలాదర్పణ మండలే.

ప్రతాపరుద్రుని యశోవైశద్యసంపదలు పాలసముద్రము అనే లీలాదర్పణ మండలంలో గోచరములవుతున్నవి.

దీనిలో ఉపమేయ ధర్మమయిన యశోవైశద్యము దుగ్ధార్ణవములో సంభవించనందు వలన సాదృశ్యమును స్వీకరించి యశోవైశద్య సదృశమయిన యశోవైశద్యము అని స్వీకరించాలి. ఈ విధంగా బింబప్రతిబింబనము గమ్యమవుతుంది. ఉపమేయధర్మము ఉపమానగతంగా చెప్పడంలో ఇది ఉదాహారణము. ఇంకా ఈ నిదర్శనములో చాలా భేదములను ప్రాచీనులంగీకరించి నిరూపించారు. ఒక్కొక్కచోట నిషేధవశము వలన ప్రాప్తి ఆక్షిప్త మవుతుంది. అక్కడకూడా బింబప్రతిబింబభావము గోచరమవుతుంది. ఈ విశేషమును ఈ పద్యంలో గుర్తించ వచ్చు. ఉదా :—

కాకతీంద్రద్విషత్కాంతా భావంత్యః ప్రతికాననం
పద్భ్యాం ముంచం త్యలాక్షాఖ్యాం స్థలే రక్తోత్పలశ్రియం

ప్రతాపరుద్రుని శత్రుస్త్రీలు ప్రతిఅరణ్యానికీ పరుగెత్తుతూ లాక్షారహితములయిన పాదాలతో భూమియందు ఎర్రగలువ శోభను విడిచి పెట్టుతున్నారు. ఇక్కడ ఎర్రగలువ శోభను విడిచి పెట్టుతున్నారు అనడము చేత ఒకప్పుడు వారి పాదాలకు లాక్షారసముతో కూడుకొన్న సమయంలో రక్తోత్పలశోభ ఉండేదని ఆ శ్రీప్రాప్తి ఆక్షిప్తమవుతుంది. పూర్వము కూడా రక్తోత్పలశ్రీ ఉన్నదంటే కేవలమూ అదే సంభవించదు. రక్తోత్పలశ్రీ సదృశమయిన శ్రీ అక్కడ ఉన్నదని ప్రతిబింబకరణమును అభ్యూహించ వచ్చును.

### ౩౮ వ్యతిరేకము

భేదప్రధానసాధర్మ్య ముపమానోపమేయయోః
ఆధిక్యాల్పత్వ కథనాత్ వ్యతిరేకః స ఉచ్యతే.

ఉపమానోపమేయములకు భేదప్రధానమయిన సాధ

ర్మ్యమును చెప్పినట్లయితే వ్యతిరేకాలంకార మవుతుంది. ఉపమానముకంటె ఉపమేయమునకు ఆధిక్యము చెప్పడము వలన గాని అల్పత్వము చెప్పడము వలన గాని సాధర్మ్యము గమ్యమయ్యేటట్లుగా ఉండాలి. అంతే గాని అది వాచ్యము కాకూడదు. భేదమనగా వైలక్షణ్యము. ఇది రెండు విధాల సంభవిస్తుంది. ఉపమానము కంటె ఉపమేయము అధిక గుణాలు కలదిగా వర్ణించి నప్పుడున్ను, ఉపమేయము తక్కువ గుణాలు కలదిగా వర్ణించి నప్పుడున్నూ సంభవిస్తుంది. భేదము దీనిలో ప్రధానముగా ఉంటుంది కాని అభేదము కూడా దీనిలో ఉండనే ఉంటుంది. ఉదా:—

దినకృతి కుముదైః ధృతో న రాగః శశిని పరాంచి పరం సరోరుహాణి
కువలయ కమలాదృత ప్రకాశః ప్రభవతి విశ్వసుహృత్ ప్రతాపరుద్రః,

కుముదములు సూర్యునియందు రాగమును ధరించ లేదు. పద్మములు చంద్రుని విషయమై పరాఙ్ముఖములుగా ఉన్నవి. కువలయకమలాదృత ప్రకాశుడయిన ప్రతాపరుద్రుడు విశ్వసుహృదుడై ఉంటున్నాడు. దీనిలో సూర్యచంద్రులకు సంబంధించని సర్వప్రియంకరత్వము ఉపమేయమయిన ప్రతాపరుద్రునకు సిద్ధప్రాయముగా నిరూపితమయింది. అందువలన ఉపమేయాధిక్య రూపమయిన వ్యతిరేకము. ఇది కువలయ కమలాదృతప్రకాశః అని శ్లేషసముత్థాపితమై ఉన్నది. కువలయము - కలువ భూమండలము. కమలము—లక్ష్మి పద్మము. ఈ రెండర్థములకు అభేదాధ్యవసానమునుగ్రహించాలి. ఉపమానము కంటె ఉపమేయాల్పత్వ పక్షములో విద్యానాథుడు ఉదాహరణమును ప్రదర్శించలేదు. ఆ భేదము సహృదయహృదయాలకు అంతగా

తృప్తిని ఇవ్వక పోవచ్చు. అని ఊహించి ఉంటాడేమో! మొదటి లక్షణవాక్యంలో రెండవభేదము కూడా ఆసూత్రిత మయింది. సర్వస్వ కార మతమును అనుసరించి ఆ విధ ముగా లక్షణమును నిరూపించి ఉండాలి. ఉపమానముకంటె ఉపమేయము తక్కువగుణాలు కలది కావడము మామూలె. కాబట్టి ఆ విధంగా వర్ణించడములో వ్యతిరేకాలంకారత్వము ఉండదని కొందరనుకుంటారు. ఆ అభిప్రాయముతో రెండవ ఉదాహరణమును ప్రదర్శించలేదేమో అని అనిపిస్తుంది. వ్యతిరేకాలంకారములో ప్రకృతార్థమును ఉపరంజకముగా నిరూపించాలని కవికి బాగా సంరంభము ఉంటుంది. అది ఒకపుడు అధికగుణముగా రావచ్చును. ఇతరముఖముగా రావచ్చును. ఎట్లాగయినా సరే! ఇష్టసిద్ధి కలిగితే చాలు. అందువలన రెండవభేదము కూడా ఉండడము ఉచితము గానే కనిపిస్తుంది. ఈదృష్టితోనే మొదట విద్యానాథుడు భేదద్వయమును నిరూపించినాడు. ఉదాహరణసమయంలో అది ఏల లేదో? అని ఆలోచించితే అర్వాచీనులెవరయినా ఆ భేదమును తొలిగించిఉంటారా! అనిన్నీ తోస్తుంది.

## ౩౯ శ్లేష

ప్రకృతాప్రకృతోభయగత ముక్తం చేత్ శబ్దమాత్ర సాధర్మ్యం
శ్లేషోయం శ్లిష్టత్వం సర్వత్రాద్యద్వయే నాంత్యే

శబ్దమాత్ర సాధర్మ్యమును ప్రకృతగతముగా అప్ర కృతగతముగా ఉభయగతముగా నిరూపించినట్లయితే శ్లేషా లంకార మవుతుంది. ఈ రూపంగా శ్లేష మూడు విధాలు. ప్రకృత శ్లేష అప్రకృతశ్లేష ఉభయశ్లేష అని. మొదటి రెండూ అయిన ప్రకృత శ్లేషలోను అప్రకృత శ్లేషలోనూ

అంతటా శ్లిష్టత్వము ఉంటుంది. ఆ రెండిటిలో విశేషణములు శ్లిష్టములు కావచ్చును. విశేష్యములూ శ్లిష్టములు కావచ్చును. చివరి భేదమయిన ఉభయ శ్లేషలో అంతటా శ్లిష్టత్వము ఉండదు. ఒక అంశములోనే శ్లిష్టత్వము ఉంటుంది. అంటే విశేషణములు మాత్రమె శ్లిష్టములు అవుతవి కాని విశేష్యములు శ్లిష్టములు కావన్నమాట. విశేష్యములు కూడా శ్లిష్టము లయితే శబ్దశక్తి మూల ధ్వనియే అవుతుంది. ఒకే శబ్దమును అనుసరించి అనేకార్థములు ఉండడము శ్లేష. కేవలము ప్రకృతములయిన రెండర్థములూ శ్లేషవిధాన గోచరము లయినట్లయితే దానిని ప్రకృత శ్లేష అంటారు. ఒక అర్థము ప్రకృతము వేరొక అర్థము అప్రకృతముగా ఉండి శ్లేష విధాన భాసించితే ఉభయశ్లేష అవుతుంది. దీనికే ప్రకృతా ప్రకృత శ్లేష అనిన్నీ పేరు. కేవలమూ ప్రకృతములయిన రెండర్థములు కాని కేవలమూ అప్రకృతములయిన రెండర్థములుకాని ఏక శబ్దగోచరములయినపుడు ధ్వని అని శంకించరాదు. ఈ రెండింటిలో అర్థద్వయమును ప్రతిపాదించడములో 'ఇది ప్రస్తుతము ఇది అప్రస్తుతము' అని వైషమ్యము ఉండదు. రెండర్థములూ ప్రస్తుతము లయినపుడు రెండర్థములూ అప్రస్తుతము లయినపుడున్నూ ఒక అర్థము ప్రస్తుతము వేరొక అర్థము అప్రస్తుతము అనే అభిప్రాయము ఎందుకు కలుగుతుంది? కాబట్టి అభిధాశక్తియే అకుంఠితమయిన సంచారము కలదై ప్రస్తుతము లయిన రెండర్థములను ప్రస్తుత శ్లేషలోనూ, అప్రస్తుతములయిన రెండర్థములను అప్రస్తుత శ్లేషలోనూ తెలియజేయగలదు. కాబట్టి అభిధచే చెప్పబడిన

ఆ రెండర్థములకూ వాచ్యత్వమె ఉంటుంది. కనుకనే అక్క
విశేషణములు విశేష్యములూ అన్నీ శ్లిష్టములే అయిన
'ధ్వని' అనే శంకయే కలుగదు. ఉభయ శ్లేషలో నయి
రెండవ అర్థము అప్రస్తుత మవుతున్నది కాబట్టి 'ధ్వని' అ
తుందేమో? అనే శంక కలుగడానికి అవకాశము ఉన్నద
అభిధ ఎపుడూ కూడా ప్రస్తుతైక పరతంత్రము. ప్రకరణా
కము అభిధను ప్రస్తుతార్థమందే నియమించుతుంది. అంద
వలన అభిధ ప్రస్తుతమును చెప్పలేదు. కాబట్టే అప్రస్
తార్థానికి వాచ్యార్థమన్నపేరు రాదు. అప్రస్తుతమయి
అర్థముయొక్క ప్రతిపత్తి అటువంటి స్థలములో కలుగవ
నన్నట్లయితే అది వ్యంజన వ్యాపారమూలము గానే కలు
వలెను. కాని వేరొక విధముగా కలుగదు. ఇటువంటి స్థలంల
అర్థాంతరము ఎప్పుడూ వ్యంజన వ్యాపారైక విషయ మ
తుంది. ఈ అభిప్రాయమునే కావ్య ప్రకాశకారుడునూ
స్పష్టముగా నిరూపణము చేసినాడు. అనే కార్థకమయి
శబ్దముయొక్క సర్వార్థములను చెప్పే వాచకతా శక్తి స
యోగాదులచేత నియమితమై పోతే అంటే; ప్రస్తుతపరమ
గానే ఆ వాచకత్వము నియమితము కాగా, అప్రకృత మయి
అర్థ జ్ఞానమును కలుగజేసే వ్యాపారము వ్యంజన వ్యాపారమె
ఇతర వ్యాపారముల వలన ఆ అర్థ జ్ఞానము కలుగదు. అ
అంటున్నారు. కాగా; ఇంతకూ ఉభయశ్లేషలో విశేష
ములు మాత్రము శ్లిష్టములు కావచ్చును కాని, విశేష్యమ
ఏమాత్రమూ శ్లిష్టము కాదని భావము పర్యవసన్న మ
తున్నది. ఇట్లా ప్రకృత గతముగా అప్రకృత గతముగ
ఉభయ గతముగా శ్లేష మూడువిధాలు. ఒక అర్థము ప్రక

తము వేరొక అర్థము అప్రకృతముగా ఉన్నప్పుడు కొందరు ఇటువంటి స్థలంలో శబ్దశక్తి మూలధ్వని అంటారు కాని ఉభయ శ్లేష అనరు. అభిధా శక్తి ప్రాకరణికార్థమును మాత్రము చెప్పి విశ్రాంత మవుతుంది. కాబట్టి ఇక్కడ గోచరించే అర్థాంతరము వ్యంజన వలననే వస్తుంది. కనుక 'ధ్వని' అని అనడమె సముచితము కాని శ్లేష అనడము బాగుండదు. అని వారి అభిప్రాయము. నానార్థక స్థలములో కూడా శబ్దశక్తిమూలధ్వనికి ఉభయశ్లేషకూ విషయ విభాగ మును ప్రదర్శించి ఒకటొకటి కలయిక లేకుండా వేరు వేరుగా ప్రదర్శించడము విద్యానాథునకు అభీష్టము. అందువలననే ఉభయ శ్లేషలో విశేష్యము శ్లిష్టము కారాదు అని నియమ మును ప్రదర్శించుతున్నాడు. దీనివలన ధ్వని కంటె శ్లేషకు వేరుగా అవకాశము లభించింది. ఉభయశ్లేషలో అప్రకృ తార్థము అభిధచే ప్రతిపాదింప బడవచ్చును. విశేష్యము ఎప్పుడయితే శ్లిష్టము కాలేదో ప్రకృతాప్రకృతము లయిన రెండు విశేష్యములూ అపుడు విడి విడిగా ఉంటవి. కాబట్టి ఆయా విశేష్యములకు సంబంధించిన అర్థమును శబ్దశక్తి ద్వారా సూచనము చేయవలసి ఉంటుంది అభిధచే అక్కడ ఆ అర్థమును ప్రతిపాదించు కొనకపోతే వాచ్యార్థమునకు వెలితి ఉంటుందే కాని సంపూర్ణమయిన ఉపపత్తి ఉండదు. అందువలన విశేష్యము శ్లిష్టము కాకుండా ఉన్నపుడు ఉభయ శ్లేషయే అవుతుంది. ఈ శ్లేషాలంకారమును వేరొక విధ ముగా కూడా మూడు విభాలని భావించవచ్చు. శబ్దశ్లేష, అర్థశ్లేష, ఉభయశ్లేష, అని. జతుకాష్ఠ (లక్కపుడక) న్యా యాను సారముగా శబ్దములె అటూ ఇటూ శ్లిష్టములయి

నపుడు శబ్ద శ్లేష అవుతుంది. దీనినే అభంగ శ్లేష అంటారు ఒక తొడిమెను అనుసరించిన రెండు ఫలాల మాదిరిగ (ఏక నాళావలంబి ఫలద్వయ న్యాయము) ఒకే శబ్దమును అనుసరించి రెండు అర్థములు భాసించుతూ ఉన్నప్పుడు అ శ్లేష అంటారు. దీనినే అభంగ శ్లేష అంటారు. రెండు విధాలా నిబంధనము ఉంటే ఉభయ శ్లేష అవుతుంది

ఉదా :-

రాజ్ఞః పూజావిధిం ధత్తే సకలో మాధవే తిథిః
నీలకంఠకలాపాంకే స్ఫురదబ్జమణి త్విషి

ఈ పద్యములో హరి హరులకు సంబంధించిన రెండు అర్థములు ఉన్నవి. మొదట హరి పక్షార్థమును ఈ విధముగా గ్రహించాలి. మయూర పింఛచిహ్నము కలిగిన ప్రకాశిస్తున్న కౌస్తుభ కాంతికల మాధవుని విషయమై పాడ్యమి మొదలయిన చంద్రుని సకల తిథులున్ను పూజావిధానము ధరించు తున్నవి. హరపక్షమయిన రెండవ అర్థము. నల్లని కంఠము కలిగినట్టిన్ని శేఖరమందు ప్రకాశించు చంద్రుని కాంతివంటి కాంతికల ఉమాధవుని విషయమై సకల తిథిని పూజా విధానమును ధరించుతున్నది. దీనిలో హరి హరు ఇద్దరున్నూ పూజావిషయముగా ఉన్నందువలన ప్రాకరణికు సకలా- ఉమాధవే. సకలః- మాధవే' అని పదచ్ఛేదము ఉన్నందు వలన ఇది శబ్దశ్లేష. ఇతర స్థలములలో అర్థశ్లేష

సదృశః కాకతీంద్రోయం మహాకులమహీభృతాం
శిరోగృహీత సన్మార్గ స్ఫుటత్కటక సంపదాం

ఈ పద్యములో కాకతీంద్రుడు- ప్రకృతము అప్రకృతము లయిన రెండు అర్థములు ఉన్నవి. ఈ ప్రతాపరుద్రుడు

శిరస్సుతో గౌరవముగా స్వీకరించిన సాధుమార్గము కలిగి స్ఫురించుతున్న అలంకార (కటక) సంపదకల మహాకుల ములోని మహారాజులకు సదృశుడు. ఇది ప్రకృతము. శిఖర ములచే గ్రహించిన నక్షత్ర మార్గము కలిగి స్ఫురించుతూ ఉన్న చరియల సంపదకల పర్వతములకు సదృశుడు. ఇది అప్రకృతము. మహాకులీను లయిన హరిశ్చంద్రాదులు కుల పర్వతములూ ఉపమానముగా ఉన్నందు వలన అప్రా కరణికములు.

విజితారిపురో మూర్త్యా విలసత్సర్వమంగళః
రాజమౌళిః ప్రతాపాంకరుద్రో రుద్ర ఇవ స్థితః,

ఈ పద్యార్థము నిరూపితమె. రుద్ర ప్రతాపరుద్ర రూప మయిన విశేష్యములు వేరుగా ఉన్నందు వలన ఉభయశ్లేష. రుద్రుడు అప్రాకరణికుడు.

## ౪౦ పరికరము

ఇంతవరకూ ఒకవిధముగా విశేషణముల లోని వైచి త్ర్యము కనపడుతున్నది. పరికరము కూడా విశేషణ వైచిత్ర్య మూలకము. కాబట్టి ఇక్కడ నిరూపణార్హము.

యత్రాభిప్రాయగర్భా స్యా ద్విశేషణ పరంపరా
తత్రాభిప్రాయ విదుషా మసౌ పరికరో మతః.

విశేషణముల పరంపర అభిప్రాయ గర్భముగా ఉన్నట్ల యితే అభిప్రాయ వేత్తలు దానిని పరికరాలంకారమని అం టారు. విశేషణములు వ్యంగ్య గర్భములుగా నిబంధింప బడి నపుడు పరికరాలంకారమవుతుందని భావము. విశేషణములు సాభిప్రాయముగా ఉండడము అంటె ప్రతీయ మానార్థమును గర్భీకరించు కొనడమన్నమాట. కనుకనే ప్రసన్న గంభీరపద

ములు దీనిలో ఉంటవి. అందువలన ఇది ధ్వనివిషయము కాదు. దీనిలో ప్రతీయమానాంశము వాచ్యార్థమునకు ఉన్ముఖమై ఉంటుంది. కనుకనే పరికర మనేపేరు సార్థకము. దీనిలో విశేషణములు అనేకములు ఉండడము వివక్షితము. ఏదయినా విశేషణము నిరభిప్రాయముగా ఉంటే అపుష్టార్థమన్నదోషము కలుగుతుంది. విశేషణము సాభిప్రాయముగా ఉంటే అక్కడ అపుష్టార్థమనే దోషము ఉండదు. అంతే కాని ఇంకా ఎక్కువ విశేషము అక్కడ ఏమి ఉంటుంది? అనేక విశేషణాలను చెప్పి వానిని సాభిప్రాయములనుగా చేసినట్లయితే వాని ద్వారా వైచిత్ర్యాతిశయము కలుగుతుంది. అప్పుడే ఇది అలంకారము. ఈ అర్థమునే 'విశేషణ పరం పరా' అనే పదము సూచిస్తున్నది. దీనిలో ప్రతీయమానార్థము వాచ్యార్థమునకు ఉన్ముఖంగా ఉన్నందువలన ప్రాధాన్యము కలది కాదు. వ్యంగము ఇక్కడ గర్భీకృతమవుతుంది.

రాజ్ఞో యాదవవంశ పార్థివమణేః ప్రఖ్యాతశౌర్యశ్రియః
త్వంగత్తుంగ తురంగ సైన్యమహతో మానైకవిత్తస్య చ
సద్యో రుద్రనరేంద్రనాయక చమూనాథేన కేనాప్యధి
క్షిప్తస్యాచరితాని సేవణపతే ర్జానాతి సా గౌతమీ

యాదవ వంశపార్థివ మణి, ప్రఖ్యాత శౌర్యశ్రీః సమున్నత తురంగ సైన్యాధికుడు, అభిమానైకధనుడు, రాజూ అయిన సేవణ ప్రభువు రుద్రనరేంద్రుని ఏదో ఒక సేనానాయకునిచే అధిక్షిప్తు డయినాడు. అతని అప్పటి చరితములను గౌతమీ నది మాత్రము తెలిసికొంటున్నది. దీనిలోని విశేషణములు అన్నీ ఉత్ప్రాస గర్భములుగా ఉన్నవి.

## ౪౧ ఆక్షేపము

పరికరాలంకారములో అన్యార్థము యొక్క ప్రస్తావము ఉన్నది. విశేష రూపమయిన గమ్యమును ఆశ్రయించి ఉండే ఆక్షేపాలంకారానికి ఇక్కడ అవకాశము ఉన్నది.

విశేషబోధాయోక్తస్య వక్ష్యమాణస్య వా భవేత్
నిషేధాభాసకథన మాక్షేపః స ఉదాహృతః.

ఒక విశేషార్థమును బోధించ డానికి చెప్పిన వచనమునకు నిషేధాభాసము ఉన్నట్లయితే ఒకవిధమయిన ఆక్షేపా లంకార మవుతుంది. విశేషార్థమును సంపాదించ డానికి వక్ష్యమాణమునకు (చెప్పబోయే దానికి) నిషేధాభాసము ఉన్నట్లయితే వేరొక విధమయిన ఆక్షేపాలంకార మవుతుంది. ఈ విధంగా ఉక్త వక్ష్యమాణముల ఆభాస రూపమయిన నిషేధము విశేషమును బోధించేది అయినపుడు ఆక్షేపా లంకారమని తాత్పర్యము. ప్రాకరణికమయిన అర్థమును ప్రాకరణికము కాబట్టే నిరూపణము చేయాలని కవి ఇష్టపడు తాడు. అందువలన ఉక్తముకాని, వక్ష్యమాణము కాని, ప్రాకరణికమె కాబట్టి విధానమునకు (విధించడానికి) తగి ఉంటుంది. అటువంటి దానిని నిషేధము చేయడము యుక్తము కాదు. ఒకపుడు ఆ నిషేధమును చేసినప్పటికీ అది బాధితమె అవుతుంది. అపుడు నిషేధము విశేషార్థ బోధకై ఉపయోగించుతూ అభాసరూప మవుతుంది. అపుడది ఆక్షేపా లంకారమన్నమాట. ఆక్షేపాలంకారములో అంతటా నిరూపింపబడే నిషేధము ప్రకృతమునకు సంబంధించిన విశేషమును సూచించేదిగా ఉండితీరాలి. కాకపోతే గజస్నాన తుల్యమయింది. ఇట్లా ఆభాసరూపమయిన నిషేధము ఒక

పుడు ఉక్తమునకు సంబంధించేది అవుతుంది. (ఉక్తము చెప
బడినట్టిది.) ఒకచోట వక్ష్యమాణమున కయినా సంబంధిం
ఉంటుంది. ఈ విధముగా ఆక్షేపమునకు గతి ద్వయవ
ఉన్నది. ఉక్త విషయాక్షేపములో విశేష రూపమయి
ఇష్టము ఆక్షిప్త మవుతుంది. వక్ష్యమాణ విషయముల
ఇష్ట విశేషము ఆక్షిప్తమవుతుంది. విశేషము ఇక్కడ శ
ముచే చెప్పబడదు కాబట్టి గమ్యముగా ఉంటుంది. ఉ
విషయాక్షేపములో ఒకచోట వస్తువు నిషిద్ధము కా
చ్చును. వేరొకచోట వస్తుకథనము నిషిద్ధము కావచ్చు
అందువలన ఇది రెండు విధాలు. వక్ష్యమాణ విషయాక్షే
ములో వస్తుకథనమె నిషిద్ధ మవుతుంది. ఇదిన్నీ రెం
విధాలు. సామాన్య రూపంగా మొదట ప్రతిజ్ఞ చేసి విశే
షముగా నిషేధించడము ఒకరీతి. సామాన్య రూపము
ఒక అంశమును చెప్పి అంశాంతర గతముగా నిషేధించడ
రెండవ భేదము. ఈ విధముగా ఈ ఆక్షేపాలంకార
నాలుగు భేదాలు కల దవుతుంది. జటిలముగా ఉన్న ఈ
మాల ఈ ఉదాహరణములలో స్పష్ట విశద మవుతుంది.

నరేంద్రమౌళే ! న వయం తవ సందేశహారిణః
జగత్కుటుంబినః కశ్చిన్న శత్రు రితి కథ్యతే

ఓ ! రాజా ! మేము సందేశ హారకులము కా
జగత్కుటుంబివి అయిన నీకు ఎవడున్నూ శత్రువు అని
బడడుకదా ! ఇది రాజులకు సంధి విగ్రహములను ఏర్పా
చేసే వారి వచనము. మేము సందేశహారకులము కా
అని వస్తు నిషేధము ఉన్నది. సందేశ హారకులయిన
సందేశహారకులము కాము అని తత్వనిషేధము చేస్తున్నా

అది ఉపపన్నము కాదు. ఓ ! రాజా ! సంధి విగ్రహ కాలములో ఎప్పటి కప్పుడు తగినట్టి కైతవ వచనాలను మేము పలకడము లేదు. మేము యథార్థమునే చెప్పుతున్నాము. అనే తత్వ వాదిత్వములో ఈ నిషేధము పర్యవసన్న మవుతుంది. సర్వ జగత్పాలకుడ వయిన నీకు శత్రువుగా ఉండే వాడు ఎవడూ లేడు. కాబట్టి మారాజులను కూడా భృత్యరూప ముగా నీవు సంరక్షింప వలసినది. అనే విశేషార్థము ఇక్కడ ఆక్షిప్త మవుతుంది. మొదటలో చెప్పిన నిషేధము నిషేధ ముగా ఉండక ఆభాసరూపమై ఈ విశేషమును గోచరింప చేస్తుందని గ్రహించాలి. ఇది ఉక్త విషయములో వస్తు నిషేధరూపమయిన ఆక్షేపమని ఈసమన్వయము వలన స్పష్ట మవుతూనే ఉన్నది.

వయ మశరణా ఇత్యేషోక్తిః కథం ఘటతే జగత్
త్రితయశరణే త్రాయస్వాస్మానితి స్ఫుట మజ్ఞతా
సకలజనతా రక్షా దక్షే త్వయి ప్రణతా ఇతి
త్రిభువన నమస్కార్యే సిద్ధం ప్రతాపమహీపతే !

మూడు లోకాలకూ శరణుడ వయిన నీ విషయమై మేము అశరణులము అనే మాట ఏ విధముగా కుదురు తుంది ? సకల జనులనూ రక్షించడములో దక్షుడవయిన నీవిషయమై మమ్ములను రక్షింపవలసినది అని అనడము చాలా అజ్ఞత. త్రిభువన నమస్కార్యుడవయిన నీవిషయమై మేము నమస్కరిస్తున్నాము అనేది సిద్ధమే కదా ! ఓ ! ప్రతాప భూపతీ ! సర్వ నాథుడవు రక్షకుడవు నమస్కార్యుడ వయిన నీవు దేదీప్య మానముగా ఉంటూ ఉంటే అనేకులలో ఒకర మయిన మేము అశరణుల మని రక్షించ మని నమస్కరిస్తు

న్నామని పలకడము వ్యర్థముగా ఉన్నది. అని భావము. ఈ పద్యము ఉక్తవిషయములో కథననిషేధమునకు ఉదాహరణము. "మేము అశరణులమనేది ఏ విధంగా కుదురుతుంది ?" ఈ మొదలయిన మాటలు "అశరణుల మనుట కుదరదు" అనే ఆకారంతో నిషేధరూపములు అవుతున్నవి. ఇది కథన నిషేధము. అవిషయప్రవృత్తి ఉన్నందువలన ఈ నిషేధము పెంపుదలలేక ఆభాసరూప మవుతుంది. దీనివలన అవశ్యముగా పరిపాలింప వలసినది అనే విశేషము ప్రతీయమాన మవుతున్నది.

విజ్ఞాపయామస్తే కించి త్కాకతీయకులోద్భవ !
విజ్ఞాప్యతే కిమధునా ? సర్వజ్ఞే రక్షకే త్వయి.

ఓ ! ప్రతాపరుద్రా ! మేము కొంచెము విజ్ఞాపనము చేస్తున్నాము. పోనీలే ! సర్వజ్ఞుడవు రక్షకుడవూ అయిన నీ విషయంలో ఇంకా విజ్ఞాపనము చేసేది ఏముంది ? ఇది వక్ష్యమాణవిషయంలో మొదటి భేదానికి ఉదాహరణము. మేము విజ్ఞాపనము చేస్తాము అని సామాన్యంగా ప్రతిజ్ఞ చేసి ఇంకా ఏమి చెపుతాములే, అని కథననిషేధము ఉన్నది. ఈ కథననిషేధము ఆభాసరూపమై సర్వథా మమ్ములను రక్షింప వలసింది అనే విశేషము గోచర మవుతున్నది.

ప్రతాపరుద్రః స్వయమిద్ధతేజాః దైవం చ తద్విక్రమ దత్తహస్తం
యూయం చ తూలోపమసారభాజః తద్వ్యక్త మేవం యది వా కిముక్తైః ?

ప్రతాపరుద్రుడు స్వయంగా ప్రసిద్ధ పరాక్రమము కలవాడు. దైవము కూడా ఆతని పరాక్రమానికి అనుకూలము. మీరు కూడా నిస్సారులు. కాని ఈ మాటలతో ఏమి ప్రయోజనము ? దీనిలో వక్ష్యమాణవిషయ మయిన

ఆక్షేపము యొక్క సామాన్య రూపమయిన ఒక అంశమును చెప్పి అంశాంతరమును నిషేధించడమునకు ఇది ఉదాహరణము. ప్రతాపరుద్రుడు గొప్పవాడు. మీరు అల్పులు. అని సామాన్య రూపముగా మొదట అంశాత్మక మయిన వచనము ఉన్నది. తరువాత ఈ మాటలతో ఏమిలే! అని అంశాంతర నిషేధము ఉన్నది. ఆ నిషేధము నిషేధరూపముగానే ఉండడము లేదు. ఎన్ని విధాల నయినా ప్రణామాలు చేసి ప్రతాపరుద్రుణ్ణి ప్రసన్నుణ్ణి చేసికొనవలసింది. కాని మీరు ఏమాత్రమూ ప్రాతిపక్ష్యము వహించరాదు. అనే విధంగా శత్రుస్త్రీ వచన భంగితో విశేషము ఆక్షిప్తమవుతుంది. కాబట్టే అంశాంతర రూపమయిన నిషేధము ఆభాస రూపమయిం దన్న మాట.

ఇప్పటికి ఇష్టనిషేధముతో ఆక్షేపమును నిరూపించడమయింది. ఇష్ట నిషేధము బాధితమై విధిలో పర్యవసానము పొందింది. ఇట్లాగే అనిష్టవిధానమున్నూ నిషేధములో పర్యవసానము పొందవచ్చు. ఈ చెప్పిన ఆక్షేపానికి చెప్పబోయే ఆక్షేపానికిన్నీ ఇదే సాజాత్యము. అనిష్ట విధ్యాభాసముకూడా ఆక్షేపాలంకారమె అవుతుంది. అని పెద్దలు అంగీకరిస్తున్నారు. ఇష్ట నిషేధము ఉపపన్నము కాక ఆభాస అయినట్లు అనిష్ట విధి కూడా అనుపపన్నమై ఆభాస అవుతుంది. ఇష్టమయిన వస్తువు ఇష్టము కనుకనె నిషిద్ధము కావడము కుదరదు. అదే విధముగా అనిష్టమయిన వస్తువు అనిష్టము కనుకనె విధింపబడడము కూడా ఉపపన్నము కాదు. అటువంటి దానిని విధించినట్లయితే ప్రస్ఖలద్రూపము అవుతుంది. అంటే తన రూపము నుండి తానే చెదిరి పోతుందన్నమాట. స్వార్థ

బాధ కలదవుతుందన్నమాట. అటువంటి ఆవిధి నిషేధములో పర్యవసానము పొందుతుంది కనుక ఇక్కడ నిషేధము విధికి ఉపకరణము అవుతుంది. విధిచే సిద్ధమవుతున్న ఈ నిషేధము అనిష్ట విశేషరూపమును గోచరింప చేస్తుం దన్నమాట. ఈ ప్రయోజనము లేకపోతే ఇది గజస్నానమే. ఉదా :—

**నాథ !** ప్రతాపరుద్రస్య సేవాం త్యజసి చే త్త్యజ !
అరణ్యగృహమేథిన్యా రీతి రభ్యస్యతే మయా.

ఓ ! నాథా ! ప్రతాపరుద్రుని సేవను విడిచి పెట్టేటట్లయితే విడిచి పెట్టండి. నేనున్నా అరణ్య గృహిణీ రీతిని అభ్య సిస్తున్నాలె. ప్రతాపరుద్రుని పాదసేవ చేయనని పట్టుదల కలిగిన ఒకరాజును గూర్చి ఆతని భార్య పలికే ఈ వచనములో పాదసేవా పరిత్యాగము ఇష్టము కాదు. ఆతని పాదసేవ చేస్తూ పట్టణంలో ఉండడమే మంచిదని ఆ స్త్రీభావము. కాని; 'సేవను విడిచి పెట్టండి' అని అనిష్ట భూతమయిన ప్రతాపరుద్ర పాదసేవా త్యజనమును శత్రుకామిని విధించు తున్నది. ఆ విధి ఇక్కడ ఉపపన్నము కాక ఆభాస రూపముగా పర్యవసన్న మవుతున్నది. అరణ్య గృహమేధినీ రీతిని అభ్యసిస్తున్నాను అని అనడము చేత విధ్యాభాసయే ఉపబృంహిత మయినది.

### ౪౨ వ్యాజస్తుతి

ఇంతవరకూ గమ్యప్రస్తావము వచ్చినందువలన ఇక వ్యాజస్తుతిని నిరూపించాలి.

**నిందయా** వాచ్యయా యత్ర స్తుతిరేవావ గమ్యతే
స్తుత్యా వాగమ్యతే నిందా వ్యాజస్తుతి రసౌ మతా.

వాచ్య మయిన స్తుతిచేత నింద గోచరమయినపుడు

వ్యాజస్తుతి అవుతుంది. నిందాకథన ముఖముగా స్తుతి గమ్యమాన మయితే ఒక వ్యాజస్తుతి. స్తుతి ముఖముగా నింద గమ్యమానమయినపుడు వేరొక వ్యాజస్తుతి. వ్యాజముతో స్తుతి, వ్యాజరూపమయిన స్తుతి, అని రెండు విధాలుగా శబ్దార్థమును గ్రహించాలి. ఉదా :—

కాకతీయవిభోః కీర్త్యా కిం వాద్య ధవళీకృతం
యత్తదీయారివక్త్రేషు దృశ్యతే కాలిమా మహాన్.

ప్రతాపరుద్రుని కీర్తి ఇప్పుడు దేనిని ధవళముగా చేసింది? ఎందు వలన అంటే ఇప్పటికీ ఆతని శత్రు ముఖాలలో బాగా కాలిమ కన్పడు తున్నది. దీనిలో మొదట నింద ఉన్నది. దానిచే శత్రుముఖా తిరిక్తమయిన ప్రపంచమంతా కీర్తిచే ధవళీకృత మయింది అనిస్తుతి గమ్యమానమవుతున్నది.

ప్రతాపరుద్రనృపతే రహో? సాహసికా ద్విషః
యద్విశంత్యుదధీన్ శైలానారోహంతి సమంతతః

ప్రతాపరుద్రుని శత్రువులు అబ్బో! ఎంతో సాహసికులు. సముద్రాలు దూరుతున్నారు. కొండలెక్కు తున్నారు. స్తుతిచే నిందకు ఉదాహరణము. దీనిలో శత్రువుల సాహస ప్రశంస వారి భీరుత్వమును వ్యంగ్యము చేస్తున్నది.

## ౪౩ అప్రస్తుతప్రశంస

గమ్యత్వ ప్రస్తావము వచ్చింది కాబట్టి అప్రస్తుత ప్రశంసను నిరూపించుతాము.

అప్రస్తుతస్య కథనాత్ ప్రస్తుతం యత్ర గమ్యతే
అప్రస్తుత ప్రశంసేయం సారూప్యాది నియంత్రితా.

అప్రస్తుతమును చెప్పినందు వలన ప్రస్తుతము గమ్యమాన మయినట్లయితే అప్రస్తుత ప్రశంసాలంకారము అవు

తుంది. సారూప్యము, సామాన్యవిశేష భావము, కార్యకారణ భావము ఈ మూడూ దీనిని నియంత్రణము చేస్తవి. అప్రస్తుతవర్ణనమె అప్రస్తుతము కాబట్టి దాని వర్ణనము యుక్తము కాదు. అదెపుడయినా ప్రస్తుతపర మయినట్లయితే ఆ వర్ణనము కూడా యుక్తము కావచ్చు. ఏమీ సంబంధము లేకపోతే అప్రస్తుతము వలన ప్రస్తుతము ప్రతీతముకాదు. కనుక అప్రస్తుతము వలన ప్రస్తుతప్రతీతి ఉంటే ఏదయినా సంబంధము ఉండాలి. సంబంధము ఉండి ఆ విధముగా ప్రతీతి కలిగేటపుడు అది త్రివిధసంబంధాన్ని ఎప్పుడూ అతిక్రమించదు. అదే అర్థాంతరప్రతీతిలో హేతువు అవుతూ ఉంటుంది. సారూప్యము, సామాన్యవిశేషభావము, కార్యకారణభావము అని సంబంధము మూడు విధాలు. సామాన్యము విశేషాశ్రయముగా ఉంటుంది. విశేషము సామాన్యనిష్ఠమై ఉంటుంది. ఇట్లా సామాన్యవిశేషములు రెండూ ఒకటొకటి పొదుపుకొని ఉంటవి. ఇట్లాగే కార్యము కారణపరతంత్రము. కారణము కార్యోన్ముఖము. కనుక కార్యకారణములు ఇట్లా సంబంధము కలిగి ఉంటవి. ఈ సంబంధద్వయము వాస్తవము. సారూప్యమయితే అది ప్రతీతిసిద్ధమె కాని వాస్తవము కాదు. ఈ విధముగా అప్రస్తుతప్రశంసాలంకారము అయిదు భేదాలు కలది అవుతుంది. వాని పేరులు—

౧. అప్రస్తుతమయిన సామాన్యము వలన ప్రస్తుతమయిన విశేషప్రతీతి.

౨. అప్రస్తుతమయిన విశేషమువలన ప్రస్తుతమయిన సామాన్యప్రతీతి.

౩. అప్రస్తుతమయిన కారణము వలన ప్రస్తుతమయిన కార్యప్రతీతి.

౪. అప్రస్తుతమయిన కార్యము వలన ప్రస్తుతమయిన కారణ ప్రతీతి.

౫. అప్రస్తుతమయిన సారూప్యము వలన ప్రస్తుతమయిన సారూప్యప్రతీతి.

అప్రస్తుతము వలన ప్రస్తుతప్రతీతి దీనిలో ఉంటు న్నందు వలన సమాసోక్తి కంటె భేదము సిద్ధ మవుతుంది. సమాసోక్తిలో ప్రస్తుతము వలన అప్రస్తుతము గోచర మవుతుంది కదా! అప్రస్తుతమయిన కార్యము వలన ప్రస్తుతమయిన కార్యము గోచర మయినపుడు అనుమానాలంకారము అవుతుందేమో నని శంకించ నక్కర లేదు. అనుమానాలంకారములో ప్రత్యాయ్యము ప్రత్యాయకము (గోచరింప చేయబడేది, గోచరముచేసేది) అనే రెండున్నూ ప్రాకరణికములె అవుతున్నవి. అక్కడ కార్య కారణములు ప్రస్తుతములె. ఈ విధముగానే పర్యాయోక్తములో కూడా కార్య కారణములు ప్రస్తుతములు గానే ఉంటవి. కనుకనే పర్యాయోక్తాలంకారమునకున్నూ వ్యావృత్తి కలుగు తుంది. ఇటువంటి ఈ అప్రస్తుతప్రశంసాలంకారములో ప్రతీయమానము ఉన్నప్పటికిన్నీ ధ్వని అని అనరాదు. దీనిలో ప్రతీయమానార్థము వాచ్యసిద్ధ్యంగమె అవుతున్నది కాబట్టి ఇది గుణీభూతవ్యంగ్యమె కాని ధ్వని కాదు. అప్రస్తుతము వాచ్యము కావడము యుక్తమె కాదు. ప్రతీయమాన మవుతున్న ప్రస్తుతము అప్రస్తుతమునకు సాధనమై ఉపకరిస్తుంది. ఇటువంటి స్థలాలలో ధ్వని కాదు. ఉదా:-

సారూప్యము

**ఆశాసు ప్రశమిత వాసనోదయేభ్యః కిం లబ్ధం? భ్రమరీగణైః జరత్తరుభ్యః పున్నాగో నవనవ సౌరభ ప్రసూనైః ఆమోదం దిశతి నివాస మారభధ్వం.**

దిక్కులలో పరిమళప్రచారము లేకుండగా ఉన్న ముసలి చెట్ల నుండి తుమ్మెద సమూహము ఏమి పొంద గలిగినది ? ఈ పున్నాగము నవనవ సౌరభముకల ప్రసూన ములతో పరిమళము ఇస్తూ ఉన్నది. ఇక్కడ నివాసమును ఆరంభించడి. దీనిలో భ్రమరవృత్తాంతము అప్రస్తుతముగా నిరూపితమయింది. ఈ వృత్తాంతసారూప్యము వలన ప్రస్తుత మయిన ప్రతాపరుద్రవృత్తాంతము గోచర మవుతుంది. అసంపూర్ణ వైభవము కలిగిన సకలరాజులనూ విడిచిపెట్టి సకలగుణపరిపూర్ణుడు సర్వజనానందకరుడూ అయిన ప్రతా పరుద్రుడు ఒక్కడే విద్వాంసులకు సేవింపదగినవాడు అని ప్రస్తుతము.

## సామాన్యము — విశేషము

యశస్వినీ పద్మభవస్య సృష్టి రుత్పాదయిత్రీ నృపశేఖరాణాం
తత్పాలనా ల్లాలనభాగ్య యోగ్యః జాత శ్చిరాన్మధ్యమలోక ఏషః.

రాజశేఖరులను ఉత్పాదించే బ్రహ్మసృష్టి యశోవం తమై ఉన్నది. తత్పాలనము వలన ఈ భూలోకము చాలా కాలానికి లాలనభాగ్య యోగ్య మయింది. ఈ పద్యములో నిరూపితమయిన అర్థము సామాన్యరూపముగా ఉన్నది. దీని వలన రాజవిశేషుడయిన ప్రస్తుతప్రతాపరుద్రుని గుణమ హిమ ప్రతీత మవుతుంది.

## విశేషము - సామాన్యము

ద్రష్టుమనా అపి న పశ్యతి న భణతి వక్తుం సకౌతూహలాపి
స్పర్శాశయాపి న స్పృశతి వనితాయాః కీదృశీ సృష్టిః?

చూడవలెనని అనుకున్నా చూడదు. మాట్లాడాలని కౌతూహలము ఉన్నా మాట్లాడదు. స్పృశించాలని కోరిక

ఉన్నా స్పృశించదు. ఈ వనితాసృష్టి ఏమిటో ? దీనిలో ముగ్ధలయిన స్త్రీలకు నవసమాగమములో సిగ్గు అధికంగా ఉంటుంది. అనే సామాన్యార్థము ప్రస్తుతముగా వివక్షితము. దానిని ప్రతీతము చేయడము కొరకై ఒక విశేషార్థము నిరూపిత మయింది. లజ్జాకార్యము లయిన అదర్శనాదులు విశేషరూపములు. అవి వాచ్యములుగా ఉన్నవి.

**కార్యము - కారణము**

గాధా ఇవార్ణవా జాతా నీచా ఇవ మహాద్రయః
మహీ మవతరత్యస్మిన్ కాకతీయకులేశ్వరే.

కాకతీయకులేశ్వరుడు భూమికిఅవతరించగానే సముద్ర ములు మెరకగా అయినవి. కులపర్వతాలు పొట్టివిగా అయినవి. అర్ణవగాధత్వము పర్వతనీచత్వమున్నూ కార్యభూత మయిన అప్రస్తుతము. దీని వలన కారణభూత మయిన ప్రతాపరుద్రుని గాంభీర్యాదికము ప్రతీయమాన మవుతున్నది. ఇక్కడ కార్య కారణములు అప్రస్తుతప్రస్తుతములు కనుక అనుమానాలం కారము కాదు. పర్యాయోక్తమూ కాదు అని గ్రహించాలి.

**కారణము - కార్యము**

ప్రతాపరుద్రనృపతే ర్ధరిత్రీ కల్పశాఖినః
జాతా మయి కృపాదృష్టిః కిం వా విస్మయసే సఖే !

భూకల్పవృక్షమయిన ప్రతాపరుద్రుని కృపాదృష్టినాపై ప్రసరించింది. సఖుడా ! ఆశ్చర్యపడతావేమి ? ఇప్పుడు నీవు ఇంతటి మహావిభవానికి ఎట్లా భాజనము కాగలిగినావు ? అని కార్యమును గురించి అడుగుతూ ఆశ్చర్యము పొందుతూ ఉన్న స్నేహితునకు కారణభూత మయిన ప్రతాపరుద్రుని

కృపాదృష్టి వాచ్యముగా నిరూపిత మయింది. ఇంకా ఈ అలంకారంలో వాచ్యార్థము సంభవించేది కావడము, కాక పోవడము, అటు ఇటుగా ఉండడము, అని అనేక భేదాలు ఉన్నవి. వానిని యథాసంభవంగా ఆయా ముఖ్యగ్రంథాలలో పాఠకులు స్వయంగా చూచుకోవాలి.

## ౪౪ పర్యాయోక్తము

కారణం గమ్యతే యత్ర ప్రస్తుతాత్కార్యవర్ణనాత్
ప్రస్తుతత్వేన సంబద్ధం తత్పర్యాయోక్త ముచ్యతే.

ప్రస్తుత మయిన కార్యవర్ణనము వలన ప్రస్తుతముగా సంబంధించి ఉన్న కారణము గోచరమయినట్లయితే పర్యాయోక్తాలంకార మవుతుంది. "పర్యాయేణ ఉక్తం పర్యాయోక్తం" ప్రతీయమానమవుతూ ఉన్న కారణమున కార్యాది ద్వారముగా వర్ణించి నట్లయితే పర్యాయోక్త మని అభిప్రాయము. దీనిలో కార్యకారణములు రెండూ ప్రస్తుతములే కావాలి. అందువలననే అప్రస్తుతప్రశంసకంటే భేదము సిద్ధమవుతుంది. ఏది గమ్యమవుతుందో దానినే వాచ్యముగ చెప్పితే పర్యాయోక్తము. ఒకే వస్తువు ఒకే కాలంలో వాచ్యము గమ్యమూ కావడము కుదరదు. అందువలన గమ్యమవుతూ ఉన్న విధానం కంటె వేరొక ప్రకారాంతరంలో అంటే; కార్యముగా అభిధానము ఉండాలి. వాచ్యముగ చెప్పబడుతున్న కార్యము కారణమునకు సంబంధించే ఉంటుంది కాబట్టి స్వసిద్ధికొరకై కారణమును ఆక్షిప్తము చేస్తుంది. అందువలన అది గమ్యమయినా వాచ్యాయమానమే. ఉదా :—

ప్రతిభూపాల శుద్ధాంత దీర్ఘికా స్వాజిధూసరాః
ప్రక్షాలయంతి గాత్రాణి కాకతీయచమూచరాః

శత్రువుల అంతఃపురములలోని బావులలో యుద్ధ ధూళి ధూసరితులయిన ప్రతాపరుద్రుని సేనాభటులు తమ శరీరములను ప్రక్షాళనము చేసికొంటున్నారు. దీనిలో ప్రతాపరుద్రుని భటులు చేస్తూ ఉన్న రిపునగరీ దీర్ఘికా వారి విహారము కార్యభూతము. దీని వలన యుద్ధ ప్రారంభము లోనే తమ పట్టణాలను విడిచి పెట్టి శత్రురాజులు పలాయితు లయినారు అని కారణము ప్రతీతము అవుతున్నది.

## ౪౨ ప్రతీపము

అలంకారాలలో కొన్నిటి యందు ప్రతీయమానము స్ఫుటముగా ఉంటుంది. మరికొన్నిటిలో అస్ఫుటముగా ఉంటుంది. ప్రతీపము అస్ఫుటప్రతీయమానము. ఇది రెండు విధాలు. ఉపమేయము వలననే ఉపమానకార్యము సిద్ధమ వుతూ ఉంటే ఉపమానము ఇంకా దేనికి ? అనే అభిప్రాయ ముతో ఉపమానము వ్యర్థమని నిరూపిస్తూ ఆక్షేపము చేసి నట్లయితే మొదటి ప్రతీపము. ఉపమానంగా ప్రసిద్ధమై ఉన్న వస్తువునకు వేరొక ఉపమానమును చూపించి అనాదరము చేయడానికి ఉపమేయత్వము కల్పించితే రెండవ ప్రతీపము. ఉపమేయము ఉపమాన ప్రతికూలముగా ఉంటుంది కాబట్టి దీనికి ప్రతీపము అనే పేరు యుక్తముగా ఉంటుంది. ఈ అభి ప్రాయముతో ఈ లక్షణార్థమును భావించాలి.

ఆక్షేప ఉపమానస్య కైమర్థ్యేన కథ్యతే
యద్వోపమేయభావః స్యాత్ తత్ప్రతీప ముదాహృతం.

ఉపమానమునకు కైమర్థ్యము చేత ఆక్షేపమును

నిరూపించినా, ఉపమానమునకు ఉపమేయభావమును నిరూపించినా ప్రతీపాలంకార మవుతుంది. ఉపమేయము లోకోత్తరము అనే అభిప్రాయముతో ఉపమానాక్షేపము చేస్తే ఒక ప్రతీపము. ఉపమేయానికి ఉపమానత్వమును కల్పించితే రెండవ ప్రతీపము. ఉపమానోపమేయాలలో ఉపమానము అధిక గుణాలు కలదని ఉపమేయము న్యూనగుణాలుకలది అని ఒక ప్రసిద్ధి. ఇటువంటి ప్రసిద్ధిలో కవి వివక్షయే ప్రయోజకముగా ఉంటుంది. ఈ అలంకారము యొక్క రెండు భేదాల లోనూ ప్రతీపము అనేపేరు సంజ్ఞామాత్రము కాక సార్థకంగా ఉంటుంది. ఈ రెండు భేదాలకూ అనుగతంగా సామాన్యలక్షణం లేదు. ఒకటే రెండు విధాలవుతుం దన్న మాట. ఇవి ఉపమాభేదములె అవుతవని అనుకోరాదు. ఉపమాలంకారములో ఉపమానాక్షేపము ఉండదు. ఉపమానమునకు ఉపమేయత్వ కల్పనమూ ఉండదు. ఇవిన్నీ సాధర్మ్య జీవితముగా ఉంటవి. ఉదా ;

కీర్త్యౌ ప్రతాపరుద్రస్య విలసంత్యాం దిగంతరే
కిమర్థ ముదయత్యేష నిర్లజ్జః శశలాంఛనః.

ప్రతాపరుద్రుని కీర్తి దిగంతరంలో విలసిస్తూ ఉంటే సిగ్గులేని చంద్రుడు ఎందుకు ఉదయిస్తున్నాడు ? చంద్రుడు చేయవలసిన పనిని కీర్తి చేస్తూ ఉన్నపుడు చంద్రుడు ఇంకా ఎందుకు ?

కాకతీయకులే లక్ష్మీపతి రేష న సంశయః
అనేన కథ మల్పజ్ఞైః సుమేరు రుపమీయతే.

కాకతీయకులంలో ఈతడు లక్ష్మీపతి. సంశయము లేదు. అల్పజ్ఞులయిన వారు ఈతనితో సుమేరువును పోల్చు

తారేమి ? దీనిలో ఉపమానముగా ప్రసిద్ధమయిన మేరుపర్వతానికి నికర్ష సంపాదించడానికి ఉపమేయత్వము కల్పితమయింది. కాకతీంద్రునకు ఉపమానత్వము నిరూపితమయింది. ఇటువంటి నిరూపణములో ఇక్కడకూడా కవి వివక్షయె ప్రయోజకము.

## ౨౭ అనుమానము

ఇటు మీదట తర్కన్యాయమూలాలంకారములు నిరూపితము లవుతవి. వానిలో కూడా అనుమానాలంకారము ప్రధానము. కాబట్టి మొదట నిరూపణీయము.

సాధ్య సాధన నిర్దేశే త్వనుమాన ముదీర్యతే.

సాధ్యము సాధనము అనే రెండింటి యొక్క నిర్దేశము ఉన్నట్లయితే అనుమానాలంకార మవుతుంది. అనుమానవాదుల ప్రణాళికలో, సాధ్యము సాధనము వ్యాప్తి పక్షము సపక్షము విపక్షము మొదలయిన కొన్ని పారిభాషిక పదాలు ఉన్నవి. కావ్యభాషలో ప్రసిద్ధములయిన అర్థాలకంటె వీని అర్థములో కొంత సాంకేతికములై ఉంటవి. కార్యమును అనుసరించికారణమునుఊహించడముసామాన్యముగా అనుమానము యొక్క స్వరూపము. అగ్నివలన ధూమము ఉత్పన్న మవుతుంది కాబట్టి అగ్ని కారణము. ధూమము కార్యము. ఒకడు గ్రామంలో తన ఇంటి దగ్గర ఉన్నపుడు వంటగదిలో అగ్ని ఉండగా ధూమము రావడమును అనుభవములో గుర్తించి ఉంటాడు. అపుడాతడు ధూమము ఉన్న చోట అగ్ని ఉంటుంది అని అభిప్రాయమును కలుగ జేసుకుంటాడు. ఒకపుడు పర్వతసమీపానికి వెళ్లగా దట్టమయిన ధూమము కనపడింది. దానిని చూచి పర్వతము మీద అగ్ని

ఉన్నదని ఆతడు ఊహించ గలడు. ఊహింప జేసిన ధూమము సాధనము. ఊహింప బడిన అగ్నిసాధ్యము. ఆశ్రయముగా ఉన్న పర్వతము పక్షము. ఎక్కడెక్కడ ధూమము ఉంటుందో అక్కడక్కడ వహ్ని ఉంటుంది అనేది వ్యాప్తి. సాధనమన బడే హేతువు మూడు రూపములతో ఉండాలి. పక్షంలో గోచరించడము. సపక్షములో ఉండడము. విపక్షమునుండి వ్యావృత్తము కావడము. పర్వతము పక్షము. వంటఇల్లు సపక్షము. తటాకము విపక్షము. ఇటువంటి సాధనముతో తప్పకుండా సంబంధి ఉండేది సాధ్యమవుతుంది. అని భావము న్యాయశాస్త్రమర్యాదలో అనుమాననిరూపణము ఏ విధ ముగా ఉంటుందో ఇక్కడ కూడా అదే విధము ఉంటుంది ఇట్లా తర్కానుమాన సమాన కక్ష్య మయినప్పటికిన్నీ ఈ అలంకారంలో కొంత విశేషము ఉన్నది. తర్కాను మానము చమత్కారి కాదు. లోకవిలక్షణమయిన సాధ్య సాధనభావము దీనిలో ఉంటుంది కాబట్టి చమత్కారవి షము దీనిలో ఉంటుంది. స్వార్థానుమానము పరార్థాను మానము అని అనుమానము రెండు విధాలు. "ఈ విష యము నాకు తెలిసింది" అని తన పరామర్శ నిశ్చయమవ ఉంటే స్వార్థానుమానమని, ఇతరునకు తెలియనట్టి వస్తువు ప్రతిపాదించి నపుడు ఇతరుని విశ్వసింప చేయడము ఉ టుంది కాబట్టి అటువంటిది పరార్థానుమానమని అంటా ఈ రెండు విధములయిన అనుమానాలున్నా ఇక్కడ ఒ అలంకారముగా నిశ్చయించాలి. అలంకారమయిన అ మానము రూపకమూలముగా ఉంటుంది కాబట్టి తర్కా నుమానము కంటె విలక్షణము. వేరొక అలంకారము ఇక్క

మూలముగా ఉండడమె కాక కేవలము శుద్ధముగా కూడా ఇది ఉండవచ్చు. అటువంటి స్థలాలలో కవిప్రౌఢోక్తి నిష్పన్న మయిన రమణీయార్థము చమత్కార విశేషమును సంపాదిస్తుంది. కనుక తర్కానుమానం కంటె వైలక్షణ్యమును ఊహించాలి. అందువలన కవికర్మ వైలక్షణ్య నిమిత్తమని నిశ్చయించడమె సముచితము. కవి కౌశలమె లేకపోతే అసలీ అలంకారములో విచ్ఛిత్తివిశేషము కుదరదు. ఒకపుడు నిరూపించిన అర్థములో స్వభావసిద్ధ మయిన సుందరత లేకపోయినా కవి ప్రతిభా నిర్వర్తితమయిన విశేషము ఉన్నప్పుడు అనుమానము అలంకారమె అవుతుంది. సామాన్యంగా అనుమాన ప్రక్రియలో ప్రత్యాయ్య ప్రత్యాయకభావము సమర్థ్య సమర్థకభావము అని రెండు విధానాలు ఉంటవి. ఇదివరలో ప్రతీతము కాని దానిని ప్రత్యాయనముచేయడము అంటే; తెలియజేయడము ఉన్నప్పుడు ప్రత్యాయ్య ప్రత్యాయక భావము ప్రసరించుతుంది. తెలిసిన దానిని ప్రత్యాయనము చేయడము ఉంటే సమర్థ్య సమర్థకభావము ఉంటుంది. సమర్థ్య సమర్థకభావము ఉన్నపుడు అనుమానాలంకారము కాదు. ప్రత్యాయ్య ప్రత్యాయకభావము ఉన్నపుడే అనుమానము అలంకారము అవుతుంది. ఇంకా ఈ విషయవిస్తరణము కంటె ఉదాహరణ సమన్వయమె సముచితము.

రజోధూమః సేనావ్యతికరభవో యత్ ప్రసరతి
స్ఫులింగా దృశ్యంతే భటఘటిత కౌక్షేయక భువః
తతో మన్యే యాత్రాశుచిసమయజో రుద్రనృపతేః
ప్రభూతః కోపాగ్నిః దహతి రిపుభూపాల నగరీః.

సేనాసంబంధము వలన పుట్టిన రజోధూమము ప్రసరించుతున్నది. అంటే, భటులఖడ్గాలవలన ఉత్పన్నములయిన

స్ఫులింగములు కన్పడుతున్నవి. అంటే,వీనివలన జైత్రయాత్ర
అనే గ్రీష్మసమయంలో పుట్టిన ప్రతాపరుద్రుని ప్రభూ
కోపాగ్ని శత్రునగరములను గహించుతున్నది అని నిశ్చ
యించు తున్నాను. దీనిలో క్రోధాగ్ని సాధ్యము. రజోధూ
స్ఫులింగములు సాధనము. సాధ్యసాధననిర్దేశము ఇక్క
ఉన్నది. రజోధూమ-యాత్రాశుచిసమయ-కోపాగ్ని స్థ
లలో రూపకమున్నూ ఉన్నది కాబట్టి అనుమానాలంకారమ
ఇక్కడ అనుమానప్రక్రియను ఈ విధముగా బోధించవచ్చు
అయ మగ్నిమాన్ స్ఫులింగాత్ ధూమాత్, యత్ర యత్ర
ధూమః తత్ర తత్ర అగ్నిః; అయం కోపవాన్ సేనారజ
వత్వాత్, భటఖడ్గవత్వాచ్చ, యత్ర యత్ర సేనారజః ఖ
తత్ర తత్ర కోపః; ఇట్లా వేరు వేరుగా అనుమానరూపము
గ్రహించి నందు వలన చమత్కారము కలుగక పోయిన
ఆరోపము వలన చమత్కారవిశేషము ఉదయించుతుం
కాబట్టి అనుమానము అలంకార మవుతుంది. ఇంకా దీని
సంబంధించిన విశేషములు ఇక్కడ నిరూపితములు కా
డము లేదు.

## ౪౭ కావ్యలింగము

ఈ అలంకారము కూడా తర్కన్యాయమూలమ
అనుమానాలంకారములో మాదిరిగా సాధ్యసాధన నిర్దేశవ
దీనిలోనూ ఉంటుంది. కాని అప్రతీత ప్రత్యాయనవ
ఉండదు కనుక ప్రత్యాయ్యప్రత్యాయకభావము గోచరించద
ప్రతీతప్రత్యాయనమె ఇక్కడి పరమార్థము. కాబట్టి సమర్థ
సమర్థభావము ఉంటుంది.

హేతో ర్వాక్యపదార్థత్వే కావ్యలింగ ముదాహృతం.

హేతువు వాక్యగతముగా ఉన్నా పదగతముగా ఉన్నా కావ్యలింగాలంకార మవుతుంది. ఈవిధముగా ఇది ద్వివిధము. కారణరూప మయిన హేతువు వాక్యార్థగతిని అనుసరించి విశేషణద్వారముగా ఉన్నప్పుడు ఒక విధము. పదార్థగతిని అనుసరించి హేతువుగా నిబద్ధమయినప్పుడు రెండవ విధము. ఈ రెండుభేదాలను వాక్యార్థహేతుక కావ్యలింగము పదార్థ హేతుక కావ్యలింగము అని వ్యవహరించవచ్చును. హేతువుగా ఉన్న దానిని నిబంధించడము మొదటి దానిలోనూ, ఉపనిబద్ధమయిన దానిని హేతువుగా చెప్పడము రెండవ దానిలోనూ ఉంటుంది. చెప్పిన విషయమును సమర్థించడానికి సమర్థకముగా ఉండే హేతువు అనగా లింగము ఇక్కడ ఉన్నందు వలన కావ్యలింగము అనే పేరు సార్థకము. తర్కశాస్త్ర ప్రసిద్ధమయిన వ్యాప్తి పక్షధర్మత మొదలయిన వాటితో కూడుకొన్న లింగముకంటె ఇది విలక్షణ మని నిరూపించడానికె కావ్యపదము సమర్థ మవుతుంది. ఉదా :—

### వాక్యార్థగతము

ప్రతాపరుద్ర ఇత్యేషా కాపి పంచాక్షరీ శుభా
హృది యాం బిభ్రతో భూపా వశీకుర్వంతి సంపదః.

"ప్రతాపరుద్ర" అనే పంచాక్షరీ మంత్రము అనిర్వాచ్యము. శుభప్రదము. దీన్ని హృదయాన ధరించిన రాజులు సంపదలను వశీకరించు కొంటున్నారు. సంపద్వశీకరణములో పంచాక్షరీ ప్రాశస్త్య రూపమయిన వాక్యార్థము హేతువుగా ఉన్నది.

### పదార్థగతము

మ్లానాపి భూభృతాం ఫాలలిపి రుచ్ఛ్వసితా పునః
ప్రతాపరుద్ర దేవాంఘ్రి నఖజ్యోత్స్నామృతోక్షితా

ప్రతిరాజుల ఫాలలిపి మ్లానమయినప్పటికి ప్రతాపరుద్ర దేవుని పాదనఖ జ్యోత్స్నామృతముచే తడుపబడి మరల ఉచ్ఛ్వసిత మయింది. దీనిలో పూర్వము పరిమ్లానమయిన భూపాల ఫాలలిపి పునరుచ్ఛ్వాసము పొందడములో ప్రతాపరుద్ర నరేంద్రుని చరణనఖ చంద్రికాసేచనము హేతువు. అది విశేషణగతముగా ఉన్నది కాబట్టి పదార్థగత కావ్య లింగము. హేతుహేతుమద్భావము స్పష్టంగా శబ్దోపాత్త మయితే అందంగా ఉండదు. అందువలన దానిని కొంత గూఢాగూఢంగా ఉంచాలి. ఇక్కడ ఆ విధముగానే ఉన్నది.

## ౪౮ అర్థాంతరన్యాసము

కావ్యలింగాలంకారానికి అర్థాంతరన్యాసాలంకారము నకూ కొంత సామ్యము ఉంది. కనుక ఇక్కడ నిరూపించాలి.

కార్య కారణ సామాన్య విశేషాణాం పరస్పరం
సమర్థనం యత్ర సోర్థాంతరన్యాస ఉదాహృతః.

కార్యము కారణము, సామాన్యము విశేషము వీనికి పరస్పరమూ సమర్థనము ఉంటే అర్థాంతరన్యాసాలంకార మవుతుంది. కార్యము కారణమును సమర్థించేదిగా ఉన్నా కారణము కార్యమును సమర్థించేదిగా ఉన్నా సామాన్యము విశేషమును సమర్థించేదిగా ఉన్నా విశేషము సామాన్యమును సమర్థించేదిగా ఉన్నా అర్థాంతరన్యాస మవుతుందని భావము. ఈ పరిసంఖ్యానముతో ఈ అలంకారము నాలుగు విధాలవు తున్నది.

౧. సామాన్యముతో విశేష సమర్థనము.
౨. విశేషముతో సామాన్య సమర్థనము.
౩. కార్యముతో కారణ సమర్థనము.

౮. కారణముతో కార్య సమర్థనము.

వీనిలో సమర్థింపబడేది సమర్థనార్హముగా ఉండాలి. అంతేకాని అపూర్వముగా ప్రతీత మయ్యేది కాకూడదు. సమర్థ్య సమర్థకభావ మనేది కావ్యలింగములోనూ దీనిలోనూ సమానమె. అయినా ఈ అలంకారములో సమర్థ్యసమర్థక భావము తాటస్థ్యముతో ఉంటుంది. సమర్థనమునకు తగిఉన్న ప్రకృతమును కార్యకారణభావముతో గాని సామాన్యవిశేష భావముతోగాని సమర్థించడమును చెప్పితే అర్థాంతరన్యాసా లంకారము అవుతుందని ఫలితార్థము.

౧. భూపాః ! ప్రతాపరుద్రస్య నతా భవత ? నోన్నతాః
ఉన్నతాఞ్ నమయత్యేష నతా నున్నమయ త్యసౌ.

ఓ ! భూపాలకులారా ! మీరు ప్రతాపరుద్రునకు వినమ్రులు కండి. ఉన్నతులు కావద్దు. ఈతడు ఉన్నతులను వినమ్రులనుగా చేస్తాడు. వినమ్రులను ఉన్నతులనుగా చేస్తాడు. నమ్రత్వము వలన ఔన్నత్యము కలుగుతుందని దీనిలో భావము. ఫలరూపమయిన ఔన్నత్యము చేత నమ్రత్వ కారణము దీనిలో సమర్థితమయింది.

౨. ఉద్వేజితా రుద్రనరేశ్వరస్య రణాపదానైః ప్రతిపక్షభూపాః
బిభ్యత్యమీ చిత్ర మచేతనేభ్యో భీతస్య సర్వం భయకారి నూనం.

ప్రతాపరుద్రుని యుద్ధము లనే అద్భుతకర్మలచేత ఉద్వేగముపొందిన శత్రురాజులు అచేతనములవలన కూడా భయపడుతున్నారు. ఆశ్చర్యము ! భయపడినవానికి సర్వమూ భయమును కలుగజేస్తుంది కదా ! దీనిలో అచేతనముల వలన కూడా శత్రురాజులు భయపడుతున్నారు అనే విశేషా

ర్థమును భయపడినవానికి సర్వమూ భయకారి అనే సామ
న్యార్థము సమర్థించు తున్నది.

౩. దుష్టోపి మహతాం సంగా ద్భవత్యేవ హి సజ్జనః
ప్రతాపరుద్ర మభ్యేత్య కలిః కృతయుగాయతే.

దుష్టుడయినా గొప్పవారి సంబంధము వలన సజ్జ
డవుతాడు. ప్రతాపరుద్రుని పొంది కలియుగము కృతయు
మువలె ఆచరిస్తున్నది. దీనిలో ప్రతాపరుద్రుని సంగ
మహిమ చేత కలి కృతయుగ సదృశ మయింది అని విశేష
ర్థముచేత సామాన్యార్థ సమర్థనము ఉన్నది. కార్యకార
భావములో కారణము వలన కార్యమును సమర్థించుట అనే
కావ్యలింగములో అంతర్భవించుతుంది. కాబట్టి అర్థాం
రన్యాసాలంకారము మూడు విధాలని తేలింది. కార్యకార
భావమును ఆశ్రయించిన రెండు భేదాలూ కావ్యలింగమ
లోనే అంతర్భూతము లని సర్వస్వకారునిభావము. విద్యా
నాథుడు ఒక భేదము మాత్రమె కావ్యలింగాంతర్భూతమ
భావిస్తున్నాడు. సమర్థకమయిన హేతువు వాక్యపదగతముగ
ఉన్నప్పుడు కావ్యలింగముకదా! వాక్యపదగతత్వము కార
మునకె కాని కార్యమునకు కాదు అని దానివలన వచ్చే
అర్థము. కార్యము సమర్థించేదిగా ఉన్నప్పుడు కావ్యలింగమ
అనవక్కరలేదు అని విద్యానాథుడు భావించి ఉంటాడు.

## ౪౯. యథాసంఖ్యము

తర్కన్యాయ మూలాలంకారములను నిరూపించి
తరువాత వాక్యన్యాయమూలాలంకారములను నిరూపి
చడము సముచితము. తర్కపరిశుద్ధ బుద్ధులు మీమాంసలో
అధికారులు కాగలుగుతారు.

ఉద్దిష్టానాం పదార్థానాం పూర్వం పశ్చా ద్యథాక్రమం
అనూద్దేశో భవే ద్యత్ర తద్యథాసంఖ్య మిష్యతే

మొదట ఉద్దిష్టములయిన పదార్థములకు తరువాత యథాక్రమంగా అనూద్దేశము ఉంటే యథాసంఖ్యాలంకార మవుతుంది. మొదట నిర్దిష్టములు ఉద్దిష్టములు. తరువాత నిర్దేశించడము అనూద్దేశము. ఈ అర్థము ఉద్దిష్టానూద్దేశ పదాల వలననె లభించినా లక్షణంలో పూర్వం పశ్చాత్పద ప్రయోగము స్పష్టార్థతకు అని భావించాలి. మొదట నిర్దేశించిన పదార్థాలకు తరువాత నిర్దేశించిన పదార్థాలతో క్రమంగా సంబంధము ఉంటే ఈ అలంకార మవుతుంది. దీనిని కొందరు క్రమాలంకారము అని అంటారు. ఈ ఉద్దేశానూద్దేశ విధానము అసమస్త పదాలలో ఉంటే అర్థద్వారకంగా అక్కడ శాబ్దమయిన సంబంధం భాసిస్తుంది. క్రమసంబంధమున్నూ స్పష్టంగా కనపడుతుంది. సమస్తపదాలలో ఆవిధానము ఉంటే సముదాయముతో సముదాయమునకు సంబంధము మాత్రమె శబ్దము వలన గోచరిస్తుంది కాని అవయవగతమయిన క్రమసంబంధము గోచరించదు. అది అర్థపర్యాలోచనము చేస్తే భాసిస్తుంది. కనుక శాబ్దము ఆర్థము అనే భేదద్వయం కలుగుతుంది. ఈ అలంకారములో ఉద్దిష్టములు అనూద్దిష్టములున్నూ బహుసంఖ్య కలవి అయితేనే చమత్కారము ఉంటుంది. ఒకటి ఉద్దిష్టమయి వేరొకటి అనూదిష్టమయితే ఆవిధానంలో చమత్కారలేశ మయినా ఉండదు కాబట్టి ఈ అలంకారానికి ప్రసక్తియే లేదు. రెండు ఉద్దిష్టములు రెండు అనూద్దిష్టములూ అయినప్పుడున్నూ ఆట్టే చమత్కారము రాదు. ఉద్దిష్టములకు అనునిర్దేశము లేకపోతే

అపక్రమము అనే దోషము సంభవిస్తుంది. ఉద్దిష్టములయి రెండిటికి యథాక్రమంగా రెండు అనూద్దిష్టములయినప్పుడు దోషము లేక పోవడమె కాని విశేషము ఏమి ఉంటుంది కనుక విశేష చమత్కారమును సంపాదించడానికి ఉద్దిష్టములు అనూద్దిష్టములున్నా రెండిటికన్న అధికంగా ఉండితీరాలి అప్పుడే యథాసంఖ్యము అలంకార మవుతుంది. ఈ విశిష్టా భిప్రాయమును బోధించడానికే లక్షణవాక్యంలో బహువచ నిర్దేశము కూడా సాభిప్రాయముగా సంయోజిత మయినది గ్రహించాలి. ఎక్కడనయినా ఒక్కొక-చోట శుష్కమయి స్థలాలలో ఉద్దిష్టానుద్దిష్టములు బహుసంఖ్యగా ఉన్నప్పు విచ్ఛిత్తివిశేషము ఉదయించదు. కాబట్టి అలంకారత్వం రాదు. అందువలన కవిప్రతిభాత్మకమయిన విచ్ఛిత్తి అంత ఉండక తప్పదు. కవిప్రతిభ విచ్ఛిత్తివిశేషమును సంపా చేదిగా ఉన్నప్పుడు ఉద్దిష్టానూద్దిష్టములు రెండయినా ఉం వచ్చును, అని కొందరు భావించితే భావించ వచ్చును. క బహుత్వము ఉండడము స్వారసికంగా ఉంటుందని లక్ష మును సంభావించాలి. ఉదా:

గాంభీర్య మౌన్నత్య మనర్గలత్వం ప్రతాపరుద్రే సమవేక్ష్య ధాతా
అంభోనిధి ష్వద్రిషు దిగ్గజేషు సృష్టిం ప్రయాసైకఫలా మమం...

బ్రహ్మ ప్రతాపరుద్రునిలో గాంభీర్యమును ఔన్నత్య మును అనర్గలత్వమునూ చూచి సముద్రములను పర్వత లను దిగ్గజాలనూ సృజించడము వలన ఉత్త ప్రయాస త ఏమీ ఫలం లేదు అని భావించినాడు. దీనిలో ఉద్దిష్ట లయిన మూడింటికీ యథాక్రమముగా అనూద్దేశము చే సంబంధమును గోచరింపచేయడము ఉన్నది కాబట్టి యథా సంఖ్యము.

## ౫౦ అర్థాపత్తి

మీమాంసకులు అర్థాపత్తి అనే ఒక న్యాయమును అంగీకరిస్తారు. దానిని సచమత్కారంగా నిబంధించితే అలంకార మవుతుంది.

ఏకస్య వస్తునో భావా ద్యత్ర వస్త్వన్య దాపతేత్
కైముత్యన్యాయతః సా స్యా దర్థాపత్తి రలంక్రియా.

ఒక పదార్థము యొక్క నిష్పత్తి వలన వేరొక పదార్థము యొక్క సిద్ధి కైముత్యన్యాయానుసారముగా కలిగినట్లయితే అర్థాపత్తి అలంకార మవుతుంది. దండాపూపికాన్యాయమును కైముత్యన్యాయమని అంటారు. "దండా నేవ భక్షయతః అపూపాః కిముత !" అనే ఆకారమును అనుసరించి ఈన్యాయమునే దండాపూపికాన్యాయము అనికూడా అంటారు. ఒక గదిలో ఒక దండము వ్రేలాడగట్టి ఉన్నది. దానికి ఒక చివర గారె ముక్కల మూట కట్టారు. మూషికములు ఆ గదిలోకి వచ్చి ఆ దండము రెండవవైపున కొరకడమును ఒకడు గుర్తించాడు. ఇక్కడ ఎలుకలు ఉన్నవి కదా ! ఆ ప్రక్క గారెలు ఏమయినవో? అనే శంకను ఈ న్యాయము దిద్ది తీర్చుతుంది. కర్రలనే కొరికి తింటూ ఉంటె గారెల సంగతి ఇంకా చెప్పేదేమిటి ? ఆ గారెలు ఇంకా ఉంటవా? మూషికాలు ఎప్పుడో తిన్నవి. అనే అర్థము ఇక్కడ లభిస్తుంది. ఇటువంటిది దండాపూపికాన్యాయము. కైముత్యన్యాయము. ఈ సమానన్యాయమును బట్టి ఒకదాని సిద్ధి వలన వేరొకదాని సిద్ధి కూడా స్పష్టమయితే ఈ అలంకార మన్నమాట. దండభక్షణము వలన అపూపభక్షణము అర్థసిద్ధమయినట్లు ఒక అర్థసిద్ధి కలిగితే అర్థాంతరముయొక్క

ఆపత్తి అర్థాపత్తి అని సారాంశము. ఒక దాని వలన వేరొక దానిసిద్ధి అభ్యూహిత మవుతున్నదని ఇక్కడ అనుమానశంక చేయరాదు. అనుమానములో కైముత్యన్యాయసంబంధము ఉండదుకదా! ఇది కైముత్యన్యాయ సంబంధరూపము. రెండిటికీ స్పష్టభేదము ఉన్నది. ఒకదాని వలన వేరొకదాని సిద్ధిని గోచరింప చేయడములో సమానన్యాయమె ఇక్కడ ఉన్నది కాని నియత సంబంధము లేదు. నియత సంబంధము ఉండనపుడు అనుమానప్రసక్తి కలుగదు గదా! ఈ అర్థాపత్తి అలంకారము రెండు విధాలు. ప్రాకరణికము వలన అప్రాకరణికాక్షేపము, అప్రాకరణికము వలన ప్రాకరణికాక్షేపము అని ఉదా :—

సమంతా దుద్వేలై ర్వివిధహయఘాటీ కలకలైః
జగత్యాం క్రామన్న ప్యజని విధురః సేవణపతిః
మనాక్ క్రోధోదంచద్భ్రుకుటి కుటిలే రుద్రనృపతౌ
నృపాణా మన్యేషాం విఫలితరుషాం కైవ గణనా?

ప్రతాపరుద్రుడు కొంచెపు కోపంతో కుటిలభ్రుకుటి కలవాడు కాగానే అంతటా ఉద్వేలములయిన నానావిధ హయ ఘాటీ కలకలములతో కూడుకొని జగత్తులో ఆక్రమించే వాడయినా సేవణపతి వివశు డయినాడు. వ్యర్థులయిన ఇతరరాజులకు ఇంకా లెక్క ఏమిటి? మహాపరాక్రమశాలి అయిన సేవణప్రభువే వివశుడయినప్పుడు ఇతరులు అత్యంతమూ అసమర్థులయినట్లె అని అర్థాంతరాపత్తి ఉన్నది. సేవణపతి వృత్తాంతము ప్రాకరణికము. అది అప్రాకరణికమయిన నృపాంతరవృత్తాంతమును ఆక్షిప్తము చేస్తున్నది.

త్రైలోక్యసారోపి సువర్ణశైలః ప్రతాపరుద్రేణ నృపేణ తుల్యాం
తులాం సమారోఢు మపూర్ణ ఏవ మహీభృతాం కా గణనేతరేషాం?

త్రిలోకసారరూపమయిన మేరుపర్వతము కూడా ప్రతాపరుద్రునితో సమానంగా సామ్యము పొందడానికి అసమర్థమె. ఇతర మహీభృత్తులకు (పర్వతములు, రాజులు) ఇంకా లెక్క ఏమిటి? దీనిలో మేరు వృత్తాంతము అప్రాకరణికము. ఇతరరాజులకు ఇంకా ఏమి గణన? అనే అన్యరాజవృత్తాంతము ప్రాకరణికము. ఇతరపర్వతములకు లెక్క ఏమిటి? అనే వృత్తాంతము అప్రాకరణికమె. ఇక్కడ అప్రాకరణిక మేరువృత్తాంత సమాన న్యాయమును బట్టి ఒక అప్రాకరణికార్థాపత్తి ఒక ప్రాకరణికార్థాపత్తీ ఉన్నది. మహీభృతాం అనే శబ్దము శ్లిష్టముకావడము దీనిలో ఒక విశేషము. అన్యరాజవృత్తాంతమును ప్రాకరణికముగా భావించడము అంతగా సమ్మతము కాకపోతే అప్రాకరణికము వలన ప్రాకరణికార్థసిద్ధికి ఉదాహరణాంతరమును గ్రంథాంతరములలో భావించాలి. ప్రాకరణికమయిన రాజవృత్తాంతాపత్తి ఇక్కడ అసంగతముగా కన్పడదు.

## ౫౧. పరిసంఖ్య

మీమాంసకులు నియమవిధి పరిసంఖ్యావిధి అని పరిసంఖ్యను విధి భేదాలలో పరిగణించు తున్నారు. నియమ పరిసంఖ్యావిధులకు వారొకవిధమయిన భేదమునున్నా నిరూపిస్తారు కాని వారు చెప్పే స్వరూపనిరూపణమును ఆలంకారికులు అంగీకరించరు. అలంకారికుల పరిసంఖ్యాలక్షణము ఈ విధముగా ఉంటుంది.

ఏకస్య వస్తునః ప్రాప్తా వనేకత్రైకదా యది
ఏకత్ర నియమః సా హి పరిసంఖ్యా నిగద్యతే.

ఒక వస్తువునకు ఒక సమయంలోనే అక్కడా ఇక్కడా అనేకస్థలాలలో ప్రాప్తి ఉన్నప్పుడు ఒకేచోట నియమమును నిరూపిస్తే పరిసంఖ్యాలంకార మవుతుంది. ఏకకాలంలోనే అనేకప్రదేశాలలో ఉంటూ ఉన్నట్లుగా ఊహింపబడే వస్తువును ఇతరస్థలాల లేకుండగా చేసి ఒకే చోట నియమించడము పరిసంఖ్య అన్నమాట. పరివర్జనము సంఖ్యానము రెండూ ఉంటున్నందు వలన పరిసంఖ్య అనే పేరు సార్థకము. అనేక ప్రదేశాలలో ఉండే దానిని ఇతర స్థలాలలో లేకుండా వర్జింపచేసి ఒకే చోట నియమించడము అంటే వర్ణనీయముగా పరిగణించడము పరిసంఖ్య అని తాత్పర్యము. ఇది ప్రశ్నపూర్వకము అప్రశ్నపూర్వకము అని మొదట రెండు విధాలు. మళ్లీ ఒక్కొక్కటి రెండు విధాలు. వర్జనీయము శాబ్దముగా ఉండడము ఒకటి. ఆర్థముగా ఉండడము మరి ఒకటి. ఇట్లా మొత్తమిది నాలుగు విధాలు. వానిపేర్లు

౧ ప్రశ్నపూర్వక శాబ్ద వర్జనీయము
౨ ,, ఆర్థ వర్జనీయము
౩ అప్రశ్నపూర్వక శాబ్ద వర్జనీయము
౪ ,, ఆర్థ వర్జనీయము.

వీని ఉదాహరణములు ఇట్లా సంభావించాలి.

౧ కిం మండనం త్రైలోక్యాః? కాకతితిలకో న హాటకక్షితిభృత్
స్తోతవ్యః కః సుధియాం? రుద్రనరేంద్రో న మందరః క్షితిభృత్.

"మూడులోకాలకూ అలంకారము ఏమి?" అని ప్రశ్న. ప్రతాపరుద్రుడె అలంకారము మేరుపర్వతం కాదు" అని సమాధానము. "విద్వాంసులకు స్తోత్రయోగ్యుడు ఎవరు?" అని ప్రశ్న. "ప్రతాపరుద్రుడె మందరపర్వతము కాదు.

అని సమాధానము. ఇది ప్రశ్నపూర్వకమని స్పష్టము. త్రిలోకమండనత్వము కాకతీంద్రకనకాచలములనే అనేకస్థలాలలో ప్రాప్తమవుతూ ఉంటే కనకాచలమునందు నిషేధించి కాకతీంద్రునియందే నియమించడము ఉన్నందువలన పరిసంఖ్య ఇట్లాగే ఉత్తరార్థములో. వర్జనీయమును శబ్దముతో స్పష్టముగా చెప్పడమువలన ఇది శాబ్దవర్జనీయ మవుతున్నది.

౨. కిం వా క్షౌమ వితానం లోకానాం ? కాకతీయకుల కీర్తిః
కిం సౌఖ్యం వసుమత్యాః ? రుద్రనరేంద్రస్య భుజవాసః

ఇది ప్రశ్నపూర్వకార్థవర్జనీయోదాహరణము. లోకాలకు శుభ్రవితానము ఏమి? కాకతీయకులకీర్తి. భూమికి సౌఖ్యము ఏమిటి? ప్రతాపరుద్రుని భుజనివాసము. దీనిలో వితానత్వము కాకతీయ కీర్తికి చంద్రికకూ ప్రాప్త మవుతూ ఉంటే కీర్తి యందే నియమించడము ఉన్నది. చంద్రికయందు పరివర్జనము కంఠోక్తిగా లేనందువలన ఆర్థము. ప్రశ్న ఉన్నది. సమన్వయము సులభము.

౩. రాగో ధర్మే న విషయసుఖే, సంగతిః సత్సభాయాం
న స్త్రీగోష్ఠ్యాం వ్యసన మనిశం నీతిశాస్త్రే న చాక్షే,
కీర్త్యాం నిత్యార్జనచతురతా నార్థజాతే, వినోదో
విద్యాభ్యాసే న చ పరిజనే, రుద్రదేవస్య రాజ్ఞః.

ప్రతాపరుద్రదేవునకు రాగము (అభిమానము) ధర్మమునందే కాని విషయసుఖమునందు కాదు. ఆసక్తి సత్సభయందే కాని స్త్రీగోష్ఠి యందు కాదు. నిత్యమూ వ్యసనము నీతిశాస్త్రమందే కాని పాచికయందు కాదు. నిత్యము సంపాదన చాతుర్యము కీర్తి యందే ద్రవ్యజాతమందు కాదు. వినోదము విద్యాభ్యాసమందే కాని పరిజనము నందు కాదు.

రాగము మొదలయినవి ధర్మ విషయసుఖాదులందు ప్రాప్తములు కాగా విషయ సుఖాదికము నందు నిషేధించి ధర్మాదులందు నియమించడము దీనిలో ఉన్నది. విషయసుఖాది వర్జనీయము శాబ్దముగా ఉన్నది. ఇది ప్రశ్నరహితమయిన పరిసంఖ్య.

౪. భూరేవ భువనం, దేవః స్వయంభూ రేవ పార్థివః
ప్రతాపరుద్ర ఏ వైకశిలైవ నగరీ శుభా
క్షోణీం రుద్రనరాధీశే రక్షతి క్షతవిద్విషి
బలిసద్మ న్యహిభయం త్రిదివే గోత్రభిత్కథా

భూలోకమె లోకము. స్వయంభూదేవుడే దేవుడు. ప్రతాపరుద్రుడె పార్థివుడు. వరంగలు నగరమె నగరము. శత్రుసంహారము చేసిన ప్రతాపరుద్రుడు భూమిని రక్షించుతూ ఉంటే అహిభయము (శత్రుభయము, సర్పభయము) పాతాళమునందే, గోత్రభిత్కథ (ఇంద్రకథ, కులఘాతుక ప్రసంగము) స్వర్గము నందే ఉన్నది. దీనిలో వర్జనీయము ఆర్థము. అప్రశ్నము. చివరి పద్యములో శ్లేష కూడా ఉన్నందున చారుత్వాతిశయము అభ్యుచ్చయము. కవిప్రతిభా నిర్వర్తనము ఉన్నందువలననె లోకోత్తరంగా నియమనము దీనిలో కుదురుతుంది.

## ౫౨ ఉత్తరము

పరిసంఖ్యాలంకారములో ప్రశ్నప్రసంగము వచ్చింది. ఉత్తరాలంకారములో కూడా ప్రశ్నసంబంధము ఉన్నది కాబట్టి ఇక్కడ నిరూపించాలి.

ఉత్తరా త్ప్రశ్న ఉన్నేయో యత్ర ప్రశ్నోత్తరే తథా
బహుధా చ నిబధ్యేతే తదుత్తర ముదీర్యతే

ఇది రెండు విధాలు. ప్రశ్న శబ్దముచే స్పష్టముగా ఉపనిబద్ధము కాకపోయినా నిరూపితమయిన సమాధానము వలన ప్రశ్న ప్రశ్నరూపముగా ఊహింప బడినప్పుడు ఒక విధమయిన ఉత్తరమవుతుంది. ప్రశ్నోత్తర పరంపర అనేక పర్యాయములు కూర్చబడినప్పుడు రెండో విధమయిన ఉత్తర మవుతుంది. లేని దానిని గోచరింప చేయడము మొదటి ఉత్తరభేదములో ఉన్నప్పటికీ అనుమాన మన్న శంక కలుగ రాదు. అనుమానసాధకములయిన వ్యాప్తి పక్షధర్మత మొదలయిన వేవీ ఇక్కడ ఉండవు కదా ! రెండవ భేదములో ప్రశ్నోత్తరములు అనేకపర్యాయములు ఉండాలి. ఒకపర్యా యము నిర్దేశించితే చమత్కారము కలుగదు. దీనిలో నిబం ధింపబడే సమాధానమున్నా కవిప్రతిభానిర్వర్తిత మవుతుంది కాబట్టి లోకోత్తరంగా ఉంటుంది. ఇది ప్రశ్నోత్తరరూప ముగా ఉన్నా పరిసంఖ్య కాదు. పరిసంఖ్యలో ఒకదానిని పరి వర్జనము చేయడము వేరొకదానిని నియమించడమూ ఉంటుంది. ఇక్కడ అటువంటి విధానం ఉండదు. ఇక్కడ ఆ వివక్ష కూడా ఉండదు. ఈ రెండూ రెండు భేదాలు. అనుగత మయిన ఒకే లక్షణం వీనికి లేదు. ఉదా :—

కిమద్య వ్యుత్పత్తి స్తవ సుజనలోక వ్యవహృతా
యదద్య జ్ఞాతవ్యం ప్రభవతి యదా రుద్రనృపతిః
తదారభ్యోన్మూర్ధా జయతి నిశదో ధర్మవిభవో
మహీదేవా శ్చోద్యద్వివిధ విభవారంభ ముదితాః.

సుజనలోకములో ప్రసిద్ధమయిన నీ వ్యుత్పత్తి (ధార్మి కత్వాదిజ్ఞానము) ఏమి వ్యుత్పత్తి? ఇంకా నీవు తెలుసుకో వలసి ఉన్నదాయెను! అదేమిటో తెలిసిందా ? ప్రతాప

రుద్రనృపతి ఎప్పటి నుండీ ప్రభువై ఉంటున్నాడో అది మొదలు కొని ధర్మవిభవము విశదమై తలఎత్తుకొని తిరుగుతూ విలసిస్తున్నది. భూసురులున్నూ అప్పటి నుండీ నానా విధ విభవ విజృంభణములతో విలసిస్తున్నారు. ఈ పద్యము ఉత్తరము వలన ఉన్నేయప్రశ్నకు ఉదాహరణము. దీనిలో ప్రతాపరుద్రుడు ఎపుడు ప్రభువయినాడో అప్పటినుంచి ధర్మ ప్రతిష్ఠ పూర్ణముగా ఉన్నది. బ్రాహ్మణులున్నూ మంచి సంతోషముతో ఉన్నారు. ఇంకా ఏమో అడుగుతావేమి? అనే సమాధానము ఉపనిబద్ధమై ఉన్నది. దీని వలన "ప్రతాపరుద్రరాజ్యములో ధర్మప్రతిపాలనము ఉన్నదా ? బ్రాహ్మణులు సుఖముగా ఉన్నారా ? అని ప్రశ్న సమున్నీతమవుతున్నది.

౨, కిం ను ధనం ? కులవిద్యా, కో లాభః ? సజ్జనేన సహవాసః
కా నగరీ ? ఏకశిలా. కో రాజా ? వీరరుద్రనరనాథః

ధనమేమిటి ? కులవిద్య లాభమేమిటి ? సజ్జనసహవాసము. పట్టణము ఏది ? వరంగలు. రాజు ఎవరు ? ప్రతాపరుద్రుడు. దీనిలో ఇతర పరివర్జనము కాని నియమము కాని లేనందువలన ఇది పరిసంఖ్య కాదు. అనేక ప్రశ్నోత్తరాలు ఉన్నందువలన రెండవ ఉత్తరాలంకారము.

## ౫౩ వికల్పము

వాక్యన్యాయ ప్రస్థానములో వికల్పము నిరూపణీయము. సర్వస్వకారునకు ప్రాచీనులు వికల్పాలంకారమును పరిగణించ లేదు. సముచ్చయాలంకారమును అంగీకరించారు. సముచ్చయాలంకారములో రెండు యుగపత్కాలంలో సంప్రాప్తములవుతవి. ఇందులో అట్లా కాదు. అందు

వలన వికల్పమును సముచ్చయప్రతిద్వంది అయిన అలంకార మునుగా సర్వస్వకర్త నిరూపించాడు. విద్యానాథుడు సముచ్చయాలంకారమునే వికల్పప్రతిపక్షభూతముగా భావించి ఇక్కడ ముందుగా వికల్పమును నిరూపిస్తున్నాడు. మీమాంసకుల రచనలో వికల్పము స్వరూప ప్రతిష్ఠితమై ఉన్నది. అటువంటి వికల్పమునే ముందుగా చెప్పి తరువాత సముచ్చయమును చెప్పడములో ఔచిత్యమును పరిశీలించిన విద్యానాథుడు ఈ క్రమమును ఆదరించాడు.

విరోధే తుల్యబలయో ర్వికల్పాలంకృతి ర్మతా.

సమానబలము కల వానికి విరోధమును నిరూపించితే వికల్పాలంకార మవుతుంది. సమానప్రమాణముల చేత అనుశాసింపబడిన రెండు విరుద్ధములకు ఒకేచోట ఒకేసారి, (అవి విరుద్ధములు కనుక) యౌగపద్యము కుదరదు. రెండూ తమ కిది స్థానము అని యుగపత్ప్రాప్తము లవుతవె కాని వాని కక్కడ యౌగపద్యము కుదరదు. పరస్పరవిరుద్ధములలో అది ఉంటే ఇది ఉండదు. ఇది ఉంటే అది ఉండదు. అపుడు అది కాని ఇది కాని ఏదో ఒకటే సంభవిస్తుంది. మరొకటి సంభవించదు. అపుడు వికల్పము అలంకార మవుతుంది. మీమాంసకుల వాస్తవ వికల్పము కూడా ఈ విధముగానే ఉంటుంది కాని అక్కడ ఔపమ్యము ఉండదు. ఇక్కడ ఇది ఔపమ్య గర్భమయినందువలన చారుత్వవిశేష మున్నది. ఔపమ్యగర్భత్వము ఉన్నపుడే వికల్పము అలంకార మవుతుంది. కానపుడు కాదు. ఉదా :—

భూపాలాః! క్రియతాం మూర్ధ్నాం ధనుషాం వా వినమ్రతా  
పాదచ్ఛాయాంధ్రనాథస్య విన్ధ్యాద్రే ర్వా నిషేవ్యతాం.

ఓ! భూపాలకులారా! శిరములను వినమ్రములను చేయండి. ఆంధ్రప్రభువు పాదచ్ఛాయను సేవించండి. లేదా వింధ్యపర్వతము పాద (ప్రత్యంతపర్వత) చ్ఛాయ నయినా సేవించండి. ప్రతాపరుద్రునకు లొంగిపొండి. లేదా యుద్ధము చేయండి అని భావము. దీనిలో ప్రతిరాజకార్యములయిన శిరోనమనము ధనుర్నమనమూ తుల్యప్రమాణానుశిష్టములు. శత్రువు ప్రబలుడై ఉన్నపుడు వేతసవృత్తి నవలంబించి తల వంచడము సముచితము. అని సంధిప్రమాణానుశాసనము 'యశో వా మృత్యుర్వా' అనే నియమాన్ని బట్టి ధనువుతో యుద్ధము చేయడము విగ్రహప్రమాణానుశాసనము. ఈ ప్రమాణముల చేత శిరోధనుర్నమనములు ఒకే సారి ప్రాప్తము లవుతున్నవి. కాని ఇవి పరస్పరము విరుద్ధములు కావడము వలన ఏకకాలంలో కుదరవు. శిరోనమనం ఉంటే ధనుర్నమనము ఉండదు. ధనుర్నమనము ఉంటే శిరోనమనము ఉండదు. అందువలన యౌగపద్యము సంభవించదు. కనుక వికల్పము. శిరోధనువులకు నమన కృతమయిన సాదృశ్యము ఉన్నది కాబట్టి అలంకారతను నిశ్చయించాలి. ఈ పద్యములో పాదచ్ఛాయ అనే చోట శ్లేష ఉన్నది. వికల్పము శ్లేష లేకుండగా కూడా ఉంటుంది.

## ౫౪. సముచ్చయము

వికల్పప్రతిపక్షభూత మయిన సముచ్చయాలంకారము ఇక్కడ నిరూపణార్హము. వికల్పములో యౌగపద్యము (ఒకే సారి ఉండడము) కుదరదు. సముచ్చయములో కుదురుతుంది.

గుణక్రియా యౌగపద్యం సముచ్చయ ఉదాహృతః.

వైమల్యాది గుణములకు దర్శనాదిక్రియలకు యుగపదవస్థానమును వర్ణించితే సముచ్చయాలంకార మవుతుంది. గుణములను క్రియలను వ్యస్తముగా చెప్పవచ్చును. సమస్తముగా చెప్పవచ్చును. ఇవి భిన్నవిషయములుగా ఉండవచ్చును. ఏకవిషయములుగా ఉండవచ్చును. అంటే; సమకాలకథనము ఉన్నా ఒకగుణము ఒకరియందు వేరొకగుణము వేరొకరి యందూ ఉంటే భిన్నవిషయత. ఇట్లాగే క్రియలలో కూడా భిన్నవిషయత్వము ఊహ్యము. అన్నిగుణాలకు అన్నిక్రియలకూ ఒకరే విషయముగా ఉంటే ఏకవిషయత్వము ఇట్లా ప్రథమసముచ్చయము ఆరు విధాలవుతుంది.

౧ భిన్నవిషయ గుణ సముచ్చయము
౨ ,, క్రియా సముచ్చయము
౩ ,, గుణక్రియా సముచ్చయము
౪ ఏకవిషయ గుణ సముచ్చయము
౫ ,, క్రియా సముచ్చయము
౬ ,, గుణక్రియా సముచ్చయము

ప్రతాపరుద్రనృపతౌ భద్రాసన ముపేయుషి
సతాం ప్రసన్నం హృదయ మసతాం కలుషం మనః

ప్రతాపరుద్రుడు సింహాసనమును అధిష్ఠించగా సజ్జనుల హృదయము ప్రసన్నమయింది. అసజ్జనుల మనస్సు కలుషమయింది. ప్రసన్నత్వకలుషత్వ రూపములయిన గుణాలకు భిన్నవిషయక మయిన యౌగపద్యము దీనిలో ఉన్నది.

ప్రేక్షతే ఇమాం నరేంద్రః ప్రవిశతి మదనశ్చ గలతి మానశ్చ
ఘూర్ణతి మనశ్చ శూన్యం కిమేతత్ ? పశ్యత ! సఖ్యః !

ఈమెను ప్రతాపరుద్రుడు చూస్తున్నాడు. మన్మథుడు ప్రవేశిస్తున్నాడు. కోపము జారిపోతున్నది. మనస్సు గాభరా

పడుతున్నది. అంతా శూన్యంగా ఉన్నది. సఖులారా! చూడండి! ఏమిటిది ? దీనిలో భిన్నవిషయమయిన క్రియా సముచ్చయము స్పష్టము.

త్రైలోక్యప్రథమాన కీర్తిమహిత శ్రీవీరరుద్రప్రభోః
సేవార్థం చిరయత్సు కాకతిపురే భూపేషు తద్యోషితః
ద్వారం యాంతి విలోకయంతి పురతః నిశ్వాస మాతన్వతే
శుష్యంతి ప్రలపంతి యాంతి తనుతాం ముహ్యంతి మూర్ఛంతి చ.

మూడులోకాలలో కీర్తిప్రఖ్యాతుడై గొప్పవాడయిన ప్రతాపరుద్రుని సేవించడానికై వెళ్లి కాకతిపట్టణంలో రాజులు ఆలస్యం చేస్తూ ఉంటే వారిస్త్రీలు ద్వారము దగ్గరకు వెళ్లుతున్నారు. ఎదట చూస్తున్నారు. నిట్టూర్చుతున్నారు. ఎండిపోతున్నారు. ప్రలపించుతున్నారు. కృశించిపోతున్నారు. నిశ్చేష్టలవుతున్నారు. మూర్ఛపోతున్నారు. దీనిలో విషయ భేదము లేదు. అన్నిక్రియలు ఏకవిషయకముగానె ఉన్నవి. ఇది ఏకవిషయక్రియాసముచ్చయాలంకారము.

దేవే కాకతివీరరుద్రనృపతౌ జైత్రప్రయాణోన్ముఖే
మాద్యద్దంతి చలత్పదాతి విచలద్వాజి ప్రధావద్రథం
విచ్ఛాయాననమాకులాక్ష ముదయాత్కార్పణ్య మావిర్భవ
త్కంపం భ్రామ్యతి సర్వతః ప్రతివనం ప్రత్యర్థిభూభృద్గణః.

గుణక్రియలకు మొత్తముగా యౌగపద్యము దీనిలో ఉన్నది. కాకతివీరరుద్రనృపుడు జైత్రప్రయాణోన్ముఖుడు కాగానే శత్రుసమూహమంతా మదించే ఏనుగులు, చలించే పదాతులు, ప్రచలించే అశ్వములు, పరుగెత్తే రథములు, కాంతిలేని ముఖము, వ్యాకులమయిన నేత్రాలు, ఉదయించే కార్పణ్యము, ఆవిర్భవించే కంపము ఉండేటట్లుగా ప్రతి

వనమూ అంతటా భ్రమించుతున్నది. దీనిలో భిన్నభిన్న విషయకములయిన గుణక్రియల సముచ్చయము స్పష్టము.

## ద్వితీయసముచ్చయము

ఇది వికల్ప ప్రతిపక్షరూప మని భావించ నక్కర లేదు. పూర్వసముచ్చయము కంటె ఇది భిన్నలక్షణము. అనేకములు సముచ్చితములు కావడమనేది రెండిటిలోనూ సమానము కనుక ఇది ఇక్కడ ప్రసక్త మవుతున్నది.

ఖలే కపోతన్యాయేన బహూనాం కార్యసాధనే
కారణానాం సముద్యోగః స ద్వితీయః సముచ్చయః.

ఖలేకపోతన్యాయానుసారముగా అనేక కారణములు ఒక కార్యసాధనములో ఉద్యతములు అయినట్లయితే ద్వితీయసముచ్చయ మవుతుంది. ఖలే కపోత న్యాయమంటే అది ఒక కథ. ఒకపుడు ఒక కళ్లములో పిట్టల వేటగాడొకడు వలను పన్నినాడు. అక్కడికి చిత్రగ్రీవమనే కపోతరాజు (పావురము) సపరివారముగా వచ్చి వలలో చిక్కుకొన్నది. పరివారమంతా పరస్పరము ఆలోచించి అంపరూ కలిసి వలతో ఎగిరిపోయి హిరణ్యకుడు అనే స్నేహితుడయిన మూషికరాజు దగ్గరకు వెళ్లారు. మూషికరాజు పాశములు త్రెంపిన తరువాత కపోతరాజు పరివారముతో సుఖముగా ఉన్నాడు. ఇది పంచతంత్రకథ. వలను ఎత్తుకొని పోవడము అనే ఏకకార్యములో అన్నిపావురములకూ ప్రయత్నము ఉన్నట్లుగా, ఒకకార్యమును సాధించడానికి అనేక కారణాలు అహమహమికతో ప్రవర్తించితే అదిన్నీ (ద్వితీయ) సముచ్చయ మని తేలింది. ఒకే సారి అనేకముల అవస్థానము ఉన్నది కదా! సద్యోగము అసద్యోగము సదసద్యోగము

అని ఇది మూడువిధాలు. యోగ్యము యోగ్యముతో సంబంధించుట, అయోగ్యము అయోగ్యముతో సంబంధించుట యోగ్యము అయోగ్యము సంబంధించుట అన్న మాట. ఉదా:—

శుభ్రం యశః శౌర్యమహచ్చ వృత్తం విద్యానవద్యా విమలం కులం చ
ప్రతాపరుద్రస్య నరేశ్వరస్య లోకోత్తరాం రీతి ముదంచయంతి

ఇది సద్యోగమునకు ఉదాహరణము. శుభ్రమయిన యశస్సు శౌర్యాధికమయిన ప్రవృత్తి, అనవద్యవిద్య, అమలిన కులము ఇవి ప్రతాపరుద్రనరేశ్వరునకు లోకోత్తరమయిన రీతిని ప్రకాశింపచేస్తున్నవి. లోకోత్తరరీతి సంపాదనములో శోభనయశస్సు శోభనవృత్తాదులతో సంబంధించి సముచ్చితమై దీనిలో కనపడుతున్నది. లోకోత్తరరీతి సంపాదనములో యశస్సు మొదలయినవి ప్రత్యేకము హేతువులయినా ఒకే పర్యాయము ఖలేకపోతన్యాయరీతిగా కూడి ఉన్నవి. ప్రకృతకార్యసిద్ధిలో యశస్సు హేతువుగా ప్రక్రాంతము. వృత్తము మొదలయినవి కూడా తత్స్పర్థతో కార్యసిద్ధిని కలుగజేస్తున్నవి. అందువలన లక్షణము సుసంగతము. చెప్పబోయే సమాధ్యలంకారములో ప్రకృతకార్యసిద్ధికొరకయిన కారణము పూర్ణమై అన్యనిరపేక్షముగా ఉంటుంది. కారణాంతరము కాకతాళీయముగా వస్తుంది. ఆకస్మికంగా వచ్చిన ఆ కారణాంతరము సౌకర్యము కలుగజేస్తూ స్వరూపోపచ్చయమును కూర్చుతుంది. అప్పుడు బాగా కార్యనిష్పత్తికలగడము ప్రయోజనము. సముచ్చయములో చాలా కారణాలు స్పర్థతో ఏకకార్యకారులవుతూ ఉంటవి. అందువలననే ఖలేకపోతిక నిదర్శనము.

## ౫౫. సమాధి

కార్యకారిత్వసాదృశ్యము ఉన్నది కాబట్టి సము చ్చయము తరువాత సమాధి నిరూపణము సముచితము.

ఏకస్మిన్ కారణే కార్యసాధనేఽన్యత్పరాపతేత్
కాకతాలీయ నియతః స సమాధి రుదీర్యతే.

ఒకకారణము కార్యసాధనమునకై ప్రవృత్తము కాగా వేరొక కారణమున్నూ పరాపతితమయితే సమాధి అలం కార మవుతుంది. ఇది కాకతాలీయన్యాయనియతమై ఉం టుంది. కాకతాలీయముగా వేరొక కారణము వచ్చి ప్రకృత కార్యమును సుకరము చేస్తే సమాధి అన్నమాట. ఇక్కడ ప్రసక్తమయిన కాకతాలీయన్యాయమును ఈ విధముగా గ్రహించాలి. కాకము తాళవృక్షము దగ్గరకు వెళ్లింది. తాటి పండు పడింది. పగిలింది. కాకము అనుభవించింది. ఇట్లాగే ఒకడు ఒక రహః ప్రదేశమునకు వెళ్లినాడు. అక్కడ ఒక పడుచు కన్య ఉన్నది. ఆ కన్య ఈతని చూచి తహతహ లాడింది. ఆతడు ఆమెను అనుభవించినాడు. కాకతాళీయ మన్నప్పుడు కాకి రావడము పండు పడడము కాకి అనుభవించడముతో సమానమయిన తరుణకృత కన్యానుభవము గోచరమవు తుంది. అనుకోకుండా ఆకస్మికంగా ఒకటి సంభవించినప్పుడు కాకతాళీయన్యాయమును స్మరిస్తారు. ప్రకృతక్రియాసిద్ధికై కారణాంతరము ఆకస్మికముగా పరాపతితము కావడము ఇక్కడ ఉన్నది. ఉదా:

రణాంగణే రుద్రనరేంద్రరోష శమాయ రాజ్ఞాం విహితస్తుతీనాం
వక్త్రేషు యద్వాయువశా త్పతంతి తృణాని దేవస్య న పక్షపాతః.

యుద్ధరంగములో ప్రతాపరుద్రుని కోపమును శమింప

జేయడానికి స్తవం చేసిన రాజుల ముఖాలలో వాయువశాన గడ్డిపడుతున్నది అంటే అది దేవుని పక్షపాతము. కోపశాంతి రూపమయిన కార్యసిద్ధికి రాజులు స్తుతిచేస్తూ ఉండగా కాకతాలీయముగా వచ్చిన తృణపతనము కార్యసౌకర్యమును సంపాదిస్తున్నది కనుక సమాధి.

### భావికము

ఇక లోకన్యాయ మూలాలంకారములను నిరూపించాలి. లోకన్యాయ మూలకములలో భావికాలంకారము చమత్కారాతిశయ హేతువు.

అతీతానాగతే యత్ర ప్రత్యక్షే ఇవ లక్షితే
అత్యద్భుతార్థకథనా ద్భావికం తదుదాహృతం.

అతీతానాగతములు భూతభవిష్యదర్థములు. అవి అత్యద్భుతార్థకథనము వలన ప్రత్యక్షాయమాణములై ఉపలక్షితము లయినట్లయితే భావికాలంకార మవుతుంది. అని సామాన్యముగా భావము. అతీతానాగతములు ప్రత్యక్షాయమాణములు కావలె నంటే అలౌకికముగా అత్యద్భుతముగా నిరూపణము ఉండాలి. ఇటువంటి నిరూపణము ఉన్నందు వలననే సహృదయులు సావధానులవుతారు. ఇక్కడ అనాకులమయిన శబ్దసందర్భముతో ఈ అర్థనిరూపణము అవసరము. సామాన్యంగా ఎక్కడ నయినా శబ్దముల ఆకులపాటు వర్జనీయమె. శబ్దాలు అనాకులములుగా ఉండక విప్రకీర్ణములుగా ఉన్నప్పుడు అర్థములో విశేషము ఏమీ కలగదు. వెంటనే సరైన ప్రతీతి కలగదు. విఘ్నము మాత్రమె అక్కడ ఫలము. విశేషించి ఈ భావికాలంకారములో శబ్దముల వ్యాకులత అతీతానాగతములను ప్రత్యక్షముగా చేయదు కనుక దీనిని

స్పష్టముగా గుర్తించాలి. అపూర్వములయిన అర్థములు కవి వాక్యములో అనుకూలముగా పొదుప బడి ఉంటే వాచ్యవాచకములకు రామణీయకము కలుగుతుంది. కొన్నికొన్ని అర్థములు కవివాక్యములో బాగా కూర్పబడి నప్పటికీ స్వకీయసౌభాగ్యము లేనందు వలన పంచదారలో గడ్డి మాదిరిగా సహృదయులకు అవజ్ఞాస్పదములై అవధానార్హములు కావు. కొన్ని అర్థములు సుభగములె అయినా దుర్భగ శబ్దాలలో ఉన్నందు వలన సహృదయులకు ఆవర్జకములు కావు. కనుక ఈ భావికాలంకారములో రెండిటి ఆవశ్యకత ఉన్నదన్నమాట. కవిభావము శ్రోతలో ప్రతిబింబముగా ఉంటుంది. కాబట్టి భావికమనే పేరు తగి ఉన్నది. కవి భావము కవిభావన మాటిమాటికీ చేతోనివేశనము పొంది దీనిలో ఉంటుంది కాబట్టిన్నీ ఇది భావికము.

భూతభవిష్యదర్థములు ప్రత్యక్షములో మాదిరిగా అవభాసించడము విరుద్ధమేమో? అని శంకించుకో నక్కర లేదు. భావనాబలము వలన ప్రత్యక్షవదవభాసనము కుదురుతుంది. భావన అనేది అన్ని చోట్లా ఉండాలి. అది లేక పోతే ఏమీ కుదరదు. ప్రత్యక్షవిషయములో కూడా భావన ఉండక తప్పదు. అసలు ప్రత్యక్షత్వమనేది కేవలమూ వస్తు ధర్మము కాదు. భావించేవాని యొక్క ప్రతిపత్తి విశేషమును అనుసరించి ఇది ప్రత్యక్షమని ఇది వేరొకవిధ మని నిశ్చయించుతాము. భావకునకు తన జ్ఞానప్రతిభాసము ఉంటే వస్తువు ప్రత్యక్షమవుతుంది. లేకపోతే కాదు. వస్తువు ప్రత్యక్షము కావడములో భావకునకు సామగ్రి ఉపకారి అవుతుంది. భావించేవారి విశేషాన్ని బట్టి ఆ సామగ్రిన్నీ నానావిధాలుగా ఉంటుంది. మామూలు లోకయాత్రలో

నయితే ఆ సామగ్రి చక్షువు మొదలయిన ఇంద్రియముల స్వభావముగా ఉంటుంది. యోగులకు అతీంద్రియార్థదర్శనములో భావనారూపముగా ఉంటుంది. కావ్యార్థవిదులకు ఆభావన స్వభావసిద్ధము. అది వస్తుగతిని అనుసరించి అద్భుతరూపముగా ఉంటుంది. భావనావిషయములయిన పదార్థములను సహృదయులు సమాదరముగా చూస్తారు. వానిని హృదయాన బాగా ధరిస్తారు. వారి హృదయము ఆ పదార్థములందు ఏకతానమై ఉంటుంది. అప్పుడాపదార్థాలు ప్రసూఢములై భావనారూపమును పొందుతవి. సహృదయులు మాటి మాటికీ ఆ పదార్థాలను హృదయములో భావించగా భావించగా ప్రత్యక్షాయమాణత్వము బాగా ఘటిస్తుంది. విరహి పాంథుడు కామినీభావన చేసి ఆమెను ప్రత్యక్షాయమాణముగా చేసికొంటున్నాడు గదా! యోగులకు భావనాబలమువలన భూతభావ్యర్థములు ప్రత్యక్షముగా భాసిస్తున్నట్లు కావ్యార్థవిదులయిన సహృదయులకున్నూ భావనాబలమువలన భూతభావివస్తువులు ప్రత్యక్షాయమాణములు కావడము విరుద్ధము కాదు ప్రత్యక్షాయమాణములు కావడము అంటే ప్రత్యక్షములో ఉన్నట్లుగా అవభాసించడము అన్నమాట. అంతే కాని కేవలము ప్రత్యక్షము కావడమని అభిప్రాయము కాదు. భూతభావి వస్తువులు తమతమ కాలములో ఉన్నవే అయినా భావకులకు అవభాసిస్తున్నవి అని భావము. అప్రస్తుతమయిన ఈ గహనవిషయమును ఇంతకన్న విస్తరించడము సముచితముగా ఉండదు.

ఈ భావికము సర్వోత్తీర్ణమయిన అలంకారము. స్వభావోక్తి, రసవదాద్యలంకారము, ఉత్ప్రేక్ష భ్రాంతిమదలంకారములకు ఇక్కడ ప్రసక్తి ఉంటుందేమో అనే శంక

ఒకప్పుడు కలుగవచ్చును. కనుక ఈ చెప్పబోయే అంశములను బాగా భావించాలి.

౧. సుందరమయిన వస్తువును యథాతథముగా వర్ణించినట్లయితే ప్రత్యక్షాయమాణత సిద్ధ మవుతుంది. సామాన్యముగా ఈ భావికాలంకారానికి ఇది స్వరూప ముగా గోచర మవుతుంది. అందువలన సూక్ష్మవస్తుస్వభావ వర్ణనము ఉన్నది కాబట్టి ఈ భావికము స్వభావోక్త్యలం కారము కానచ్చునేమో? అని శంకించడము ఉచితము కాదు. ఈ రెండింటికీ వైషమ్యము బాగా ఉన్నది. స్వభా వోక్త్యలంకారములో లౌకికవస్తుగతములయిన సూక్ష్మ ధర్మాలను వర్ణించినపుడు హెచ్చుతగ్గులు లేకుండా ఉన్నది ఉన్నట్లుగా వర్ణించడము ఉంటుంది కాబట్టి సాధారణ్యమును అనుసరించి హృదయసంవాదము కలుగుతుంది. ఇతరుల చిత్తవృత్తిని తనచిత్తవృత్తితో అభిన్నముగా పరామర్శించ డమును హృదయసంవాదమని అంటారు. తనది పరునిది అనే విభాగము లేకుండా దేశకాలవిభేదము లేకుండా వ్యాప కముగా గోచరించడము సాధారణ్యము అవుతుంది. ఇంతకూ స్వభావోక్త్యలంకారములో సాధారణ్యముతో హృదయ సంవాదము ఉంటుందని అటువంటి హృదయసంవాది ప్రతీతిలో లౌకికవస్తుగతములయిన సూక్ష్మధర్మాలు భాసిం చును అని చెప్పినట్లయింది. ఈ భావికాలంకారములో ప్రక్రియ ఇంత కన్న భిన్నముగా ఉంటుంది. అత్యద్భుతరూప ముగా లోకోత్తరవస్తువులకు ప్రస్ఫుటముగా ఇక్కడ ప్రతి భానము ఉంటుంది. ఆ ప్రతిభానమున్నూ తాటస్థ్యముతో ఉంటుంది. "దీనిని నేను తెలుసుకొంటున్నాను" అనే సామానాధికరణ్యముతో ప్రతీతి ఉంటుందని పరమార్థము.

సాధారణ్యమున గోచరించడానికి తాటస్థ్యమున గోచరించడానికిన్ని ఉన్న స్వరూపభేదమె స్వభావోక్తి భావికములకు భేదమును సంపాదిస్తున్నది.

౨. రసవదలంకారము కంటే ఈ భావికాలంకారానికి భేదము ఉన్నది. ఎదట స్ఫురించే రూపము ఉండేటట్లుగా వర్ణించడము చమత్కారముతో కూడుకొన్న ప్రతీతి ఉండడమున్నూ ఈ రెండు అలంకారాలలోనూ ఉంటుంది. అందువలన ఇది రసవదలంకారము కాకూడదా? అనే శంకకూడా కలుగవచ్చును. రసవదాద్యలంకారములో విభావానుభావసంచారిభావముల యొక్క అనుసంధానము చేతనే రసాదులకు ఆస్వాద్యత్వము కలుగుతున్నది. విభావాదులను బాగా అనుసంధానము చేయడము చేత పరమాద్వైతజ్ఞానికి వలె "ఇది నాది, ఇది పరునిది, ఇది తటస్థునిది" అనే విశేషసంబంధ నియమము కాని 'ఇది నాది కాదు. ఇది పరునిది కాదు. ఇది తటస్థునిది కాదు' అనే సంబంధవిశేషపరిహారము గాని ఏమీ లేక సాధారణ్యముతో సహృదయులకు హృదయసంవాదమును సంపాదించే అలౌకికమయిన ప్రత్యయము కలుగుతుంది. ఇటువంటి ప్రతీతిలో రత్యాదిచిత్తవృత్తులు గోచరములు అవుతూ ఉండగా రసవదాద్యలంకారమునకు స్వరూపలాభము కలుగుతుంది. ఈ భావికాలంకారములో అట్లా కాదు. రసవదాద్యలంకారములో అత్యద్భుత విధముగా ఆస్వాదము కలుగదు. భావికములో భూతభావి వస్తువులు సర్వజ్ఞుడయిన సకలవిద్యేశ్వరునకు గోచరములయినట్లుగా గోచరము లవుతవి. అంతే కాని సాధారణ్యమున గోచరములు కావు. ఇటువంటి ఈ భేదమును

అనుసరించి రెండింటికీ [illegible]

3. ఉత్ప్రేక్షాలంకారమునకు ఈ భావికమునకున్నూ ఈ విధముగా భేదవివేకమును గ్రహించాలి. అప్రత్యక్షము లయిన భూతభావిపదార్థములు ప్రత్యక్షపదార్థములుగా గోచరములు కావడము ఉన్నది. కాబట్టి అధ్యవసాయము ఉన్నట్లు ఊహించవచ్చును కదా! ఉత్ప్రేక్షాలంకారము ఏల కాకూడదు? ఇవాదులు లేవు కాబట్టి ఇది ప్రతీయమానోత్ప్రేక్షయే అగునేమో? అనే శంకకూడా ఇక్కడ అవసరము కాదు. అప్రత్యక్షమును ప్రత్యక్షముగా అధ్యవసాయము చేసి నిరూపించినపుడే ఉత్ప్రేక్షాలంకారమునకు ప్రసక్తి ఉన్నది. ఇక్కడ అతీతానాగతములు ప్రత్యక్షములుగా అధ్యవసితములు కావడము లేదు. కావ్యార్థవిదులయిన సహృదయులు భూతభావివస్తువులను ప్రత్యక్షముగా భావనలో దర్శించడమె ఇక్కడ ఉన్నది. అధ్యవసాయము లేనే లేదు కాబట్టి ఉత్ప్రేక్ష కాదు.

ర. భూతభావివస్తువులను ప్రత్యక్షముగా చూడడము ఉన్నందువలన ఇది భ్రాంతిమదలంకారము కాకూడదా? అనే శంకకూడా సముచితము కాదు. కావ్యతత్త్వవేత్తలయినవారు అప్రత్యక్షములయిన భూతభావివస్తువులను భావనావశమున సాక్షాత్కరించుకొంటున్నారు. భావన ఎప్పుడూ భ్రాంతి రూపము కాదు. భూతభావి వస్తువులు భూతభావి వస్తువులుగానే ఇక్కడ ఉన్నవి. భూతభావి వస్తువుగా ఉన్నంతమాత్రాన అది కేవలమూ వస్తుమాత్రము కాదు. భావనావశము వలన భూతభావిగతము ప్రత్యక్షత్వాదిగతమూ అయిన ఒక స్ఫుటధర్మము దీనిలో అధికముగా ఉన్నది. భ్రాంతిలో నయితే ఈ విశేషము ఉండదు. అందువలన ఇది భ్రాంతిమదలంకారము కాదు. ఇంకా ఇత

రాలంకారములకంటె భేదవివేకమును ఇక్కడే ప్రదర్శించడము అంతగా యుక్తము కాదు. ఇంతకూ ఈ భావికము సర్వోత్తీర్ణమయిన అలంకారమని భావించాలి. ఉదా:

ధ్వజాగ్రే కాకతీంద్రస్య భాతి క్రోడాకృతి ర్హరిః
మృద్బిందురివ దంష్ట్రాగ్రే యస్యాలక్ష్యత మేదినీ.

కాకతీంద్రుని జండాపై విష్ణువు క్రోడాకారముగా భాసిస్తున్నాడు. ఆతని దంష్ట్రాగ్రమందు భూమి మృద్బిందువు వలె కన్పడుతున్నది. దీనిలో అష్టాదశద్వీపసహిత అయిన భూమి దంష్ట్రాగ్రములో మృద్బిందురూపముగా ఉన్నదని అద్భుతముగా వర్ణించడము చేత అటువంటి అద్భుతమయిన భావనలో భూమి ప్రత్యక్షాయమాణ మవుతున్నది కాబట్టి భావికాలంకారము. ఈ భావికాలంకారములో ఒక్కొక్క చోట వర్ణనీయము వర్ణనావశము వలన ప్రత్యక్షాయమాణ మవుతుంది. వేరొకచోట ప్రత్యక్షాయమాణమే వర్ణిత మవుతుంది. ఇంకా దీని విచారవిస్తరమునకు ఇది స్థలముకాదు.

## ౫౭ ప్రత్యనీకము

బలినః ప్రతిపక్షస్య ప్రతీకారే సుదుష్కరే
య స్తదీయతిరస్కారః ప్రత్యనీకం తదుచ్యతే.

బలవంతుడయిన శత్రువునకు ప్రతీకారము చేయడము సుదుష్కర మయినపుడు ఆతనికి సంబంధించిన వానిని తిరస్కరించడము ప్రత్యనీకాలంకారము అవుతుంది. బలవంతుడయిన ప్రతిపక్షునకు దుర్బలుడయిన వాడు ప్రతీకారము చేయలేడు. ఆ బలవంతుని ఏ విధముగా నయినా బంధించడానికై దుర్బలుడు బలవంతునకు సంబంధించిన వానిని తిరస్కరించడము ఉన్నచోట ప్రత్యనీకాలంకారము అవుతుంది.

"అనీకస్య ప్రతినిధిః ప్రత్యనీకం" సేనకు ప్రతినిధిగా ఉంటే ప్రత్యనీకము. తత్సామ్యము వలన ఇది కూడా ప్రత్యనీకము. సేనను ఎదుర్కోవలసి ఉన్నప్పుడు దానిని ఎదుర్కో లేక దానికి ప్రతినిధిగా ఉండే వేరొక దానిని ఎదుర్కొన్నట్లుగా, ప్రబలుడయిన శత్రువు జయింపబడవలసిఉండగా దుర్బలుడయిన తదీయుని తిరస్కరించుట ప్రత్యనీకము. ప్రతిపక్షుని యందున్న బలవత్త్వమును చెప్పడము దీని ప్రయోజనము.

ఉదా :—

కాకతీయపతి శౌర్యమహోష్మ స్యకృతస్వమహిమా బడబాగ్నిః
తద్గభీరిమ సనాభి మజస్రం బాధతే నిధి మపాం బహి రంతః

ప్రతాపరుద్రుని శౌర్యమహోష్మచేత తిరస్కృతమయిన మహిమకలిగిన బడబాగ్ని ప్రతాపరుద్రుని ఏమీ చేయలేక ఆతనితో సమానగాంభీర్యముకలిగిన సముద్రుని నిత్యమూ లోపలా బయటా బాధించుతున్నది. దీనిలో సముద్రము ప్రతాపరుద్రునకు సంబంధించినది అంటే సాదృశ్యము హేతువు.

## ౫౧. వ్యాఘాతము

వ్యాఘాతాలంకారము కూడా లోకన్యాయమూలకమె.

యేన యత్సాధితం వస్తు తేనైవ క్రియతేన్యథా
అన్యేన తదలంకారో వ్యాఘాత ఇతి కథ్యతే.

ఏదో ఒక ఉపాయవిశేషమును అవలంబించి ఒకడు ఒకవస్తువును నిష్పన్నము చేస్తే సాధనరూపమైన ఆ ఉపాయమునే అవలంబించి వేరొకడు ఆ వస్తువును వేరొకవిధముగా చేసినప్పుడు వ్యాఘాతాలంకార మవుతుంది. మొదట నిష్పన్నమైన వస్తువునకు వ్యాహతి హేతువుగా ఉన్నందు వలన

ఇది వ్యాఘాత మవుతుంది. నిష్పన్నమైన వస్తువు యొక్క వ్యాఘాతమే ఇక్కడ ఉంటుందిగాని, నిష్పాదింప దలచిన వస్తువునకు ఇక్కడ ప్రసక్తి లేదు. విఘాతమును సంపాదించిన వానికి వైలక్షణ్యము గోచరించడమే దీనిలో ఫలము. ఉదా:

> కాకతీయాభిజాతోఽయం నాభిజాతాధికస్థితిః
> దోర్భ్యం లబ్ధోదయా న్నృపా న్స్వాభ్యా మనుదయాన్ సృజన్.

కాకతీయకులములో పుట్టిన ఇతడు నాభిసముత్పన్నుడైన బ్రహ్మకంటె అధికస్థితి కలవాడు. ఎందువల్లనంటే బాహువులనుండి ఉత్పత్తి పొందిన రాజులకు బాహువులతో ఉత్పత్తి లేని వారలనుగా చేస్తున్నాడు కదా! దీనిలో బ్రహ్మ బాహువులను సాధనముగా చేసుకొని క్షత్రియులను సృజించినాడు. ప్రతాపరుద్రుడు ఆ బాహువులనే అవలంబించి ఆ రాజులను ఉత్పత్తి లేనివారలుగా చేస్తున్నాడు. అని ఉన్నందువలన వ్యాఘతసమన్వయము స్పష్టము. నిష్పన్నులైన రాజులకు వ్యాహతి సంపాదించడము దీనిలో స్పష్టముగా నిరూపించబడినది. ఇంతవరకు లోకన్యాయమూలకములైన అలంకారములు నిరూపితములైనవి.

## ౫౯ పర్యాయము

వ్యాఘాతాలంకారములో వస్తుసాధనము అన్యథాకరణము అనే రెండు క్రమముగా కూర్చబడి ఉన్నవి. ఆ ప్రసంగానుసారముగా పర్యాయాలంకారము కూడ ఇక్కడ నిరూపింప తగి ఉన్నది.

> క్రమేణైకమనేకస్మిన్ ఆధారే వర్తతే యది
> ఏకస్మిన్ అథవానేకం పర్యాయాలంకృతి ర్మతా

పర్యాయాలంకారము రెండు విధాలు. రెండూ రెండు పర్యాయములు. అంతేకాని రెండూ ఒకటికాదు. ఈ రెండింటికి సామాన్య లక్షణము లేదు. ఒకవస్తువు అనేక ఆధారములలో క్రమముగా ఉన్నట్లు వర్ణించినట్లయితే ఒక విధమైన పర్యాయాలంకారము. ఒక ఆధేయము అనేక ఆధారములందు ఉన్నట్లు వర్ణించినా ఒకే వస్తువు అనేకములలో గోచరించడము అనే విశేషాలంకారమునకు ఇక్కడ ప్రసక్తి లేదు. విశేషాలంకారములో ఒక ఆధేయము అనేక ఆధారములందు ఏకకాలములోనే ప్రవర్తించుతుంది. పర్యాయములో ఆ విధముగా యౌగపద్యప్రతీతి ఉండదు. ఒకే ఆధారమందు అనేకాధేయములు ఉన్నట్లు వర్ణించితే అది రెండవ పర్యాయము. ఇక్కడ కూడా ఆధేయ ప్రవృత్తి క్రమముగా ఉంటుంది అనే ఊహించాలి. అందువలననే గుణ క్రియాయౌగపద్యము ఉన్న సముచ్చయాలంకారానికి ప్రసక్తి లేదు. సముచ్చయములో యుగపద్వర్తనము ఉండవలసిన అవసరము స్పష్టముగా నిరూపితమైనది. రెండు విధములైన పర్యాయాలంకారములోనూ క్రమాశ్రయణము ఉన్నది. అందువలన పర్యాయము అన్వర్థము. ఉదా:

దంష్ట్రాగ్రియాం కుహనాకిటేః భగవతో దేవస్య శౌరేః పురా
పశ్చాన్మస్తకమండలే ఫణభృతః పాతాళలోకేశితుః
అత్యోర్వీపతిశేఖరస్య మహతః శ్రీకాకతీయప్రభోః
బాహౌ విశ్వధురీణసారమహితే బద్ధోత్సవా మేదినీ.

భూదేవి మొదట మాయావరాహమైన ఆది దేవుని దంష్ట్రయందు, తర్వాత పాతాళలోక ప్రభువైన ఆదిశేషువు శిరమందు, ఇప్పుడు రాజశిరోమణియైన ప్రతాపరుద్రుని,

ప్రపంచమును ధరించడములో ప్రఖ్యాతసారముగలబాహువు సందున్నూ ఉత్సవము కలదై ఉన్నది. దీనిలో ఒకే మేదిని అనేకాధారములందు క్రమముగా ఉన్నట్లు నిరూపితమైనది. ఇది మొదటి పర్యాయము.

యేషాం ముఖే నిజవధూసవిధే నృపాణాం
శౌర్యోక్తయః సమభవన్ అభిమానగర్భాః
తేషాం ప్రతాపనృపవీక్షణ కాతరాణాం
తత్రైవ దీనవచనాని సముద్భవంతి.

ఏ రాజులకు తమ భార్యల దగ్గర అభిమాన పరిపూర్ణములైన శౌర్య వచనములు ముఖములో ఉత్పన్నములయినవో ప్రతాపరుద్రుని చూడగానే భయపడిన ఆరాజుల ఆముఖములందే దీనవచనములు పుట్టుతున్నవి. ఆధారమైన ముఖమందు ఆధేయములైనశౌర్యోక్తులు దీన వచనములు క్రమముగా ఉండడము నిరూపితమైనది. ఇది రెండవ పర్యాయము. రెండింటిలోనూ క్రమానుసంధానము ఉన్నది కాబట్టి విశేష సముచ్చయములకు అవకాశము లేదు.

## ౨౦ సూక్ష్మము

పర్యాయాలంకారములో ఏకాధారమందు అనేకాధేయముల ప్రసక్తి ఉన్నది. వానిలో ఒకటి సంలక్షితము కాకపోవడము అనే సంబంధమును బట్టి పర్యాయాలంకారానంతరము సూక్ష్మాలంకారమును నిరూపించడములో సంగతిగ్రహించాలి. సూక్ష్మాలంకారములో గూఢమైన అర్థ ప్రతీతి ఉంటుంది.

అసంలక్షిత సూక్ష్మార్థప్రకాశః సూక్ష్మ ఉచ్యతే.

బాగా గోచరముకాని సూక్ష్మమైన అర్థమును ప్రకా

శింపచేయడము ఉన్నట్లయితే సూక్ష్మాలంకారమవుతుంది. చతుర సహృదయులు మాత్రము తెలిసికొనే సూక్ష్మార్థ మును ఆకారేంగితములద్వారా ప్రకాశింప చేసినప్పుడు సూక్ష్మమన్నమాట. స్థూలమతులు ఈఅర్థమును బాగాగ్రహించలేరు. కుశాగ్రమతులు ఇంగితాకారముద్వారా ఆ అర్థ మును గ్రహించగలరు. మందబుద్ధులు తెలిసికోలేని అభి ప్రాయమును రసికుడు తెలిసికొనేటట్లుగా ప్రకాశింప చేసి నట్లయితే సూక్ష్మాలంకార మవుతుందని తాత్పర్యము సూక్ష్మార్థమును సంలక్షించినా ప్రకాశము చేసినా సూక్ష్మా లంకారమవుతుందని కొందఱి ఊహ. ఉదా :-

గురుజనసవిధే వధూః దృష్ట్వా నరేంద్రప్రేషితాం దూతీం
సర్వాంగేషు సహాసం కస్తూరీవిలేపనం కరోతి.

పెద్దల సమక్షంలో రాజుగారు పంపిన దూతికను వధువు గుర్తించి తన సర్వావయవములందు నవ్వుతు కస్తూరీ విలేపనము చేసుకొంటున్నది. దీనిలో కస్తూరీ విలేప నము చేత తిమిర సమయము సంకేతకాలము అని సూచిత మైనది. సంకేత సమయమును తెలిసికొనవలెననే ఊహతో దూతిక వచ్చింది. భ్రూభంగము మొదలైన ఇంగితముల ద్వారా నాయిక దూతీభావమును గుర్తించింది. రాత్రిసమ యము సంకేతకాలమని దగ్గర ఉన్నవారు తెలిసికోలేని నిపుణురాలైన దూతి మాత్రము తెలుసుకోగలిగిన సూక్ష్మా ర్థమును ప్రకాశింపచేసింది. కనుక సూక్ష్మాలంకారస సమన్విత మవుతుంది.

## ౭౧ ఉదాత్తము

ఉదాత్తాలంకారము కూడా లోకన్యాయమూలవే

భావికాలంకారములో ఉన్నవస్తువును ఉన్నట్లుగా వర్ణించడము ఉంటుంది. ఆరోపితవస్తు వర్ణనము ఉదాత్తప్రాణము. కనుక భావికాలంకారానికి ఇది ప్రతిపక్షమని ఊహించవచ్చు.

తదుదాత్తం భవేత్ యత్ర సమృద్ధం వస్తు వర్ణ్యతే

సమృద్ధమైన వస్తువర్ణనము ఉన్నట్లయితే ఉదాత్తము. అసంభావ్యమాన మైన మహాసమృద్ధి కలిగిన వస్తువర్ణనము దీనిలో ఉండాలి. కవిప్రతిభాప్రాప్తమైన ఐశ్వర్యము దీనిలో ఉంటుంది. కాబట్టే ఉదాత్తమనే పేరున్నా సార్థకము.

ఉదా:

రమ్యా మేకశిలాభిధాననగరీ మాసేదివాంసో బుధాః
సౌవర్ణేషు గృహేషు రత్నరచిత ద్వారతోరణేషు స్థితాః
ఆరుహ్యాంగణమేదినీషు కలభాన్ క్రీడోత్సుకా నర్భకాన్
మోదంతే యదవేక్ష్య రుద్రనృపతేః తత్త్యాగలీలాయితం.

అందమయిన ఏకశిలానగరమును పొందిన పండితులు రత్నాలు కూర్పబడిన ద్వార తోరణాలు కలిగిన బంగారపు భవనాలలో ఉండి, ముంగటి ప్రదేశములలో ఏనుగు గున్నలను ఎక్కి ఆడుకొనవలెననే అభిలాషకల అర్భకులను చూచి ఆనంద పడుతున్నారు అంటే ఇదంతా ప్రతాపరుద్రుని త్యాగ లీలాచరణము. ఈ పద్యములో మహా సమృద్ధిశాలి అయిన వస్తువు వర్ణితమయింది.

ఉదాత్తులయిన మహాపురుషుల చరితమును వేరొక ప్రధానమునకు అంగభూతముగా వర్ణించిన చోట కూడా ఉదాత్తాలంకారమె అవుతుందని ప్రాచీనులు అంగీకరించు తున్నారు. విద్యానాథుడు రెండవ ఉదాత్తాలంకారమును నిబంధించలేదు. నిబంధించక పోవడములో హేతువును ఈ

రీతిగా భావించాలి. రసభావాదులు వాక్యార్థభూతములై ప్రధానముగా ఉన్నచోట రసవదాద్యలంకారత్వము ఉంటుందని అలంకార రసికులయిన భామహాదులు అంగీకరిస్తున్నారు. వారి మతములో, రసభావాదులు అంగిగా ఉన్నప్పుడు రసవదాద్యలంకారమని, అంగముగా ఉన్నప్పుడు ద్వితీయోదాత్తాలంకారమని వ్యవస్థను భావించవచ్చును. కాగా అంగిభూతమయిన వస్త్వంతరమునకు ఒకవిశేషమును సంపాదింపదలచి మహాత్ములు ఉదాత్తచరితమును నిబంధించినప్పుడు ద్వితీయోదాత్త మవుతుందని భావము. ఇది మొదటి ఉదాత్తము కంటె భిన్నము. అర్థభేదము ఉన్నందువలన సామాన్యలక్షణము లేనందువలన ఇది వేరయిన అలంకారమె. శబ్దసామ్యమును బట్టి ఇదిన్నీ ఉదాత్త మనడమె కాని దానికీ దీనికి సంబంధము లేదు. చిరంతనాలంకారికులు ఈ ద్వితీయోదాత్తమును కూడా అంగీకరించు తున్నారని సూచించడానికె అలంకార సర్వస్వకర్త దీనిని నిరూపించినాడు. ధ్వనిదర్శనమును అంగీకరించే వారి దృష్టిలో ఇది ప్రత్యేకాలంకారము కాదు. రసవదాద్యలంకారములలోనే అంతర్భూతము. ధ్వనివాదులు రసభావాదికము అప్రధానముగా ఉన్నపుడు రసవదాద్యలంకార వ్యవహారమును ఆదరిస్తారు. ఈ ఉదాత్తము కూడా అటువంటిదే కాబట్టి వానిలో చేరుతుంది. ప్రత్యేకముగా దీనికి విషయము లేదు. అపుడు ద్వితీయోదాత్తమును పరిగణించ నక్కరలేదు. ఈ అభిప్రాయముతో విద్యానాథుడు ద్వితీయోదాత్తమును ఆదరించి ఉండడని ఊహించ వచ్చును.

మమ్మటాదులు ఈ ద్వితీయోదాత్తమును కూడా లక్షించారు. కొందరు రసాదులు అంగముగా ఉన్నప్పటికీ

సవదాద్యలంకారమని అనరు. వారి మతంలో ద్వితీయో
ాత్తము స్వరూపలాభము పొందుతుంది. ఈ విశేషమును
ాచించ డానికి మమ్మటు రచన యత్నించినదని గ్రహిం
ాలి. అప్రసక్తముకాని ఈ విషయమును కూడా ప్రస్తుత
ములో భావించాలి. రసాదులు ఇతరములకు అంగములుగా
రూపింప బడిన చోట సాధారణ్యము ద్వారా చిత్తవృత్తి
శేషము లయిన రతిభావాదులు ఆస్వాదగోచరములు
వుతూ ఉంటవి. ఈ రెండవ ఉదాత్తములో అంగముగా
ర్ణింపబడిన మహాపురుష చరితము తాటస్థ్యముతో
స్వాద్య మవుతుందని అభిమానముఉంటే రసవదాద్యలం
ారము కంటె వీనిని వేరుగానే పరిగణించ వచ్చును. విద్యా
ాథుడు అలంకారాలను నిరూపించేటపుడు తనకు అభీష్టము
యిన కొన్నిటినే నిరూపిస్తూ కొన్నిటిని విడిచి పెట్టడమును
లవాటులో ఉంచుకొన్నాడు. ఈ ద్వితీయోదాత్తము
ాడా ఆ దృష్టితో నిరూపితము కాలేదేమో! ధ్వనివాదా
యాయులున్నా దీనిని పృథక్కుగా పరిగణించి నందువలన
ద్యానాథుడు నిరూపించక పోవడములోని భావమును
ంతగా అన్వేషింప వలసివచ్చింది.

## ౬౨ పరివృత్తి

ఉదాత్తాలంకారములో సమృద్ధి ఉండడము ప్రసక్త
యింది. పరివృత్త్యలంకారములో వినిమయము ఉంటుంది.
ినిమయము అంటే మార్పు. ఒకటి ఇచ్చి వేరొకటి పుచ్చు
నుట. వినిమయము సమృద్ధి కార్యము కదా! అందువలన
దాత్తాలంకారము తరువాత పరివృత్తి నిరూపణార్హమై
న్నది.

సమన్యూనాధికానాం చ యదా వినిమయో భవేత్
సాకం సమాధికన్యూనైః పరివృత్తి రసౌ మతా

సమము న్యూనము అధికమూ అయిన పదార్థము లకు క్రమముగా సమాధిక న్యూనములతో వినిమయము ఉన్నట్లయితే పరివృత్తి అలంకార మవుతుంది. ఇది మూడు విధాలు. సమానమును ఇచ్చి సమానమును పుచ్చుకొనుట. తక్కువ ఇచ్చి ఎక్కువ పుచ్చుకొనుట. ఎక్కువ ఇచ్చి తక్కువ పుచ్చుకొనుట అని. వీనినే సమపరివృత్తి న్యూనపరివృత్తి అధిక పరివృత్తి అంటారు. సమపరివృత్తిలో త్యజ్యమానము ఆదీయమానము రెండున్నూ తుల్యగుణములు కలవిగా ఉంటవి కాబట్టి ఔపమ్యము గమ్యముగా గోచరిస్తుంది. ఉదా:—

౧ సుధారసముచో వాచో దత్వా కాకతి భూభుజే
అతో లభంతే కవయః సహస్రం గంధ సింధురాన్,

ప్రతాపరుద్రునకు కవులు అమృతము చిలుకునట్టి వాక్కు లిచ్చి వేయి గంధ సింధురములను ఆతని నుండి పుచ్చుకొను చున్నారు. దీనిలో వాక్కులు సింధురములూ రెండూ సమానములై ఉన్నవి.

౨. ఉపాయనం గజాశ్వాది కృత్వా సర్వేపి భూభుజః
ప్రతాపరుద్ర దేవస్య లభంతే సుస్థిరాం కృపాం

రాజులందరూ ప్రతాపరుద్రునకు గజాశ్వాదులను ఉపాయనముగా చేసి సుస్థిరమయిన కృపను పొందుతున్నారు. దీనిలో త్యజ్యమానమయిన ఉపాయనము హీనగుణము. స్వీకరింపబడే ప్రతాపరుద్ర కృపా విలసితము ఉత్కృష్ట గుణము. కాబట్టి ఇది రెండవ పరివృత్తి.

౩. ప్రతాపరుద్రస్య రణే జితాః ప్రత్యర్థిభూభుజః
దత్వా భూషాం కిరాతేభ్యో లభంతే వల్కలాదికమ్

ప్రతాపరుద్రుని యుద్ధములో పరాజితులయిన ప్రత్యర్థి రాజులు వనములో కిరాతులకు అలంకారములిచ్చి నారచీరలను తీసుకొంటున్నారు. దీనిలో అధికము ఇచ్చి తక్కువ తీసికొనడము ఉన్నది.

## ౬౩ కారణమాల

ఇటుపై నాలుగు అలంకారములున్నూ శృంఖలా న్యాయ మూలకములు. కేవలమూ శృంఖలగా ఉండడము అలంకారము కాదు. శృంఖలా బంధముతో ఉపచిత్రతమయిన కార్య కారణ భావము విశేషణ విశేష్య భావము విచ్ఛిత్తి విశేషమును సంపాదించేదిగా ఈ అలంకారములలో ఉంటుంది. ఈ విధముగా అంగీకరించక పోతే సాధర్మ్య మూలకములయిన అలంకారాలలో సాధర్మ్యమునే అలంకారముగా పరిగణింప వలసి ఉంటుంది. విరోధమూలకాలంకారాలలో కేవల విరోధమునే అలంకారముగా పరిగణింప వలసి వస్తుంది. ఈ విధముగా చూస్తే మొత్తము మీద ఏడెనిమిది మాత్రమె అలంకారములు కాదగినవిగా పరిగణనములో సిద్ధములవుతవి. కనుక చెప్పబోయే అలంకారములు శృంఖలా బంధోపచితములయిన చమత్కార విశేషము కలిగి ఉంటవని అభ్యూహించాలి.

పూర్వం పూర్వం ప్రతి యదా హేతుః స్యా దుత్తరోత్తరం
తదా కారణమాలాఖ్య మలంకరణ ముచ్యతే

పూర్వ పూర్వము ఉత్తరోత్తరము గురించి క్రమముగా హేతువుగా నిబంధింపబడి నట్లయితే కారణమాల అనే అలంకార మతువుంది. మాలాన్యాయముగా అనేక కారణములు యాగపద్యముతో ఇక్కడ ఉంటవి కాబట్టి కారణ మాల అనేపేరు సార్థకముగా ఉంటున్నది. శృంఖలా

బంధ చిత్రితములయిన ఇతరాలంకారాలకంటె దీనిలో ఇదే విశేషము. ఈ కారణమాలాలంకారము విపర్యయముగా కూడా ఉండవచ్చును. పూర్వ పూర్వమునకు ఉత్తరోత్తరము కారణముగా ఉన్నప్పటికీ ఈ అలంకారమె అవుతుంది. ఉదా:

విద్యయా వినయోత్కర్షో వినయేన గుణార్జనం
గుణైః ప్రజానురాగశ్చ క్రమోయం కాకతీశ్వరే

విద్యచే వినయాతిశయము వినయముచే గుణార్జనము గుణములచే ప్రజానురాగము ఇది కాకతీశ్వరునియందు క్రమము. విద్యాదులు వినయాదులలో హేతువుగా ఉన్నవి. కనుక కారణమాల.

## ౭౪ ఏకావళి

యత్రోత్తరోత్తరేషాం స్యాత్పూర్వం పూర్వం ప్రతిక్రమాత్
విశేషణత్వ కథన మసా వేకావళీ మతా.

ఉత్తరోత్తరములకు పూర్వ పూర్వములను గురించి క్రమముగా విశేషణత్వమును చెప్పినట్లయితే అది ఏకావళి అలంకార మవుతుంది. ఉత్తరోత్తరము విశేషణముగా ఉండడము రెండు విధాలు. ఒకటి స్థాపన పద్ధతి. మరొకటి అపోహాన పద్ధతి.

ప్రతాపరుద్రనగరీ సుజనై రుపశోభితా
సుజనాః స్ఫీత విభవైః విభవాః స్థైర్యశాలినః.

ప్రతాపరుద్ర నగరి సుజనులతో శోభ కలిగి ఉన్నది. సుజనులు అతిశయిత విభవులు. విభవములు స్థైర్యము కలిగి ఉన్నవి. దీనిలో పూర్వ పూర్వములయిన నగరాదికములకు ఉత్తరోత్తరములయిన సుజనాదికము స్థాపన విధానముతో విశేషణమై ఉన్నది.

నతద్రాజ్యం ప్రజాయత్ర నభవం త్యూర్జితశ్రియః
నతాః ప్రజాః ప్రభుర్యాసాం నస్వయం కాకతీశ్వరః.

అది రాజ్యమె కాదు; ఎచట ప్రజలు ఊర్జిత శ్రీకులు కారో. వారు ప్రజలే కారు; ఎవరికి కాకతీశ్వరుడు ప్రభువు కాడో. దీనిలో పూర్వ పూర్వమయిన రాజ్యాదికమునకు ఉత్తరోత్తర మయిన ప్రజాదికము అపోహన విధానముతో విశేషణముగా ఉన్నది. ఈ ఏకావళి అలంకారములో పూర్వోత్తరములు పరస్పరమూ కూడుకొని ఏక పంక్తి రూపముగా ఉన్నవి కాబట్టి ఏకావళి అనే పేరు సార్థకము.

## ౬౫ మాలాదీపకము

యదాతు పూర్వ పూర్వస్య సంభవే దుత్తరోత్తరం
ప్రత్యుత్కర్షా వహత్వం తన్మాలాదీపక ముచ్యతే.

ఉత్తరోత్తరమును గురించి పూర్వ పూర్వము ఉత్కర్షను సంపాదించేదిగా ఉన్నపుడు మాలాదీపకాలంకారము అవుతుంది. ఈ అలంకారములో మాలాశబ్దము శృంఖలను గోచరింప చేస్తుంది. మాలోపమలో మాలా శబ్దము వలె ఇచటి మాలాశబ్దమును గ్రహించరాదు. ఒక ఉపమేయమునకు అనేకోపమానములు దీనిలో నిబంధింప బడడము లేదు. దీనిలో ఔపమ్యమె లేదు కదా! కనుకనె మాలాదీపకము దీపకాలంకారములో ఒక భేదమని అనుకోరాదు. దీపకము ఔపమ్య జీవితము. శృంఖలా విధముగా కూడుకొని ఉండడము దీనిలో చారుత్వమును సంపాదిస్తుంది. ఉదా:—

భాగ్యభూమా మహీం ప్రాప్తః కాకతీంద్ర భుజం మహీ
భుజః ప్రతాపమతులం ప్రతాపశ్చ జగత్త్రయం

భాగ్యాతిశయము భూమిని పొందినది. భూమి కాకతీంద్రుని భుజమును పొందినది. భుజము ప్రతాపమును పొందినది. అసమాన ప్రతాపము జగత్త్రయమును పొంది

నది. దీనిలో భాగ్యాతిశయము మొదలయిన వానిచేత భూమ్యాదులకు ఉత్కర్ష నిరూపిత మయింది.

## ౭౬ సారము

ఉత్తరోత్తర ముత్కర్షః సారాలంకార ఉచ్యతే.

పూర్వపూర్వము కంటె ఉత్తరోత్తరమునకు ఉత్కర్షను నిబంధించుట సారాలంకారము అవుతుంది ఒకే వస్తువునకు ఉత్తరోత్తర సముత్కర్ష చెప్పడము కాని అనేక వస్తువులకు ఉత్తరోత్తర సముత్కర్ష చెప్పడము కాని దీనిలో ఉంటుంది. మొదటి భేదములో అవస్థావిశేషము ననుసరించి పూర్వపూర్వముకంటె ఉత్తరోత్తరమునకు ఉత్కర్షను ఊహించాలి. కాకపోయినట్లయితే ఒకే పదార్థమునకు పూర్వత్వము ఉత్తరత్వము ఏవిధముగా కుదురుతుంది? ఈ ఉత్తరోత్తరము ఉపచయము ఉండుట కూడా స్వరూపము ననుసరించి కాని, ధర్మము ననుసరించి గాని ఉండవచ్చును. మాలా దీపకములో పూర్వము కంటె ఉత్తరము ఉత్కృష్టముగా ఉండదు. ఉత్తరపదార్థమును గురించి పూర్వము ఉత్కర్ష నిబంధనము కావడమె మాలాదీపకములో ఉంటుంది. దీనిలో ఉత్తరోత్తరమునకు ఉత్కర్షనిబంధనము ఉన్నది కనుక సారము అనే పేరు సార్థకము ఉదా :—

జగత్సు వసుధా భాతి తస్యా మేకశిలా పురీ
కాకతీయాన్వయ స్తత్ర తస్మిన్ రుద్రనరేశ్వరః

లోకాలలో భూమి ప్రకాశిస్తున్నది. భూమిలో ఏకశిలాపట్టణము శోభగా ఉన్నది. ఆ పట్టణములో కాకతీయ వంశము రమణీయముగా ఉన్నది. ఆ వంశములో రుద్రనరేశ్వరుడు విలసించుతున్నాడు. ఈ పద్యములో ఉత్తరోత్తర సముత్కర్ష నిరూపిత మయింది.

# మిశ్రాలంకార ప్రకరణము

ఇంతవరకు నిరూపించిన ప్రకరణములో ఏకైకా లంకారములు నిరూపితము లైనవి. ఇక ఇటుమీాదట మిశ్రా లంకారనిరూపణము అవసరప్రాప్త మౌతున్నది. ఉపమాద్య లంకారములు కొన్ని ఒకచోట కలసి ఉన్నప్పుడు అవి వేరు వేరుగా పర్యవసానము పొందుతున్నవా? లేక ఆ స్థలములో అలంకారాంతర పరిగణనము చేయవలెనా? అని విచా రించ వలసి ఉన్నది. లౌకికములైన అలంకారములు కొన్ని సువర్ణమయములు, కొన్ని మణిమయములు. అవి పరస్పరము సంబంధము లేకపోయినా వేరు వేరుగా సౌందర్యమును సంపాదించేవి కాగలుగుతూనే ఉన్నవి. అవి ఎక్కడైనా ఒక్కొకచోట పరస్పరము సంబంధము కలవై నప్పుడు చారుత్వాతిశయము కన్పడుతూనే ఉన్నది. కంకణము మొదలయినవి సువర్ణాలంకారాలు. హారములు మొదల యినవి కొన్ని మణిమయాలంకారాలు. సువర్ణప్రత్యుప్త రత్నాలంకారములున్నూ ఉంగరము మొదలయినవి ఉన్నవి. సువర్ణములో పొదుపబడిన రత్నాలంకారములను కేవల సువర్ణాలంకారాలని గాని కేవల రత్నాలంకారాలని గాని అనగూడదు. అదే విధముగా కావ్యలంకారవిషయములో కూడా గ్రహించాలి. రూపకాలంకారము ఉపమాలంకారము వేరువేరుగా సంబంధము లేకుండా ఉన్నప్పుడు సౌందర్య హేతువు లౌతున్నప్పటికీ ఒకచోట పరస్పరము సంబంధము కలిగి ఉన్నప్పుడు సంఘటనాకృతమైన చారుత్వాంతరము

అవశ్యముగా భాసిస్తుంది. అలంకారములకు అటువంటి సం బంధము రెండు విధములుగా ఉంటుంది. ఒకటి సంయోగ రూపము. వేరొకటి సమవాయరూపము. సంయోగములో తిలతండులన్యాయమును, సమవాయములో క్షీరనీరన్యాయ మును గ్రహించాలి. భేదము స్పష్టముగా గోచరమైతే సం యోగమని, స్పష్టముగా గోచరము కాకపోతే సమవాయమని గ్రాహిక. తిలతండులవిధముగా అలంకారములు సంబంధము కలవైనప్పుడు సంసృష్టి అనే భేదమును, క్షీరనీరముల విధ ముగా సంబద్ధము లైనప్పుడు సంకరము అనే భేదమును అంగీకరింపవలసి ఉన్నది. ఈ రెండున్నూ వేరువేరుగా చారు త్వాతిశయ హేతువులవుతూ ఉన్నవి. ఈవిధముగానే సంసృష్టి సంకరములను గ్రహించాలి. అంతే గాని పూర్వము చెప్పిన అలంకారముల కంటె ఇవి శేషరూపము లయిన అలం కారాలు అని అనుకోరాదు. దానిలో మొదటగా సంసృష్టి నిరూపణము సముచితము.

## సంసృష్టి

తిలతండుల సంశ్లేష న్యాయా ద్యత్ర పరస్పరం
సంశ్లిష్యేయు రలంకారాః సా సంసృష్టి ర్నిరూపత్యే.

తిలతండులముల న్యాయానుసారముగా రూపకాద్య లంకారములు పరస్పరము సంబంధము కలిగి ఉంటే సం సృష్టి అలంకారము అవుతుంది. నువ్వులు బియ్యము కలిపి నపుడు వేని కవి విశదముగా కనపడుతూనే ఉంటవి. ఆ విధ ముగానే సంసృష్టములైన రూపకోపమాదులు విడివిడిగా గోచరము లవుతవి. శబ్దాలంకారగతము అర్థాలంకారగతము ఉభయాలంకారగతము అని ఈ సంసృష్టి మూడు విధాలు.

౧ ఖుంభత్సంభ్రమ గంధసింధుర ధురా నిర్దారితోర్వీతలాః
త్వంగత్తుంగ తురంగమ ప్రతిభయా ద్రాక్స్యందన స్యందనాః
తీవ్రారంభ సముద్యదుద్భట భటాటోప స్ఫురద్దిక్తటాః
నిస్సీమాః ప్రసరంతి రుద్రనృపతేః జైత్రప్రయాణోద్యమాః.

ప్రతాపరుద్రుని జైత్రప్రయాణప్రయత్నములు నిస్సీమములై ప్రసరిస్తున్నవి. దీప్యమానములైన గంధసింధురముల భారముచేత భూమి బ్రద్దలవుతున్నది. ఎగురుతూ ఉన్న ఉన్నతాశ్వములు భయంకరములుగా ఉన్నవి. రథములు శీఘ్రముగా పరుగెత్తుతున్నవి. తీవ్రారంభము కలిగిన మహాభటుల ఆటోపము దిక్తటములను చెదరగొట్టుతున్నది. ఈ పద్యములో ఛేకానుప్రాస వృత్త్యనుప్రాసలకు సంసృష్టి గ్రహించాలి.

౨. కాకతీయచమూ ర్ధత్తే మహిమాన ముదన్వతః
గ్రసతే యా ద్విషద్భూప ధ్వజినీ స్తటినీ రివ

ప్రతాపరుద్రసేన సముద్రమహిమను ధరిస్తున్నది. ఆ సేన శత్రురాజసేనలను సముద్రము నదులను వలె గ్రసిస్తున్నది. పూర్వార్ధములో నిదర్శనాలంకారము, ఉత్తరార్ధములో ఉపమాలంకారము సంసృష్టములై ఉన్నవి. పరస్పరము ఇవి నిరపేక్షములుగా ఉన్నందున తిలతండులన్యాయ సాదృశ్యము ఉన్నది. దీనిలో రెండు అర్థాలంకారముల సంసృష్టి భావనీయము.

౩ ప్రతాపరుద్ర దోర్దండో మండలాగ్రేణ మండితః
దృశ్యతే సమరే వీరైః ఉత్ఫణః ఫణవానివ.

ఇది ఉభయసంసృష్టికి ఉదాహరణము. ఖడ్గశోభితమైన ప్రతాపరుద్రుని దోర్దండము పడగతో కూడుకొన్న

పాము వలె యుద్ధములో వీరులచే చూడబడుచున్నది. ఈ పద్యములో వృత్త్యనుప్రాస ఉపమాలంకారములకు సంసృష్టి ఉన్నది.

## సంకరము

క్షీరనీరనయా ద్యత్ర సంబంధః స్యా త్పరస్పరమ్
అలంకృతీనా మేతాసాం సంకరః స ఉదాహృతః,

క్షీరనీరన్యాయానుసారముగా అలంకారములకు పరస్పరము భేదము స్పష్టముగా నిరూపితమై ఉన్నట్లయితే సంకరాలంకారము అవుతుంది. నీరు పాలు కలయిక స్పష్టముగా గోచరము కాదు. సంకీర్ణములైన అలంకారముల కలయిక కూడా బాగా భాసించదు. ఈ సంకరము మూడు విధాలు. అంగాంగిభావ సంకరము, సందేహ సంకరము, ఏకవాచకానుప్రవేశ సంకరము అని. అంగాంగిభావసంకరమునే అనుగ్రాహ్యానుగ్రాహకభావ సంకరమని అంటారు. ఒక అలంకారమునకు స్వరూపము సంపాదించడానికి వేరొక అలంకారము అంగముగా ఉండి ఉపకరించుతుంది. ఇటువంటి స్థలములో మొదటి సంకరము. సందేహసంకరములో సంకీర్ణములైన అలంకారములలో నిర్ణయము చేయడానికి అవకాశము ఉండదు. ఆ అలంకారమగునా? ఈ అలంకారము అగునా? అని సందేహము కలుగుతుంది. మూడవసంకరములో ఒకే వాచకమునందు రెండు అలంకారములు అనుప్రవేశము పొంది ఉంటవి.

౧. ఉద్యద్బృంహిత గర్జితైః ద్విపఘటా కాదంబినీ సంభ్రమైః
క్షోణీభృత్కటకోపరోధ పటుభిః ప్రావృడ్విహారా ఇవ
శత్రుస్త్రీ బహులాశ్రువృష్టి శమిత క్ష్మాచక్ర తాపోదయాః
యాత్రాః కాకతివల్లభస్య జగతా మానంద మాతన్వతే

ప్రతాపరుద్రుని జైత్రయాత్రలు జగత్తునకు ఆనందమును కలుగజేస్తున్నవి. ఆ యాత్రలు వర్షావిహారముల వలె ఉన్నవి. వర్షమువలెఉన్న శత్రుస్త్రీల కన్నీటి చేత భూమిలోని తాపము శమింపజేయబడినది. గర్జితముల వంటి బృంహితములు కలిగి క్షోణీభృత్కటకములను [రాజులశిబిరములు, పర్వతములచరియలు] అడ్డుపెట్టగల మేఘమాలవంటి గజసమూహముల సంభ్రమములు కలవై యాత్రలు జగదానందకములై ఉన్నవి. దీనిలో రెండు ఉపమాలంకారములకు అంగాంగిభావసంకరము ఉన్నది. ఒకటి సమాసగతోపమ, వేరొకటి వాక్యగతమైన ఉపమ. వాక్యగతోపమ అంగి. సమాసగతోపమ అంగము. "ప్రావృడ్విహారా ఇవ" అనే వాక్యగతమైన ఉపమాలంకారము ఉన్నందు వలననే 'గజఘటాకాదంబినీ' అనే చోట నమాస గత మయిన ఉపమ సాధిత మవుతున్నది. 'గజఘటాకాదంబినీ' అన్నప్పుడు ఉపమితసమాసమును ఆశ్రయించాలి. 'క్షోణీభృత్కటకోపరోధ' అనేస్థలములో శ్లేషమూలక మయిన అతిశయోక్తి ఉన్నది. ఈ అతిశయోక్తి సమాసగతోపమాలంకారమునకు అంగము. ఇట్లా అతిశయోక్త్యనుగృహీత మయిన సమాసగతోపమ వాక్యగతోపమకు అనుగ్రాహకముగా ఉన్నందు వలన ఇది అనుగ్రాహ్యానుగ్రాహకభావ (అంగాంగిభావ) సంకరము. అంగాంగులయిన ఉపమలు రెండూ సజాతీయములు కాబట్టి ఇది సజాతీయ సంకరము.

ప్రతాపరుద్రస్య కృపాణధారా ప్రత్యర్థిపాలేషు పతత్యమందం
ప్రతాపేనాయేవ కృతసం ధానా తదరినో గురిసికలుషసం

ప్రతాపరుద్రుని ఖడ్గధార శత్రురాజుల ఫాలములపై బ్రహ్మ అక్కడ ఏర్పాటు చేసిన దుర్లిపికల్మషమును కడిగి వేయడానికో అన్నట్లు వేగముగా పడుతున్నది. ఈ పద్యములో విజాతీయములయిన అలంకారాలకు అంగాంగిభావ సంకరము ఉన్నది. "ప్రక్షాళనాయేవ" కడగడానికో అన్నట్లు అనేచోట ఉన్న ఉత్ప్రేక్ష 'దుర్లిపికల్మషస్య' అనేరూపకమును ప్రసాధనము చేస్తున్నది. దుర్లిపియందు కల్మషారోపము ఉంటేనే ప్రక్షాళనము ఉపపన్న మవుతుంది. స్పష్టనిరూపిత మయిన ఉత్ప్రేక్ష కల్మషారోపరూపమయిన రూపకమున్నూ పరస్పరమూ సహకారము కలిగి ఉన్నందు వలన విజాతీయ సంకరము.

## ఏకవాచకానుప్రవేశ సంకరము

విజితారిపురో మూర్త్యా విలసత్సర్వమంగళః
భువి శంభు రివాభాతి కాకతీయనరేశ్వరః.

విజితారిపురుడూ స్వరూపములో విలసత్సర్వమంగళుడూ అయిన కాకతీయనరేశ్వరుడు భూమియందు శివుని వలె ప్రకాశిస్తున్నాడు. దీనిలో విజితారిపుర అనే చోట అర్థసామ్యము ఉన్నందు వలన ఉపమాలంకారము. విలసత్సర్వమంగళః అని శబ్దసామ్యము వలన శ్లేషాలంకారమున్నూ 'శంభురివ' అనేచోట ఉన్న ఒక 'ఇవ' శబ్దములో అనుప్రవేశము పొంది ఉన్నవి కాబట్టి ఏకవాచకానుప్రవేశ సంకరము.

## సందేహ సంకరము

జాతః ప్రతాపరుద్రేందుః కాకతీయాన్వయాంబుధౌ
ధత్తే జనచకోరాణాం ప్రసాదజ్యోత్స్నయామృతం.

కాకతీయకులాంబుధిలో పుట్టిన ప్రతాపరుద్రేంద్రుడు జనచకోరములకు ప్రసాద చంద్రికచే అమృతమును దానము చేస్తున్నాడు. ఈ పద్యము లోని నాలుగు పదాలలో రూపక సమాసమా ? ఉపమితసమాసమా ? అని సందేహము కలుగుతుంది. "ప్రతాపరుద్ర ఏవ ఇందుః, ప్రతాపరుద్రః ఇందు రివ- కాకతీయాన్వయ ఏవ అంబుధిః, కాకతీయాన్వయః అంబుధి రివ- జనా ఏవ చకోరాః, జనాః చకోరా ఇవ- ప్రసాద ఏవ జ్యోత్స్నా, ప్రసాదః జ్యోత్స్నా ఇవ" అని సమాసద్వయము సంభవించడానికి అవకాశము ఉన్నది కదా ! రూపకోపమలలో ఒకే దానిని సాధించడానికి సాధక (అనుకూల) ప్రమాణము కాని, బాధక (ప్రతికూల) ప్రమాణము కాని లేదు. అందువలన సందేహమె పర్యవసన్న మవుతున్నది. దేనినీ నిర్ణంచడానికి వీలులేదు కాబట్టి సందేహ సంకరము. సాధకము కాని బాధకము కాని ఏదయినా ఉంటే సందేహ నివృత్తి కలుగుతుంది.

ప్రతాపరుద్రనృపతేః పారిజాతాత్ సముద్భవాః
వతంసయంతి దిఙ్నార్యో మధురాః కీర్తిమంజరీః

ప్రతాపరుద్రనృపతి అనే పారిజాతము నుండి పుట్టిన మధురములయిన కీర్తులనే మంజరులను దిగంగనలు అవతంసముగా చేసికొంటున్నారు. దీనిలో "కీర్తయ ఏవ మంజర్యః" అనేచోట రూపలంకారమని నిశ్చయించడానికి 'వతంసయంతి' అని సాధకమయిన ప్రమాణము ఉన్నది. అవతంసీకరణ మనేది మూర్తమయిన మంజరియందే సంభవ మవుతుంది కాని కీర్తియందు సంభవించదు. రూపకసమాసమును అంగీక

రిస్తేనే మంజరీప్రాధాన్యము ఉంటుంది కాబట్టి వతంసీకరణము కుదురుతుంది. ఉపమితసమాసమయితే కీర్తిప్రాధాన్యము ఉంటుంది. కనుక వతంసీకరణము కుదరదు. ఇక్కడ ఈ అనుకూలప్రమాణమును అనుసరించి రూపకనిర్ణయము చేయవచ్చును. అవతంసీకరణము ఇక్కడ ఉన్నందువలన కీర్తిమంజరులకు అభేదప్రతిపత్తి కలుగుతున్నది. అంతేకాని ఉపమాలంకారములో మాదిరిగా భేదాభేదప్రతీతి కలగడము లేదు.

కాకతీంద్రస్య నిస్సాణధ్వనౌ దిక్షు విజృంభితే
వ్యాకులీకృతసత్త్వోఽభూత్ ప్రతిపక్షబలార్ణవః

కాకతీంద్రుని భేరీధ్వని దిక్కులలో విజృంభించగానే ప్రతిపక్షబలార్ణవము వ్యాకులపడిన సత్త్వములు కలది అయింది. దీనిలో ప్రతిపక్షబలార్ణవః అనే చోట ఉపమాసమాసమును అంగీకరించడానికి వీలులేదు. 'వ్యాకులీకృత సత్త్వః' అనే బాధకప్రమాణము ఉన్నందువలన "ప్రతిపక్ష బలం అర్ణవ ఇవ" అని ఉపమితసమాసము కుదరదు. 'ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" అనే వ్యాకరణానుశాసనము వలన సామాన్యధర్మప్రయోగము ఉన్నప్పుడు ఉపమితసమాసమును అంగీకరించ రాదని, సామాన్యధర్మప్రయోగము లేనప్పుడే ఉపమిత సమాసమును స్వీకరించాలని తేలుతున్నది. కాగా ఇక్కడ సామాన్యధర్మ ప్రయోగము ఉపమాబాధకముగా ఉన్నది కాబట్టి ఉపమను స్వీకరించడానికి వీలులేదు. ఇక మిగిలిన రూపాలంకారమునే ఈ పద్యములో నిశ్చయించాలి. అలంకారాంతరములతో

సంసృష్టి సంకర విశేషాలను వేరుగా ప్రబంధాంతరములలో గ్రహించాలి. వివేకులకు ఇంత మాత్రపు నిరూపణమె చాలు.

యదున్మీలనసంపత్తి
సముల్లాసః శ్రియః కళా
వందే తాం పరాం దేవీం
స్వాత్మభావేన సాహితీం.



*P*rinted at Kalyani *P*ress, Tenali. Q. H. G. 79 A
For Navya Sahitya *P*arishat, Guntur Q. H. No. G. 80
[illegible]

# శోధిక

1-20 బాధించేది
2-22 యదప్రయుక్తంకవిభి
రప్రయుక్తంతదుచ్యతే
3-1 ప్రతాపరుద్ర శత్రు
3-24 ప్రయుక్తమయితే
4-8 వ్యర్థబాహు
4-9 తము కాగా;
4-13 అసమర్థము
6-18 సందిగ్ధార్థ
7-7 సమర్థము కానపుడు
9-13 అప్రసిద్ధార్థములో
10-8 పారిభాషికము
14-25 శంకించవచ్చు
15-13 శాబ్దో వా
20-23 పునరుక్తపదాభాస
22-14 ఉంచుకో లేదో
23-5 గ్రంధమత
27-14 పదార్థము
28-10 విచ్ఛేదము
30-19 రసానికి
31-10 లుప్తము
32-5 ఇటువంటివి
33-12 అందుచేత వాచ్య
35-22 స్త్రియః
39-5 రాగ్ధము
39-9 ఉన్నప్పుడు;
40-13 తర్పణం
47-8 శిఖాటోపజవే
48-12 అస్వేష్టమన్యతో
51-19 జీవించుతున్నారు.
57-9 ఉంటుంది.
57-1? సరసత
58-15 సుధామధు
61-2 స్వేచ్ఛగా
63-6 ఘనోర్వ్యోర్వీ
64-7 అవిశ్లాఘ్య
65-17 శ్రీహరి మూడు
65-22 వ్యుత్పత్తి
70-22 స్పష్టముగా
72-3 చంద్రమకుట
72-22 దృష్టాకమలాసక్తి రాజ్ఞ
స్తథా సుభగ చిత్ర
చరితస్య భాస్వాన
పిత్వాంతాం కువలయ
లక్ష్మీం ప్రసాధయసి
73-16 చూస్తున్నాడు
76-8 సహముకాదు
76-17 అనాలికదా !
78-5 అంతర్భవింపవని
81-1 సంఘటనా
81-24 అరవైఆరు
83-8 నిరూపితాను
83-25 మవుతూ
86-20 సాధర్మ్యము

88- 5 భాసిస్తుంది
89-21 ఉండి
92-10 (కులాయము)లో
96-16 తిరుగుతూ ఉంటే
,, కలుగుతుం
97- 3 పౌనరుక్త్యేతు
97-11 అవృత్తము కావడము
99- 8 కాకతీంద్రో
100-2 అధికచర్చ
101-8 వ్యంగ్యపర
103-14 అదిఅట్టే
104- 8 మానజ్ఞా-సాధకులు
108-18 లక్షణార్థము
110-21 సమ్మతేన
112 7 చేస్తున్నారు
116-17 కాని వానికి
117-21 పరోక్ష విధముగా
ఉపపన్నముకాక ఈవిధా
నము వలనే
123-16 లుప్తోపమ
126-21 బాహశాయయాతే
131-25 కలగదని
132-14 అలకాపురీ
132-16 నమస్కరించుచున్నారు.
137-22 అంగీకరిస్తూ
138- 8 జ్యోత్స్నయంతి
138-10 (ఉపమేయమునకు)
138-18 జ్యోత్స్నయంతి
139- 5 కల్పశాఖి
139- 8 అనేది
139-18 సామాన్య ధర్మ
144-13 ఎవనికి
144-17 భీమసేన
145-17 వ్యుత్పాదకములు
147- 5 కకుత్స్థల
150- 3 మాననిర్దేశము
150-10 వ్యంగ్యముగా
160-13 ప్రకృతరూపమును
(ప్రకృతాంగత్వమును)
161-21 సావయవరూప
162-19 ఆరోపవిషయములు
163-23 కల్పశాఖిత్వము
164-23 కవికి
165-12 ప్రవిదల
165-13 శ్రుత్వైవ
167-10 సాపేక్షరూపకము
పరంపరిత రూపకమని
అనేక రూపక సాపేక్ష
రూపకము సమస్త
170-19 సంపత్తిని సంధానించడ
ములో సమర్థుడయిన
ప్రతాపరుద్రుడు అక్షయ
స్వర్ణసంపత్తిని సంపా
దించే
172- 2 భూమ్యాదులు
172-11 జిహ్వేవాత్యా
174- 8 మాణము పరిణామములో
175- 1 (ప్రకృతాంగత్వమును)
176- 8 సామానాధికరణ్య
177-2 అరిక్షితీంద్రాః

178-6 సంబంధించి
178-15 సంపత్ప్రదం
178- 8 వికల్ప్యతే
182- 5 పదార్థమును
183-10 నిషేధించి అన్యారోప మును నిబంధించితే
184- 5 ఉన్నది కనుక
189- 9 శాకతీంద్ర
187-13 రజ్జువును
193-20 ప్రభరిత
198-21 పరాగరేఖ
201- 3 విస్మారితా
204- 1 దర్శనక్రియా
206-17 సంస్కృతి
220-11 అని విద్యాసాధుని
220-29 ధర్మములకు
221- 7 సాయము అని
221-20 చాత్రాతిశయాఖ్య
221 పుట ప్రారంభములో "ఇంతగా ఇది" మొదలు
222 పుటలోని "మనవి చేస్తున్నాను" అనేవరకు ఉన్న గ్రంథ మును 221 పుట చివర పూరణాంశముగా పఠించాలి.
223-11 సమం మొదలయినవి.
224- 6 వాస్తవము
2.5-15 చెప్పడమనే

228-15 విశేషమును
228-22 కంఠరజ్జువు
235-17 సాలంకారా
237-17 వేరొకడు
240-13 కలవాడుగా
240-22 సామ్యము
240-22 కాబట్టి వ్యాజోక్తికి
254- 1 పాఙ్క్త్యయోః
264-16 అనర్థప్రాప్తి
265-17 సిద్ధించడము
267- 2 చలనసె
270-24 గతమని
271-18 వాక్యార్థము పదార్థముల ద్వారా
273-12 ప్రతిష్ఠా
275- 7 ఇది ఇట్లా రెండు
276-12 లాక్షాభ్యాం
278-11 గుణముఖముగా
280- 8 అప్రస్తుతమును
283- 1 సాధుమార్గము
284-15 వ్యంగ్యము
285-25 మవుతుంది
286- 2 సంబంధించి
288-18 ఆభాసరూపము కాగా
289- 1 ఆక్షేపము యొక్క ఒక భేదము ఉన్నది.
290-10 అభ్యసిస్తున్నాను లె.
291-16 సముద్రాలు ప్రవేశించు తున్నారు.
292- 4 అదెపుడయినా

293-24 భ్రమరగణైః
299-16 కొంత విశేషము ఉన్నది. ఇవి
300- 9 సంబంధించి
300-11 విధముగా
302-24 సమర్థకభావము
305- 2 సమర్థనార్థముగా
305-12 ప్రతాపరుద్రునకు
308-18 మమంస్త
314- 9 గోత్రభిత్కథా
315-21 విశదోధర్మ
316-23 సముచ్చయాలంకార
320-18 విచ్ఛాయానన
329- 6 ప్రతీయమానో
331-15 అనడములో
332-20 బాహువుల నుండి
333-21 అద్యోర్వీపతి
335- 5 కారముల ద్వారా
335-16 అని నిరూపిత
336-13 తత్త్యాగలీలా
336-16 ఉండి
337- 8 మహాత్ముల
337-17 కారములలో నే
338-11 దీనిని
339- 5 పరివృత్తి
340- 8 ఉపచిత్రిత
345-14 వీనిలో
345-18 రూప్యతే
346-18 రెండూ సంసృష్ట
348-13 సమాసగత
350-22 రూపకాలంకార
351- 9 విజృంభితే
352- 6 వందేఽహంతాం పరాం దేవీం.



